**June 1997, Ashadha 1919**

ISBN . 81-230-0325-0



**Price : Rs 120.00**

Cover Design Asha Saxena

ప్రచురణల విభాగం, సమాచార, ప్రసార మంత్రిత్వశాఖ, భారత ప్రభుత్వం, పటియాలా హౌస్, క్రొత్త ఢిల్లీ వారిచే ముద్రితము

*విక్రయ కేంద్రాలు ● ప్రచురణల విభాగం*

- 1, తిలక్ మార్గ్, పటియాల హౌస్, క్రొత్త ఢిల్లీ - 110 001
- కామర్స్ హౌస్, కురింభోయ్ రోడ్, బల్లార్డ్‌పైర్, ముంబాయి-400038
- 8, ఎస్ప్లనేడ్, తూర్పు కలకత్తా-700069
- రాష్ట్ర పురావస్తు ప్రదర్శనశాల భవనం, హైదరాబాద్ పబ్లిక్ గార్డెన్స్ హైదరాబాద్-500004
- 27/6, రామ్మోహన్ రాయ్‌మార్గ్ కృషి భవన్ వెనుక, లక్నో - 226001
- ఎ వింగ్ యఫ్ ఎండ్ జి బ్లాక్, గ్రౌండ్ ఫ్లోర్, వసంత నగర్, మద్రాసు- 600090
- సూపర్ బజార్, (2వ అంతస్థు), కన్నాట్ సర్కస్, క్రొత్త ఢిల్లీ - 110001
- బీహార్ రాష్ట్ర సహకార బ్యాంక్ భవనం, అశోక రాజ్‌పథ్, పాట్నా-800004
- ప్రభుత్వ ముద్రణాలయం సమీపంలో, ప్రెస్ రోడ్, తిరువనంతపురం-695001

---

BHARATHA SUPRASIDHA GRANDHALU-TELUGU by Dr R Anantha Padmanabha Rao, Publications Division,1997

Typeset at . ADSET COMMUNICATIONS, S-513, School block, Shakarpur, Delhi- 110092

Printed at Jupiter Offset Works, Shahadara, Delhi-110032

# ప్రకాశకుల మనవి

ఒక ప్రసిద్ధ గ్రంథమును ప్రజలు మెచ్చుకుంటారేగాని చదవరనేది నానుడి. ఒక గ్రంథం మెప్పుకు నోచుకున్నదంటే ఆ గ్రంథంలో ఉత్తమ మానవ చింతన ఇమిడి ఉన్నదనే భావించాలి. ప్రస్తుతం, ఈ భారత సుప్రసిద్ధ గ్రంథామాలికను అందుకోసమే రూపొందించడం జరిగింది. ఉత్తమ భారతీయ చింతనను ఒక రూపంలోకి తీసుకురావడం ద్వారా ఈ సుప్రసిద్ధ గ్రంథాలను పఠించే అవకాశం లభిస్తుంది.

తమ తమ భాషలలోని ప్రసిద్ధ గ్రంథాలను గుర్తించి, ఎంపికచేసి (గ్రంథాల ఎంపికలో కొన్ని విభేదాలు ఉంటాయేగానీ పొరపాటు లేని ఎంపికంటూ ఉండనే ఉండదు) గ్రంథంలోని ముఖ్య విషయాలను సరళభాషలో చెప్పవలసిందిగా భారతీయ భాషల్లోని ప్రముఖ సాహిత్యవేత్తలను అభ్యర్థించాలనేది మా యోచన. ప్రత్యేకించి ఒక గ్రంధమునే ఎందుకు సుప్రసిద్ధ గ్రంధముగా గుర్తించారో కారణం వివరిస్తూ, ఆ గ్రంథ రచయిత గురించి కూడ కొంతంత చెప్పవలసిందిగా కోరాము

ఏ భాషనుంచైతే ఈ గ్రంథాలను గుర్తించామో ఆ భాషలోనే మొదటి ఈ గ్రంధమును ముద్రించిన తర్వాత అన్ని ప్రధాన భారతీయ భాషల్లో వీటిని అనువదింపజేయాలనేది మా ధ్యేయం.

ఈ విధంగా, వారి వారి మాతృభాష అనే భేదం లేకుండా ప్రతి ఒక్కరికి అన్ని భారతీయ భాషలలోని అన్ని సుప్రసిద్ధ గ్రంధముల ముఖ్య విషయాలను అందుబాటులోనికి తీసుకురావాలని భావిస్తున్నాం

తెలుగులో, ప్రస్తుతం ఈ సుప్రసిద్ధ గ్రంధముల సంక్షేపం, సంకలనంను డా. ఆర్ అనంతపద్మనాభ రావుగారు చేశారు

మా ఈ ప్రయత్నాన్ని పాఠకులు అభినందించి, ఉపయుక్తంగా భావించగలరని విశ్వసిస్తున్నాము

**డా॥ ఓం ప్రకాష్ కేజరీవాల్**

# ముందు మాట

'EPICS RETOLD' అనే శీర్షికతో గత శతాబ్దంలో వచ్చిన సుప్రసిద్ధ ఆంధ్ర గ్రంథాలలో పదింటిని ఎన్నుకొని సంక్షిప్తపరచి ఒక గ్రంథంంచాలని భారత ప్రచురణల విభాగంవారు ఆదేశించారు. ఇందులో రెండు ఇబ్బందులు. ఒకటి వేలు, వందలుగా వెలువడిన తెలుగు సాహిత్య సౌరభాలలో పదింటఎంపిక చేయడం. ఎందరో మహానుభావులు. ఎన్నో ప్రక్రియలు. ఆంగ్లసాహిత్య ప్రభావంవల్ల 20వ శతాబ్ద సాహిత్యం పరిపుష్టమైంది. అందులో గుణగ్రహణపారీణత చాలా కష్టం. పండితులను సంప్రదించి పది పుస్తకాలు ఎన్నుకున్నాను

ప్రక్రియావైవిధ్యం, విషయ వైవిధ్యం, గ్రంథప్రాచుర్యం ప్రధానంగా నా దృష్టిలో పెట్టుకున్నాను. యాత్ర చరిత్రలు తెలుగులో తక్కువ. అందుకు శ్రీకారం చుట్టిన వీరాస్వామయ్యగారి రచన మొదటిది సాంఘిక సమస్యలకు స్పందించి గురజాడ, కాళ్ళకూరి కన్యాశుల్క, వరవిక్రయ నాటకాలు వ్రాశారు. అవి ఆంధ్రలోకంలో విశేష ప్రచారం పొందాయి అలానే ధర్మవరంవారు బలిజాపల్లివారు రచించిన సారంగధర, హరిశ్చంద్ర చారిత్రక, పౌరాణిక నాటకాలకోవలో అగ్రశ్రేణిని నిలిచాయి నవలాప్రక్రియలో మాలపల్లి, రాజశేఖర చరిత్ర, గణపతి, కోనంగి, దైవమిచ్చిన భార్య చెప్పకోదగ్గవి ఇలా ఎంపికచేసిన పది గ్రంథాలుకాక మరెన్నో పదుల గ్రంథాలు ఉత్తమ సాహిత్యంగా తెలుగువారికున్నాయి అయినా గ్రంథ విస్తరణభీతిచే పదింటిని మాత్రమే పొందుపరచాను జన్మ సంవత్సరాన్ని బట్టి వరుసక్రమం ఏర్పరచాను

రెండో ఇబ్బంది సంక్షిప్త పరచడం. 600 పుటల మాలపల్లి, కాశీయాత్ర చరిత్ర ముప్ఫయిపుటల్లో వ్రాయడం కొండను అద్దంలో చూపడమే ఈ రచన లక్ష్యం భావితరాలవారికి తెలుగు సాహిత్య సంప్రదాయాలను పరిచయం చేయడమేగాబట్టి ఆ కోణంలోనే నేను ఆలోచించి కుదించాను మూలకథకు భంగం రాకుండా సంక్షిప్తపరచాను. ఉత్తమ పురుషలో సాగిన రచనలు ప్రథమపురుషలోకి నేను మార్పు చేశాను పాఠకులేదీని న్యాయనిర్ణేతలు.

ఈ గ్రంథ రచనకు నాకు అవకాశమిచ్చిన ప్రచురణల విభాగం అసిస్టెంట్ ఎడిటర్ శ్రీమతి కల్పానా పాల్కీవాలా, సి జె.కె మూర్తి, వసంతబానులకు కృతజ్ఞతలు. ముఖ చిత్రకల్పనగావించిన శ్రీమతి ఆశానక్సేనా, శ్రీ గద్దె దుర్గారావుగార్లకు దన్యవాదాలు ఆయా రచయితల రచనలు సంకలన పరచడానికి అనుమతించిన వారందరికీ అభివాదాలు మొట్టమొదట చలంగారి రచనను సంకలనపరచడానికి సౌరీస్ అంగీకరిచారు ఆ తర్వాత అందరూ అందరికీ వందనాలు అడుగడుగునా నా అర్ధాంగి శోబాదేవి సలహాలు నాకీ రచనలో ఉపకరించాయి అందరికీ కృతజ్ఞతాంజలి

విజయవా                డా ఆర్ అనంతపద్మనాభరావు

(ఉగాది 1997)

# ఇందులో

1

# కాశీ యాత్ర చరిత్ర

( యాత్రా చరిత్ర )

ఏనుగుల వీరాస్వామయ్య
**( 1780-1836 )**

ప్రథమ ముద్రణ: 1838

# ఏనుగుల వీరాస్వామయ్య

ఏనుగుల వీరాస్వామయ్య (1780-1836) మదరాసు హైకోర్టులో ప్రధాన దుబాసి (chief interpretor) ఆయన మదరాసులోనే జన్మించారు. దుబాసిగా ఆయన పని ఆంగ్లం నుండి తెలుగులోకి, తెలుగునుండి ఆంగ్లంలోకి అనువదించడమే. ఆంగ్లం, తెలుగు సంస్కృతం, తమిళభాషల్లో అలవోకగా మాట్లాడగల శక్తి సంపాయించారు. 1815 నుండి 11 సంవత్సరాలు అదాలత్ కోర్టులో పనిచేసి ప్రధానదుబాసీగా పదవీ విరమణ చేశారు. తెలుగు భాషకు ఎనలేని సేవచేసిన ఛార్లెస్ ఫిలిప్‌బ్రౌన్ ఆయనకు బాగా సన్నిహితుడు. ఆయనను బందరులో వీరాస్వామయ్య కలుసుకొన్నారు.

వీరాస్వామయ్య కన్యాకుమారి మొదలు కాశ్మీరు వరకు భారతదేశమంతటా రెండుసార్లు పర్యటన చేసి తన మిత్రుడైన కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లైకి జాబులు వ్రాశారు. ఆ ఉత్తరాలను శ్రీనివాసపిళ్లై వీరాస్వామయ్య మరణానంతరం కాశీయాత్ర చరిత్రపేర **1838లో** మొదటిసారిగా ప్రచురించారు. **1869లో** ద్వితీయ ముద్రణ వచ్చింది. **1914లో** దిగవల్లి వెంకట శివరావుగారు (విజయవాడ) ఈ గ్రంథాన్ని పునర్ముద్రణ చేయించారు.

వీరు చెన్నపట్టణ నగర వాసుల్లో ఆధునిక, భావాలను ప్రోత్సహించడానికి **'Hindu literary Society'** మిత్రులతో కలిసి ప్రారంభించారు. వీరాస్వామి తెలుగుభాషా సేవ అమోఘం.

**1830** మే **18**న వీరస్వామయ్య ఉత్తరదేశ యాత్రకు మదరాసు నుండి బయలుదేరి కాశీకి చేరుకున్నారు. **15** నెలల **15** రోజుల కాశీయాత్రను చారిత్రక నేపధ్యంలో ఈ గ్రంథంలో చూడవచ్చు.

# కాశీయాత్ర చరిత్ర గురించి

ఏనుగుల వీరాస్వామయ్య మదరాసు హైకోర్టులో పనిచేస్తూ మదరాసు నుండి కాశీ వరకు ప్రయాణం చేసారు. దారిలో విశేషాలను తన మిత్రులు కోమలేశ్వరపురం. శ్రీనివాసపిళ్లైగారికి లేఖల ద్వారా తెలియజేస్తూవచ్చారు.

ఉత్తరదేశ యాత్ర చేయాలని ఆయన ఆధ్యాత్మిక చింతనతో సంకల్పించారు. మదరాసు నుండి కడప, హైదరాబాద్, నాగపూర్, జబల్‌పూరు, మీర్జాపూర్, అలహాబాద్‌ల మీదుగా మదరాసుకు **15** నెలల **15** రోజుల తర్వాత చేరుకున్నారు. దారి మధ్యలో బందరులో బ్రౌన్ పండితుణ్ణి కలుసుకున్నారు.

యాత్రా సమయంలో వీరాస్వామయ్య తాను రోజూ చూసిన వింతలు, విశేషాలు, నాగరికుల విశేషాలు డైరీ (దినచర్య) రూపంలో వ్రాసుకున్నారు. తాను చూసిన విశేషాలు మదరాసులో మిత్రులు శ్రీ కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్లైకి లేఖలు వ్రాస్తూవచ్చారు. దారిలో కనిపించిన వ్యక్తుల, పల్లెల ఆచార వ్యవహారాలు సవివరంగా ఉత్తమపురుషలో వ్రాశారు. శ్రీనివాసపిళ్లై ఆ లేఖలు భద్రపరచి వీరాస్వామయ్య మరణించిన కొంత కాలానికి ప్రచురించారు. **328** పుటల గ్రంథమిది.

కేవలం యాత్రాగ్రంథం మాత్రమేగాక ఆనాటి రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక వ్యవహారాలకు అద్దంపట్టే రీతిలో సులభవచనంలో వీరాస్వామయ్య వ్రాశారు. యాత్రా గ్రంథం (**Travelogue**)గా ఇది చక్కటి ప్రయత్నం.

# కాశీ యాత్ర చరిత్ర

## సంక్షిప్త గ్రంథం

భగవంతుని అనుగ్రహం వల్ల సుప్రీం కోర్టువారు నా (వీరాస్వామయ్య) కాశీయాత్రకు సెలవిచ్చారు. క్రీ.శ. 1830 సంవత్సరం మే నెల 18వ తేది మంగళవారం రాత్రి 9 గడియలకు చెన్నపట్టణం వదలాను మాధవరం ద్రావిడులు చెన్నపట్టణంలో సమిధలు అమ్మి జీవిస్తుంటారు దోవలో ఉప్పుకయ్యకు కాక్రయన్ దొర కాలువ తవ్వించి వారధులు కట్టించాడు.

19వ తేది ఉదయం పాలవాయిసత్రం మీదుగా వెంకటేశనాయుడు సత్రం చేరాము. ఆ రాత్రికి పెద్దపాళెం వచ్చాము అక్కడ శక్తి రూపంలో చిన్నలింగం ఉద్భవించింది. దానికి ప్రజలు పూజలు చేస్తారు. 20వ తేది రాత్రికి తిరువళ్లూర. అది విష్ణుస్థలం. అక్కడ ప్రార్థనల సమయంలో బెల్లం వేస్తారు. అక్కడ తీర్థస్నానము ముఖ్యం 21వ తేదీ కనకమ్మ సత్రానికి వచ్చాం అక్కడ బొమ్మకంటి శంకరయ్య సత్రంలో బస. అది కార్వేటి నగర సంస్థానంలోది కోనేటి నీరు బాగా తియ్యగా ఉన్నాయి

22వ తేది బుగ్గగుడి అనే పుణ్యక్షేత్రం చేరాం 14 ఆమడలు ప్రయాణం చేశాం గంగా యమునా సరస్వతులు గుడి కింద స్రవించి అడవిలో కలిసి పోతాయి. అది అరణ్య నదీ తీరం అక్కడి నుండి నగరి మీదుగా పుత్తూరు ప్రయాణించాం. పుత్తూరులో మునియప్పిళ్ల సత్రం వుంది. కుంఫిణీవారు ముసాఫరుఖానా కట్టించారు. 23వ తేది అంజాలమ్మ కనమదాటి వడమాలపేట సత్రం వచ్చాం అంజాలమ్మ అనే శక్తిప్రతిమ అక్కడ కోరిన వారికోర్కెలు తీరుస్తుందని నమ్మకం కొల్లా పెద్దసామిశెట్టి సత్రం వుంది. బస్తీ పెద్దది. ఆ రాత్రికి అలమేలుమంగాపురం మీదుగా దిగువ తిరుపతి చేరాము. అక్కడ 8 దినములున్నాను ఒకరోజు వెంకటాచలపతి దర్శనానికై కొండ ఎక్కి దిగాను కపిల తీర్థంలో సమారాధన చేసి, గోవిందరాజస్వామి గుడి, కోదండరామస్వామి గుడి దర్శించాను మునియప్పిళ్ళ వేద పాఠశాల నడుపుతున్నాడు

పెద్దవూరు కోతుల బెడద వుంది కపిల తీర్థం రమ్య ప్రదేశం దిగువ తిరుపతి నుండి కొండ మీదికి 14 మైళ్లు వెంకటేశ్వరునికి ప్రార్ధనలు చేసేవారి ద్వారా కుంఫిణీవారికి సాలుకు లక్షరూపాయలు వస్తాయి

30వ తేదీ రాత్రికి కరకంబాడు వచ్చాం అక్కడ ముసాఫరు ఖానా వుంది అక్కడ నుండి మహారణ్యమధ్యంలో బయలుదేరి 31వ తేది శెట్టిగుంట చేరాం అక్కడ మామండూరు, కృష్ణాపురం అనే పాలెగాళ్ల ఊళ్లు ఉన్నాయి అక్కడకి బాలావల్లె సమీపమే అది కడప జిల్లా సరిహద్దు అక్కడ నీరు రోగప్రదం సెట్టిగుంటలో అన్ని వస్తువులు దొరుకుతాయి పాళెగాళ్ల సహాయంతో బయలుదేరి ఆమడదూరంలో వున్న కోడూరు వద్ద అగ్రహారం సత్రంలో మకాం చేశాను అక్కడ ఏమీ దొరకవు

జూన్‌నెల మొదటి తారిఖున ఓరంబాడు ప్రయాణం సమకట్టాం బాట బాగున్నది చింతచెట్టు సమృదిి బాలవల్లె నీళ్ళు తాగి ఒక బోయి ఒక కావటివాడు జబ్బుపడ్డారు బాలవల్లె వద్ది వాగువద్ద వెంకటేశ్వరుని పాదమొకటి చేసి యున్నది అక్కడ నుండి పడమటి ప్రాంతంవారు తిరుమల కొండ ఎక్కి వెళుతుంటారు అక్కడ నుండి పుల్లంపేట చీకటి పడకముందే వచ్చాం 2వ తేది రాత్రి ప్రయాణంచేసి నందలూరు వెళ్లాం చెయ్యేరు నది ప్రవహిస్తోంది నదికి యిరు పక్కలా గుళ్లు పరశురాముని మాతృహత్య దోషం పోగొట్టిన అత్తిరాల క్షేత్రం అక్కడికి సమీపంలో వుంది ఆ వూళ్లో ఆ రోజంతా గడిపాం

3వ తేది రాత్రి రెండు గంటలకు బయలుదేరి బాకరాపేట చేరుకొన్నాం దోవలో బంటిమిట్టగ్రామం వస్తుంది అక్కడ చూడవేడుకయిన గుళ్లున్నాయి పెద్ద చెరువు బాకరాపేట నుండి నెమ్మదిగా కడప వచ్చాం కడపలో నాలుగు రోజులు బస చేశాను జిల్లా కోర్టు కలెక్టరు కచేరి ఉన్నాయి మంచి పట్టణం అక్కడ ఒక రెజిమెంటు వుంది ఒక వైపు మిలటరీ దొరలు, మరొక వైపు సివిలు దొరలు కాపురం వున్నారు

8వ తేది ఉదయం కడప వదలి పుష్పగిరి చేరాను. అది ఒక పుణ్యక్షేత్రం. మధ్యలో పినాకిని నది దాటాలి. నదిగట్టున కొండ వెంబడి చక్కటి దేవాలయం ఉంది. అక్కడ అస్తినిక్షేపం చేస్తారు. పుష్పగిరిస్వాముల వారు అక్కడ మఠాధిపతులు. అక్కడ నుండి కాజీపేటకు వచ్చాం. బాట సరిలేదు. 8వ తేది రాత్రి ప్రయాణం చేసి దువ్వూరు చేరుకొన్నాం. అది కడప జిల్లాలో చేరినది. అక్కడ నుండి ప్రొద్దుగ్రుంకక ముందే వంగలి గ్రామం చేరాం. దగ్గరలో పేట కందనూరు నవాబు గారిది. రూపసింగ్ అనే సర్దారుకు ఊళ్లు జాగీరుగా ఇచ్చారు. ఆ రోజు వర్షం పడింది 9వ తేది అహోబల క్షేత్రం చేరాం. దిగువ అహోబలం, ఎగువ అహోబలం క్షేత్ర స్థలాలు నరసింహామూర్తి ఉద్భవించిన స్థలం జియ్యరుగారి అధీనంలో ఆ దేవా వచ్చి గర్భగృహం తలుపు తెరుస్తాడు. ఆ రాత్రికి బండి ఆత్మకూరు చేరాను. అది కందనూరువారిది. ఆ ప్రాంతంలో ఆవులను పాలుపితకడం లేదు. దూడలను కూడా ఆవులతో మేతకు తోలుతున్నారు. ఎనుముల పాడి సహజం. పశువులకు చక్కటి కొఠాలు కట్టించారు. ఇళ్ల కంటె బాగున్నాయి. అక్కడ వరి పంటలేదు.

12వతేది రాత్రి వెలపనూరు వచ్చాము. అక్కడ బట్టల అంగళ్లు కూడా ఉన్నాయి. అన్ని పదార్థాలు దొరుకుతాయి. గ్రామకరణం శేషప్ప అన్నదానం చేస్తున్నారు. నవాబు తరపు ఉద్యోగులు కొందరక్కడ ఉన్నారు. ఓంకారం మీదుగా వెంపెంట చేరాను. పదార్థాలు అక్కడ దొరకవు. 13వ తేది ఆత్మకూరు మజిలీ, కందనూరు నవాబు తాలూకు ఉద్యోగులక్కడ ఉంటున్నారు. నౌకర్లకు జీతాలబదులు నవాబు జాగీరు జారీ చేసాడు. నవాబు కుంఫిణీకి ఏటా లక్ష రూపాయలు కడుతున్నారు. అతని రాజ్యం బళ్లారి జిల్లా కలెక్టరు ఆజ్ఞకు లోబడి వుంది. నవాబు స్వంతంగా ఒక ఖాజీ కోర్టు పెట్టి న్యాయ విచారణ చేస్తున్నాడు. నౌకర్లుకు జీతాలు సరిగా ముట్టడం లేదని వదంతి. అది పెద్ద పేట. అక్కడ ఆదివారం సంతలో అన్ని పదార్థాలు దొరుకుతాయి. ఆత్మకూరులో శ్రీశైలం అర్చకులు, యాత్రీకులవద్ద పన్ను పుచ్చుకొనే నవాబు ముసద్దీలు ఉన్నారు. అక్కడికి శ్రీశైలం నలభై మైళ్ళు.

శ్రీశైలంలో ఏవస్తువులూ దొరకవు. అందువల్ల అక్కడ నుండి తిరిగి వచ్చే దాక కావలసిన సామానులన్నీ ఆత్మకూరులో మరచిపోకుండా తీసుకపోవాలి. శివరాత్రి ఉత్సవాలలో అభిషేకానికి, వాహనోత్సవాలకు దర్పణ సేవోత్సవానికి టిక్కెటు డబ్బులు వసూలు చేస్తారు. శ్రీశైలానికి నాలుగు దారులు. ఎటువెళ్లినా 40 మైళ్లు ఉండటం ఈశ్వరేచ్ఛ. ఒక దారి నెల్లూరు మీదుగా వచ్చి చుక్కలపర్వతం ఎక్కాలి. రెండవది కంభం దూపాడు మీదుగా చుక్కల పర్వతం ఎక్కాలి మూడవది కృష్ణానది దాటి రావాలి. నాల్గవది నేను వచ్చిన ఆత్మకూరుబాట. కృష్ణానది పాతాళగంగ పేరుతో శ్రీశైలం క్రింద ప్రవహిస్తోంది. ఉత్సవాల సమయంలోనే మిగతా మూడు బాటల నుండి జనం వస్తారు శ్రీశైలంలో శివరాత్రి మొదలు చైత్రమాసం వరకు ప్రతి రోజూ పల్లకీసేవ ఉత్సవం జరుగుతుంది. ఆత్మకూరు నుండి ఒకరిద్దరు అర్చకులు మార్చి మార్చి వస్తుంటారు. స్వామికి 100 దాకా ఆవులున్నాయి. కడప తర్వాత ఆవుపాలు, పెరుగు కళ్ళ చూడాలంటే శ్రీశైలంలోనే కుదురుతుంది. దున్నడానికి ఎద్దులు నెల్లూరు సీమ నుంచి కొనాల్సి వస్తున్నది ఆత్మకూరి నుండి మేము మూడు డోలీలు చేయించుకొని కొండ ఎక్కాము. నా పరివారంలో ఉన్న 15 మందికి భత్యం తీసుకొని ఆత్మకూరిలో 15 ఉదయాననే బయలుదేరాము. నాగులేటి మీదుగా పెద్ద చెరువు చేరాము. కొండ ఎక్కుడు దిగుడుగా ఉంది. రాత్రి గేటు దారి దాటిన తర్వాత పెద్ద చెరువుదాకా బాట గుర్రపు బళ్ళు పోవడానికి వీలుగా విశాలంగా ఉంది పెద్ద చెరువులో చక్కటి మంచినీళ్ళు ఉన్నాయి. ఆ చెరువు కట్టమీద ఆ రాత్రి వంట చేసుకొని తిని మర్నాడు ఉదయాన్నే బయలుదేరాము. ఆరాత్రి చల్ల గాలితో మబ్బు తువ్వర పడుతుంటే ఒక బోయ గుడిసెలో పడుకొన్నాం.

16వ తేది మధ్యాహ్నం 12 గంటలకు శ్రీశైలం చేరాము. చుట్టూ పర్వతాలు. మెట్లు ఎక్కడం దిగడం అలవాటు లేకపోతే కళ్ళు తిరుగుతాయి. నాతో వచ్చిన 8 మంది బోయీలు నా డోలీని అనాయసంగా మోశారు. 17 వతేది పగలు 3 గంటలకు శ్రీశైలం కల్యాణ మండపంలోఉన్నాను. అక్కడ వేశ్యల యిళ్ళు పాడుబడి ఉన్నాయి. అనవేమారెడ్డి స్వామిగర్భగృహానికి, ముఖ మండపానికీ విమానానికి, ధ్వజస్తంభాలకు బంగారు మలాం చేసిన రాగి రేకులు వేయించాడు.

అవి యిప్పుడు శిథిలావస్థలో ఉన్నాయి. గుడికి రెండు ప్రాకారాలు. శిల్ప సంపద చక్కగా ఉంది. స్వేచ్ఛగా లింగాన్ని తాకి అభిషేక నివేదనలు చేయవచ్చు. భ్రమరాంబాదేవికి మిరాశీ అర్చకుడు నియమంగా అర్చన చేస్తున్నాడు. రాజశ్రీభొట్లు అనే 50 ఏళ్ళ అర్చకుడు గత 5 సంవత్సరాలుగా కొండ మీద ఏకాకిగా అర్చన చేస్తూ ఉన్నాడు. గుడి లింగం భూమికి జానెడు ఎత్తున ఉంది. విమానానికి 5 శిఖరాలు నాలుగు పక్కలా శిథిలమై ఉన్నాయి. ఆత్మకూరిదారిన వచ్చే వారికి శిఖరం కనిపించదు. నెల్లూరు, కంభం మార్గాల మీదుగా వస్తే దూరం నుండే శిఖర దర్శనమవుతుంది. గర్భగృహం కడప మీద శ్రీ చక్రస్థాపన చేసి యున్నది. గుడిలో తీర్థాలున్నాయి. అన్ని తీర్థాలలో కొండవూట స్రవించి అంతర్వాహినిగా అవతలకు సాగిపోతుంది. గుడి తహాశ్శీలు ద్వారా కందనూరు నవాబుకు సంవత్సరానికి 1800 రూపాయలు వసూలు అవుతుంది. ఎవరైనా ఆలయ మరమ్మత్తు చేస్తే తహాశ్శీలు కట్టాలి. రాజా చందూలాలు ఈ నిర్బంధంతో కొంత మరమ్మత్తు చేసి వదలిపెట్టాడు. మహిషాసురుని మర్దించిన తర్వాత భ్రమరాంబ శ్రీశైలం ప్రవేశించింది. మహినూరు ఆమె పుట్టిన ప్రదేశం కాబట్టి ఆదేశస్థులు తహాశ్శీలు యివ్వనక్కరలేదు. శ్రీశైలశిఖరదర్శనము చేత జన్మాదులు లేవని పురాణాలు ఘోషిస్తున్నాయి. 18 వతేది సాయంకాలానికి తిరుగు ప్రయాణంలో ఆత్మకూరు చేరాము

19వ తేది అక్కడ నుండి నందిగుంట దేవస్థానంలో దిగాను. 20వ తేది అక్కడికి 20 మైళ్ళ దూరంలో వున్న నివృత్తి సంగమం అనే పుణ్యక్షేత్రం చేరాను అది కృష్ణా తీరం. ఆ కృష్ణలో తుంగభద్రతోబాటు 5 నదులు కలుస్తాయి. ఏటి ఒడ్డున ధర్మరాజు ప్రతిష్ఠించిన శివలింగం వుంది. బృహస్పతి కన్యారాశిలోకి వచ్చినప్పుడు అక్కడ పుష్కరాలు జరుగుతాయి. ఇక్కడ కృష్ణ ఉత్తరవాహినిగా ప్రవహిస్తుంది. కృష్ణ దాటడానికి కొంత సుంకం వసూలు చేస్తారు. కృష్ణకు ఒక వైపు కందనూరు నవాబు, మరొక వైపు హైదరాబాదు నవాబు సుంకం వసూలు చేస్తారు తిరుపతి నుండి సంగమం వరకు ప్రతి గ్రామానికి ఒక రెడ్డి, కరణము ఉన్నారు వారిని స్వాధీనపరచుకొంటేగాని దారినవెళ్ళే యాత్రీకులకు పనులు సాగవు. కడప నుండి ఈ ఊరివరకు జ్యేష్ఠ మాసం మొదలు శ్రావణ మాసం

వరకు వర్షాకాలం. 21వ తేది నుండి 24 వరకు తీర్థ విధి మొదలైన పిత్రు కర్మలు చేయడానికి అక్కడే ఉన్నాను అక్కడ నుండి సిద్ధేశ్వరం ఘాటు వెళ్లాను. అక్కడ నుండి పెంటపల్లి చేరాను. అక్కడ వెంకటేశ్వరాలయంలో బస. ఆ గ్రామం కొల్లాపురం జమీందారీలోనిది

25వ తేది ఉదయం 5 గంటలకే బయలుదేరి పానగల్లు వచ్చాను. ఆ రాత్రి అక్కడ వుండి, 26 ఉదయం బయలుదేరి చిన్నమంది చేరాను. అది వనపర్తి జమీందారీ గ్రామం దోవ ఇరుపక్కలా అడవి. కొండల నడుమ దారి అయినా రాతి గట్టు కాదు. అక్కడ చెరువు కట్టమీద వంట చేసుకొని భోజనాలు ముగించి గణపురానికి వెళ్లాం. దారిలో మనోజీపేట అనే బస్తీ వుంది. అక్కడ వెంకటేశ్వర దేవాలయం కొండ మీద వుంది. మంచినీళ్ళు దూరం నుండి తెచ్చుకోవాలి.

జడ్చర్లకు 27వ తేది ఉదయం 11 గంటలకు వచ్చాం. కృష్ణానది దాటింది మొదలు శేషాచల పర్వతం అదృశ్యమయినా అక్కడక్కడా చిన్న కొండలు కనిపిస్తాయి. అంతా పరమాత్ముని అద్భుతం. అక్కడ 360 గ్రామాలకు రాజగోపాలరావు జమీందారు. ఆయన గొల్కొండ నవాబుకు 3 లక్షలు కడుతున్నాడు. వారికి రాచూరు రాజధాని. ఇప్పుడు 12 సంవత్సరాల చిన్నవాడు తల్లి సంరక్షణలో దొరతనం చేస్తున్నాడు.

28వ తేది నాగపల్లె బాలనగరం చేరాను. ఆ వూరికి చుట్టూ కోట వుంది. బాలచందు అనే ముసద్దీకి అది జాగీరు. ఆయన ధర్మాత్ముడు. తిరుపతి తర్వాత యిక్కడ సత్రం కనిపించింది. ఈ వూరికి రెండు పేర్లు  నాగపల్లె-బాలనగరం. అలానే జానంపేట ఫరక్కునగరం అనే రెండు పేర్లున్న వూరికి ఆ తర్వాత చేరి రాత్రి అక్కడ బస చేశాను.

29వ తేది షాపురం 10 గంటలకు చేరాను. దారిలో పాలమాకల గ్రామం మామిడి తోటలో జలవసతి వుండటంతో భోజనానికిదిగాం. పల్లకీ స్వారీ మీద వచ్చేవాళ్ళు కొన్ని తాళ్ళు తప్పకుండా తెచ్చుకోవాలి. లేకపోతే నేనుపడ్డ బాధలు పడాలి.

యాత్రలు చేసేవారికి కొన్ని సలహాలు యిస్తున్నాను. గుర్రపు తట్టున సామాన్యడోలీ తీసుకవెళ్ళడం మంచిది. అందరూ ఆయాసంగా ఉన్నప్పుడు గుర్రపుతట్టువ మీద డోలీలలో భోజన సామాన్లు నిల్వచేసి తీసుకొని వెళ్ళవచ్చు. సపరివారంగా దేశాటన చేసేవారు చికిత్స చేసే వారిని, దానికి తగిన మందులు తీసుకుపోవాలి. అజీర్తికి, జ్వరానికి, వ్రణాలకు, గాయాలకు ఔషధాలు తీసుకుపోవాలి. నాతో వచ్చిన వారికి నాకు తోచిన మందులు యిస్తూ కాపాడుకొంటూ వచ్చాను. సీమమైనవు వత్తులకన్నా బంగాళా నాటు వత్తులే యోగ్యం.

జూన్ 29వ తేది రాత్రి నుండి జులై 7వ తేది సాయంకాలం వరకు హైదరాబాదు నగరంలోని బేగంబజారులో ఒక తోటలో బంగళాలో ఉన్నాను. 29వ తేది మొహరం పండుగ ఆరంభం. కంచికి గరుడ సేవవలె హైదరాబాదుకు మొహారం ముఖ్యం. భగవదనుగ్రహం వల్ల ఆ పుణ్య దినాలలో నేను అక్కడ చేరడం విశేషం. లోకుల యిష్ట సిద్ధిని చేసే పరమాత్ముడొక్కడే. 'యాదృశీభావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ' అని భావించి ఆ పుణ్యస్థలంలో ఉండిపోయాను.

జులై 19 వరకు సికిందరాబాదులో కాకాగూడెం అనే నాగన్నతోట చావడిలో ఉన్నాను. హైదరాబాదులో బేగంబజారు అనే బస్తీ వుంది. అది వాసయోగ్యమైన ప్రదేశం. అక్కడికి దగ్గరలో కార్వానా అనే బస్తీ వుంది. అక్కడ రత్నాలు అమ్మే వర్తకులున్నారు. షాలిబండ అనే పేటకూడా వుంది. నగరం మధ్యలో మక్కామసీదు అనే మహమ్మదీయుల ధ్యానశాల వుంది. హైదరాబాదులో చెలామణీలో వున్న నాణెములు, ద్రవ్యము వేరు. నగరంలో మూసీ అని పిలువబడే ముచుకుందనది పారుతున్నది. ఆనది వాడపల్లెవద్ద కృష్ణలో కలుస్తున్నది.

హైదరాబాదుకు సికిందరాబాదుకు మధ్య హుసేన్ సాగరం అనే పెద్ద చెరువు ఉంది. సికిందరాబాదు 20 సంవత్సరాల కిందట నేను చూసిన దానికన్నా పెద్ద బస్తీ అయింది. అక్కడ ఇంగ్లీషు వారి సైన్యం ఉంది. అక్కడికి సమీపంలో గోల్కొండ ఉంది. అక్కడ బలమైన కోట ఉంది. అందులో నిజాం

అంతఃపురస్త్రీలు వున్నారు. అసఫ్‌సాహి వంశస్థులు ఇప్పుడు రాజ్యం చేస్తున్నారు. ఇంతకు ముందు సాలారుజంగు దొరతనం చేసి గత సంవత్సరం చనిపోయాడు. అతని కొడుకు నాసర్‌ద్దౌలా కంపెనీ వారి సహాయంతో ప్రభుత్వం చేస్తున్నాడు. రెసిడెంటు అనుమతి లేకుండా అక్కడ ఏదీ జరగదు.

20వ తేది ఉదయం మేడిచర్ల 10 గం కు చేరాను. దారిపొడుగునా సీతాఫలం చెట్ల అడవి వుంది. ఊరు పెద్దది. అంగళ్లు చాలా ఉన్నాయి. చెన్నపట్టణం నుండి 9 మంది, కడప నుండి నలుగురు కాక హైదరాబాదులో 9 మంది బంట్రోతులను మనిషికి 8 రూపాయల జీతంలో కుదుర్చుకున్నాను.

21వ తేదీ ఉదయాన 6 గంటలకు బయలుదేరి మాషాపేట అనే వూరు 12 గంటలకు చేరాను. జీడిచెట్లు, విప్పచెట్ల, టేకుచెట్లు, మోదుగచెట్లు వుండే అడవి భూమి దారిపొడువునా వుంది. అక్కడ అన్ని పదార్థాలు దొరుకుతాయి. అక్కడ ఆ రాత్రి వుండి మర్నాడు మధ్యాహ్నానికి బిక్కనూరు పేట చేరాను. వర్షాకాలంలో కొన్ని వాగులు దాటాల్సి వస్తుంది. ఆ వూరు పెద్దది. శివాలయము, రెండు చెరువులు ఉన్నాయి. అది జమీందారీ గ్రామం. జమీందారు కింద బస్తీ గ్రామాలలో పటేలు అనే అధికారి, హావల్‌దారు ఉంటారు. కుడిచర్ల మొదలుకొని నాకు వసతి గురించి వెతుక్కోవలసిన అవసరం రాలేదు. ఏ వూరిలో దిగితే ఆవూరి కరణం పక్కవూరికి బంట్రోతును ముందురోజే పంపి నా వసతి ఏర్పాటు చేసేవారు

23వతేది కామారెడ్డి చేరేదారి నల్లరేగడి భూమి. దోవలో కొన్ని వాగులు దాటాలి. కృష్ణానది దాటింది మొదలు ప్రతి వూళ్ళో మంచి బియ్యం దొరుకుతున్నాయి. మల్లుపేటలో మర్నాడు దిగడానికి స్థలం లేక మూడు డేరాలు ఒక చావడి ఏర్పాటు చేసుకొని దిగాను. అక్కడ ఒక పాడుకోట వుంది. చెరువు నిండా నీళ్లు ఉన్నాయి. 25వ తేది ఈదలవాయి అనే రామస్థలం చేరాను. అక్కడి గుడిలో జమీందారు రాజోపచారాలతో ఆరాధన నడిపిస్తున్నాడు. తిరుపతి తర్వాత యింత చక్కటి రాజోపచారాలు యిక్కడే చూశాను. జమీందారు వంశస్థులు

పిలిస్తే భగవంతుడు పలుకుతాడన్నట్లు ఆరాధనలు జరుగుతున్నాయి. అక్కడి నుండి ఈదల గండి వెళ్ళడానికి నాతోకూడా ఆయుధపాణుల్ని తీసుకొని వెళ్లాను. దారి అంతా చోరభయం. ఇలాంటి భయప్రదేశాలకు అవసరమని కడపలో రెండు తుపాకులు కొన్నాను. హైదరాబాదు నుండి నాతో వచ్చిన కూలీలు ఐదుగురు దారిలో అక్కడక్కడా తుపాకులు పేలుస్తూ వచ్చారు.

చిన్న ఘాటు మార్గం మీదుగా డిచ్‌పల్లెకి 27న చేరాను. ఇక్కడ పూర్వం రామ విగ్రహ ప్రతిష్ఠ కోసం గొప్ప దేవాలయం కట్టారు. అయితే కొన్ని కారణాలచేత ఆ విగ్రహాన్ని ఈదలవాయిలో స్థాపించారు. డిచ్‌పల్లె నుండి జగనంపల్లె వరకు మార్గ మధ్యంలో మొగలాయి రాణావారు కొందరు తుపాకీలు ధరించి నిలుచున్నారు. వారు మార్గంలో వచ్చే వారివద్ద అంతో యింతో వసూలు చేసేవారు. జగనంపల్లెలో రెండు చిన్న దేవాలయాలు, స్నానఘట్టంగల చెరువు ఉన్నాయి. ఇక్కడికి దగ్గర అడవిలో నరసింహక్షేత్రం వుంది. ఇక్కడికి వేములవాడ భీమేశ్వర రాజరాజేశ్వర క్షేత్రం వుంది. వేములవాడ భీమకవి ఇక్కడివాడే. ఇక్కడ పెద్దపులులు పశువుల్ని అప్పుడప్పుడు బాధిస్తున్నాయి

27వ తేది మధ్యాహ్నం 12 గం.కు గోదావరీతీరంలోని దూదుగాం చేరుకొన్నాను. జనగాం, బాలకొండల మీదుగా ఆ వూరు చేరవచ్చు. హైదరాబాదు తర్వాత అన్నివూళ్ళలో పాలు, పెరుగు సమృద్ధిగా దొరుకుతాయి. దూదుగాం ఆర్మూరు పరగాణాలోనిది. అక్కడ పటేల్ గుమాస్తా ఉన్నారు. గోదావరి నదికి అటువైపు నిర్మల్ అనే వూరువుంది. ఈ గోదావరీ తీరంలో తీర్థవిధులు నిర్వహించడానికి అక్కడే 4 దినాలు వున్నాను. హైదరాబాదులో అన్ని రోజులు వృధాగా వుండాల్సి వచ్చిందిగదా అనే బాధ పడ్డను. అక్కడ నేనున్న 20 రోజులు ఈ ప్రాంతాలలో క్షోణీపాతమైన వర్షం కురిసింది. అప్పుడు నేను ఈ కుగ్రామాలలో వుండి వుంటే ప్రయాసపడాల్సి వచ్చేది. శ్రీరాముని దయవలన హైదరాబాదులో ఉన్నాను. ఈ వూళ్ళలో తిరిగే రోజుల్లో రాత్రులు వర్షాలు కురిసి పగలు వెలసేది.

ఆయా మజిలీ గ్రామాలలో దొరికే తమలపాకులు మంచివికావు. అందువల్ల

తోటలకు మనుషులను పంపి లేత ఆకులు గిల్లించి తెప్పించేవాణ్ణి. హైదరాబాదులో ధనికులు పండుటాకులు వేసుకొంటారు. కడప మొదలు ఈ గోదావరీ తీరంవరకు అమ్మే వక్కలు ముడివక్కలు, కత్తిరించి వుడకబెట్టినవి కావు. అయితే మంచి రుచి. ఇక్కడ పేదలు తాంబూలం వేసుకోరు. వక్కలు నములుతారు. ఒకరి హుక్కాలు మరొకరు తాగుతారు హైదరాబాదులో నుండి మిగతా గ్రామాల్లో గోధుమల పిండి విసిరి అమ్ముతారు. రొట్టె తింటే మంచి బలమని వీరి నమ్మకం. మేముకూడా ఒక పూట రాత్రి అన్నంతోబాటు రొట్టె తీసుకొంటూ వచ్చాం. కడప దాటిన తర్వాత అరవభాష మాట్లాడేవారు తక్కువ. తెనుగు భాషతో పాటు హిందూస్తానీ మాటలు కలిపి వాడుతారు. వర్షాకాలంలో ఇటువక్క ఈగలబాధ జాస్తి.

ఇక్కడ పంచాంగాలు యితర పంచాగాలతో సరిచూశాను. తిథివార నక్షత్రాదులు అరగడియ అటోయిటో సరిపోతాయి బ్రాహ్మణులందరూ పంచాంగం చేతబట్టుకొని తిరుగుతారు కార్తీక, శ్రావణమాసాల్లో నిత్యాభిషేకాలు, నక్తభోజనాలు పాటిస్తారు. గృహకార్యాల్లో పురుషుల కంటే స్త్రీలకు ఎక్కువ చొరవ. డాగావాండ్లు అనే దొంగలు ధనికుల ఇళ్ళలో గుంపులుగా ప్రవేశించి, వారిని చంపి దోపిడీలు చేసేవారు. హైదరాబాదు వారికి ఇంగ్లీషు సైన్యాలకు మధ్య యిదే విధంగా జరిగింది. డాగా వారి భయం ఈ ప్రాంతంలో ఎక్కువ.

31వ తేది నిర్మల్‌లో బస. నిర్మల్ పంచపాత్రలు బాగా ప్రసిద్ధం. ఆ వూళ్ళో వాటిని వాడరు. ఈ వూళ్ళో దృశ్యా అనేవాడు నిజాం కింద అధికారం చేసేవాడు. అగస్టు 2న పొద్దూరు చేరుకున్నాను. అక్కడ నుండి విచ్చోడా ఏదులాబాదు ధనోరా, కాయరా, వోణీగ్రామాలలో మజిలీలు చేస్తూ 7వ తేది వడిడా అనే గ్రామం చేరాను. ఇక్కడ వరదా (వసిష్ఠ) నది చిన్న గంగ వలె ప్రవహిస్తున్నది ఇక్కడ నుండి నాగపూర్ వరకు కొంత కాలం ఇంగ్లీషువారి అధీనంలో వుండేది. తెనుగు భాష వాడుక తక్కువ. హిందూస్థానీ, ఉర్దూ సర్వసాధారణంగా వాడుతారు ఇక్కడ సంప్రదాయం పాటించేవారు ఒక పూట భోంచేస్తారు. రాత్రికి అటుకులు ఫలహారం చేస్తారు.

దారిలో నాగిరి అనే ఊరిలో రుక్మివిఠోబా దేవాలయం చూసుకొని మాండుగాం, చిందీగ్రామాలలో బస చేసి 13వ తేది గూంగాం చేరాము. వర్ణభేదం లేకుండా భోజనాలు యిక్కడ చేస్తారు. హైదరాబాదు నుండి దారిలో నేను చూసిన ఇళ్ళు చిత్రంగా కట్టారు. మట్టి మిద్దెను ఒక అరయింటికిగాని కూటానికి గాని వేసి పైన పెంకుల పూరితో ఒక కొట్టడి ఏర్పాటు చేసేవారు. పైకి ఎక్కడానికి ఒక నిచ్చెనగాని, పొడుగు మెట్లు గాని కట్టేవారు.

నాగపూరు ఆగస్టు 14న ప్రవేశించాం. శీతాబులిడి అనే ప్రదేశంలో అక్కడి రెసిడెంట్ ఇల్లు, తోటఉన్నాయి. ఇక్కడ చెన్నపట్టణం కాపురస్థుడైన వీరాస్వామి మొదలారిని మంచిచేసుకొని తోటబంగళాలో దిగాను. నాగపూరు రాజ్యం కొండరాజులది. 200 ఏళ్ల ముందు షావురాజు కుమారులు పీష్వాకు రాజ్యం దానంచేశారు. రామటెక్‌తో నాగపూరువారి రాజ్యసరిహద్దు ముగుస్తుంది.

నాగపూరికి దగ్గర కామిటి అనే ప్రదేశంలో ఇంగ్లీషువారి ఐదు పటాలాలు దానికి తగ్గ అధికారులు, ఉద్యోగులు వున్నారు. నాగపూర్‌లో సుమారు 20 వేల ఇళ్లు ఉంటాయి. స్త్రీ పురుషులు బలిష్ఠులుగా, రూపవంతులుగా ఉన్నారు. కమలాపండ్లు సమృద్ధి. రత్నవర్తకం జరుగుతున్నది. రెండు దేవాలయాలు అలంకారంగా ఉన్నాయి. దేవాలయాల్లో గర్భగృహం ముఖమండపం, ఒక స్థూపం నిర్మించారు.

నాగపూర్ పట్టణంలోను, కామిటిలోను నల్లరేగడ భూమి కావడంవల్ల వర్షాకాలంలో నడవడానికి అసహ్యంగా తోస్తుది. జాజిపూలు, మొల్లపూలు దొరాకుతాయి. మల్లెపూలు దొరకవు. ఈతాకులతో చీపుర్లు కడతారు. ఈనపుల్లలు కనపడవు. వీరికి చింతపండు వాడుకలో లేదు. చెన్నపట్టణం దండు వచ్చిన తర్వాత తెలుసుకున్నారు. మజ్జిగ, పెరుగు కాచివేసుకొంటారు. అక్కడ వారం రోజులు గడిపి కృష్ణనవరాత్రి ఉత్సవాలు దర్శించాను ఇక్కడ నాగపూరు రూపాయ చెలామణిలో వుంది. ఇక్కడ 15 సంవత్సరాలుగా డా. వోయిలీ **(Dr. Wylie)** నివసిస్తున్నారు ఆయన చెప్పిన దానినిబట్టి నాగపూర్ మొదలు జబల్‌పూర్ వరకు ఆగస్టు నుండి అక్టోబర్ వరకు చలిజ్వరాలు తగులుతాయి. నాతో వచ్చే వారికి నేనిచ్చే మందులు పనిచేస్తున్నాయి. నేను దిగిన వూళ్లలో నావద్ద వైద్యం

చేయించుకోవడానికి కొందరు వచ్చేవారు. తెలిసీతెలియని వైద్యం చేయడం ధర్మంకాదని చెప్పి పంపేవాణ్ణి.

కామిటి నుండి త్యాజ్యకాలంలో బయలుదేరాను. ఫలితం దారి ప్రయాణంలో వర్షంపడి కొంచెం తడిశాము. దారితెలియక బాధపడ్డాము. రామటెక్ రామక్షేత్రం తమలపాకుల తోటలు విస్తారం. ఆకులు నెలరోజులు చెడిపోకుండా వుంటాయి. ఈవూరికి దగ్గరలో కొండల మధ్య అంబరీషతీర్థమనే కొలను వుంది. ఇక్కడ బ్రహ్మోత్సవం కార్తీక శుద్ధపూర్ణిమకు జరుపుకొంటారు. కొండ మీద నరసింహమూర్తికి, వరాహమూర్తికి రెండు ఆలయాలున్నాయి. ఆవిగ్రహాలు జీవకళఉట్టిపడేలా వున్నాయి. అక్కడ తీర్థ శ్రాద్ధాలు నిర్వహించాను. తీర్థ తీరంలో దత్తాత్రేయప్రతిమ ఒకటి ప్రతిష్ఠచేయించి ఉంది. అంబరీషమహారాజు ఇక్కడి సమీపంలోని నందిగ్రామం రాజధానిగా రాజ్యం చేశాడు. ఈ సింధురాజ పర్వతం మీద శ్రీరామ చంద్రుడు, సీతాలక్ష్మణ హనుమత్సమేతుడై నిత్యం దర్శనమిచ్చేలా భక్తునికి వరమిచ్చాడు. ఈ స్థలంలో ఆగష్టు 28 రాత్రి వరకు వున్నాను.

29వ తేది త్యాజ్యకాలంలో బయలుదేరిన ఫలితంగా వర్షంలో బాగా తడిసి దొంగలతళావు అనే ఊరు చేరాను. ఇక్కడ దుకాణాలవారు తమ అంగళ్లకు దగ్గరగా యాత్రికులు దిగేందుకు వసతిగా కొట్టాలు వేశారు. ఆకొట్టాలలో దిగినవారు తమ అంగడిలో సామానులు కొనాలని నియమం. గుర్రాలకు పచ్చికసువు మేతగా తెచ్చియిచ్చారు. గుర్రాల దాణా అయిన సెనగలు చౌకగా దొరుకుతాయి.

నాగపూర్ రాజ్యంలో ఎర్రకందులు, నల్లనువ్వులు దొరకవు. తెల్లకందులు తెల్లనువ్వులు దొరుకుతాయి. నువ్వుల నూనె దొరకడం అరుదు. ఆముదం శుద్ధంగా దొరకదు. ధాన్యాలు పిండిగా విసిరి అమ్ముతారు.

రామటెక్‌కు ఉత్తరం బంగాళా గవర్నమెంటులో చేరిన శిమిని తాలూకాలోది గవర్నరుజనరల్ జబల్‌పూర్‌లో ఒక ఏజెంటును, సాగరులో ఒక ఏజెంటును వుంచి వారి క్రింద ఏడుగురు ప్రిన్సిపల్ అసిస్టెంట్లను ఏర్పరిచాను. ఈ అడవులలో దొంగలభయం జాస్తి. ఊరికి మూడేసి గుర్రపు సవార్లు ఠాణాలుగా వుంచి,

దొంగలను పట్టి శిక్షించి కొందరిని ఉరితీసి వేలాడకట్టారు. దొంగలు ఎక్కువ కనుక దీనికి దొంగలతావు అని పేరు వచ్చింది.

30వ తేది కురాయి వచ్చి, 31వ తేది చావిడి చేరుకున్నాను. ఇక్కడ రాతి ఉప్పు విశేషంగా అమ్ముతారు. ఈవూరి నుంచి బాలకృష్ణబాబు అనే ముఖ్యునికి ఇంగ్లీషుజాబు వ్రాసి నర్మద వరకు నాతో ఒక బంట్రోతు, ఒక టపామనిషి వచ్చే ఏర్పాటు చేసుకున్నాను.

సెప్టెంబరు 1న నారాయణ గంజు, రెండున గణేష్‌గంజ్, 3వ తేదిన ధూమా 4వ తేదిన రాయచేడు ప్రయాణించాము. దారిలో ఎన్నో వాగులు దాటుకుంటూ శ్రీరాముని కృపతో ప్రయాణం సాగించాను. బోయీలు శ్రమపడి మోస్తున్నారు. వారికి ధనాపేక్షకన్న మంచి పేరు తెచ్చుకోవాలని కోరిక. 5వతేది పిప్పర, 6తేది నర్మదానది దాటి తిలవారం చేరుకొన్నాను. ఈనది పశ్చిమంగా పారుతుంది. సుమతి అనే పశ్చిమ సముద్రతీరంలో సముద్రంలో కలుస్తుంది. ధృవుడు యాగం చేసినప్పుడు ఋత్విక్కులు సాంబమూర్తిని సంతోషపెట్టి పశ్చిమవాహినిగా నది కావాలని ప్రార్థించి సాంబుని అర్ధదేహం పారేలా చేసుకొన్నారు. అందువల్ల ఇది పురుషనది.

ఈతిలవారాలో కృష్ణతీరవాసులు 12 ఇళ్లవారు ఇళ్లు కట్టుకుని చాలా కాలంగా ఉంటున్నారు. యిక్కడి వారితో సంబంధ బాంధవ్యాలు లేకుండా అధ్యయన, అధ్యాపనాలు చేస్తున్నారు నర్మదకు ఇవతలి గట్టు నుండి విక్రమశకం ప్లవనామ సంవత్సర బహుళపాడ్యమి మొదలు పూర్ణిమ వరకు మాసంగా వ్యవహారం. కురాయి నుండి నర్మదానది వరకు దారి ప్రయాణం చేసి సురక్షితంగా వస్తే పునర్జన్మ కలిగినట్లే.

సెప్టంబరు 7వ తేది మధ్యాహ్నానికి జబల్‌పూర్ చూశాం. అది ఘర్డా మండల రాజధాని. నిజాంషావు అనే కొండరాజు పాలకుడు ఘర్డామండల పట్టణం చుట్టూ నర్మదానది ప్రవహిస్తుంది. ఇక్కడ భృగుమహార్షి తపస్సు చేస్తుండగా నది అతనికి

కొద్ది దూరంలో ప్రవహించసాగింది. ఆయన అందుకు నొచ్చుకోగా నది భృగు సమీపంలో ప్రవహించింది. ఇక్కడ భూమి అంతా శిలామయం. నర్మదా లింగాలు తెచ్చి అమ్మే గోసాయీలు ఈ శిలలతో కోడిగుడ్డు ఆకారంలో లింగాలు చేయించి స్వయం భూలింగాలుగా అమ్ముతారు. ఇంగ్లీషువారి అధీనంలోకి వచ్చిన తర్వాత రాజవీధులు విశాలంగా కట్టారు. ఇక్కడ కండగల దోసకాయలు, బీరకాయలు దొరుకుతాయి. ఇక్కడ గవర్నర్‌జనరల్ ఏజెంటు ఉంటాడు. రాకూరు ప్రసాద్ అనే కాన్పూరు కాపురస్తుడు షావుకారుగా పనులు చేస్తున్నాడు. ఇక్కడ ఏజెంటు అయిన స్మిత్ దొర కాశీ వరకు నాతో బంట్రోతు వచ్చే ఏర్పాటు చేసాడు. ఇక్కడ నాతో వచ్చిన వారికి కొందరికి చలిజ్వరాలు వచ్చాయి.

అక్కడ నుండి 13వ తేది గోసలపూరు, 14వ తేది సలమాబాదు వచ్చాము 15వ తేది మురువారా, 16వ తేది సభాగంజు, 17వ తేది మైహర్ అనే రాజధాని చేరాను. ఇక్కడి దొర ఒక బంగళాకట్టి తన ఠాణాను వుంచాడు. ఇక్కడ రాజు తన ఇష్టదైవమైన శక్తికి గుడి కట్టించాడు ఈ రాజు బహుయోగ్యుడని దొరలవద్ద పేరు తెచ్చుకొన్నాడు. బిషన్‌సింగు మహారాజు తమ్ముడు ప్రయాగదత్తు అన్నతో తగవుపడి రాజ్యాన్ని పంచుకొన్నాడు మైహారులో 20వ తేది వరకు వుండి 20వ తేది అమరాపాటన్ అనే వూరు చేరాను.

జబల్‌పూర్ దాటిన తర్వాత కొందరు బోయీలు, కావటి వాళ్ళు, బంట్రోతులు అడవిగాలికి చలిజ్వరాలతో మంచాన పడ్డారు. వాళ్ళను కొందర్ని డోలీలలో వేసి తేవల్సి వచ్చింది. వారికోసం పల్నా అనే వూరిలో మజలీ చేయాల్సి వచ్చింది. మర్నాడు రీమా చేరాము. అది రీమారాజు రాజధాని. రాజు కోటలోపల వుంటాడు. కోటబయట అంగళ్లు ఉన్నాయి. నాతో వచ్చిన పరిజనులు మిరపకాయలు చింతపండు తిననందున మాకు రోగాలు వస్తున్నాయని భ్రమపడ్డారు. కాబట్టి యాత్ర చేయదలచుకున్న వారికి నేనిచ్చే సలహా ఏమిటంటే కావల్సినంత చింతపండు మిరపకాయలు, మిరియాలు, ఆవాలు నాగపూరులోనే కొనుక్కొని రావడం మంచిది. పక్కలు కావల్సినన్ని తెచ్చుకొన్నాము. నెయ్యి దొరకడం కూడా కష్టం. ఈ రీమారాజులు వంశపారంపర్యంగా ఈరాజ్యం ఏలుతున్నారు. వారిది క్షత్రియ

జాతి. సంవత్సరానికి పది లక్షల ఆదాయం వస్తుంది.

23న రాయపూరు చేరుకున్నాను. వూరి చుట్టూ తోటలు, గుంటలు, చెరువులు ఉన్నాయి. అంగళ్లు వనతిగా లేవు. సత్తిమీదుగా మౌగంజు వచ్చాం. ఇది అనిరుద్ధసింగు అనే రాజు అధీనంలో వుంది. రీమారాజు వీరిరాజ్యాన్ని జప్తుచేసుకొని యీరాజుకు భత్యఖర్చు యిస్తున్నారు. తామరకొలను ఒడ్డున డేరాలువేయించి ఆరాత్రి అక్కడ ఉన్నాం.

హనుమాన్యా అనే వూరు దాటుకొని వచ్చాం. దారిలో నాతో వచ్చినవారు జ్వరాలతో బాధపడ్డారు.నాతో దాదాపు పరివారం నూరుమంది వచ్చారు. వీరిలో 15 మందికి జ్వరాలు. ఆసుపత్రిలో వార్డులు డాక్టర్లు పరీక్షచేసినట్లు నేను రోజూ వారికి చిక్సిత చేస్తూవచ్చాను. రామకటాక్షం వల్ల అందరికి అనుకూలమైంది. కట్రా అనేవూరు దాటి వస్తూ దారిలో మృగభయం వల్ల జవాన్లు తుపాకీ కాలుస్తూ వచ్చారు. ఈదారిలో నీరు దొరకక కొందరు ప్రాణాలు వదిలారట. దారిలో మూడు నదులు దాటి లాలుగంజ్ మీదుగా మిర్జాపూరు చేరి గంగ దర్శనం చేసుకొన్నాం. కోటి జన్మల పాపంపోగొట్టి పావనుల్ని చేసే నది అది ఆతృప్తి ఎంతవ్రాసినా తీరదు. వింధ్యపర్వతం దాటుకొని రావాలి. మీర్జాపూరు పెద్దపట్టణం. పాత్రసామాన్లు చేసే కంచరవాళ్లు అహోరాత్రులు పనిచేస్తారు. గంగానది గుండా అనేక సరుకులు కలకత్తా, ఢిల్లీ వంటి స్థలాలకు వస్తూపోతూ వుంటాయి. ఇది మొదలు కుంఫిణీ రాజ్యం. ఆయుధాలు పట్టుకోనీరు. గంగానది చెంత హిరణ్యశ్రాద్ధము, పితృక్రియలు చేశాను. ఈవూరు చెన్నపట్టణమంత పెద్దది. చలిజ్వరాలు తగ్గిన దాకా అక్కడే వుండిపోయాం. ఇద్దరు దారిలో దురదృష్టవశాత్తు చనిపోయారు. మిరిజాపూరు దాటి వింధ్యవాసిని అనే దేవీక్షేత్రం చేరుకొన్నాం. ఊరుగొప్పదే. ఇక్కడ పండ్యాలు పూజారులు. వీరు యాత్రికుల్ని ముందుగా కలుసుకొని దర్శనాలు చేయించి దక్షిణలు, వస్త్రాభరణాలు తీసుకొంటారు. నాతో గురుదాసుబాబు అనే పండ్యా వచ్చాడు. మేము అక్కడ తోటబంగళాలో దిగాం. ఇక్కడ చైత్రశుద్ధంలో, ఆశ్వీయుజ శుద్ధంలో తామసమహోత్సవాలు జరుగుతాయి. ఇక్కడ యోగమాయ, భోగమాయ, కాళి అనే మూడు శక్తులున్నాయి.

అక్టోబరు 9న గోపీగంజ్‌లో ఒక బంగళాలో దిగాను. ఇక్కడ భాగవత గ్రంథం పురాణ కాలక్షేపంలా ఒక పండితుడు చెబుతున్నాడు. ఇలా మిరిజాపూర్‌లో కూడా జరుగుతుందని విన్నాను. జబల్‌పూర్ వదిలింది మొదలు ఎండలు తీవ్రమై పడమటి గాలి తీవ్రమైంది. అండ్యానరాయి మీదుగా జూసీనరాయి వచ్చాం. గంగ ఒడ్డున వున్న ఈవూరు పెద్దది. ఇక్కడ దక్షిణవాహిని. అభ్రకసంబంధమైన భూమి కాబట్టి గంగాజలం మెరుస్తూ వుంటుంది.

12వ తేది గంగా నది దాటి ప్రయాగ చేరాం. అక్కడ పెరిమిట్టు ఘాటులో దిగాను. ప్రయాగలో పరమాత్ముడు వటపత్రశాయిగా ఉన్నాడు. ఇక్కడ వట వృక్షము ఎప్పటికి క్షయంకాదు కాబట్టి అక్షయ వటవృక్షం అంటారు. బ్రహ్మ యిక్కడ దశాశ్వమేధాలు చేశాడు. విష్ణువు సంతోషించి ఈ క్షేత్రాన్ని విష్ణుప్రజాపతి క్షేత్రం అని పిలుస్తారని చెప్పాడు. సూర్యభగవానుని ద్వారా గర్భం ధరించిన ఛాయాదేవి తపస్సు చేస్తూ వుంది మోహావేశుడైన సూర్యుడు ఆమె దగ్గరగా మళ్ళా వచ్చాడు. గర్భవిచ్చితియై ఒక పిండము, ఉదకము స్రవించాయి. హరిరుద్రాదులు ప్రసన్నులయ్యారు. రుద్రశక్తితో ఆ పిండం యమధర్మరాజుగా రూపొందింది. విష్ణుశక్తితో ఉదకం యమునానదిగా మారింది యమునను మాధవమూర్తి మోహించాడు.

గంగాయమునలు యిక్కడ సంగమించి ప్రయాగ అయింది. సరస్వతి కూడా వారితో సంగమించి గుప్తంగా వుంటున్నది అందువల్ల దీనిని త్రివేణీ సంగమము అని కూడా అంటారు. లోకుల పాపాలను పోగొట్టడానికి ఈ ముగ్గురూ ఇక్కడ నదీ రూపంలో ప్రవహిస్తున్నారు. ఇక్కడ ప్రాణిదానం చేస్తే జన్మాంతరంలో ఇహలోకంలో ఇష్టసుఖాల ననుభవించి ముక్తిని పొందుతాడు. ఇక్కడ గోదాన తిలదానాలు ముఖ్యం. ఇక్కడ ఒకటి రెండు ధర్మశాలలు వున్నాయి. ఇక్కడ కార్తిక శుద్ధ విదియ నాడు స్నానం చేస్తే పుణ్యం. ఆరోజు యమధర్మరాజు తన చెల్లెలిని చూడటానికి అక్కడకు వచ్చి, అక్కడ స్నానం చేసిన వారికి యమదండన లేకుండా వరమిచ్చాడు. నాకు ఆపుణ్యం ప్రాప్తించింది. ఇక్కడ ఢిల్లీపాదుషా కోటకట్టాడు. దీనిని అలహాబాదు అని కూడు అంటారు. ఇక్కడ అధికారిగా ఒక

కమీషనర్ వున్నాడు. మీర్జాపూర్ దొరలు యిచ్చిన పాస్‌పోర్టు ఆధారంగా ఇక్కడ దొరలు కాశీ దాకా వేరే పాస్‌పోర్టు యిచ్చారు. ప్రయాగలో స్త్రీలు వేణీ దానం చేస్తేపుణ్యం. అయితే జడ కత్తిరించి యివ్వటమా! వెంట్రుకలు పూర్తిగా యివ్వటమా! అనేది వివాదంగా వుంది. నా భార్య తలవెంట్రుకలు పూర్తిగా దానం యిచ్చింది. ఇక్కడ క్షౌరము చేసేవారికి శక్త్యాను సారం డబ్బు యివ్వాలి. ఇక్కడ రామభట్లు కృష్ణం భట్లు, శంకరభట్లు తెనుగు నేర్చుకొని పురోహితులుగా వుంటున్నారు నేను శంకరభట్లను పిలిపించుకొని అన్ని పనులను పూర్తి చేశాను. నేను తీర్థశార్ధాలు పెట్టించాను. మా ఆవిడ మంగళవాద్యాలతో త్రివేణీ సంగమంలో వేణీదానం చేసింది. మేము ద్వారకాదాను ధర్మశాలలో దిగాము. నేను పనిచేసిన సర్‌జాన్ న్యూబోట్ సర్‌చార్లెస్ గ్రే దొరలు వ్రాసి యిచ్చిన సర్టిఫికేట్లు నాకు బాగా ఉపయోగపడ్డాయి ఈ దేశస్తులు పాత్ర సామాను శ్రమపడి తోమి శుభ్రముగా వుంచుకుంటారు వీళ్ళ గుడ్డలు మనదేశంలో పాత్రలవలె నల్లగా వంటాయి గంగ ఒడ్డున భూమిని దున్ని పైరు పెడుతున్నారు. గోధుమలు పండుతాయి ఇక్కడ వేద పారం జరుగదు. ఇక్కడ పంచగౌడులు నివసిస్తున్నారు.

ప్రయాగకు నాలుగు ప్రక్కలా హిందూస్తానీ నాలుగు విధాలుగా వాడుకలో వుంది. ఇక్కడ శంకరాచార్యులు స్థాపించిన అద్వైతమతం వ్యాప్తిలోవుంది. ఇక్కడ పౌరాణికుడయిన మధురానాథ్ అనే మహారాష్ట్రీయునితో పురాణ గోష్ఠి జరిపాను సీమ సామానులు అమ్మే అంగడి ఒక బంగాళీ నడపుతున్నాడు. పది రోజులు ప్రయాగలో గడిపి 23వ తేది బజరా అనే ఇల్లు గల పడవ ఒకటి, నావా అనే సాధారణ పడవ ఒకటి తీసుకొని గంగ గుండా ప్రయాణం చేశాను. వీటి బాడుగ సర్కారు వారు నిర్ణయించారు నేను దశాశ్వమేధంలో గంగ ఎక్కువగా పట్టుకొని యింటికి తీసుకెళ్లడానికి ఏర్పాటు చేశాను

శ్రావణభాద్రపదమాసాలలో గంగ బాగా ప్రవహిస్తుంది. మేము తూర్పువైపు వెళ్తున్నాం గాబట్టి ఎదురుగాలి తగిలింది నది మధ్య మధ్యలో మిట్టలు ఉంటాయి గాబట్టి వాటికి పడవ కొట్టుకొంటుందని రాత్రులు పడవనడపరు. గంగ కిరువైపులా దగ్గర దగ్గరగా వూళ్లు ఉన్నాయి. గంగకు ఇవతల వైపువున్న వ్యాసకాశి చేరాము.

కాశీ కనిపిస్తుంటుంది ప్రయాగలో చెప్పే సంకల్పము కాశీలో చెప్పే సంకల్పం కొద్దిగా తేడా కలిగి వుంటాయి.

కాశీలో కేదారఘట్టంలో ఒక పెద్ద యింట్లో దిగాను. ఇక్కడ గంగాపుత్రులు దొరతనం చేస్తూ యాత్రికులపై పోకిరీతనం చేస్తారు. నాతో వచ్చిన రామరహాల్ సహాయంతో నాకు అన్నీ సవ్యంగా జరిగాయి. నాతో కూడా వచ్చిన వారిచేత తీర్థశ్రాద్ధాలు పెట్టించి బంతులు ఏర్పాటు చేసి సంతర్పణ చేసి దక్షిణలతో సంతృప్తిపరిచాను.

కాశీలో కార్తీకమాసం జనాకర్షణ కాలం. ఈ పట్టణానికి ఉత్తరంలో ''వరణ'' దక్షిణంలో 'అసి' అనే రెండు నదులు కాల్వలుగా ప్రవహిస్తాయిగాబట్టి దీనికి 'వారణాసి' అని పేరు. ఇక్కడ దేహంవదలిన వానికి తారకోపదేశం అవుతుందని పురాణాలు చెబుతున్నాయి. ఇక్కడ దేవాలయాలు సంకుచితంగా ఉన్నాయి. సాదాస్తూపాలు కలిగి అర్చకుల అదుపు లేక వృషభాలతో నిండి ఉన్నాయి. ఫలపత్ర పుష్పాలతో స్వయంగా ఆరాధన చేసుకోవచ్చు. పీతాంబరాలు, వస్త్రాలు అపారంగా అమ్ముతారు. గవర్నర్ జనరల్ఏజెంటు పట్టణానికి సర్వాధికారి. కొత్వాలు కచేరీ వుంది.

ముల్లంగిగడ్డలు పొడుగుగా వున్నాయి. కమలాపళ్లు చెట్ల కింద రాలిపడివున్నాయి. తినేవారు లేరు. విధవలు, వృషభాలు, మెట్లు-ఇక్కడి ఉపద్రవాలు బాలవిధవల నడత సరిలేదు. దానం చేసి వదలిన ఎద్దు మనుషులతో పాటు తిరుగుతున్నాయి. ప్రతివీధిలోను మెట్లు ఎక్కడం దిగడంలో తొట్రుపడిన వారికి కాళ్లుచేతులు విరుగుతాయి.

ఇక్కడ అధర్వణవేదం కొందరు అధ్యయనం చేశారు. శాస్త్రాలు చదివినవారు ముఖ్యంగా న్యాయశాస్త్రం చదివినవారు ఎక్కువ. గంగా పుత్రులు ఎక్కువ. దక్షిణభాగంలో దుర్గాగుడి వుంది. చేతిలో పూజాద్రవ్యాల పైబడి ఎద్దు తినిపోతుంటాయి. కాశీ పట్టణంలో పదివేల ఇళ్లు, లక్షదాకా ప్రజలు వుంటారు. దేశభాష హిందుస్తానీ. స్థలమహాత్మ్యం స్కాందపురాణంలో కాశీఖండంలో నూరు

అధ్యాయాలలో చెప్పబడింది. విశ్వేశ్వరుడున్న కాశీ ముక్తి క్షేత్రం. ఇక్కడ డిసెంబరు 16వ తేది వరకు ఉన్నాం.

కాశీలో ధనుర్లగ్నంలో 17వ తేది బయలుదేరి వచ్చాం. అక్కడి నుండి 1830 సంవత్సరం డిసెంబరు 28వ తేది పాట్నా అనే పట్టణం ప్రవేశించాం. అక్కడ పునః పునః అనే నది గంగాసంగమం చేస్తుంది. పాట్నాలో మంచు కాలంలో దేహాలేపనం చేసేటందుకు నాలుగు విధాల పరిమళ తైలాలు తయారు చేస్తారు. కాశీవరకు తాటిచెట్లు కనబడలేదు. యిక్కడ ఇరుపక్కలా తాటిచెట్లు కనపిస్తాయి. బంగాళాదుంపలు ఈ దేశజనులు పైరుపెట్టడం ఇరవై ఏళ్లకు ముందు మొదలు పెట్టారు

పాట్నాలో కలెక్టరు ఉన్నారు ఒక అపీలు కోర్టు, కమీషనరు ఉన్నారు. పాట్నాదేవి మందిరం, గోపీనాథుని మందిరం ప్రసిద్ధమైనవి నేపాల్ దేశం ఇక్కడికి సమీపం గనుక అక్కడ అమ్మే కస్తూరి అమ్ముతారు.

గయలో డాక్టర్ జాన్ దేవిడ్సన్ దొర నాతో సృష్టిని గూర్చి చర్చిస్తూ వర్ణవ్యవస్థను గూర్చి మాట్లాడుతూ ఇది మానవ సంకేతమని అన్నారు. సతీ సహగమనం గూర్తి ప్రస్తావనవచ్చింది బెంటింక్ దొర దానిని నిషేధించారు అష్టాదశ పురాణాలు, స్మృతులను గూర్చి ముచ్చటించుకొన్నాం. పాట్నా నుండి 1821 జనవరి మొదటి తారీఖున గయకు బయలుదేరాం. జానా, చెలాయనే దాటుకొని 4వ తేది గయాక్షేత్రం చేరాం గయ గొప్ప పట్టణం. ఇంగ్లీషువారు ఒక బస్తీ కట్టించుకొన్నారు. కలెక్టరు కచేరీ బస్తీలో వుంది

గయాక్షేత్రమహాత్యం వాయుపురాణ, గరుడపురాణాలలో ఎనిమిది అధ్యాయాలలో వుంది గయాసురుడనే రాక్షసుడు తపస్సు చేసి తన దేహం అతిపవిత్రంగా ఉండేలా వరం తీసుకొన్నాడు. బ్రహ్మ అతని శరీరం మీదనే యాగం మొదలు పెట్టారు. రాక్షసుని శిరస్సు కదలకుండా ఒకశిల తెచ్చి పెట్టారు దానిమీద విష్ణువు తన కుడికాలు పెట్టి గదాధరుడై నించున్నాడు. బ్రహ్మయాగం పూర్తి చేశాడు విష్ణువు అదేరూపంలో దేవతల ప్రార్థన మన్నించి అక్కడే వుంది

భక్తుల ఆరాధనలు పొందుతున్నాడు. ఇక్కడ పిండప్రదానం గోదానం చేస్తారు గయాప్రజనం నేను నెలరోజులు చేశాను ఒంటిపూట భోజనము, బ్రహ్మచర్యం నియమంగా చేసి సంతర్పణ చేశాను. ఇక్కడ నల్లరాతితో చెంబులు, గ్లాసులు తట్టలు, ప్రతిమలు తయారుచేసి అమ్ముతుంటారు.

ఈ దేశంలో కాలువాపులు, బీజవృద్ధి రోగాలు జాస్తి. గండకి నది నీరుతాగి మెడలు వాయడం, మహోదరాలు వంటి అండవాయువులు వస్తున్నాయి. యౌవనంలో స్త్రీసంచారం ఎక్కువకావడంవల్ల ఇది విస్తరించిందని డాక్టర్లు చెప్పారు. రేగుపళ్లు యోగ్యంగా దొరుకుతాయి. విస్తళ్లు దొరకవు. అష్టగయ, పంచగయలు చేయడం యిక్కడి విధి

గయాక్షేత్రం రాజా మిత్రజిత్‌సింగు జమీందారీలో వుంది. ఇతడు కుంఫిణీకి సాలుకు లక్షరూపాయలు కడుతున్నాడు. అతనికి సునాయాసంగా 50 లక్షలరూపాయల ఆదాయం వస్తుంది. లార్డ్‌కారన్‌వాలీసు ఉత్తర్వుమీద అప్పట్లో జిల్లాకలెక్టర్లు జమిందారులకే భూమినిచ్చారు. రైతులు బీగాకు 14 రూపాయలు సర్కారుకిస్తారు. ఇక్కడ గ్రామకరణాలను బట్టువారీలు అంటారు

గోధుమలు, జవ అనే యవలు వరి పైరువలె పండుతాయి కాశీలో వలె గయలో అడుగడుగున లింగాలు లేకపోయినా నాలుగు వక్కలా గుళ్లు, తీర్థాలు ఉన్నాయి ముఖ్యంగా మంగళగౌరి గయాసురి అనే శక్తి గుడులలో బలిప్రదానాలు జరుగుతాయి. అష్టాదశపీఠాలలో మంగళగుడి ఒకటి గయలో ఫిబ్రవరి 14 వరకు ఉన్నాను.

ఫిబ్రవరి 15వ తేది గయలో బయలుదేరి 18వ తేది పాట్నా చేరుకొన్నాం. శివరాత్రి వెనకాముందులుగా ఈదేశంలో వర్షం పడటం వాడుక. కురిస్తే రాళ్ల వానకురుస్తుంది. అవి కొద్దిసేపటికి కరిగిపోతాయి. ఈవానలు గోధుమ పంటకు మంచిది కాదు. అక్టోబరునుండి ఫిబ్రవరి 15వరకు చలిబాధ. అది తగగానే తీక్షణమైన ఎండలు. ఈఎండలు తట్టుకోలేక లార్డ్ విలియం బెంటింక్ దొర హిమాలయాలకు ఎండాకాలం కాలక్షేపానికి వెళ్లేవారు.

పాట్నాలో 15 రోజులు వుండవలసి వచ్చింది. అక్కడ నుండి ముద్గలా క్రమంగా ప్రసిద్ధికెక్కిన మాంఘీర్ వచ్చాం. ఇక్కడ పట్టునారమళ్లు నేసి మూంగా చీరలుగా మనదేశంలో అమ్ముతారు. సమీపంలో సీతాగుండము, రామగుండము, లక్షణగుండము వున్నాయి. నీరు చల్లగా వుంటాయి. దాతా వైద్యనాధ స్థలం ప్రసిద్ధం. కైలాసంలో శివుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకొన్న రావణుడు లంకలో తనతో వుండమని శివుని లింగరూపంలో తీసుకెళ్తున్నాడు. విష్ణువు ఆదేశంతో వరుణుడు రావణునికి దాహం కలుగజేసి లింగం కింద పెట్టేలా చేశాడు ఆ లింగం అక్కడే స్థాపితమైంది. వైద్ది అనే గోపాలకుడు భక్తకన్నప్ప కాళహస్తీశ్వరునికి వలె వైద్యం చేసినందునే ఆదేవునికి వైద్యేశ్వరుడని ప్రసిద్ధి వచ్చింది.

కహాలుదాం, రాజామహాల్, బదరుగంజ్, పటకాబాడి, కృష్ణనగర్ మీదగా ఏప్రీల్ 2వ తేది శాంతిపురం అనే గ్రామం చేరాము. టెంకాయతోపులు, పోకచెట్లు జాస్తి. సముద్రపు పోటు ఎక్కువ హుగ్గులీ, బారక్‌పూర్ దాటుకొని కలకత్తాపట్నం తొమ్మిదో తేదికి చేరుకొన్నాం. చరత్క పూజాభానుపోడా అనే ఈశ్వరారాధనలు జరుగుతున్నాయి. ఉదక కుంభదానాలు, పిండప్రదానాలు శ్రాద్ధాలు పితృప్రీతిగా చేస్తారు. మహాకాళి ఆలయం దక్షిణ భాగంలో వుంది. విశాలమైన గర్భగృహము ముఖమండపము ఉన్నాయి. మేకలు, మేకపిల్లలు రోజూ బలియిస్తారు. శుక్రవారం ఆదివారం పూజలు, బలులు జరుగుతాయి. నవరాత్రులు ప్రధానం. కాళీప్రతిమ బహుస్థూలం మనిషి చేయిఎత్తు పూలమాలలతో కాళిని పూజిస్తారు.

కలకత్తాలో స్త్రీలు 12మూరల బట్టతో దేహాచ్ఛాదన చేసుకొని ముసుగువేసుకొంటారు. రవికెలు తొడిగే సంప్రదాయం లేదు. మలయాళీల సంప్రదాయమది. ఇది గౌళదేశమనీ, విరాటదేశమనీ పేరు కెక్కింది. ఏప్రిల్-మే నెలల్లో అధికమైన ఎండలు. ఇక్కడ బ్రిటీషువారు కొన్ని కాలేజీలు కట్టించారు. పురుషులు మీసాలు వుంచుకోరు జూన్ 2 వరకు అక్కడే ఉన్నాను.

ఉడుబడియా, బాగునా, సీదాహాట్, డబరా భద్రకాళి, రాణీనరామ్, జౌలేశ్వరం బస్తా, బాలేశ్వరం, సూరత్తు గ్రామాలు దాటుకుంటూ 13వ తేదీకి 'భద్రక' అనే

గ్రామం వచ్చుము. నాభీగయాళీలు మాకు ఎదురు వచ్చారు. నాతో కూడా వచ్చిన మనుష్యులలో కొందరికి అకస్మాత్తుగా కడుపు నొప్పి విపరీతంగా వచ్చింది. కొంతమందికి నెత్తురు బంక. స్త్రీ సంబంధమైన మేహరోగం నయంకాలేదు. అతనికి కలకత్తాలో చికిత్స చేయించమని మిత్రులకు చెప్పి వదలివచ్చాను. స్త్రీల ఆకర్షణలో పడి పురుషులు పశుతుల్యులు అవుతున్నారు.

18వ తేది కటక్ చేరుకొన్నాం కటకం పూర్వం ఢిల్లీ కింద వుండేది. వారి అంతఃకలహాలవల్ల నాగపూరు పాలించే షాహురాజు వంశస్థులు లోబరచుకొన్నారు. పట్టణంలో రెండువేల యిండ్లు, పదివేల మంది జనం వుంటారు. మొహారం పండుగ మేం వెళ్లిన సమయంలోనే జరుగుతోంది. కటక్ చుట్టూవుండే మహానదిని దాటుకొని గోపాలపురం చేరి, సత్యవాది మీదగా 21వ తేదికి జగన్నాథ మహాక్షేత్రం చేరుకొన్నాం. దగ్గరలో తులసీదాసు సమాధి వుంది. జగన్నాధ క్షేత్రం విశాలంగా ఉంది. గర్భగృహం చుట్టూ చిల్లర గుళ్లు వున్నాయి. గుడికి నాలుగు పక్కలా నాలుగు ద్వారాలు, ప్రసాదాలు సింహద్వారం మొదలు ముఖమండపం దాకా అమ్ముతారు. బలభద్రుడు, జగన్నాథస్వామి, సుభద్రామూర్తులకు చేతులు లేవు. 12 సంవత్సరాలకొకసారి వచ్చే అధిక ఆషాఢమాసంలో కొత్తదారువులతో మూర్తులు తయారు చేయిస్తారు. జ్యేష్ఠశుద్ధపూర్ణిమనాడు గర్భగృహంలో మూర్తులను బయట అభిషేకమండపానికి తీసుకొని వచ్చి సాయంకాలం దాకా వుంచి గర్భగృహం వద్దకు తీసుకొని పోయి అమావాస్య వరకు తెరలోపల వుంచుతారు. ఈ కాలంలో దర్శనాలు వుండవు ఇక్కడికి దగ్గరలో ఇంద్రద్యుమ్నమనే పేరుతో మరొక ఆలయం వుంది

ఇక్కడి నుండి భువనేశ్వరంలోని లోకనాథస్వామిని దర్శించుకొన్నాం. ఇక్కడ మార్కండేయ తీర్థము, మార్కండేయుల గుడి ఉన్నాయి. జూన్ 26 వరకు అక్కడవున్నాము. నరసింగఘాటు, మాణిక్యపట్టణం, మితాగువ్వ, ప్రయాగల మీదుగా గంజాం చేరుకొన్నాం. 15 ఏళ్ల కిందట మల్లాడి జ్వరంతో పట్టణం పాడుబడింది. అది ఋషికుల్యానదీ తీరంలో ఉంది. ప్రయాగవరకు బృహస్పతిమానమైతే గంజాంలో చాంద్రమానం. అక్కడ నుండి ఛత్రపూర్, బరంపురం చూసుకొంటూ

ఇచ్ఛాపురం చేరుకొన్నాం. ఇక్కడ బియ్యము, ధాన్యము ఎగుమతి చేసే రేవులు ఆరు వున్నాయి.

కంచర్ల, పలాస మీదుగా 6వ తేది, హరిశ్చంద్రపురం చేరాము. ఇక్కడ అంగళ్లలో సమస్తపదార్థాలు దొరుకుతాయి. కొరివి రామన్న పంతులు అనే జమీందారు యింట్లో బసచేశాం. 7వ తేది శ్రీకాకుళం చేరాము. ఇక్కడికి దగ్గరలో శ్రీకూర్మమనే మహాస్థలంఉన్నది. విష్ణువు కూర్మావతారం ఎత్తినందున శిలతో చేసిన బింబము శంఖచక్రలాంఛనాలతో వుంది. విష్ణువు తన చక్రంతో పతివ్రత ఏకాదశీవ్రతాన్ని, పాతివ్రత్యధర్మాన్ని ఏకకాలంలో కాపాడినట్లు ప్రసిద్ధి. విజయరామరాజు సంస్థానం వారు ఈ గుడి ధర్మాన్ని పరిపాలిస్తారు. జిల్లా జడ్జీ కలెక్టరు, పోలీసు దొర ఉన్నారు. వెయ్యి ఇళ్లు ఉంటాయి. దీనికి బలరామక్షేత్రమని ప్రసిద్ధి స్కాంధపురాణంలోని కూర్మపురాణంలో 30 అధ్యాయాలలో క్షేత్రమహాత్యం వర్ణించబడి వున్నది. నదీతీరంలో కోటీశ్వరాలయం పురాణ ప్రసిద్ధం రత్నవ్యాపారం బాగా జరుగుతుంది.

వెజ్జపురం, గిరివాడిపాళెంల మీదుగా 10వ తేది విజయనగరం చేరాము. ఇది కళింగరాజధాని. విజయనగర రాజులు సంగీత సాహిత్య ప్రియులు. రామతీర్థులు అనే స్థలంలో విజయనగర రాజ గురువు నివసిస్తున్నారు. 250 సంవత్సరాలుగా ఈరాజవంశీకులు విజయనగరం పాలిస్తున్నారు. రాజు చిన్నకోటలో వుంటున్నాడు. బంగారు మీద పోగరపని చేసేవాళ్లు, పాత్ర సామాన్లు చేసే కంచరవాళ్లు, నేతగాళ్లు ఉన్నారు.

రాజ్యాన్ని విశాఖపట్టణం కలెక్టరు అధీనంలో వుంచి విజయనగర రాజు సకుటుంబంగా కాశీలో నివశిస్తున్నాడు. రాజు అయిన నారాయణబాబు ధనకాంక్ష లేక అప్పులపాలైనా ప్రజల పొగడ్తలందుకుంటున్నాడు. రాజ వీధులు విశాలంగా వున్నాయి. సోమవారం నాడు జగన్నాధస్వామి ఆలయంలో రధోత్సవం వైభవంగా జరుగుతుంటే చూశాము. సంవత్సరానికి 5 లక్షలు కుంఫిణీవారికి కట్టాగ్. బందిపోట్ల ఉపద్రవం యిక్కడ కూడా వుంది.

అలమంద అనేవూరు చేరుకొని అక్కడ నుండి సుబ్బవరం మీదుగా సింహాచలం చేరుకున్నాము. ఇక్కడ వరాహనరసింహమూర్తి ఆలయం వుంది. సంవత్సరానికి పదివేల రూపాయలు ఆలయానికై విజయనగర రాజు ఖర్చుచేస్తున్నాడు. శ్రీమహావిష్ణువు ప్రహ్లాదుని తండ్రిదండన నుండి కాపాడిన ప్రదేశం ఇది. పర్వతం మీద వరాహమూర్తి మందిరం వుంది. అక్షతదియ రోజు మాత్రమే స్వామి దర్శనం జరుగుతుంది.

అనకాపల్లి, కనంకోట, యలమంచిలి, నక్కవల్లి దాటుకొని 17వ తేదీ తుని చేరాము. కనంకోట వద్ద శారదా నది, యిక్కడ తాండవ నది వున్నాయి. గంజాము మొదలుకొని అన్ని యిళ్ళలోను ఎఱ్ఱమన్ను గోడలకు పూసి సున్నపు చుక్కలు బారులు తీర్చి వుంచుతారు. వంటమామిడి, నాగలాపల్లి దాటు కొని 20వ తేదీ పిఠాపురం చేరాము. ఈ స్థలాన్ని పాదగయ అంటారు. శ్రాద్ధము చేసి పిండప్రదానం చేస్తారు. ఇక్కడ కుక్కుటేశ్వరాలయం వుంది. నీలాద్రిరాయుడు అనే జమీందారు యిక్కడ మట్టి కోట కట్టుకొని వుంటున్నాడు. పెద్దాపురం మీదుగా రాజానగరం చేరాము. అక్కడ నుండి రాజమహేంద్రవరము చేరుకున్నాము. ఇది పూర్వము రాజరాజనరేంద్రుని రాజధాని. అతని కొడుకు సారంగధరునితో చంద్రవంశం అంత్యమైందని లోక ప్రసిద్ధి. (విషాద సారంగధరలో వివరాలున్నాయి). రాజమహేంద్రవరము గౌతమ మహాముని ఆశ్రమము. గౌతముడు ద్వాదశ వర్ష క్షామము పోగొట్టడానికి గౌతముడు వడ్లు చల్లి ఆ ధాన్యంతో ప్రాణరక్షణ చేశాడు. ఒకరోజు ఆ పైరును ఒక గోవు మేస్తూ వుంటే గరికపోచతో గౌతముడు దానిని అదిలించగా అది చనిపోయినట్లు అభినయించింది గోహత్య పోగొట్టకోవడానికి శివుని ప్రార్థించి తన ఆశ్రమం వరకు గంగను ప్రవహించేలా చేసాడు. సప్త ఋషులు ఆ ధారకు గోదావరి అని నామకరణం చేశారు. వారి ప్రార్థన మన్నించి గౌతముడు గోదావరిని ఏడుధారలుగా చీల్చి సప్తగోదావరులు సృష్టించాడు. రాజమహేంద్రవరం హైదరాబాదు అధీనంలో వుంది. వేయి యిండ్లు వుంటాయి. జిల్లా జడ్జి కోర్టు వుంది.

28వ తేదీ బందరు వెళుతున్న రాజాకొచ్చెర్ల కోట వెంకటరాయనింగారితో

కూడా నేను వాడపల్లి చేరాను. వాడపల్లిలో వేంకటేశ్వర్ల గుడి వుంది. ఆచంట మీదుగా 31వ తేదీకి శృంగవృక్షం చేరాను. ఏలూరుపాడు, తుమ్మడి, దాటుకొని మచిలీపట్టణం అనబడే బందరు ఆగష్టు 2వ తేదీ ప్రవేశించాను. అక్కడ రామన్న పేటలో ఒక తోట యింట్లో బసచేశాను. ఇక్కడ 22 పేటలు వున్నాయి. రాజవీధులు బాగా విశాలంగా వున్నాయి. స్త్రీలు శోభాయమానంగా వున్నారు. కృష్ణాతీరంలో వుండే కొత్తపాళెం 16వ తేదీకి చేరాను. మహావిష్ణు, కృష్ణానదీ స్వరూపంలో అవతారమెత్తినట్లు స్కాందపురాణం చెప్తుంది. చందవోలు, బాపట్ల, మీదుగా 21వ తేదీ వేటపాళెం చేరాను. ఇక్కడ నేతగాళ్ళు ఎక్కువ.

అమ్మనబ్రోలు, ఆకులల్లూరు మీదుగా 23వ తేదీ వెలగపూడి సత్రం చేరాను. అక్కడ నుండి కరేడు చేరాము. దార్లో రెండు ఉప్పుటేర్లు దాటాము. కొత్త సత్రము, జువ్వల దిన్నె, కొడవలూరు, పంటలల్లూరు మీదుగా 25వ తేదీ నెల్లూరు పట్టణం చేరాను. దారిలో 4-5 సత్రాలు వున్నాయి. నెల్లూరులో జిల్లా జడ్జి, కలెక్టరు వున్నారు. పినాకినీ నది దగ్గర రంగనాయకుల ఆలయంవుంది. ఇక్కడకు దగ్గరలో జొన్నవాడ కామాక్షమ్మ ఆలయంవుంది. అక్కడ లక్ష్మి సరస్వతులు వింజామరలు వీస్తుంటారు. దానికి సమీపంలో చిన్న కొండమీద నరసింహస్వామి ఆలయం వుంది నెల్లూరులో సుమారు వేయి యిండ్లు వుంటాయి. ఎక్కువ మంది ఉద్యోగస్తులు. కూరగాయలు, సమస్త పదార్థాలు, మంచి పాలు పెరుగు దొరుకుతాయి. మనుబోలు, నాయుడుపేట మీదుగా దొరవారి కోనేరు చేరుకున్నాము. ఇక్కడ వెంకటగిరి రాజు త్రవ్వించిన కోనేరులో రుచికరమైన నీళ్ళువున్నాయి.

30వ తేదీ మన్నారుపోలూరు చేరుకున్నాము. ఇక్కడ కృష్ణదేవాలయం వుంది. కాళింది యమునలు చిన్న నదులుగా ప్రవహిస్తున్నాయి. విష్ణుమూర్తి జాంబవంతునితో పోరి శమంతకమణిని, జాంబవతిని పొందినట్లు స్థల పురాణం చెబుతుంది. ఇక్కడకు సమీపంలో సూళ్ళూరుపేట వుంది. అక్కడ నుండి 31వ తేదీకి చిలకలపూడి చేరాను. నెల్లూరిసీమలో స్త్రీ పురుషులు దేహపటుత్వం కలవారు. కురుచరూపం, సౌందర్యం చామనచాయవర్ణం వీరిలక్షణాలు. వీరు నిష్కపటులు.

సెప్టెంబరు నెల 1వ తేదీ పొన్నేరు చేరుకున్నారు. బ్రహ్మాండ పురాణంలో ఈ స్థలమహాత్యం చెప్పబడివుంది. కృష్ణమూర్తి కలి యుగంలో తానుయిక్కడ

అవతరిస్తానని చెప్పియున్నాడు భరద్వాజ ముని కోరిక మేరకు శ్రీమన్నారాయణుడు ఇక్కడ శేషశాయిగా వున్నాడు ఆరోజు ఉట్లపండగ చూచుకొని విచ్చూరికి రాత్రికి చేరుకున్నాను. తిరువత్తూరు 2వ తేదీకి చేరి అక్కడ నుండి సెప్టెంబరు 3వ తేదీ సాయంకాలము 6 గంటలకు తండయారుకాడులో నా సొంత యిల్లు తిరిగి చేరుకున్నాను. నేను మొత్తం 15 మాసాలు, 15 దినాలు యాత్ర చేసివచ్చాను. నేనున్న చెన్నపట్టణం 200 యేండ్ల క్రిందట యేర్పడింది ఇది రేవుపట్టణం ఇక్కడ ఉద్యోగం చేసే అవకాశం భగవంతుడు నాకు కల్పించాడు.

2

# రాజశేఖర చరిత్ర

(సాంఘిక నవల)

కందుకూరి వీరేశలింగంపంతులు

1848-1919

మొదటి ముద్రణ : 1878

# కందుకూరి వీరేశలింగం

నవ్యాంధ్రసాహిత్యనిర్మాతలలో కందుకూరి వీరేశలింగం పంతులు అగ్రగణ్యులు. వీరేశలింగం 1848 ఏప్రియల్ 16న రాజమహేంద్రవరంలో పవిత్ర గోదావరి తీరంలో జన్మించారు. చిన్నతనం నుండి చదువుపట్ల శ్రద్ధ చూపేవారు. కవితలల్లడంలోను సభారంజకంగా ఉపన్యాసాలు ఇవ్వడంలోను నైపుణ్యం సంపాదించారు. ఇంగ్లీషులో ప్రవేశ పరీక్షపాసయ్యారు.

రాజమండ్రిలోను, ధవళేశ్వరంలోను ఉపాధ్యాయుడుగా పనిచేశారు. ''వివేకవర్ధని'' అనే మాసపత్రికను స్త్రీల సమస్యలను ప్రచారం చేయడానికి ప్రారంభించారు. ధవళేశ్వరం నుండి 1876లో రాజమండ్రికి బదిలీమీద వచ్చారు. అప్పటి నుండి ఆయన సంఘ సంస్కరణాభిలాష ఎక్కువైంది. వితంతు వివాహాలు ప్రోత్సహించారు 1881లో రెండు వితంతు వివాహాలు జయప్రదంగా మొదటసారి నిర్వహించారు. రాజమండ్రిలో వితంతు శరణాలయాన్ని స్థాపించారు. ఆయన ధర్మపత్ని రాజ్యలక్ష్మి ఆయనకెంతో సహకరించారు. స్త్రీ విద్య గురించి ప్రచారం చేశారు. 1893లో వీరేశలింగం సంఘసంస్కరణకు గుర్తింపుగా ప్రభుత్వం 'రావుబహద్దూర్' బిరుదుతోసత్కరించింది.

కేవలం సాంఘిక సమస్యలనే గాక ఆధునిక సాహిత్యం విషయాలలోను వీరేశలింగం కృషిచేశారు. శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వచన నైషధం, సరస్వతీనారద సంవాదం, సంధి, విగ్రహాలు ఆయన రచనలు. ప్రసిద్ధ ఆంగ్లకవి Goldsmith (గోల్డ్‌స్మిత్) వ్రాసిన 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' నవలను రాజశేఖర చరిత్ర పేర అనువదించారు. తెలుగులో వచ్చిన మొట్టమొదటి సాంఘికనవల ఇది. అనేక సాంఘిక విషయాలపై ఆయన వ్యాసాలు వ్రాశారు.

# రాజశేఖర చరిత్ర

రాజశేఖర చరిత్ర కథాకాలం 250 సంవత్సరాలనాటిమాట. రాజమహేంద్రవరానికి సమీపంలో గోదావరి తీరంలో ధవళగిరి అనే ఎత్తైన కొండ వుంది. ఆ కొండకు అటూఇటూ గ్రామాన్ని ధవళేశ్వరం అంటారు. ఆ వూరిలో పెద్దమనిషి రాజశేఖరుడు. ఆయనకు మంచిపేరు ప్రఖ్యాతులు వున్నాయి. అయన దాన గుణాన్ని ప్రశంసించనివారు లేరు. అవూరిలో పురోహితుడు సిద్ధాంతి. అతని కుమార్తెకు గ్రహబాధ వుంది రాజశేఖరుని నలహామేరకు కొండమీద బైరాగిచేత ఆమెకు వైద్యం చేయించాలని సిద్ధాంతి నిశ్చయించుకున్నాడు.

రాజశేఖరుని పెద్ద కుమార్తె రుక్మిణి. ఆమెకు 14 సంవత్సరాలు. ఆమెభర్త 6 నెలల క్రితం చెప్పకుండా దేశాంతరం వెళ్ళాడు. రాజశేఖరుని యిల్లు అతిథి సంతర్పణలకు నెలవైంది. ఆయన ధనికుడు. ఆడపిల్లకు చదువు ఎందుకని ఆయన ఉద్దేశ్యం. ఆయన దానధర్మాలకు పెట్టింది పేరు. ఏదో చుట్టరికం కలిపి వారింట ఎందరో తిష్ఠవేసేవారు. ఆయన సనాతన ఆచారాలను అంతగా పట్టించుకోరు. సహపంక్తి భోజనాలకు ప్రోత్సాహం కలిగించేవారు. రాజశేఖరుని కుమారుడు సుబ్రహ్మణ్యం. ముఖప్రీతి మాటలకు రాజశేఖరుడు లొంగిపోయాడు. ఆయన చిన్ననాటి స్నేహితుడు నారాయణమూర్తి. అతని అప్పులు తీర్చటానికి రాజశేఖరుడు ఎంతోఖర్చు చేశాడు. రాజశేఖరుని రెండవ కుమార్తెను మేనల్లుడు శంకరయ్యకు యిచ్చి చేయాలని సంకల్పించారు. రుక్మిణి భర్త చనిపోయాడని వర్తమానం వచ్చింది ఆమె కృంగికృశించింది. భూత పిశాచంపట్టుకున్నదని వైద్యాలు చేయించారు. రాజశేఖరుడు బైరాగి వద్ద స్వర్ణవిద్య నేర్చుకోవడం కోసం నగలన్నీ మూటకట్టి అతని చేతిలోపెట్టి సర్వం పోగొట్టుకున్నాడు. బంధుమిత్రులు దూరమయ్యారు. ఊరువదిలిపెట్టి పోవలసిన పరిస్థితి ఏర్పడింది. రాజశేఖరుడు కాశీయాత్రకు బయలుదేరాడు. జీవనోపాధికోసం సుబ్రహ్మణ్యాన్ని పిఠాపురం పంపారు. రాజశేఖరునికి శోభనాద్రిరాజుతో పరిచయం ఏర్పడింది. అమ్మాయిపెండ్లి విషయం రాజశేఖరుడు ఆయనతో ముచ్చటించాడు బాడిరాజుతో సీత పెండ్లి నిశ్చయమయింది. బంధువు మరణంతో సీత పెండ్లి నిలిచిపోగా రాజశేఖరుని భార్య ఆ బాధను తట్టుకోలేపోయింది. సుబ్రహ్మణ్యం పిఠాపురం రాజుకొలువులో చేరిన తర్వాత అక్కడ దొంగతనం మోపబడి చివరకు అది ఎలానో తొలగిపోయింది. చివరకు రుక్మిణి, సీత, సుబ్రహ్మణ్యం రాజశేఖరం ఒకచోట చేరటంతో కథ సుఖాంతమైంది.

# 2. రాజశేఖర చరిత్ర

## సంక్షిప్త గ్రంథం

రాజమహేంద్రవరానికి సమీపంలో గోదావరి తీరంలో ధవళగిరి అనే ప్రదేశం వుంది. అది ఎత్తైన కొండ. ఆ కొండపై చిన్న దేవాలయం వుంది.పాండవులు వనవాససమయంలో అక్కడ తపస్సు చేశారని ప్రతీతి. ఉత్సవాల సమయంలోతప్ప ఆదేవాలయంలో జనార్ధన స్వామికి పూజాపునస్కారాలు వుండవు. అక్కడ ధ్వజస్తంభానికి అనుకొని చేతులు జోడించుకున్న ఆంజనేయ విగ్రహం వుంది. అక్కడ కల్యాణమండపంలో ఉత్సవాలలో స్వామివారి కల్యాణం వైభవంగా జరిపిస్తారు. హరిభక్తులు కృష్ణలీలలు గానం చేస్తారు.

ఆపర్వతం క్రింద గోదావరి వొడ్డులో నల్లరాతి బండపై చక్కగా మలచిన రామపాదాలున్నాయి. శ్రీరాముడు సీతాలక్ష్మణులతో పర్ణశాలకు పోతూ దారిలో ఈపర్వతం మీద నడచిన గుర్తులే ఆపాదాలని ప్రజల నమ్మకం. గోదావరిలో స్నానం చేసి రామపాదదర్శనం చేసి జనార్ధన స్వామికి పూజలు చేయించి భక్తులు తరించేవారు. జాతిమత భేదం లేకుండా అందరూ స్వామిని అర్చించేవారు.

కొండకు దక్షిణాన, తూర్పున గ్రామం వుంది. ఇప్పుడాగ్రామాన్ని ధవళేశ్వరం అంటారు. రాజవీధికి పక్కన అగస్త్యేశ్వర స్వామి దేవాలయం ఉంది. వింధ్యపర్వతాన్ని అణచిన అగస్త్యుడు అక్కడ ఈశ్వర ప్రతిష్ఠచేశాడని జనుల నమ్మకం. ఆఊర్లో యాత్రికుల కోసం ధర్మచావడి ఒకటి ఎవరో కట్టించారు ఇప్పుడక్కడ ఉబుసు పోకరాయుళ్లు కాలక్షేపం చేస్తూ కూచొని వుంటారు

ఒకనాటి సూర్యోదయం ఒకపెద్దమనిషి గోదావరిలో కాళ్లుచేతులు కడుగుకొని ధర్మశాలమీద వొడ్డున కూర్చొని ధంతధావనం చేస్తున్నాడు

ఆయనకు 40 సంవత్సరాలుంటాయి. ఎర్రని శరీరరచ్ఛాయ, స్థూలకాయుడు పొట్టివాడు అయిన అతని మొహాన స్ఫోటకం మచ్చలున్నాయి. ఆయనపేరు రాజశేఖరుడు. ఆయన మొహం కడుగుకోవడం పూర్తి అయ్యేసరికి చావడినిండా జనం చేరారు. ఆయన అక్కడ కొలువుదీరాడు.

రాజశేఖరుడు అక్కడ చేరిన సిద్ధాంతిగారిని కుశల ప్రశ్నలు వేశారు. సిద్ధాంతి గారు రాజశేఖరుని దానగుణాన్ని ప్రశంసించారు. అక్కడ చేరిన రామశాస్త్రి. కూడా వంత పాడాడు. సిద్ధాంతిగారి చిన్నదానికి గ్రహబాధ వున్నదని తెలిసి తగిన వైద్యాన్ని చేయించమనీ, డబ్బు విషయం ఆలోచించవద్దనీ రాజశేఖరుడు సలహా ఇచ్చాడు.

సిద్ధాంతి ఆచుట్టుపక్కల జనాలకు పురోహితుడు. పెళ్లిళ్లు, పేరంటాలు శుభాశుభకార్యాలు, గ్రహశాంతులు, బాలారిష్టాలు ఆయన వద్ద చెప్పించుకొంటారు. బల్లిపాటు మొదలు శకునాల వరకు జ్యోతిషముతో సహా సిద్ధాంతి చెప్పేవాడు. జనానికి ఆయన మాట మీద నమ్మకం.

ఎవరో ఆ ఊరికొక భూతవైద్యుడు వచ్చాడన్నారు. రాజశేఖరుడతని చేత చిన్నదానికి వైద్యం చేయిచమని సిద్ధాంతికి సలహా ఇచ్చారు. అక్కడ చేరినవారు తానతందానా అనివంత పాడారు. గొప్పవారు ఏమాట అన్నాదానికి తలవూపేవారు ఎక్కువ. రాజశేఖరుని మాటప్రకారం సిద్ధాంతి బైరాగి వద్ద వైద్యం చేయిస్తానన్నాడు.అక్కడికి దగ్గరలో ఉన్న రామపాదముల వద్ద బైరాగి ఉన్నాడని విని అందరూ అతణ్ణి చూడటానికి బయలుదేరారు.

రాజశేఖరుడు అలావెళ్ళిన కొంత సేపటికి ఒక సుందరాంగి విలాసంగా స్నానం చేయటానికి వచ్చింది. పసుపుముద్ద రాచుకుని మోకాటి లోతు నీటిలో నిలబడింది ఆమె ఎవరో కాదు రాజశేఖరుని పెద్ద కుమార్తె రుక్మిణి. ఆమె సర్వాంగ సుందరి. ఆమె ముఖ లక్షణాలను బట్టి చూస్తే ఏదో దిగులుతో ఉన్నట్లు కనిపిస్తుంది. దానికి కారణం లేకపోలేదు. ఆరు నెలల క్రిందట తల్లిదండ్రులతో చెప్పకుండా ఆమె భర్త దేశాంతరం వెళ్ళాడు

ఇప్పుడు ఆమె వయస్సు 14 సంవత్సరాలు. బంగారానికి తావి అబ్బినట్లు యవ్వనం అడుగుపెట్టింది. ఆమె ధరించిన నగలు ఆమెకు అలంకార ప్రాయం అయినాయి భగవంతుడు సౌందర్యాన్ని అంతా ఒకచోట రాశిపోశాడు. ఆమె మెడ బాగా పొడుగు. అది ఒకటే లోపం. అయితే భిక్షకు వచ్చే శాస్త్రులవారు అది వంశోన్నతికి మంచిదని సప్రమాణంగా చెప్పేవాడు.

అక్కడ స్నానాలకు వచ్చిన కొందరు స్త్రీలు బట్టలు ఉతుక్కుంటున్నారు. కొందరు యువతులు స్నానాలు ముగించి తడి బట్టలు కట్టుకున్నారు. అంట్లుతోమేవారు, చేపలుపట్టేవారు,విధవరాండ్రు యిలా రక రకాలుగా అక్కడ పరిస్థితి వుంది. ఇంతలో ఒకపెద్ద ముత్తైదువ రుక్మిణితో మాట కలిపింది. ఈవేళ విశేషం ఏమిటని ఆమె అడిగితే కడపటి కార్తీక సోమవారం కాబట్టి గోదావరీ స్నానం చేసి శివాలయానికి వెళ్ళాలని రుక్మిణి చెప్పింది. ఆమె కుమార్తె గ్రహబాధను గురించి ప్రస్తావించింది. ఆముత్తైదువ ఆపిల్లకు గ్రహబాధకంటె పెండ్లి అయి రెండేడ్లకు భర్త చనిపోవటం వల్ల అలావచ్చిందని చెప్పింది. చనిపోయిన ఆమగడు రాత్రింబగళ్ళు దానికి కనపడసాగాడు అని ఏడ్వసాగింది. జాతకాలు చూసి చేశారు గదా! అలాఎందుకు జరిగిందని రుక్మిణి అడిగింది. పార్వతీదేవి శాపం వల్ల ఒక్కొక్కసారి జ్యోతిష్కులు చెప్పినట్లు జరగదని ఆమె సమర్థించింది.

నీళ్లరేవు దగ్గర చేరిన స్త్రీలు ఎక్కడలేని పురాణాలు చెప్పుకుంటారు. అంతకు మించి స్త్రీలకు తీరిక అవకాశము దొరకవు. శేషమ్మను మగడు కొట్టిన వార్త, అతడు ముండ నుంచుకున్న కబుర్లు, పొరుగింటివానితో శేషమ్మ సరసాలు, అత్తగారి ఆగడాలు, కోపతాపాలు అక్కడ ప్రస్తావనకు వచ్చాయి. కాంతమ్మ కొత్తగా చేయించుకున్న నగల వ్యాపారం ముచ్చటించుకున్నారు. మగని ప్రేమను మించిన ఆభరణాలు లేవని తీర్మానించారు. ఇరుగుపొరుగు ఆడవాండ్ర సంగతులన్నీ అక్కడ పంచాయితీకి వచ్చేవి. ఇంతలో పంచాంగం చేతబట్టుకొని పురోహితుడు రుక్మిణి దగ్గరకు వచ్చాడు. సంకల్పం చేయిస్తానని చెప్పి గట్టిగా ముక్కు పొడుము పీల్చాడు. " శుభే శోభన ముహూర్తే...... " అని ప్రారంభంచేసి గౌతమీ స్నానం

అహాం కరిష్యే. అని చెప్పి రుక్మిణిని మూడు సార్లు చేయమన్నాడు. అమె నదిలోతుకు దిగక మోకాటిలోతు నీళ్ళలో కూర్చుని స్నానం ముగించి కుంకుమ బొట్టు పెట్టుకొని సిద్ధాంతి భార్యతో కలిసి యింటికి పోయింది.

రాజశేఖరుని యిల్లు ఆరోజుల్లో అత్యంత సుందరమైనది. వీధి గుమ్మానికి రెండు ప్రక్కల రెండు అరుగులు , రెండు అరుగులకు మధ్య లోపలికి పోయే నడవ. దాని ముందు సింహద్వారము. చక్కటి నగిషీలు చెక్కిన వీధి తలుపులు. లోపలికి అడుగు పెట్టగానే చావడి. ఇంకొంచెం లోపలకు వెళితే దక్షిణాన కచేరి చావడి. ఉత్తరపు పక్క మరొక చావడి వున్నాయి. దక్షిణపు చావడిలో బంధువులు, పెద్దమనుషులు సభతీర్చేవారు. విశాలమైన ఆయింటిలో రాజశేఖరుని పడకగది ముందరి చావడిలో దూలానికి చిలుక పంజరమొకటి వ్రేలాడదీసి వుంది. రుక్మిణి ఆ చిలుకకు పద్యాలు నేర్పించేది. ఆరోజులలో స్త్రీ విద్య లేకపోయినను వివేకం సంపాదించేంత వరకు రుక్మిణికి విద్య నేర్పించారు.

రాజశేఖరుడు ధనికుడు కాబట్టి ఆడపిల్లకు చదువెందుకని అనడానికి సాహసించేవారు కాదు. ఒకరిద్దరు పెద్దవాండ్రు అన్నా ఆయన సమర్థించుకునేవాడు. రాజశేఖరుడు దేవతార్చన చేసుకునేందుకు ఆయింటిలో ఈశాన్య మూల దేవుని అరుగు వుంది. ఆ అరుగుపై భువనేశ్వరము అనే పెద్ద పెట్టె వుంది. ఆపెట్టె మీదకూర్చుని రాజశేఖరుడు నిత్యము సుందరకాండ పారాయణము చేస్తారు పెరటిలో తులసికోట పూజకు పనికివచ్చు పూల చెట్లూ అందంగా వున్నాయి. రుక్మిణి గోదావరీ జలాలు తీసుకొనివచ్చి తులసికోటలోపోసి ప్రదక్షిణములు చేసి రామాయణం పాటలు పాడసాగింది.

ఇంతలో రాజశేఖరుడు పరివారముతో యిల్లు చేరి కచేరీ చావడిలో కొలువు తీరాడు. దేవాలయము పూజారి భయభక్తులతో మ్రొక్కి జనార్దన స్వామిపై కటాక్షముంచమని కోరాడు. రాజశేఖరుడు జనార్ధనస్వామి ఉత్సవం దగ్గరలో వుందా? అని అడిగారు. పూజారి 15 దినములలో ఉత్సవాలు మొదలవుతాయని చెప్పాడు తాము యిచ్చే ఉభయం పైకం సరిపోవడం

లేదని గుమస్తా చెప్పాడు. రాజశేఖరుడు యథోచితంగా పూజారికి యిచ్చి పంపాడు.

ఇంతలో ముప్పై సంవత్సరాల వయస్సు గల అపరిచిత వ్యక్తి మూటాముల్లెతో సరాసరి లోపలికివచ్చి రాజశేఖరుని ముందు కూర్చొన్నాడు. మీకు నేను గుర్తున్నట్లు లేదు అని నమస్కారం పెట్టి మాట కలిపి తన పేరు భైరవమూర్తి అని చెప్పాడు. దూరపు బంధుత్వాన్ని కలిపాడు. రాజశేఖరుని ఔదార్యాన్ని కొనియాడాడు. యింతలో ఆయింటిలోనే తిష్టవేసికొని కూర్చున్న మరో బంధువు చుట్టరికం కలిపాడు. రాజశేఖరుని భార్య మాణిక్యాంబ వంటపూర్తి అయినదని చిన్నకూతురు సీతతో చెప్పింది. సీత తండ్రికి కబురందించింది.

రాజశేఖరునితోబాటు అందరూ లేచారు. ఊరివారు వెళ్లిపోయిన తర్వాత బంధువులు స్నానాలు ముగించి భోజనాలకు సిద్ధమయ్యారు. బంతిలో వడ్డన ప్రారంభమైంది. ఇంతలో వీధి తలుపు ఎవరోకొట్టారు. మాణిక్యాంబ తలుపు తీసింది. ఎవరో అతిథి దూరప్రాంతం నుండి వచ్చాడు. రాజశేఖరుని దానశీలాన్ని గూర్చి విని వచ్చానని పేరయ్య సోమయాజులు ఘనంగా చెప్పాడు. 'భోజనాలు సిద్ధంగా ఉన్నాయి, రండి!' అని పిలిస్తే స్వయంపాకం చేసుకొంటానని భీష్మించుకున్నాడు. అదికుదరదని రాజశేఖరుడు నిష్కర్షగా చెప్పడంతో విధిలేక వారి బంతిలో కూచోడానికి సిద్ధపడ్డాడు. స్నానం ముగించుకొని రెండు గంటలు ముక్కుమూసుకొని ధ్యానం చేసి చివరకు బంతిలో కూచొన్నాడు. భోజనాల మధ్యలో నీళ్లకావడి వెంకటయ్యకూడా తమసరసన భోంచేశాడని తెలుసుకొని సోమయాజులు మనసొప్పక యిల్లు వదిలి వెళ్లిపోయారు. సంభావన సంగతి సరేసరి!

రాజశేఖరుడు భోజనానంతరం ఒక కునుకు తీసి కచేరి చావడిలో కూర్చోవడం అలవాటు! పెద్దమనుషులు చుట్టూ కూచొనేవారు. కొడుకు సుబ్రమణ్యము ఆదిపర్వం తెచ్చాడు. పూరాణం చెప్పే శాస్త్రులవారు యింతలో రానే వచ్చారు. సుబ్రమణ్యం విఘ్నేశ్వరస్తుతి చేసి పద్యాలు చదవసాగాడు. అర్జునుడు ద్వారకానగరం వెళ్లిన ఘట్టం చదివాడు. శాస్త్రులు వ్యాఖ్యానం

చెప్పారు. ఉన్నదీ, లేనిదీ కల్పించి స్వంతభాష్యం విప్పారు. సంధ్యవేళ వరకు భారత ప్రవచనం సాగింది. తర్వాత ఎవరిదారిన వాళ్లు వెళ్లిపోయారు.

రాజశేఖరుడు బంధుప్రియుడు. నాలుగు తరాలవారు నట్టింటకూచొని తినిపోయేవారు. వారి స్తోత్రపాఠాలకు ఆయన పొంగిపోయేవాడు. వారికి చేబదుళ్లు యిచ్చేవాడు. రకరకాలుగా ఆయనను జనం మోసగించి లాభపడేవారు.ముఖప్రీతి మాటలకు రాజశేఖరుడు లొంగిపోతాడని వారికి బాగా తెలుసు. అంజనేయస్వామికి గుడికట్టిస్తే పేరు ప్రతిష్ఠలని పురోహితులు చెప్పిన మీదట ఆయన ఆపనికి పూనుకున్నాడు. దానివల్ల పనివాండ్రు బాగుపడ్డారే తప్ప ఆలయనిర్మాణము పూర్తి కాలేదు. క్రమక్రమముగా దరిద్ర దేవత ఇంట్లో ప్రవేశించింది. రుక్మిణిపెళ్ళికి చేసిన అప్పులబాధ అధికమై ఆస్తిని హరింపజేయసాగింది.

రాజశేఖరుని బావమరిది దామోదరయ్య. తోడబుట్టునిచ్చి పెళ్లిచేశారు. ఆమె ఒక కుమారుని కని కాలధర్మం చేసింది. అతని పేరు శంకరయ్య. అతని కిప్పుడు **15** సంవత్సరాలు. అతడు మేనమామ ఇంట్లో పెరుగుతున్నాడు. చిన్నకూతురు సీతను అతనికిచ్చి పెళ్లిచేయాలని రాజశేఖరుని సంకల్పం. దామోదరయ్య రెండోపెళ్లి చేసుకొన్నాడు. రాజశేఖరుని తండ్రి ఇల్లు కట్టించేందుకు తవ్వుతుంటే లంకెబిందె దొరికింది. ఉన్నవూరు వదలి ధవళగిరి కాపురం మార్చారు. దామోదరయ్య మామగారి పేరుమీద అప్పులు చేయసాగాడు. రాజశేఖరుడు విధిలేక అతని యిల్లు వెడలగొట్టాడు. దామోదరయ్య భూతవైద్యుని అవతారమెత్తి డబ్బు సంపాదించి తిరిగివచ్చి ఆవూరిలోనే వేరేకాపురం పెట్టాడు. భూతవైద్యుడుగావూరిలో పేరు సంపాదించాడు.

రాజశేఖరుని చిన్ననాటి స్నేహితుడు నారాయణమూర్తి. అతని అప్పులన్నీ రాజశేఖరుడు తీర్చసాగాడు. అది అదనుగా తీసుకొని అతడు మితిమీరి పోయాడు నారాయణమూర్తికి ధనం సమకూరినా రాజశేఖరుని అప్పుతీర్చే ఆలోచన రాలేదు. ఈవిధంగా బంధుమిత్రుల అవసరాలకోసం గొప్పలకుపోయి రాజశేఖరుడు ధనవ్యయం చేసేవాడు.

ఒకరోజు రుక్మిణి పెరటి గుమ్మము దగ్గర నిలుచుని పొరుగింటి వారితో మాటాడుతుండగా ఒక ఎరుకతె వచ్చి ఎరుక చెప్పింది. నీ మనసులో కోర్కె తీరుతుందనీ, మగనివిషయమై ఆలోచన సానుకూలపడుతుందనీ, మిడతంభొట్ల జ్యోష్యం చెప్పింది. దేశాలుపట్టి తిరిగే మగడు తిరిగి వస్తాడని రుక్మిణి సంబర పడింది.

ఒకనాడు రాజశేఖరుడు చావడిలో కొలువుతీరాడు. సిద్ధాంతిగారు తానుతెచ్చిన తాటాకులలో వ్రాసిన జాతకాల చిట్టా బయటకు తీసారు. సీతకు సంబంధాలు వెతికే విషయంలో ఈ ప్రయత్నం జరుగుతుంది. మంత్రి ప్రగడబాపిరాజు కుమారుని సంబంధం మంచిదని సిద్ధాంతి నమ్మబలికాడు. లోగడ బాపిరాజు సిద్ధాంతికి మంచిధోవతుల చాపు బహుమానంగా ఇచ్చారు. బాపిరాజు కుమారుడు రూపసికాదు. చెడుతిరుగుళ్లు తిరుగుతాడు. రాజశేఖరురడు అంగీకరించలేదు.

మేనల్లుడు శంకరయ్య జాతకం అసలే బాగులేదనీ, వంశనాశమవుతుందనీ సిద్ధాంతి భయపెట్టాడు. బాపిరాజు సంబంధం అదృష్టదాయకమని భ్రమపెట్టినాడు. రాజశేఖరుడు మేనల్లుని వైపు మొగ్గు చూపినాడు. చెల్లెలికిచ్చిన వాగ్దానం, శంకరయ్య సత్ప్రవర్తన రాజశేఖరుని మనస్సులో ఉంది. సిద్ధాంతి ఏ ఎండకాగొడుగు పట్టే రకం. మళ్లీ జాతకం చూసి ఏవోశ్లోకాలు చదివి దోషం లేదని చెప్పాడు. మాఘమాసంలో పెళ్లి చేయమని ముహూర్తం పెట్టారు.

సిద్ధాంతి రుక్మిణి అనారోగ్యాన్ని గూర్చి ప్రస్తావించారు. బైరాగిచిట్కా వలన ఆమె ఆరోగ్యం కుదుటపడిందని రాజశేఖరుడు చెప్పాడు. చెల్లెలు సుబ్బమ్మకు కూడా బైరాగి వైద్యం చేయించాలని సంకల్పం. దానికని బైరాగిని ఇంటికి తీసుకొని వచ్చే ప్రయత్నాలు చేశారు. అతనికి స్వర్ణవిద్య తెలుసునని రాజశేఖరుడు అతని వద్ద భయభక్తులతో మెలగారు. బైరాగి రాజశేఖరుని యింట తిష్టవేశాడు.

ఇంతలో జనార్దన స్వామి కల్యాణోత్సవం వచ్చింది. రథోత్సవం వైభవంగా జరిపారు.

భోగంమేళం కూడా పెట్టించారు. రుక్మిణి సర్వాలంకార భూషితయై రథోత్సవం చూడటానికి వెళ్లింది. తల్లి, తాను అర్చన పూర్తి చేసుకొని సంబరంగా వస్తున్నారు. ఆలయం లోపల ఎవడో దొంగ రుక్మిణి మెడలో కాసులపేరు దొంగిలించాడు. 'దొంగ దొంగ' అనే సరికి వాడుకూడా దొంగను వెతకసాగాడు. సాయంవేళ శుభమా అనివస్తే నగలు పోయాయని రుక్మిణి దిగులు పడింది.

మర్నాడు రాజశేఖరుడు వీధి అరుగుమీద కూచున్నపుడు సిద్ధాంతి హరిశాస్త్రులు అనే ఒక మహామంత్రవేత్తను తీసుకొని వచ్చాడు. అతడు మళయాళ మంత్రగాడనీ పోయిన వస్తువులుఆనవాళ్లు చెప్పడంలో మహానిపుణుడని గొప్పలు చెప్పాడు. రాజశేఖరుడు రుక్మిణి నగ పోయిన సంగతి చెప్పాడు. హరిశాస్త్రులు ముక్కు వద్ద వేలు పెట్టుకొని వేళ్ళుమడిచి ఏవో లెక్కలు గొణిగి -వస్తువు యిల్లు దాటిపోలేదు. ఎవరో వచ్చే పోయేవారు తీసుకున్నారు- అని చెప్పాడు. మధ్యాహ్నం వచ్చి యంత్రం వేసి ఒక పరీక్ష పెట్టాడు. ఒకవస్తువు ఎవరైనా దాచిపెడితే ఎక్కడ వుండేది చెప్పగలనన్నాడు. మిడతం భట్లు జోస్యం వలె ఒకరిని గుర్తించాడు. అది నిజమని రాజశేఖరుడు నమ్మాడు. ముందుగా అనుకున్న పథకం ప్రకారము సిద్ధాంతి ఆడిన నాటకమది. నగ దొంగతనము కనుగొనటానికి ఏవేవో యంత్రతంత్రములు వేసి చివరకు ఆ దొంగ తమవద్ద పనిచేసే సర్వడు అని చెప్పాడు. వాడు నేనుకాదని కన్నీరుమున్నీరుగా ఏడ్చాడు. చివరకు రాజశేఖరుడు వాణ్ణి తన పనిలోనుండి తీసివేశాడు. హరిశాస్త్రులకు తగిన బహుమానము ధోవతుల చాపు దొరికాయి. సిద్ధాంతి, హరిశాస్త్రులు చెరినగము పంచుకున్నారు.

ఆ మర్నాడు రుక్మిణి ఎరుకచెప్పినట్లుగా మగడు రాలేదే అని విచారిస్తోంది. ఇంతలో 20 సంవత్సరముల వయస్సు గల చిన్నవాడొకడు లోపలికి వచ్చి రుక్మిణి భర్త నృసింహస్వామి పూరీ జగన్నాథం వద్ద పుష్యశుద్ధ నవమినాడు

జబ్బు చేసి చనిపోయాడని తానే స్వయంగా దహనం చేయించానని చెప్పాడు. కుటుంబ సభ్యులంతా గొల్లున యేడ్చారు. రుక్మిణికి శిరోముండనం చేయించాలని పట్టుబట్టారు. రాజ శేఖరుడు అందుకు ససేమిరా ఒప్పుకోలేదు. విధవరాలనుమాట ఆమెకు మిగిలిపోయింది. రుక్మిణి రాత్రింబగళ్ళు నిద్రాహారములు మాని క్రుంగి కృశించి పోయింది. దానికి తోడు అనారోగ్యము.

వైద్యుడు సీతజ్వరమని నిర్ధారణ చేశాడు. దానికి తగిన ఆయుర్వేద మందులను తెప్పించాడు. లంఖణం పరమౌషధం అను సూత్రమును చెప్పి పస్తులు పెట్టాడు. రోగి చిక్కి శల్యమాయెను. ఇక లాభములేదని మరొక వైద్యుని పిలిపించి పథ్యము పెట్టించి ఔషధ సేవ చేయించారు. వ్యాథి తగ్గు ముఖం పట్టింది.

మాణిక్యాంబ ఒక ఆదివారం సుబ్బమ్మను వెంటబెట్టుకొని కోరలమ్మ గుడికి సోది అడగడానికిక వెళ్ళింది. అక్కడ సోదిచెప్పించుకోగా దేవత వొంట్లోకి వచ్చి నరసింహస్వామి తనతో రుక్మిణిని కూడా తీసుకు పోతానని చెప్పాడు. మాణిక్యాంబ గోడుగోడున యేడ్చింది. రకరకాలవైద్యాలు చేయించి భూతపిశాచఉచ్చాటనము చేయించి ఆమెను పీడించసాగరు. ఆమెకు పట్టిన పిశాచిని వదలించడానికి సిద్ధాంతి పెద్ద యాగం చేశాడు. మంత్రముతో దిగ్బంధనం చేసి 'ఓం హ్రీం' అని అరిచి యింట్లో వున్న వస్తువులన్నీ హారిశాస్త్రులు తస్కరించాడు. రుక్మిణి మెడకు ఒక రక్షరేకును వ్రాయించి 116 రూ.లు బహుమతిగా తీసుకున్నాడు.

రాజశేఖరునికి బైరాగి వద్ద స్వర్ణవిద్య ఎలాగైనా నేర్చుకోవాలని ఉబలాటం. తన వద్ద ఆ పరమరహస్యం గురూప దేశంగా వుందని బైరాగి నమ్మబలికాడు. గృహస్థులు ఆవిద్యను నేర్చుకోరాదని నీకోసం నేను చేసి యిస్తానని బైరాగి చెప్పాడు.

ఇంట్లో ఉన్న వెండి బంగారు నగలు రెండో కంటికి తెలియకుండా రాజశేఖరుడు ఒక మూట కట్టాడు. బైరాగి పిడకలదాలి తయారు చేసి

అందులో మూటను పెట్టించాడు. వేమగిరికొండ మీద నుంచి పసరుతీసుకొని వస్తానని బైరాగి బయలు దేరి వెళ్ళాడు. ఒక రోజంతా చూసి రాజశేఖరుడు పిడకలదాలి తొలగించి చూస్తే తెల్లటి పిడకల భస్మం మాత్రం వుంది. మూలికలు దొరకక కాబోలు బైరాగి ఆ వూరికి మళ్ళీ రాలేదు.

పురాణ వైరాగ్యంతో రాజశేఖరుడు దరిద్రాన్ని కోరుకున్నాడు. ఇన్నాళ్ళు ఇంద్రుడవు చంద్రుడవు అనిన పెద్దమనుషులు బంధువులు చూసీ చూడనట్లు తొలగి పోసాగారు. యాచకులకు మాత్రము తనకున్నంతలో రాజశేఖరుడు ఇచ్చేవాడు. సొమ్ము కుదవ పెట్టక తప్పేదికాదు. వాగ్దానాలు ఎక్కువైనాయి. దరిద్రదేవత ఎప్పుడు వదులుతుందా అని కాలం వెళ్ళబుచ్చారు.

అ రోజుల్లోనే సుబ్బమ్మకు రోగం తిరిగ బెట్టింది. వంట బ్రాహ్మణుడొకడు వంట చేయుటకు కుదిరాడు. సుబ్బమ్మ వ్యాధిగ్రస్తురాలై చనిపోయింది. సాటివారెవ్వరూ శవం మోయటానికి రాలేదు. చివరకు ఎలానో శవదహనం జరిపించాడు. రాజశేఖరుణ్ణి ఇంతకాలం ముఖస్తుతులతో ముంచెత్తిన వారు నెమ్మదిగా దూరం కాసాగారు. పరిహాసం చేసేవారు ఎక్కువయ్యారు. ఆయన దానగుణాన్ని బలహీనతగా యిప్పుడు చెప్పుకోసాగారు.

ఇంతకాలం సీతను చేసుకుంటామని చెప్పిన బావమరిది దామోదరం ఇప్పుడు కాదు పొమ్మన్నాడు. తనకు అప్తమిత్రుడైన నారాయణమూర్తి చివరకు బదులివ్వడానికి కూడా ముందుకు రాలేదు. రాజశేఖరుని యిల్లు ఇప్పుడు బోసిపోయింది. రుక్మిణి శిరోజాలు తీయించలేదని జాతిలో నుండి వెలివేస్తామని బెదిరించారు. ఇక ఆ వూరిలో వుండి లాభంలేదని రామశాస్త్రికి యిల్లు తాకట్టుపెట్టి అప్పులన్నీ తీర్చి కాశీ యాత్రకు రాజశేఖరుడు బయలుదేరాడు.

రాజశేఖరుడు ప్రయాణమయ్యేటప్పుడు భార్య యింట్లో సామానులన్నీ సిద్ధపరచింది. అవి తీసుకుని వెళ్ళే నదుపాయం లేనందువలన చుట్టుపక్కల వారికి దానధర్మాలు చేసింది. కుటుంబ మంతా ప్రయాణమయ్యారు. వారెక్కిన బండి యెద్దులు బక్కచిక్కినవి. కొంత దూరం పోగానే అవిలాగలేక బండిని

వీళ్ళే యీాడ్వవలసి వచ్చింది. రాజమహేంద్రవరము ఆ రాత్రి తెల్లవారుతుందనగా చేరారు. అక్కడ పినతండ్రి కుమారుడైన రామమూర్తి యింట్లో దిగారు. సువాసినులు రుక్మిణిని ఆ సమయంలో చూడకూడదు కాబట్టి మరియొక గదిలో పెట్టి తలుపు వేశారు. మాణిక్యాంబను పట్టుకొని అందరూ ఏడవసాగారు. రాజశేఖరుడు గోదావరితీరంలో పుణ్యక్షేత్రాలన్నీ ఒక్కొక్క రోజు ఒక్కొకటి చొప్పున సకుటుంబంగా చూశారు.

బాహ్యవేషధారణకు ఎక్కువ గౌరవం వుందని రాజశేఖరుడు గ్రహించాడు. కాశీకి వెళ్ళటానికి రాజశేఖరుడు ప్రయాణంకాగా రామమూర్తి ఉగాది వరకు వుండిపొమ్మన్నాడు. ఆ మధ్యలో పాల్గుణబహుళ అమావాస్యనాడు పగటిపూట సంపూర్ణసూర్యగ్రహణం పట్టింది. గ్రహణ స్నానాలు, దాన ధర్మాలు చేశారు. శాస్త్ర విరుద్ధములైన విషయాలను రాజశేఖరుడు నమ్మేవాడు కాదు. పౌరాణికులు చెప్పినట్లు గ్రహణం రాహుకేతువులు మ్రింగడం వలన కాదని ఘంటాపథంగా చెప్పాడు. పండితులతనితో వాదించలేక పెద్దపెద్దగా కేకలు వేశారు. గ్రహణం వదలిన తర్వాత అందరూ స్నానాలు చేసి వచ్చి భోజనాలు చేశారు.

సంవత్సరాది నాడు రాజశేఖరుడు ఆయన కొడుకు సుబ్రహ్మణ్యము తలంట్లు పోసుకొని ఉగాది పచ్చడి తిన్నారు. వేణుగోపాల స్వామి ఆలయంలో ఆ సాయంకాలం నూతన పంచాంగశ్రవణం యేర్పాటు చేశారు. పురోహితుడు సంక్రాంతి పురుషుని లక్షణాలు సంవత్సర ఫలము, కందాయ ఫలము, గోచార రీతులు వివరించాడు. నామ నక్షత్రాలను బట్టి జన్మనక్షత్రాలను బట్టి ఆదాయ వ్యయాలు అడిగి తెలుసుకున్నారు. పంచాంగశ్రవణం అయిన తర్వాత ఎవరి యిండ్లకు వాళ్ళు వెళ్ళిపోయారు.

రాజశేఖరుడు మరునాడు విదియ శుభ గడియలలో కాశీ యాత్రకు బయలు దేరినాడు. బండి సంగతి తెలియును కాబట్టి కాలినడకనే ప్రయాణం సాగించారు. తమతో తెచ్చిన సామానులు రామమూర్తి యింట్లో అప్పగించి వెళ్ళారు. మంచి శకునం చూసి బయలు దేరారు. దారిపొడవునా రాజశేఖరం ప్రకృతి విశేషాలను భార్యాబిడ్డలకు చెప్తు వెళ్ళాడు. సీత కొంత దూరం

నడిచి తానిక నడవలేనంది రుక్మిణికి కాళ్ళు పొక్కులెక్కాయి ఆకలి కాసాగింది దారిలో రాచకుమారుడొకడు వడదెబ్బతగిలి పడిపోయినాడు ఆయన వాళ్ళచేతి నీళ్ళు తాగనని మొండి కెత్తాడు నీళ్ళు శుద్ధి చేయుటకు ప్రక్కనున్న పల్లెకు వెళ్ళి మజ్జిగ తేవడానికి వెళ్ళారు రాజశేఖరు దదివిని నవ్వుకొని తమ చెంబులో నీళ్ళు అతనినోట్లో పోశాడు

రాజుగారిది పెద్దాపురం దగ్గర కట్టమూరు. రాజమహేంద్రవరంలో బంధువులను చూడటానికి పోయి పులివాతబడి దానిని చంపారు రాజుగారు మరొక పులిని ఎదుర్కొనలేక చెట్టు మీదికెక్కి నిన్నటి ఉదయం నుండి కూచొన్నారు. ఆకలి దప్పులకు నాలుక ఎండిపోయింది రాజశేఖరుడు రాజుగారి సాహసాన్ని మెచ్చుకొన్నారు రాజుగారు తన ప్రాణాలు కాపాడినందుకు రాజశేఖరానికి కృతజ్ఞతలు చెప్పారు ఇరువురు ఒకరి విశేషాలు మరొకరు తెలుసుకొన్నారు ముఖస్తుతికి లోనై ధనం హరించుకుని పోయిందని రాజుగారికి రాజశేఖరుడు చెప్పాడు భీమవరందాకా అంతా కలిసి వెళ్ళారు. అక్కడ రామరాజు మార్గాయాసంతో నిలిచి పోయాడు

రాజశేఖరం నడుచుకొంటూ కుటుంబంతో నల్ల చెరువు చేరాడు అక్కడ చెరువుగట్టు మీద జువ్విచెట్టు కింద ఒక యోగి జపం చేసుకొంటున్నాడు. ఆయన వారి వివరాలు తెలుసుకొని మీవద్ద డబ్బు ఉందికాబట్టి దారిలో దొంగలు దోచుకొంటారని చెప్పాడు తోడుగా శిష్యులను పంపు తానని చెప్పివారెంతసేపటికి రాకపోగా రాజశేఖరుడు దారిపట్టాడు పొద్దువాలుతోంది. చీమలచింత వద్ద ఒక కిరాతుడు వారిని కలిశాడు. గురువుగారు తోడుగా పంపారని చెప్పి వారిని పెడత్రోవ పట్టించాడు ఇంతలో మబ్బుపట్టి దారికానరాలేదు. చిమ్మచీకటులు పట్టాయి ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని వారు నడవసాగారు ఆ రాత్రి ఆపద తప్పించుకొంటే మేకపోతును బలియిస్తానని మాణిక్యాంబ మొక్కుకొంది. చింత చెట్టు కింద కూచొన్న దొంగలు వారి వద్దకు వచ్చారు వారిలో ఒకడు కర్రతో రుక్మిణిని గట్టిగా కొట్టాడు. ఆమె నిశ్చేష్టురాలై పడిపోయింది. ఇంతలో ఒక అదృశ్యవ్యక్తి

దొంగలలో ఒకనిని ఖడ్గంతో తెగనరికాడు. అది చూసి మిగతా వారు కాలికి బుద్ధిచెప్పారు.

ఆ వ్యక్తి రామరాజు. రాజశేఖరం ఒంటరిగా కుటుంబంతో వెళితే దొంగలబారిని బడక తప్పదని గ్రహించి వారిననుసరించాడు. దారిలో తనకీ విషయం తెలిసి వచ్చానన్నాడు. రాజశేఖరం కృతజ్ఞతతో రాజుగారికి నమస్కరించాడు. రుక్మిణి నాడి నిదానించి చూసి చనిపోయిందని నిశ్చయించుకొన్నారు. ఇంతలో ఒకపెద్ద పులి గాండ్రిస్తూ వచ్చింది. రుక్మిణిని వదలి వాళ్లు కష్టంతో పెద్దాపురం వెళ్లారు.

రామరాజు రాజశేఖరం కుటుంబాన్ని పెద్దాపురం చేర్చారు. కాశీ ప్రయాణం మాని భీమవరంలో ఉండమని రాజుగారు సలహా యిచ్చారు. ప్రయాణ బడలికవల్ల, రుక్మిణి పోవడంవల్ల రాజశేఖరం భీమవరం వెళ్లి కొద్ది రోజులు ఉండాలని నిర్ణయించుకొన్నారు. మర్నాడు ఉదయం రుక్మిణి కోసం వెదకసాగారు. రక్తపుమరకలు కనిపించాయి తప్ప ఆమె శవం కనిపించలేదు. పులి తీసుకొని వెళ్లి వుంటుదని భావించి యింటికి తిరుగు ముఖం పట్టారు.

మాణిక్యాంబ ఆ దుర్వార్త విని పెద్దపెట్టున ఏడవసాగింది. చుట్టువక్కలవారు వారినోదార్చారు. ఇంతలో కుమ్మరి వీధి తగలబడిపోతోందని వార్తవచ్చింది. దిగులుతో రాజశేఖరుడు వెళ్లలేకపోయాడు. సుబ్రహ్మణ్యం యితరుల ఆపదపోగొట్టడానికి బయలుదేరాడు. వేలకొద్ది జనం పోగయ్యారు. ఎవరూ మంటలార్పడానికి ముందుకు రాలేదు. ఇంట్లో వస్తువులు బయటపడవేస్తే అవి మాయమయ్యాయి. మంటలు రేగటానికి కారణం గ్రహానికి కోపం రావడమని వాళ్ల నమ్మకం. ఏటా గ్రహశాంతి చేయిస్తారు. అయినా కారణంలేకుండా మంట లెగశాయి. జాతరలో గ్రహాన్ని సాగనంపుతారు. ఈమాటలు సుబ్రహ్మణ్యం నమ్మలేకపోయాడు.

రాజశేఖరం రుక్మిణి మరణవార్తను వారి అత్తవారికి కబురుపంపారు. ఒకరోజు రాజశేఖరుడు వీధి అరుగుమీద కూచొనివుండగా బండిమీద కుంభం

పెట్టుకొని, గ్రహశాంతికై ఉత్సవం బయలుదేరింది. మంత్రగాడు యిళ్లు కాల్చేదేవతను కొంచెం సేపట్లోపారదోలుతాడు. అతని పేరు వీరదాసు. గ్రామదేవత గుడివద్ద ఈ తంతు జరుపుతారు. భేతాళయంత్రం వేసి ఏడేసి రావి ఆకులతో కుట్టిన ఏడు విస్తళ్లలో కుంభంపోసి నైవేద్యం ఇస్తారు. సుబ్రహ్మణ్యం ఈవింత చూడటానికి బయలుదేరాడు.

యంత్రజ్ఞుడు వీరదాసు గ్రామదేవత అయిన మరిడీమహా దేవత పేర ఒక ఆజ్ఞ వ్రాసి చదివాడు. యంత్రజ్ఞుడైన వీరదాసు గ్రామదేవత మరిడీమహాలక్ష్మిని చేసిన ఆజ్ఞ. గ్రామదేవతవయి వుండి నీవు ఏదో గ్రహం వూళ్లో ఇల్లు కాలుస్తుంటే చూస్తూవూరుకోవడం భావ్యం కాదు. ఈకుంభం నీతరపున కట్టుబడి చేయిచాం. నీవు ఈకుంభం ఆగ్రహానికిచ్చి దానిని కొండల మీదికి పంపించెయ్యాలి. అలాచేయకపోతే భేతాళుడో, హనుమంతుడో తాఖీదు పంపుతారని ఒక శ్లోకం పెద్దగా చెప్పాడు.

యంత్రజ్ఞుడు కుంభం నైవేద్యం పెట్టి , నల్లకోడిని కోయించి ఆ రక్తం కుంభంపై పోసి ' ఓగ్రహమా! కొండల మీదికిపో!' అని ఆజ్ఞచేశాడు. జాతరకు వెళ్లినవారంతా చెరువులో స్నానాలు చేసి ఎవదారిన వాళ్లు వెళ్లారు. సుబ్రహ్మణ్యం అక్కడ జరిగిన విశేషాలు తండ్రికి చెప్పాడు రాజశేఖరం జనుల మూర్ఖత్వానికి విస్తుబోయారు.

రుక్మిణి గుర్తుకురాగా అలా పట్టణం చూసి వద్దామని బయలు దేరారు. అక్కడ భార్యాభర్త లిద్దరు తగవుపడుతున్నారు. భార్యకు నోరు ఎక్కువ. భర్త చేయిచేసుకొంటున్నాడు. భార్య ఏడుపు విని చుట్టుపక్కల జనం మూగారు. అంతావినోదం చూస్తున్నారే గానీ ఎవరూ వాళ్ళను ఆపలేదు. మరొక చోట కొందరు సభతీరి ఒకరినొకరు పొగడుకొని సంతోషిస్తున్నారు. అక్కడ అందమైన యిళ్లు కనిపిస్తే చూడాలని గుమ్మం ఎక్కి మరలా తిరిగి వచ్చేశాడు. వారున్న సత్రంలో బ్రాహ్మణుడు రాజశేఖరంతో కబుర్లకు దిగాడు ఆ వూళ్ళో పండితుల ప్రస్తావన వచ్చింది. హరిపాపయ్యశాస్త్రులు గొప్ప

పండితుడని అతడు చెప్పాడు. అందుకు నిదర్శనము ఆయన ఎవరితోనూ మాట్లాడడు. మరొకరు తన గురువుగారైన భానుమూర్తి. ఆయన వేదాంత శాస్త్రములో గొప్ప పండితుడు. ఆయనవద్ద ఏదో దొంగవస్తువు ఉన్నదని రాజభటులు తీసుకొనిపోయి బందిఖానాలో పెట్టినారు. ఇక అక్కడ వర్తకులు సరుకులనే గాక మాటలను కూడా లాభానికి అమ్ముతారు. ఇక్కడ పెద్దమనుషులు అంగళ్ళలో వస్తువులు తీసుకొని పైకం ఎగనామం పెడతారు. ఈ కబుర్లు విని రాజశేఖరానికి రాజుగారి పాలనపై అనుమానం వచ్చింది. మోసాలకు నెలవైన ఆ పట్టణము వదలి రాజశేఖరం బండిమాట్లాడుకుని భీమవరం చేరారు.

ఆవూరు చేరగానే వసతికోసం వెదుకగా ఎవ్వరునూ చూపలేదు. ఆవూట కరణంయింటిలో వంట చేసుకొని సాయంకాలం పురోహితుల యింట ప్రవేశించారు. ఆయిల్లు వాసయోగ్యము కాదు. వాస్తురీత్యా ఆ యిల్లు అచ్చిరాలేదు. రాజశేఖరుడు ఆయింటిని కొంత మరమ్మత్తు చేయించి డబ్బు ఖర్చు పెట్టాడు. తెచ్చుకున్న డబ్బు అయిపోయింది.

భీమవరం పల్లెటూరు పాలుమజ్జిగ కట్టెలు దొరకవు. ఆదివారాలలో పెద్దాపురం సంతకు పోయి రాజశేఖరుడు వస్తువులు కొనుగోలు చేసి తెచ్చేవాడు. నెలరోజులలో ఊరివారు పరిచితులయ్యారు. కారాగృహాధికారియైన శోభనాద్రి రాజుగారిని చూస్తే ఏదైనా సహాయం చేస్తారని అందరూ సలహా యిచ్చారు. రామరాజు అప్పడప్పుడు వచ్చి చూసి పోతూవుండేవాడు. ధనలేమిచే మాణిక్యాంబ శోభనాద్రిరాజును కలిసి ఉద్యోగ ప్రయత్నం చేయమని చెప్పేది. ఒకటి రెండు సార్లు ఆప్రయత్నం కుదరలేదు. చివరకు ఒకరోజు రాజదర్శనానికి వెళ్ళి వచ్చాడు.

రాజగృహందగ్గరకు వెళ్ళగానే అక్కడ వున్న పరిచారకుడు భాగ్యవంతులకు మాత్రమే లోపల ప్రవేశమని, బీదవారు ఇక్కడే నిలుచోవాలని చెప్పాడు. రాజశేఖరం చొరవ చేసుకొని లోపలకు వెళ్ళాడు. అక్కడ ఈయన మాటలకు రాజుగారు బదులుపలకలేదు. దగ్గర వున్న కుక్క మొరగ సాగింది. చివరకు రాజు తనను బయటికి పంపించి వేయమని సేవకునితో చెప్పాడు.

అమర్యాద జరగకముందే తాను యింటి ముఖం పట్టాడు. ఆయనను ఆశ్రయించి ప్రయోజనం లేదని రాజశేఖరం నిశ్చయించుకున్నాడు.

జీవనోపాధికై సుబ్రహ్మణ్యాన్ని పిఠాపురం పంపాలని నిశ్చయించుకున్నారు. తల్లిదండ్రులు అనేక విధాలుగా నీతిబోధలు చేసి ఆశీర్వదించి సాగనంపారు. సుబ్రహ్మణ్యం వారి ఎడబాటు ఓర్చుకొని సెలవు తీసుకోని బయలు దేరాడు.

ఆదివారం నాడు రాజశేఖరుడు పెద్దాపురం బయలు దేరాడు. శోభనాద్రి రాజు వీధి అరుగుపై దర్జాగా కూర్చుని వున్నాడు.రాజుగారు రాజశేఖరాన్ని బంట్రోతులచే పిలిపించాడు. కుశలప్రశ్నలైన తరువాత ఆరోజు తామలా అన్నందుకు శోభనాద్రి బాధపడ్డారు. రాజశేఖరుడు తన కుటుంబ విషయాలు శోభనాద్రికి వివరించారు.

ఇంతలో మరికొంత మంది పెద్దమనుషులు శోభనాద్రి చుట్టు చేరారు. ఆయన మాట్లాడిన దాంట్లో చమత్కారం లేకపోయినా వాళ్ళు నవ్వసాగారు. రాజశేఖరం కూడా నవ్వసాగాడు. ఆయన తన పాండిత్యాన్ని పొగిడించుకునే వాడు. నంగీత కచేరీలు జరిగేటప్పుడు వారికి శ్రమ యివ్వటం మంచిది కాదని యిక సెలవివ్వండని చెప్పి యిండ్లకు వెళ్ళేవారు. రాజశేఖరాన్ని తరచూ వచ్చిపోతుండమని శోభనాద్రి ఆజ్ఞ యిచ్చారు. అది మొదలు రాజశేఖరుడు ఉదయం సాయంకాలం రాజదర్శనానికి వెళ్ళేవాడు. రాజుగారు ఈయనను గౌరవంగా చూడసాగాడు. ప్రతిరోజు కొలువులో రాజుగారు తన గొప్పతనాలను గూర్చిన కథలు చెప్పేవారు. కొందరు స్తోత్ర పాఠములు చేసేవారు. అలవాటు లేకపోయినా రాజశేఖరుడు అనత్యదోషమునకు భయపడి మీరు మంచి బట్టలు కట్టుకున్నారని ప్రశంసించేవాడు. రాజ నభలో పదిమందిని నవ్వించటం నేర్చుకున్నాడు. రాజు ధర్మోపన్యాసాలు కూడా చేసేవారు. ఎన్ని చేసినా ఉదరపోషణ కోనమేనని అందులో తప్పులేదని వాదించేవారు. ఉదయాస్తమానములు పుష్టికరమైన భోజనమును గూర్చి ఆలోచించేవారు.

రాజశేఖరునికి రాజువద్ద చనువు యేర్పడింది. కొందరు రాజశేఖరుని మెప్పు పొందుటకై ఆయన యింటికి వచ్చి యోగక్షేమాలడిగేవారు.సీత వివాహ ప్రస్తావన తెచ్చేవారు. ఒకరోజు సుబ్బారాయుడు సిద్ధాంతి వారింటికి వచ్చి తన జోతిష్యశాస్త్ర పాండిత్యాన్ని గురించి యేకరువు పెట్టాడు. జన్మ నక్షత్రం చెబితే రాజశేఖరానికి భవిష్యత్తును గూర్చి చెబుతానని ఊరించాడు. జ్యోతిషముపై తనకు నమ్మకం పోయిందని రాజశేఖరుడు ఖరాఖండిగా చెప్పాడు. కాశియాత్రకు మంచి ముహూర్తము పెట్టుకొనిబయలుదేరిన తమకు కలిగిన ఆపదలు వివరించారు. పెద్దాపురం నుండి యిక్కడికి వచ్చేటప్పుడు ఏమీ చూసుకోకుండా వచ్చినా శుభ ఫలితాలు తగులుతున్నాయని చెప్పాడు. సిద్ధాంతి వదిలి పెట్టలేదు. సీత వివాహ విషయం ప్రస్తావించాడు. పెద్దాపురంలో మంచి రాజుగారి సంబంధం మంచిది వుందని చెప్పాడు. శోభనాద్రి మాట సహాయంతో అది కుదురుతుందని సలహా యిచ్చాడు.

సిద్ధాంతి ఆరోజే రాజశేఖరాన్ని శోభనాద్రి వద్దకు తీసుకు వెళ్ళాడు. మంచిరాజు వారి సంబంధం గురించి చెప్పారు. కాని వారిదిపెద్ద సంబంధం కావటం వల్ల శోభనాద్రిగారి జోక్యం అవసరమన్నారు. అనుకోకుండా ఆపూట పద్మరాజు వారి యింటికి వచ్చి మాట్లాడుతున్నాడు. అతనికి ముప్పది యేండ్లు. చలువ చేసిన తెల్లబట్టలు పదివేళ్ళకూ వుంగరాలు చేతులకు మురుగులు మొలకు బంగారు మొలత్రాడు. చూచుటకు స్ఫురద్రూపి అందునా ప్రథమవరుడు. సంవత్సరానికి రెండు వేలకుపైగా ఆదాయం వచ్చే మాన్యాలున్నాయి. ఎటుచూసినా బ్రహ్మాండమైన సంబంధం.

శోభనాద్రి రాజు పద్మరాజును దగ్గరకు పిలిపించుకొని రాజశేఖరాన్ని పరిచయం చేసి వంశ ప్రతిష్ఠకలను పొగిడారు. వీరిపిల్ల లక్షణవతి అని చెప్పారు. పద్మరాజు తమకు యింతకాలము వివాహముపై ఇచ్ఛలేదని ఎన్నో సంబంధాలు వచ్చినా కాదన్నానని చెప్పాడు. అయినా తమరు సెలవిచ్చారు కాబట్టి మానాన్న గారితో చెప్పి ఏవిషయం రేపు కబురు పంపుతానన్నాడు. శోభనాద్రిరాజు ఈసారి మామాట వినక పోతే మనస్నేహంఇంతటితో సరి అని మీనాన్నతో నామాటగా చెప్పమని చెప్పిపంపారు. రాజశేఖరుడు శోభనాద్రిపై ఒత్తిడి తెచ్చాడు

మర్నాడు శోభనాద్రిరాజు రాజశేఖరునికి శుభవర్తమానం అందజేశాడు. నేను చెబితే కాదనటం కూడానా అని బీరాలు పలికారు. వారివద్ద నుండి వచ్చిన జాబు చదువుకొని రాజశేఖరుడు సంతోషించాడు. సిద్ధాంతి పంచాంగం చూసి వైశాఖ బహుళ సప్తమి గురువారం రాత్రి పునర్వసు నక్షత్ర మేష లగ్నము నందు ముహూర్తం పెట్టారు. శోభనాద్రి గారు పెండ్లి ఖర్చులకు కొంత డబ్బు బదులు యిచ్చారు. ఒకసేవకుని పెండ్లిపనులలో సహాయపడమని రాజశేఖరానికి తోడుపంపారు.

రాజశేఖరుడు అది మొదలు పెద్దాపురం వెళ్లి పెళ్లికి కావలసిన సామాన్లు చేర్చసాగాడు. పంచమినాడు సీతను పెళ్లికూతుర్ని చేశారు. ఇంట్లో పెండ్లి కళ ఏర్పడింది.

రేపురాత్రి పెళ్లి అనగా ఒక కూలివాడు పెద్దాపురం నుండి రాజశేఖరుడు లేని సమయంలో ఒక ఉత్తరం తెచ్చి యింట్లో ఇచ్చాడు. రాజశేఖరుడు ఊరినుండి వచ్చి చదువుకొని కన్నీరు పెట్టాడు. మాణిక్యాంబకు విషయం బోధపడలేదు. పెద్దాపురంలో తమబంధువు రామమూర్తి మశూచితో చనిపోయాడని వర్తమానం.

మర్నాడు రాజశేఖరుడు శోభనాద్రిరాజు ద్వారా పెండ్లివారిని రావద్దని కబురు పంపారు. అశుభదినాలలో పెండ్లి జరిపించరాదని నిర్ణయించుకున్నారు. మరుసటి ఆదివారం రాజశేఖరుడు పెండ్లికి తెచ్చిన కూరగాయలు పెద్దాపురం సంతలో అమ్మివేసారు.అక్కడ చనిపోయాడని చెప్పిన రామమూర్తి రాజశేఖరానికి తటస్థపడ్డాడు. బుధవారం రాత్రి ఎవరో తెచ్చియిచ్చిన జాబు గూర్చి తెలుసుకుని ఇద్దరూ బాధపడ్డరు. గిట్టని వారెవరో చేయించి ఉంటారని ఊహాచేశారు.

రాజశేఖరుడు భీమవరం వచ్చి భార్యతో ఆవార్త చెప్పాడు. రామరాజు ఈ కుట్రపన్నాడని తర్వాత ఆనవాళ్లు దొరికాయి. గిట్టనివారు అతనికి డబ్బిచ్చి యిలా చేయించి ఉంటారని నమ్మారు. డబ్బు ఎంతపని అయినా చేయిస్తుందనడానికి అది నిదర్శనం.

రామరాజుతో ఆ విషయం ప్రస్తావిస్తే ఆయనకు ఎక్కడ లేని కోపం వచ్చింది. చివరకు రాజశేఖరానికి రామరాజుకు మాటామాటా పెరిగి సఖ్యత అంతరించింది. రాజశేఖరుడు శోభనాద్రికి జరిగిన సంగతి చెప్పి సిద్ధాంతిని పిలిపించి ముహూర్తం పెట్టించమన్నాడు. సిద్దాంతికి జ్వరం తగిలి చావు తప్పి ఆతురసన్యాసం స్వీకరించి మంచంపట్టి ఉన్నాడని చెప్పారు.

రాజశేఖరుడు సిద్ధాంతి ఇంటికి వెళ్లి కుశల ప్రశ్నలు వేసి ఆయన ఆరోగ్యం గురించి విచారించారు. బంధువులు తనకు ఈ సన్యాసమిప్పించారనీ, తనరెండో పెండ్లాము కాపురానికి వచ్చి 6నెలలైనా కాలేదనీ, ఆస్తికోసం బంధువులు ఈపని చేశారని చెప్పాడు. మీకు చేసిన అపకారానికి మన్నించమని జరిగిన కథ వివరించాడు.

'పద్మరాజు ధనవంతుడు కాదు. శోభనాద్రికిముండల తార్పుడుగాడు. అతడు ధరించినవన్నీ రాజుగారివే. రాజుగారే ఈకుతంత్రం పన్ని పెండ్లిజరిపించాడని సిద్ధాంతిబాధగా చెప్పాడు.

రాజశేఖరుడు శోభనాద్రి దుర్మార్గానికి, కపటత్వానికి బాధపడ్డాడు. డబ్బులివ్వడంలో ఆంతర్యం కూడా తెలిసింది.రామరాజు పుణ్యమా? అని వివాహం నిలిచిపోయింది గాబట్టి సరిపోయిది. లేకపోతే సీత గొంతుకోసిన వారం అయ్యేవాళ్లం అన్నాడు.

జ్ఞాతిమరణవార్త వల్ల వివాహం నిలిచిపోయిందని రాజశేఖరుడు చెప్పగా సిద్ధాంతి సంతోషించాడు. ఆ ముహూర్తం పెట్టిన రోజే తనకు బాగులేకుండా వచ్చిందనీ పాపపరిహారార్థం కోటివేల్పులకు మొక్కుకున్నాననీ సిద్ధాంతి చెప్పాడు. పెండ్లిరడ్లలో అబద్దాలాడవచ్చునని మనసుకు సమాధానం చెప్పకున్నానన్నాడు.

రాజశేఖరుడు శోభనాద్రిరాజు వీధిగుమ్మంలో నిలబడి వుంటే మీ మాటలు నమ్మిమోసపోయానని నిర్భయంగా చెప్పారు.శోభనాద్రి తనవద్ద అప్పుగా తీసుకున్న పైకం యిచ్చివేయమని బలవంతం చేశాడు. పెండ్లికి కావలసిన

వస్తువులు కొన్నాను నావద్ద రొక్కం లేదు, ఉన్నప్పుడు ఇస్తానని రాజశేఖరుడు తిరుగుముఖం పట్టాడు. శోభనాద్రి భటులను పంపి రాజశేఖరుని చెరసాలలో పెట్టించారు. మాణిక్యాంబ ఆవార్త విని కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. నిద్రాహారాలు మాని దైవధ్యానంలో కాలం గడుపుతూ క్రుంగి కృశించిపోయింది.

మూడోరోజు సీత వీధిగుమ్మంలో నిలుచుని వుండగా యిద్దరు మనుష్యులు వచ్చి- మీ అన్న పిఠాపురం నుండి వచ్చి అవతలి వీధి కరణంగారి యింట్లో కూర్చొని నిన్ను తీసుక రమ్మన్నారు, అని చెప్పి తీసుకొని పోయి ఊరిబయటకు ఎత్తుకొని పారిపోయారు. మాణిక్యాంబ ఆ వార్తవిని మూర్ఛపోయింది. భర్తృవియోగము, పుత్రికాశోకము ఆమె భరించలేకపోయింది.

సుబ్రహ్మణ్యం బయలుదేరిన నాటి సాయంకాలానికి పిఠాపురం చేరాడు. అప్పటికే రాత్రి అయింది. అతనివాలకం చూసి అతడు పల్లెటూరువాడని కొందరు దుష్టాత్ములు గ్రహించి అతడ్ని బెదిరించి డబ్బు గుంజాలని ప్రయత్నించారు. రాజభటుడొకడు సుబ్రహ్మణ్యాన్ని రకరకాల ప్రశ్నలు వేసి భయపెట్టి లంచం యిస్తేగాని వదలిపెట్టనని కూచున్నాడు. ఇంతలో ఎవరో దారిలో వెళ్లే పెద్దమనిషి ఆ సంగతి తెలుసుకొన్నాడు. సుబ్రహ్మణ్యాన్ని ఆ పెద్ద మనిషి గుర్తుపట్టి మాటకలిపాడు. అదివింటూ రాజభటుడు మెల్లగా జారుకున్నాడు. సుబ్రహ్మణ్యాన్ని ఇంటికి తీసుకెళ్లాడు. దారిలో రాజశేఖరుని కుటుంబ పరిస్థితి తెలుసుకొని బాధపడ్డాడు.

గురువుగారి ఋణం తీర్చుకోవడానికి తన చేతనైన సహాయం చేస్తానని ఉమాపతి మాట ఇచ్చాడు. తాను పిఠాపురం మహారాజు వద్ద ఉద్యోగం యిప్పిస్తానని హామీ యిచ్చాడు. అప్పటిదాక తన యింట్లో ఉండమన్నాడు.

పిఠాపురం మహారాజా విజయరామరాజుగారి వద్దకు సుబ్రహ్మణ్యాన్ని తీసుకొని వెళ్ళి ఉద్యోగమివ్వమని ఉమాపతి మనవిచేశాడు.

ఆ ఊరిలో కొత్తగావచ్చిన నీలాద్రిరాజు ఒకమేడ అద్దెకు తీసుకొని సంతర్పణ చేశారు. ఒకరోజు దారిలో వెళుతున్న సుబ్రహ్మణ్యాన్ని పిలిపించి

పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకున్నారు నీలాద్రిరాజునకు రాజశేఖరుడు తెలుసు. కాబట్టి అతని కుటుంబ వ్యవహారాలు సుబ్రహ్మణ్యం ద్వారా అడిగి తెలుసుకున్నారు.

సుబ్రహ్మణ్యం పిఠాపురం రాజాకొలువులో ఉద్యోగులను పరిచయం చేసుకొని తలలో నాలుకగా మెలగసాగాడు. అందరూ అతనికుద్యోగం చేయించమని రాజుగారికి మనవి చేశారు. సమయం వచ్చినప్పుడు ఇస్తామని రాజుగారు హామీ ఇచ్చారు

నీలాద్రిరాజు సుబ్రహ్మణ్యాన్ని చేరదీసి అతని అమాయకత్వం ఆసరాగా పిఠాపురం మహారాజు వారికోటలో ధనాగారమున్న చోటు గ్రహించాడు. తనకు ఉద్యోగం లభించగలదనే ఆశతో సుబ్రహ్మణ్యం అన్ని విషయాలు చెప్పాడు. స్వయంగా పిఠాపురం కోటపటాన్ని తానుచూసినది చూసినట్లుగాపటం గీచి యిచ్చాడు. ఈరహస్యాన్ని బయటపెట్టవద్దని నీలాద్రిరాజు బ్రతిమాలాడు. రాజులు తమ కోటవంటిదిమరొకటి వుండకూడదనుకొంటారని బొంకాడు.

నాలుగు రోజుల తర్వాత పిఠాపురం కోటలో దొంగలు పడి ధనాగారంలోనగలు, రొక్కం దోచుకొని పోయారు. రాజ భటులు వూరిలో అనుమానం వున్నవారి నందరిని చెరసాలలో పెట్టారు. నిజమైన దొంగలు దొరకలేదు. ఉత్తరం దిక్కున కోటగోడకు నిచ్చెన వేసుకొని దొంగలు ప్రవేశించినట్లు అడుగుల జాడ కనబడుతోంది. కావలివాండ్రు నిద్రపోయారు. అదే అదనుగా దొంగతనం జరిగిపోయింది. దొంగలను పట్టుకోలేక పోతే రాజుగారికి కోపం వస్తుందని రాజభటులు అంజనం వేసేవాణ్ణి పట్టుకొచ్చారు.

అంజనం వేసే భీమన్నను పిలిపించారు. నిముషములో పేరు చెప్పిస్తానని అతడు గొప్పలు చెప్పుకొన్నాడు. దానికి పిల్లికన్నులు గల ఆసామీ కావాలన్నాడు. సామిగాణ్ణి పిలిపించారు. భీమన్న స్నానం చేసి వచ్చి పిండి ముగ్గు పెట్టి ఆంజనేయస్వామి విగ్రహం వుంచి పూజ చేశాడు. సామిగాడు

రాగానే వానిని పట్టులో కూర్చోబెట్టి బరిణెలో కాటుక వాని కుడి చేతిలో రాశాడు. దానిలో ఏమి కనబడుతోందో చూసి చెప్పమని అన్నాడు. భీమన్న అతడి నోట గోటేటి సుబ్రహ్మణ్యం ఆ దొంగతనం చేశాడని చెప్పించాడు. ఊరిలో దానిపై వాదోపవాదాలు జరిగాయి. రాజుగారు మాత్రం నమ్మలేదు.

సుబ్రహ్మణ్యం తనపై నీలాపనిందలు పడ్డాయని దిగులు పడ్డాడు ఆనాటి రాత్రి చాలా సేపు ఆలోచించాడు. నాలుగు రోజుల కిందట నీలాద్రిరాజు తన వద్ద కోటపటం వ్రాయించుకోవడం గుర్తుకు వచ్చింది. గోడ ఎత్తు కూడా అడిగాడు కాబట్టి అతడే ఈ పని చేయించి ఉంటాడని నిర్ధారణ కొచ్చాడు.

తెల్లవారి రాజదర్శనం చేసుకొని సుబ్రహ్మణ్యం దొంగలను పట్టుకొనివస్తానని భటుల సహాయం కావాలనీ కోరాడు. రాజుగారు అతని వెంట భటులను పంపారు. సుబ్రహ్మణ్యం నేరుగా నీలాద్రిరాజు ఇంటికి బోయి, భటులను ఇంటు చుట్టూ కాపలా పెట్టాడు. నీలాద్రిరాజు పెరటిలో ఉన్నాడు. కొత్త మనుష్యులను చూసి ఆయన తత్తర పడ్డాడు. దొడ్డిలో విత్తనాలు చల్లించడానికి తవ్వించానని అబద్ధం చెప్పాడు.

భటులు పెట్టెలన్నీ వెతికారు. బైరాగి రాజశేఖరుని ఇంట్లో ఎత్తుకొని పోయిన వస్తువులన్నీ అందులో సుబ్రహ్మణ్యం గుర్తించాడు. బటులచే దొడ్డి తవ్వించాడు మొలలోతు భూమిలో రాజుగారి సొత్తు యావత్తు దొరికింది. నీలాద్రిరాజును విచారించేందుకు పెద్దాపురం మహారాజువారి వద్దకు పంపారు.

పెద్దాపురం బయలుదేరే సమయంలో వీధిగుమ్మం వద్ద సుబ్రహ్మణ్యంపై బల్లి పడింది. పురోహితుని బల్లిపాటుకు ఫలితం అడిగారు. సువర్ణదానం చేస్తే దోషం పోతుందన్నాడు. సుబ్రహ్మణ్యం గాయత్రి మంత్రం జపించి దానంగా నాలుగు డబ్బులిచ్చి ఆరోజే పెద్దాపురం బయలుదేరాడు.

పెద్దాపురానికి దగ్గరలో జగ్గయ్యపేట అనే గ్రామం ఉంది. సీతనెత్తుకొని పోయినవారు ఆవూరి గ్రామకరణం యింటివద్దకెళ్ళి సీతకు భోజనం పెడతారా? అని అడిగారు. 14 సం.ల కుర్రవాడు లోపలి నుండి బయటకు వచ్చి 8 సం.ల బాలిక బయట ఏడుస్తుంటే చూశాడు. సీతను తీసుకొని వచ్చిన దొంగలను ఆ కుర్రవాడు ప్రశ్నించసాగాడు. ఇంతలో ఒక ఆగంతుకుడు వచ్చి ఆ దొంగలను చావబాది తరిమి కొట్టాడు. ఆ యింటి కుర్రవాని పేరు సుబ్బరాయుడు.

సుబ్బరాయుడు రామరాజు ద్వారా సీత తల్లి దండ్రుల వివరాలు తెలుసుకొన్నాడు. సుబ్రహ్మణ్యము, తాను స్నేహితులమన్నాడు. భీమవరంలో వున్న తల్లిదండ్రులవద్దకు సీతను చేర్చడానికి సుబ్బరాయుడు సాయంవస్తానన్నాడు. రామరాజు సుబ్బరాయుని సౌందర్యాని కాశ్చర్య పోయాడు. అతడే స్త్రీ అయితే ఎంత బాగుండునో అనుకొన్నాడు. సీతను రామరాజు భుజానికెత్తుకొని భీమవరం దారి పట్టారు.

సుబ్బారాయుడు తాను వెంకటేశ్వరునికి మొక్కుకున్నాననీ, అందువల్ల తలవెంద్రుకలు పెంచుకొన్నాననీ చెప్పాడు ఆ రాత్రికి భీమవరం చేరలేక దారిలో ఒక పల్లెలో బస చేశారు. రామరాజు మర్నాడు వేకువనే వారిని లేపి భీమవరం తెల్లవారక ముందే చేర్చాడు. రామరాజు వూరిలోకి వెళ్ళకుండా తనకు పనివున్నదని చెప్పి వెనక్కి వెళ్ళిపోయాడు. సీత తుర్రుమని యింటికి వెళ్ళిపోయింది. సుబ్బరాయునికి వారి యిల్లు తెలియక వూళ్ళో తిరుగుతున్నాడు. సీత పిలుపు విని మాణిక్యాంబ తుళ్ళిపడి లేచి తలుపు తీసింది. సీతను కౌగిలించుకొని భోరుభోరున ఏడ్చింది. జరిగిన వృత్తాంతం తల్లికి సీత చెప్పింది. రామరాజు, మరొక చిన్నవాడు తనను యిల్లు చేర్చారని చెప్పింది. సుబ్బరాయుడు రాజశేఖరుని యిల్లు వెతుకుతూ వచ్చాడు. మాణిక్యాంబను చూడగానే 'అమ్మా' అని కౌగిలించుకొని ఏడవసాగాడు. అందరూ లోపలి కెళ్ళారు.

చెరసాలలో రాజశేఖరుడు బాధపడుతూ ఒకచోట కూచొన్నాడు. మంచి రాజు పాపయ్య అనే మరో ఖైదీ రాజశేఖరాన్ని గుర్తుపట్టి నల్ల చెరువు వద్ద

బైరాగిని తానేనని వొప్పుకొన్నాడు. శోభనాద్రిరాజు స్నేహదోషంవల్ల ఈ అవస్థ పట్టిందనీ దారులు కొట్టి వచ్చిన మొత్తం అందరం పంచుకొనే వారమని చెప్పాడు నేను లోగడ చేసిన అపకారానికి ప్రతిగా ఇప్పుడొక ఉపకారం చేస్తానన్నాడు.. పెద్దాపురం రాజాగారు యోగ్యులనియు, శోభనాద్రి ఈ విధంగా నిర్బంధించినది తెలిస్తే విడిచిపెడతారనీ చెప్పాడు. విజ్ఞాపనం పంపితే న్యాయం జరుగుతుందని బోధ చేశాడు. రాజశేఖరుడు పంపిన విజ్ఞాపనానికి నాలుగు రోజులు సమాధానం రాలేదు. బంధుత్వం అడ్డు వచ్చి వుంటుందనుకొన్నాడు.

రామరాజు రాజశేఖరుని వద్దకు వచ్చాడు. రాజశేఖరుడు తనతప్పుకు క్షమాపణ కోరాడు. చేసిన మేలుకు తగిన శాస్తి అయినదని రామరాజు వెళ్ళిపోయాడు.

మహారాజుగారు కొలువుదీరి రాజశేఖరానికి కబురు పంపారు. శోభనాద్రిరాజు చేతులు కట్టుకొని నిలబడి వున్నాడు. రాజుగారు రాజశేఖరాన్ని తమవిన్నపం చెప్పుకోవచ్చునన్నాడు. భయపడి ఆయన నోరు మెదపలేదు.

మహారాజు శోభనాద్రి చేసిన తప్పిదాలన్నీ గ్రహించి అతణ్ణి కొలువులో నిలదీసి అడిగారు. సాక్ష్యాధారాలతో శోభనాద్రి బండారం బయట పడింది. పాపయ్య సాక్ష్యం కుడా రాజశేఖరునికి అనుకూలంగా వుంది. శోభనాద్రి మారు పలకలేదు. రాజశేఖరుడు దిగ్భ్రమ చెందాడు. రాజుగారి కంఠస్వరం యెరిగినట్లే వుంది. తాను రామరాజునని చెప్పి మహారాజు రాజశేఖరుని చేయి పట్టుకున్నాడు. రాజశేఖరుడు గద్గద స్వరంతో తాను ఇన్నాళ్ళూ దేవర వారిని సామాన్యమానవునిగా చూచినందుకు, దూషించినందుకు క్షమించాల్సిందిగా కోరాడు. రాజుగారు ఆ విషయం మనసులో పెట్టుకోవద్దన్నారు. శోభనాద్రిపై దయతలచి నెలరోజులు శిక్ష విధించారు.

రాజశేఖరుడు యింటికి వెళ్ళేసరికి మాణిక్యాంబ సుబ్బరాయుడితో మాట్లాడుతోంది. రాజశేఖరునిరాక గమనించి మాణిక్యాంబ పరమానంద

భరితురాలైంది. జరిగిన కథలు ఒకరికొకరు చెప్పుకున్నారు. సీతను దొంగలెత్తుక పోవడం రామురాజు రక్షించటం, మాణిక్యాంబ చెప్పింది. రామురాజే ప్రభువులవారని రాజశేఖరుడు చెప్పాడు. సుబ్బరాయుడు రాజశేఖరం దగ్గరకు వచ్చి తానే రుక్మిణినని చెప్పి యింటివారినెల్ల సంతోషపరిచారు. రుక్మిణి తనకథ వివరంగా తల్లి దండ్రులకు చెప్పింది :

''మనలను దొంగలు కొట్టిన రాత్రి వెన్నెల రాత్రి. నాకు మెలకువ వచ్చి చూసే సరికి చుట్టూ మనుష్య సంచారం లేదు. నా ప్రక్కనే ఒక పెద్ద పులి నడుచుకుంటూ వెళ్ళింది. మీరంతా మరణించారను కున్నాను. ఆత్మహత్య మహాపాపమని విర మించుకున్నాను. ప్రక్కనే నెత్తుటి మధ్యలో ఒక శిరసు కనిపించింది. ప్రక్కనే వున్న బట్టలమూటలో పురుషుల వస్త్రాలు తీసుకుని నేను ధరించాను. నగలు తీసి వేసి ఎలానో ప్రక్క గ్రామం చేరి ఆ నగలు అమ్మి జీవనం కొనసాగించాను. జగ్గంపేట కరణం తనకు సాయంగా నన్ను చేరదీశాడు తనకుమార్తెకు నన్నిచ్చి పెండ్లి చేసి యిల్లరికం వుంచుకోవాలని ఆ ముదుసలి కోరిక. నా పేరు సుబ్బరాయుడుగా మార్చుకున్నాను. వెంకటేశ్వరుని మ్రొక్కు కోసం జుట్టు పెంచుకున్నానని అందరినీ నమ్మించాను. అదృష్టవశాత్తు సీతను దొంగిలించిన వారు నా దగ్గరకే వచ్చారు.''

రుక్మిణి సాహసానికి బుద్ధి కుశలతకు అందరూ మెచ్చుకున్నారు.

రాజశేఖరుని యింటికి శంకరయ్య ఒక రోజు వచ్చి తన తండ్రి చనిపోయినాడని చెప్పి గోడుగోడున ఏడ్చాడు. ఆతడు గ్రామంలో జరిగిన కథ, తన తండ్రి చనిపోయిన వృత్తాంతము వివరించాడు. శంకరయ్య రాజశేఖరుని మేనల్లుడు. అతని తండ్రి దామోదరుడు. దామోదరుని మరణానికి దారి తీసిన కథ యిది.

దామోదరుడు భూతవైద్యుడుగా పేరు సంపాదించాడు. ఊళ్ళో ఎవరికి ఏ రోగము వచ్చినా ఆయన విభూతి పెట్టేవాడు. అందరూ భక్తి శ్రద్ధలతో

ఏవో కానుకలు సమర్పించేవారు. ఒకరోజు ఒక యజమాని యింటి దగ్గర నిలబడి నిండుగా వున్న కొబ్బరి చెట్టును చూసి కాయలు కావాలన్నాడు. అతడు పైసలు లేనిదే యివ్వనన్నాడు. మరునాడు అర్ధరాత్రి దొంగతనంగా ఆ చెట్టు మీదికి ఎక్కి దాని మొవ్వులో బియ్యం పోశాడు. మరునాటి నుంచి ఆ చెట్టుకు ప్రయోగం చేశానని గొప్పలు చెప్పుకున్నాడు.

ఊరిలో ఎవరికో రోగం వస్తే దామోదరుడు ప్రయోగం చేశాడని అపోహ పడ్డారు. వదంతులు వ్యాపించడం సులభం. ఎవరు చనిపోయినా అది దామోదరుని పని అని అనుమానించసాగారు. దామోదరుని సవతి తల్లికి అనారోగ్యము చేసినపుడు కూడా ఎవరూ సహాయం రాలేదు. కావలసిన వాళ్ళు కూడా దూరమయ్యారు. ఇంక అక్కడ లాభంలేదని శంకరయ్యను, ఆమెను ఏలూరు పంపి తానొక్కడే యింటి పట్టున ఉన్నాడు. ఒక రోజు శంకరయ్య ఉన్న యింటికి ఒకడు కాసులపేరు తీసుకొని వచ్చి అమ్మ జూపాడు. అది రుక్మిణిదని అతడు గ్రహించి దొంగను పట్టుకొన్నాడు.

కొద్ది రోజులకు దామోదరుడు చనిపోయినాడని వార్త వచ్చినది. ఇల్లు ఎవరో కాల్చినారు. ఊరందరు శత్రువులగుటచే దామోదరయ్య పాతాళ హోమము చేయుచున్నాడని అతని యింటికి నిప్పు పెట్టించారు. శంకరయ్య వెళ్ళేసరికి నారాయణమూర్తి దహన సంస్కారాలు పూర్తి చేశాడు. దామోదరయ్య మరణవార్త విని రాజశేఖరుని కుటుంబమంతా దుఃఖపడ్డారు.

ఆరాత్రి ఆ వూరికి పల్లకి ఎక్కి ఒక వైష్ణవ స్వాములవారు వచ్చినారు. ఆ వూరేగింపు వెళ్ళిన తరువాత రాజశేఖరుని వీధి తలుపు ఎవరో కొట్టినారు. తలుపు తీసి చూస్తే నృసింహస్వామి. ఇంటివారు నమ్మలేకపోయారు. నృసింహస్వామి తన కథ యిలా చెప్పాడు.

''చిరకాలం నుండీ తనకు కాశీయాత్ర చేసి రావాలని కోరిక. శేషాచలం అనే స్నేహితుడు తనకు స్వర్ణవిద్య తెలియునని నమ్మకంగా చెప్పాడు

వారు ఇంట్లో చెప్పకుండా పెద్దాపురం చేరాము. ఆ రోజు నృసింహస్వామి పుట్టిన రోజు. అతడికి నగలు పెట్టారు. అవితీసుకొని శేషాచలంతో వుడాయించాడు. ఇద్దరూ ఆ నగలు అమ్మి కాశీ చేరారు. కొన్నాళ్ళకు తమవద్ద చిల్లి గవ్వ మిగలలేదు. శేషాచలం తనను వదలి వెళ్ళి పోయాడు నృసింహస్వామి ఇంటిగాలి మళ్ళి తిరుగు ముఖం పట్టాడు. రాజశేఖరుని వివరాలు అతనికి తుని వద్ద తెలిశాయి. వారిని వెదుకుతూ ఇల్లు చేరాడు.''

సుబ్రహ్మణ్యం నీలాద్రిరాజు వెంట వస్తున్న భటులతో పెద్దాపురం పోతూ భీమవరం వచ్చాడు. ఇంటికి వచ్చే సరికి సంతోషం వెల్లి విరుస్తోంది నృసింహస్వామి సజీవంగా రావడం, రుక్మిణి బ్రతికి బయట పడటం విని సంతోషించాడు. మహారాజు వద్ద తనకు జరిగిన గౌరవం గురించి గొప్పగా చెప్పాడు. రామరాజే మహాప్రభువులని తెలిసి ఆశ్చర్య పోయాడు

రాజశేఖరుడు కొడుకును అల్లునిని తీసుకొని పెద్దాపురం వెళ్ళారు. అక్కడ రాజ వీధులలో శంకరాచార్యులవారు వూరేగింపుగా వెళుతున్నారు. వారు నెలరోజులుగా అక్కడ మకాం చేసి వున్నారు. స్వాముల వారు పూర్వాశ్రమములో ముంగండ అగ్రహారీకులు.

రాజశేఖరం మహారాజుల కొలువులోనికి ప్రవేశించారు. రాజుగారు దొంగలను పట్టుకున్నది ఎవరని అడుగుతున్నారు. నీలాద్రిరాజును శిక్షించుటకు ప్రభువు నిర్ణయించు కున్నారు. నీలాద్రిరాజు తన పూర్వ గాథను సవివరంగా చెప్పాడు.

''మాది కాళహస్తి. మా తల్లి దండ్రులు మధ్యతరగతి గౌరవకుటుంబీకులు. వారికి నేనొక్కడినే బిడ్డను. నన్ను గారాబముగా పెంచరు. నన్ను ఒక గురువు వద్ద చదువ వేసారు. అతనికి అక్షరమురాదు. దెబ్బలు తప్పించు కొనుటకు డబ్బులిచ్చేవాడిని. నాది సూక్ష్మబుద్ధి. ఇతరులను మోసము చేయడానికి దానిని ఉపయోగించే వాడిని. ఇంతలో మా పంతులు చనిపోయాడు కొత్త పంతులువద్దకు నన్ను చదువుకు పంపారు. ఆయన

వద్ద నా ఆటలు సాగలేదు. మా తండ్రి ఆకస్మికంగా గుండె నొప్పితో చనిపోయాడు. మేము దరిద్రులమయాము చెడు స్నేహముతో నేను వ్యసనాలకు లోనైనాను. నా పేరు పద్మనాభుడు. నా మిత్రుని పేరు భాస్కరుడు. నా మిత్రుడు పెద్దవాడై బాగా డబ్బు సంపాదించాడు. నేను ఒక రోజు అతని వద్దకు పోయి ఇద్దరమూ కలిసి వ్యాపారం చేద్దామని నచ్చజెప్పి కొంత మూలధనం పెట్టుబడి పెట్టించాను కొన్నాళ్ళకు నాకు ఆశ ఎక్కువై అతనితో కలహం పెట్టుకున్నాను. అతడు నాపై ప్రేమతో పెట్టుబడి నాకు వదిలివేశాడు నేను జూదానికి బానిసనై దరిద్రుడ నయాను. చివరకు ఎన్నో అవతారాలు మార్చి బైరాగినై రాజశేఖరుని నగలు అపహరించాను. ఆ తరువాత గడ్డము మీసాలు తీసి వేసి నీలాద్రిరాజు పేరుతో పిఠాపురం వచ్చి మీకోటలో ధనాగారం కొల్లగొట్టాను'' ఇదీ నా కథ అన్నాడు నీలాద్రిరాజు.

రాజుగారు అతని పశ్చాత్తాప హృదయాన్ని గమనించి ఒక సంవత్సరం కారాగారశిక్ష వేశారు. ప్రభువులవారు సుబ్రహ్మణ్యాన్ని ప్రశంసించి రాజశేఖరునికి హితవు మాటలు చెప్పిరి.

కష్టముల తర్వాత సుఖము వచ్చుట మంచిదే. మీరు ముఖస్తుతి మాటలకు పొంగిపోయి దానాలు చేయవద్దు. ఇంటిలో కలహాలు మానివేయండి. త్వరపడి కోపగించవద్దు. శోభనాద్రిరాజుపై మీ కోపమునకు ఫలితాన్ని అనుభవించారు. గౌరవ జీవనము సాగించుటకు తగిన ధనమున్న చాలును. డబ్బు లేదనెడి చింత పనికిరాదు - అని చెప్పి ప్రభువులవారు రాజశేఖరుని మాన్యములను వారికి విడిపించిరి.

రాజశేఖరుడు ప్రభువులవారి ఉదార గుణానికి కృతజ్ఞతలు చెప్పాడు. మీకు యింక ఏమైనా కావాలా? అని ప్రభువులవారు అడిగారు. తనకు కష్టకాలంలో సహాయం చేసిన మంచిరాజు పాపయ్యను చెరనుండి విడిపింపుమని వేడుకొన్నారు. ప్రభువులవారు అతని క్షమాగుణానికి సంతోషపడి పాపయ్యను విడిచిపెట్టారు.

మరునాడు ప్రభువులవారు ధనధాన్యములను యిచ్చి రాజశేఖరునితో సేవకులను ధవళేశ్వరము పంపి ఆయన మాన్యాలను విడిపింప జేశారు. కొద్ది పాటి ధనం యిచ్చి కొడుకు సుబ్రహ్మణ్యానికి కూతురు సీతకు పెండ్లి చేయించమన్నారు. శక్తికి మించిన ఖర్చు పెట్టవద్దన్నారు. రాజశేఖరుడు ప్రభువులవద్ద శలవు పుచ్చుకొని భీమవరం చేరారు. అక్కడ సుబ్బరాయుని కాశ్రయమిచ్చిన ముదుసలి వ్యక్తి వచ్చి అరుగుపై కూర్చుని వున్నాడు. ఆయన పేరు భావరాజు సూర్యనారాయణ. తన కుమార్తెను సుబ్బరాయుని కిచ్చి పెండ్లి చేయవలయనని అనుకున్నామని అతడు ఇక్కడికి వచ్చాడని తెలిసిందని అతనిని గురించి వాకబు చేశారు.

రాజశేఖరుడు సుబ్బరాయుని పూర్వవృత్తాంతము సూర్యనారాయణకు చెప్పాడు. ఆయనను నిరాశపరచడం యిష్టము లేక సుబ్రహ్మణ్యానికి పిల్ల నివ్వమని అడిగాడు. సూర్యనారాయణ పరమానంద భరితుడయాడు. ఊరికి వెళ్ళి భార్యను. కుమార్తెను వెంటబెట్టుకొని మధ్యాహ్నానికి తిరిగి వచ్చాడు అందరూ బండ్లపై ప్రయాణం చేసి రాజమహేంద్రవరం చేరారు. అక్కడ నుండి వివాహనిమిత్తం ధవళేశ్వరం పోయారు. రాజశేఖరుని మాన్యాలు, యిల్లు తిరిగి ఆయనకు సమకూరాయి. పేదరికంలో వున్నపుడు మొహం చాటుచేసుకున్న మిత్రులు ఇంటి చుట్టూ తిరగ సాగారు. సేవకులు ఇంటిముందు నిలుచున్నారు. రామశాస్త్రి, సిద్ధాంతి పోటీలు పడి ముఖస్తుతులు చేయసాగారు. కానీ, రాజశేఖరుడు మాత్రం మునుపటి ఔదార్యం చూపడంలేదు. నారాయణమూర్తి, తాను దాచిపెట్టిన దామోదరుని నగలపెట్టెను రాజశేఖరుడుకి అప్పగించాడు. సుబ్రహ్మణ్యానికి పిల్ల నివ్వడానికి వరకట్న మివ్వడానికి ఎందరో ముందుకు వచ్చారు. రాజశేఖరుడు ప్రలోభాలకు లోబడక సూర్యనారాయణగారి కుమార్తె మహాలక్ష్మితో సుబ్రహ్మణ్యం వివాహం జరిపించారు. ఎందరెన్ని చెప్పినా భోగంమేళం పెట్టించలేదు అయిదు దినముల పెండ్లిలో సంభావనలు తగుమాత్రమే ముట్టినవి భోజన సంతర్పణలకు వృధా వ్యయం చేయలేదు.

మూడవరోజున సీతను మేనల్లునికిచ్చి పెండ్లి చేసారు. రెండు పెండ్లిళ్ళలోనూ యోగ్యులకుమాత్రమే సత్కారము జరిగినది.

బదులు కావాలని నారాయణమూర్తి రాజశేఖరుని వద్దకు వచ్చాడు. మిత్రద్రోహికి సహాయం చేయటం అన్యాయమని అతణ్ణి త్రిప్పి పంపారు. అప్పులు చేయటం మాని వేశారు. వున్నంతలో దాన ధర్మాలు చేశారు. ధర్మమార్గంలో నడుస్తూ రాజశేఖరుడు కొంతకాలానికి కాలధర్మం చెందారు. ఆయనవల్ల మేలు పొందినవారు ఇప్పటికీ ఆయనను మర్చిపోలేదు.

# 3

# విషాద సారంగధర

## ( చారిత్రక నాటకం )

ధర్మవరం రామకృష్ణమాచార్యులు

1853- 1912

ప్రథమ ముద్రణ: 1908

# ధర్మవరం రామకృష్ణమాచార్యులు

తాడిపత్రితాలూకా ధర్మపురి అగ్రహారంలో రామకృష్ణమాచార్యులు 1850లో జన్మించారు. తండ్రి కృష్ణమాచార్యులు బళ్లారిలోని వార్డ్లా కళాశాలలో తెలుగు పండితులు

రామకృష్ణమాచార్యులు ఎఫ్ ఏ పరీక్ష ప్యాసయి తాలూకాఫీసులో గుమస్తా ఉద్యోగంలో చేరారు. అయినా అందులో యిమడలేక విరమించుకొన్నారు ప్లీడరు పరీక్షకు కట్టి నెగ్గారు. బళ్లారిలో న్యాయవాదవృత్తిని చేపట్టారు. త్వరలో పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. ప్రభుత్వన్యాయవాదిగా నియమించబడ్డారు.

1866లో తొలితెలుగు స్వతంత్ర నాటకాన్ని ఆయన 'చిత్రనళీయం' పేర ప్రకటించారు. ఆయన సుమారు 30 నాటకాలు వ్రాశారు 14 ముద్రణ భాగ్యానికి నోచుకొన్నాయి. హరిశ్చంద్ర ఆంగ్లనాటకంగా వ్రాశారు.

చిత్రనళీయం, విషాదసారంగధర,పాదుకాపట్టాభిషేకం, ప్రహ్లాద, ప్రమీల, చిరకారి-నాటకాలు ఆయన కీర్తి ప్రతిష్ఠలకు మూలస్తంభాలు రచయిత మాత్రమే గాక ఆయన నటుడు స్వయంగా ఆయన దశరథ, బాహుక, రాజరాజనరేంద్ర పాత్రలను సమర్థవంతంగా పోషించారు

సరసవినోదినీ సభపేర బళ్లారిలో ఒకనాటక సమాజాన్ని స్థాపించి తననాటకాలను ప్రదర్శించారు 1910లో గద్వాల సంస్థానాధీశులు ఆంధ్రనాటక పితామహ'బిరుదంతో సత్కరించారు.

సారంగధరుని కథసుఖాంతమైనట్లు తెలుగునాటప్రచారంలో ఉండగా ఆచార్యులు దుఃఖాంతం చేశారు. ఇతివృత్త నిర్మాణంలోను, రచనావిధానంలోను పాత్రపోషణలో ఆయన కృతకృత్యులయ్యారు. వేదంకాలనాటకంగా సారంగధర 1908 ప్రాంతాలలో ముద్రించారు 'పదిశోకాంత నాటకాలు చేసినంతపని తెలుగువారికి ఇది ఒకటేచేసిందని' సుప్రసిద్ధవిమర్శకులు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి అభిప్రాయం భాషసులభగ్రాంధికమైనా జటిలం

# విషాదసారంగధర గురించి

రాజరాజనరేంద్రుని పాలనలో ప్రజలు సుఖశాంతులతో వర్ధిల్లుతున్నారు. ఆయన కుమారుడు సారంగధరుడు ఆయనకు వివాహప్రయత్నాలు చేసారు రాజుగారు. ఎన్నో చిత్రపటాలు తెప్పించారు. అందులో చిత్రాంగి రాజుగారికి నచ్చింది ఆమెమనస్సు సారంగధరునిపై నెలకొంది బలవంతంగా చిత్రాంగితో రాజరాజనరేంద్రుని వివాహం జరిగింది చంద్రకళతో సారంగధరుని వివాహం జరిపారు. సారంగధరునికి మంచి స్నేహితుడు సుబుద్ధి.

రాజరాజు రాజ్యభారాన్ని 20ఏళ్ల సారంగధరుని కప్పగించాలని యువరాజపట్టాభిషేకం చేయాలనుకొన్నారు. ఆరోజు మహారాజు వేటకు బయలుదేరారు. చిత్రాంగి తానుకూడా వేటకువస్తానని బ్రతిమాలింది. రాజువారించాడు.

సారంగధరుడు తనస్నేహితులతో పావురాలాటకు వీధిలోకి వెళ్లాడు సారంగధరుని పెంపుడుపావురం చిత్రాంగి యింటిలోకి ప్రవేశించింది. పావురాన్ని తెచ్చుకొందామని ఆమెయింటికి వెళ్లాడు. సుబుద్ధి సారంగధరుని ఆమె యింటికి వెళ్లవద్దని చీటీవ్రాసి పంపాడు

ఒంటరిగావున్న చిత్రాంగి దుర్బుద్ధితో సారంగధరునిపై కోరిక ప్రదర్శించింది భోజనానికి ఆహ్వానించింది సారంగధరుడు మరోసారి వస్తానని తప్పించుకోజూశాడు చిత్రాంగి తన మోహాన్ని బట్టబయలు చేసింది సుబుద్ధి మాట విననందుకు సారంగధరుడు బాధపడ్డాడు చిత్రాంగీ సారంగధరుల మధ్య సంభాషణ చెలికత్తెవింది. అతని ఉత్తరీయం చిత్రాంగికి దక్కింది సారంగధరునిపై కక్ష తీర్చుకోవాలని నిశ్చయించుకొన్నది. రాజరాజు వేటనుండి తిరిగివచ్చి చిత్రాంగి ద్వారా విషయాన్ని తెలుసుకొన్నాడు.

న్యాయస్థానంలో నేరారోపణ జరిగింది నిందితునికి శిక్షవిధించారు అరణ్యంలో కాళ్లు చేతులు నరకివేయడమే శిక్ష చిత్రాంగి తన దురవస్థను తానే నిందించుకొంది. రాజుకు చిత్రాంగి ద్రోహబుద్ధి తెలిసి శిక్ష విధించకుండాచేయాలని తాపత్రయపడ్డాడు. అప్పటికే కాలుసేతులు నరికివేశారు చిత్రాంగి ప్రాణాలుకోల్పోయింది. ఈడుగాని వివాహం తగదని రాజరాజు చివరకు పశ్చాత్తపపడ్డాడు.

# 3. విషాద సారంగధర

## సంక్షిప్త గ్రంథం

లోకవిదితమైన పరాక్రమం కలిగిన రాజరాజనరేంద్రుడు ధర్మయుతంగా రాజ్యపాలనం చేస్తున్నాడు. ప్రజలు సుఖశాంతులతో వర్ధిల్లుతున్నారు. ఆయన పాలనలో ఏవిధమైన కొదువలేదు. ఆయన మంత్రి మతిమంతుడు. అతడు సామదాన భేదదండోపాయాలలో ధురీణుడు, రాజనీతికోవిదుడు. పేరుప్రసిద్ధులలో అతనికతడే సాటి. అతనిపై మహారాజు రాజరాజనరేంద్రునకు అపారవిశ్వాసం.

రాజరాజనరేంద్రుని కుమారుడు సారంగధరుడు. అతని కిరవైసంవత్సరాలు. అతనికి వివాహం చేయాలని రాజరాజు కన్యాన్వేషణకై దేశదేశాలకు పురోహితులను పంపాడు. ఒక్కొక్కరికి వేయివరహాలు కానుకగా ఇస్తానని చెప్పిపంపినందువల్ల వారు ఎంతో శ్రమపడి కన్యలను వెతికి వారి చిత్రపటాలు సేకరించితెచ్చి రాజునకు చూపించారు. హిరణ్యకుడు విదర్భరాజ పుత్రిక చంద్రకళాదేవి పటం తెచ్చాడు. విభావసుడు భోజరాజపుత్రిక చిత్రాంగిదేవి పటం తెచ్చారు. చిత్రాంగికి సారంగధరునిపై మమకారము, ప్రేమకలవు. విభావసునితో తన మనసువిప్పి చెప్పి పంపినది. నిన్నుగాక మరియొకరిని వివాహం చేసుకోనని చెప్పమని చెప్పింది.

రాజరాజునకు చిత్రపటం చూసింది మొదలు చిత్రాంగిపై మనసు లగ్నమైంది. చంద్రకళను సారంగధరునకు, చిత్రాంగినితనకు నిశ్చయించి రమ్మని పురోహితులకు పురమాయించాడు. భోజరాజు రాజరాజునకు ఆంతరంగికుడు. రాజుగారికి భయపడి బలవంతంగా చిత్రాంగి నిచ్చి రాజరాజుతో వివాహం జరిపించారు. ఆమె మనస్సు మాత్రం సారంగధరునిపై నెలకొనివుంది. మహారాజు యువరాజ పీఠాన్ని సారంగధరునికి కట్టపెట్టాలని నిశ్చయించి సభలో ప్రకటించారు. తనకు యింతచిన్నవయసులో రాజ్యభారం స్వీకరించడం అంత యిష్టంగా లేదని సారంగధరుడు సవినయంగా మనవి చేశాడు.

''మహారాజా! మీరింకా వంద ఏండ్లు రాజ్యభారాన్ని మోయాలని నా అభిప్రాయం'' అన్నాడు సారంగధరుడు.

''నీవు నా ఆయుర్వృద్ధి కోరడం విహితమే కాని, నీవు రాజ్యపాలనం చేస్తుంటే చూడాలని మాకుంది - అన్నాడు రాజరాజు. నీకు మంత్రులు ముగ్గురు సహాకరిస్తారనీ. సర్వనీతులు బోధిస్తారనీ విశ్వాసం ప్రకటించారు.''

''అయినా మీ మాటను కాదంటున్నందుకు మన్నించండి. ప్రస్తుతానికి రాజ్యభారం అప్పగించేపని కట్టిపెట్టండనీ, మీరు జీవించినంతకాలం మీరే రాజ్యాధికారాన్ని వహించం''డని సారంగధరుడు ప్రాధేయపడ్డాడు.

''ఇరవై సంవత్సరాలు నీకు మరో పదిరోజుల్లో నిండుతాయి. నీ కంటె చిన్న వారు ఎందరో రాజ్యభారం మోస్తున్నారు. నీకు యుక్తవయస్సు వచ్చి పుత్రవంతుడవు కాబోతున్నా''వని రాజరాజు నొక్కి చెప్పాడు.

రాజుగారికి వేటకు వెళ్ళడం పరమప్రియం. వింధ్యారణ్యాలకు వేటకు వెళ్ళి సారంగధరుని జన్మదినోత్సవాలకు ముందు రోజు తిరిగి వస్తామని రాజరాజు చెప్పారు. మరునాడు యువరాజు పట్టాభిషేకం జరిపిస్తామనీ ఏర్పాట్లు చేయమనీ మంత్రులను ఆజ్ఞాపించాడు. రాజుగారు మృగయావ్యసనలోలురై బయలుదేరారు

మహామంత్రి మతిమంతుని కుమారుడు సుబుద్ధి సారంగధరునికి మంచి స్నేహితుడు. వారిరువురు ప్రాణంలో ప్రాణంగా జీవిస్తున్నారు. మంచి గుణ సంపత్తిగల సుబుద్ది సారంగధరుని స్నేహితుడు కావడం యువరాజు అదృష్టంగా భావించాడు. ఎక్కడికి వెళ్ళినా వారిరువురు కలిసి వెళ్ళేవారు. సుబుద్ధి మాటను యువరాజు ఎన్నడు జవదాట లేదు. శుక్లపక్షచంద్రుని వలె దిన దిన ప్రవర్ధమానుడవుతున్న యువరాజును అంటిపెట్టుకొని సుబుద్ధి తిరగసాగాడు. వారి అన్యోన్యమైత్రి ప్రజల ప్రశంసకు పాత్రమైంది.

చిత్రాంగి తన రాచనగరులో ఒంటరిగా పరిపరివిధాల తల పోసుకొంటోంది సారంగధరునిపై ఆమె మోహాతిశయం రోజు రోజుకు

అధికమవుతోంది. మనసుకు ఎంత కళ్ళెంవేసినా ఆగడం లేదు. సారంగధరుని తప్ప మరియొకరిని పెండ్లాడనని పట్టుపట్టింది. కాని తండ్రి బలవంతంగా పెండ్లి చేసినాడు. సారంగధరుడు సార్థకనామధేయుడు. షోడశకళాప్రపూర్ణుడు. అతనిని ఎలాగైనా తాను లోబరచుకోవాలని చిత్రాంగి ఆలోచింపసాగింది. తల్లితో సమానమైన తనతో పొందు అతడు అంగీకరింపడు. మహాద్రోహాము పాపము అయిన ఆ పనికి చిత్రాంగి సమాయత్తమైంది

మహారాజు చిత్రాంగిని చూడటానికి అంతఃపురంలో రాణీవాసంలో అడుగుపెట్టారు. తన చేతిలోవున్న సారంగధరుని చిత్రపటాన్ని ఎదపైదాచుకొని చిత్రాంగి పవ్వళించింది రాజరాజు రాగి మేలిముసుగును తొలగించి బుజ్జగించాడు. తాను మన్మథాగ్నితప్తుడనయ్యానని తన్ను కాపాడమని వేడుకొన్నాడు. ఒక్కరాత్రికే తాను విరహాగ్ని అనుభవించానని చిత్రాంగి నయగారాలు వొలకబోసింది. తాను గత రాత్రి రత్నాంగితోకాక సారంగధరుని యింట వుండవలసి వచ్చినదని రాజరాజు ప్రాధేయపూర్వకంగా చెప్పాడు

ఇంతలో రాజుగారు వేటకు బయలుదేరడానికి భేరి మ్రోయించారు. చిత్రాంగి తానుకూడా వస్తానని బ్రతిమాలుతుంది. భీకరమైన అరణ్యంలో భయంకరమృగాలు వుంటాయనీ, తాను పరుగులు తీస్తూ వేటాడుతుంటాననీ చిత్రాంగిని రావద్దని వారిస్తాడు రాజరాజు. ఆమె కన్నీటితో వీడ్కోలు చెప్పింది.

ఆ వియోగాన్ని భరింపరానంతగా అభినయిస్తూ చిత్రాంగి రాజుతో ప్రవర్తించింది. పది రోజులు రాజు యికరాడు. తనకేమో సారంగధరునిపై మతిభ్రమ. ఎలా గడపాలో తెలియక ఆమె కళవళపడింది.

సారంగధరుని ఇంటిలో సుబుద్ధి, సారంగధరుడు చదరంగమాడు కొంటున్నారు. రాజు వేటాడబోయి ఏడురోజులైంది. రెండు, మూడు రోజులలో తిరిగి రాగలరు. ఆయనరాగానే సారంగధరునికి యౌవరాజ్య పట్టాభిషేకం చేస్తారు. అప్పుడిలా స్వేచ్ఛగా ఆటలాడుకోవడం కుదరదని సారంగధరుని బాధ తన కిష్టమైన పావురముల ఆట ఆడుకొనేందుకు మనసుపడ్డాడు సారంగధరుడు. అది వుచితం కాదని సుబుద్ధి చెప్పినా ఆయనకు దానిపై

కోరిక తీరలేదు రేపు ఆ ఆటకు సిద్దం కమ్మని సారంగదరుడు చెప్పాడు ఏదో సాకుచెప్పి సుబుద్ది తాను రానని ఖండితంగా చెప్పాడు.

చిత్రాంగి తన రాచనగరులో సారంగదరునిపై ప్రేమతో కుమిలి పోతోంది ఎలానైనా అతణ్ణి తన అభ్యంతరమందిరంలోకి వచ్చేలా ఆలోచన పన్నసాగింది రాజు వూరులోలేని ఈ ఎనిమిది రోజులలో అతడు రాలేదు చివరకు అతనికొక ఉత్తరం తయారు చేసింది అది రెండర్థాలు వచ్చేలా ఉంది విబావసుని ద్వారా తాను మున్నెన్నడో తన మనసు విప్పి చెప్పిపంపింది తనతో సమానమైన రూపవయోవిలాసాలు కలిగిన ఆ సారంగదరుడు తనను వలచునని తలపోసింది ఉత్తరం ఉపాయశాలినియైన దాసి కమల ద్వారా సారంగదరునికి పంపినది

సారంగదరుడు తన స్నేహితులతో పావురములాట ఆడుతు వీదిలో పరుగులు తీస్తున్నారు ఒక పావురం ఆకాశంలో ఆటలాడుతూ చిత్రాంగి యింటిపై తటాలున వాలింది. అది సారంగదరుని పెంపుడు పావురం పావురం గభాలున లోపలికి ప్రవేశించింది ఎవరినైనా పావురం కోసం పంపితే పినతల్లి అమర్యాదగా బావించవచ్చు తానే స్వయంగా వెళ్ళి పావురం తెచ్చుకొందామని ఉత్తరీయం తీసుకురమ్మని సేవకుణ్ణి పంపాడు సుబుద్ధి వద్దనుండి ఒక సేవకుడు ఒక చిట్టి కాగితంపై జాబు తెచ్చి సారంగదరుని కిచ్చాడు.

తాను అభ్యంజనం చేసుకొంటున్నాననీ, తాను వచ్చేంతవరకు సారంగదరుడు చిత్రాంగి మేడలో ప్రవేశింపరాదని జాబులో వ్రాసి పంపాడు దానికి నూనె మరకలున్నాయి సేవకుడు ఉత్తరీయం తెచ్చి యిచ్చాడు సుబుద్ధి పరుగులు తీస్తూ వచ్చాడు

పావురంకోసం పినతల్లి యింటిలోనికి రాజుగారులేనపుడు వెళ్ళుట మంచిది కాదని సారంగదరుని సుబుద్ధి వారించాడు. కారణం చెప్పమని సారంగదరుడు నిలదీశాడు

'చిత్రాంగిదేవి పడుచుదనంలో ఉంది ఈ రోజు జరిగిన సంగతులన్నీ అనుమానాలకు దారి తీస్తున్నాయి చిత్రాంగిదేవి యింటి దాసి సారంగధరుని యింటి కేదో మిషమీద వచ్చింది పావురాల ఆట జరిగే సమయంలో చిత్రాంగిదేవి మేడపై నుంచొని చూస్తోంది మేడపై వ్రాలిన పావురం బయటకు రావడంలేదు అందువల్ల మీరు వెళ్ళడం బావ్యం కాద'ని సుబుద్ధి సారంగధరునికి చెప్పి చూశాడు.

'నీ వూహాలు అనుచితంగా ఉన్నాయి తల్లి యింటికి కొడుకు పోవడంలో తప్పులేద'ని సారంగధరుడు వాదించాడు.

ఒంటరిపాటుగా వున్న స్త్రీలవద్దకు యువకులు పోవడం బావ్యం కాదన్న సుబుద్ధి మాటలు లక్ష్యపెట్టకుండా సుబుద్ధిని మందలించి సారంగధరుడు మేడలోనికి వెళ్ళాడు

సారంగధరుడు లోపలికి ప్రవేశించి తన అవివేకాన్ని నిందించు కొన్నాడు పావురంకోసం ఒంటరి ప్రదేశానికి రావచ్చునా? యింత దూరం వచ్చి వచ్చిన విషయం చెప్పకుండా వెళ్ళడమూ బావ్యం కాదని తటపటాయిస్తున్నాడు దాసి కనిపించింది ఆమె వెంటవెళ్ళగా పినతల్లి కనిపించింది

భక్తిపూర్వకంగా నమస్కారం చేశాడు సారంగధరుడు

'సమవయస్కులమధ్య నమస్కారాలు ఎందు'కంది చిత్రాంగి

సాహసించి రాజులేని సమయంలో లోపలికి వచ్చినందుకు మన్నించమన్నాడు తాను యిష్టపడిన పావురం యిచ్చి పంపమని ప్రాదేయపడ్డాడు రాజును ఒక రకంగా, నిన్ను ఒక రకంగా వేరుగా చూస్తానా? అని ఆమె చమత్కరించింది

చిత్రాంగి సారంగధరునిపై తనకుగల చిరకాలప్రేమను బహిర్గతం చేసింది దాకరాక వచ్చిన నీవు భోజనం చేయకుండా పోవడం బావ్యంకాదని చెప్పింది తండ్రి వచ్చిన తర్వాత తాను వచ్చి భుజిస్తాననీ, తన పావురం తనకిస్తే

వెళ్ళిపోతాననీ సారంగధరుడు బ్రతిమాలాడు. కనీసం ఫలహారమైనా చేసి వెళ్ళమని కోరింది. ఫలహారమయినా తర్వాత వచ్చి భుజిస్తానన్నాడు.

చిత్రాంగి ఆ నిరాదరణకు అలుక వహించింది. నా కోర్కె తీర్చని వానితో మాటలాడనని బింకాలుపోయింది. సారంగధరుడు మెత్తబడ్డాడు. ఫలహారం త్వరగా యిస్తే వెళ్ళిపోతానన్నాడు. సరే కవచాదులు వదలిపెట్టి రమ్మని కోరింది చిత్రాంగి. సారంగధరుని నెమ్మదిగా పడకటింటికి చేర్చింది. సారంగధరుడు యింత మొహమాటపడదలచుకోలేదు. పినతల్లి తనపై చూపుతున్న అనురాగానికి ఆశ్చర్యపోయాడు

చిత్రాంగి మనసు బయటపెట్టింది. ఈ పడకయిల్లు నీదిగా చూసుకోమని కోరింది. సారంగధరుడీమర్మగర్భితమైన మాటలేలయని ప్రశ్నించాడు. చిత్రాంగి గత వృత్తాంతాన్ని వివరించింది. పెండ్లికి ముందు కన్యాన్వేషణ సమయంలో విభావసునికి తన మనసు విప్పి చెప్పిన మాటల ప్రస్తావన తెచ్చింది. సారంగధరుడు తనతో ఎవ్వరూ ఏమీ మాటాడలేదని నిక్కచ్చిగా చెప్పాడు. 'రూపవతియైన నీ భార్య చంద్రకళ, నేను సమవయస్కులము. నన్ను సమభావంతో చూడ'మని చిత్రాంగి కోరింది. 'నీవు పరస్త్రీలతో విహరించి యుండలేదా' అని వ్యంగ్యంగా మాటాడింది. ఇదుగో ఈ చిత్రపటాలు చూసి వెళ్ళమని కృష్ణుని రాసక్రీడల చిత్రపటాలను చూపించింది. తారా చంద్రుల విలాసాలను చూపించింది. ఇక లాభంలేదని నేరుగా పలికింది. 'నేనే నిన్ను కామించి పైబడితే ఏం చేస్తా'వని అడిగింది. సారంగధరుడు 'హరి! హరీ!' యని చెవులు మూసుకొన్నాడు.

చిత్రాంగి ఇంక లాభం లేదనుకొంది. 'వివాహానికి ముందునుంచి నేను నీపై మోహపడ్డాను. నీ చిత్రపటం చూసింది మొదలు నిన్నే పతిగా భావించాను. నా కర్మకొద్ది నీ తండ్రితో వివాహమైంది. మీ తండ్రివలన భయంతో మా తండ్రి ఈ ఏర్పాటు చేశాడు. నేనెన్ని విధాల బ్రతిమాలినా ప్రయోజనం లేక పోయింది. శరీరం అతని వశమైనా మనసు నీపైవుంది. అందువలన నీవు వావివరసలు భావించనవసరం లేద'ని చిత్రాంగి పలువిధాల ప్రాధేయపడింది.

సారంగధరుడు తన బుద్ధి తక్కువతనానికి చింతించాడు. చిత్రాంగి తన మనోవ్యథను బహిర్గతం చేసింది. 'సారంగధరా! ఇన్నాళ్ళు ప్రాణాలు ధరించి ఉన్నానంటే నీ కోసమే! ఎన్నోరోజులు ఆలోచించి ఈ విధంగా నా మనసు ఎరుకపరిచాను. నా మనస్సాక్షిగా, దైవ సాక్షిగా నిన్నే మోహించాను. కావాలంటే చూడమని సారంగధరుని చిత్రపటాన్ని తన పడకటింటిలో చూపించింది. దీనిని నా ఎదపై పదిలంగా వుంచుకొని జీవిస్తున్నాను. నీవు నా మాటకాదంటే ప్రాణత్యాగం చేస్తాను. నన్ను మన్మథుని బారి నుండి రక్షింప'మని వేడుకొంది.

సుబుద్ధి మాట విననందుకు సారంగధరుడు బాధ పడ్డాడు. ఇంత పాపపు మాటలు వినవలసి వచ్చినదిగదా అని తన చెవులను తానే నమ్మలేక పోతున్నానని పినతల్లికి మ్రొక్కాడు.

మగవానికి పాపమేలేదు, ఆపాపమేదైనా నేను భరిస్తానని చిత్రాంగి వాదించింది. తన వాదనకు తోడుగా పూర్వగాథలను త్రవ్విపోసింది. ఇది దుర్బుద్ధికాదనీ, మనకులపెద్ద అయిన కుంతీదేవి సూర్యుని, సూర్య తనయుడైన యముని పొందింది. అందువలన వావి వరసల విషయం మరిచిపొమ్మంది.

'అమ్మా! ఈ మాటలెందుకు? నీ మనసు మరలించుకో! పావురం యివ్వకపోయినా వెళ్ళిపోతా'నని సారంగధరుడు వేగిర పడ్డాడు. తండ్రితో ఈ విషయం చెప్పవలసి వస్తుందన్నాడు. పాదాలపై బడి వేడబోయిన పినతల్లిని తొలగద్రోసి అంతఃపురంనుండి బయటపడ్డాడు.

దూరం నుండి చిత్రాంగిసారంగధరుల అవస్థను దాసి కమల గమనించింది. ఉత్తరం యిచ్చివద్దామని వెళ్ళి సారంగధరుడు కనిపించక తిరిగి వచ్చింది. చిత్రాంగి జరిపిన సంభాషణ అంతావిన్నది. సారంగధరుని ఉత్తరీయం పట్టుకొని చిత్రాంగి బలాత్కరించడం కనులార చూసింది. అతడు వద్దని దుఃఖపడటం గమనించింది. చిత్రాంగిసారంగధరుల మధ్య జరిగిన సంభాషణ విని ఆశ్చర్యపోయింది. చాటున నిలబడి అంతా పరికించింది. పాపపుణ్యాలు లెక్కింపననీ, చచ్చిన తర్వాత ఏమైనా కానీ ఇప్పుడు నీ పొందు కావాలని

చిత్రాంగి అనడం ఆమె చెవులబడింది. సారంగదరుడు 'హరి హరీ!' యని తొలగద్రోసి పోవడం తెలుసుకొంది మనవంశంలో ఇలాంటి చెడు ప్రవర్తన ఎన్నడూ లేదని సారంగదరుడు మందలించాడు నరకం పాలవుతామని హెచ్చరించాడు చివరకు ఆమెను వదిలించుకొని వెళ్ళిపోయాడు

చిత్రాంగి నివ్వెరపోయింది గాంభీర్యం కోల్పోయి మనోధర్మాన్ని దాచుకోలేక అలా ప్రవర్తించినందుకు బాదపడింది చివరకు ఆత్మహత్య చేసుకోవాలనుకొంది. దీరగుణం కోల్పోయినందుకు చింతించిది చివరకు సారంగధరునిపై తనకసి తీర్చుకోవాలని నిర్ణయించుకొంది రాజు తాను చెప్పినదంతా నమ్ముతాడు. కాబట్టి సారంగదరునిపై మోహాన్ని క్రోధంగా మలచుకొంది. దానికి కావలసిన పన్నాగం పన్నింది

కమల జాబు చదివి తనలో ఆనందపడింది ఇంతకాలం చిత్రాంగి తనపై పెత్తనం చెలాయించింది ఇప్పుడు చిత్రాంగిని తన దాసిగా చేసుకోగల సాక్ష్యం తనచేతిలో ఉందని కమల ఉబ్బిపోయింది ఠీవిగా అంతఃపురంలోకి అడుగుపెట్టింది

చిత్రాంగి కలవరపడింది సారంగధరునికి జాబు ఇచ్చావా? అని కమలను అడిగింది సారంగదరుడింట్లో లేదనీ, పోకముడిలో దాచుకొని తెచ్చిన ఉత్తరం జారిపడిపోయిందనీ బొంకింది కమల చిత్రాంగికి చిరాకు వేసింది జాబు యివ్వకపోతే శిరచ్ఛేదం చేయిస్తానని కమలను బెదిరించింది

రాజరాజు వేట ముగించుకొని నగరుకు తిరిగి వచ్చాడు నేరుగా చిత్రాంగి అంతఃపురమందిరంలోకి అడుగు బెట్టాడు తనకు ఎదురు వచ్చి ఆశ్లేషసౌఖ్యాన్ని కలిగించే చిత్రాంగి ఈ రోజు ఎందుకో కనిపించలేదు లోపలికి వెళ్ళి పడకటింట్లో గాసిపడి పండుకొనివున్న చిత్రాంగిని చూసి ఆందోళన చెందాడు చిక్కుపడిన జుట్టు, వాడిన నగుమోము, కందువారిన శరీరము చూసి రాజు మనస్సు తల్లడిల్లింది కన్నీరుదారలుగా స్రవిస్తోంది ఈ బెంగపాటుకు కారణమేమో తెలుసుకోవాలనుకొన్నాడు

చిత్రాంగిని ప్రశ్నిస్తే ఆమె వగలు పోయింది తనకు జరిగిన అవమానానికి

ప్రతీకారం తీర్చుకోవాలంటే సమీప బంధువుల మనసు నొప్పించవలసి వస్తుందని దుఃఖించింది

'నిన్ను కలతపెట్టిన ఆ దుర్మార్గుడెవరో చెప్పు'మని రాజు బలవంతం చేశాడు 'నిన్ను బాధించినవాడు సోదరుడైనా, కుమారుడైనా వదలి పెట్టేది లే'దన్నాడు

చిత్రాంగి పథకం ఫలించింది తన పన్నాగం నెరవేరే అవకాశం లభించింది తనను అంతఃపురంలో ఒక దుండగుడు వలదన్నను వినక బలాత్కరించాడని చెప్పి ఏడ్చింది

రాజరాజునకు క్రోధాగ్ని ప్రజ్వరిల్లింది చిత్రాంగిని ఆ విధంగా కించపరచి బలాత్కరించిన తులువను చంపుదునని శపథం చేశాడు చెల్లని ప్రతిజ్ఞలు చేయవద్దని చిత్రాంగి రెచ్చగొట్టింది రాజు మనసు కుతకుతలాడుతోంది ఆ దుర్మార్గుడెవరో తెలుసుకోవాలని ఉబలాటం ఎక్కువైంది

సారంగధరుడు ఈ అఘాయిత్యానికి వొడిగట్టాడనీ, నిన్నటినుండి వావివరుసలు మారిపోయాయని రాజు తనకు మామ అవుతారనీ చిత్రాంగి బొంకింది.

ఆమాటవిని సారంగధరుడు 'హా! శ్రీహరీ!' అని మూర్ఛిల్లాడు చిత్రాంగి మరింత దుఃఖాన్ని అభినయిస్తూ సారంగధరుని దుందుడుకుతనాన్ని చెప్పికోపాన్ని యినుమడింపజేసింది

''తల్లినని మొరపెట్టుకొన్నా అతడు వినలేదనీ, బ్రతిమాలినా ప్రయోజనం లేక పోయిం'దనీ చిత్రాంగి కపటవాక్యాలు నూరిపోసింది మీకు ఎందరో సతులు లభిస్తారుగానీ, ఒక్కగానొక్క కుమారుడు లభించడం కష్టం కాబట్టి అతణ్ణి క్షమించమని కోరి ఆమె అక్కడనుండి వెళ్ళిపోయింది

రాజరాజు ఆ మాటలు నమ్మాడు సారంగధరుని ద్రోహచింతకు బాధపడ్డాడు. పూజలు చేసి కన్న ఒక్కగానొక్క కుమారుడు యిలా చేశాడని కుమిలిపోయాడు

రాజు వెంటనే సేవకులను బిలిచి ఆ రాత్రి సభ ఏర్పాటు చేశాడు. నయార్ణవ, నీతిజ్ఞ, మతిమంతులనే మంత్రులను సభకు ఆహ్వానించాడు.

రాజరాజనరేంద్రుడు సభలో కొలువుదీరాడు. మంత్రులు యథాస్థానాలలో ఆసీనులయ్యారు. చిత్రాంగిదేవి చేసిన నేరారోపణ గురించి సారంగధరునికి లేఖ వ్రాసి పంపారు. అతని ప్రత్యుత్తరం కోసం కొలువుకూటం ఎదురు చూస్తోంది. రాజు మతిమంతుని అభిప్రాయం అడిగాడు. సారంగధరుడిలాంటి పని చేశాడని నమ్మలేకున్నానని మంత్రి సవినయంగా చెప్పాడు. చిన్నప్పటినుండి అతని ప్రవర్తన తెలిసిన వారెవ్వరు నమ్మలేరని విన్నవించాడు.

ఇంతలో సారంగధరుని ప్రత్యుత్తరం తెచ్చాడు సేవకుడు. మతిమంతుడు రాజుగారికి ఉత్తరం చదివి వినిపించాడు. ఇలా జరుగుతుందని తాను కలలో కూడా ఊహించలేననీ, కన్నీరు మున్నీరుగా విలపిస్తూ సమాధానం వ్రాస్తున్నాననీ సారంగధరుడు సమాధానమిచ్చాడు.

ఈ విషయంలో తానేమీ చెప్పజాలననీ, ప్రమాణపూర్వకంగా తనపినతల్లి ఏమి చెప్పినా దానికి తాను బద్ధుడననీ, ఆమెను మళ్లీ నిజానిజాలు అడగమనీ సారంగధరుడు ఉత్తరంలో వ్రాశాడు.

ఈఉత్తరం చదివితే సారంగధరుడు నిరపరాధియని తోస్తోందని మంత్రి స్పష్ట పరిచాడు. రాజు దాని నంగీకరించలేదు. అయినా వారికోరిక మేరకు చిత్రాంగీదేవిని మళ్లీ అడగటానికి రాజు అంగీకరించాడు. వారిని ముప్వరిని గోప్యమైన ప్రదేశంలో వినికిడి దూరంలో ఉంచి తాను చిత్రాంగిని ప్రశ్నించడానికి రాజు బయలుదేరాడు.

ముగ్గురుమంత్రులు వినికిడి దూరంలో నిలబడ్డారు. రాజరాజు చిత్రాంగి నగరులో ప్రవేశించి ఆమెను ప్రశ్నించసాగాడు 'దేవీ! జరిగిన దంతా ప్రమాణపూర్వకంగా చెప్పమని అడిగాడు దైవసాక్షిగా చెప్పమన్నాడు. చిత్రాంగి మాటలధోరణి మార్చివేసింది. ఏమీ జరగలేదనీ, సారంగధరుడు నిరపరాధి అనీ, అపరాధమంతా తనదేననీ తనను శిక్షింపమనీ చిత్రాంగి ప్రాధేయపడింది.

బహుశా తనపై జాలితో చిత్రాంగి అలా అంటున్నదని రాజు అపోహపడ్డాడు. చిత్రాంగిని నిజం చెప్పమని నిలదీశాడు. అవమానభారంతో క్రుంగిపోతున్న నన్ను ఇలా నిలదీసి అడగడం ధర్మంకాదనీ, ఈఉత్తరీయం దానికి సాక్ష్యమని పరుపుకిందవున్న ఉత్తరీయం చూపించింది. కరవాలంతో తనను చంపమనీ, కొడుకుని క్షమింపమనీ దుఃఖిస్తూ మూర్ఛిల్లింది.

రాజనరేంద్రుడు ఉత్తరీయం ఆనవాలుగా తీసుకొని చూపించి మంత్రులను దీనికేమి సమాధానమిస్తారని ప్రశ్నించాడు. ఇది చూస్తే ఇంక సందేహించనవసరం లేదనే నిర్ధారణకు వచ్చాడు రాజు.

రాజశాసనం తయారు చేయించి సేవకుని చేతికిచ్చి తలారి వీరసేనునికిచ్చి పంపి తనమాటగా ఇలా అన్నాడు రాజనరేంద్రుడు: ''సారంగధరుని రాజకుమారుడని కనికరము జూపక నిర్బంధించి న్యాయస్థానానికి తీసుకొనిరండి.న్యాయాధికారులకు వర్తమానంపంపండి. ముగ్గురు మంత్రులు రేపు న్యాయసహాయులుగా వ్యవహరిస్తారు! అని చెప్పి రాజు నిష్క్రమించాడు.''

సారంగధరుని కాళ్ళు చేతులు కట్టివేసి కారాగృహంలో బంధించారు అతడు చింతాక్రాంతుడై తనకు కలిగిన దురవస్థకు దుఃఖించసాగాడు పావురాల ఆటకు పూనుకోవడమే తప్పు. ఒకవేళ ఆడుకున్నా ఆ పావురం పినతల్లి యింటికి పోవడం దురదృష్టకరం. దానిని తీసుకురావడానికి ఆమె యింటికి తాను వెళ్ళడం అంతకన్నా హానికరం. సుబుద్ధి మాటలు పెడచెవిని పెట్టడం, పినతల్లికి అధర్మబుద్ధి కలగటం దయనీయం. తాను ఇంద్రియనిగ్రహంతో ప్రవర్తించనందుకు తనకిట్టి అపవాదు రావటం బాధాకరం. తన తండ్రి ఆమె మాటలు నమ్మటం మరింత అవమానకరం. ఏది ఏమైనా నిజాన్ని రాజుకు చెప్పి పినతల్లి సిగ్గుపడేలా చేయాలి అని నిశ్చయించుకున్నాడు సారంగధరుడు. తలారిని పిలిచాడు. ఇంతలో మనస్సు మార్చుకున్నాడు మిన్ను విరిగిమీద పడ్డా పినతల్లికి అపవాదు తేవటం ధర్మంకాదనుకున్నాడు. మనస్సు పదిలపరచుకున్నాడు.

ఇంతలో స్నేహితుడు సుబుద్ధి సారంగదరుని వద్దకు వచ్చి అతని దురవస్థను చూసి బాదపడ్డాడు సుబుద్ధి చెప్పిన మాటలు విననందుకు తనకు తగిన శాస్తి జరిగిందని సారంగధరుడు కుమిలి పోయాడు సుబుద్ధి సారంగధరుని ఓదార్చాడు న్యాయవిమర్శన సమయంలో జరిగిన విషయం బయటపడుతుందని సాక్ష్యాదారాలు చూపాడు. నీవు చెప్పక పోయినా నేను నిజం కనుగొన్నానని ఖండింతంగా చెప్పాడు అందుకు ప్రధాన సాక్ష్యంగా దాసి కమల ఉపయోగపడుతుందని చెప్పాడు చిత్రాంగి వ్రాసి ఇచ్చిన జాబు, కమల కనులారా చూచిన వృత్తాంతము విభావసుని సాక్ష్యము రేపు న్యాయస్థానంలో నీపై అపవాదుని తొలగిస్తాయని సుబుద్ధి చెప్పాడు

''ఈ విషయంలో సుబుద్ధి చొరవజూపరాదనీ, పినతల్లికి అపవాదం రావడం తనకిష్టం లేదనీ అందువల్ల ఈ సాక్ష్యాలు బయట పెట్టవద్దని సుబుద్ధి వద్ద సారంగదరుడు ప్రమాణం చేయించుకున్నాడు '' మాటకుకట్టుబడి సుబుద్ధి నోరువిప్పలేదు పినతల్లికి అపవాదు రావడం తనకిష్టం లేదని సారంగదరుడు ఖండితంగా చెప్పాడు సారంగదరుని అజ్ఞతకు సుబుద్ధి వాపోయాడు ''నీమీది అపవాదు సంగతి ఆలోచించవేమని ఏడుస్తూ అడిగాడు అపరాధం తెలియని నీవు మౌనం వహించడం బావ్యం కాదనీ పినతల్లి కోసం ఈవిధానం అవలంబించడం మంచిదికాదనీ నిన్ను చంపడానికి సాహసించిన అమెపై కనికరంచూపనవసరం లేదనీ దర్మమార్గం అవలంబించమనీ సుబుద్ది కోర్గాడు నీ ఉరిని నీవే కోరుకోవడం ఘోర'' మన్నాడు ప్రమాణం గుర్తుకు తెచ్చి సారంగదరుడు సుబుద్ధి కాళ్ళనోరు కట్టివేశాడు

రాజరాజనరేంద్రుడు న్యాయస్థానంలో కొలువుదీరాడు న్యాయాధిపతి రాజు, మతిమంతుడు, నీతిజ్ఞుడు, నయార్ణవుడు అను ముగ్గురు మంత్రులు న్యాయసహాయులుగా వచ్చారు నిందితుడుగా సారంగధరరుడు నిలబడ్డాడు

అపరాదస్థాపకుడైన ఉద్దండుడు సారంగధరునిపై నేరారోపణ చేశారు

''మహామహులారా! నేనిప్పడు చెప్పబోయే ఘోరాపరాదం లోకంలో కనీవినీ ఎరుగరు ఇప్పుడు నిందితుడైన సారంగదరునికి చిత్రాంగిదేవి పినతల్లి

ఆమె రాజుగారి రెండవ భార్య రాజుగారు వేటకోసం పదిరోజులు వెళ్ళారు ఆయన లేని సమయం చూసి ఇతడామె యింటికి బోయి ద్రోహబుద్ధితో ఆమెను బలాత్కారం చేశాడు దానికి సాక్ష్యం చిత్రాంగిదేవి శారీరక పరిస్థితి ఆమె రాణి అందువలన ఆమె సాక్ష్యం మరియొకరి ద్వారా వినవలెను'' అంటూ ఆమె మాటలను అతనిచేత చెప్పించాడు:

''భోజరాజకుమార్తెనైన 16 సంవత్సరాల చిన్నదానిని, రాజరాజనరేంద్రుని భార్యనైన నేను ప్రమాణ పూర్వకంగా చెబుతున్నాను నావిభుడు ఇంటలేని సమయంలో ద్వాదశి గురువారం మద్యాహ్నం ఇరవై గడియల కాలంలో సారంగధరుడు నా యింటికి వచ్చాడు నన్ను మోహించినట్లు మాట్లాడాడు నేనెంత బ్రతిమాలినా వినక నన్ను చెరిచాడు నేను స్పృహకోల్పోయి శుక్రవారం ఉదయం వరకు శుష్కించి పడిపోయాను ఆ సాయంత్రం నాదుడు రాగానే ఆయనకు నా గాయాలు చూపి, నావడక్పై పడివున్న వాని ఉత్తరీయం చూపించాను'' అని సారంగదరుని ఉత్తరీయం సాక్ష్యంగా చూపారు

ఎన్ని మాటలు ప్రశ్నించినా సారంగదరుడు నోరెత్తి సమాదానం ఇవ్వడు చంపక అనేదాసి చిత్రాంగి స్పొమ్మసిలిపడి యుండగా చూశాననీ, సారంగదరుడు రాణివాసంలోకి వచ్చినపుడు తాను, కమల అనే మరోదాసి ఉన్నామనీ చెప్పింది ఇద్దరు చెలికత్తెలను రాణి ఏవో పనిమీద బయటకు పంపివేసినట్లు చంపక చెప్పింది. సారంగధరుడు చిత్రాంగి ఇంటినుండి బయటకు వచ్చునపుడు చూసిన వసుదేవుడు తన సాక్ష్యం చెప్పాడు

సారంగదరుడు తనసాక్ష్యంలో తనపై అబియోగం మోపబడటానికి దైవయోగమే కారణమనీ చిత్రాంగిని తాను బలాత్కరించునంతటి పాపిని కాదనీ చెప్పాడు

ఇంతలో సుబుద్ధి నెత్తినోరు కొట్టుకొంటూ న్యాయస్థానంలోకి వచ్చాడు చిత్తచాంచల్యం కలిగినట్లు ప్రవర్తించ సాగాడు అతడిని ఉన్మాద వైద్యశాలకు చేర్చమని రాజుగారు సెలవిచ్చారు

అయితే ఈ అభియోగానికి సుబుద్ధి ప్రదాన సాక్ష్యమనీ అతని పిచ్చి కుదురునంతవరకు కేసు వాయిదా వేయాలనీ సదయుడు కోరాడు రాజు ఒక్కక్షణం కూడా వాయిదా వేయడానికి వీలులేదనీ వాదోపవాదాలు పూర్తి చేయమని ఆజ్ఞాపించారు

అపరాద స్థాపకుడైన ఉద్దండుడు అపరాదాన్ని ఈవిదంగా నిరూపించాడు కొలువులో

“ రాజా! ఆలకించండి! ఈవిదమైన సంఘటన పూర్వం ఎన్నడూ జరగలేదు తలపోయడానికే భయంకరంగా ఉంది నిందితుడు రాజకుమారుడని ఏమాత్రం కరుణ వహించడానికి వీలులేదు అపరాది ఎవరైనా కావచ్చు ఎంతటివాడైనా కావచ్చు అలాంటివాడిని కరుణిస్తే సజ్జనులకు మనఃక్లేశం కలుగుతుంది స్వయంగా రాజుగారే న్యాయాధిపతిగా కూర్చొన్నారు నిందితుడు పినతల్లిని పట్టిన నేరం ఆరోపించబడింది చిత్రాంగిదేవి యింటికి కవచం, కిరీటము, ఉత్తరీయం దరించి వెళ్లిన సారంగదరుడు సాయంత్రం తిరిగి వెళ్లేటప్పుడు అవి ఏవీలేవు అందుకు చిత్రాంగి, ఆమెదాసి, వసుదేవుల సాక్ష్యం ఉంది నిందుతుడు స్వయంగా అంగీకరించాడు నేరం తప్ప మిగిలిన వాటిని నిందితుడు సమ్మతించాడు

నిందితుడు చేసిన నేరానికి చిత్రాంగి కంటె మరొక సాక్షి అక్కరలేదు పావురంకోసమే అంతఃపురంలోకి వెళ్లాడనుకొందాం కవచాదులు తీసివేయనవసరం లేదు రాజుభార్య స్వయంగా తమకు జరిగిన అన్యాయం, అపకీర్తి, మానహాని వెల్లడించింది రాజుగారు లేని సమయంలో సారంగధరుడు ఇలాంటి సాహసానికి వొడిగట్టాడు కాబట్టి ఇతనికి శిరచ్ఛేదమే దండనం” అని ఉద్దండుడు తన వాదన ముగించాడు

నిందితుని పక్షాన నియమింపబడిన సదయుడనే న్యాయవాది తన ప్రతివాదాన్ని ఇలా కొనసాగించాడు

"కొలువులో ఉన్న మహాజనులారా! నిందితుడు జరిగిన విషయం సాకల్యంగా చెప్పడానికి ముందుకు రావడంలేదు అందువల్ల నావాదనలో ఎవరినైనా నొప్పించక తప్పదు పెక్కురు నిందితులు శిక్షపడకుండా తప్పించుకొన్నా ఫర్వాలేదుగాని, ఒక నిరపరాధి శిక్షితుడు అయితే అది మహాపాపం! అందువలన జాగ్రత్తగా ఆలోచించండి

పగటివేళ ఈపాపకార్యానికి కవచాదులతో వెళ్తాడా? పాపకార్యం చేసి వెళ్తుంటే రాచవీదిలో నడిచివెళ్తాడా? సారంగదరుడు వెళ్లిన సమయంలో చిత్రాంగిదేవి బయట భవనంలో ఉంది ఆమెను లోపలికి ఎత్తుకపోయాడా? మరి కవచాదులు ఏమైపోయాయి? బలాత్కారం చేయదలచుకొంటే లోపలికి తీసుకెళ్లాలా? ఈ నిందను చిత్రాంగి స్వయంగా అతనిపై మోపింది

"నిందకు కారణాలు రెండు సారంగదరుడు స్వయంగా నేరం చేశాడు రెండు చిత్రాంగి నిందితుని పొందగోరి, అత నంగీకరించకపోతే దానికి భయపడి నేరం అతనిపై మోపడం దానికి దోహదంగా కొన్ని సాక్ష్యాలు చెబుతున్నాను. చిత్రాంగిదేవి పరిచారిణులకు తలకొక పనిచెప్పి బయటకు స్వయంగా పంపివేసింది. భర్తలేని సమయంలో ఒంటరిగా ఉండవలిన అవసరమేముంది? ఉన్నా పరిచారికలను పంపవలసిన అగత్యమేమి? ఒకవేళ సారంగధరుడు బలాత్కరిస్తే అరిచివుంటే దాసదాసీజనులు వచ్చేవారు కవచాదులను ఆమె ఏదోనెపంతో అతనిచేత తీయించి వుంటుంది ఉత్తరీయం ఒక్కటే సాక్ష్యం కాజాలదు

సారంగదరుని స్వభావం లోకానికి తెలియనిది గాదు. ఈ సభలో ఎవ్వరైనా నిర్భయంగా నిలబడి అతని గతప్రవర్తనలో చెడు గురించి ఒక్కముక్క చెప్పండి! 20 సంవత్సరాలలో అతని కీర్తి ప్రతిష్ఠలు లోకవిదితం! సుబుద్ధికి తెలివివచ్చేంతవరకు వేచివుండటం సబబుగా తోస్తోంది". అని తన ప్రతివాదం ముగించాడు

రాజుగారు యితర మంత్రుల అభిప్రాయాలు అడిగారు నిందితుడు అపరాదియని వారబిప్రాయ పడ్డారు

రాజు తన న్యాయనిర్ణయం వెల్లడించారు

''నిందితుడు నాకుమారుడే కాని అపరాధం మిక్కిలి ఘోరం! ఎన్నడూలేనిది నీపినతల్లి యింటికి భర్తలేని సమయంలో వెళ్లడం, వావివరుస చూడకుండా చెప్పరాని పాపం చేయడం, ఘోరాతి ఘోరం! నీ తండ్రినని చెప్పుకోవడం మాకే సిగ్గుగా వుంది అందువలన దండనం యిప్పుడు న్యాయస్థానంలో వినిపిస్తారు'' అని రాజు నేరారోపణచేశారు

నిందితునిపై నేరం నిర్ధారించబడింది నిందితుడు కవచాదులు తీసివేసినట్లు స్వయంగా ఒప్పుకొన్నాడు. ఇతర సాక్ష్యాలు దాన్ని బలపరస్తున్నాయి. నిందితుడు మోసకారియై పడకటింటికి పిలుచుకొని పోయి ఈ పాపకార్యం చేశాడు కాబట్టి నిందితుడు శిక్షార్హుడు దానికి అరణ్యంలో కాళ్ళు చేతులు నరికి వేయడమే దండనగా ధర్మశాస్త్రం చెబుతోంది శిక్ష తగ్గించడానికి కారణం కనిపించడం లేదు కాబట్టి అపరాధిని ఊరికవతల కరపాదచ్ఛేదన చేయవలసిందిగా దండన విదించారు

తన ఆస్తిని తన భార్యకు సగభాగము సుబుద్ధికి మరొక సగము యివ్వవలసిందిగా సారంగధరుడు న్యాయస్థానాన్ని కోరాడు రాజు ఘోరంగా విలపించాడు

కాళ్ళు చేతులూ కట్టివేసి సారంగదరుని తలారులు రాచ వీదులలో తీసుకుపోతున్నారు అతనికి దండన విదించడానికి వారి మనసు అంగీకరించడంలేదు చేతులు ఆడటంలేదు అతడు అపరాధం చేశాడని వారు నమ్మటంలేదు. ఇంతలో మహారాణి రత్నాంగి దేవి కుమారుని వెదుకుతూ అక్కడికి వచ్చింది. ప్రాణ ప్రదమైన తన కుమారుని గుణగణాలు వర్ణిస్తూ భోరు భోరున ఏడుస్తూ వుంది. అతనిపై మోపిన నిందను నమ్మలేక పోయింది

సారంగదరుడు చిత్రాంగి దుశ్చేష్టలను తల్లికి చెప్పి తాను నిర్దోషినని తల్లి పాదాలనంటి చెప్పాడు

ఆ విషయాన్ని న్యాయస్థానంలో చెప్పి వుంటే ఆ అపవాదు. దండన తప్పి పోయేవని ఆమె విలపించింది. పినతల్లికి అపవాదు రాకూడదని తాను అలా చేశానని కన్నతల్లి తనను అనుమానించకుండా వుండేందుకు నిజా నిజాలు బయట పెట్టానని చెప్పాడు సారంగధరుడు. హరిధ్యానంతో కాలం గడుప మని, పతిభక్తి మానవద్దని హితవు చెప్పాడు. అంతా దైవాధీనమని కొడుకే లేడని గుండె దిటవు చేసుకోమని తల్లిని వూరడించాడు. రాజభటుల అలికిడి విని రత్నాంగిని బలవంతంగా దాసి ఈడ్చుకొని పోయింది.

చిత్రాంగి అంతఃపురంలో రాజనరేంద్రుడు దుఃఖితుడై యున్నాడు. జరిగి పోయిన దేదో జరిగి పోయింది. కుమారుని రక్షించుకోమని క్షమించమని చిత్రాంగి రాజుకు హితవు చెప్పింది. రాజు ఉద్రిక్తుడైనాడు. నీ వలన ఇంత ఆపద వచ్చిందని, ఇంత దుఃఖం తెచ్చిన విధవరాలివి నీవని చిత్రాంగిని దూషించాడు.

చిత్రాంగి తన దురవస్థను తానే నిందించుకుంది. లోకంలో ఎందరో అపురూప సౌందర్యవంతులైన యువరాజులు తనను వలచిరాగా తండ్రిమాటను కాదనలేక ముసలివాడైన పతిని దైవంగా భావించడం తనదే తప్పని నిందించుకుంది. మానభంగం జరిగినా ప్రాణాలు కోల్పోక యింకా బ్రతికి వుండటం వల్ల తనకు తగన శాస్తి జరిగిందని ఏ నుయ్యో గొయ్యో చూచుకుంటానని విలపించింది. దుఃఖావేశంలో దిగ్భ్రమంలో తాను అలా పలికానని, ద్రోహి బ్రతకరాదని రాజు బ్రతిమాలాడు.

ఇంతలో రత్నాంగి ఏడుస్తూ చిత్రాంగి భవనంలోకి ప్రవేశించింది. కొన్ని ఘడియలు దాటితే మన ఏకైక పుత్రరత్నం మనకు దక్కడని ఎలా అయినా అతని దండన తప్పించమని రాజును ప్రాధేయపడింది మధ్యలో చిత్రాంగి కల్పిచుకుంటు 'అక్కా! నీ మొహమోటంతో రాజు ఏమీ అనలేకుండావున్నాడు సారంగధరుని క్షమించమని నేనెంతో చెప్పిచూశాను - యింక దురాశ మానుకోవడం మంచి'దంది.

రత్నాంగి తగిన సమాధానం చెప్పింది. ''పినతల్లివని నమ్మి నీ యింటికి వచ్చినందుకు కుమారినిపై మోహం ప్రకటించి ఎంత పని చేశావమ్మా!'' అని దెప్పిపొడిచింది.

చిత్రాంగి ఊరుకోలేదు. అలాంటి దుశ్శీలుని కన్నతల్లివి గాబట్టి అలానే మాట్లడతావని రత్నాంగిని ఎద్దేవా చేసింది. తన కుమారుని బ్రతికించమని పాదాలంటి వేడుకొంటానని బ్రతిమాలింది.

అది గయ్యాళితనమని చిత్రాంగి తొలగద్రోసింది.

రత్నాంగి రాజేంద్రుని మ్రోల తన గోడు వెలిబుచ్చింది. ఇరవై ఏళ్ళ నుండి సచ్ఛీలుడుగా పేరెన్నికగన్న కన్నకొడుకు మీకు శత్రువు కావడం దురదృష్టకరమంది. యాత్రలు చేసి, పూజలు, పునస్కారాలు చేసి, వ్రతాలు నోమి, దానాలు చేసి కష్ట ఫలంగా పొందిన ఉప్పుకల్లు వంటి ఒక్కగానొక్కకుమారుని నిరపరాధిగా కరుణించమనీ, పుత్రభిక్ష పెట్టమనీ ప్రార్థించింది.

రాజు కఠినంగా మాట్లాడాడు. ''తల్లిపై ద్రోహం చేసినవాడు పుత్రుడైనా, మిత్రుడైనా క్షమించడం ధర్మంకా''దన్నాడు. తన పుత్రుని తనకు దానంగా ఇమ్మని కోరింది. మమ్మల్ని ఇద్దర్నీ దేశాంతర బహిష్కృతుల్ని చేయమంది. కారాగారంలో యావజ్జీవ శిక్ష విధించమని కోరింది. పగబూని చంపవలదని నమస్కరించింది.

అంతటి మహాపరాధం చేసిన పాపి సజీవుడుగా వుండటం భావ్యం కాదని రాజు శాసించాడు. ఇతర శిక్షలు సరిపోవని ఆయన వాదన.

రత్నాంగి దుఃఖితమతియై విలపించింది. అయినా ఆమె ఆవేదన రాజు తలకెక్కలేదు.

ఉన్మాదవైద్యశాలలో సుబుద్ధికి వైద్యం చేయిస్తున్నారు. అతను మాటిమాటికి దాసి, చిత్రాంగి, పావురం, ప్రమాణం అని కలవరిస్తున్నాడు.

చిత్రాంగి తన రాచనగరంలో ఆత్మగతంగా ఇలా పలికింది :

''సారంగధరుని చిత్రపటాన్ని చేతధరించింది. ఇలా తలపోసి మురిసిపోయింది. ఇంకో ఐదుగడియలకు శత్రువు నశిస్తాడు. రత్నాంగి రాకతో ముసలిరాజు మనసుమారుతుందేమోనని భయపడ్డాను. ఇప్పుడిక నిరాటంకంగా కార్యసాధన జరిగిపోతుంది. సారంగధరా! నీవెంత మూర్ఖుడవు. నా మాటవిని వుంటే మదన సామ్రాజ్య పట్టాభిషిక్తుడవు, యౌవరాజ్యా పట్టాభిషిక్తుడవు అయివుండేవాడివి. రాజు పుత్రవియోగంతో తనువు చాలిస్తాడు రత్నాంగిదేవిని అంతమొందిచడానికి సాహసించాను. నిజం నిలకడ మీద తెలియకపోదు. అప్పుడు ఆబాల గోపాలం నన్ను తిట్టిపోస్తారు. చేసిన పాపాలు పోవాలంటే ఉరివేసుకోవడమే తడవు.

మహారాజుకు లేక లేక కలిగిన సంతానం! రతిరాజును సౌందర్యంలో మించినవాడు - సారంగధరుడు. నావంటి అతిలోకసుందరి పై బడినా చలించని జితేంద్రియుడు. మహాపాపం అంటగట్టి నేరారోపణ చేసి దండన వింధించినా నా తప్పులు సైరించిన ఉదారుడు. ఏకపత్నీవ్రతుడు. లేని నేరం మోపిన ఘోరపాపం నన్నంటుకొంటుంది'' - అని మూర్ఛిల్లింది అంతఃపురంలో చిత్రాంగి.

రాజనరేంద్రుడు అక్కడికి వచ్చి ఘోరంగా విలపించాడు : ''స్వయంగా కుమారుని కాలుసేతులు ఖండింపమని దండన విధించిన దుర్గతి ఎలా భరించాలి? కులదీపకుడైన కొడుకు లేకుండా జీవించడం ఎలా? రాజభోగాలు వైభవాలు, అంతఃపురకాంతలు యింకెందుకు; పూర్వ జన్మపాపము దైవద్రోహము, దుష్ప్రాప్తి ముప్పేటలుగా పెనవేసుకొని నా మనస్సును కలచివేస్తున్నాయి. చిత్రాంగి వలనగదా తనకింత దురవస్థ! మరో ఐదు గడియల్లో సారంగధరుడు వధింప బడతాడు. తలారులైనా మాయమాటలు చెప్పి వధించకుంటే బాగుండును. ఈ చిత్రాంగికి భయపడి గదా! నేనీ సాహసానికి పూనుకొన్నది. నేను వానిని క్షమిస్తాను.........లేదు. ఆ చండాలుడు జీవించరాదు. అతణ్ణి చూస్తూ లజ్జతో నేను రోజూ చావకతప్పదు. కాబట్టి కరుణకు తావులేదు. అనుకొన్నాడు రాజు.

చిత్రాంగి మగతగా కలవరిస్తోంది 'ఒక ముద్దివ్వూ! ఫలహార మొనరింపుమా! కవచము విప్పుమా!' అంటోంది

రాజు ఆ మాటలు వింటూ ఆశ్చర్యపోయాడు ఇంతలో చిత్రపటము, కవచము కనిపించాయి రహస్యం బయటపడింది

రాజు వెంటనే సేవకుని బిలిచి నా ఆజ్ఞ అమలుపరచవద్దనీ, దండనం నిలిపివేయమనీ ఉత్తరువు వ్రాసి పంపాడు

అర్ధరాత్రికి యింకా నాలుగుగడియలున్నాయి వేళకు వెళ్ళి దండనం ఆపివేస్తాడు ఇంతటి ఘోరపాతకానికి వొడిగట్టిన ఈ దుర్మార్గురాలిని కత్తివేటుతో తల తెగవేస్తాను - అనుకొన్నాడు రాజు

ఇంతలో కవచంలో నుంచి సుబుద్ధి వ్రాసిన ఉత్తరం జారి పడింది నేను వచ్చి మాట్లాడేంతవరకు మీరు అంతఃపురంలోకి వెళ్ళవద్దని కట్టడిచేశాడు వచ్చిన వాణ్ణి లోబరచుకోవాలని పన్నిన పన్నాగమయివుంటుంది.

రాజు వెంటనే సేవకుణ్ణి పిలిచి ఉన్మాద వైద్యశాలకు వెళ్ళి సుబుద్ధిని తీసుకురమ్మని ఉంగరం ఆనవాలుగా పంపాడు

అడవిలో తలవరులు, వీరసేనుడు సారంగదరుని పారిపొమ్మని బ్రతిమాలారు సారంగదరుడు అందుకు అంగీకరించలేదు రాజద్రోహం మంచిది కాదని హితవు చెప్పాడు నేను సత్యసంధుడను, ఏకపత్నీవ్రతుడను అయితే నాకు సునాయసంగా మరణం కలిగించమని భగవంతుణి వేడుకొన్నాడు

వీరసేనుడు సారంగధరుని పరుండబెట్టి కాలు చేతులు రెండు దెబ్బలకు ఖండించివేసి దుఃఖించసాగాడు.

గుఱ్ఱంపై దౌడుతీస్తూ రాజసేవకుడు ప్రవేశించాడు రాజు ఆజ్ఞతో యిచ్చిన పత్రిక చూపించాడు అప్పటికే జరగరానిది జరిగిపోయింది

చిత్రాంగి నగరులో రాజనరేంద్రుడు పావురం పంజరం చూశాడు ఇది సారంగధరునిదే ఈ పావురం కోసమే అతడు లోపలికి వచ్చివుంటాడు. ఈనాడు ఎంతో సుదినం ఇంక నాలుగు గడియలైతే మహాఘోరం జరిగి వుండేదని రాజు ఊరటపడ్డాడు

ఉన్మాదవైద్యశాలకు వెళ్ళి తిరిగి వచ్చిన సేవకుడు ఒక ఉత్తరం తెచ్చియిచ్చాడు. అది వైద్యుడు వ్రాసింది రాజు ఆ ఉత్తరం విప్పి చదివాడు: ''మహారాజా! సుబుద్ధి నేటి రాత్రి రెండుగడియలదాకా ఉన్మత్తప్రలాపాలు చేశాడు చిత్రాంగి, జాబు, దాసి అనే మాటలు మాటిమాటికి పలికేవాడు ఇప్పుడు స్థిమితపడ్డాడు తెలివి రాగానే సారంగదరుడు నిరపరాధియనీ, తన చేత ప్రమాణం చేయించి నిజం బయటకు రాకుండా చేశాడనీ చెబుతున్నాడు ''

రాజు మరొక దాసి కమలను పిలిపించడానికి సేవకుని బంపాడు ఏమైనా దండన అమలుజరగకుండా ఆజ్ఞాపత్రిక పంపడం మేలైంది ఒకవేళ సేవకుడు అలస్యంచేస్తే దుర్విధి తనను కాటువేస్తుంది - అనుకొన్నాడు రాజనరేంద్రుడు

సేవకుడు కమలను తీసుకొచ్చాడు రాజు జాబువిషయం అడిగాడు కమల దాటవేయ జూసింది శిరచ్ఛేదనం చేస్తానని రాజు బెదిరించడంతో కమల తనకు తెలిసిన వృత్తాంతం బయట పెట్టింది.

''దేవా! ఈ జాబు చిత్రాంగిదేవి నా కిచ్చి సారంగదరుని వద్దకు పంపింది అతడు పావురాల ఆటకు వెళ్ళాడు. నేను తిరిగి వచ్చేసరికి దేవి సారంగదరుని ఉత్తరీయం పట్టుకొని వుంది సారంగధరుడు ఎంత బ్రతిమాలినా ఆమె వదలలేదు. ఆమె గాఢాలింగనం చేసింది అతడు ఉత్తరీయం వదలి వెళ్ళిపోయాడు ఆ తొందరలో కవచాదులు యిక్కడే వదలివెళ్ళి పోయాడు అవి నేను తీసి దాచాను సుబుద్ధికి ఈ విషయాలు అన్నీ చెప్పాను న్యాయస్థానంలో సాక్ష్యమివ్వాలని వచ్చాను. సారంగదరుడు ప్రమాణం చేయించుకొన్నందున ఈ రోజు నన్ను మాట్లాడనీ లేదు'' - అంది దాసి

రాజు దాసిని క్షమించి పంపి ఉత్తరం తీసి చదవసాగాడు . రాజూర లేదు కాన నీవు వచ్చి వైద్యుని పిలిపించవలసినదని వ్రాసి వుంది చివరలో ఆద్యంతము నిను జూడగోరు చిత్రాంగి అని వ్రాసింది మళ్ళీ ఆద్యంతాలు కలిపి చదివాడు.

''నీపై నాకు ఘనమోహాము

రతిని దేల్చికావకున్న బ్రదుకను'' - అని వస్తుంది

రాజు కోపం పరాకాష్ఠనందుకొంది

రాజు చిత్రాంగిని వివరంగా ప్రశ్నించాడు కమలను తాను పంపలేదనీ, ఇదంతా రత్నాంగి పన్నాగమనీ బొంకింది జాబు తానే వ్రాశాననీ అంగీకరించింది ఆ ఆవేదన భరించలేక మూర్ఛిల్లింది

రాజు చిత్రాంగికి కఠిన శిక్షవిదించాడు కత్తులు, కటార్లు వైసిన మూతతొట్టిలో ఆమెనుంచి రోజుకు నాలుగైదు సార్లు దొర్లించి ఎనిమిదవ రోజు ప్రాణాలు తీయాలి శిక్షా పత్రిక వ్రాసి పంపబోయాడు

అడవికి వెళ్ళిన సేవకుడు దుర్వార్తతో తిరిగి వచ్చాడు ఆవార్తవిని రాజు మూర్ఛిల్లాడు చిత్రాంగి నేలపైబడి ప్రాణాలు కోల్పోయింది రాజు వైద్యుని సారంగదరుని వద్దకు పంపమని రాజు ఆజ్ఞాపించాడు

అడవిలో సారంగదరుడు కాళ్ళు చేతులు తెగిపడి విచారంగా ఉన్నాడు తన దురవస్థకు దుఃఖిస్తున్నాడు :

-'నా పూర్వపాపపలం యిలా అనుబవించాల్సివుంది తలారులు తనతల నరకివేసివుంటే సులబంగా మరణం లబించివుండేది నా కష్టాలు గట్టెక్కించే మహాత్ములెవరూ లేరా? ఓ చిత్రాంగిదేవీ! నా పై మోపిన అపనింద బరించరానిది ఇప్పుడు నా అవస్థ చూస్తే నీకు తప్పక కరుణ కలుగుతుంది కన్నతల్లి యీస్థితిలో నన్ను చూసి దురసిల్లుతుంది'' సారంగదరు డలా అనుకొంటున్న సమయంలో మిత్రుడు సుబుద్ధి ప్రవేశించాడు ''యువరాజా! నా చేత అలాంటి ప్రమాణం ఎందుకు చేయించావు ఎన్నడూ ఎవ్వరికీ

అపకారం తలపెట్టని నీవు యిలా ఎందుకు చేశావు? కలలోగూడ అసత్యమాడని వాడవు శత్రువుకు కూడా అపకారం తలపెట్టని వాడవు, ఇతరుల మనసు నొప్పించని వాడవు, పరస్త్రీని కన్నెత్తి చూడని వాడవు, సద్గుణరాశివి అయిన నీకీ ఆపద ఎందుకు రావాలి?'' అని దుఃఖించాడు

తలారితో వచ్చిన వైద్యుడు సారంగధరుని వద్దకు వచ్చాడు చిత్రాంగి పన్నిన పన్నాగం బయటపడింది. రాజు పశ్చాత్తప్తుడై వైద్యుని పంపాడు చిత్రాంగి మరణించిందనే వార్త విని సారంగదరుడు దుఃఖించాడు ప్రాణనాడులలో రక్తంమంతా పోయినందున సారంగదరుని బ్రతికించడం కష్టమని వైద్యుడు సుబుద్ధితో రహస్యంగా చెప్పాడు.

సుబుద్ధి మూర్చిల్లాడు రాజనరేంద్రుడు, రత్నాంగి, పురజనులు వచ్చారు

సారంగధరునిపై బడి రాజదంపతులు విలపించాడు

సేవకుడు దారితప్పి ఆలస్యంగా అడవికి రావడంవల్ల దండన తప్పించలేక పోయాడు ఆ చిత్రాంగి మాటలు విని మోసపోయానని రాజు ఘోరంగా ఏడ్చాడు

సారంగదరుడు తండ్రిని ఓదార్చాడు. రాజనీతిజ్ఞుడవైన నీవు చేసినది దర్మమేనన్నాడు ''దైవవిధి ఎలా ఉందో అలా జరగాలి నా పినతల్లి మరణవార్త నన్ను కలచివేసింది మాతా పుత్రులది ఋణానుబంధం. దైవభక్తితో మీరు శేషజీవితం గడపండి''అని సారంగధరుడు కన్ను మూశాడు

రాజ దంపతులు మూర్చిల్లారు రత్నాంగి కుమారుని మరణానికి ఘోరంగా విలపించింది ''నీవు జన్మించికూడా గొడ్రాలినని నాకు పేరువచ్చింది గదా! మనుమలను ముద్దాడే భాగ్యానికి నోచుకోలేదు హంసతూలికాతల్పంపై పరుండవలసిన నీవు కటికనేలపై పరుండవలసివచ్చింది. నీ ముఖబింబంవాడిపోయింది. కనులు కాంతి హీనాలైనాయి కాలు చేతులు తెగిపడ్డాయి పుట్టింటి కెళ్ళిన చంద్రకళ తిరిగి వస్తే ఏం చెప్పగలను?'' అని ఏడ్చింది

రాజనరేంద్రుడు తన స్వయంకృతాపరాధానికి తనకు తానే నిందించు కొన్నాడు. త్వరపడి దండన విధించినందుకు సిగ్గుపడ్డాడు. సాక్ష్యాధారాలు సరిగా విచారించక త్వరపడ్డాను. దేవతలారా! నా బిడ్డను రక్షించండి! రత్నాంగీ! నీవైన పుత్రభిక్ష పెట్టుమని ప్రార్థించాడు. ఇలా మాట్లాడుతూ రాజు మూర్ఛపోయాడు. మళ్ళీ లేచి సారంగధరుని శవాన్ని చూసి మళ్ళీ మూర్ఛిల్లాడు.

రత్నాంగి కుమారుని తలచితలచి ఏడ్చింది. పుట్టిన రోజు నాడు ఇలాంటి ఘోరం జరిగిందే అని మూర్ఛపోయింది.

రాజు తెప్పరిల్లి జరిగిన వృత్తాంతాన్ని మననంచేసుకొని బాధపడ్డాడు. ఆపాడు వేటకు బోనేల? పట్టాభిషేకం ఆలస్యం చేయనేల? తలారులైన దయతలచి యుండరాదా? సారంగధరుని కొక కొడుకు కలిగిన వంశాంకురం మిగిలివుండేవాడు గదా! చంద్రకళ వద్దకు పోయివస్తానన్న సారంగధరుని నిలిపివేసినందుకు ఈ ఘోరం జరిగింది. ఆ ఘాతుకురాలి మాయమాటలు ఏలనమ్మాలి? విభావసుడు నిజం చెప్పి యుండకూడదా? నానోములఫలం లేకుండా జీవించడమెలా? ఇంక ఎవరికి పట్టం గట్టాలి? అని విలపించాడు.

రాజు పౌరజనాలనుద్దేశించి తన తప్పిదాలు చెప్పి బాధ పడ్డాడు. చిత్రాంగి మాటలువిని చెడిపోయానని తప్పు వొప్పుకున్నాడు. ఇలాంటి స్త్రీ లోకంలో ఉండదనీ, త్వరపడి దండనవిధించడం వల్ల ఈ ఘోరం జరిగిపోయిందనీ వాపోయాడు. ఈడు కాని వారిని పెండ్లాడం మహాఘోరమని అంగీకరించాడు. **14** నం.ల యువతిని **50** ఏళ్ళ ముసలి రాజు పెళ్ళి చేసుకోవడం అన్యాయమని విలపించాడు. ఈడుగాని వివాహం తగదనే సందేశ మిచ్చి దుఃఖంతో రాజు నిష్క్రమించాడు.

# వేదం వెంకటరాయశాస్త్రి

వేదం వెంకటరాయశాస్త్రి మదరాసులో జన్మించారు. 1886లో మదరాసులో క్రైస్తవ కళాశాలలో సంస్కృతపండితులుగా ఉద్యోగంలో చేరారు. 25 సంవత్సరాలు ఆ పదవిలో కొనసాగారు. సూర్యరాయాంధ్ర నిఘంటునిర్మాణ సమయంలో శాస్త్రి ప్రధాన సంపాదకులుగా కొంతకాలం వ్యవహారించారు. ఆయన రచయిత, వక్త, నాటకరంగంలో నిష్ణాతుడు.

చెన్నపురి ఆంధ్రమహాసభవారు 'మహామహోపాధ్యాయ' బిరుదంతోను ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు 'కళాప్రపూర్ణ' బిరుదంతోను సత్కరించారు. నెల్లూరులో ప్రతిఏటా ఆయన వర్ధంతి జయప్రదంగా జరుగుతున్నది.

శాస్త్రి రచనలలో ప్రతాపరుద్రీయం, ఉషాపరిణయం బొబ్బిలి యుద్ధం, నాగానందం, రత్నావళి, విక్రమోర్వశీయం మాళవికాగ్ని మిత్రం, శాకుంతలం,ప్రసిద్ధ నాటకానువాదులు వ్యాఖ్యానకారుడుగా శాస్త్రి సుప్రసిద్ధులు. మేఘసందేశం రఘువంశ, కుమార సంభవాలు శృంగారనైషధం,ఆముక్త మాల్యద కావ్యాలకు సప్రమాణికమైన వ్యాఖ్యలు వెలయించారు. బహుభాషాకోవిదులైన శాస్త్రి సాహిత్య తర్క వేదాంతవ్యాకరణాలలో ప్రావీణ్యం సంపాదించారు.

ప్రతాపరుద్రీయం 1897లో ప్రచురించారు. ప్రతాపరుద్రీయానికి మూలాధారాలులేవు. కొన్ని చారిత్రకాంశాల ఆధారంగా కొన్ని పాత్రలను కల్పనచేసి ఈనాటకాన్ని ప్రకటించారు ఇందులో పేరిగాని పాత్ర అద్భుత కల్పన. ప్రతాపరుద్రీయం ప్రథమాంధ్ర జాతీయ స్వతంత్రనాటకం. ప్రతాపరుద్రాయంలో తొమ్మిది గమ్యభేదాలను పాత్రోచితంగా రచయిత వాడారు. నాటకాలలో వ్యావహారిక భాషను ప్రయోగించడానికి ఆయన వెనుకాడలేదు.

ప్రతాపరుద్రీయం 10 అంకాల స్వతంత్ర నాటకంగా రచించారు. ప్రతాపరుద్రుడు, యుగంధరుడు, పేరిగాడు వలీఖాన్, చెకుముకి శాస్త్రి ప్రధాన పాత్రలు. వెర్రివానిద్వారా కొంత కథనడుస్తుంది. ముస్లింపాత్రలు ఉర్దూయాసతో కూడిన తెలుగును, పేరిగాడు గ్రామ్యభాషను వాడడం విశేషం.

# ప్రతాపరుద్రీయం గురించి

పాత్రోచిత భాషామర్యాదను పాటించి ప్రతాపరుద్రీయ నాటకాన్ని స్వతంత్ర జాతీయ నాటకంగా వ్రాశారు ఈరచనకు మూలాధారాలు లేవు. చారిత్రకాంశాలు ఆధారంగా కొన్ని పాత్రలను కల్పనచేసి నాటకాన్ని ప్రకటించారు. ఇందులో పేరిగాని పాత్ర అద్భుత చిత్రణ. కన్యాశుల్కంలో గిరీశంవలే ఇతని చేష్టలు కలకాలం గుర్తుకు వుంటాయి. అతనికి వాడిన భాష జన సామాన్యంలోనిది.

ఓరుగల్లు రాజధానిగా త్రిలింగదేశాన్ని ప్రతాపరుద్ర మహారాజు పరిపాలిస్తున్నాడు. ఆయనను ఢిల్లీసుల్తానుకు సంబందించిన వారు బంధించి తీసుకువెళ్ళారు. ఆయన మంత్రి యుగంధరుడు పిచ్చివాని వేషంలో ఢిల్లీకి వెళ్ళి రాజును విడిపించుకొచ్చాడు. రాజు ఊరిలో లేని సమయంలో చాకలి పేరిగానిని రాజుగా ప్రకటించి మంత్రులు కధ నడిపారు ఈ నాటకంలో వెంకటరాయశాస్త్రి ముస్లిముల చేత ఉర్దూయాసతో కూడిన తెలుగు భాష పలికించారు. అలానే పేరిగాని చేత గ్రామ్యభాషను పలికించి శాస్త్రిగారు నాటకాన్ని రసవంతం చేశారు. అందులో కధ ఎలా సాగిందో చూద్దాం!

## 4. ప్రతాప రుద్రీయం

### సంక్షిప్త గ్రంథం

ప్రతాపరుద్ర మహారాజు ఓరుగల్లును తన రాజధానిగా చేసుకొని త్రిలింగ దేశాన్ని పరిపాలిస్తున్నాడు. అతని మంత్రి యుగంధరుడు. అతడు రామేశ్వరానికి తీర్థయాత్రకై వెళ్ళాడు. అతని తమ్ముడు జనార్దనుడు రాజ్యపాలనా వ్యవహారాలుచూస్తున్నాడు. ప్రతాపరుద్రుడు వేటకు బోయాడు. అలాంటి సమయంలో ఢిల్లీ సుల్తాను యొక్క సర్వసేనాధిపతి వలీఖానుడు త్రిలింగరాజ్యం మీదకి దండెత్తి వచ్చాడు. రాజధానియైన ఓరుగంటి సమీపంలో విడిది చేశాడు. సఖ్యానికి వచ్చినట్లుగా నటిస్తూ జనార్దనమంత్రి దర్శనంకోరి వచ్చాడు.

అన్నగారు, మహారాజు నగరంలోలేని సమయంలో వీరువచ్చారని జనార్దనుడు పసిగట్టాడు. అపశకునాలు కనిపించాయి. తాను ఢిల్లీ సుల్తాను దగ్గరనుండి రాయబారం తెచ్చాననీ, ఢిల్లీరాజ్యం మీదకి ఆఫ్గనీస్తాను సుల్తాను దండెత్తి వస్తున్నాడని వలీఖాన్ బొంకాడు. ఇలాంటి సమయంలో ప్రతాపరుద్ర మహారాజు స్వయంగా దండు నడుపుకొని వచ్చి ఢిల్లీ సుల్తానుకు సహాయపడవలసిందిగా సుల్తాను ప్రార్థనమని తెలిపాడు.

జనార్దనుడు వలీఖాన్ గడుసుదనాన్ని సమయస్ఫూర్తిని పసిగట్టాడు. వారి రాజ్యం పైకి దండెత్తి వస్తూవుంటే ఢిల్లీకి గొప్ప సరదారులైన వలీఖాన్ రాజ్యం వదలి పెట్టి గొప్ప దండుతో రావడం ఆశ్చర్యంగా తోచింది. రాయబారానికైతే ఒకరిద్దరు పెద్దవారు రావచ్చును. ఇంత ఆర్భాటం దేనికి? అనుకున్నాడు. సుల్తాను ఈ మిషతో రాజును అపహరించుకొనిపోయి ఖైదులో వేసి, ఆపైన దేశాన్ని కబళించాలని ప్రయత్నిస్తున్నాడని వూహించాడు. రాజుగారు ఊళ్ళో లేడని తననోట పలికించాలని వలీఖాన్ ప్రయత్నిస్తున్నాడని జనార్దనుడు గమనించాడు. తాను యుగంధరమంత్రి తమ్ముడనని అన్నగారు గ్రామాంతరం వెళ్ళివున్నారని తెలియజేశాడు.

రాజుగారు, అన్నగారు లేకపోయినా వారిద్దరికీ సమానమైన మీరున్నారు కాబట్టి మా పని నెరవేరుతుందని వలీఖాన్ కపటంగా పలికాడు. జనార్దనుడు కూడా పైపైకి సఖ్యాన్ని అభినయించాడు. నగరంలో రాజు లేడని ఆయన రాగానే మీకు దర్శన మిప్పిస్తానని నమ్మబలికాడు.

వలీఖాన్ వెళ్ళిన తర్వాత తన శిరస్తాదారు విశ్వానరావును జనార్దనుడు పిలిపించాడు. తురకల మోసాన్ని గూర్చి యిద్దరూ చర్చించారు. వారితో ఎత్తుకు పై ఎత్తు వేసి సింహాక్రమణం చేయాలని నిశ్చయించుకున్నారు. తక్షణమే నాసిక మొదలు భద్రాచలం వరకు గోదావరి నదిని దాటటానికి వీలు లేకుండా బల్లకట్టుడింగీలు మొదలు అన్నిటినీ పగుల గొట్టించాలని ఉత్తర్వు చేశారు. పడవలూ, ఓడలు మొదలైన అన్నింటినీ భద్రాద్రి కవతల లంగరు వేయమన్నారు. ఎవరైనా ఈ ఉత్తర్వు అతిక్రమిస్తే తలతీసి వేయటమే. సైన్యాన్ని అప్రమత్తం చేశారు. ఇంతలో ప్రతాపరుద్రుని సర్వసేనాపతి భేతాళరావు మంత్రిని దర్శించడానికి వచ్చాడు. ఇన్నాళ్ళకు యుద్ధప్రసక్తి వచ్చింది. కాబట్టి యుద్ధానికి అనుమతి యివ్వవలసిందిగా ప్రార్థించాడు. రాజు, మంత్రి లేని సమయంలో తాను నిర్ణయం తీసుకోలేనని అవసరం వచ్చినపుడు ఆజ్ఞాపిస్తానని జనార్దనుడు చెప్పాడు. అన్నగారైన యుగంధరునికి తక్షణమే బేగిరావు టపా పంపించవలసిందిగా విశ్వానరావును కోరాడు. రాజునకు వర్తమానం పంపాడు.

వలీఖాన్ కోరినట్లుగా కొందరు చాకళ్ళను కొందరు మంగళ్ళను అతనికి నౌకరీ చేయడానికి పంపాడు. వారిని తురక వేగులుగా ఉపయోగించుకుంటాడని జనార్దనుడికి తెలుసు. ఈ వ్యవహారమంతా ఇనుక తక్కెడ పేడతక్కెడలా వుంది. అందువలన తనకు ఆప్తులైనవారిని, హిందూస్తానీ వచ్చినవారినీ వలీఖాన్ వద్దకు (తన వేగులను) నౌకర్లుగా పంపించాడు. వెంటనే రాజధానికి తిరిగి రావలసిందని తురకలు దండెత్తి వచ్చారనీ రాజుకు వర్తమానం పంపాడు. తురకలను స్వదేశానికి తిరిగి పోనీకుండా అక్కడికక్కడే చంపడానికి సకల సన్నాహాలూ సిద్ధమయ్యాయి. ఎవ్వరూ గోదావరి నది దాటకుండా ఆజ్ఞ జారీ చేశారు. ఒకవేళ అవసరమైతే రాజుగారివలే పోలికలు కలిగిన చాకలిపేరిగాడిని రాజు వేషంలో సభలో కూర్చోబెట్టడానికి ఆలోచన చేశాడు.

పేరిగాడు పరమ మూడుడైనా రాజు పోలికలు వున్నాయి అత్యవసర పరిస్థితులలో అతడు ఉపయోగపడతాడని యుగంధరమంత్రి చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి

చాకళ్ళు, మంగళ్ళుగా వేషాలు దరించి చారులు జనార్ధనుని వద్దకు వచ్చారు వారికి కర్తవ్యాన్ని తెలియజేసి పంపించారు వారి వేషభాషలను చూస్తే అచ్చం గడుసువాంద్రుగా కనిపిస్తున్నారు. వారిని నమ్మవచ్చు. తనకు తోడుగా తన సహాద్యాయి చెకుముకి శాస్త్రిని పిలిపించుకోవాలని జనార్ధనుడు నిశ్చయించుకున్నాడు

వలీఖాను తన సర్దారులైన ఖుస్రూఖాన్ మొదలైన వారితో మంత్రాలోచన చేస్తున్నాడు ముందు రాజును పట్టి హతం చేస్తే ఆ తర్వాత ఓరుగల్లు ముట్టడించవచ్చునని మంత్రిని, అతని తమ్ముడిని అంతమొందించవచ్చుననీ తలకొక సలహా యిచ్చారు వారు సభలో వుండగా జనార్ధనుని సహాధ్యాయి చెకుముకి శాస్త్రి అతని ప్రేరణచే జోస్యుడుగా సభా ప్రవేశం చేశాడు వలీఖానుకు దిగ్విజయం కలుగుతుందని ఆశీర్వదించాడు వీడేదో గూఢచారి అయివుంటాడని తాను అనుమానించాడు తన పేరు యమధర్మరాజు శాస్త్రులు అనీ తాను ప్రతాపరుద్రుని రాష్ట్రంలోకి వచ్చిన పొరుగు వారిని గుర్తించ గలననీ చెప్పాడు. తన మీద ఆయుధాలు ప్రయోగించిన మొదటి ఐదుగురూ చస్తారనీ తన జాతకంలో వున్నట్లు చెప్పాడు. మీరు రాజును ముందు పట్టుకుందామా? రాజదానిని ముందు పట్టు కుందామా? అని ఆలోచిస్తున్నారని జోస్యం చెప్పాడు వలీఖాన్ బెదిరిపోయాడు తాను జ్యోతిషం చక్కగా చదువుకున్నాననీ ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు చెప్పగలనని నమ్మ బలికాడు ఆవులిస్తే పేగులు లెక్కబెట్టగల అసాదారణమైన ప్రతిబ వుంది అన్నాడు తనకూ ప్రతాపరుద్రుని ఆస్థాన జోస్యునకు శత్రుత్వమనీ, 'యాచకో యాచకః శత్రుః' అనడం సరిపోతుందని చెప్పాడు ప్రతాపరుద్రుని వద్ద తాను ఆశీర్వచన శ్లోకం చెబితే ఆ జోస్యుడు నిందించాడనీ తానతని పొగరణుస్తానని ప్రతిజ్ఞ చేసి వచ్చాననీ నమ్మించాడు మీకు నేను చెప్పిన జోస్యం ఫలిస్తే తనకు సుల్తాను దర్శనం కలిగించమని వరంగా కోరుకున్నాడు చివరకు ఉభయులూ మైత్రి కుదుర్చుకున్నారు బయట చాకళ్ళకు, మంగళ్ళకు

తన ఆనవాలు తెలియకుండా తురకవేషం వారి వద్ద స్వీకరించాడు. తాను కూడా రాజద్వేషినని నమ్మించారు.

ఓరుగల్లును పట్టుకోవడం అసాధ్యమని వలీఖాన్ బృందం తలపోసింది. ఇప్పుడు వచ్చిన జోస్యుడు తమ పక్షంలో వుంటే జనార్దనుని సాధించవచ్చు. అతడు మళ్ళీవస్తే తమపక్షంలో చేర్చుకొని స్నేహం చేయాలని నిశ్చయించుకున్నారు. అలా అని తమ ప్రయత్నాలను మానుకోలేదు. వలీఖాన్ ఒక్కడే రాజును ఖైదుగా చేసి ఢిల్లీ తీసుకెళ్ళటానికి అడవికి వెళ్ళాడు. ఇంతలో ఒకవేళరాజువస్తే రాయబారం జరుపుతుండమని సర్దారులకు చెప్పివెళ్ళాడు.

ప్రతాపరుద్ర మహారాజు వేటకై వెళ్ళి ఒంటరిగా చిక్కి బడలిపోయారు. ఇంతలో రాణిగారికి దుస్వప్నమైంది. ఏలినవారికి కీడవుతుందని రాణిగారు దిగులుపడుతున్నారు. దానికి శాంతి చేయడానికి పురోహితుని పిలిపించారు. గోదావరీ దక్షిణతీరంలో అడవిముఖంలో ప్రతాపరుద్రుడు ఒక చెట్టుకింద నిదురిస్తున్నాడు. వలీఖాన్ సిపాయిలు అతణ్ణి గుర్తుపట్టి వలీకి తెలియ జేశారు. చుట్టుపక్కల ఎవరూ లేకపోతే బంధించమని వలీ ఆజ్ఞ! మర్రి చెట్టు కింద నిద్రిస్తున్నరాజు కాలుసేతులకు బంగారు నంకెళ్ళు తగిలించి ఆయుధాలు తీసివేశారు. కలలో నుంచి రాజు తేరుకొని లేచికూర్చున్నాడు. కాళ్ళు చేతులకు నాగుబాము చుట్టుకున్నట్టు స్వప్నం. ఆడుదానివలె ఇలా చేసినారేమని ఖానును రాజు ప్రశ్నించారు. తనకు కలిగిన భంగపాటుకు రాజు పరిపరి విధాల దుఃఖించాడు. చంచలమైన లక్ష్మి మోసగత్తె గదా! అని అనుకున్నాడు. తన తల్లి, ధర్మపత్ని, కుమారుడు ఏవిధంగా బాధపడతారోనని చింతించాడు. దీనికి మూలకారణం తానే! యుగంధర మంత్రి మాట వినకుండా వేటకు వచ్చినందుకు తగిన ఫలం దక్కింది. విధి బలీయం.

రాజును వలీఖాను సవారిలో వుంచి గోదావరివైపు తీసుకుపోయారు. ఆసమయంలో గోదావరి నదిలో కొన్ని ఓడలు మంత్రి ఆజ్ఞ అందనివి పోతున్నాయి. వాటిలో ఎక్కి వలీఖాన్ బృందం గోదావరి దాటుతున్నారు. గోదావరీతల్లికి రాజు ప్రణమిల్లాడు.

రాజును బందీగా తీసుకుపోవటం విద్యానాదుడనే మహాకవి దూరంనుంచి గమనించాడు ప్రభువునూ ముసల్మానులు తీసుకొని పోతున్నారని వూహించాడు నిజానిజాలు తెలుసుకుందామని గోదావరి నదిలో దూకాడు ఎలానైనా బొంకి నిజం కనుక్కుందామని ప్రయత్నించాడు. పడవలోకి గజగజవొణుకుతూ ప్రవేశించాడు తనది ఆదరిని వుండే గ్రామమని తన తల్లికి ప్రాణాంతకంగా వుందని వైద్యుడు పచ్చిగరళం తెమ్మంటే వచ్చాననీ చెప్పాడు గోదావరిని దాటి రావులూరికి పోయి గరళం సంపాదించానన్నాడు తిరిగి వచ్చే సరికి గోదావరి దరిలో ఏ పడవా కనిపించలేదనీ ఇరవై రేవులు తిరిగాననీ అన్నిరేవులూ పగుల గొట్టారనీ అన్నాడు రాజమంత్రి అజ్ఞతో అలా చేశారట ఎందుకు అలా చేశారో ఎవరికీ తెలియదు. తల్లిని కాపాడటానికి మొసళ్ళ పుట్ట అయిన ఈమడుగులో దూకి ఏటికి అడ్డంగా ఈదుకొని వచ్చానని చెప్పాడు మొసలి తనను తరుముకుంటూ వచ్చినట్లు నటించాడు ఎలానో పడవలో ప్రవేశం సంపాదించి రాజు సమీపానికి వెళ్ళాడు అతని వలన రాజు జనార్దన మంత్రి ప్రయత్నాన్ని గ్రహించాడు విద్యానాధుడు తాను ప్రతాపరుద్రుని మీద ఒక గ్రంధం వ్రాశాననీ ఓరుగంటిలో రాజు లేనందువలన రాజదర్శనం కాలేదని బాధపడ్డాడు. తాను అలంకార శాస్త్రాన్ని ప్రతాపరుద్రునికి అన్వయం చేసి వ్రాశానని ఆయన ద్వారా సన్మానం పొంది తన కుమార్తెకు వివాహం చేయాలన్నాడు. రాజు నగరంలో లేకపోవటానికి తలకొక కారణం చెప్పారనీ వేటకని కొందరు, కాశీకని కొందరు నోటికొకమాట ఇకలాభంలేదని నెలరోజులు చూసి తిరుగుముఖం పట్టానన్నాడు మరొకరికి అంకితం చేయకూడదా? అని రాజు సలహా యిచ్చాడు. 'అంతటను వానినే తగులవేసితిని' అందువల్ల అది సాధ్యముకాదని విద్యానాధుని సమాధానం రాజు రెండు శ్లోకాలు చదివించుకొని సంతోషించాడు బహుమానం ఇచ్చేదానికి తనవద్ద ఏమీలేదు తన జేబులో మొహరు వుంగరమును కవికి బహూకరించాడు దానిపై ప్రతాపరుద్రమహారాజు అని వ్రాసి వుండడంచూసి విద్యానాదుడు ఆశ్చర్యపోయాడు

విద్యానాదుడే ఈ కవి అని తెలుసుకొని రాజు సంతోషించాడు తిరిగి రాజును సింహాసనంపైకి ఎక్కించి అతనికి స్వయంగా [illegible]న్ని

ధరింపజేస్తానని విద్యానాధుడు ప్రతిజ్ఞ చేశాడు తాను అనుమానించినది నిజమైనందులకు కవి ఆనందించాడు పడవలో నుండి బయటపడడానికి కవి మరొక ఎత్తు ఎత్తాడు తనకు తేలు కుట్టిందనీ, మూత్రంవల్ల కడుపు వుబ్బిపోయి బాధగా వుందని చెబుతూ చేతిలో వున్న పొడుంపొట్లాం జారవిడిచాడు. మందుపొడి పోయిందని చెప్పి గొడవ చేస్తున్న కవిని సిపాయిలు నీళ్ళలోకి తోశారు. గోదావరి ఈదుకుంటూ విద్యానాధుడు గట్టెక్కాడు. అంతటి మహారాజుకు విది విధించిన కష్టాలకు ఆశ్చర్యపోయాడు. విష్ణు రథాన్నిఈగ ఢీకొన్నట్లు ప్రతాపరుద్రుని మునల్మానులు బందించారు. ఎంతటి పరాక్రమవంతులైనా విధికి తలవంచవలసినదే అనుకుంటుండగా రాజు పరివారం రాజును వెదుకుతూ కనిపించారు రెండుగడియల ముందు వారక్కడికి వచ్చివుంటే రాజురక్షింపబడి వుండేవాడు తాను తన కుమార్తె వివాహం అలావుంచి రాజసేవలో కృషి చేయాలి రాజు బందీగా పట్టుబడటానికి లోకులంతా చింతిస్తున్నారు గోదావరి నదికూడా కంటతడిపెట్టింది తనవద్ద వున్న రాజముద్రిక ఆధారంగా తాను త్రిలింగ రాష్ట్ర సర్వదర్మవిచారణాద్యక్ష పదవిని స్వీకరించాలి తద్వారా రాచకార్యాన్ని సాధించాలి అని విద్యానాధుడు నిశ్చయించుకున్నారు.

యుగంధర మంత్రి ఓరుగంటికి తిరిగి వచ్చి మంత్రి సభ యేర్పాటు చేశారు తమ తమ్ముని పిలిపించి ముస్లిమ్ సైన్యాన్ని ఓరుగంటిలోనికి రానిచ్చినందుకు బాధపడ్డాడు జనార్ధనుడు తాను అప్రమత్తంగా వున్నానని చెప్పాడు మంత్రికి అపశకునాలు ఎదురయాయి బేతాళరావును దండుతో వెళ్ళి తురకలను రూపుమాపవలసిందిగా ఆజ్ఞాపించాడు జమిందారులందరూ మంత్రి దర్శనానికి విచ్చేశారు. ఇంతలో విద్యానాదుడు సబలో ప్రవేశించి యుగంధరునికి ప్రభువు వృత్తాంతాన్ని తెలియజేశాడు అతడు నానామాయోపయాలతో రాజధాని చేరుకున్నాడు

యుగంధర మంత్రికి విద్యానాదుని మనస్సులో మాట అర్థమైంది కానీ సబలో వారికి తెలియకుండా అతణ్ణి జోస్యునిగా పరిచయం చేసాడు రాజువేటగాయాలతో బెడదపూడిలో రామావధానుల యింట వున్నట్లు ఒక

ఉత్తరం సృష్టించమని విద్యానాథుని కౌగలించుకొని రహస్యంగా చెవిలో చెప్పాడు. చిన్నన్నయ్యను చూసి జనార్దనుడు సాష్టాంగ నమస్కారం చేశాడు. పరస్పరం కుశల ప్రశ్నలు వేసుకున్నారు. గత 18 సంవత్సరాలుగా 18 శాస్త్రాలు నేర్చుకొని రెండేండ్లు దేశాటనం చేసి ఇప్పుడు తిరిగి వచ్చినట్లుగా కథ సృష్టించారు. అతడు తన పినతల్లి కుమారుడని గొప్ప జోస్యుడని సభకు పరిచయం చేశాడు.

విద్యానాథుడు కూడా తన ఆనవాలు బయటబడకుండా తెలివితేటలు ప్రదర్శించాడు. చేయిచూసి భవిష్యత్తు చెప్పగలమని జాతకాలతో పని లేదని అక్కడివారినందరినీ కొన్ని మాటలు చెప్పి లోబరచుకున్నాడు. అతని వాక్సుద్ధికి భేతాళరావు వంటి పెద్దమనుషులు దాసోహమన్నారు. పేరిగాడు ఆశ్చర్యపోక తప్పలేదు. భేతాళరావు గొల్లపడుచుతో సరసమాడటం, విశ్వాసరావు భార్య పాతివ్రత్యము పూసగుచ్చినట్లు చెప్పాడు. విశ్వాసరావు లోపాయకారిగా ఖజానాలో డబ్బు తారుమారు చేయటం జోస్యుడు గుర్తుచేసే సరికి అతని పాదాలు పట్టుకున్నాడు.

పేరిగాడు, విద్యానాథుడు అందరి చేతులూ చూడటం చూసి ఆయన వుంగరం పోయిందేమోనని భ్రమపడ్డాడు. తన చేయి చూపమన్నాడు నేను వుంగరం దొంగిలించలేదని మొరపెట్టుకున్నాడు. పేరిగాని హస్తం చూసి భార్య ఎల్లితో జగడమాడినట్లుగా జోస్యం చెప్పాడు. వారిగిల్లి కజ్జాలను విద్యానాథుడు వివరించాడు. ఇంతలో ఒక ఉత్తరం వచ్చింది. బెడదపూడిలో తాను అనారోగ్యంతో ఉన్నట్లు మహారాజు పంపిన ఉత్తరమది. యుగంధరుడు ఆ ఉత్తరం చూచి బాధపడ్డాడు. విద్యానాథుని యుగంధరుడు మరో మంత్రిగా నియమించాడు. రాజులేని లోటు తీర్చడానికి పేరిగానిని రామావధానుల యింటికి చేర్చి రోగగ్రస్తుడైన రాజుగా చెప్పి అతణ్ణి సవారిలో రేపు నగరానికి చేర్చవలసిందని ఆజ్ఞ జారీ చేశారు. యుగంధర మంత్రి విద్యానాథుని తెలివి తేటలను ప్రశంసించాడు. పేరిగాడు తనకు జరుగుతున్న భోగాలకు గాబరాపడ్డాడు.

మర్నాడు జనార్దనుడు, విద్యానాథుడు పేరిగానిని రోగిరాజునుగా వేషంవేసి తెచ్చి కోటలో వేరుగా ఒకమహలులో వుంచారు. అక్కడ తురక శిబిరంలో సర్దార్ ఖుస్రూఖాన్ రాజువచ్చేశాడని తెలుసుకొని చారులవార్తను నమ్మలేక పోయాడు. వలీఖాన్ రాకపోవడానికి కారణం తెలియలేదు. బహుశా అతడు రాజును కలుసుకోలేక పోయి వుంటాడు. రాయబారం జరపాలో లేదో బోధపడటం లేదు. ఇంతలో ఒక సిపాయి వచ్చి ఎల్లి మొగుడు పేరిగాణ్ణి వలీఖాన్ ఢిల్లీ పట్టుకుపోయాడని తెలియజేశాడు. ఎల్లి ఏడుస్తోంది. యుగంధరుడు పేరిగానికి రాజు వేషం వేసి వేటకు వెళ్ళినట్లుగా మైదానంలో వుంచారు. వలీఖాన్ అతడే రాజనుకొని బంధించి తీసుకెళ్ళాడు. యుగంధర మంత్రిశక్తి యుక్తులకు ఖుస్రూఖాన్ ఆశ్చర్యపోయాడు. తనకు సహాయంగా యమధర్మరాజశాస్త్రులు వుంటే బాగుండును గదా! అనుకున్నాడు. అనుకున్నదే తడవుగా జోస్యం శాస్త్రులు ప్రత్యక్షమయ్యాడు. ఖుస్రూ అతణ్ణి జోస్యం అడిగాడు. వలీఖాన్ గోదావరి దాటి ఎనిమిది ఆమడ నడిచి ఢిల్లీకి శరవేగంతో వెళ్తున్నాడని జోశ్యం చెబుతున్నాడు. రాజనుకొని చాకలిని పట్టుకెళ్ళాడనీ, రాజు సిబ్బందికి తాను దొరకకుండా సుల్తానుకు ఖైదీని అప్పగించాలని అతనికోరిక. ఇంతలో ఎవరో వచ్చి అతడు నిజమైన రాజే అని చెప్పినా జోస్యం శాస్త్రులు ఒప్పుకోలేదు. ఇంతజేసీ చాకలి పేరిగానిని సవారిలో కూర్చోబెట్టి తీసుకెళ్ళారని గేలి చేశాడు. యుగంధరుడు ఖుస్రూపైకి రెండువైపులా రెండులక్షల దండు పంపాడని జోస్యం చెప్పాడు. కోటలో నుండి శిబిరం కిందికి సొరంగాలు తవ్వించారని దాని నిండా తుపాకిమందు దట్టించారనీ మరో గడియలో శిబిరం రూపుమాసిపోతుందని నమ్మబలికాడు.

ఇంతలో ఒక దుబాసీ ఖుస్రూఖాన్ వద్దకు యుగంధర మంత్రి వద్దనుండి ఒకవార్త తీసుకొని వచ్చాడు. ప్రతాపరుద్రమహారాజు ఈ ఉదయమే వేటనుండి వచ్చారని యుగంధరుని ద్వారా వారి రాయబార వార్తను తెలుసుకున్నారనీ చెప్పాడు. కానీ రాయబారాన్ని మోసంగా చేసినందుకు బాధపడుతున్నారు. 'మా చాకలిని మాకు సురక్షితంగా అప్పగించకపోతే వలీఖాన్ తలకొట్టి పంపవలసినదని సుల్తానుకు కబురు పంపారు. అంతవరుకు కింది సర్దారులు ఖైదీలే. ఇది వర్తమానం.

ఖుస్రూను యుద్ధానికి సిద్ధంగా వుండమని రాజాజ్ఞ. ఈ గందర గోళంలో ఖుస్రూకు ఏమీ తోచలేదు. ఇంతకాలం తాను కోటను పట్టుకోకుండా జాప్యం చేసినందున తన కార్యం ఇలా చెడిపోయిందని భావించాడు. యుద్ధం వద్దని చెబుతున్న తనకింది సర్దారులు ముస్తఫా, ఫిరోజులను చంపాలని ఖుస్రూ బయలు దేరాడు. యుద్ధంలో ముస్లిం దండుకు అపజయం కలుగుతుందని జోస్యంశాస్త్రులు చెప్పాడు. నిశ్చేష్టుడుగా వున్న ఖుస్రూఖాన్ వొరలో నుంచి కత్తి తీసుకొని అతని గుర్రం మీదనే చెకుముకి శాస్త్రి బయలు దేరాడు.

ఓరుగల్లులో యుద్ధం ప్రారంభమైనది. యుగంధరుడు శత్రునాశనాన్ని క్రమ పద్ధతిలో జరిపించాడు. శిబిరాలు నేలమట్టమైనాయి.ప్రళయ కల్లోలంగా వుంది. మంత్రిగారిని దర్శించడానికి చెకుముకి శాస్త్రి బయలుదేరాడు.

ఓరుగల్లులో మంత్రి కచేరీ చేస్తున్నాడు. ఎల్లి తన భర్తను తురకలు పట్టుకొనివెళ్ళారని ఏడుస్తూ వచ్చిచెప్పింది. ఎలానైనా తన భర్తను తనకు దక్కించమని మొరపెట్టుకొంటోంది. యుగంధరుడే స్వయంగా వారికి పట్టి యిచ్చాడని ఆమె ఆరోపణ. వారు పట్టుకొనిపోయిన మాట వాస్తవమే కాని మేము పట్టి ఇవ్వలేదని మంత్రి చెప్పాడు. ఏలినవారి దుస్తులు ధరించి తానే ప్రజ్ఞలు పలుకుతున్న నీభర్తను వారు పట్టుకొనిపోయారని మంత్రి చెప్పాడు. ఇంతలో చెకుముకి శాస్త్రిమంత్రి దర్శనానికి వచ్చాడు. అతని ద్వారా పేరిగానిని వలీఖాన్ బంధించి తీసుకొని వెళ్ళినట్లు నమ్మపలికాడు. యుద్ధం ప్రారంభమైందని తెలియజేశాడు. చెకుముకి శాస్త్రి ప్రజ్ఞాపాటవాలకు యుగంధరమంత్రి ప్రశంసించాడు. ఎల్లికి కొంత డబ్బు మంత్రి ఇచ్చి పంపాడు. పేరిగాని కేమీ భయంలేదని అతణ్ణి త్వరలోనే తెప్పిస్తామనీ అతడికి రోజూ పరిచారాలు జరుగుతున్నాయని చెప్పిపంపాడు.

భేతాళరావు, నరసింహరాయలు ఇరువైపులా ముస్లిం సేనలను నరికివేశారు. హాతశేమల్ని ఖైదు చేశారు. భేతాళరావు ఉగ్ర నరసింహామూర్తివలె భయంకరంగా వున్నాడు. అతణ్ణి చూడటానికి కూడా భయం వేస్తోంది. 90 వేలమంది శత్రు సైన్యంలో వారు చనిపోయారు. మైదానమంతా రక్త

సముద్రంలా వుంది చెకుముకి శాస్త్రి తనప్రతిజ్ఞ నెరవేరినందుకు సంతోషించాడు

అంతఃపురంలో రాణి, రాజు తల్లి ముమ్మడమ్మ రాజును చూడాలని వచ్చారు మంత్రులు, రాజవైద్యులు వీలువడదన్నారు రాణిగారికి కోపం వచ్చింది మహామంత్రికి చెప్పి తమ ప్రాణేశ్వరుల దర్శనానికి యేర్పాట్లు చేయించమని యుగంధరునికి కబురు వచ్చింది రాణిని ఆపటానికి శక్యం కావటం లేదు సాక్షాత్తు మహిషాసుర మర్దినివలె కోపంగావుంది అపాయాన్ని శంకించిన యుగందరుడు వారి వద్దకు బయలుదేరాడు మంత్రి ప్రయోగంలో వున్న రాజుగారిని మూడు రోజులు స్త్రీలు, బాలురు చూడరాదని అలా నియమం తప్పితే ప్రాణాపాయమని విద్యానాదుడు, జనార్దనుడు చెప్పారు రాణి ఆమాటలు నమ్మలేదు ఇంతటి దేశక్షోబకర సమయంలో మేము వారిని చూడవలసిందేనని రాణి పట్టుదల యుగంధరుడు వచ్చేంతవరకు ఎవ్వరినీ లోపలికి వెళ్ళనీయమని అడ్డుపడ్డారు

ఇంతలో యుగందరుడు రానేవచ్చాడు విషయం దాటవేసి ప్రయోజనం లేదని యుగందరుడు నిశ్చయించుకున్నాడు ముమ్మడమ్మకు రాజు బందీగాపట్టుబడిన సంగతి రహస్యంగా చెవిలో చెప్పాడు అంతటితో వారు వెనుదిరిగి వెళ్ళిపోయారు అక్కడ వున్నవారిని పేరిగాడురాజుగా ప్రతాపరుద్ర నాటకం ఆడవలసినదని యుగందరుడు సూచించాడు ఏడు నెలల పది రోజులలో రాజుగారిని తాను తీసుకవస్తానని ప్రతిజ్ఞ చేశాడు రాజ్యాన్ని విద్యానాద జనార్దనులకు అప్పగించాడు బ్రతికివుంటే సుఖాలు పొందవచ్చునని మంత్రులను దీవించి తన పరోక్షంలో రాజును పట్టుకున్న సుల్తాను సంగతి చూస్తానని చెప్తూ యుగందరుడు ఎక్కడికో వెళ్ళిపోయాడు

మంత్రులుగా వున్న విద్యానాద, జనార్దనులు పేరిగానికి రాచరీవి శబ్దశుద్ధి కొంతకాలం నేర్పించారు ఆరోజు సభలో రాజు ఒక గాయకుని సభలో సంగీత స్వారస్యాన్ని ఆస్వాదించాలి పేరిగాని జుట్టుకు పొడుగాటి తాడు కట్టి లాగే యేర్పాటు చేసారు పంకావాడు అదిలాగితే 'ఏమి స్వారస్యం' అని రాజు అనాలి ముందుగా పేరిగానికి అబ్యాసం చేయించారు పేరిగాడు

స్వారస్యం అనడానికి బదులు 'సారాసెంబు' అంటున్నాడు సభ ప్రారంభమైంది వైణికుడు, గాయకుడు, మార్దంగికుడు వచ్చి 'చంద్రకళాధర। సాంబసదాశివ!' అనే పల్లవి అందుకున్నారు

పేరిగాడు రసాబాసం చేశాడు చమత్కారానికి అలా అంటున్నారని మంత్రులు సమర్థింపజూశారు ఏలినవారి బుద్ధి ప్రబావాన్ని ప్రశంసించారు. గాయకుడు పాట మొదలుబెట్టాడు స్వారస్యంతాడు లాగారు తనగాడిద ఓండ్రపెట్టినట్లుందని రాజు చెప్పాడు పాటగాడు తనగాడిదకు అన్నోతమ్ముడో అయివుంటాడని, ప్రశంసాపూర్వకంగా అక్షరలక్షలిస్తానని పేరిగాడు పలికాడు ఇలా రసాబాసం చేస్తే విద్యావంతులెవరూ రారని మంత్రులు నచ్చజెప్పారు. ఇంతలో ఒక నటి నాట్యం చేయడానికి వచ్చింది సారాశెంబు తాటి వల్ల తనమెడ పడిపోయిందనీ తనకు కొంత విశ్రాంతి కావాలనీ పేరిగాడు మొరాయించాడు విద్వాంసులను తంజావూరి నుంచి పిలిపించ నక్కరలేదనీ, వీరిని భూమిలో పాతిపెడితే చెట్లు మొలిచి వందల కొలదీ విద్వాంసులు వుడతారనీ పేరగాడు సలహా యిచ్చాడు గాయకులు హడలిపోయి పారిపోవాలనుకున్నారు నాట్యాన్ని చూస్తూ మృదంగం చేసేవాణ్ణి గేలిచేశాడు స్వారస్యం తాడు తెగిపోయింది ఇంతలో తాను మెచ్చుకునేలా కవిత్వం చెబితే అక్షరలక్షలిస్తానని పేరిగాడు ప్రగల్బాలు పలికాడు పీయూష వర్షులనే కవి ఒక పద్యాన్ని రాజుగారిపై చెప్పాడు కవితో పేరిగాడు కొంతవాదోపవాదం చేశాడు ఆనాటి సభ చాలించారు

చిలుకకు నేర్పినట్లు నేర్పితే సమయానికి వ్యర్థం చేశావని మంత్రులు పేరిగాణ్ణి తిట్టారు కొత్తవారి ఎదుట వాడెలా వ్యవహారిస్తాడో చూడాలని తమలో తామే సంగీత గాంధ్రుగా కవులుగా వచ్చి దర్శనం చేసుకున్నారు. పేరిగాడు మంత్రుల బోదను మరిచిపోయి తన సహజ దోరణిలో ప్రవర్తించి రసాబాసం చేశాడు ఒకవేళ కొత్త వారే వచ్చి వుంటే పరువు దక్కేదికాదని మంత్రులు సంతోషపడ్డారు ఇతణ్ణి కొత్తవారికి చూపించ వద్దని ఎక్కడైనా బయట పరగణాలలో ఇతని ఆకారాన్ని ఉపయోగించుకుందామని నిశ్చయించు కున్నారు వీడు మూడుడుగా వుండడమే మహోపకారమనీ, వివేకి అయితే కష్టమనీ నిర్ణయించుకొన్నారు ప్రపంచంలో మంత్రానికి పనికిరాని అక్షరము

మందుకు పనికిరాని వేరు ఉండదు. అలాగే అయోగ్యుడైన పురుషుడంటూ వుండడు. ఉపయోగించుకునే వాడే వుండాలి అని శుక్రాచార్యుడు చెప్పిన మాటలు మంత్రులు గుర్తుకు తెచ్చుకున్నారు. పేరిగాని ప్రవర్తన ఇతరులకు తెలియకుండా కడుపుబ్బ నవ్వుకున్నారు.

ఢిల్లీలో చెకుముకి శాస్త్రి యుగంధరుని ఆజ్ఞతో వలీఖానుతో కుట్రపన్నాడు. తురకవేషంలో చెకుముకి శాస్త్రి వలీఖాన్ దర్బారులో ప్రవేశించాడు. మంత్రి చెప్పినట్లుగా ఒక పన్నాగం చెప్పాడు. వలీఖాన్ పై కోపాన్ని ప్రకటించాడు. ఢిల్లీ తీసుకొనిపోయి సుల్తాన్ దర్శనం చేయిస్తానని చెప్పినమాటలు విని మోసపోయానని చెప్పాడు. ఏదో తొందరలో వచ్చాననీ వలీఖాన్ సర్ది చెప్పాడు. లోకమంతా చాకలిని పట్టుకొచ్చావనీ ఎగతాళి చేస్తోంది అని శాస్త్రి రహస్యంగా చెప్పాడు. ఇప్పుడు చాకలి రాజభోగాలనుభ విస్తున్నాడనీ కవ్వించాడు. యుద్ధంలో ఖుస్రూ పరారై దండు సర్వనాశనమైందనీ చెప్పాడు. రాజు వేటలో చనిపోయాడని పుట్టిన వదంతి నిజంకాక వారంరోజులకు రాజు తిరిగి వచ్చాడు. యుగంధరుడు రామేశ్వరం పోయి అక్కడ మరిడీ జాడ్యంతో చచ్చిపోయాడు - ఇది చెకుముకి శాస్త్రి వలీఖాన్‌కు కల్పించి చెప్పిన కథ.

భవిష్యత్తు సంగతి చెప్పమని వలీఖాన్ శాస్త్రికి దండంపెట్టాడు. శాస్త్రి కొన్ని మాటలు చెప్పాడు. ఖుస్రూవచ్చి వలీఖాన్‌తో చాకలిని బంధించి తీసుకు వచ్చావని చెబితే వాణ్ణి చంపివేయాలనుకుంటున్నావు. రెండవది ఢిల్లీ సింహాసనం ఎక్కాలనుకుంటున్నావు అన్నాడు శాస్త్రి. తనను ప్రమాణ పూర్వకంగా ఓరుగల్లు పాదుషా చేస్తానని కాగితంపై వ్రాసి ఇవ్వమని శాస్త్రి పట్టుబట్టాడు. వలీఖాన్ అంగీకరించాడు. కుట్ర స్థిరపడింది.

మూడునెలలుగా ఢిల్లీవీధులలో 'ఢిల్లీ సుల్తాన్ పట్టుకుపోతాన్' అని ఒక వెర్రివాడు అరుస్తూ తిరుగుతున్నాడు వాడు వెర్రివాడో కాదో కనిపెట్టమని సుల్తాను చారులను నియమించాడు. చారులు అతణ్ణి అనుసరించి తిరుగుతున్నారు. రాజుకూ వీడికి ఏదైనా సంబంధం వుందా అని వాళ్ళు రహస్యంగా గమనిస్తున్నారు. తాను కండ చీమననీ, పట్టుకుంటే వదలననీ

వెర్రివాడు అరుస్తున్నాడు. పిచ్చి పిచ్చి వేషాలు వేస్తున్నాడు. నేలమీద పడి పొర్లాడు. దండాలు పెడుతున్నాడు దారిలో కనిపించిన పిల్లవాండ్రను గొడుతున్నాడు. చెకుముకి శాస్త్రి కుట్రప్రకారం కార్యం సాధించడానికి ప్రతాపరుద్రుని ఆభరణాలను వలీఖాన్ దగ్గర నుండి లంచంగా తీసుకొన్నాడు. అవి ఒక పెట్టెలో పెట్టి జవాను చేత ఎత్తించుకొని వీధిలో వెర్రివాడి ముందర శాస్త్రి వెళుతున్నాడు.

ఖుస్రూఖాన్ ఓరుగంటి యుద్ధంనుండి పరారై వచ్చాడు. అతడు వలీఖానును చూడటానికి పోతూ దారిలో వెర్రివాణ్ణి నిదానించి చూశాడు. వెర్రివాడు తనకు శిష్యుడుగా ఆడుతున్న ఒకణ్ణి తన కుమారునే ఖుస్రూ వెంట చారుడిగా పంపించాడు. ఖుస్రూ, వలీని చూశాడు. యమున వద్ద స్మశానంలో వెర్రివాడు పిచ్చి పిచ్చి మాటలు మాట్లాడుతున్నాడు. వీరడు రాగడు తన భూమిని లాగుతున్నారనీ తన పెళ్ళాన్ని దాచేశారనీ తనను సంవత్సరాల తరబడి కట్టివేశారనీ గొడవ చేస్తున్నాడు. 'ఢిల్లీ సుల్తాన్ పట్టుకు పోతాన్' అని మధ్య మధ్యలో అరుస్తున్నాడు. రాళ్ళతో పొయ్యి చేసి కుండపెంకులో ఎసరుపెట్టి చింత కొరువులతో మంట బెట్టాడు. ఎసట్లో బియ్యం పోసి బాణా కొరివితో కుండ పగుల గొట్టాడు. ఇలా ఏదేదో గొడవచేస్తూ నేను మేలుకోవడ మేమిటి? పట్టణం నిద్రపోవడమేమిటి? ఎవరినీ నిద్ర పోనీను అంటూ వూళ్ళోకి వెళ్ళాడు.

ఖూస్రూ వలీని చూసి రాజునకు బదులుగా చాకలిని తీసుకొని వచ్చావని అన్నాడు. ఆ మాట ఖుస్రూ సుల్తాన్‌తో చెప్తాడేమోనని వలీ భయపడ్డాడు. అతణ్ణి షికారీకని చెప్పి యమున ఒడ్డున స్మశానం వద్దకు తీసుకొని వెళ్ళాడు. అక్కడ తలకొట్టి తలకాయను గట్టు వెంబడి పాతి మొండెమును రాతికి కట్టి యమునలో పడవేశాడు వెర్రివాని శిష్యుడు అది గమనించి జరిగిన విషయాన్ని వెర్రివాడికి తాటికాయ పాట రూపంలో చెప్పాడు. ఆ వార్త తెచ్చిన శిష్యునికి వెర్రివాడు దుశ్శాలువా వెయ్యినూటా పదహార్లు యిస్తానన్నాడు. పాటరూపంలోనే వెర్రివాడు శిష్యునికి ఒక సూచన చేశాడు. ఆ కళేబరాన్ని తెచ్చి తలను అతికించి దాచి పెట్టమన్నాడు. శిష్యులను పిశాచాలుగా

ఉపయోగించుకోమని చెకుముకి శాస్త్రికి తన ఆజ్ఞగా చెప్పమన్నాడు. తాను మాత్రం వెర్రివాడుగా తిరుగుతున్నాడు.

వెర్రివాడు ఏకాకిగా యమునా తీరంలో శ్మశానం వద్ద వంట చేసుకోవడం ఖుస్రూఖాన్ చారులు చెట్లపై నుండి దాగికొని చూస్తున్నారు. వెర్రివాడికి అవలింత వచ్చింది. అందుకని వెర్రివాడు అనుమానించి యెవరో చారులు తనను గమనిస్తున్నారని ఊహించి కుండను పగులగొట్టాడు.

సుల్తాను చారులు వెర్రివాడికి నిజంగా వెర్రి అని నిశ్చయించుకొని చెట్లమీదనుంచి దూకి పోయి సుల్తానుకు చెప్పారు. సుల్తాను ఢిల్లీకోటలో దర్బారు కొలువు తీరాడు. ఎందరో వజీరులు సేనాపతులు చుట్టూ కూర్చుని వున్నారు. వెర్రివాణ్ణి గురించి ప్రస్తావన వచ్చింది వలీఖాన్ వాడు అలానే అరుస్తూ తిరుగుతున్నాడని చెప్పాడు. సుల్తాను గొప్పవాడా! లేక అల్లా గొప్పవాడా! అనే విషయంపై వజీరులు చర్చ మొదలు పెట్టారు సుల్తాను గొప్పవాడని నిర్ధారించారు. సుల్తాను ఇప్పుడే దండిస్తే, అల్లా ఎప్పుడో దండిస్తాడనీ, సుల్తాను ప్రత్యక్ష దైవమైతే అల్లా కనిపించడనీ సుల్తాను మాటలు వినిపిస్తాయనీ, అల్లా మాటలు వినిపించవనీ తేల్చివేశారు. తెలుగు రాజును పట్టుకువచ్చినందుకు వలీ తెలివి తేటలకు సుల్తాను సంతోషించాడు కానీ యుద్ధంలో ఖుస్రూ చనిపోవడం తనకు బాధగా వుందన్నాడు

సుల్తాన్ దర్శనానికి కోమట్లు, ఓడ వర్తకులు వచ్చారు. కంటికి మిరుమిట్లు కొలిపే నజరులు చూపించారు. తమ వద్ద మోసం వుండదనీ సుల్తానును వెతుక్కుంటూ నాలుగు వందల ఆమడ దూరం వచ్చామనీ చెప్పారు వివిధ రకాల వజ్రాలు చూపించారు. ఇవి తయారు చేయడానికి పది సంవత్సరాలు పట్టిందన్నారు ఒక వజ్రాన్ని సుల్తాన్ చేతిలోకి తీసుకొని దాని కాంతికి ఆశ్చర్యపోయాడు. ఖరీదు ఎంతవుతుందని అడిగాడు. దాని వెల కట్టలేమని వర్తకులు చెప్పారు వజీర్లు కూడా అవి అమూల్యమైనవన్నారు. వర్తకులు వజీర్లకు నజర్లు బహుమానంగా యిచ్చారు. ఇంతకూ వారు వచ్చిన పని ఏమిటో సుల్తాను తెలుసుకోవాలనుకున్నాడు. మేము ఓడలలో యిలాంటి విచిత్ర వస్తువులు అనంతంగా తెచ్చామనీ, గోవా నుండి వచ్చామనీ నాలుగు

ఓడలలో సరుకులున్నాయనీ అవి సుల్తాను వచ్చి చూడాలనీ వేడుకున్నాడు. నజరానా స్వీకరించినందున వాళ్ళ వద్ద ఏమైనా కొనాలని సుల్తాను నిశ్చయించుకున్నాడు. నాలుగు ఓడలలో వింత సరుకులు అపారంగా వున్నాయనీ వాటిని ఇవతలికి తీసుకు రావడానికి రెండు నెలలు పడుతుందనీ సుల్తాను స్వయంగా ఓడల మీదకి వచ్చి ఎంచుకోవచ్చునన్నారు. సుల్తాను అంగీకరించాడు. ఆమణుల వెలలు కట్టడానికి ప్రతాపరుద్రుణ్ణి ఖైదీనుంచి విడిపించి తెప్పించారు. సుల్తాను, వజీర్లు అందరూ ఓడ మీదికి పోయారు. దారిలో వెర్రివాడు 'ఢిల్లీ సుల్తాన్ పట్టుక పోతాన్ ఇదిగో ఇప్పుడే పట్టుక పోతాన్' అని అరుస్తూ వాళ్ళవద్దకు వచ్చాడు. వినోదంకోసం సుల్తాన్ వాణ్ణి కూడా ఓడమీదికి తీసుకువచ్చాడు. ప్రతాపరుద్రుని తురక సౌదాగర్ వేషంలో తీసుకవచ్చారు. మణుల ఖరీదు చెప్పమని సుల్తాను ఆయనను కోరాడు. రాజు ఆ వస్తువులను పరీక్షగా చూశాడు. ఓడలలో వర్తకులు సుల్తానుకు వినోదాలు చేస్తూ పొద్దు బుచ్చారు. రాత్రి భోజనాలకు అందర్నీ అక్కడనే నిలిపివేశారు. భోజనాలయిన తర్వాత సుల్తాను కోసం త్రిలింగ విజయం నాటకం ఆడించారు. అందులో వలీఖాన్ చాకలిని పట్టితెచ్చి రాజని చెప్పడం ఒక సన్నివేశం. ఖుస్రూఖానుని చంపటం ఖుస్రూ కళేబరం చేతనే చెప్పించారు. వర్తకులు కళేబరాన్ని చూసి ఒణికి పోయారు. వజీర్లు భయంతో దూరంగా వెళ్ళారు. సుల్తాను ఒణుకుతున్నాడు. ఖుస్రూ తనను వలీ చంపాడనీ యుద్ధంలో చావలేదనీ రాజుకు బదులు వలీ చాకలిని పట్టుకున్నాడనీ చెప్పాడు. సుల్తాను వజీర్లు ఏడుస్తున్నారు. వలీ కళ్ళు మూసుకున్నాడు ఖుస్రూ కళేబరంలోంచి చెకుముకి శాస్త్రి బయటికి వచ్చాడు. వలీఖాన్ అది గమనించాడు యమధర్మరాజా! అన్నాడు. సుల్తానుకు కోపం వచ్చింది. వలీఖాన్‌ను అతని పక్షం వజీర్లనూ అంగరక్షకుల చేత తలకొట్టించాడు. యమునలో పారవేయించాడు. వలీ పన్నిన కుట్రను సుల్తాను గ్రహించాడు. చెకుముకి శాస్త్రి చేసిన సహాయానికి సుల్తాను సంతోషించి సర్వసేనాపతిని చేశాడు. వర్తకులు వలీఖాన్ తల తెచ్చి దాచి పెట్టారు. సుల్తాను ఇద్దరు వజీర్లు, ఇద్దరు జవాన్లు మాత్రమే ఇక బతికి వున్నారు.

సుల్తాను తదితర పరివారానికి ఓడలోనే నిద్రపోయే యేర్పాటు చేశారు.

ఆయాసం తీరడానికి చెకుముకి శాస్త్రి సుల్తానుకు షర్బత్ యిచ్చాడు. అది తాగి సుల్తాను నిద్రపోయాడు వర్తకులు రాజుచేత మంగళవేషాలు ధరింపజేశారు. వెర్రివాడికి మహామంత్రి వేషం తెప్పించి యిచ్చారు. వెర్రివాడే యుగంధర మహామంత్రి. మహారాజు యుగంధరుని పాదాలు పట్టుకున్నాడు. మీదయవలన ఆపద గడిచిందన్నాడు. దైవికంగా ఇలా జరిగింది లెమ్మనీ గతానికి చింతించ వద్దని సమర్థించాడు. వర్తకులు, చెకుముకి చేసిన సహాయాన్ని యుగంధర మంత్రి ప్రశంసించాడు. సుల్తానును బందీ చేశారు. రాత్రి ఎప్పుడో ఓడలకు లంగరు ఎత్తి, చాపలు ఎత్తారు. ఓడలు వేగంగా పోతున్నాయి. రేపే విశ్వనాథుని సేవ.

ఓడలు తెల్లవారేసరికి కాశీ చేరుకున్నాయి. కృశించిన శరీరంతో వ్రతదీక్ష గైకొన్న రాణి అక్కడ ఓరుగల్లులో పూజామందిరంలో గౌరీదేవిని పూజిస్తోంది. అంతకు క్రితం రాత్రి స్వప్న ఫలితాలను పురోహితుడు రాణిగారికి వివరిస్తున్నాడు. స్వప్నంలో దేవతలిచ్చిన వరాల ఫలితంగా ఈరోజే రాణి రాజుగారిని కలుసుకోగలదని చెప్పాడు. రాణి అనేకమంది బ్రాహ్మణులను పూజించింది. ముత్తైదువులను కొలిచింది. కానుకలు సమర్పించింది. రత్నరాసులు వినియోగం చేసింది. ముత్తైదువులు సంతోషంగా వెళ్లారు. గత 7 నెలలుగా ఆమె ఇలాంటి కార్యక్రమాలు నిర్వహిస్తోంది. ఇంతలో రాణి ఎడమకన్ను అదిరింది. ప్రాణేశ్వరుడు ఈ రోజు కనిపిస్తాడనే సంతోషంలో రాణి అత్తగారి దీవెనలు కోసం వెళ్ళింది. ఓరుగల్లు రాజ వీధులలో అప్పుడే చాటింపు వినిపించింది. యుగంధర మంత్రి చాకలి పేరిగాణ్ణి తీసుకొస్తున్నాడనీ - వాణ్ణి తీసుకువెళ్ళిన సుల్తానును కూడా పట్టు కొచ్చారని, మహారాజు వారికి ఎదురేగి నగరులోకి తీసుకువచ్చారనీ చాటించారు. నగరం అలంకరింపజేశారు.

రాజునగర ప్రవేశానికి వ్యూహం పన్నారు. ఖుస్రూ కళేబరం బండిలో వుంది. వలీ తల అక్కడ గడమీద వుంది. గౌరీదేవి ఈ విశేషాలను రాణికి తెలియ జెప్పటానికి విద్యాధర దంపతులను పంపించింది. యుగంధరుని ప్రతిభవలన సుల్తాను బంధితుడైనాడనీ వారు జరుగుతున్న వృత్తాంతాన్ని చెబుతున్నారు.

ఎనిమిది ఏనుగుల మీద (అష్టగజ పుష్పకం) రాజు సుల్తాను మంత్రులు వస్తున్నారు. వారి ముందర సువర్ణవృష్టి కోసం కురిపిస్తున్నారు. బాజా భజంత్రీలతో రాజు ముందుకుసాగుతున్నాడు. యుగంధరుడు ఏకాకిగా గుర్రం మీద కోటకు పోతున్నాడు. పౌరకాంతలు ఆనందంతో చూస్తున్నారు. రాజును పుష్పకంనుండి దింపి అంతఃపురంలోకి తీసుకువచ్చారు. ముమ్మడమ్మ రాజువద్దకు వచ్చింది. రాజుకు ముత్తైదువులు హారతి యిచ్చారు. రాణి ఆర్యపుత్రులు కనిపించారని ఆనందపరవశురాలైంది. రాజును రాజమాత కప్పగించి తనమాట నెరవేర్చుకున్నానని యుగంధరమంత్రి వినయంగా చెప్పారు. రాజు తల్లి పాదలకు నమస్కరించాడు. నా కడుపున దైవకృపతో పుట్టావనడం కంటె ఈ యుగంధరుని వరంవల్ల పుట్టావని చెప్పడం సమంజసమని ఆ తల్లి చెప్పింది. యుగంధరుని రుణం తీర్చుకోలేమని కుటుంబమంతా అనుకున్నారు. యుగంధర మంత్రి తన తమ్ములవద్దకు వచ్చాడు.

పేరిగాణ్ణి రాజువేషంలో యింటికి చేర్చారు. ఢిల్లీ నుండి తీసుకు వచ్చామని ఎల్లితో చెప్పివంపారు. వారం రోజులు దేశంలో ఉత్సవాలు జరిపారు. ఎల్లికి పేరిగానికి అక్కడి ముసలమ్మలు ఎర్రనీళ్ళు తీశారు. ఎల్లి సంబర పడింది. చుట్టుపక్కల అమ్మలక్కలకు పూలదండలు పంచియిచ్చింది. అందరూ విందు చేసుకున్నారు. తాను పడిన బాధలు పేరిగాడు కథలు కథలుగా చెప్పాడు. అక్కడి పురోహితులు తనకు జందెం వేశారనీ, ఈ ఎనిమిది నెలలు తాను నానా అవస్థలూ పడ్డాననీ గొప్పగా చెప్పాడు.

పేరిగాడు తాగికైపెక్కి దూడపేడ, బఱ్ఱెపేడ లేక తాను కూడు తిననని ఇంట్లోనించి వెళ్ళి పోయాడు. ఎల్లి తన మామ ఎక్కువ తాగకుండా చూచుకోవాలని మనసులో అనుకుంది. పేరిగాడు రాచనగరులో దూధ్‌పేడా బర్ఫీ తినడం అలవాటు చేసుకున్నాడు. జంధ్యం వేసుకొని అలవాటు లేక నానా అవస్తలూ పడ్డాడు. బంగారు, రత్నాలు ధరించి దేశం అంతా తిరిగాడు. సవారిలో దర్జాగా తిరిగాడు. అనేక దేవాలయాల్లో సన్మానాలు పొందాడు. ప్రసాదాలు తిన్నాడు. శఠగోపం పెడితే అది తీయవద్దని జగడం ఆడేవాడు.

భోగం మేళాలు చూశాడు. పేరిగాడికి అమ్మవారు ఆవహించిందని అనుకున్నారు. కూడుతినమని ఎల్లి ఎంత బతిమాలినా పేరిగాడు వినలేదు. మురికి గుడ్డలుతికే ఎల్లి నాకొద్దని తమాషాకు సరసమాడాడు. ఎనిమిది నెలలుగా తాను రాత్రింబగళ్ళు అతనికోసం కలవరించిన సంగతి ఎల్లి చెప్పింది. పేరిగాడికి ఎర్రి పట్టిందని అది కుదిరితే తనకు మంత్రి యిచ్చిన నగలు నిలువు దోపిడీ యిస్తానని గౌరమ్మతల్లికి మొక్కుకుంది. ఈ సంగతి మంత్రితో ఎల్లి మొరపెట్టుకుంది. క్షేమంగా తెచ్చి యిస్తానని చెప్పి ఎర్రోణ్ణి తెచ్చియిచ్చారని గోల చేసింది. ఏదైనా మందో, మంత్రమో వేయించమంది.

ఓరుగల్లులో ప్రతాపరుద్ర మహారాజు తన ఆస్థానంలో కొలువుతీరాడు. అక్కడ అన్నమదేవుడు సురత్రాణుడు, వజీర్లు, జనార్దన విద్యానాధులు. చెకుముకి శాస్త్రి నరసింహరాయలు, విశ్వానరావు పరివారంతో ప్రవేశించి తమతమ స్ధానాల్లో ఆశీనులయారు. మహారాజు తన తమ్ముడైన అన్నమ దేవుని కటకం పరిస్థితి వివరించమన్నాడు. అన్నమ దేవుడు కటక నరేంద్రుడైన బల్లహుని యుద్ధంలో చంపి అతని కుమారుడు భండిని రాజును చేశానని చెప్పాడు. ఆ రాజ్యంలోని సంపదను కొల్లగొట్టి తెచ్చానని చెప్పాడు. కటకాన్ని జయించిన సంగతి తెలుసుకున్న సుల్తాను ఢిల్లీ మీదకి కూడా ప్రతాపరుద్రుని బలగం వస్తుందని, దక్షిణదేశంవారి స్వాధీనమౌతుందని తాను బయటపడటం కుదరదనీ తలపోశాడు. ఇంతటి పనులు సాధించిన యుగంధర మహామంత్రిని చూడాలని సుల్తాను కోరిక వెలిబుచ్చాడు. యుగంధరుని రప్పించారు. రాజ్యంలో మహోత్సవాలు ప్రకటించారు. యుగంధరుడు సుల్తానుతో సంభాషణ మొదలు పెట్టాడు. మహామంత్రి శలవిస్తే తాము ఢిల్లీ వెళ్ళిపోతామని సుల్తాను కోరాడు

ముమ్మడమ్మ యుగంధరుడుకి ఒక వజ్రహారం బహుమానంగాపంపింది. దానిపై వీర బిరుదాంకితమైన పదాలు ఇలా వ్రాసి ఉన్నాయి.

'త్రైలింగ రాజ్య సింహాసన సంస్థాపక!

ఢిల్లీ సురత్రాణ బందీ గ్రాహక!' అని వ్రాసి యుంచిన హారాన్ని యుగంధరుని మెడలో మహారాజు అలంకరించారు. ప్రతాపరుద్రుని కుమారుడు

సభలోకి వచ్చి పెద్దలకు నమస్కరించాడు. ఇంతవరకు జరిగిన కథ యావజ్జీవం సుల్తానుకు వినోదంగావుండిపోతుందని యుగందరుడు శలవిచ్చాడు సుల్తాను యుగందరుని పాదాలకు నమస్కరించాడు యుగందరుడు సుల్తాను చేయి ప్రతాపరుద్రుని చేయి కలిపి వారికి మైత్రిని కలిపాడు సుల్తాను తన జ్ఞాపకార్థం యుగంధరునికి కత్తి, పగిడీ ఇచ్చాడు. సగౌరవంగా సేనాపతి బేతాళరావు వెంటరాగా పరివారంతో సుల్తానుకు అందరూ వీడ్కోలు చెప్పారు. ఆ సమయానికి వర్తకులు కూడా అక్కడికి వచ్చారు వర్తకులు చేసిన మోసాన్ని సుల్తాను గుర్తుకు తెచ్చుకున్నాడు వారి తంత్రానికి మాయోపాయాలకు బుద్ధి కుశలతకు మెచ్చుకున్నాడు చివరకు అందరమూ స్నేహితులమైనామని సుల్తాను వారిని ప్రశంసించాడు అక్కడ నుండి త్వరగా వెళ్ళిపోవడం మంచిదని వజీర్లు సుల్తానుకు సలహా చెప్పారు

ఇంతలో రాజ సభలోకి ఎల్లి ప్రవేశించింది పేరిగాణ్ణి జవాన్లు తీసుకొని వచ్చారు యుగందరుడు మహారాజుకు జరిగిన కథ చెప్పాడు ఎల్లి భర్త పేరిగాడని అతన్ని వలిఖాన్ ఖైదు చేసి తీసుపోయాడనీ చెప్పాడు ఇప్పుడు భార్యాభర్తల మధ్య ఏదో రగడ జరిగిందనీ. ప్రభువులే విచారించాలని చెప్పాడు ఎల్లి భర్త పై పిర్యాదు చేసింది భర్త తన నొల్లనని మురికి కంపు కొడుతున్నాననీ పేడ లేకుండా కూడు తిననంటున్నాడనీ రాజుగారికి చెప్పింది పేరిగాడు తనకేమీ తెలియదని చేతులు మోడ్చి దండం పెట్టాడు

రాజు తన తీర్పు చెప్పారు తమ దర్శనం చేసుకున్న ఈ భార్యాభర్తలకు ఒక ఇనాం ఇస్తున్నామన్నారు ఇకపై వారు చాకిపని మానుకోవచ్చుననీ పేరని చాకలి దొరను చేస్తున్నామనీ ఆజ్ఞాపించారు చాకళ్ళందరూ ఇకపై చాకలి దొరకు పన్ను కట్టాలి అతనికి సకల సంపదలూ పరివారము భోగభాగ్యాలు కలుగుతాయి ఎల్లి దొరసాని అవుతుంది

సభలోనికి విద్యానాదమహాకవి ప్రవేశించాడు ఒక శ్లోకాన్ని చదివి అగ్రహారాలకు పీడ కలిగిందనీ అర్థం వచ్చేలా చెప్పాడు ఇక్కడ అగ్రహారాలనగా స్త్రీల పాలిండ్లపై వుండే హారాలని అర్థం రాజు ఆ సూక్ష్మం

గ్రహించి విద్యానాథుని కావ్యకన్యకు కృతి భర్తగా ఉంటానని కవితో చెప్పాడు. ప్రతాపరుద్రీయ కావ్యం అంకితం తీసుకున్నాడు. అంతకుముందు కవి 'అంతటా వానినే తగుల వేసితినని' అన్నమాటకు అర్థం ప్రతిశ్లోకానికి ప్రతాపరుద్రుని పేరు తగిలివున్నదని కవి అర్థం చెప్పాడు. కన్యా దాతకు గౌరవ పురస్కారాలు జరిగాయి. కృతి భర్తకు విద్యానాథుడు తన చేతివ్రేలికి వున్న (రాజు ఇచ్చిన రాజముద్రికను) రాజు వ్రేలికి ధరింప జేశాడు. రాజు తన మిత్రులకు హితులకు శాసనాల ద్వారా కానుకలు అందించారు. దేవతలు పుష్పవృష్టి కురిపించారు.

## 5

# కన్యాశుల్కం

(సాంఘిక నవల)

గురజాడ వెంకట అప్పారావు

**1861-1915**

ప్రథమ ముద్రణ : **1897**

# గురజాడ అప్పారావు.

గురజాడ వెంకట అప్పారావు నవ్యాంధ్ర కవితా వైతాళికులుగా ప్రసిద్ధులు. ఎలమంచిలి తాలూకా రాయవరంలో 1861 సెప్టెంబరు 21న అప్పారావు జన్మించారు చీపురు పల్లిలో ప్రాథమిక విద్యను, విజయనగర కళాశాలలో బి.ఏ చదివారు. ఆ కళాశాలలోనే ఉపన్యాసకుడుగా చేరారు విజయనగర ప్రభువుల ఆస్థానంలో ప్రాచీన లిపి పరిశీలకుడుగా కూడా పనిచేశారు

గ్రాంధిక భాష బాగా ప్రచారంలో వున్న ఆరోజుల్లో ఆయన వ్యావహారిక భాషోద్యమంపట్ల మొగ్గుచూపారు. పూర్ణమ్మ కన్యక, లవణరాజుకల, ఖండకావ్యాలుగా వెలువరించారు గురజాడ సృష్టించిన ముత్యాలసరాలు దేశిచ్ఛందస్సులో ఆణిముత్యాలు 'దేశమును ప్రేమించుమన్నా!' అన్న గేయం విశేషప్రజాదరణ పొందింది.

'నీపేరేమిటి?' 'సంస్కర్త హృదయం' అనే కథానికలలో ఆయన సామాజిక స్పృహ కనిపిస్తుంది. కన్యాశుల్కం నాటకాన్ని ఆయన 1891లో ప్రకటించారు అప్పటికే తెలుగునాట వరవిక్రయం కంఠాభరణం వంటి సాంఘిక వచననాటకాలు ప్రచారంలో ఉన్నాయి విజనగరంలో జగన్నాథవిలాసినీ సభవారు మొదటిసారిగా కన్యాశుల్కం ప్రదర్శించారు.

కన్యాశుల్కం అనే సాంఘిక దురాచారం ఆనాడు ప్రబలంగా వుండేది. మహారాజుగారి ఆదేశానుసారం కన్యాశుల్కం తీసుకున్నవారి గణాంకవివరాలను సేకరించే బాధ్యత అప్పారావు స్వీకరించాడు. ఇందులో విజయనగరం ప్రాంతాల మాండలిక వ్యావహారికభాష ప్రయోగింపబడింది. రెండవకూర్పు సమయంలో 1909లో కొద్దిమార్పు చేశారు ఇది గొప్పసాంఘికనాటకమని సుప్రసిద్ధ విమర్శకులు కట్టమంచి రామలింగారెడ్డి అన్నారు. ఈనాటకం తమిళం, ఆంగ్లం, ఫ్రెంచి, రష్యన్ భాషలలోకి అనువదించబడింది.

ఇందులో పాత్రలు వందసంవత్సరాల తర్వాత కూడా సజీవంగా మనకు కనిపిస్తాయి. తెలుగు సాహిత్యంలో అర్థశతాబ్ది కృషి చేసిన అప్పారావు 1915 నవంబరు 30న కాలధర్మం చెందారు.

# కన్యాశుల్కం గురించి

విజయనగరంలో గిరీశం అనే పెండ్లికాని పెద్దమనిషి వున్నాడు అతడు బహు మోసకారి ఆవూరిలో వేశ్య మదురవాణి అతని స్నేహితురాలు అతని ప్రియశిష్యుడు వెంకటేశం ఆసంవత్సరం అతడు పరీక్షతప్పాడు పరీక్ష తప్పినందుకు తండ్రి దండించకుండా గిరీశాన్ని వెంకటేశం తనవూరికి తీసుకెళ్ళాడు అగ్నిహోత్రావదానులు పెద్దకూతురు బుచ్చమ్మ చిన్నకూతురు సుబ్బికి ఇంకా పెండ్లి కాలేదు వెంకటేశం అతగాని కొడుకు చదువుకు డబ్బుఖర్చు అవుతోందని వెంకటేశాన్ని అగ్నిహోత్రావదానులు గదమాయించాడు గిరీశం తన ఆంగ్లప్రతిభను బంధుత్వాన్ని చూపి అగ్నిహోత్రావదానుల్ని లొంగదీసుకున్నాడు మాటలతో బుచ్చమ్మను వశపరచుకున్నాడు

రామప్పపంతులు మదురవాణిని వుంచుకున్నాడు లుబ్ధావదానులతో సుబ్బిపెండ్లి నిశ్చయమైంది దాన్ని చెడగొట్టమని రామప్పపంతులు మధురవాణి సహాయంకోరాడు రామప్పపంతులు లేని సమయంలో మదురవాణి యింటికి కరటక శాస్త్రులువచ్చాడు ఆయన శిష్యునికి ఆడపిల్లవేషం వేసి లుబ్ధావధానులతో పెండ్లి జరిపించటానికి పన్నాగం పన్నాడు

గిరీశం మాయమాటలతో బుచ్చమ్మ హృదయంలో చోటు సంపాదించాడు బుచ్చమ్మను పెండ్లి చేసుకుంటానని నమ్మబలికాడు దొంగవుత్తరం సృష్టించి లుబ్ధావదానుల పెండ్లి రామప్పపంతులు ఆపించగలిగాడు కరటకశాస్త్రి (గుంటూరుశాస్త్రి) తన కూతురినిచ్చి కన్యాశుల్కంతో పెండ్లి జరిపిస్తానని చెప్పాడు చెల్లెలిపెండ్లి తప్పించడానికి మనమిద్దరం లేచిపోవటమే మార్గమని బుచ్చమ్మతో గిరీశం నమ్మబలికాడు పెండ్లికాని కూతురు (శిష్యుడు) తప్పించుకొని పారిపోయింది సౌజన్యారావు పంతులు రామప్పపంతుల్ని యింట్లోంచి గెంటివేయించాడు రామప్పపంతులు కూనీకేసు బనాయించాడు

డిప్యూటీ కలెక్టరు కచేరిలో అగ్నిహోత్రావధానులకేసు విచారణకు వచ్చింది గిరీశం లుబ్ధావధానులను కౌగలించుకొని ఏడ్చాడు మదురవాణి సౌజన్యారావు సౌజన్యాన్ని చూరగొన్నది గిరీశం తన తప్పిదాలకు పశ్చాత్తాపపడుతున్నట్లు చెప్పాడు సౌజన్యారావు మధురవాణిని వివాహమాడటానికి అంగీకరించాడు

'డామిట్ కథ అడ్డం తిరిగింది' అని గిరీశం వాపోయాడు

# 5. కన్యాశుల్కం

## సంక్షిప్త గ్రంథం

విజయనగరంలో గిరీశం అనే పెండ్లిగాని పెద్దమనిషి వూళ్ళో అందరినీ రకరకాలుగా మోసపుచ్చి తిరుగుతున్నాడు. పూటకూళ్ళమ్మతోకూడా బాకీ విషయంలో గొడవపడ్డాడు. తిండిపెట్టేవాళ్ళుకూడా కరువయ్యే పరిస్థితి యేర్పడింది. అక్కడ నుండి బిచాణా ఎత్తి వేద్దామని అనుకున్నాడు. కానీ ఆవుళ్ళో వేశ్య మధురవాణిని వదలడానికి అతడికి బుద్ధిపుట్టలేదు. అతని ప్రియ శిష్యుడు వెంకటేశం. అతడు ఆ సంవత్సరం కూడా పరీక్ష ఫెయిలు అయ్యాడు. గురువుగారి దగ్గరకు వచ్చి వెంకటేశం తను పరీక్ష తప్పానని అందుకు కారణం మీరేనని గిరీశాన్ని నిలదీశాడు

గిరీశానికి ఒళ్ళు మండింది. వెంకటేశానికి పెద్ద లెక్చరు ఇచ్చాడు. ''నా దగ్గర చదువు కున్నవాడు ఒక్కడూ అప్రయోజకుడు కాలేదు. చుట్టకాల్చటం వంటి చక్కటి విషయాన్ని నీకు బోధించాను. నిన్ను తప్పించినందుకు మీ మాష్టారు మీద వళ్ళు మండు తోం''దన్నాడు. తండ్రివద్ద తనకు గండం గడిచేందుకు వెంకటేశం తనతో గిరీశాన్ని కూడా తన గ్రామానికి తీసుకెళ్ళడానికి వొప్పించాడు. ఆ రాత్రికే యిద్దరు బయలు దేరడానికి సిద్ధమయ్యారు. ఆ రాత్రికి మధురవాణి వద్ద వీడ్కోలు పుచ్చుకోవాలని నిశ్చయిచుకొన్నాడు గిరీశం. ఇంతలో ఫోటోగ్రాఫరు వద్దనుండి బంట్రోతు వచ్చి బాకీ యివ్వమని గిరీశాన్ని మొండి పట్టు పట్టాడు. అతడికేవో మాయమాటలు చెప్పి తప్పించుకొన్నాడు. గాయత్రి మీద వొట్టు పెట్టుకొని మర్నాడు ఇచ్చివేస్తానని హామీ యిచ్చాడు. ఎలానైనా ఈ వూరి నుంచి త్వరగా పలాయనం చిత్తగించాలని నిర్ణయించుకున్నాడు.

మధురవాణి యింట్లో రామప్పపంతులు సరసాలాడుతున్నాడు. మధురవాణి రామప్పంతులుపై కోప్పడుతోంది గిరీసంతో సరసాలాడుతున్నందుకు మధురవాణిపై రామప్పంతులుకు అనుమానం గిరీశం

వంటి చవటాయిని గొప్పచేసి చెప్తునందుకు రామప్పంతులుకు కోపం. తాను డబ్బుకు కక్కుర్తి పడటం లేదని తనను ముట్టు కోవద్దని మధురవాణి ఖండితంగా చెప్పింది. ఇంతలో గిరీశం రానేవచ్చాడు. పంతుల్ని మంచంక్రింద దాచిపెట్టింది మధురవాణి.

తాను హైదరాబాదు నైజాము ఫర్మానా మేరకు 1000 సిక్కా రూపాయలు జీతంతో చేరబోతున్నానని గిరీశం మధురవాణికి చెప్పాడు. తన గురించి వాళ్ళు వీళ్ళు తక్కువ చేసి చెప్పినమాటలు నమ్మవద్దని దృష్టాంతాలు చూపాడు. మధురవాణి తక్కువేంతినలేదు. ఆ పూటకూళ్ళమ్మతో హైదరాబాదు వెళ్ళమని సలహా యిచ్చింది. గిరీశానికి మతిపోయింది. పూటకూళ్ళమ్మ చిన్నతనంలోనే ఎలా విధవరాలైంది వివరించాడు. మంచం క్రింద ఈ కబుర్లన్నీ వింటున్న రామప్పంతులు తన విషయం మధురవాణి బయట పెడుతుందేమోనని భయపడుతున్నాడు. ఆయన రామచంద్రాపురం అగ్రహారం కరణం. మంచి వ్యవహారికుడు. ఇంతలో పూటకూళ్ళమ్మ గిరీశాన్ని వెదుక్కుంటూ వచ్చి మధురవాణి యింటి తలుపు తట్టింది. గిరీశం కూడా రామప్పంతులుతో పాటు మంచం క్రింద దూరాడు. యిద్దరూ పరామర్శచేసుకొని మధురవాణి తెలివి తేటలకు ఆశ్చర్యపోయారు.

వల్లెవాటులో చీపురుకట్ట దాచుకుని పూట కూళ్ళమ్మ మధురవాణి ఇంట్లోకి ప్రవేశించి గిరీశాన్ని చూపమని నిలదీసి అడిగింది. తనకిస్తానని చెప్పి తెచ్చిన 20 రూపాయలు తిరిగి యివ్వమని మధురవాణితో అంది. అలాంటిదేమీ యివ్వలేదని మధురవాణి అంటేవినలేదు. మధురవాణి చివరకు మంచం కింద చూపించి సైగ చేసింది. ముందుగా పైకి లేచిన రామప్పంతులుకు చీపురు కట్ట దెబ్బలు తప్పలేదు గిరీశం తప్పించుకొని పారిపోయాడు. గిరీశంపై కేసుపెట్టి వాడిమీద దెబ్బకు దెబ్బ పగ తీర్చు కొంటానని రామప్పంతులు ప్రతిజ్ఞ చేశాడు.

కృష్ణరాయపురం అగ్రహారీకుడు అగ్నిహోత్రావధానులు. అతని భార్య వెంకమ్మ. పెద్దకూతురు బుచ్చమ్మ వితంతువు. చిన్నకూతురు సుబ్బమ్మ వెంకటేశం ఆయన కొడుకు. గిరీశం శిష్యుడు. కరటకశాస్త్రి

అగ్నిహోత్రావధానుల బావమరిది. విజయనగరం సంస్కృత నాటక కంపెనీలో విదూషకుడు. అగ్నిహోత్రావధానుల యింట్లో కరటకశాస్త్రులు కూడా వచ్చివున్నాడు. క్రిస్మస్ శెలవులకు వెంకటేశం వస్తాడని కళ్ళుకాయలు కాచేలా తల్లి వెంకమ్మ ఎదురు చూస్తోంది. వద్దంటుంటే వాణ్ణి ఇంగ్లీషు చదువులు చదివించటానికి పట్నం పంపినందుకు భార్యను తిడుతున్నాడు అగ్నిహోత్రావధానులు. తన వంశంలో ఎవరికీ ఇంగ్లీషు చదువులు అచ్చిరాలేదని ఆయన నమ్మకం. దానికి తోడు వెంకటేశం క్రిందటేడు ఫెయిలు అయ్యాడు. డబ్బు ఖర్చు తప్ప వాడికి చదువు వంట బట్టలేదు.

ఇంగ్లీషు చదువులు చదివితే మునసబుగానో, పోలీసుగానో చేరి భూములన్నీ వెంకటేశం కొనగలడని తల్లి భరోసా ఇచ్చింది.

ఇంతలో గిరీశాన్ని వెంటబెట్టుకొని వెంకటేశం ఇంట్లోకి అడుగుపెట్టాడు. అగ్నిహోత్రవదానులికి గిరీశం వాలకం నచ్చలేదు. అక్కడే కూచోని వున్న కరటక శాస్త్రులతో కబుర్లు చెప్పి పొగిడి ఆయనను గిరీశం బుట్టలో వేసుకొన్నాడు.

గిరీశం వాలకం చూస్తే యిక్కడే తిష్ఠవేసుకుకూచొంటాడని అగ్నిహోత్రవధాన్లు భయం. సెలవుల్లో వెంకటేశానికి చదువు చెప్పడానికి అతడు బతిమాలితే వచ్చానని గిరీశం ప్రగల్భాలు పలికాడు. పిల్లవాడికి ఇంగ్లీష్ చదువు చెప్పి తల్లీతండ్రీ తానే అయికాపాడాలని గిరీశాన్ని వెంకమ్మ బ్రతిమాలింది. ఇప్పటికైన ఖర్చుగాక యింకా చదువుకు ఖర్చుపెట్టడం కుదరదని వెంకటేశంతో తండ్రి ఖరాఖండిగా చెప్పాడు. దమ్మిడీ ఖర్చు లేకుండా తాను వేదాలు చదువుకొన్నానన్నాడు. గిరీశానికి కోపం వచ్చి వెళ్లిపోతానన్నాడు. కరటకశాస్త్రి అభ్యంతరం చెప్పాడు.

గిరీశం బంధుత్వం కలిపి అగ్నిహోత్రవధానుల్ని దారిలోకి తీసుకొచ్చాడు. ఇంగ్లీషు కాగితాలు చదివిచెప్పడానికి ఉపయోగపడతాడు లెమ్మని గిరీశాన్ని ఇంట్లో వుంచుకోవడానికి అంగీకరించాడు. పెద్ద వాళ్ళను మెప్పించడానికి గిరీశం, వెంకటేశం ఇంగ్లీషులో మాట్లాడుకొన్నారు. గిరీశం ఇంగ్లీషు చదువు అంతంతమాత్రం. అయినా మహా విద్యావేత్తలా మాట్లాడాడు.

దాంతో అగ్నిహోత్రావధాన్లకు నమ్మకం కుదిరింది డబ్బు ఖర్చు లేకుండా వెంకటేశానికి పెళ్లి అయ్యే సాధనం ఏర్పాటు చెయ్యమని గిరీశాన్ని బ్రతిమాలాడు ఆడపిల్లని అమ్మినట్లు 1500 రూపాయలు యిస్తేగాని వెంకటేశానికి పిల్లనివ్వరని కరటకశాస్త్రులు ఎద్దేవాచేశాడు

రామచంద్రపురం అగ్రహారంలో లుబ్ధావధానులనే లక్షాధికారి 1800 రూపాయలకు సుబ్బిని అడిగారనీ, ఉభయఖర్చులూ వారే భరిస్తారనీ అగ్నిహోత్రవధాన్లు గొప్పగా చెప్పాడు ఆయనకు 60 ఏళ్లు దాటాయని గిరీశం చెప్పాడు సంబంధం తన కిష్టం లేదని కరటకశాస్త్రులన్నాడు నాతో చెప్పకుండా పెళ్ళి ఎలా చేస్తారని వెంకమ్మ కోపగించుకొంది అగ్నిహోత్రవధాన్లకు వొళ్లు మండుకొచ్చింది ఈ సంబంధం తప్పించమని వెంకమ్మ గిరీశాన్ని బ్రతిమాలింది తనకు దెబ్బలు తప్పినందుకు వెంకటేశం సంబరపడ్డాడు గిరీశం తన పాచిక పారినందుకు సంబరపడ్డాడు

బుచ్చమ్మను మొదటిసారిగా గిరీశం చూశాడు ఆమె వితంతువని తెలిసి ఎంతగానో బాదపడ్డాడు ఆమెకు విధవావివాహము చేయించి శాశ్వత కీర్తి సంపాదించాలని అనుకున్నాడు ఆమె చక్కదనానికి సొంపుకు ఆశ్చర్య పోయాడు పల్లెటూరిలో కాలక్షేపము కాదనుకున్నందుకు ఇంతటి మహదవకాశము కలిగిందనుకున్నాడు వెంకటేశానికి కూడా ఒక వితంతు సంబంధం చూసి పెడతానని హామీ యిచ్చాడు

కన్యాశుల్కం మీద గతరాత్రి గిరీశం భోజనాలవేళ ఒక ఉపన్యాసం ఇచ్చాడు ఎంతో తెగువ చేసుకొని నాలుగు మాటలు అనేసరికి అగ్నిహోత్రావధానులకు మహాకోపం వచ్చింది వత్తాసు పలుకుతానన్న కరటక శాస్త్రులు మొహం చాటు వేశాడు ఎలాగైతేనేం తన ఉపన్యాసం గిరీశం కొనసాగించాడు ఏమైనా పల్లెటూరి జనానికి ఉపన్యాసాలు నచ్చవు వీరిమాటల మధ్యలో బుచ్చమ్మ కలుగ జేసుకొని తన సొమ్ముతో తమ్ముడికి పెండ్లిచేయమని, చిన్న దాని కొంపముంచి ముసలి పీనుగు లుబ్ధావదానులకు ఇవ్వవద్దనీ చెప్పింది దానితో అగ్నిహోత్రావదానులకు ఒళ్ళుమండి అన్నంవిస్తరి

తీసుకెళ్ళి ఆమె నెత్తిన రుద్దాడు. కరటకశాస్త్రులు అడ్డుపడితే చెంబుతో నీళ్ళు నెత్తిన కుమ్మరించాడు. కరటక శాస్త్రులకు కోపంవచ్చి శిష్యుని తీసుకొని వూరికి వెళ్ళి పోయాడు. వెంకమ్మ ఏడుస్తూ ఒక మూల కూర్చుంది. అగ్నిహోత్రావధానులు పశ్చాత్తాపపడి అరుగు మీద గిరీశంతో కూచుని రాత్రంతా కబుర్లు చెబుతూ గడిపాడు. ఇదే సమయమని గిరీశం అతనితో స్నేహం కలిపాడు. ఆయన చెప్పిందల్లా బాగుందని సమ్మోహనాస్త్రం వదిలి గిరీశం ఆయన్ని లోబరచుకున్నాడు. ఆయనతో మాట్లాడిన తరువాత బాల్య వివాహాలు కూడా మంచివేనని గిరీశం ఒక నిర్ణయానికి వచ్చాడు. రాజకీయ వాది యైనవాడు అభిప్రాయాలు మార్చుకోక తప్పదని అతని నమ్మకం. దానికి గిరీశం చెప్పిన వాదన విందాం. బాల్య వివాహాలు జరిగితేగాని బాల్య వితంతువులుండరు. వాళ్ళు వుంటేగానీ వితంతు వివాహోద్యమం అవిచ్ఛిన్నంగా కొనసాగదు. ఇది ఆగిపోతే నాగరికతే ఆగిపోతుంది. ఇది తాను కనిపెట్టిన కొత్త పరిశోధన. అలానే చిన్న పిల్లల్ని ముసలాళ్ళ కిచ్చి పెండ్లి చేయటం కూడా మంచిదేనని గిరీశం వాదన.

లుబ్ధావధానులతో సుబ్బి పెండ్లి జరిపితే బావిలోపడి చస్తానని మా అమ్మ అంటున్నదని వెంకటేశం అన్నాడు. గిరీశానికి కోపం వచ్చింది రెండు తులాలు బంగారు నగ చేయిస్తే అన్ని సర్దుకుంటాయని గిరీశం సలహా. గిరీశం తన వాదన కొన సాగిస్తూ పెండ్లి అనేది శుభకార్యం కాబట్టి చిన్నపిల్లను ముసలాడికిచ్చి చేస్తే వాడు చస్తే, మరొకడికి. ఇలా పెండ్లి మీద పెండ్లి చేయడం శుభకరమని కన్యాశుల్కం కూడా వస్తుందని అన్నాడు. తన వంటి బుద్ధిమంతుల్ని పెండ్లి చేసుకుంటే ఇహపరసౌఖ్యాలు దక్కుతాయన్నాడు. కన్యాశుల్కం డబ్బురూపంలో కాకుండా బంగారం రూపంలోనో, వెండిరూపంలోనో, తీసుకోవచ్చునన్నాడు. దొరల్లో కూడా ఈ పద్దతి వుందని అగ్ని హోత్రావధానులతోచెప్పినపుడు ఆయనకది నచ్చింది. లుబ్ధావధానులతో సుబ్బి పెండ్లి చేస్తే అతను రెండేళ్ళకు చనిపోతే సుబ్బి ధనవంతురాలైన వితంతువౌతుంది. ఆమెకు వితంతు వివాహం చేసి వెంకటేశం కీర్తి సంపాదించవచ్చు. గిరీశంతో బాంధవ్యం ఏర్పడుతుంది.

వెంకటేశాన్ని హైకోర్టువకల్తా దాకా చదివించాలని వాళ్ళ నాన్న ఆశ పుస్తకాలకు గిరీశం డబ్బులడిగితే పెండ్లి అయిన తర్వాత చూద్దామన్నాడు కనీసం చుట్టముక్కలకైనా డబ్బులు తెమ్మని వెంకటేశాన్ని పురమాయించాడు ఇద్దరూ కలిసి గుళ్ళోకివెళ్ళారు అక్కడ గిరీశం చుట్ట కాల్చడం మొదలుపెట్టాడు మధ్య మధ్యలో కవితావేశం వచ్చి వితంతువుమీద ఒక చక్కటి కవిత ఆంగ్లలో చెప్పాడు ఆ కవిత అచ్చు అయినపుడు చూసి టెన్నిసన్ మహాకవి గుండెలు బాదుకున్నాడు గిరీశం దృష్టిలో వితంతువైన స్త్రీ కష్టజీవి సూర్యోదయాత్ పూర్వంలేచి ఇల్లు చిమ్మి వాకిలి కడుగుతుంది దిబ్బరొట్టె చేసుకొని తింటుంది ఉపవాసాలద్వారా పండగ భోజనాల ద్వారా ఆరోగ్యంగా వుంటుంది పైసా పైసా కూడ బెడుతుంది అలాంటి వితంతును గిరీశం ప్రేమిస్తాడు పవిత్రతకు, ప్రశాంతతకు నిలయమైన ఆమె జన్మవల్లనే భూమి పవిత్రమైంది ఇదీ గిరీశం కవి సారాంశం

గిరీశానికి దారి మధ్యలో అగ్నిహోత్రావధానులు కలిశాడు తన దావాలు గెలుస్తామా లేదా అని అడిగాడు బుచ్చమ్మ కేసు తప్పకుండా గెలుస్తామని గిరీశం భరోసా యిచ్చాడు తన పెదతండ్రి కాకినాడలో తెలివైన ప్లీడరు కాబట్టి ఆయనకు కేసు అప్పగిద్దామన్నాడు ఫీజుతో సంబంధం లేకుండ గెలిపించే పూచీ తనదన్నాడు గెలిచిన తర్వాత తగిన బహుమతి యిద్దామని అగ్నిహోత్రవదానులు అన్నాడు

రామచంద్రపురం అగ్రహారంలో రామప్పంతులు ఇంట్లో మధురవాణి రామప్పంతులు మాట్లాడుకొంటున్నారు తెలియక మోనపోయానని మధురవాణి అంది అనుకొన్న మాటప్రకారం నెల జీతం రెండొందలు ముందే ఇచ్చాను గాబట్టి మోసపుచ్చింది ఏమీ లేదని పంతులు వాదన తనకు డబ్బు ప్రధానం కాదనీ, పంతులు భూములన్నీ రుణాల కింద చెల్లి పోయాయనీ తెలిసి బాదపడ్డానంది నన్ను వుంచుకొని మీరు చెడి పోయారంటే నాకు అప్రతిష్ఠ అంది ఇల్లూ వాకిలీ వదిలి మాన ప్రాణాలు తన పాలు చేసి నమ్మి వచ్చిన వ్యక్తిని మోసం చేయవద్దని మధురవాణి ప్రాధేయపడింది ఎలానైనా లుబ్ధావధానులపెళ్ళి తప్పించమని కోరింది లేకపోతే మీతో మాట్లాడనంది

కుదుర్చుకొని సిద్దంగా ఉన్న పెళ్ళి ఆపడం శక్యంకాదని రామప్పంతులు బాధపడ్డాడు. అందునా లుబ్ధావధానులు పరమలోభి. వాడి గుణం ముందే వూహించి తల్లిదండ్రులు ఆ పేరు పెట్టారన్నాడు. ఎలానో తంత్రంచేసి అతణ్ణి ఈ పెళ్ళికి వొప్పించానన్నాడు. సిద్ధాంతిని లోబరచుకొని అతని ద్వారా లుబ్ధావధానులకి వివాహధనయోగాలు కలిసివున్నాయని చెప్పించాడు. లేక పోతే మారకమో, ధననష్టమో సంభవిస్తుందని భయపెట్టాడు. అది విని అవధాన్లు వివాహప్రయత్నం ఆరంభించాడు. సుబ్బి జాతకం మహా అదృష్ట జాతకం. లుబ్ధావధానుల్ని అడ్డంపెట్టుకొని డబ్బుగుంజడానికి సిద్ధపడ్డారని మధురవాణి ఎద్దేవాచేసింది.

లుబ్ధావధానులు విధవ కూతురు మీనాక్షి ప్రవర్తన మంచిది కాదు. నాలుగు రోజుల కొకసారి ఏదో ఒక తగవు పీకలమీదదాకా తెస్తుంది. పోలీసువాళ్ళు బెదిరించి పది రూపాయలు లాగేస్తారు డబ్బు ఖర్చుకు యిష్ట పడని లుబ్ధావధాన్లు ఈ పెళ్ళికి అంగీకరించాడు. ఇలాగైనా మీనాక్షి ఆట కట్టించవచ్చుననుకొన్నాడు - ఈ కథ రామప్పంతులు మధురవాణికి చెప్పాడు. ఏలాగైనా ఈ పెళ్ళి ఆపించమని మధురవాణి పట్టుబట్టింది. ఇంతలో హెడ్ కానిస్టేబులు రామప్పంతుల్ని పోలీసు స్టేషనుకు యినస్పెక్టరు తీసుకురమ్మంటున్నాడని కబురు తెచ్చాడు. గుర్రపు బండి మీద రామప్పంతులు పోలీస్ స్టేషనుకు ప్రయాణమయ్యాడు. రామినాయుడు దగ్గర యినస్పెక్టరు పేరు చెప్పి పాతికరూపాయలు రామప్పంతులు లాగాడు. ఇలా ఎంతమంది దగ్గర వసూలు చేశాడోనని విచారించేందుకు తీసుకరమ్మన్నాడు.

రామప్పంతులు లేని సమయంలో మధురవాణి యింటికి కరటకశాస్త్రులు వచ్చాడు చాలా రోజులుగా ఆమెను చూడలేనందుకు బాధపడ్డాడు. డిప్యూటీ కలెక్టరు కుమారుణ్ణి మధురవాణి వుంచుకొందని తెలిసి అతనికి భయపడి ఆమె వద్దకు రాలేదన్నాడు. డిప్యూటీ కలెక్టరు కొడుకును మదరాసుకు చదువు నెపంతో పంపివేశాడని మధురవాణి చెప్పింది. ఆయన స్నేహితుడు గిరీశం కొన్నాళ్ళు తనని వుంచుకొన్నాడనీ, కానీ డబ్బులేక యిబ్బంది పడ్డాననీ యిప్పుడు ఆ వూరువదలి యిక్కడికి వచ్చాననని చెప్పింది. గిరీశం

తన మేనల్లుడికి చదువు చెప్పే నెపంతో తమ బంధువులయింట్లో చేరాడనీ వాడికి ఉద్వాసన చెప్పించాలనీ కరటక శాస్త్రులన్నాడు.

లుబ్ధావధానులతో సుబ్బి పెళ్ళి చెడగొట్టడానికి తన శిష్యుడికి ఆడపిల్ల వేషం వేసి తీసుకొచ్చాననీ, ఎలాగైనా ఈ పెళ్ళి జరగకుండా చూడమని శాస్త్రులు మధురవాణిని బ్రతిమాలాడు. తన చెల్లెలు వెంకమ్మ నూతిలో బడతానని అంటోందని ఎలాగైనా పెళ్ళి తప్పించమనీ కోరాడు. తన బుద్ధి చాకచక్యంతో ఎలాగైనా ఈ పెళ్ళి జరగకుండా చూడగలననీ మధురవాణి హామీ ఇచ్చింది. రామప్పంతులుతో మాట్లాడి పని చేసి పెడతానంది. మీనాక్షిని రెండు కాసులు యిస్తానని లోబరచుకొని, సిద్ధాంతికి ఆశపెట్టి సానుకూలపరచుకోనాలని చెప్పింది. హెడ్ కానిస్టేబులుతో నిజం చెబుదామంది. అతగాడు తను చెప్పినట్లు వింటాడని తనకు గులాం అనీ చెప్పింది. ఈ ఒప్పందం అయ్యేటప్పటికి రామప్పంతులు రానేవచ్చాడు.

కరటక శాస్త్రులు తన పేరు గుంటూరు శాస్త్రులని పరిచయం చేసుకొన్నాడు. పోలీసువారికివ్వవలసిన పాతికరూపాయలు రామప్పంతులు తరపున శాస్త్రులు తానే యిచ్చాడు. శాస్త్రులతో వచ్చిన పని మాట్లాడారు రామప్పంతులు. లుబ్ధావధానులు తన సలహాలేకుండా ఏ పనీ చేయడని అన్నాడు. అయితే లుబ్ధావధానులికి తనతో వచ్చిన పిల్లనిచ్చి పెండ్లి చేసే ఏర్పాటు చూడమని కరటక శాస్త్రులు రామప్పంతుల్ని బ్రతిమాలాడు. తనకు వచ్చే కన్యాశుల్కంలో కొంతసొమ్ము పంతులుకిస్తానని శాస్త్రులు నమ్మబలికాడు. పిల్ల కట్టుతప్పి ఉండటం వల్ల తొందరపడుతున్నానని లేకపోతే రెండు వేలకుపైగా గిట్టుబాటు అవుతుందని అన్నాడు రామప్పంతులు పిల్ల చేయిపట్టుకొని చూసి ధనరేఖ, సంతానయోగ్యత ఉన్నాయని ప్రశంసించి పెండ్లి చేయిస్తానన్నాడు.

కృష్ణరాయపురం అగ్రహారంలో అగ్నిహోత్రవధానుల యింటి గుమ్మం ముందు గిరీశం నిలుచుని స్వగతంగా అనుకుంటున్నాడు "మన్మధుని బాణాలు తాను సహించలేనని, అవి విషంలో ముంచి కంటికి కనిపించకుండా అతడు విసురుతాడని గిరీశం అభిప్రాయం. అందుకనే పైకిగాయం కనపడదుగానీ

పోలీసువాళ్ళ దెబ్బల్లా లోపల తహతహ పుట్టిస్తాయి. బుచ్చమ్మ అందం చూస్తే అతగాడి కేమీ తోచడం లేదు. ఆమె సులభంగా వశమయ్యే మనిషిగాదు. చమత్కారము మాటలు ఆమెకు అర్థంగావు. ఆమెను చూసింది మొదలు వేశ్యలంటే గిట్టడంలేదు. మధురవాణి రంగు వేసిన గాజుపూస అయితే బుచ్చమ్మ అచ్చమైన వజ్రం. ఆమెను చెడగొట్టడం సాధ్యంకాదు. లేవదీసుకుపోవడమే శరణ్యం. పెండ్లి చేసుకుంటే కీర్తి, సుఖం దక్కుతాయి. ఇప్పుడు షేక్స్పియర్ పడ్డ అలోచనలో పడ్డాడు. ఏది ఏమైనా వితంతు వివాహం చేసుకొని తీరవలసిందేనని నిశ్చయించుకున్నాడు. ఆమె దగ్గరకు వెళ్ళి తన మనసు బయట పెట్టాలని ప్రయత్నించాడు. వెంకటేశాన్ని దగ్గర పెట్టుకొని అతడి ద్వారా తన ప్రేమ బయట పెట్టాలని ప్రయత్నించాడు. దమయంతీస్వయంవరఘట్టం వెంకటేశానికి చెబుతూ విధవావివాహాల మీద ఉపన్యాసం దంచాడు.

విధవలను పెండ్లి చేసుకోకూడదనటం కేవలం స్వార్థంతోనేనని, యింట్లో చాకిరీ చేయించుకొని ఒకపూట భోజనం పెట్టి సరిపెడతారని వాదించాడు. మంచి గుడ్డ కట్టుకోనీయకుండా నగలు పెట్టుకోనీయకుండా జుట్టు తీయించి వేయడం చూస్తే తన హృదయం కరిగి పోతుందని వాదించాడు. ఇక బ్రహ్మచారులు విధవలను పెండ్లి చేసుకోవడమే కర్తవ్యంగా భావించాలని సిద్ధాంతీకరించాడు.

ఇంతలో అగ్నిహోత్రావధానులు అక్కడకు వచ్చి వెంకటేశం చదువు సంగతి ప్రస్తావించాడు. వెంకటేశం చేత కొన్ని ఇంగ్లీషు మాటలనిపించి తండ్రికి మించిన దైవం లేడని చెప్పించాడు కోర్టులు, దావాలు, కచేరీలూ దేవుడు సృష్టించిన ప్రధాన విషయాలన్నాడు. అవసరమైతే మామగారూ మీకోసం శ్రమపడి అమలాపురం వెళ్ళి కోర్టులో కేసు గెలిపించి తీరుతానని వాగ్దానం చేశాడు. అగ్నిహోత్రావధానులకు గిరీశంపై బాగా నమ్మకం కుదిరింది. ఎలానైనా పెండ్లిపనులు జరిపించమని గిరీశాన్ని బ్రతిమాలాడు.

బుచ్చమ్మ గిరీశంగారి గొప్పదనాన్ని గూర్చి తమ్ముడు వెంకటేశాన్ని వాకబు చేసింది. సురేంద్రనాథ్ బెనర్జీ అంతగొప్పవాడని వెంకటేశం

నిర్ధారించాడు. అయితే ఉద్యోగం ఎందుకు చేయడం లేదని బుచ్చమ్మ సందేహం. ఉద్యోగం అంటే పని మనిషితో సమానమనీ అందువల్ల గిరీశంగారు చేరలేదనీ వెంకటేశం వివరించాడు. అయితే ఆయన వివాహం ఎందుకు చేసుకోలేదని ఆమె అనుమానం. లోకాన్ని మరమ్మత్తు చేయడానికేననీ, వేశ్యావృత్తి నిర్మూలన జాతీయ కాంగ్రెసులో చేరడం వంటివి గిరీశం చేశారని వెంకటేశం చెప్పాడు.

వీరి మాటల మధ్యలో గిరీశం రానే వచ్చాడు. విధవావివాహం గురించి బుచ్చమ్మ గిరీశాన్ని అడిగింది. తన గొప్పలు తాను చెప్పుకోవడం యిష్టం లేదనీ, అయినా అడిగారు గాబట్టి చెబుతున్నాననీ గిరీశం ఉపన్యాసమిచ్చాడు. అత్తగారు, మామగారు వితంతువివాహానికి వ్యతిరేకులు. వారిని కాదని చెప్పి మెప్పించడం కష్టం. నేను వేద, శాస్త్రాలు చదువుకొన్న వాణ్ణి. చిన్న వాళ్ళు చెప్పిన మాటవాళ్ళు వినరు సరికదా, కొట్టడానికి పైకి వస్తారు. అయినా ఎవరితో చెప్పనంటే మీకీ మాటలు చెబుతాననీ గిరీశం బుచ్చమ్మ దగ్గర ఒట్టుపెట్టించుకొని రహస్యాలు చెప్పాడు.

తాను వివాహం చేసుకొని వుంటే భార్యాబిడ్డలపై మమకారంతో ఏ సాహసకార్యమూ చేయలేనన్నాడు. ఉదాహరణకు వెంకమ్మ నూతిలో పడ్డప్పుడు దూకి తీయడానికి పూనుకొనివుండడు. అలా లోకోపకారం చేయడమే తన ఆశయం. పెళ్ళాం బిడ్డలకు ఉపకారం చేసేకంటె లోకోపకారం మంచిది. సంఘసంస్కరణ తన ధ్యేయం. సాంఘిక దురాచారాలను తరిమికొట్టడం తన లక్ష్యం. ఇప్పుడు సమాజంలో ఎన్నో కట్టుబాట్లు ఉన్నాయి. అవి మంచివి కాదు. బాల్య వివాహం, కన్యాశుల్కం ఈ కోవలోవి. చిన్నతనంలోనే భర్తను పోగొట్టుకొని వితంతువులుగా ముద్ర వేయబడి చాకిరీ చేసే స్త్రీలంటే తనకు జాలి. వితంతువివాహాలు శాస్త్ర విరుద్ధంకాదు. ఆ మాట చెబితే మామగారు వినరు. ఇంట్లోంచి గెంటివేస్తారు. అందువల్ల నోరుమూసుకొని వూరుకోవాల్సివచ్చింది. అలానే సానిమేళం పెళ్ళిళ్ళకు పిలవకుండా ఉంటే ఆ సమస్య తీరిపోతుంది. అందువల్ల ఈ రెండు సమస్యల నిర్మూలనకు తాను కంకణం కట్టుకొన్నానన్నాడు గిరీశం. అలానే

జాతీయ కాంగ్రెసు ఉద్యమంలో తన పాత్ర గురించి వివరంగా చెప్పాడు. అలా నెమ్మదిగా మాటల్లోకి దించి బుచ్చమ్మతో తన పెళ్ళి అయినట్లు చెప్ప సాగాడు.

''లోకోపకారం కోసం బతకడం ఉత్తమం. అందునా రత్నంలాంటి విలువైన స్త్రీ దొరికితే వివాహం చేసుకోవలసిందే. అయితే ఈ ఊరొచ్చేవరకు తనకు అందమైన స్త్రీ కనిపించలేదన్నాడు గిరీశం. కాని, అందరాని పండుకు ఆశించడమెందుకని అలాంటి స్త్రీ యీ వూళ్ళో కనబడ్డా మనస్సు దిటవు చేసుకొని మరల్చుకొన్నాడు. పెళ్లాడితే లోకోపకారం కుదరదని అంతరాత్మ ప్రబోధిస్తోంది. మాట వరసకు వదినా! మనం పెళ్ళాడామనుకో! సంసారం గడవడానికి డబ్బు సంపాదించాలి. ఎవరితోను చెప్పకుండా రామవరం వెళ్ళి శాస్త్రోక్తంగా పెళ్ళి చేసుకొంటే విధవా వివాహసభవారు నెలకి **100** రూపాయలు ఇస్తారు. ఆ తర్వాత హైదరాబాదులోనూ, బరోడాలోనో వెయ్యి రూపాయల ఉద్యోగం సులభంగా సంపాదించవచ్చు. హైదరాబాదు నవాబు ఇస్తానన్న ఉద్యోగం మానేశాను. మీరు వివాహం చేసుకోమని సలహా యిస్తారని తెలిసి వుంటే అలా చెయ్యను.''అని గిరీశం బుకాయించాడు.

ఉద్యోగం చేయబోనని శపథం చేసిన మాట వాస్తవమే కాని లోకోపకారం కోసం బంగారం లాంటి బుచ్చమ్మ భార్యగా దొరికినప్పుడు పెళ్లాడడమే సబబు-అని గిరీశం కుండ బద్దలు కొట్టినట్లు చెప్పాడు. ''మన పెళ్ళి అయిన తర్వాత సంసారం సుఖంగా సాగడానికి బోలెడంత డబ్బుకావాలి. ఇల్లు, బ్రహ్మాండమైన మేడ కావాలి. దాని చుట్టూ తోట, చెట్లు ఉండాలి. అందులో పళ్ళు వెంకటేశం కోసుకుతింటూ ఉంటాడు. మనకు పిల్లలు పుడతారు. బుచ్చమ్మ మహాలక్ష్మిలా ఇంట్లో కళకళలాడుతూ తిరుగుతూంటారు. పిల్లలు అవికావాలి, ఇవి కావాలి అని గారాము చేస్తారు. వాళ్ళకు చదువు సంధ్యలు చెప్పించాలి. వెంకటేశాన్ని దగ్గర వుంచుకొని చదివించాలి - ఇదంతా సంసారతాపత్రయం కాదా? ఒకవేళ పెళ్ళి చేసుకొంటే బుచ్చమ్మని తప్ప మరొకర్ని పెళ్ళాడనని'' ఖండితంగా చెప్పేశాడు.

అటువేపు నుంచి అగ్నిహోత్రావధాన్లు రావడం గమనించి గిరీశం ఏతాము తోడుతుంటాడు. మీకా శ్రమ ఎందుకని ఆయన గిరీశాన్ని అడిగాడు. పని చేయడంలో తన కానందమనీ, కాయకష్టం చేసే మనిషి గొప్పవాడని ఆంగ్లకవి షేక్స్పియర్ అన్నాడనీ చెప్పాడు గిరీశం. గొప్ప దొరలంతా తోటమాలీ పని చేస్తారని అన్నాడు అందువల్ల చెట్లు చేమలు ఎక్కడం కూడా అప్పుడప్పుడు అవసరమనీ, అందుకే వెంకటేశానికి అవి నేర్పిస్తున్నానని గిరీశం బుకాయించాడు. రేపు తాశీల్దారు అయితే అవి అవసరమన్నాడు. మార్గమధ్యంలో పెద్దపులి వస్తే చెట్లెక్కడం అవసరమవుతుందన్నాడు. అగ్నిహోత్రావధాన్లు సరేనని తలవూపాడు.

రామప్పంతులు తనయింట్లో మధురవాణితో సరసాలాడుతున్నాడు. చిన్నతనంలో తాను ఇంగ్లీషు చదువుకొని వుంటే కోర్టులో జడ్జీలముందు తన ప్రతాపం చూపించివుందుననీ, రాకపోయినా ఎలానో దర్జాగా జరిగి పోతోందని రామప్పంతులు అన్నాడు. తనకు ఇంగ్లీషు వచ్చివుంటే దొరసానులు తన వెంట పడి వుండేవారని ప్రగల్భాలు పలికారు. గిరీశం ఇంగ్లీషు మాట్లాడితే అచ్చం దొరలు మాట్లాడినట్లు వుంటుందని మధురవాణి జ్ఞప్తికి తెచ్చుకుంది. రామప్పంతులుకు ఆ మాట నచ్చలేదు. వాడి వూసు చెప్పటం ఆయనకు గిట్టదు.

గిరీశం లుబ్ధావధానుల తమ్ముడు కాబట్టి రేపు పెండ్లికి అతడు వచ్చి ఏదో చిలిపి జట్టీ పెట్టుకుని రామప్పంతులు మీద చెయి చేసుకుంటాడేమోనని మధురవాణి సందేహం వెలబుచ్చింది. ఎలాగైనా అతడు రాకుండా వుండాలంటే పెండ్లి తప్పించే తంత్రం పన్నాడు రామప్పంతులు. పెళ్ళి నాలుగు రోజులు తలుపేసి ఇంట్లో కూర్చోమని మధురవాణి సలహా. ఐనా నిశిరాత్రివేళ పైగొళ్ళెం బిగించి కొంపకు అగ్గిపెడతాడేమోనని భయం వెలిబుచ్చింది. వాడు అలాంటి ఘటికుడనీ, ఎలాగైనా తనను కాపాడమని రామప్పంతులు ప్రాధేయ పడ్డాడు. పెళ్ళి వంటలకు పూటకూళ్ళమ్మను కుదిరిస్తే ఆమె దెబ్బకు భయపడి గిరీశం పరుగులు తీస్తాడని మధురవాణి సలహా. పూటకూళ్ళమ్మ దెబ్బలు స్వయానా రుచి చూసిన పంతులు ఆమె నోరు కూడా మహా చెడ్డదని వంత పలికాడు.

పంతులు ఆ సంతోషంలో మదురవాణిని ముద్దుపెట్టుకుంటుడగా లుబ్ధావధానులు ఒక ఉత్తరం చేతబట్టుకుని ఇంట్లోకి అడుగుపెట్టాడు ఆ ఉత్తరం అగ్నిహోత్రావదానులు పేరు పెట్టి తానే బనాయించానని పంతులు మదురవాణి చెవిలో చెప్పాడు ఈ ఉత్తరం రామప్పంతులు కల్పించిందేనని లుబ్ధావదానులు నెపం వేశాడు. మధురవాణి లేనిపోని తంటాలు తెచ్చిపెట్టిందని రామప్పంతులు కోప్పడ్డాడు మదురవాణి వెళ్ళిపోతున్న లుబ్ధావదానుల్ని చెయిపట్టుకొని లోపలికి తీసుకొని వచ్చి ఆ వుత్తరం చదవమని రామప్పంతులు చేతికిచ్చింది ఆ ఉత్తరం చూస్తే తాను వ్రాసింది కాదు రామప్పంతులు బ్రతుకుజీవుడా అని ఊపిరిపీల్చుకున్నాడు అనవసరంగా పెండ్లి దర్జాగా చేయాలని పటాటోపంగా జరిపించాలని వ్రాసినందుకు లుబ్ధావదానులకు కోపం

రామప్పంతులు గిరీశం వ్రాసిన ఉత్తరం లుబ్ధావదానులకు చదివి వినిపించాడు సారాంశం యిది

'వృద్ధాప్యంలో మీరు తిరిగి వివాహం చేసుకోవటం సంతోషం నేను అగ్నిహోత్రావదానుల యింట్లో పెండ్లి పనులు చూస్తున్నాను వీరికి కొంత ప్రదమ కోపం వుంది మీరు బాగా దనవంతులనీ యాభై బండ్ల మీద తరలి వస్తున్నారు పెండ్లి కూతురికి కొంచెం పెయ్యనాకుడు వుంది వైదవ్య హేతువు అందువల్ల మీకు తెలియజేస్తున్నాను మీ అత్తగారికి ఈ పెండ్లికి సుతరామూ ఇష్టం లేదు ఆమె నూతిలో పడతానంటున్నది'

ఇట్లు

సేవకుడు, తమ్ముడు

గిరీశం

ఆ ఉత్తరాంశాలు విని లుబ్ధవదాన్లు ఈ పెండ్లి సంబందం మీకు వద్దని ఉత్తరం వ్రాసి పెట్టమని రామప్పంతులుల్ని కోరాడు

పోస్టుజవాను మరొక ఉత్తరం తెచ్చి లుబ్ధావదాన్లకు ఇచ్చాడు సులోచనాలు లేనందున రామప్పంతుల్నే చదివి పెట్టమన్నాడు 'నీ సంబంధమే

అక్కరలేదని మీరు పిసినిగొట్టని అగ్నిహోత్రావదాన్లు లుబ్ధావదాన్ల గురించి వ్రాశాడు పైపెచ్చు మీరు ముసలి వారని, క్షయరోగం వుందని ఎవరో చెప్పారట' అనే వాక్యాలు విని లుబ్ధవదానులు ఎగిరి పడ్డాడు ఈ తంటా గిరీశం తెచ్చిపెట్టి వుంటాడని అనుమానం

ఇంత కంటె చౌకైన సంబంధం చేసుకుంటే అగ్నిహోత్రావధానులను చెప్పుతో కొట్టినట్లు వుంటుందని రామప్పంతులు సలహా యిచ్చాడు మీ కుమార్తె ప్రవర్తన సరిగా వుండక పోవడంచేత మిమ్మల్ని వెలివేశారని ఉత్తరంలో వక్యం చదివి లుబ్ధావదానులు రామప్పంతులు మీద అనుమాన పడ్డారు ఏమైనా పెండ్లి ప్రయత్నం మానుకోవడమే ఉత్తమమని నిశ్చయించుకున్నాడు ఎలానైనా ప్రయత్నం చేసి మళ్ళీ పెండ్లి చేసుకోమని రామప్పంతులు సలహా ఇచ్చాడు పెండ్లాము బయం చేత మీనాక్షి అట కడుతుందని, మీనాక్షి బయం చేత పెండ్లాము ఆట కడుతుందని రామప్పంతులు చెప్పాడు పైపెచ్చు జాతకరీత్యా వివాహం జరగక పోతే మారక ముందని రామప్పంతులు గుర్తు చేశాడు చవకగా సంబంధం కుదిరితే చేసుకునేందుకు లుబ్ధావదానులు సిద్ధపడ్డాడు 18 వందలకన్నా తక్కువలో సంబంధం కుదర్చమని బ్రతిమాలాడు

గుంటూరు నుండి ఒక సంప్రదాయ కుటుంబీకుడు వచ్చాడని అతడు 1200 రు లకు పిల్ల నివ్వటానికి సిద్ధంగా వున్నాడని కానీ ఎక్కడికి వెళ్ళాడో తెలియదని ఐశ్వర్య లక్షణాలు ధనరేఖ సంతాన రేఖ అద్బుతమని చెప్పాడు

మాటల సందర్బంలో మదురవాణి అక్కడకు వచ్చింది జాతక రీత్యా ఈ సంవత్సరంలో వివాహయోగ్యత వుందని రామప్పంతులు ఖండితంగా చెప్పాడు పెయ్యనాకుడు పిల్లను మాత్రం చేసుకో వద్దని మధురవాణి సలహాయిచ్చింది

ఎదురింట్లో బసచేసిన స్త్రీ వేషంతో వున్న శిష్యుణ్ణి తీసికొని వచ్చి లుబ్ధావదాన్లకు అరచేయి చూపించి సంతాన రేఖలు చూడమన్నాడు. కంఠం దగ్గర హారరేఖలు చూడమన్నాడు సిద్దాంతి కూడా సమయానికి వచ్చి

చేయిచూసి సౌభాగ్యరేఖ, ధనరేఖ ఉన్నాయని నిష్కర్షగా చెప్పాడు. రేపటి త్రయోదశినాడు పెండ్లికి మంచిదని పంచాగం చూసి రామప్పంతులు ముహూర్తం పెట్టాడు. ఇంతలో పిల్ల తండ్రి గుంటూరు శాస్త్రులు రానే వచ్చాడు. 1200 రూపాయలకు రామప్పంతులు సంబంధం కుదిర్చాడు. మధురవాణి నగలు తెచ్చిపెట్టి పెండ్లి తంతు జరిపిద్దామని రామప్పంతులే సలహాయిచ్చాడు. చివరకు ఏకరాత్రి వివాహం చేయిద్దామని గుంటూరు శాస్త్రులు అన్నాడు. లుబ్ధావధానులు అందుకంగీకరించలేదు. పంతులుతో చెప్దామన్నాడు. గుంటూరు శాస్త్రులు పంతులుతో చెప్పటమెందుకని బుకాయించాడు.

మీనాక్షి పెండ్లి కూతుర్ని కడుపులో పెట్టుకొని సంరక్షిస్తానని హామీయిచ్చింది. నాలుగు ఘడియలు రాత్రి సమయంలో పెండ్లి ముహూర్తం నిశ్చయమైంది. ఆ చలివేళ మంగళస్నానాలు చేయలేనని లుబ్ధావధానులు గునిగాడు నలుగురూ వచ్చేలోగా పెండ్లి తంతు జరిపించేశారు. రామప్పంతులు వచ్చేసరికి అంతా అయిపోయింది. ముహూర్తం నాలుగు ఘడియల పొద్దుకని ఆయన అనుకున్నాడు. ఇంతలో గుంటూరు శాస్త్రులు వూరికి వెళ్ళిపోయాడు. ఏకరాత్రి వివాహం జరిపించినందుకు రామప్పంతులు కోప్పడ్డాడు. గుంటూరు శాస్త్రులు డబ్బులు పట్టుకుపోయాడని తెలిసి మరీ బాధపడ్డాడు. తాను వాడికి పెండ్లి ఖర్చులకోసం నూరు రూపాయలు బదులిచ్చానని రామప్పంతులు లూబ్ధావధానుల్ని నిలదీశాడు.

అగ్నిహోత్రావధానులు యింటి పెరటిలో గిరీశం పనివాళ్ళ చేత పెండ్లి పందిరి వేయిస్తున్నాడు. సంధ్యావార్చ లేదని వెంకటేశానికి వాళ్ళనాన్న గూబ గుయ్యిమనిపించాడు. అలాంటి సందర్భాలలో ఏదోలాఒకధ్యానం చేయాలని గిరీశం సలహా యిచ్చాడు. రేపటి నుంచీ తాను చమకపారాయణం చేస్తానని వెంకటేశం గిరీశంతో అన్నాడు. లోలోపలే చేయమని పైకి అనవద్దని గిరీశం సలహా. ఉపనిషత్తులలో చెప్పిన శిష్యుడి వంటివాడివని గిరీశం వెంకటేశాన్ని ప్రశంసించాడు. చుట్ట కాల్చటం వల్ల ప్రయోజనాలు వివరించాడు. సప్తసముద్రాలు సృష్టించడంలో భగవంతునిలోపాన్ని ఎత్తిచూపాడు పాలసముద్రం ఉన్నప్పుడు మళ్ళీ పెరుగు సముద్రం, నేతి సముద్రం ఎందుకు

సృష్టించాడని అనుమానం వ్యక్తం చేశాడు ఇలా మతంమీద, యింకా అనేక విషయాల మీద గిరీశం వెంకటేశానికి ఉపన్యాసమిచ్చాడు. వెంకటేశం బయటకు వెళ్ళిపోయాడు.

ఇంతలో బుచ్చమ్మ వచ్చి రుబ్బురోలునిండా తాటాకుముక్కలు పడుతున్నందున రోలు యివతలకు లాగమని గిరీశాన్ని కోరింది. గిరీశం రుబ్బురోలును పందిరి అవతలకు లాగాడు. బుచ్చమ్మ రుబ్బురోలు కడిగి మినప్పప్పు రుబ్బుతోంది. మధ్య మధ్యలో కంటతడిపెడుతున్న బుచ్చమ్మను చూసి గిరీశం మనసు కరిగి పోయింది మా కష్టాలు మీకెందుకులెమ్మని బుచ్చమ్మ తన పని తాను చేసుకొంటోంది. ప్రాణాలిచ్చేందుకైనా తాను సిద్ధమేననీ గిరీశం ఆమెకు నమ్మబలికాడు. ఎలాగైనా చెల్లి పెళ్ళి తప్పించమని బుచ్చమ్మ బ్రతిమాలింది. ఆపెండ్లి ఆపాలని తాను రెండు తావుల ఉత్తరం అన్నగారికి వ్రాశానని అయినా ప్రయోజనం లేక పోయిందని బుచ్చమ్మ మనసుకు కష్టంగా వుంటే తాను వూరిని విడిచి వెళ్ళిపోతానని గిరీశం అన్నాడు. బుచ్చమ్మ కనబడకుండా తాను బ్రతకలేనని నమ్మబలికాడు లుబ్ధావధానులు సుబ్బిని పెండ్లి పేరుతో కొంటున్నాడని చాకిరీ చేయించు కోవడానికే ఈ పిల్ల ఉపయోగపడుతుందని అన్నాడు. పైపెచ్చు లుబ్ధావధానులు చనిపోయిన తర్వాత మీనాక్షివలె చెడిపోతుందని రామప్పంతులే చెడగొడతాడని గిరీశం అన్నాడు.

ఏమైనా ఒకానొక రోజు గిరీశాన్నీ పెండ్లాడి పుణ్యస్త్రీకాక పోతినే అని బుచ్చమ్మ బాధ పడే రోజు వస్తుందని ఖండితంగా చెప్పాడు పెండ్లి కాగానే తాను వూరు విడిచి వెళ్ళి పోతాననీ బుచ్చమ్మ మీది ధ్యానతో నిద్రాహారాలు మాని మరణిస్తాననీ గిరీశం కోతలు కోశాడు. మరణించిన తర్వాత స్వర్గంలో రంభవచ్చి తన్ను మట్టుకోబోతే తన్ని తరిమి వేస్తాననీ కల్పవృక్షం నీడలో బుచ్చమ్మను స్మరిస్తూ తపస్సు చేస్తానని అన్నాడు. తపస్సు ఫలించి బుచ్చమ్మ ఎదురైతే స్వర్గ సుఖాలు అనుభవిస్తామన్నాడు.

చెల్లెలి పెండ్లి తప్పించటం బుచ్చమ్మ చేతులోనే వుందని గిరీశం నమ్మించాడు. తనతో లేచివచ్చి పెండ్లి చేసుకుంటే ఈ పెండ్లి తప్పి పోతుందని

సలహా యిచ్చాడు. అది తెలిసి బుద్ధివచ్చి ముసలివాడికిచ్చి పెండ్లి చేయదనీ పూనగుచ్చినట్లు చెప్పాడు. తనతో రాకపోతే తాను ఛస్తానని బెదిరించాడు. చివరకు గిరీశం చెప్పినట్లు నడుచుకోవడానికి బుచ్చమ్మ అంగీకరించింది.

పడక గదిలో లుబ్ధావధానులు నిద్రలోంచి లేచి అరచి కాళ్ళు చేతులూ కొట్టుకొని ఒణుకు తున్నాడు. కొత్త పెండ్లి కూతురు రెండో పెండ్లి ముండ అనీ దాని మొగుడు పిశాచమైవచ్చి పీక పిసికి చంపేస్తున్నాడనీ కేకలు వేశాడు. మీనాక్షి వచ్చి పీడకల వచ్చి వుంటుంది లెమ్మని సర్ది చెప్పింది. లుబ్ధావధానులు అంగీకరించలేదు. దాని చచ్చిన మొగుడు వచ్చి పీకనులుము తున్నాడని అతని నమ్మకం. గుంటూరు శాస్త్రులు మోసం చేశాడని అతనిపై కోపం వచ్చింది. ఇంతలో శిష్యుడు ఏడుస్తూ పరుగెత్తి వచ్చి లుబ్ధావధానుల్ని గట్టిగా కౌగలించు కున్నాడు. మీనాక్షి చీపురుతో కొట్ట బోయింది. వాడు తప్పించుకోగా లుబ్ధావధానులకు చీపురు దెబ్బలు తగిలాయి. శిష్యుడు మీనాక్షి చేయి కరచి పారిపోయాడు. తనకు కట్టబెట్టిన రామప్పంతులు దగ్గరకే ఈ ముండను పంపించి వేస్తామని అవధానులు నిశ్చయించు కున్నాడు. ఎంత వెదికినా పెళ్ళికూతురు (శిష్యుడు) కనిపించలేదు. ఏ నూతిలోనో దూకిందని అవధానులు భయపడ్డాడు. ఎంత గాలించినా దొరకలేదు. రామప్పంతులు యింటికి వెళ్ళి వుంటుందని నిశ్చయించు కున్నాడు. రజస్వలానంతరం వివాహం చేసుకున్నందుకు తనకు తగిన ప్రాయశ్చిత్తమే జరిగిందని చెంపలు వాయించు కున్నాడు. మాటలోనే రామప్పంతులు వచ్చాడు. పెండ్లినాడు పెట్టిన మధురవాణి కంటె తిరిగి యివ్వమని కోరాడు. లుబ్ధావధానులు ఆ విషయం తనకు తెలియద్దు పొమ్మన్నాడు. గుంటూరు శాస్త్రులు రామప్పంతులు కలిసి నాటకమాడారన్నాడు మధురవాణితో బాటు దాన్ని కూడా వుంచుకోమన్నాడు. నా కంటె ఇవ్వకపోతే వూరుకునేది లేదని రామప్పంతులు అన్నాడు. పిల్ల కనబడనందువల్ల పూజారి గవరయ్యను పిలిపించి యంత్రం వేయించారు. ఆ కామినీ ఎశాచాన్ని సీసాలో బంధించానని గవరయ్య సీసా చూపించాడు. కొంత ఖర్చుచేసి ఆ సీసాను భూస్థాపితం చేయాలని అన్నాడు. ఇప్పటికయిన ఖర్చు చాలని లుబ్ధావధానులు నమస్కారం పెట్టాడు. కంటెకోసం రామప్పంతులు పట్టుబట్టాడు. చివరకు ఆ పిల్ల ఎలా పోయిందా? అని ఆశ్చర్యపోసాగారు.

రామప్పంతులు హెడ్ కానిస్టేబులు వద్దకు వచ్చి పిల్ల పారిపోయిన సంగతి చెప్పాడు ఎలాగైనా జవాన్లను పంపి ఆ పిల్లను పట్టుకొని కంటె ఇప్పించమని డబ్బు ఆశ చూపాడు ఒకవేళ ఆ కంటె అవధాన్ల దగ్గర వుంటే ముసలాడి మీద కూనీ కేసు బనాయిస్తే డబ్బు గుంజవచ్చునని సలహాయిచ్చాడు

ఆ పిల్ల మీనాక్షికి భయపడి రామప్పంతులు యింట్లోనే దాగి వుండవచ్చునని హెడ్ కానిస్టేబులు అన్నాడు తన యింట్లో లేనే లేదని ఎవరింటికైనా వెళ్ళి వుంటే పిల్ల నిద్రపోయేటప్పుడు కంటె లాగేస్తే మధురవాణి తనను యింట్లోంచి గెంటివేస్తుందని పంతులు గోలపెట్టాడు ఎలాగైనా మధురవాణి వద్ద మాటపడకుండా చూడమని హెడ్ కానిస్టేబుల్ని రామప్పంతులు బ్రతిమలాడాడు

లుబ్ధావదానుల యింట్లో మీనాక్షి ప్రమిదతో దీపం తెచ్చి గూటిలో వుంచింది రామప్పంతులు అక్కడకు వచ్చి వత్తి తగ్గించి మీనాక్షిని ముద్దుపెట్టుకున్నాడు తోవతప్పి వచ్చినందుకు మీనాక్షి పంతుల్ని హాస్యమాడింది మధురవాణిని వదిలి వేయడానికి సిద్ధంగా వున్నానని మనయిద్దరం పెండ్లాడితే పవిత్రత ఏర్పడుతుందని నమ్మించాడు మధురవాణి నీతిమాలిన పనులు చేస్తుంది కాబట్టి దానికి బుద్ధి చెప్పాలని పంతులు అన్నాడు రేపు మధురవాణిని తన్ని తరిమి వేసి మర్నాడు మనమిద్దరం రాజమహేంద్రవరం వెళ్ళిపోదామని అన్నాడు నగలతో సహా పారిపోయివస్తే సులభంగా వెళ్ళవచ్చునన్నాడు కంటె మధురవాణి కిచ్చి వేస్తే దాని పీడ వదలిపోతుందని దీపం ఆర్పివేసి మీనాక్షిని కౌగిలించి ఎత్తుకొన్నాడు లుబ్ధావధానులు చీకట్లో వచ్చి కర్రతో రామప్పంతులు కాళ్ళమీద కొట్టాడు మీనాక్షి కింద పడింది రామప్పంతులు పారిపోయాడు నన్ను కూడా తీసుకెళ్ళమని మీనాక్షి కోరినా వినకుండా వెళ్ళిపోయాడు మధురవాణి యింట్లోకి రానీకుండా తలుపు బిగించి కూచొంది మీనాక్షి పరుగెత్తుకొంటూ వచ్చి రామప్పంతులు రెక్కపట్టుకొని బలవంతంగా పెళ్ళి చేసుకోమని నిలవేసింది తమ మధ్య జరిగిన పెళ్ళి ముచ్చట్లు మధురవాణికి చెప్పివేసింది మధురవాణి

కూడా మీనాక్షిని పెళ్ళి చేసుకోమని రామప్పంతులుని నిర్బంధించింది. లేకపోతే మీనాక్షి దావా వేస్తుందని బెదిరించింది. ఇద్దరికీ మంగళహారతి తీయడానికి హారతి పళ్లెం తీసుకు రావడానికి మధురవాణి లోపలికెళ్ళింది. అదే అదనుగా తీసుకొని రామప్పంతులు చెరువు కట్టవైపునకు జారుకొన్నాడు. అక్కడ శిష్యుడు (పెళ్ళి కూతురు) పంతులు వెంటబడ్డాడు. పంతులు కాలికొద్దీ పరుగెత్తాడు.

రామచంద్రాపురం చెరువు గట్టుమీద వున్న తోటలోనికి పెళ్లివారి బళ్ళు వచ్చాయి. గట్టుమీద ఒకవైపు అగ్నిహోత్రావధానులు, రెండోవైపు పళ్ళుతోముకుంటూ రామప్పంతులు నిలుచున్నారు. అక్కడ బళ్ళుదించి స్నానాలు పూర్తి చేసి వెళ్ళమని అగ్నిహోత్రావధాన్లు తనతో వచ్చినవారిని పురమాయించాడు. లుబ్ధావధానుల పెళ్లి అప్పటికే అయిపోయిందని రామప్పంతులు జరిగిన కథ చెప్పాడు. గుంటూరు శాస్త్రులు రావడం, ఉత్తరం రావడం వివరంగా చెప్పాడు. అగ్నిహోత్రావధానులు మండిపడ్డారు.

లుబ్ధావధానుల్ని నిలదీసి అడగడానికి అగ్నిహోత్రావధానులు యింటి కెళ్ళాడు. అక్కడ లుబ్ధావధానుల్ని చెడ్డ దెబ్బలు కొట్టి వెనక్కి తిరిగి వచ్చేశాడు. తోవ ఖర్చుకయినా యిమ్మంటే యివ్వనన్నాడు పిల్లి శకునం యిలా మారిందని బాధ పడ్డాడు. లుబ్ధావధానుల మీద క్రిమినల్ కేసు తేవడానికి రామప్పంతులు సలహా అడిగాడు. తగిన సాక్ష్యాధారాలు తెచ్చి పెడతాననీ, కేసు వెయ్యమనీ పంతులు వుసిగొలిపాడు. దానికి తోడు పరువునష్టం దావా కూడా వేయవచ్చునన్నాడు. ఏదైనా నగ తాకట్టు పెట్టి డబ్బుతెచ్చి కేసు వేద్దామని అగ్నిహోత్రావధానులు ముందుకు వచ్చాడు. గిరీశం సలహాతో కేసు గెలుస్తామని అన్నాడు. ఏమైనా అతడు లుబ్ధావధానుల పినతల్లి కొడుకుకాబట్టి అతణ్ణిచ్చి పిల్లల్ని వెనక్కి పంపివెయ్యడం మంచిదని పంతులు గుర్తు చేశాడు. అందరూ కలిసి గిరీశం కోసం వెదికారు. గిరీశం, బుచ్చమ్మ లేచిపోయారని తెలిసిపోయింది. అగ్నిహోత్రావధాన్లు మండిపడ్డాడు. వెంకటేశాన్ని చావ బాదాడు. మీ గురువు యిలా చేశాడని కోప్పడ్డాడు.

విశాఖపట్టణంలో రామప్పంతులు, అగ్నిహోత్రావధానులు చాలా రోడ్డులు కలియతిరిగి చేతిలో డబ్బు పైసాలేకుండా ఖర్చు చేశారు చివరకు కడియం తాకట్టు పెట్టి అయినా డబ్బు తెచ్చుకోవాల్సివచ్చింది వకీలు కోసం చాలా ఖర్చు పెట్టించారనీ, ఇంగ్లీషు కూడా సరిగారానివాడ్ని పెట్టించారనీ అగ్నిహోత్రావదానులు రామప్పంతులుపై విసుక్కొన్నాడు రామప్పంతులుకూ కోపం వచ్చి లాయరు నాయుడితో చెప్పాడు అయన కలెక్టరుగారికి అగ్నిహోత్రావదానుల వెదవ పనులు చెప్పడానికి సిద్ధపడ్డాడు

లుబ్ధావధానులు తన దురవస్థకు తానే చింతిస్తున్నాడు ఏళ్ళనాటి శని ఫలితం యిలా దాపురించిందని బాధ పడ్డాడు సౌజన్యారావు పంతులవంటి ఘనుల మాటలు విననందుకు బాదపడ్డాడు రామప్పంతుల్ని నమ్మినందుకు తగిన శాస్తి జరిగిందనుకొన్నాడు ఈ ఆపద తప్పిపోతే కాశీకి వెళ్ళి పోదామని నిశ్చయించుకొన్నాడు

అక్కడికి రామప్పంతులు వచ్చి నిరాశానిస్పృహాలతో కొట్టుమిట్టాడుతున్న లుబ్ధావదానుల్ని సముదాయించడానికి ప్రయత్నించాడు. ఖూనీకేసు మాఫీ చేయించడానికి రెండు సంచుల డబ్బు కావాలని సలహా యిచ్చాడు దమ్మిడీ కూడా యిచ్చేది లేదని అవదాన్లు మంకు పట్టుబట్టాడు ఉరిశిక్ష మీనాక్షికీ, తండ్రికీ తప్పదని పంతులు గట్టిగా చెప్పాడు

ఈలోగా సౌజన్యారావు పంతులు అక్కడికి వచ్చి రామప్పంతుల్ని యింట్లోంచి గెంటివేయిస్తాడు డిప్యూటి కలెక్టరు లంచం తీసుకోడనీ తనకు స్నేహితుడనీ ఆపద గట్టెకిస్తాననీ హామీయిచ్చాడు. తనకు ఫీజు కింద కన్యాశుల్కం నిరసన, బాల్యవివాహ నిరసన చేస్తే చాలునన్నాడు కేసు గెలిపించే బాద్యత సౌజన్యారావు పంతులు తీసుకొన్నాడు

మదురవాణి యింటి ఎదుట వీదిచివర్లో కరటకశాస్త్రి శిష్యుడు వాదించుకొంటున్నారు మదురవాణి కంటె ఆమె కిచ్చి వచ్చినందుకు శిష్యుడ్ని తిట్టిపోస్తున్నాడు రామప్పంతులు కూనీకేసు బనాయించాడు తాను తీసుకొన్న డబ్బు లుబ్ధావదానులికి ఇచ్చివేయడానికి శాస్త్రులు సిద్ధపడ్డాడు ఖూనీకేసు తప్పించి లుబ్ధావధానులికి ఉరి శిక్ష పడకుండా చూడాలని అతని తాపత్రయం

మధురవాణి వద్దకు గురుశిష్యులు వెళ్ళి ఆమెతో మాట్లాడారు. జరగబోయే ప్రమాదం గురించి ఆమె హెచ్చరించింది. ఇద్దరూ ఆడిననాటకం బయటపడి ఇద్దరికీ శిక్ష పడుతుందని బెదిరించింది. పాపం, పుణ్యం ఎరగని తనకు శిక్ష పడటం అన్యాయమనీ, ఎలాగైనా రక్షించమనీ శిష్యుడు మధురవాణిని బ్రతిమాలాడు.

సౌజన్యారావు పంతుల్ని తన వద్దకు తీసుకొని వస్తే ఈ ఆపద గట్టెక్కిస్తానని మధురవాణి శాస్త్రులతో అంటుంది. పరోపకార పరాయణుడైన ఆయన లుబ్ధావధానుల్ని రక్షించడానికి ప్రయత్నిస్తానన్నారని తెలిసి ఆమె సంతోషించింది. శిష్యుణ్ణి తనవద్ద తాకట్టుపెట్టి పొమ్మని శాస్త్రులకు చెప్పింది. సౌజన్యారావు పంతులువద్దకు తననే తీసుకెళ్ళమని శాస్త్రులను బ్రతిమాలింది. డిప్యూటీ కలెక్టరును వలచి వలపించుకోమని శాస్త్రులు మధురవాణికి సలహా ఇచ్చాడు.

సౌజన్యారావు పంతులు తన ఇంట్లో అగ్నిహోత్రావధానులతో చర్చిస్తున్నారు. బాల్య వివాహాలు చేయడం దోషమని సౌజన్యారావు పంతులు వాదిస్తున్నారు. కన్యల్ని అమ్ముకోవడం తప్పుకాదా? అని అడిగారు. మీ రెండోపిల్లకు తగిన వరుణ్ణి చూసి పెళ్ళి చెయ్యమని సలహా ఇచ్చాడు. అగ్నిహోత్రావధానులు ఆగ్రుడయ్యారు. బుచ్చమ్మకు వితంతువుల మఠంలో సంఘసంస్కారసభవారు విద్యాబుద్ధులు చెప్పించగలరన్నాడు. ఆ మాటకు అవధానులకు గంగవెర్రులెత్తాయి.

బుచ్చమ్మకు ఇవ్వవలసిన ఆస్తి యిచ్చివేసి గిరీశం మీద దావా ఉపసంహరించుకొంటే, లుబ్ధావధానుల చేత కేసు తీయించి వేస్తానని సౌజన్యారావు సూచించాడు. అగ్నిహోత్రావధానులు వొళ్ళు మండి లేచి వెళ్ళి పోయాడు.

డిప్యూటీ కలెక్టరు కచేరీలో అగ్నిహోత్రావధానుల కేసు విచారణకు వచ్చింది. నాయుడు అవధానుల దుశ్చేష్టలన్నీ ఏకరువుపెట్టాడు. భీమారావు గిరీశం బుచ్చమ్మను లేవదీసుకబోవడం వివరించాడు. ఫోర్జరీకేసు తప్పిస్తానని అగ్నిహోత్రావధానులతో నాయుడు అన్నాడు. డబ్బులేదు కాబట్టి రెండు

పుట్లు మిరపకాయలు ఫీజు కింద ఇచ్చుకుంటానని అవధానులు చెప్పాడు గిరీశం అక్కడికి తొందరగా వచ్చి అవదాన్లు కాళ్ళు బట్టిలాగి 'మామగారికి నమస్కారం' అని పరుగు లంఘించుకొన్నాడు అగ్నిహోత్రావదానులు కింద పడ్డాడు

గిరీశం లుబ్ధావదానుల్ని కౌగలించుకుని ఏడ్చాడు సౌజన్యారావు నలహా నీకు చెప్పి పోదామని వచ్చానన్నాడు హెడ్ కానిస్టేబులు అక్కడికి వచ్చి అంజనంవేసి పెళ్ళికూతురు ఆనవాలు కనిపెట్టమని అన్నాడు హెడ్ కానిస్టేబులు చెప్పినట్లు సాక్ష్యమివ్వడానికి సిద్ధంగా ఉన్నానని గిరీశం నమ్మబలికాడు గిరీశం సౌజన్యారావుని కలిసి సాక్ష్యం విషయం చెప్పాడు గుంటూరు శాస్త్రుల్ని ఎలానో పట్టుకోగలనని అన్నాడు తాను సంఘ సంస్కర్తనని చాటుకొన్నాడు బుచ్చమ్మను పెళ్ళిచేసుకోవడం తన అదృష్టమనీ లుబ్ధావధానులు తనని దత్తత తీసుకొనేలా చూడమనీ గిరీశం కోరాడు

అలా వారిద్దరు మాట్లాడుకొంటున్న సమయంలో ఒక కొత్త మనిషి సౌజన్యారావు ఇంట్లోకి ప్రవేశించి ఆయనతో మాటలు మొదలెట్టింది వితంతువివాహం, వేశ్యావృత్తి నిర్మూలన గూర్చి ఆయన అభిప్రాయాలు తెలుసుకొని సంతోషించింది 'ఆంటీనాచ్' అయిన సౌజన్యారావు వేశ్యలు తనని ముట్టుకొంటేనే అపవిత్రమైపోతామని అనుకొనేవారు. అలాంటిది వారిని వివాహమాడటానికి సంసిద్ధతవ్యక్తం చేయడం పట్ల ఆ కొత్త మనిషి ఆశ్చర్యం వ్యక్తతం చేశారు ఒక వేశ్య సౌజన్యారావు పంతుల్ని చూడాలని దీక్ష పట్టి వుందని తెలుసుకొని ఆయన ఆశ్చర్యపోయాడు.

ఆ వచ్చిన మనిషి మదురవాణి. ఆమె తన వేషాన్ని తీసివేసి సౌజన్యారావు ముందు నిలుచుంది లుబ్ధవదానుల్ని ఉరి శిక్ష నుండి తప్పించమని ఆయన ప్రాధేయపడ్డాడు అర్ధరాత్రివేళ ఒక వేశ్య తన యింటికి రావడం ఆయన సహించలేక పోయాడు అయినా లుబ్ధావధానులకోసం ఆమెను బ్రతిమాలాడు ఒక ముద్దిస్తే చాలునని మదురవాణి చెప్పింది

జరిగిన కద అంతా చెప్పి కరటకశాస్త్రులు, శిష్యుడి నాటకం వివరించింది సౌజన్యారావు ఆమె చాతుర్యానికి మెచ్చుకొన్నాడు ఆమె సౌజన్యారావును

ప్రశంసిస్తూ వెళ్ళబోతూ వుంటే లోపలవున్న గిరీశాన్ని మధురవాణికి పరిచయం చేశాడు. గిరీశం తన తప్పిదాలకు పశ్చాత్తాపపడుతున్నట్లు చెప్పాడు. సౌజన్యారావు పంతులు గిరీశంవంటి ఆషాఢభూతులవల్ల ఎందరో దగాపడతారన్నాడు. చక్కగా కాలేజిలో చదువుకొని బుద్ధిగా బ్రతకమని సలహా ఇచ్చాడు. మధురవాణితో సౌజన్యారావు పంతులు కరచాలనం చేసి తన వ్రతభంగానికి సిద్ధపడ్డాడు.

'డామిట్ కథ అడ్డం తిరిగింది గదా' అని గిరీశం వాపోయాడు.

6

# గణపతి

(సంక్షిప్త గ్రంథం)

చిలకమర్తి లక్ష్మీ నరసింహం

1867-1946

ప్రథమ ముద్రణ : 1919

# చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు

చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులు గోదావరి జిల్లా ఖండవల్లిలో **1867** సెప్టెంబరు **26**న జన్మించారు. వీరవాసరం కొండపల్లి, రాజమహేంద్రవరాలలో ప్రాథమిక, ఉన్నతవిద్యలను అభ్యసించారు, **1892**లో ఉపాధ్యాయవృత్తి స్వీకరించారు. అప్పటికి రాజమహేంద్రవరంలో నాటకసమాజాలు ప్రబలంగా ఉన్నాయి. అందులో ప్రకాశంగారికి ఆశ్రయమిచ్చిన ఇమ్మానేని హనుమంతరావునాయుడు ప్రముఖులు వారి కోరికమేరకు చిలకమర్తి వచనంలో నాటకాలు వ్రాయనారంభించారు.

కీచకవధ, ద్రౌపదీపరిణయం, శ్రీరామజననం గయోపాఖ్యానం, పారిజాతాపహరణం, నలచరిత్ర, సీతాకళ్యాణం చిలకమర్తివారి ప్రసిద్ధనాటకాలు. నాటక సమాజాలవారితో సాన్నిహిత్యం వల్ల వారి అవసరాల కనుగుణంగా రంగ స్థలానికుపయుక్తమైన ప్రదర్శనయోగ్యములైన నాటకాలు వ్రాశారు.

అన్ని భాషలనాటకాలను ఆయన తెలుగులోకి అనువదించారు. వీరేశలింగాన్ని చిలకమర్తి రచనలో గురువుగా భావించారు. ప్రహసనాలు వ్రాయడానికి వీరేశలింగమే స్ఫూర్తి

చిలకమర్తి 'దేశమాత' అనే వారపత్రికకు సంపాదకులుగా వ్యవహరించారు. చిలకమర్తి గ్రాంధికభాషోద్యమాన్ని సమర్థించారు 'భరతఖండంబు చక్కని పాడియావు' అనే దేశభక్తి పద్యం చిలకమర్తి స్వాతంత్రోద్యమ స్ఫూర్తితో వ్రాశారు. **43**వ ఏట రేచీకటి ముదిరి కనులు కనిపించడం మానివేశాయి. ఇతరుల సహాయంతో ఏక సంధాగ్రాహిగా రచనావ్యాసంగం కొనసాగించారు జీవితకథలు, స్వీయచరిత్ర వ్రాశారు.

చిలకమర్తి పరిశుద్ధ హాస్యానికి 'గణపతి' నవల సాక్ష్యం ఆంగ్లంలో 'లారేల్ అండ్ హార్డీ' హాస్యంవలె గణపతి కథసాగిపోతుంది. ఆనాటి సాంఘిక విషయాలు యిందులో పొందుపరచారు. గణపతి నవలలో ప్రత్యేకవ్యంగ్య చిత్రణ కనిపిస్తుంది గురజాడవారి గిరీశం, పానుగంటివారి జంఘాలశాస్త్రి మొక్కపాటివారి బారిష్టరు పార్వతీశం ఒకేకోవకు చెందినవారు 'ఈనాటికి కూడా గణపతి కొంతమంది ఆంధ్రుల్లో ప్రస్ఫుటంగా మనకు సాక్షాత్కరిస్తారు' అన్నారు ఆరుద్ర చిలకమర్తివారు **1946** జూన్ **16**న నిర్యాణం చెందారు.

# గణపతి గురించి

పప్పుభొట్లవారు ఎక్కడనుండో మందపల్లి వచ్చారు. శ్రమలేకుండా భుక్తి దొరికే మార్గాన్ని ఎంచుకొని అక్షయపాత్రను స్వీకరించారు. పాపయ్య గణపతి తాత. అతడు తద్దినం బ్రాహ్మడుగా స్థిరపడ్డాడు. పెండ్లిచేసుకోవడానికి డబ్బు మిగల్చాలని చూశాడు. మందపల్లికి వచ్చి యిల్లుకట్టుకొని పిచ్చమ్మను వివాహమాడాడు పెండ్లి అయిన తర్వాత అత్తమామలు శనిగ్రహాల్లా అల్లునితోనే వుండిపోయారు. చివరకు పాపయ్య అందరినీ యింట్లోంచి గెంటివేశాడు. పిచ్చమ్మ గణపతి తండ్రి గంగాధరుని ప్రసవించింది. మరిడీజాడ్యంతో పాపయ్య కాలధర్మం చేశాడు. పిచ్చమ్మ గంగాధరునితో ఏడేండ్ల వయస్సులో (గంగాధరుడు) యేనుగు మహల్ చేరుకుంది జరుగుబాటు లేక గంగాధరుడు కాకినాడకు మకాంమార్చాడు. నీళ్ళకావిళ్ళు మోసి డబ్బుసంపాదించాడు. సింగమ్మతో గంగాధరుని వివాహమైంది. వీరి వంశోద్ధారకుడే మన గణపతి.

గణపతి పుట్టిన మూడునెలలకే పిచ్చమ్మ కాలధర్మం చేసింది. గణపతి ప్రసిద్ధపురుషుడౌతాడని జ్యోతిష్కులు చెప్పారు. చదువు సంధ్యలు మాత్రం వంటబట్టలేదు మేనమామకు తలవంపులు తెచ్చేలా ప్రవర్తించేవాడు తద్దినాలకు భోక్తగావెళ్ళి యింటివారిని పీడించి డబ్బుసంపాదించడం మొదలు పెట్టాడు. గణపతి నాలుగో యేట తండ్రి చనిపోయాడు

మేనమామ భార్యకు కూతురుపుట్టింది. గణపతి భార్య అని తల్లి సంబరపడింది ఆ వరస పిల్లతల్లికి మాత్రం యిష్టంలేదు. మేనమామ బాధ తప్పించుకోవటానికి తల్లీకొడుకులు వానపల్లి చేరారు. అక్కడ గణపతి ఉపాధ్యాయవృత్తి స్వీకరించాడు. అక్షరంముక్కరాని గణపతి పాఠాలు చెప్పిన తీరు వర్ణనాతీతం బడిసాగక గణపతి వీధి భాగవత నాటకాలాడాడు. పెళ్ళిపిచ్చి అతనికి పట్టుకుంది పెళ్ళివిషయంలో తల్లీకొడుకులు తగాదాపడి సింగమ్మ తీర్థయాత్రలకు వెళ్లి మార్గమధ్యంలో కాలధర్మం చేసింది. గణపతి పెళ్ళి చింతాభైరవ దీక్షితులవారి అమ్మాయితో అయిదు రోజులు వైభవంగా జరిగింది. దీక్షితులు మోసంచేసి పెళ్ళి అయిన పిల్లను అంటగట్టాడు. పోలీసులకు భయపడి గణపతి వూరువదలి వెళ్ళిపోయాడు.

## 6. గణపతి

### సంక్షిప్త గ్రంథం

శుక్లాంబరధరం విష్ణుం, శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనం ధ్యాయేత్, సర్వ విఘ్నోపశాంతయే॥

అని గణపతి ప్రార్థన చేయనిదే ఏపనీ మొదలపెట్టం శివుని ప్రథమ గణాలకు నాయకుడు ఈ గణపతి ఆ గణపతితో సమానమైనవాడు ఈ కథానాయకుడు ఈ గణపతి ఇద్దరికి ఎన్నో సామ్యాలున్నాయి ఆకారంలోనేమి అన్నిటిలోను ఈ గణపతి గొప్పవాడు ఆపేరు తల్లిదండ్రులతని కెందుకు పెట్టారని అనుమానం వద్దు ఎన్నోకారణాలు ఒక్క చదువులో తప్ప అన్నిటిలోను మన గణపతి అతణ్ణి మించి పోయాడు వాల్మీకి వ్యాసాదులెవ్వరికి దొరకని అదృష్టము చిలకమర్తి లక్ష్మీనరసింహంగారికి దొరికినది ఆయన గణపతి జీవితచరిత్ర వ్రాసి చరితార్థుడైనాడు

గణపతి ఒకానొకనాడు చిలకమర్తివారికి కలలో కనిపించి తన చరిత్ర వ్రాయమని ఆదేశించాడు కలలోకనపడి కవులను కావ్యాలు వ్రాయమనడం మన తెలుగులో ఆనవాయితీ మనకదానాయకుని వంశవర్ణన చేయడం అవసరం గోదావరీ తీరంలో మందపల్లి అనే గ్రామం ఉంది అక్కడ శనైశ్చరుడు శివప్రతిష్ఠ చేశాడు అక్కడ పప్పుబొట్ల వారిది ప్రసిద్దవంశం నక్కపల్లి నుండి గణపతిపూర్వులు ఎన్నడో మందపల్లి వచ్చారు వీరి పూర్వీకులలో ఒకానొకడు భార్యమీద కోపంతో జందెములు తెంపుకొని సన్యసించాడు కాని భుక్తిజరగ లేదు అతడు యింట్లోనే సన్యాసానికి స్వస్తి చెప్పి నక్కపల్లి వదలి మందపల్లి చేరాడు

గణపతి పూర్వులు భుజబలమితో కొంత స్థిరాస్తి సంపాదించారు ఊరివారి ఆస్తి తమ ఆస్తిగా బావించడం పప్పుభొట్ల వంశానికి వెన్నతో పెట్టిన విద్య ఎలాంటి శ్రమ లేకుండా భుక్తి గడిచిపోవు మార్గమును వారు ఎంచుకొన్నారు కలకాలము తర తరాలకు నిలిచిన ఆస్తి అక్షయపాత్ర పప్పుభొట్లవారు వైదికులు గణపతి తాతపేరు పాపయ్య ఋగ్వేదంలో

తొమ్మిదవ అర్థం ఆయని నిత్యపారాయణం చేసేవారు. షట్కర్మలలో మిగిలిన ఐదింటిని వదిలిపెట్టిదానం స్వీకరించటం మాత్రము స్వీకరించారు. అతడొక యజ్ఞంకూడా చేశాడు. పాపయ్య కప్పుడు 20 యేండ్ల వయసు. తల్లి ఎండబోసిన మినప్పప్పు తింటున్న మేకను సత్తువకొద్దీ తన్నాడు. అది హరీ మని చచ్చింది. అలా అతనికి యజ్ఞఫలం దక్కింది. ఆయనకు కొన్ని పౌరుషనామాలు కలిగాయి. ఒకటి బండబూతుల పాపయ్య. రెండవది పిడిగుద్దుల పాపయ్య. చిన్నప్పటి నుండీ అతనికి అద్వైతము సిద్ధించినది. కంట బడిన వస్తువులన్నీ తనవిగా భావించేవాడు. వివాహవయసు వచ్చినా పాపయ్యకు పిల్ల నివ్వటానికి, ఎవరూ ముందుకు రాలేదు. ఆ దిగులుతో అతని తల్లి గతించినది. ఫలితముగా అతడు తద్దినాలు లేనిరోజులలో స్వంతంగా వండుకోక తప్పలేదు. అతని భోజనపరాక్రమం తెలిసిన వారెవ్వరూ భోజనానికి పిలిచేవారు కారు. చిన్నతనంలోనే మానెడు బియ్యపు అన్నం తినగలిగిన శక్తిశాలి. పెండ్లి కావాలంటే డబ్బు సంపాదించాలి. పూనా నగరంలో బ్రాహ్మణులకు సంభావనలు ఎక్కువని ఎవరో చెప్పగా విని అతడు చేతకాను లేకపోయినా సత్రాలలో తలదాచుకుంటూ పూనా చేరాడు. మహారాష్ట్రుల ఆచారవ్యవహారాలు అతనికసలు నచ్చలేదు. యాచనవల్ల బ్రాహ్మణార్థముల వల్ల వచ్చిన డబ్బు పొగచుట్టలకు, తినుబండారములకు సరిపోయేది. పెండ్లికాకుండా యింటికి వెళ్ళడం అతనికి యిష్టం లేదు.

నెలరోజులకు పైగా ఆలోచించి కోటి యజ్ఞ ఫలప్రదమైన అనాథప్రేత సంస్కారానికి పూనుకున్నాడు. శవాలు మోసి కష్టపడి డబ్బు సంపాదించాడు. తన భుజశక్తితో జీవిస్తున్నానని సంతోషపడేవాడు. పల్లకి మోయడం వంటిదేనని సమర్థించుకునేవాడు అవసరాన్ని బట్టి వ్యక్తుల్ని బట్టి బేరం ఆడేవాడు.

ఎవరైనా లోభులు కొనరితే ఈ సారికి ఇలాపోనీండి మరోసారి చూద్దామనేవాడు. శవదహనానకి తోడు ఏకమహాపిండభక్షణం కూడా చేసేవాడు. నెలకు వందల కొద్దీ రూపాయలు సంపాదించేవాడు. అప్పుడప్పుడు అతడు కొందరు వేశ్యలకు దానధర్మాలు చేసి బతకించేవాడు. పాపయ్యకు 50

సంవత్సరాలు వచ్చాయి. పూనా వచ్చి అప్పుడే ఇరువది యేండ్లయింది. మార్వాడి వాని వద్ద అప్పుడప్పుడు యిచ్చిన డబ్బు మూడు వేలు సమకూరింది. వాడు పాపయ్యకు ఎగ గొట్టాలని అనుకున్నాడు. మశూచివచ్చి మార్వాడి చనిపోయాడు. అతని కొడుకు పాపయ్య డబ్బు పాపయ్యకు యిచ్చి వేశాడు.

మూల స్థానంలో అన్నంభొట్ల అన్నప్ప కూతురుతో 1200 రూ. లకు సంబంధం కుదిరింది. మందపల్లికి తిరిగి వచ్చి యిల్లు కట్టుకొని పిచ్చమ్మను వివాహమాడాడు.

పాపయ్య వివాహ వేడుకలు చెప్పనలవి కావు. పప్పుభొట్ల వారితో అన్నంభొట్ల వారు వియ్యమందటం విశేషంగా చెప్పుకున్నారు. ఉభయ ఖర్చులూ పాపయ్యవే. పొడగరి కావడంతో పాపయ్య పల్లకిలో తలవంచుకుని ఐదు రోజులు వూరేగాడు. భోగం మేళం లేకుండా పెండ్లి జరగడం అతనికి యిష్టం లేదు. అమావాస్య చంద్రబింబం వంటి మొగముగల చంద్రవదనతో మేజువాణి కట్టించాడు.

వివాహమయాక ఎంత కాలానికీ అత్తమామలు మందపల్లి వదిలి పోలేదు. ఏదో ఒక సాకుతో అన్నప్ప ప్రయాణం మానుకునేవాడు. తిథి బాగులేదని ఒకరోజు, శకునము కాలేదని మరో రోజు ప్రయాణం మానుకునేవాడు. దశమగ్రహం వలె అన్నప్ప గాదెక్రింద పందికొక్కు అయినాడు. శనిగ్రహాన్ని వదిలించుకునేందుకు అందరూ మందపల్లి వస్తే అక్కడే వున్న పాపయ్యకు శనిగ్రహం వదలలేదు. వాళ్ళ చేత వీళ్ళ చేత చెప్పించాడు. అన్నప్పకు కోపం వచ్చింది. పాపయ్యను నానా దుర్భాషలాడి ఆరు మాసాలూ విధిలేక వున్నానని బిడ్డలతో భార్యతో కలిసి స్వగ్రామం వెళ్ళిపోయాడు.

వివాహమైన రెండు సంవత్సరాలకు భార్య యుక్తవయస్కురాలైందని తెలిసింది. పునస్సంధానానికై ఎవరినో రాయబారం పంపాడు. అన్నప్ప

సుతారమూ ఒప్పుకోలేదు. మూడువందల రూపాయలు ప్రాయశ్చిత్తం విధించాడు. పాపయ్య ఒప్పుకోక తప్పలేదు. పెండ్లి జరిగిన చోటనే పునస్సంధానం జరగవలెనని అన్నప్ప షరతు పెట్టాడు. మగని దగ్గర బెదురు తీరేంతవరకు కూతురుతో వుండాలని అన్నప్ప ఆరుమాసాలు తిష్ఠ వేశాడు.

పిచ్చమ్మ నెలతప్పింది. నవమాసాలు మోసి పిచ్చమ్మ మగ శిశువును కనింది. అన్నప్పగారి తండ్రి గంగయ్యపేరు బారసాలనాడు నామకరణం చేశారు. ఆ విధంగా గణపతి తండ్రి గంగాధరుడయ్యాడు. ఆరవ మాసంలో అన్నప్రాశన కాగానే వెళ్ళిపోతానని అన్నప్ప ముహూర్తం పెట్టించాడు. శ్రాద్ధభోజనాలు వరుసగా మూడు రోజులు తిని సరిపడక మరిడీ జాడ్యంతో పాపయ్య కాలధర్మం చేశాడు. అన్నప్ప కూతురుతో మందపల్లిలోనే వుండిపోక తప్పలేదు.

పాపయ్య గతించిన వెనుక యింటిపనులు చూసిపెట్టుటకని అన్నప్ప అక్కడే తిష్ఠ వేశాడు. పాపయ్య వూరిలో యిచ్చిన అప్పులన్ని అన్నప్ప తనపేర వ్రాయించుకొన్నాడు. అల్లుడు పోయిన తర్వాత ఆరు నెలలకు అన్నప్ప యింటికి తిరుగు ముఖం పెట్టాడు. వెళ్ళేటప్పుడు పిచ్చమ్మ యిల్లు తనఖా పెట్టి ఎవరివద్దనో నూరురూపాయలు బదులు యిప్పించాడు. దైవముపై భారము వేసి పిచ్చమ్మ దుఃఖం దిగమ్రింగుకుంది. ఆ తరువాత అన్నప్ప పాపయ్య సంవత్సరీకానికి కూడా రాలేదు. సంవత్సరం తిరక్కముందే నూరురూపాయలు ఖర్చయ్యాయి. నాలుగు సంవత్సరాలయ్యేటప్పటికి అప్పు తీర్చడానికి యిల్లు అమ్మక తప్పలేదు. పాపయ్య యిచ్చిన అప్పులన్నీ అన్నప్ప దండుకున్నాడు. కూతురిపై అతడికంతటి క్షేమ.

కూతురుని చూడటానికి అన్నప్పకు తీరిక దొరకలేదు. ఇల్లు దొరకక మందపల్లి వదలి పిచ్చమ్మ గంగాధరునితో యేనుగులమహాలు గ్రామానికి చేరుకుంది. గోదావరీపాయ యేనుగుల మహాలుకు మందపల్లికి మధ్య ప్రవహిస్తుంది. గంగాధరుడికి ఏడేండ్లు. యేనుగుల మహాలులో గున్నఏనుగువలె వుండేవాడు. ఎనిమిదవ యేడు రాకముందే ఉపనయనం చేయాలని పిచ్చమ్మ

సంకల్పం. భోజన విషయంలో గంగాధరుడు అసాధ్యుడు. మూడు సార్లు మూడు సోలల బియ్యంతిని యెలానో సరిపెట్టుకునేవాడు. ఉపనయనం చేస్తే బ్రాహ్మణార్థాలకు వెళ్ళవచ్చునని పిచ్చమ్మ ఉబలాటం. పీటలమీద కూర్చోడానికి రావలసిందని తండ్రికి కబురు చేసింది. ఎవరు జందెం వేసినా కూలికే కాబట్టి ఎలానో జరిపించమని అన్నప్ప సందేశం. పిచ్చమ్మ ఎలానో జెందెం వేయించింది. భిక్షాందేహి అనేమాట అదిమొదలు అతనికి నిత్యస్మరణ అయింది. చిన్నతనంలో ఒక్కొక్కరికి ఒక్కొక్క ప్రజ్ఞ. గంగాధరునికి భోజన ప్రజ్ఞ. దిష్టి తగలకుండా తల్లి కాపాడేది. ఉల్లి తరవాణి అతనికి యిలవేల్పు. శ్రాద్ధమునాడు కూడా అతడు తరవాణి సేవించిగాని వెళ్ళడు. దేవతలకు అమృతము మనుష్యులకు తరవాణిని బ్రహ్మ యేర్పాటు చేసినాడని అతడు పెద్దవాడైన తర్వాత ఉపన్యాసం ఇచ్చేవాడు. పొద్దుటే తరవాణి సేవించే అతణ్ణి బ్రాహ్మణార్థాలకు పిలవడం మానివేశారు. శుభకార్యాలకు కూడా పిలుపు లేదు.

అక్కడ లాభం లేదని గంగాధరుడు కాకినాడకు మకాం మార్చాడు. పట్టణంలో జరుగుబాటు యిబ్బంది అయింది. నీళ్ళ కావిళ్ళు మోసే పని మొదలుపెట్టాడు. నెలకు ముప్పై రూపాయల ఆదాయం రాసాగింది. నీళ్ళు పోయాలంటే రెండుపూటలా తనకు భోజనం పెట్టాలని షరతు పెట్టాడు. ప్రత్యేకముగా ఒక యిల్లు తీసుకొన్నాడు. గంగాధరుడు కావలసినంత ధనము సంపాదించి సింహాచలమనే వృద్ధ వేశ్యకు ధారపోశాడు. దానికి సకలోపచారములు చేసి ధన్యుడయ్యాడు. నీళ్ళు మోసి అతడు సాక్షాత్తు గంగాధరుడే అయినాడు. పాకశాస్త్రములో కూడ అతనికి ప్రవేశం వుంది. ఒక బాలకవి గంగాధరుని ప్రజ్ఞావిశేషాలను పద్యములలో కీర్తించాడు. గంగాధరుడు కావడి పట్టుకున్నప్పుడు గాండీవి, పచ్చడి బండ పట్టుకున్నప్పుడు నలుడు, రోకలి ధరించన్నప్పుడు బలరాముడు, వడ్డనపళ్ళెము పుచ్చుకున్నపుడు సుదర్శనధారి ఇలా సాగిపోయింది ఆ వర్ణన.

గంగాధరుడు భగీరథుని వలె కాకినాడ పురజనులకు గంగను తెచ్చి మహోపకారి అయినాడు. ఇలా వుండగా ఒకరోజు ఆ పట్టణంలోని ఒక

ధనికవైశ్యుని యింట వివాహము జరిగింది. ఎందరో బ్రాహ్మణులు సంభావనకు అక్కడ చేరారు. పెండ్లివారు వివాహితులైన బ్రాహ్మణులకు రూపాయి, బ్రహ్మచారులకు అర్ధ రూపాయి. సంభావన ఈయదలచారు. గంగాధరునికి అప్పటికి ముప్పై యేండ్లు. అతనికంటె చిన్నవారైన బ్రహ్మచారులతో సమానముగా సంభావన ముట్టినది. వివాహము కాని కొఱత గంగాధరునికి అప్పుడు గుర్తుకు వచ్చింది. సింహాచలము రెండురూపాయలు తీసుకొని రమ్మని కట్టడి పెట్టింది. గంగాధరునకు ఒక ఉపాయము తోచింది. బజారునకు వెళ్ళి సీమనూలు జందెముల జతకొని మొగము నిండా విభూతి అద్దుకొని దొడ్డిదారిన ప్రవేశించాలనుకున్నాడు. దొడ్డి వెనుకభాగపు గోడ వూడి గంగాధరుడు క్రిందపడి కుడిచేయి విరిగింది. కుమ్మరి గురవయ్యను పిలిచి యాభైరూపాయలు యిచ్చుటకు ఒప్పుకొని వైద్యము చేయించుకొన్నాడు. దాని ప్రభావము వలన ఆరునెలలు కావడిమోత కుదర లేదు. తల్లి ఎలానో పోషణ చేయసాగింది. ఈ సమయములోనే తాతగారైన అన్నప్ప కాలంచేశాడు. భవిష్యత్తు ఎలా వుంటుందా అని ఆమె మధనపడసాగింది. భగవంతుని కృప వలన కాకినాడలో నువ్వుల దానం తీసుకొనే ఒక బ్రాహ్మణుడు మరణించాడు. ఆయన స్థానం గంగాధరునికి దక్కింది. వచ్చిన డబ్బును అతడు నాలుగు భాగాలు చేసేవాడు. మొదటి భాగము తన ఖర్చులకు, రెండవ భాగము తనకు దానం యిప్పించిన పురోహితునకు, మూడవ భాగము తనకు ప్రాణముతో సమానమైన సింహాచలమునకు, నాల్గవ భాగము జూదమునకు ఖర్చుపెట్టేవాడు.

అతని జాతకమే మారిపోయినది. సంభావనగా వచ్చిన వస్తువులతో యిల్లు నిండిపోయినది. తనకొక పరుపు, తల్లికొక పరుపు, సింహాచలమునకు మూడు పరుపులు యేర్పాటు చేశాడు. కానీ, దురదృష్టవశాత్తు తనకంటె పెద్దదయిన సింహాచలం కన్నుమూసింది. దాని కులమువారు సెబాసు అనునట్లు ఉత్తరక్రియలు జరిపించాడు. జూదము వ్యసనమాయెను.

ఒక అమావాస్య నాటి రాత్రి జూదగాండ్రు తమలో తాము కలహించుకొని ఒక కాపువానిని చంపిరి. ఆ హత్యానేరము గంగాధరునిపై

పడింది. అదిమొదలు గంగాధరుడు జూదము జూడ పోలేదు.

వివాహము చేసుకోవాలనే కోరిక గంగాధరునికి నలభైయవ యేట కలిగినది. ఇంటినిండా ధనధాన్యసమృద్ధి కలిగింది. మందపల్లి నివాసియైన కోట కోనప్ప పిచ్చమ్మ బ్రతిమాలగా తన రెండు సంవత్సరముల కూతుర్ని గంగాధరునికి యివ్వడానికి అంగీకరించాడు. కన్యాశుల్కము 400 రూ.లు. వయసులో అంత తేడా ఉన్నప్పటికి కోనప్ప వంశోద్ధరణ కోసమై ఈ పెండ్లి జరిపించాడు. పెండ్లి సమయములో పెండ్లికూతురు మారాము చేసి అరటిపండ్లు తిన్నది. ఫలితముగా జ్వరము వచ్చి బాలపావ చిహ్నములు కనబడినవి. ధూమపానము చేయు గంగాధరుడు పొగచుట్ట ప్రయోగించి భార్యను బ్రతికించుకున్నాడు. సింగమ్మ 13వ యేట రజస్వల అయినది. 53వ యేట గంగాధరునకు పునస్సంధానమైనది. మామగారి ప్రేరణతో గంగాధరుడు కాకినాడ వదలి మందపల్లిలో ఒకయిల్లు కొని గృహప్రవేశం చేశాడు. కాపురానికి వచ్చిన నాలుగేండ్లకు సింగమ్మకు వరప్రసాదంగా పప్పుభొట్ల వంశోద్ధారకుడైన కథానాయకుడు గణపతి జన్మించాడు.

గణపతి రూపురేఖా విలాసాలు వర్ణింపనలవిగాదు. అతడొక పిల్లపిశాచము. కొండముచ్చు. కిష్కింధాపుర అగ్రహారీకులలో ఒకడు. రామునకు తోడ్పడిన కోతివలె, తోకలేని కొండముచ్చువలె గణపతిని పోల్చవచ్చును. మొహముపై తిరుగలి గంట్లవలె మశూచికపు మచ్చలు. మెల్లకన్ను. కుడికంటిలో కాయ, దొడ్డికాళ్ళు, గుజ్జురూపు, గుజ్జునకు తగిన బొజ్జ, ఒంటినిండా రోమములు. ఇది గణపతి అవతారము. సహజసిద్ధముగా అతడు వికృత స్వరూపి.

గణపతి పుట్టిన రెండు మూడు నెలలకే గంగాధరుని తల్లి పిచ్చమ్మ కాలధర్మము చెందినది. అదిచూసి నాయనమ్మ గండమున పుట్టిన వెధవయని తిట్లు శాపనార్థాలు పెట్టేవారు. ఎందుకైనా మంచిదని గండములున్నవేమోయని శాంతులు చేయించుటకు పిల్లవానిజాతకమును వ్రాయుమని గంగాధరుడు ఒక జ్యోతిష్కుని కోరాడు. జన్మతిధి నక్షత్ర వారములు గంగాధరునకు గుర్తులేదు. వెంకన్నపంతులుగారి నెలమాసికమునకు తాను పోయినది గుర్తు. దాని ఆధారముగా గణపతి జాతకము వ్రాయబడినది.

ఇటు వంటి మహార్జాతకుడు లేడని జ్యోతిష్కుడు నమ్మబలికినాడు. గండము మునలమ్మతో పోయినదని సంతోషపెట్టినాడు. తాటాకుమీద వ్రాసిన జాతకమును తండ్రి పడమటింటి వసారా చూరులో దోపాడు. గండములు గడిచి గట్టెక్కి గణపతి ప్రసిద్ధపురుషుడు అవుతాడన్నమాట మిడతంభట్టు జోశ్యము వలె నిజమైనది. నాలుగేండ్లు నిండకమందే గంగాధరుడు కన్నుమూశాడు. అప్పటికింకా గణపతికి ఉపనయనం కాలేదు. చేత చిల్లి గవ్వలేదు. ఉత్తరక్రియలు గణపతి మేనమామ జరిపించారు. మేనల్లుణ్ణి తోబుట్టువును తనతో తీసుకెళ్ళాడు.

ఎనిమిదేండ్లలోనే గణపతికి మేనమామ ఉపనయనం చేయించాడు. వామనమూర్తి వలె గణపతి వడకపెండ్లి పీటలపై కూర్చున్నాడు. గాయిత్రీమంత్రము అతనిచేత చెప్పించటం పురోహితుని తరం కాలేదు. చదువుసంధ్యలు వంటపట్టలేదు. చింతబెత్తం పట్టుకొని పంతులుగారు యజ్ఞపశువును తోలుకొని పోయినట్లు గణపతిని లాగికొనిపోయెడివాడు. పూటకొక నాటకమాడి గణపతి బడి తప్పించుకొనేవాడు. గణపతి బడికి వెళ్ళింది మొదలు పంతులుగారి అవస్థ చెప్పనలవిగాదు. బడిపేరు చెప్పగానే గణపతికి ఎక్కడలేని రోగాలూ వచ్చేవి పంతులుగారు బెత్తము తీనుకొని అతని రోగం కుదిర్చేవాడు. పంతులుగారికి ఏదైన జాడ్యమువచ్చి చనిపోతే బలియిస్తానని అమ్మవారి గుళ్ళో గణపతి మొక్కుకున్నాడు. రకరకాల బాధలైనా ఓర్చుకోని ఔషధాలైనా సేవించేవాడు గానీ బడికి మాత్రం ససేమిరా వెళ్ళేవాడుగాదు. బడి ఆపద తప్పించుకోవడానికి అతడు పన్నని ఉపాయం లేదు. గాజు పెంకుతో ఒళ్ళు గీచుకొని పుండు చేసుకున్నాడు. దానిసాకుతో కొన్నిరోజులు బడికి ఎగనామం పెట్టాడు.

ఒక రోజు తెల్లవారేసరికి చాకిరేవులో చాకిబాన క్రింద దూరి కూర్చున్నాడు. ఇంకొకరోజు మేనమామకు కోపం వచ్చి ఈతజువ్వతో తిక్కకుదిర్చాడు. మేనమామపై కసితీర్చుకోవాలని ఒక ఉపాయం పన్ని ఒక బండరాయిని బావిలో పడవేసి గణపతి పడ్డాడని ఇతరులచే బొంకించాడు.

ఎంత వెదికినా బావిలో శవం కనికించక బోయే సరికి మేనమామ, తల్లి దిగులు పడ్డారు, రెండు జాములరాత్రి అయిన తర్వాత గణపతి ప్రక్కయింట్లో నుంచి గుడగుడా నడుచుకుంటూ వచ్చాడు

మేనమామకు గణపతిపై కోపం వచ్చింది చెల్లెలు సింగమ్మను తిట్టి గణపతి కాలికి బొండ చేయించి తగిలించాడు విద్యార్థులకతడు వింతగా కనిపించాడు మేనమామను నానాతిప్పలు పెట్టడం గణపతికలవాటు అప్పుడతని వయస్సు 10 సంవత్సరాలు చదువు మాత్రం సరిగా వంటబట్టలేదు చీట్లపేక ఆడటం మొదలెట్టాడు డబ్బులు యింట్లో దొంగిలించడం అభ్యాసమైంది మేనమామ గణపతిపై దొంగతనం మోపేవాడు సింగమ్మకు ఎక్కడలేని కోపం వచ్చేది క్రమేపీ పొగచుట్టలు తాగడం నేర్చుకొన్నాడు 'పొట్టివాడు గట్టివాడు' అనే పేరు సంపాదించాడు అతని పట్టుదల, సామర్థ్యము అటువంటివి

గణపతికి గుఱ్ఱం ఎక్కాలనే కోరిక కలిగింది మందపల్లికి వ్యాపారనిమిత్తం వచ్చే వర్తకులను బ్రతిమాలి గుఱ్ఱపు స్వారీ చేసేవాడు గాడిదనెక్కాలని ఉబలాటం గుఱ్ఱంకంటె అన్నిరకాల గాడిద మేలని అతని అభిప్రాయం కొంగుబంగారంగా దొరికేది గాడిద గాడిదమీద ఎక్కితే నవ్వుతారని అతడు జంకలేదు వారివూళ్లో చాకలిని బ్రతిమాలి అతనికేవో ఆశలు చూపి మైలగుడ్డలు మోసే గాడిదను వెంట తెచ్చుకొన్నాడు తాటియాకుల కళ్లెం చేతిలో పట్టుకొని గాడిద స్వారి మొదలుపెట్టాడు ఊరి జనమంతా పిల్లలు పెద్దలు, ఆశ్చర్యంగా చూడసాగారు వీళ్లను చూసి గాడిద బెదిరిపోయింది ఎలానో దొర్లి పడకుండా తప్పించు కొన్నాడు మేనమామ కీసంగతి తెలిసి దుడ్డుకర్రతో బుద్ధి చెప్పాలని ఎదురు వచ్చాడు గణపతి కాలికి బుద్ధిచెప్పాడు మూడు రోజుల వరకు యింటిముఖం చూడలేదు మేనమామకు తలవంపులు తెచ్చావని ఊరివారు మందలించారు గణపతి తన వాదనతో వారి నోళ్లు కట్టించెను వసుదేవునంతటివాడు గాడిదకాళ్లు ఆపదసమయంలో పట్టుకోలేదా? అని సమర్థించుకొనెను మా మేనమామ గుఱ్ఱం కొనియిస్తే గాడిద ఎక్కడం మానుకొంటానన్నాడు

గణపతి బుద్ధికుశలతకు, పురాణపరిచయానికి ఊరి వారు ఆశ్చర్యపోక తప్పలేదు. పురాణాలలో గొఱ్ఱె, దున్నపోతు, మొసలి, లేడి, ఎలుక, చిలుక నంది, నెమలి వాహనముగా గలవారు లేరా? వారందరూ వాటిమీద ఎక్కితిరగగా గాడిద నెక్కితే తప్పు వుందా? అనేవాడు. అతని చరిత్రలోకానికి తెలిసేదా?

మేనమామ కొడతాడనే భయంతో గణపతి యింటికి రావడం మానేశాడు. ఇరుగుపొరుగు వాళ్ల యిళ్లలో తలదాచుకోసాగాడు. సింగమ్మ కొడుకును యింటికి రమ్మని ఎంతో బ్రతిమాలింది. మేనమామ చావబాదుతాడేమోనని భయం. 'నాజోలికి రా'నని వాగ్దానం చేస్తేవస్తానని తల్లితో కబురుపంపాడు. తల్లి కుమారునిపక్షాన ఎంతో నమ్మబలికింది. మంచిమనసుచేసుకొని వాడిని క్షమించమంది. వాడికి తగిన బుద్ధి చెప్తానంది. మేనమామ మనసు కరిగిపోయింది. 'నాకు నిజంగా వాడిమీద కోపం వచ్చినమాట వాస్తవమే. కోపంలో అలా అన్నానేగాని, నాకువాడిమీద మమకారం లేదా? వాడు మనకు అప్రతిష్ఠ తెస్తున్నాడని బాధ. నీవు గారాము చేయడం వల్ల యిలా చెడిపోయాడు ఇంకొకమారు యిలాచేస్తే చూస్తూ ఊరుకోను. వీవు బద్దలుకొడతా'నని మేనమామ నిష్కర్షగా చెప్పాడు. సింగమ్మ సంతోషం పట్టలేకపోయింది. అన్నకోపం ఉపశమించినందుకు ఏనుగు నెక్కినంత సంబరపడింది. కొడుకును యింటికి తీసుకొని వచ్చింది.

గణపతి భయభక్తులతో తిరగసాగాడు. మేనమామపట్ల గౌరవభావం చూపాడు. కాని తోటిస్నేహితులు కనిపిస్తే అతనికి వొళ్లు తెలిసేదికాదు. ఊరంతా బలాదూరుగా తిరగసాగాడు. తోటలు, దొడ్లు విహార ప్రదేశాలైనాయి. చెట్లమీదకు రాళ్లురువ్వి మామిడికాయలు పడగొట్టేవాడు. కొబ్బరి చెట్లు ఎక్కి కాయలు కోసేవారు. నీళ్లరేవులో కుండలు పగల గొట్టేవారు. పట్టుబడితే వొళ్లు హూనమయ్యేది. ఒకరోజు జామతోటలో దొంగతనం చేసినందుకు యజమానిచేత చింతబరికెలతో పూజ జరిగింది. అయినా అది రెండోకంటికి తెలియనీయలేదు.

అట్లతద్ది, ఉండ్రాళ్ల తద్ది వచ్చిందంటే పండుగ. తోటి స్నేహితులతో కలిసి పల్లేరుగాయలు మూటకట్టుకొని వీధులవెంబడి తిరిగేవాడు. రాళ్లవానలు కురిపించేవాడు. శ్రీకృష్ణుని మీద కోపంతో దేవేంద్రుడు రాళ్లవాన కురిపించాడని పురాణాలు చెప్పగా విన్నాముకాని గణపతి కురిపించిన రాళ్లవానతో పోలిస్తే అది తక్కువే. గణపతి సవ్యసాచివలె విసిరేవాడు. పొద్దుటే చద్దిఅన్నం తిని చాటుమాటుగా నిలిచి స్నేహితులతో కలిసి ఆడపడుచులమీదికి పల్లేరుకాయలు చల్లేవారు. వాళ్లు తిట్లు శాపనార్థాలు పెట్టేవారు. తమ భర్తలకు ఫిర్యాదుచేసి వారిని తగవుకు తీసుకొని వచ్చేవారు. గణపతి మెరుపు తీగవలె మాయిమయ్యేవాడు. కొందరి వీపులమీద దూలగొండి ఆకు రాసేవాడు. వాళ్లు వీపులు బరుకు కొంటుంటే పరమానందంతో గంతులు వేసేవాడు.

ఆ రోజుల్లో ఫోటోలు తీయడం అంత ప్రాచుర్యంలో లేదు. ఉండివుంటే గణపతి ఫోటో యావదాంధ్ర దేశంలో కోట్ల కాపీలు అమ్ముడుపోయేవి. గణపతి రూపురేఖా విలాసాలు మనకు లభ్యమైయుండేవి. గణపతి అల్లరి చేష్టలు, నవ్వుల పువ్వులు మనకు లభించియుండేవి. అది చూచినవారి జన్మచరితార్థమై యుండేది. అంతటి అదృష్టము ఆంధ్రులకు దక్కలేదు. కనీసం గణపతి లీలలు కొన్ని అయినా చదివి ఆనందించే అదృష్టం మానకు కలిగింది.

గణపతికి పాలు త్రాగడం యిష్టము. కొని త్రాగడానికి సరిపడా డబ్బు లేదు ఉపాయశాలి కాబట్టి సాయంకాలాల్లో యింటికి తిరిగి వచ్చే ఆవులను, గేదెలను, మేకలను పట్టుకొని పాలు పితికి తాగేవాడు. ఇంటి యజమానులు ఆ పశువులకు దయ్యాలు పట్టాయని సోదికి పోయేవారు. వారిని చూచి గణపతి తన తెలివితేటలకు తానే సంబర పడిపోయేవాడు.

చిల్లర ఖర్చులకు, చిరుతిండ్లకు చిల్లికానీ చేతిలో లేదు. ఇంట్లో దొంగిలించడం కుదరటం లేదు. తోట కావరులు జాగ్రత్త పడటం వల్ల అక్కడ కూడా తన బుద్ధి విశేషము పారటము లేదు. గణపతి ఉపాయాలు ఆలోచించాడు. సొంత ఊళ్ళో లాభం లేదని ప్రక్క గ్రామాలకు వెళ్ళేవాడు

అక్కడ పేరున్నవాళ్ళ యిండ్లకు వెళ్ళి తన తండ్రి చనిపోయాడనీ, శ్రాద్ధ కర్మలు పెట్టడానికి తన పేదరికం అడ్డువస్తోందని నమ్మబలికేవాడు.

14 సంవత్సరాల పిల్లవాడు తండ్రి ఋణం తీర్చుకోవడానికి అలా కన్నీరు మున్నీరుగా ఏడుస్తుంటే ఎదుటివారి మనసు కరిగి తమకు తోచిన సహాయం చేసేవారు. పోయిన వూరికి పోకుండా వూరూరాతిరిగేవాడు. ఒకవేళ జమాబందీ అయిన వూరికే వెళ్ళవలసివస్తే ఈసారి తల్లికి చావు మూడేది. అయితే అలా చెప్పటం దోషంకాదా అని అనిపించవచ్చు. పుట్టినవారు గిట్టక మానరు. కొద్ది సంవత్సరముల తేడాలో ఆమె చావక మానదు. 'ఉదర నిమిత్తం బహుకృత వేషం' అన్నట్లు అతడు ఎన్ని ఉపాయములో పన్నాడు. తండ్రి తద్దినమని తల్లి మాసికమని, దొంగలు దోచు కున్నారని తిరుపతి వెంకన్నకు మ్రొక్కువున్నదనీ ప్రాధేయపడేవాడు. వేంకటేశ్వరస్వామికి వెండి చెంబు చేయిస్తానని మొక్కుకున్నాననీ పేదబ్రాహ్మణుడనైన నావద్ద డబ్బులేదని స్వామికి కోపం రాకుండా వుండటానికి తోచిన సహాయం చేయమని ప్రాధేయపడేవాడు. ఎలానో ఈ వ్యాపారంలో గణపతి చేతిలో నాలుగు కాసులు పడసాగాయి. అయితే ఈ వ్యవహారం చాల కాలం సాగిందికాదు. అతని పలుకుబడి తగ్గి పోయింది. ఇబ్బందుల పాలుగాక తప్పలేదు. చివరకు శ్రాద్ధభోజనమే గత్యంతరమైనది. తద్దినాలకు వెళ్ళి కడువునిండా భోజనము, దక్షిణలు స్వీకరించేవాడు. భోజన విషయంలో అతనికతడేసాటి. అతడు సర్వభక్షకుడు. ఇష్టాయిష్టములతో పనిలేదు. అరిశెలు, గారెలు డజన్ల కొద్దీ తినేవాడు. అది అతని భోజన ప్రియత్వమునకు నిదర్శనము. బ్రహ్మదేవుడు అతనికి ఈవిషయములో ప్రజ్ఞ ఇచ్చాడు. లోకములో ఒక్కొక్కరికి ఒక్కొక్క విషయమున ప్రజ్ఞ.

గణపతి జీవితంలో ప్రధానమైన మార్పు జరిగే సంఘటన ఒకటి జరిగింది. అతని చీట్లపేక స్నేహితుడొకడు వివాహం చేసుకుంటూ గణపతిని రాజమహేంద్రవరానికి పిలిచాడు. అభిమానంతో వివాహానికి వెళ్ళాడు గణపతి. అక్కడ తన ఈడు బాలురంతా గిరజాల ఉంగరాలు జుట్టు పెంచుకొని వున్నారు. ఆ అదృష్టం తనకు కూడా కలిగితే బాగుండునని అనుకున్నదే తడవుగా జుట్టు కత్తిరింపించుకున్నాడు. పెండ్లి మండపంలో

ఆనందోత్సాహాలతో బంగారు కిరీటం పెట్టుకున్న వాడిలా సగర్వంగా తిరగ సాగాడు పెండ్లికి వచ్చిన స్త్రీల వద్ద సంపెంగ నూనె తీసుకొని తలకు పూసేవాడు పెద్ద పెద్ద గిరజాలు త్వరగా పెరగాలంటే ఏమి చేయాలా అని అతని ఉబలాటం ఒక కుర్రవాడు హాస్యానికి గణపతిని వంట ఆముదం పూసుకోమని సలహా యిచ్చాడు ఆ మాట గణపతికి బాగా నచ్చింది. పెండ్లికి తెచ్చిన కాగడాల వారి గిన్నెలలో నుండి దొంగతనంగా ఆముదం తెచ్చి తలకు రాసుకునేవాడు నిద్రాసమయంలో దిండు మీద ఆ చమురంతా కారేది మరునాడు ఉదయం గోదావరిలో తలస్నానం చేసి వచ్చి - నా గిరజాలు పెరిగాయో లేదో చూడమని పెండ్లివారిని అడిగే వాడు గణపతిని ఆట పట్టించడానికి వాళ్ళు నీతల జొన్నచేను వలె ఎదిగిందని చెప్పారు. గణపతికి బాగా గురి కుదిరింది మరునాడు కాగడావాళ్ళు గిన్నెలలో ఆముదం లేకపోవటం చూసి గణపతితో బాటు అందరినీ అడిగారు గణపతికి ఎక్కడలేని కోపం వచ్చింది

మరునాటి రాత్రి ఎలాగైనా దొంగను పట్టుకుందామని నిశ్చయించు కున్నారు యదా ప్రకారం గణపతి ఆముదపు దొంగగా వారి చేతికి దొరికి పోయాడు తనకు వచ్చిన సంభావన వారి చేతిలో పెట్టి తప్పించు కున్నాడు గణపతి చౌర్యగాదలు ఆనోటా, ఈనోటా ప్రచారమై పెండ్లిమండపమంతా వ్యాపించాయి అందరు గణపతిని చూసి పరిహాసమాడసాగారు 'గుమ్మడికాయల దొంగ వలె గణపతి ఆ ప్రస్తావన వచ్చినపుడు ఏదో సమాదానం చెప్పేవాడు ఈ విదంగా అతని ఘనకార్యం వ్యాప్తిలోకి వచ్చింది

రాజమహేంద్రవరంలో గణపతికి మరొక ఉబలాటం కలిగింది చెప్పులు నాగరికులు దరించరని నిశ్చయించు కున్నాడు మిట్టముచ్చెలు నీకు అందంగా వుంటాయని ఎవరో సలహా యిచ్చారు మరొకరు చెడావులు కొని కిర్రు కిర్రుమని వీదులలో తిరుగుతూ వుంటే ముచ్చటగా వుంటుందని సలహా యిచ్చారు చేతిలో, డబ్బులు లేవు ఎలాగైనా సంపాదించాలనే పట్టుదల కలిగింది పెండ్లి కొడుకు దగ్గరకు వెళ్ళి నాకిచ్చే బహుమానానికి బదులు

జోడు కొనిపెట్టమని ప్రాధేయ పడ్డాడు. తన తండ్రి డబ్బులివ్వడని పెండ్లికొడుకు ఖండితంగా చెప్పాడు. బదులు యిచ్చేందుకు కూడా అతడు అంగీకరించ లేదు. గణపతికి నిరాశ ఎదురైంది. అది సంపాదించే ఉపాయం కోసం ఆలోచించాడు. అదృష్టవశాత్తు పెండ్లికి పదేండ్ల వయస్సు గల ఒక వైశ్య బాలుడు జరీముచ్చెల జోడు తొడుక్కుని వచ్చి గుమ్మంలో వదిలాడు. అటూ యిటూ చూసి గణపతి తన కాళ్ళకు అవి తగిలించు కొని, ఎవరూ లేనప్పుడు ఉత్తరీయంలో చుట్టి బట్టలమూటలో దాచిపెట్టాడు. ముచ్చటపడి పెద్దాపురంలో చేయించి తెప్పించుకున్న జోడు పోయినందుకు కుర్రవాడు ఏడుపు ముఖం పెట్టి యింటికి వెళ్ళాడు. విడిదిలో వారందరూ దొంగవెధవను నోటికి వచ్చినట్లు తిట్టారు. గణపతి కూడా వారితో కలిసి శాపనార్థాలు పెట్టాడు. బట్టల మూట వెదుకుతారని పక్క యింటికి మార్చి దొంగతనం బయటపడకుండా జోడు సాధించాడు.

గణపతికి కోటు కుట్టించుకోవాలని మరో ఉబలాటం కలిగింది చిన్నప్పుడెప్పుడో తల్లి బొందుల చొక్కాలు కుట్టించింది. అవి ఎప్పుడో చిరిగి పోయాయి. ఎలాగైనా కోటు కుట్టించుకోవాలని సంకల్పించు కున్నాడు. బట్టల దుకాణాలకు వెళ్ళి మూటలు విప్పించి ఏదో ఒక మిషపెట్టి బేరం కుదర లేదని వెళ్ళిపోయే వాడు. జోడు సంపాదించినట్లు కోటు సంపాదించటం కుదరలేదు. తద్దినాలలో సైను గుడ్డకు కోటుగుడ్డలు యిచ్చిన బాగుండునని అభిప్రాయ పడ్డాడు. అలా అనుకుంటూ ఆ రాత్రి విచారంగా నిద్ర పోయాడు.

వివాహం అయిన తర్వాత పెండ్లివారితో కలసి స్వగ్రామానికి తిరిగి వచ్చాడు. కోటు సంపాదించే ఉపాయం కుదరలేదు. నాలుగు రోజుల తర్వాత ముచ్చెలు బయటికి తీసి దాని మీదవున్న జరీ వూడబెరికి వేసుకొని తిరగ సాగాడు. నోట్లోచుట్ట, కుచ్చుతలపాగా, చేతిలో కర్ర. ముచ్చెలు ధరించి టకటకమని వీధులలో తిరిగే వాడు. స్నేహితులందర్నీ పిలిచి వారికి కనపడేలా తిరిగేవాడు. ఎవరైనా ఎంతకు కొన్నావని అడిగితే తలకోరకంగా సమాధానం ఇచ్చేవాడు. వీడు దొంగతనం చేసి తెచ్చాడని ఎవరైనా అంటే గణపతి తీవ్ర నిరసన తెలియజేసే వాడు. చేతగాని వెధవలు దొంగతనమని

వెక్కిరిస్తున్నారని దుర్భాషలాడేవాడు. తల్లికికూడా గణపతిపై అనుమానం కలిగి ఆ రాత్రి అతణ్ణి నిలదీసి అడిగింది "ఎవరైనా బహుమానంగా యిచ్చారా? లేక దొంగతనంగా తెచ్చావా? పోలీసులు వచ్చి పట్టుకొని పోతా"రని మందలించింది. దొంగతనంగా తెచ్చివుంటేవారి దొడ్డిలో గిరవాటు వేద్దామని సలహా యిచ్చింది. గణపతి తన ప్రయోజకత్వాన్ని తల్లితో సుధీర్ఘంగా చెప్పాడు 'అమ్మా! ఇది ఈ వూరివారిది కాదు. నీవు భయపడవలసిన పనిలేదు. రాజమహేంద్రవరంలో పెండ్లిలో అదృష్టవశాత్తు దొరికింది. "కొడుకు ప్రయోజకుడై వస్తువులు సంపాదిస్తున్నందుకు సంతోషించక వెర్రిముండవలె విచారంచవద్దు. ఈ వూరిలో నేను ఎందుకు పనికిరానుగానీ రాజమహేంద్రవరంలో నన్ను నెత్తి మీదపెట్టు కుంటారు. నాపుణ్యము వలన నాకు ఈ జోడు దొరికింది. దొంగతనం అంటే అసలు ఏమిటి? ప్రక్కయింటి యజమాని వేపపుల్ల కోసుకోవటం, చెట్లపూలు, కాయలు కోసుకోవటం కాదా! లేగదూడల మూతులు గట్టి ఆవుపాలు పిండు కోవటం దొంగతనం కాదా? కాబట్టి, నీవు బెంగపెట్టుకొని చావనక్కరలేదు. అమాయకపు ముండవు గాబట్టి నీవు భయపడుతున్నావు. వాళ్ళు నా దగ్గరకువస్తే తుపాకితో పేల్చేస్తాను. రెండు కోట్లు కుట్టిస్తే కుచ్చుల తలపాగా పెట్టుకొని ముచ్చెలు తొడుగుకొని వీధులలో వెడుతూ వుంటే డిప్యూటీ కలెక్టరు లాగున్నాడని తోక ముడుచుకొని పోగలరు. నేను పాత చచ్చు గణపతిని గాదు. రాజమహేంద్రవరంలో ఎన్నో టస్సాలు నేర్చుకున్నాను. మా నాయన సంపాదించిన బిందె వుంటే అది తాకట్టు పెట్టి కోటు కుట్టించు కుంటాను. అప్పుడు నాకు ఎక్కడలేని గౌరవం వస్తుంది. పూర్వకాలంలో జడలు పెంచుకున్న మునీశ్వరులకు కాషాయవస్త్రధారులకు గౌరవం వుండేది. ఇప్పుడు గిరజాలు, కోటు, చెడావులు తొడుక్కున్న వారికి మరియాద. నేను కోటు తప్ప మిగిలినవని సంపాదించాను. నీవు మామయ్య చూడకుండా ఆ బిందె యిలా పడవెయ్యి. నేను కోటు కుట్టించుకుంటాను. మాయమర్మం తెలియని నీకు ఇంతకంటె చెబితే అర్థం కాదు". ఈ సుదీర్ఘోపన్యాసం నల్లమందు మత్తులో వున్న తల్లికి తలకెక్కలేదు. ఆమె మంచం మీద నుంచి దొర్లి క్రింద పడింది. గణపతికి ఎక్కడ లేని కోపం వచ్చింది. తెల్ల వారి మాట్లాడ

వచ్చునని గణపతి నిద్రపోయాడు. గణపతి రకరకాల కోట్లు కుట్టించుకున్నట్లు కలగన్నాడు.

తెల్లవారి బిందె తెచ్చిపెట్టమని తల్లిని పీడించాడు. గణపతి చెప్పిన గొప్పలు నిజమని నమ్మిన ఆ తల్లి బిందెకుదువ పెట్టడానికి సిద్ధపడింది. కానీ ఆ పని మేనమామ, మేనమామ భార్య పడనీయరని చెప్పింది. నాలుగు రోజులు ఓపిక పడితే మీ అత్త పురుటికి పోతే మామ పొలానికి వెళ్ళినపుడు బిందె తాకట్టు పెట్టి సొమ్ము తెచ్చి యిస్తానని సలహా యిచ్చింది. గణపతికి ఎక్కడలేని కోపం వచ్చింది. విధిలేక ఊరుకున్నాడు. మేనమామ భార్య ఎప్పుడు పురిటికి వెళుతుందా అని ఎదురు చూడసాగాడు.

ఇలా వుండగా, సమీపగ్రామంలో ఒక ముసలి బ్రహ్మణుడు చనిపోయాడు. గణపతి మిత్రులతో కలిసి శ్రాద్ధభోక్తగా వెళ్ళాడు. అక్కడికి వచ్చిన భోక్తల నందరినీ చెరువుగట్టుకు స్నానాలకని తీసుకెళ్ళి పొగచుట్టలు బదులిచ్చి తాను కాలుస్తూ వారికొక ఉపన్యాసం ఇచ్చాడు:

'మిత్రులారా! మనమందరం భోక్తలగా వచ్చాము. మనకు నాలుగణాలు రొక్కము లేక సైనుగుడ్డో యివ్వటము ఆనవాయితీ. కళాకాంతులు లేని వాటికి బదులు కోటు గుడ్డలు ఈయవలెనని కోరుదాం. మనం సంఘీభావంతో ఉన్నచో కర్మలు చేయువారు మన కాళ్ళ బేరమునకు వత్తురు'. ఆ మాటలు విని కొందరు సంతోషించగా మరికొందరు ఈ అనాచారము తెలిసి వెలి వేయుదురని తీర్మానించిరి ఒకరునొకరు నిందించు కొనిరి. చివరికి ముష్టి యుద్ధము దాకా దారితీసెను. కొందరికి గాయాలైనాయి. నీళ్ళరేవునకు స్నానాలకు వచ్చిన స్త్రీలు కోటు వివాదమును తెలిసికొని పొట్టచెక్కలయ్యేలా నవ్వారు. గణపతి పక్షములో భోక్తలుగా వచ్చిన ఇరవైమందిలో పదునలుగురు ముందుకు వచ్చారు. గణపతివారి నుద్దేశించి నాయకుని హోదాలో యిలా అన్నాడు: 'ఈ రోజు 11వ రోజు 18 మంది బ్రాహ్మణులు కావాలి. మనం కాదన్నచో వాళ్ళపని భ్రష్టుపట్టును' అని వారిని సంఘటితపరిచి కోటు గుడ్డలు కావలెనని కోరుదుమని వారిచే గాయత్రిమీద ఒట్టు పెట్టించుకొన్నాడు.

ఇంతలో గృహ యజమానికి జరిగిన రాద్ధాంతం తెలిసింది. ఎలానో వారికి బుద్ధి చెప్పాలని ఆలోచించాడు. సమయము వచ్చినపుడు గణపతి మొండి పట్టుపట్టి కోటు గుడ్డ కావలెననెను. అతని పక్షమువారు అతనిని బలపరిచిరి. యజమాని ఆగుడ్డలు రాజమహేంద్రవరం నుండి రేపు తెప్పిస్తామని వారిని శాంతపరచాడు. రెండు రోజులు గణపతి బృందం కోటు గుడ్డలకై ఎదురు చూశారు.

11వ రోజు రాత్రి గణపతి మిత్రబృందానికి కోటు గుడ్డల విషయం బాగా నూరిపోశాడు. ఏ రంగు ఎవరికి కావాలో నిశ్చయించుకోమన్నాడు. కలలో కూడా వారికి అదే ధ్యాస. తెల్లవారి యజమాని వద్దకు వెళ్ళి వారివారికి కావలసిన కోటుగుడ్డల రంగులు చెప్పారు. యజమాని సరేనని చెప్పి వారిచేత కార్యము పూర్తి చేయించాడు. భోజనానంతరము మళ్ళీ బహుమతుల విషయము గణపతి ప్రస్తావించాడు. రాత్రికి వస్తాయి రేపు ఉదయం వెళ్ళ వచ్చునని యజమాని బదులు చెప్పాడు. ఆ రాత్రి భోజనం చేయకూడదు కాబట్టి గణపతికి గంగవెఱ్ఱులెత్తాయి. ఆకలి తీర్చుకోవటానికి అతనికి ఒక ఉపాయం తోచింది. ఆ వూరిలో తన బంధువైన ఒక ముసలమ్మ ఉన్నట్లు గుర్తుకు వచ్చింది. ఆమె దగ్గరకు వెళ్ళి బంధుత్వము కలిపి ఆమె చేసిపెట్టుకున్న రొట్టెను కుక్క ముట్టినదని అబద్ధము చెప్పెను. మైలపడిన దానిని వీధిలో ఎవరికో యిస్తానని చెప్పి తానే తిని ఆకలి తీర్చుకొన్నాడు.

తెల్లవారుతుండగా యజమాని గణపతిని పిలిపించెను. గణపతికి దారిలో ఎక్కడలేని సంతోషము కలిగెను. తాను కోటు కుట్టించుకున్నట్లు తన పంతం నెగ్గినట్లు సంబరపడసాగాడు. యజమాని గణపతిని యింటిలోపలికి పిలిపించుకొని సైనుగుడ్డలు తీసుకుంటావా? లేదా? అని అడిగాడు. గణపతికి ఎక్కడలేని కోపం వచ్చింది. 'ఇప్పుడు మీ అవసరం తీరిపోయిందని సంబరపడుతున్నారు రేపు మీ యింట్లో మరెవరైనా చస్తే మాతో అవసరం రాదా' అని నిలదీశాడు. యజమానికి ఒళ్ళుమండి గణపతిని పట్టిమంచానికి కట్టి వేసి ఈత చువ్వలు తీసుకుని పోకిరీ వేషాలు వేయవద్దని రెండు తగిలించాడు. గణపతి సమయోచితంగా అతణ్ణి ప్రార్థించి మరిన్ని దెబ్బలు

తప్పించుకున్నాడు. యజమాని దయతలచి సైనుగుడ్డలు అందరికీ మూటకట్టి యిచ్చి తీసుకొని పొమ్మన్నాడు.

గణపతి తెచ్చిన సైనుగుడ్డలు చూసి మిత్రులు గోలచేశారు. మాయిష్టం లేకుండా ఇలా ఎందుకు చేశావని మందలించారు. గణపతి ఒక్కక్షణం ఆలోచించి యిలా అన్నాడు. 'ఒరే! వెర్రినాగన్నలారా? నేనేమి పిచ్చివాణ్ణికాదు. యజమాని నన్ను ఒంటరిగా పిలిపించడానికి కారణం లేక పోలేదు. అతనిది మేడిపండు వ్యవహారం. అంత పెద్ద మనిషి నా చేతులు పట్టుకొని బ్రతిమాలాడు. నీ స్నేహితులతో చెప్పి ఒప్పించమని కోరాడు. నా మనసు కరిగి పోయింది. మీరు తిట్టినా కొట్టినా ఫరవాలేదు అని డంబాలు పలికాడు. యదార్థం తెలియని వారు నిజమే ననుకున్నారు. ఒప్పుకోక తప్పుతుందా అని కొందరన్నారు. మన అదృష్టం బాగాలేదని మరి కొందరనుకున్నారు. ఈ రోజు కాకపోయినా మరొకరోజు అదృష్టం పట్టకపోదని వాళ్ళను ఓదార్చాడు.

మేనమామ భార్యకు కూతురు పుడితే గణపతికిచ్చి చేసుకుందామని తల్లి ఉబలాట పడింది. ఆమె మనోబలం గట్టితనం వల్ల కోడలు పుట్టింది చూడవచ్చిన అమ్మలక్కలు గణపతి పెండ్లామని వరుసలుపెట్టి పిలిచారు. మేనత్త ఆ దరిద్రుడికి తన పిల్లనివ్వనని మనసులో అనుకుంది గణపతి తల్లి ఎన్నో రకాలుగా బాలెంతరాలికి సేవలు చేసింది. గణపతి సంతోషానికి పట్టపగ్గాలు లేవు. అప్పుడప్పుడూ బిడ్డ నెత్తుకొనే పని గణపతిపై పడేది. ఆ పని చేయటం యిష్టం లేక పిల్లను గిల్లేవాడు. అది మొదలు గణపతి చేతికి బిడ్డ నివ్వటానికి వారెవ్వరూ ముందుకు రాలేదు. గుక్కపెట్టి ఏడ్చినా గణపతి చేతికిచ్చేవారు కాదు. గణపతి గిల్లినాడేమోనని మేనత్తకు సందేహం. తల్లి గణపతిని సమర్థించేది. పిల్ల సిగ్గు పడుతున్నదని, దేవుడు వారిద్దరినీ భార్యాభర్తలుగా దీవించాడని నీకు గిట్టకపోతే అపనిందలు వేయవద్దని మరదల్ని మందలించేది. మేనమామ ఆడవాళ్ళ తగవులు తీర్చలేక పస్తులు పడుకునే వాడు. భార్యను కొట్టి రెండుమూడు రోజులు యింటిముఖం చూచేవాడు కాదు.

గణపతి మాత్రము మేనత్తను సూటిపోటి మాటలు అనసాగాడు ఒకసారి శివరాత్రికి మేనమామ కోటిపల్లి తీర్థానికి వెళుతున్నాడు గణపతి తల్లికూడా వస్తానంది గణపతిని యింటివద్ద తోడుగా వుంచి వాళ్ళిద్దరూ వెళ్ళారు గణపతి మేనత్తను ఏడిపించాలని రాత్రులందు యింటి పట్టున వుండేవాడు కాదు అందుకామె గణపతిని మందలించింది ఆమెను అవమానించాలని గణపతి ఒక ఉపాయం ఆలోచించాడు మరునాడు మద్యాహ్నం గణపతికి విస్తరి నిండా అన్నము పెట్టి మేనత్త పిలిచింది గణపతి వీధిలో వెళుతున్న ఒక పెద్ద మనిషిని పిలిచి మేనత్త తాను తింటి పోతునని అనుకున్నందుకు నిదర్శనంగా చూపించాడు సాక్షిగా వచ్చిన ఆ పెద్ద మనిషి మేనత్తను మందలించాడు ఆమె వినయంగా సమాదానం చెప్పినా అతను వినిపించుకోలేదు గణపతి కోపంగా లేచి వెళ్ళి పోయి బయట భోంచేశాడు కోపగించుకొని పోయినవాడు యింటికిరాడు గదాయని మేనత్త ఆ రాత్రికి అతనికి అన్నం వండలేదు. అదే సాకుగా తీసుకొని అతడు వూరివారినందరినీ పిలిచి కల్లబొల్లి ఏడుపులు ఏడ్చాడు ఒక మునలమ్మ తన యింటికి తీసుకొని వెళ్ళి భోజనము పెడతానన్నది మేనత్తకు అందుకు కోపం వచ్చింది ఇద్దరూ ఏడుతరాల వరకు తిట్టిపోసుకొన్నారు ఆ రాత్రి గణపతి మునలమ్మ యింట్లో బోంచేశాడు గణపతి భోజనపరాక్రమము చూసి మునలమ్మ గుండెలు బాదుకున్నది.

మరునాడు ఉదయం గణపతిని బుజ్జగించి ''యెలా అయినా మీ అత్త దగ్గరే పెట్టించుకుని తిని నీ పంతం నెగ్గించుకో, దాని పొగరు అణచాలంటే అదే మార్గం'' అని చెప్పింది

గణపతి విధిలేక యింటికి వెళ్ళి బోజనం వడ్డించమని మేనత్తను అడిగాడు ఆమె బయపడుతూ కొద్దిగా వడ్డించింది గణపతి మళ్ళీ పెద్దమనుషులను పిలిచి రాద్ధాంతం చేశాడు మేనత్త ఎంత మొత్తుకున్నా పెద్దమనుషులు వినిపంచుకోలేదు తల్లి వచ్చిన దాకా బిడ్డ నెలాగో సర్దుకోమని సలహా యిచ్చారు

ఆ సాయంకాలం కోటిపల్లి నుండి గణపతి తల్లి, మేనమామ వచ్చారు. గణపతి నిర్వాహకం వారితో చెప్పి మేనత్త వలవలా యేడ్చింది. భర్తకు ఆమె మాటలు నచ్చాయి. గణపతిని మ్రింగి వేసే అంత కోపం వచ్చింది. తల్లి మాత్రం గణపతి తప్పులేదని అభిప్రాయ పడింది. పొరుగింటి ముసలమ్మ జరిగిన దానిని గోరంతలు కొండంతలు చేసి గణపతి పడిన బాధలు చెప్పింది. తప్పంతా మేనత్తదే అని నూరిపోసింది. గణపతి తల్లికి ఆమాటలు నచ్చాయి. మేనమామకు పట్టరాని కోపం వచ్చింది.. గణపతి అది తెలుసుకొని ముసలమ్మ యింటిలో తిష్ఠవేశాడు. తల్లి కొడుకును కౌగలించుకొని ఏడ్చింది. ఇద్దరూ ఏడుపు లంఘించు కున్నారు. నీవెంత ఆకలిగొన్నావో అని బాధ పడింది. పెండ్లాము వలలో పడి అన్న తనను చంపటానికి సిద్ధంగా ఉన్నాడని వాపోయింది. గణపతి ఆమెను సమర్థిస్తూ రేపు ఉదయమే యిల్లు వదలి వెళ్ళిపోదామని మంకు పట్టు పట్టాడు.

తల్లి అందుకంగీకరించలేదు. 'ఎలాగైనా ఆపిల్లతో నీకు పెండ్లి చేయాలని నా కోరిక. కార్యసాధన అయ్యేంత వరకు మనము తొందర పడకూడదు' అని బుజ్జగించింది.

గణపతి ఒకటి, రెండు రోజులు అక్కడక్కడా బయట తిని చివరకు మేనమామ కోపము చల్లారినదని నిర్ధారించుకున్న తర్వాత ఎప్పటిలాగా యింటి పట్టున తినసాగాడు. మేనమామ కూడా చూసీ చూడనట్లు వూరుకున్నాడు. వీళ్ళిద్దరూ తన యింట్లో ఉండడంతో మేనమామ యిల్లు గడవటానికి అప్పు చేయక తప్పలేదు. అప్పులవాళ్ళు వ్యాజ్యంవేస్తామని తొందర పెట్టారు. నాగన్నకు ఏమీ పాలుపోలేదు. భార్య గంగమ్మ అప్పు తీర్చటానికి బుచ్చిని తన పినతల్లి కొడుకు రాయప్పకు యిచ్చి పెండ్లి చేద్దామని సలహా యిచ్చింది.

నాలుగేండ్ల పిల్ల గనుక నాలుగువందలు శుల్కమిస్తాడని అయిన సంబంధం కాబట్టి అదే చేసుకుందామని గంగమ్మ తొందర పెట్టింది. బంగారులాంటి సంబంధమని తన తల్లి దండ్రులు అందుకు సంతోషిస్తారని చెప్పి సమాధానం కోసం ఎదురు చూసింది. భార్య చెప్పిన ఉపాయం

నాగన్నకు నచ్చింది ఋణ విముక్తుడనౌతానని సంతోషం కలిగింది అయినా తోబుట్టువు గుర్తుకు వచ్చి--'గణపతిని పిల్లనియకపోతే నాచెల్లెలు దుఃఖపడదా' అన్నాడు

పాడు బుద్ధుల కొంటె కోనంగి గణపతికి పిల్లనీయడం కంటె గోదారిలో తోయటం మంచిదని గంగమ్మ విరుచుకుపడింది అప్పులపాలై నిలువ నీడలేక వీదుల పాలౌతామంది పిల్లను వాడికిచ్చేపక్షంలో 'నేను నూతిలో పడి చస్తా'నంది

చివరకు నాగన్న భార్య మాటవిని రాయప్పకు కబురు పంపాడు రాయప్ప బందు సమేతముగా వచ్చి నాలుగు వందల రూపాయలు రొక్కం యిచ్చుటకు అంగీకరించి రెండువందలరూపాయలు ముందుగా యిచ్చాడు ఈ వార్త తెలుసుకున్న గణపతి తల్లి ఒకరాత్రి అన్నతో పెండ్లి ప్రస్తావన చేసింది రాయప్పకు పిల్లనిస్తానన్నమాట నిజమేనా! అని నిలదీసి అడిగింది

నిజమే! మాఘశుద్ధ దశమినాడు రాయప్పతో పెండ్లి నిశ్చయం చేశానని నాగన్న ఖండితంగా చెప్పాడు ఆ మాట వినగానే యిల్లు పైకప్పు ఎగిరిపోయేలా గణపతి తల్లి గుండెలు బాదుకొని యేడ్వసాగింది ఇరుగు పొరుగువారు గుమికూడారు మేనల్లుడు యెలాంటివాడైనా మేనమామ పిల్లనివ్వవలసిందే నన్నారు ఈ గొడవ చూస్తూవున్న నాగన్న శుభమా అని పెండ్లి జరిపిస్తూ వుంటే నీవు అల్లరిపెడతావా! అని గణపతి గుణగణాలను ఏకరువు పెట్టాడు

గణపతి తల్లి ఆ మాటలు త్రోసిపుచ్చుతూ, తమ ఉసురు తగలక పోదని గంగమ్మను ఆమె పుట్టినింటినీ తిట్టిపోసింది చెప్పరానంత గోల చేసి పుట్టినింటితో ఋణం తీరిపోయిందని దుమ్మెత్తిపోసింది గణపతి తల్లిని ఈడ్చుకొని పోయాడు

గణపతి బింకంగా వేరేకాపురం పెట్టాడుగానీ, భుక్తి గడవడం కష్టమైంది దానికితోడు అతని ఆకలి తీర్చడం సామాన్యుల వశంగాదు. యాయవారము చేసి జీవించడం తప్ప వేరే గత్యంతరం కనిపించలేదు గిరజాలతో, ముచ్చెలతో

తాను భిక్షాటనకు వెళ్ళడం పరువుతక్కువ అందువలన తల్లికి ఆ పని తప్పలేదు. ఇద్దరూ ఆ తెచ్చుకొన్నది తిని జీవనం సాగించారు గణపతికి చిరుతిండ్లు కూడా అలవాటు అవి ఎలానో సంపాదించేవాడు తల్లిపై పెత్తనం చెలాయిస్తూ పూట గడుపుకొనేవాడు గ్రామస్తులు అతని వ్యవహారం చూసి తల్లి బిచ్చమెత్తుకు తిరుగుతుంటే సిగ్గులేదా? అని మందలించారు ఇక లాభం లేదని తానే చెంబు తీసుకొని చద్దిఅన్నం తిని గిరజాలు దువ్వుకుని కోటు తొడుక్కుని తెల్ల పంచ కట్టుకొని పొగచుట్ట నోట పెట్టుకుని యాయవారానికి బయలు దేరేవాడు లోకులు అతనిని చూసి నవ్వుకునేవారు.

ఎవరైనా బియ్యం తెచ్చివేయటం ఆలస్యమైతే వాళ్ళ మంచం మీదో కుర్చీమీదో తిష్ట వేసేవాడు ఇంత ఆలస్యమెందుకని దబాయించేవాడు నిలువుకాళ్ళ జీతం యిచ్చారా అని నిలదీసేవాడు పెద్దమనిషి యింటికి వచ్చినపుడు ఇదేనా మర్యాద అనేవాడు ఊరివారంతా నవ్వుకునేవారు ఈ విదంగా తల్లి కొడుకులు భిక్షాటనం చేసి కాలం గడిపారు

ఇంతలో నాగన్న కూతురి వివాహం ఆసన్నమైంది ఎలానైనా పెండ్లి చెడగొట్టాలని తల్లి కొడుకులు ఉపాయాలు ఆలోచించారు నాగన్న దాయాది అయిన పుల్లయ్య దగ్గరకు వెళ్ళి సలహా అడిగారు నాగన్నకు పుల్లయ్యకు పచ్చిగడ్డి వేస్తే భగ్గుమనే వైరం

'బుచ్చిని నీవే తీసుకొని పోయి ఎక్కడో దేవాలయంలో పెండ్లి చేసుకుంటే నాగన్నకు రాయప్పకు రోగం కుదురుతుందని పుల్లయ్య సలహా యిచ్చాడు ఒకసారి పెండ్లి అయిన పిల్లను ఇంకొకరు చేసుకోరు ఊరి వారంతా నిన్ను మెచ్చుకుంటారు కుక్కకాటుకు చెప్పు దెబ్బవలె వుంటుందని అన్నాడు గణపతికి అది ఎలాసాధ్యమో పాలు బోలేదు దానికి పుల్లయ్య తగిన బరోసా యిచ్చాడు ఎలానైనా అష్ట కష్టాలుపడి పెండ్లి అనుకున్న ముహూర్తానికి ముందే చేయిస్తానని నడుంకట్టాడు తానే స్వయంగా వానపల్లి వెళ్ళి బజంత్రీలను, పూజారిని, పురోహితుని కుదిర్చి వచ్చాడు తన సొమ్ము ఖర్చు పెట్టడానికి కూడా వెనుకాడ లేదు నాగన్న మీద తన కోపం తీర్చుకోవడానికి ఇది మంచి అవకాశంగా భావించాడు గణపతి తల్లికి ఈ

విషయం తెలియకుండా దాచివుంచారు. ఆడవాళ్ళ నోట్లో నువ్వు గింజ నానదని పుల్లయ్య అభిప్రాయం. గణపతి ఆనందానికి అవధులు లేవు. పెళ్ళయినంత సంబర పడ్డాడు. పుల్లయ్య మాటకు కట్టుబడి దేవాలయ పూజారితో రహస్యమంతనాలు సాగించాడు. డబ్బులు చేతిలో పడగానే పూజారి ఒప్పుకున్నాడు. పురోహితుడు రాత్రి ముహూర్తం పెట్టాడు. గణపతి పేరుబలం వల్ల అన్నీ సవ్యంగా జరిగి పోతున్నాయి. పుల్లయ్య మామ తనకు చేస్తున్న సహాయానికి గణపతి కృతజ్ఞతతో నమస్కరిచాడు. బుచ్చి పెండ్లి అయిదు రోజులు పుట్టింట జరపాలని పెండ్లిపనులు ఆరంభించారు. పిల్లకి నాలుగేండ్లు. ఆమెకు లక్కబొమ్మలు బెల్లపు ముక్కతో ఆడుకోవటం యిష్టము. పుల్లయ్య అది గమనించి ఖర్జూరపు పండు పొట్లాము ఆమెకు ఆశగా చూపి నది దాటించి వానపల్లి తీసుకవచ్చాడు. బుచ్చమ్మ బండిలో నిద్రపోయింది కన్యాదాత ఎవరూ? అన్న ప్రశ్న వచ్చింది.

ఆ వూరిలో నీళ్ళకావిళ్ళు మోసే నరసయ్య ఒక విధవరాలిని వుంచుకున్నాడు. వారికి బిడ్డలు కలిగిన తర్వాత దంపతులమని చెప్పుకోసాగారు. వారికి కబురు పంపి పిలిపించారు. ఇంతలో బుచ్చి నిద్ర మేల్కొని గొడవ చేయటం మొదలు పెట్టింది. ఈ గుట్టు రట్టవుతుందేమోనని గణపతి భయపడ్డాడు. భజంత్రీలు గట్టిగా మేళం వాయించారు. మంత్రాలుగానీ పిల్ల ఏడుపు గానీ ఎవరికీ వినిపించలేదు. ఏడ్చిఏడ్చి పిల్ల నిద్ర పోయింది. నిద్రలోనే బుచ్చమ్మకు మంగళసూత్రం కట్టి తలంబ్రాలుపోశాడు గణపతి. పిల్ల మధ్య మధ్యలో ఏడుస్తూ మరలా నిద్ర పోయేది. పెండ్లి అయిన తర్వాత బుచ్చమ్మను పుల్లయ్య స్వగ్రామానికి తీసుకు వెళ్ళాడు.

అక్కడ గంగమ్మ పిల్లను వెదికి వేసారి నూతులు గోతులు చూశారు. ఎవరో చంపివేసి వుంటారని నిశ్చయించుకున్నారు. ఎవరి కంట బడకుండా పుల్లయ్య నిద్రపోతున్న బుచ్చమ్మను నాగన్న యింటి అరుగు మీద పడుకో బెట్టి వెళ్ళిపోయాడు. పిల్ల మెలుకువ వచ్చి 'అమ్మా' అని అరిచింది. తల్లి తండ్రి బిడ్డను కౌగలించుకొని ఆనందపడ్డారు. తెల్లవారి చూసేసరికి బుచ్చమ్మ మెడలో మంగళసూత్రం కనపడింది. ఇది గణపతిగాడిపని అని అందరూ నిశ్చయించుకున్నారు. నాగన్నకు ఎక్కడలేని కోపం వచ్చింది. కూతురి

మెడలో మంగళ సూత్రాలు తెంచి వేశాడు. రాయప్పతోనే పెండ్లి జరిపిస్తానని పంతం పట్టాడు. గంగమ్మ నానా శాపనార్థాలు పెట్టింది మేనల్లుణ్ణి తోడబుట్టిన దాన్ని చంపివేస్తానని నాగన్న పంతం పట్టాడు.

గణపతి తల్లి ఆ మాటలు విని ఎలాగైనా కాపాడమని పుల్లయ్యను ప్రాధేయ పడింది. తన పేరు బయట పడకుండా చూడమని పుల్లయ్య గణపతి చేత ఒట్టు వేయించు కున్నాడు. వానపల్లిలో క్షేమంగా వున్న మనుగుడుపుల పెండ్లి కొడుకైన గణపతిని చూసి సంబర పడింది. ఇక మీదట ఏమి చేయాలో అని ఒక ఆలోచన వారికి వచ్చింది.

దొంగ పెండ్లి చేసుకున్నాడని గణపతిని తక్కువగా అంచనా వేయరాదు. కృష్ణుడు రుక్మిణిని, అర్జునుడు సుభద్రను, దుష్యంతుడు శకుంతలను, ఉదయనుడు వాసవదత్తను చేసుకోలేదా! అదే విధంగా గణపతి కూడా కక్కుర్తిపడి పెండ్లి చేసుకున్నాడు.

యేనుగులమహాలు వదలిపెట్టి మేనమామ బాధ తప్పించుకొని తల్లీకొడుకులు వానపల్లిలో స్థిరపడ్డారు. యాయవారం చేయటం ఎల్లకాలం మంచిది కాదని గణపతి తల్లికి హితవు చెప్పి ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించాడు. యేనుగులమహాలు నుండి పుల్లయ్య సహాయంతో ఒక బండిలో తమ సామానులు వెనుకొని వానపల్లికి చేరారు. చేతిలో పైసా లేని గణపతికి ఊరిలోని వారు తలకొక సాయం చేసినారు. పిల్లలకు విద్యాదానం చేస్తాడని ధాన్యము తెచ్చి యిచ్చారు. అలా వచ్చిన పది కుంచాల ధాన్యం తల్లీకొడుకులకు రెండు వారాలకు సరిపోలేదు. గణపతి చిరు తిండ్లు కొనుటకు యింటిలో వెచ్చాలు సమకూర్చుకోవడానికి ఆ ధాన్యమే ఆధారమైనది. ఏడాదికి పుట్టెడు ధాన్యం గ్రామస్థులు యిచ్చేలా కుదుర్చుకుని గణపతి బడి మొదలు పెట్టాడు.

ఉపాధ్యాయుడుగా గణపతి లీలా విలాసాలు చెప్పడానికి సాధ్యంకాదు. అతనికి అక్షరంముక్క రానందువలన తనతెలివితేటలతో బెత్తంపుచ్చుకొని పిల్లలను భయపెట్టి బడినడపసాగాడు. చుట్టకాల్చుట మానలేదు. పిల్లలను బెత్తముతో కొట్టుట, చీటికి మాటికి దండించుట అలవాటైనది. బెత్తము

తోనే గాక అప్పుడప్పుడు పిడిగుద్దులు గుద్దేవాడు. తల్లిదండ్రులు 'ఏమయ్యా!' అని అడిగితే మీ పిల్లవాడిక బాగు పడడని శాపనార్థాలు పెట్టేవాడు. మీరు విశ్వాసములేని వారని ఆడిపోసుకునేవాడు. పిల్లవానికి చదువుకన్నా భయభక్తులు ముఖ్యమని వాదించే వాడు. క్రమంగా పిల్లలను బడికి పంపడం మాని వేశారు.

ఒకరోజు గణపతి బడిలో కూర్చొని చుట్టకాలుస్తూ నిద్రపోయాడు. బట్ట మీద చుట్టపడి కాలుతూ వుంటే పిల్లలు గోలచేసి లేపారు. గణపతి నిద్రాభంగమైనందుకు వారిని చావబాదాడు. అతని మూర్ఖత్వము, దండనము చూచి పిల్లలు దడుచుకునేవారు. గణపతి మహా మేధావి. అతడు పురాణాలకు చెప్పే భాష్యం ఆశ్చర్యకరంగా వుండేది. గణపతికి చిరు తిండ్లు చిల్లర పైసలు పిల్లలు లంచాలుగా యిచ్చి దెబ్బలు తప్పించుకునే వారు. గణపతి దెబ్బలకు తట్టుకోలేక పిల్లలు అతనిని ఆటపట్టించేవారు. ఒక రోజు ఒక కుర్రవాడు గణపతి దెబ్బలకు చనిపోయినట్లుగా నటించి అతనిని హడలు కొట్టించాడు. గణపతి పోలీసులకు భయపడి అటక పైకి ఎక్కి కూర్చున్నాడు. ఊరగాయలు మైలబడ్డాయని యింటివారు తిట్టిపోశారు. ఆ యిల్లు ఖాళీ చేయక తప్పలేదు.

గణపతి బడి క్రమంగా క్షీణించసాగింది. ఊరివారు వినోద కాలక్షేపానికి అతని దగ్గరకు వెళ్ళేవారు. ఇంతలో మరొక ఉపాధ్యాయుడు ఆవూరిలో ఇంకొక బడి పెట్టారు పిల్లలందరూ అక్కడికి వెళ్లారు. గణపతి జీవనాధారానికి వేరేవృత్తి స్వీకరించక తప్పలేదు.

ఆ వూరిలో శివరాత్రినాడు వీధి భాగవతులు భాగవతము ఆడడానికి వచ్చారు. సమయానికి వారికి కృష్ణవేషధారి దొరకలేదు. గణపతి తాను వేస్తానని ముందుకు వచ్చాడు. ఆ మేళం నాయకురాలైన గరుడాచలం వినోదంకోసం గణపతిని తమజట్టులో చేర్చుకుంది. గణపతికి ఏనుగు నెక్కినంత సంబరమైంది. గణపతి సంతోషంగా గరుడాచలం మగడినని చెప్పుకోసాగాడు. గణపతి వేషధారణను చూసి తత్తరపాటును చూసి సభాసదులు నవ్వుకునేవారు. చివరకు అక్కడకూడా అతడు కొనసాగ లేక పోయాడు.

మరో వృత్తి వెతుక్కున్నాడు. వంటబ్రాహ్మణుడుగా ఈసారి అవతారం ధరించాడు. అతడు పుట్టినది మొదలు వంట చేసి ఎరుగడు. ఒక అధికారి యింట్లో వంట బ్రాహ్మణుడుగా చేరి, తన అపభ్రంశత్వాన్ని నిరూపించుకున్నాడు. గరిటెకు బదులు వేప పుల్లతో అన్నం కలియ బెట్టడం వల్ల నోట బెట్టేందుకు వీలు కాలేదు. యజమానికి ఒళ్ళుమండి యింట్లోంచి వెళ్ళిపొమ్మన్నాడు.

గణపతి వూరుకోలేదు. మీ వంటి వారి దగ్గర పని చేయటం నాకే అప్రతిష్ఠ అని ప్రగల్భాలు పలికాడు. తనకు రావలసిన సొమ్ము యివ్వకపోతే నా సొమ్ము తిన్నవాళ్ళలో మీరొకరని చివాట్లు పెట్టి వెళ్ళిపోయాడు.

వానపల్లెలో కొత్తగా వచ్చిన ఉపాధ్యాయుడు కొంతకాలానికి విశూచి జాడ్యంతో చనిపోయాడు. గణపతిని మళ్ళీ బడి పెట్టమని ఊరివారు అడిగారు. కొత్తచోట బడి మొదలుపెట్టాడు. ఆ ఇంట్లో ఎలుకలు కొబ్బరు చెట్టుపై కెక్కి కాయలు కొట్టివేసేవి. వాటి బాధ తప్పించుకోవడానికి గణపతి ఉపాయం ఆలోచించాడు. ఒక పిల్లిని బుట్టలో పెట్టి చెట్టుపైకెక్కించి దాని మెడకొక తాడుకట్టి చెట్టుకు వేలాడదీయించాడు. తాడు బిగుసుకొని ఉరివేసుకొన్నట్లు పిల్లి చచ్చిపోయింది.

పిల్లిని చంపిన పాపానికి బంగారుపిల్లిని దానం చేయాలని ఊరిపెద్దలు నిశ్చయించారు. దానికి చందాలు వసూలుచేసి యిస్తామని ఊరివారు హామీ యిచ్చారు. నానాఅవస్థలు పడి చందాలు పోగుచేసి గణపతి మహాదేవశాస్త్రి చేతికిచ్చాడు. మహాదేవశాస్త్రి అసాధ్యుడు. ఎప్పటికప్పుడు వచ్చిన డబ్బుతిని వేశాడు. బంగారు పిల్లి గొడవ చాలాకాలం సాగింది.

గణపతిని నిద్రలేపడం కష్టమని, అతని శిష్యులు ఒక కోడిని కొంటే అది కూతకూయుగానే గురువుగారిని ఎలానో అవస్థపడి నిద్ర లేపవచ్చుననుకున్నారు. కోడి గుడ్లమీద మమకారంతో గణపతి తన శిష్యుల సలహా అంగీకరించాడు. కోడి పెట్టకు కావలసిన తవుడు వంతుల వారీగా శిష్యులు తెచ్చియిచ్చేవారు. తల్లికి ఆ కోడి సంరక్షణ సరిపడలేదు. మహారాజులు పెంపుడు జంతువులను పెంచలేదా? అని గణపతి సమాధానం. కోడిగుడ్ల దొంగతనం జరిగిన నాడు గణపతి శిష్యులను చావగొట్టేవాడు. కోడిగుడ్లు

ఎప్పటికప్పుడు అమ్మి పొట్ట గడుపుకొనేవాడు. ఒకరోజు గండుపిల్లి కోడిని గొంతుకొరికి చంపివేసింది. గణపతి తన పెంపుడు కోడి చనిపోయినందుకు దుఃఖపడ్డాడు. పోతే పీడపోయిందని తల్లి సమర్థించింది. గణపతి తల్లి మొగం వాచేటట్లు తిట్టాడు.

బుచ్చమ్మకు మేనమామ మళ్ళీ పెళ్ళి చేశాడనే వార్త గణపతి హృదయం కలచివేసింది. పెండ్లి కూతురుకోసం గణపతి వేట ఆరంభించాడు. ఎలాగైనా చందాలు వసూలు చేసి గణపతి పెండ్లి చేయాలని సింగమ్మ తాపత్రయం. గణపతి కూడా అందరితో తన పెళ్లి ప్రస్తావన ఎప్పుడూ చేసేవాడు. నీకున్న ఆస్తి ఏమిటి? అని ఎవరైనా అడిగితే పెద్ద ఉపన్యాసం యిచ్చేవాడు. ఆస్తి అస్థిరమని అతని వాదన.

పుల్లయ్యమామ భార్య గర్భవతి అని సింగమ్మ కొడుకుతో సంతోషంగా చెప్పింది. అంత చిన్న పిల్లను చేసుకొంటానా? అని తల్లిని చావ గొట్టాడు. రామావధానుల కూతురికి ఎక్కడా సంబంధం దొరకక పోతే తల్లిని వెళ్లి అడిగి రమ్మని గణపతి పురమాయించాడు. ఆస్తి లేనివాళ్లకు ఎవరిస్తారురా? అన్నందుకు ఆమె వొళ్లు హూనంచేశాడు.

గణపతి రోజూ చేసే విపరీత చేష్టలు ఊరిజనం ఆశ్చర్యంగా చెప్పుకొనేవారు. అతనికి పెళ్లి పిచ్చి పట్టిందని ఎగతాళి చేసేవారు. అతని శిష్యులు గణపతిని ఆటపట్టించేందుకు పెళ్లి చేయిస్తామని హామీ యిచ్చారు. శిష్యవత్సలుడైన గణపతి వారిని ప్రశంసించి అందుకు అంగీకరించాడు. పల్లకీ మీద ఎక్కితిరగాలని తన మనసులో కోరిక వెల్లడించాడు.

శిష్యులు పల్లకీ సంపాదించి తెచ్చారు. గణపతికోటు తొడుగుకొని ఉత్తరీయం వేసుకొని తలపాగా ధరించి బయలుదేరాడు. కాళ్ళకు పారాణి, కంటికి కజ్జలము, బుగ్గచుక్క తల్లిచేత పెట్టించుకొని గణపతి పల్లకీ ఉత్సవానికి బయలుదేరాడు. ఊరివారికి ఆ సంబరం పట్టరానిదైంది. గణపతి హావభావాలు వారికి నవ్వు తెప్పించాయి. భజంత్రీలను, బోయీలను కోపపడుతూ చుట్ట వెలిగించి దర్జాగా కూర్చొన్నాడు. తెల్లవారే వరకు పల్లకీ ఉత్సవం సాగింది. పెళ్లికాక పోయినా పల్లకీ ఎక్కాలనే కోరిక గణపతి కలా తీరింది.

పెళ్లి పిచ్చి ఎలాగైనా గణపతికి కుదర్చాలని ఊరి పెద్దలు సింగమ్మకు సలహాలు ఇచ్చారు. తలమీద కత్తిగాటులు వేయించి నిమ్మపళ్లరసం రుద్దితేగాని తగ్గదని చెప్పారు. శిష్యులు గురువుగారిని కాలువవద్దకు తీసుకెళ్లి తలమీద కత్తిగాటులు బలవంతంగా వేయించారు. గణపతి తల అటూయిటూ తిప్పడంతో నాలుగైదు గాటులు పడ్డాయి. ఊరివారంతా ఆ తమాషా చూడటానికి పోగయ్యారు. శిష్యులు బిందెలతో నీళ్లు తెచ్చి పోశారు. సింగమ్మ వారిని ప్రోత్సాహించింది. గణపతి కేకలు వేసినా వారు వదలిపెట్టలేదు. తన తల్లి యీ పని చేయించిందని ఆమె పై కోపపడి తన కంటికి కనపడకుండా వెళ్లి పొమ్మన్నాడు. ఆమె మహాదేవశాస్త్రి యింట్లో తల దాచు కొంది. తల్లికి తగిన శాస్తి చేయించాలని గణపతి కోరిక. శిష్యుల సహకారంతో ఆమె తల నున్నగా గీయించి, శవాన్నిమోసుకెళ్లినట్లు బావివద్దకు తీసుకెళ్లాడు. నాకు పిచ్చి లేదని మొరపెట్టు కొన్నా వూరుకోకుండా తన అక్కసు తీర్చుకొన్నాడు గణపతి.

అది మొదలు తల్లీకొడుకులు కలుసుకోలేదు. చెరియొక చోట తలదాచుకొన్నారు. మహాదేవశాస్త్రి కుటుంబం తీర్థయాత్రలకు పోతుంటే వారితో కూడా సింగమ్మ బయలుదేరి మార్గమధ్యంలో కుంభకోణంలో విశూచి జాడ్యంతో చనిపోయింది. గణపతికి ఆవార్త తెలియనే తెలియదు.

పెళ్లి చేసుకోవాలని గణపతి సంకల్పం. చందాలు వసూలు చేశాడు. ఇంతలో మహాదేవశాస్త్రి ఒక సంబంధం కుదిర్చాడు. చింతాభైరవ దీక్షితులు గారి అమ్మాయిని యిచ్చేలా నలభైవరహాలకు పెళ్లి సంబంధం మాట్లాడిపెట్టాడు. ఐదు రోజులు పెళ్లి వైభవంగా జరిపించారు. తర్వాత విచారించగా దీక్షితులు మోసం చేసి పెళ్లి అయిన పిల్లను అంటగట్టినట్లు తెలిసింది. గణపతి పోలీసులకు భయపడి ఊరు వదలి పారిపోయాడు. అంతటితే అతని కథ సమాప్తమైంది.

# 7

# పాండవోద్యోగం

(పౌరాణిక నాటకం)

తిరుపతి వెంకట కవులు

1872-1920 ● 1870-1950

ప్రథమ ముద్రణ-**1931**

# తిరుపతి వెంకటకవులు
## దివాకర్ల తిరుపతిశాస్త్రి, చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి

దివాకర్ల తిరుపతిశాస్త్రి, చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి జంటకవులుగా ప్రసిద్ధికెక్కారు. ఇద్దరూ జీవించనంతవరకు కలిసి గ్రంధాలువ్రాశారు. తిరుపతి శాస్త్రి మరణానంతరం కూడా వెంకటశాస్త్రి రచనలు కలిసి వ్రాసినట్లుగా ప్రచురించారు. అవధాన జైత్రయాత్రలు సలిపి అష్టావధాన, శతావధాన ప్రక్రియలకు ప్రాచుర్యం కలిగించారు

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి **1870** ఆగస్టు **8**న జన్మించారు గోదావరి మండలంలోని కడియం నివాసం. దివాకర్ల తిరుపతి శాస్త్రి **1972** మార్చి **26**న జన్మించి పశ్చిమగోదావరి జిల్లా ఎండగండిలో నివసించారు ఉభయులు పండిత వంశంలో జన్మించడం విశేషం. కాశీపండితులైన చర్లబ్రహ్మయ్యశాస్త్రి వద్ద సహాధ్యాయులుగా ఉన్నసమయంలో వీరికి స్నేహమారంభమైనది **19**వ ఏట ఈ యిరువురు కాకినాడలో శతావధాన ప్రదర్శనచేసి కవిపండితుల మన్ననలు పొందారు. వీరిచాటువులు బహుళజనామోదాలు యావదాంధ్రదేశ సంచారం గావించి ఎందరో రాజుల గౌరవాదరాలకు ప్రీతి పాత్రులయ్యారు

భారతంలోని కథను ఐదు నాటకాలుగా వ్రాశారు. పాండవోద్యోగ విజయాలు తెలుగువారి నాలుకపై నర్తించాయి 'అదిగోద్వారక',-బావా ఎప్పుడు వచ్చితీవు' పద్యాలు ఆబాలగోపాలం పాడుతున్నారు. జాతకచర్య స్వీయచరిత్ర, నానారాజ సందర్శనం, శతావధానసారం పాణిగ్రహీత, పతివ్రత, శివభక్తి, శివపురాణం, సుశీల, గోదేవి సుప్రసిద్ధాలు విక్రమార్కదేవచరిత్ర, చంద్రప్రభ చరిత్ర, హర్షచరిత్ర గద్యకృతులు సాహిత్య వివాదాలు, గీరతము, గుంటూరు సీమపేర పద్యగ్రంధాలుగా వెలువరించారు. కథలు-గాథలు తెలుగువారి సాహిత్య సాంస్కృతిక వారసత్వానికి మణిదర్పణం.

**1920**లో తిరుపతి శాస్త్రి స్వర్గస్థులయ్యారు.

చెళ్లపిళ్ల వారికి ఆంధ్రవిశ్వవిద్యాలయం కళాప్రపూర్ణ బిరుదప్రదానం చేసింది. వెంకటశాస్త్రి అవిభక్త మదరాసు రాష్ట్రానికి ప్రభుత్వ ఆస్థాన కవిగా నియమితులయ్యారు. **1950** మార్చిలో శివరాత్రి నాడు శివసాయుజ్యం పొందారు

# పాండవోద్యోగం గురించి

సంజయురాయబారం విఫలమైంది. దుర్యోధనుడు సంధికి అంగీకరించలేదు. యుద్ధం అనివార్యమైంది. యుద్ధంలో సహాయంకోరేందుకు శ్రీకృష్ణుని వద్దకు అర్జునుడు సహాయం కోరివచ్చాడు. శ్రీకృష్ణుడు తానొక్కడే ఒక పక్షము తనసైన్యమొక పక్షముని చెప్పాడు. దుర్యోధనుడు చిన్నవాడైన అర్జునుని ముందుగా ఎవరుకావాలో కోరుకోమన్నాడు. ఆయుధాలు ధరించకపోయినా శ్రీకృష్ణుడే తనకు కావాలని అర్జునుడు కోరుకున్నాడు. సుయోధనుడు సేనల్నికోరాడు.

శ్రీకృష్ణుని హస్తినాపురికి రాయబారిగా పంపాలని పాండవులు నిశ్చయించారు. పాండవులలో ఒక్కొక్కరు తమ భావాలను శ్రీకృష్ణునికి చెప్పసాగారు. సంధిప్రయత్నం చేయమని ధర్మజుడన్నాడు. ఇతరులు, తమతమ అభిప్రాయాలు చెప్పిన మీదట ద్రౌపది తన పరాభవాన్ని ఏకరువు పెట్టింది.

కౌరవసభలో ధృతరాష్ట్రుని ముందు కృష్ణుడు ఐదుగురికీ ఐదూళ్లు యివ్వమని సలహాయిచ్చాడు కర్ణుడు కృష్ణునితో వాదనకు దిగాడు దుర్యోధనుడు అందరిమాటలు త్రోసిపుచ్చాడు. 'వాడి సూది మొన మోపినంత నేలకూడా పాండవుల కివ్వనన్నాడు. వికర్ణుడు తండ్రిని గర్హిస్తూమాట్లాడాడు.

దుర్యోధనుడు కృష్ణుని బంధించాలనే దురాలోచన చేశాడు. కృష్ణుడు విశ్వరూపధారణ చేసి వారి ఆటలు సాగనివ్వలేదు. ధృతరాష్ట్రుడు దివ్యదృష్టితో ఆరూపాన్ని సందర్శించాడు.

కర్ణునికి శ్రీకృష్ణుడు జన్మరహస్యాన్ని తెలియజేసి కుంతీపుత్రులంతా ఒకటికావడం యోగ్యమన్నాడు కర్ణుడు దుర్యోధనునిపట్ల తన స్వామిభక్తిని ప్రకటించాడు.

కౌరవసభలో అతిరథమహారథుల ప్రస్తావన వచ్చినపుడు భీష్మునిపై కర్ణుడు కోపించాడు. కురుక్షేత్ర సంగ్రామం మొదలైంది కృష్ణుడు విజయసారథి అయినాడు. అర్జునునికి కృష్ణుడు గీతోపదేశం చేశాడు. భీష్ముని అనుమతిని యుద్ధానికి ముందు ధర్మజుడు కోరాడు. పాండవులకు విజయం తథ్యమని శ్రీకృష్ణుడు భరతవాక్యం పలికాడు.

# 7. పాండవోద్యోగం

## సంక్షిప్త గ్రంథం

సంజయ రాయబారం విఫలమైంది. దుర్యోధనుడు సంధికి అంగీకరించ లేదు. యుద్ధం అనివార్యమైంది. శ్రీకృష్ణుని వద్దకు యుద్ధంలో సహాయం కోరేందుకు దుర్యోధనుడు ద్వారకకు బయలు దేరి వచ్చాడు. ద్వారక ఆలమందలతో నిండుగా వుంది. అంతఃపురంలో శ్రీకృష్ణుడు శయనించి వున్నాడు. అర్జునుడు యదుసింహుని సహాయం కోరి ద్వారకకు వచ్చాడు. దుర్యోధనుడు ముందుగా వచ్చివుండటం, నిద్రిస్తున్న కృష్ణుని తల పార్శ్వమున కూర్చుని వుండటం గమనించాడు. కపట నిద్ర నటిస్తున్న శ్రీకృష్ణుడు అర్జునుడు రాలేదేమో యని ఎదురు చూస్తున్నాడు. ఇంతలో అర్జునుడు సమీపించి నిద్రిస్తున్న శ్రీకృష్ణుని పాదాలవద్ద భక్తి పూర్వకంగా వచ్చి నిలుచున్నాడు.

దుర్యోధనుడు అర్జునుని రాక గమనించాడు. శ్రీకృష్ణుడు తప్పని సరిగా అర్జునుని పట్ల పక్షపాతం వహిస్తాడని, అదిలోక నిందకు గురిచేస్తుందని అనుకున్నాడు. శ్రీకృష్ణుడు నిదుర నుండి లేచి ఎదురుగా వున్న అర్జునుని కౌగలించుకొని కుశల ప్రశ్నలతో యోగక్షేమాలు తెలుసుకున్నాడు. అటు తిరిగి దుర్యోధనుని చూచి, గౌరవపురస్కారంగా బంధువుల క్షేమం అడిగి తెలుసుకున్నాడు. 'ఇంతకూ వచ్చిన పని యేమి? దుర్యోధనా!' అన్నాడు. కౌరవ పాండవులు కురుక్షేత్ర సంగ్రామానికి తలపడుతున్నారని ఉభయులక్షేమాన్ని కోరే నీవు మాకు సహాయం చేయవలసిందని దుర్యోధనుడు అడిగాడు. 'సుయోధనా! నీవు ముందుగా వచ్చావు. అర్జునుని నేను ముందుగా చూశాను. ఇరువురు సహాయం కోరివచ్చారు. అయినా చిన్నవాడు కాబట్టి అర్జునుడు ముందుగా కోరుకోవడం ధర్మం. నాసైన్యాన్ని రెండు భాగాలుగా విభజిస్తున్నాను. అందులో మీరు కోరినది ఎంచుకోవచ్చు' అన్నాడు కృష్ణుడు. కృష్ణుని మాటలలో ఏదో మోసం వుందని దుర్యోధనుడు అనుమానించాడు.

శ్రీకృష్ణుడు సైన్య విభాగం చేశాడు. పదివేల మంది గోపయోధులొకపక్షం శ్రీకృష్ణుడు ఒక్కడే ఒక పక్షం. ఆయన ఆయుధాలు ధరించడు. యుద్ధంచేయడు ఇందులో ఏభాగాన్నైనా కోరుకోవచ్చునన్నాడు. తనకదృష్టం బాగలేక కృష్ణుడు తన పక్షానికి వస్తే తనకు నగుబాటేనని సుయోధనుడు సందేహిస్తున్నాడు. అర్జునుడు శ్రీకృష్ణుని తన పక్షంలో ఉండమని కోరుకున్నాడు. దుర్యోధనుడు సంతోష పరవశుడై తిరిగి వెళ్ళాడు.

అర్జునుని అవివేకానికి కృష్ణుడు పరిహసించాడు. అర్జునుడు బావా! నీవు మాపక్షాన వుంటే చాలు అదేపుష్టి. యుద్ధం చేయనక్కర లేదు. పదివేల మంది గోపకులు ఒకఎత్తు. నీవు ఒక్కడివీ ఒక ఎత్తు. నీవు మాపక్షాన ఉంటే మాకు జయం తథ్యం- అన్నాడు. యదుసింహుడు ప్రసన్నుడై అర్జునా! నేను విజయ సారథినై మీకు తోడ్పడతాను- అన్నాడు. అర్జునుడు ఆనందపరవశుడయ్యాడు. కృష్ణార్జునులు యుద్ధరంగంలో వున్నప్పుడు శత్రుసైన్యం అపజయంపాలు కాక తప్పదని అర్జునుడు సంతోషించాడు. దుర్యోధనుడు బలదేవుని సహాయం కోరివెళ్ళాడు కాబట్టి అర్జునుడు కూడా బలదేవుని చూడటం యుక్తమని కృష్ణుడు సలహా యిచ్చాడు. అర్జునుడు అందుకంగీకరించలేదు. 'బావా! నీవు మాపక్షాన ఉన్నపుడు నేనింక ఇతరుల సహాయం కోరవలసిన అవసరంలేదు. బలరాముడు తన బలంతో శత్రువులను సంహరిస్తే నాకు పేరు ప్రఖ్యాతులెలా వస్తాయి' అన్నాడు అర్జునుడు. కృష్ణుడు నవ్వి అర్జునా! నీధైర్యానికి సంతోషం. ఉన్నమాట చెప్తాను విను. బలరాముడు ఎవరి పక్షానరాడు. మీ ఉభయులకు సంధికలిగితే మా ఉభయులకూ సంతోషమే. కాబట్టి ఆప్రయత్నం చేద్దాం అన్నాడు.

పాండవుల దగ్గరకు కృష్ణుడు వచ్చాడు. ముందుగా ధర్మనందనునికి నమస్కరించాడు. కుశల ప్రశ్నలు వేశాడు ధర్మజుడు దేవా! మొన్న సంజయ రాయబార సమయంలో మా పెద్ద తండ్రి ధృతరాష్ట్రుని లోభిత్వం నీవు గమనించి వుంటావు. జయాపజయాలు దైవాధీనాలు. యుద్ధము, బంధు నాశనము తప్పదు అన్నాడు.

శ్రీకృష్ణుడు ధర్మజుని నిర్వేదాన్ని వారిస్తూ బావా! క్షత్రియులకు రణరంగమరణం సహజం. అయినా నీ అభీష్టమేదో చెప్పు అన్నాడు ద్రౌపది

ఆయన మాటలకు అడ్డువచ్చింది 'దేవా! మొన్న సంజయరాయబారంలో సారాంశం నీకు తెలియనిదికాదు మీరు బిక్షాటనం చేసి అయినా ధర్మానువర్తులై ఉండమని బోదించాడు అడవులలో కందమూలాలు తింటూ జీవించటం మీ పెద్ద బావ అభిమతం' అంది వ్యంగ్యంగా కృష్ణుడు దర్మజుని మనసులో మాట తెలుసుకుందామని దృతరాష్ట్రుని కుయుక్తులను వివరించాడు దర్మజుడు అందుకు స్పందిస్తూ- 'బావా! ఒక్కసారి నీవు కౌరవుల వద్దకు లోకం తెలుసుకునేలా సంధి ప్రయత్నం చేయవలసిన అవసరం వుంది. నీవు ఇరువురికి కావలసిన వాడవు సకలదర్మ స్వరూపుడవైన నీవు- సంధి ప్రయత్నానికి సమర్ధుడవు సంధి కుదిరితే మా అన్నదమ్ములు నూట అయిదుమంది లేనిచో పాండవులైదుగురే సహోదరులు-' అన్నాడు బాదగా కృష్ణుడు సంది జరగడం దుర్లబమన్నాడు అయినా నీమాట కాదనలేక వెళ్ళివస్తానన్నాడు సాత్యకి, కృతవర్మ అక్కడ కృష్ణునికి సాయంగా వుంటారని ధర్మజుడన్నాడు బీముడు కళ్ళెర్ర జేసి తీవ్రంగా మాట్లాడాడు ఈసంది కుదరని పని అన్నాడు కౌరవులు మృత్యువు వాత పడక తప్పదన్నాడు ద్రౌపది తనకు జరిగిన వస్త్రావహరణ దౌర్భాగ్యాన్ని తలచుకొని బీముని అసమయకోపానికి ఆశ్చర్యపోయింది శాంతించమని ప్రార్ధించింది

సంది పొసగదని తెలిసికూడా కృష్ణుడు సందికి వెళ్ళివస్తానన్నాడు తన బలాన్ని గురించి ధర్మజుడు సందేహంగా మాట్లాడినపుడు కృష్ణుడతనికి ధైర్యాన్ని నూరిపోశాడు పాండవుల బలపరాక్రమాలను స్పష్టం చేశాడు సంది కుదరకపోయినా శత్రుబలాన్ని అంచనా కట్టడానికి హస్తినకు వెళ్ళివస్తానన్నాడు కౌరవ సమాదానమేమిటో తెలిసికొని వస్తానన్నాడు బీముడు అతని మాటలకు అడ్డుతగులుతూ సందిచెడగొట్టవద్దని కృష్ణుని ప్రార్థించాడు కృష్ణుడు బీముని మాటలకు నవ్వి 'బీమసేనా! ఇవి నీమాటలేనా! దుర్యోధనుని తొడలు విరుగగొట్టాననీ, దుశ్శాసనుని రొమ్ము చీలుస్తానని పలికిన నీవు ఈ పిరికి మాటలు మాట్లాడటం బావ్యం కా'దన్నాడు

బీముడు నిన్నటి దాకా ప్రగల్బాలు పలికి ఇప్పుడు యుద్ధమంటే బెదిరి పోతున్నాడని కృష్ణుడు ఎకసెక్కెములాడాడు బీముని కృష్ణుడు

రెచ్చగొడుతున్నాడని గమనించిన పాండవాగ్రజుడు-కృష్ణా! నామీద గౌరవముతో బంధించబడిన యేనుగువలె భీముడున్నాడని సమర్థించాడు. భీమునకు కోపం అలంకారమని కృష్ణుడు ప్రశంసించాడు. భీముని కోపమే చల్లారినచో తనకు మరొక దిక్కులేదని ద్రౌపది భంగపోయింది. భీముడు ఎకసెక్కెముగా కృష్ణుని నిందించాడు. కృష్ణుడది గమనించి బావా! ఉన్నమాట కింత ఉలుకేలయని హెచ్చరించాడు. భీమసేనుడు పాండవులు అన్నమాటకు కట్టుబడి వుంటారని నిర్భయంగా పలికాడు. అన్నమాట అనగాయేమో కృష్ణునికి వివరించాడు. కేవలము చేసిన ప్రతిజ్ఞలు నిలబెట్టుకొనుటయేగాక, అగ్రజుని మాటలు శిరసావహించటం కూడా తక్కిన పాండవుల కర్తవ్యమని గంభీరంగా పలికాడు. హాస్యము ముదురుతున్నదని గ్రహించిన అర్జునుడు కృష్ణునిగొప్పదనాన్ని ప్రశంసించాడు. భీముడు తన గొప్పదనాన్ని చాటుకున్నాడు. పరిస్థితి తారుమారగుచున్నదని గ్రహించిన నకులుడు కృష్ణునితో పరిహాసమాడుట భావ్యము కాదని భీమునికి గుర్తుచేశాడు. భీముడంతటితో వూరుకొనక మనకాయన సాయము ఎంతటిదో నాకు తెలియును. అడవులలో కష్టాలుపడుతున్నపుడు ఆయన తోడు ఏమైనదని నిందాగర్భంగా పలికాడు.

సహదేవుడది విని కృష్ణుడు ఈనాడు మనకు సహాయం చేయుటకు వచ్చినపుడు మనమాతనిని మేలమాడుట తగదనీ, దాయలకిది తెలిసినచో లోకువ అయిపోతామనీ హెచ్చరించినాడు. భీముడందులకు కోపించి తన గదతో తనతలను వ్రయ్యలు చేసుకొనుటకు పూనుకొనెను. ద్రౌపది ఆసంకట పరిస్థితిని వారించుటకై శౌరి మేలమాడుట తప్పే అనియు, తన పరాభవాగ్నిని చల్లార్చుటకు పాండవులు అయిదుగురు ఉద్యమించవలసిన సమయము వచ్చినదని గట్టిగా చెప్పింది. భీముడామె మాటలకు అడ్డుతగిలి తనకు మరణమే శరణ్యమన్నాడు

ధర్మరాజు భీముని ఆత్మహత్యా ప్రయత్నాన్ని విరమించుకొనమని కోరి తమ్ములను ద్రౌపదిని మందలించాడు. కృష్ణుడు భీమసేనుని కోపాన్ని చల్లార్చాలని, ప్రసన్నుని చేయాలని నయోపేతంగా మాట్లాడాడు. అన్నమాటల కోసం ఇంతకు ముందున్న మాటలు నిలబెట్టుకోవాలని శౌర్య పరాక్రమాలతో

విజృంభించాలని అంటూ పూర్వం దుర్యోధనాదులు పాండవులకు చేసిన అపకారాన్ని ఏకరువు పెట్టాడు. సంధికి వెళ్ళమన్న భీముని ప్రవర్తన తనకు ఆశ్చర్యాన్ని కలిగించినందువలన అలా అనవలసి వచ్చిందని సర్ది చెప్పాడు.

భీముని కోపం చల్లారింది. పాంచాలీపరాభవాన్ని చూసిన శ్రీకృష్ణుడు ఈవిధంగా సంధి ప్రయత్నం చేయటం శాంతి వచనాలు పలకడం భావ్యం కాదన్నాడు. అయినా ధృతరాష్ట్రునితో తనమాటగా యిలా చెప్పమన్నాడు- 'మహారాజా! ఇంటికి పెద్దవైన నీవు అంధుడవుగాన రాజ్యాన్ని కౌరవపాండవులకు సమానంగా పంచియిచ్చి సుఖంగా జీవించు. అందుకంగీకరించనిచో యుద్ధరంగంలో నాగదా భుజం నీనూరుగురి కుమారులను మట్టుబెడుతుందని హెచ్చరించాడు. ఆ చల్లని మాటలతో ద్రౌపది మనోవ్యథ తీరింది. ముందుగా అర్జునుడు బావగారితో యిలా అన్నాడు. 'బావా! యుద్ధం అనివార్యమయ్యేలా చూడవలసిన బాధ్యత నీపై వుంది. కౌరవులు భూమి పంచియివ్వడానికి అంగీకరించరు. సహజ దుశ్శీలుడైన దుర్యోధనుడు వాడి సూదిమొన మోపినంత భూమి కూడా యివ్వనని సంజయునితో చెప్పి పంపాడు. మనం ఐదూళ్ళివ్వమనడంలో అర్థంలేదు. సంధికుదరనిచో నామాటగా కురువృద్ధునితోను, గురువృద్ధునితోను యిలా చెప్పిచూడు. మీ మీది గౌరవంతో నేను గాండీవధారిని కావడానికి సందేహిస్తున్నాను. మీరు అతనిని మందలించండి లేదా మీ అభయంతో నేను ముందు కురుకుతాను'.

నకులుడు అన్నమాట లందుకొని 'జనార్దనా! ఎన్నో కష్టాలనోర్చి తుదకు భాగాన్ని కోరితే వారికిలా దురాశ కలిగింది. మొన్న గోగ్రహణ సమయంలో అర్జునుని ప్రతాపం చూసిన భీష్మద్రోణాది కౌరవులు సంధికి ఒప్పుకుంటారా? మనపక్షంలోని వీరులు అవక్రపరాక్రమోపేతులు. నీవు యుద్ధానికి తగిన ప్రయత్నం చేయాలి. శుభ సమయం ఆసన్నమైంది అన్నాడు

సహదేవుని మాటయేమిటో అడిగి తెలుసుకున్నాడు కృష్ణుడు 'జూదంలో ఒడ్డినరాజ్యాన్ని ధృతరాష్ట్రుడు మనకివ్వడం జరుగదు. కక్కిన కూటికి ఆశించడం ధర్మం కాదు. నలాది మహా చక్రవర్తులు జూదంలో ఓడిపోలేదా!

కాబట్టి ధర్మ యుద్ధం చేసి మళ్ళీ రాజ్యం సంపాదించుకుందాం. బలవంతులదే రాజ్యం. జయాపజయాలు దైవాధీనాలు. రాజ్యమో వీరస్వర్గమో యెంచుకోవడం క్షత్రియోచితమైన మాట'- అన్నాడు సహదేవుడు. చిన్నవాడైనా సహదేవుడు పలికిన పలుకులకు కృష్ణుడు అతనిని మెచ్చుకున్నాడు. సంధి ప్రయత్నాలు మానుకొని యుద్ధానికి సన్నద్ధం కావలసిన అవసరం వుందనీ ఆనాటి ద్రౌపదీ పరాభవాన్ని మరిచి పోలేదనీ. కౌరవులకు గుర్తు చేయమన్నాడు.- సహదేవుడు.

ద్రౌపది తనమాటలు కూడా వినమని తన ఆక్రోశాన్ని వెళ్ళగక్కింది. అన్నా! ద్రుపదరాజ పుత్రినై, స్వయంవరంలో పాండవులను చేబట్టి అవక్ర పరాక్రమోపేతులైన ఐదుగురికి భార్యనై ఆనాడు కౌరవ సభలో నిండుకొలువులో పరాభవాన్ని పొందాను. పండ్రెండు యేండ్లు అరణ్యవానము, ఒకయేడు అజ్ఞాతవానము ముగించాము. ఇన్ని బాధలు భరించి బ్రతికియున్నందుకు ఫలమేమి? వారి చావుని తప్ప, కలిమిలేములను నేను ఆశించను. వీరికి పౌరుషం కలిగించడానికి ఇంతకాలం నేను తలవెంద్రుకలు ముడువలేదు. యిప్పటికీ నానోములు ఫలించలేదు-అని ఆవేదనతో మాట్లాడింది. కృష్ణుడామెను ఓదారుస్తూ నీవు ఇన్నాళ్ళు ఓర్చుకున్నావు ఇంకెన్నాళ్ళో పట్టదు. నీవు పడిన బాధలు కౌరవపత్నులు అనుభవించు సమయం దగ్గర పడింది అని చెప్పి పాండవుల వద్ద శలవు పుచ్చుకున్నాడు. ధర్మరాజు తన మనస్సులో దేవతలను ప్రార్ధించాడు తన వంశక్షేమాన్ని కాపాడమని కోరుకున్నాడు. యుద్ధాన్ని వారించి ఉభయ పక్షాలను ఆశీర్వదించమన్నాడు ఉభయ పక్షాలకు కావలసిన కృష్ణుడు మేలు చేస్తాడని సంభావించాడు. కృష్ణుని సాగ నంపి పాండవులు వెనుదిరిగారు.

శ్రీకృష్ణుడు సంధికోసం హస్తినకు చేరాడు విదురుడు కృష్ణునికి అర్ఘ్యపాద్యాదులొసగి సత్కరించాడు. దుర్యోధనుని ఆహ్వానాన్ని మన్నించక విదురునియింట ఆతిధ్యాన్ని స్వీకరించాడు. కౌరవ సభ కొలువు తీరింది. భీష్మద్రోణాదులతో ధృతరాష్ట్రుడు సింహాసనంపై ఆశీనుడయ్యాడు.

విదురసాత్యకులతో శ్రీకృష్ణుడు సభా ప్రవేశం చేశాడు దుర్యోధన దుష్టచతుష్టయం ఆ వెనుక వచ్చారు. అందరూ ఆశీనులైన తర్వాత కృష్ణుడు ధృతరాష్ట్రునితో సంధివాక్యాలు మొదలు పెట్టాడు 'మామా! నేను పాండవ దూతగా మీ ఉభయులకు సంధి కుదిర్చి సమస్త రాజలోకాన్ని కాపాడటానికి వచ్చాను. నీతమ్ముని కొడుకులు తమ సగభాగం తమకివ్వమన్నారు. అలా యిష్టపడక పోతే ఐదుగురికి ఐదూళ్ళు ఇవ్వమన్నారు. నీతనయుల మాటలతో పనియేమియని స్వతంత్రించినచో వంశక్షయము ఆపవచ్చును. పాండవులు నీయెడ అపారమైన భక్తిగలవారు. రణశూరులైన వారు ఈవిధంగా దీనంగా అడుగుతున్నప్పుడు సంశయించడం భావ్యం కాదు. వారు చెప్పమన్న మాటలు సమయం వచ్చినప్పుడు చెప్తాను', అన్నాడు.

ధృతరాష్ట్రుడు వాసుదేవుని మాటలు విని తనమాటగా ఇలా అన్నాడు. 'అల్లుడా! అన్నీ ఎరిగిన నీవు నామీద నెపం పెట్టడం భావ్యం కాదు. నేను గుడ్డివాడినైనందున కొంతకాలం పాండురాజు రాజ్యమేలాడు. ఇప్పుడు కొడుకులేలుకుంటున్నారు. కొడుకులు తండ్రిమాట జవదాటరు అనుటకు మా వంశమున ఈ భీష్మునితోనే చెల్లిపోయింది. దుర్యోధనుని వైపు చూసి ధృతరాష్ట్రుడిలా అన్నాడు. 'అన్నా! వారికి అయిదూళ్ళూ యిచ్చి యుద్ధాన్ని ఆపటం మంచిది. మనకు ఈ అవకాశం మళ్ళీరాదు'- అన్నాడు. దుర్యోధనుడు విననట్టు వూరకున్నాడు.

కృష్ణుడు వృద్ధరాజు మాటలలో కౌటిల్యాన్ని గ్రహించి రాజా! నీవంశానికి కష్టకాలం దాపురించింది. పాండవుల చేత శుశ్రూష చేయించుకుంటావో యుద్ధం చేయించుకుంటావో ఆలోచించు' అని హెచ్చరించాడు. ధృతరాష్ట్రుడు దుర్యోధనునికి నా శక్తి కొద్ది చెప్పిచూస్తానన్నాడు.

కర్ణుడు కృష్ణునితో వాదనకు దిగాడు. అధిక ప్రసంగము మాని దూతగావచ్చిన కర్తవ్యాన్ని గుర్తించమని హేళన చేశాడు. భీష్ముడు కర్ణుని అధిక ప్రసంగాన్ని అభిశంసించాడు. మాటలకడ్డుపడటం తగదన్నాడు ద్రోణుడు కర్ణుని దుందుడుకుతనాన్ని నిరసించాడు. ఎదుటివారి శక్తియుక్తులు గమనించకుండా మాట్లాడటానికి నోరెలా వచ్చింది అని నిలదీశాడు.

కర్ణుడు ద్రోణునితో ఎకసెక్కములాడాడు. 'ద్రోణాచార్యా! భీష్మునితోపాటు నీకును మతిపోయిందా! ఏమి? రారాజు ఉప్పుకారం తిని బ్రతికే మీలాగా దూషించేవాడు కాదీ కర్ణుడు. ప్రాణాలు వదలడానికైనా సిద్ధమే! అన్నాడు. ద్రోణాచార్యు డందుకు కోపించి కర్ణా! నీగొప్పదనం నీపురాతన గురువైన పరశురామునికీ మాకూ బాగా తెలును'- నన్నాడు.

అశ్వత్థామ ఆగ్రహాన్ని కర్ణునిపై వ్యక్తం చేశాడు. ఎలానో సుయోధనుని ప్రాపకం సంపాదించిన సేవకుడవైన నీవు భీష్మాదులకు ధర్మోపదేశం చేయడం హాస్యాస్పదం. రారాజు చేసిన ఘోరాలు చెప్పరాని'వన్నాడు. వికర్ణుడు మధ్యలో అడ్డుతగిలాడు, అశ్వత్థామ అతనిని వారిస్తూ దుశ్చేష్టలను వారించడం పెద్దల కర్తవ్యం. ఊరకుండటం ధర్మం గాదు. కులనాశనానికి కురురాజు పాటుపడుతున్నాడు. శ్రీకృష్ణుడు సంధి విషయానికి వస్తే మనలో మనం కలహించడం భావ్యం కాదన్నాడు. కర్ణు డశ్వత్థామను ఎద్దేవా చేస్తూ మాట్లాడాడు. అశ్వత్థామ రోషకషాయితనేత్రుడై గాండీవి యుద్ధంలో నిన్ను తరిమితరిమి కొట్టే రోజు దగ్గరలో వుంద'ని హూంకరించారు.

ధృతరాష్ట్రుడది గమనించి అశ్వత్థామను శాంతించమని కోరాడు. కర్ణునికి సంధి ప్రయత్నాలు చేయమని సలహాయిచ్చాడు. సుయోధనుని చేరదీసి- నాయనా! శ్రీకృష్ణుని రాక మనకు శుభప్రదం. అతడు దూతగా వచ్చినప్పుడు ఆయనకు సరియైన సమాధానం చెప్పు- అన్నారు. దుర్యోధనుడు బదులు చెపుతూ- సంజయునికి చెప్పిన మాటలే శ్రీకృష్ణుడు మళ్ళీవల్లిస్తున్నాడు. అందుకు సమాధానమేమీ వుండదు. -అన్నాడు.

గాంధారి కుమారుని బుజ్జగిస్తూ 'కుమారా! అలానే చేసి మీతండ్రిగారి మాటల నాదరించు! పురాణగాథలలో ఎందరో పితృవాక్యపరిపాలన చేసి పేరుతెచ్చుకొన్నారు. కాబట్టి నీవు మమ్ము దిక్కుమాలిన వారినిగా చేయకు'- మని బాధగా అంది. ధృతరాష్ట్రుడు అందుకు స్పందిస్తూ 'నాయనా! ధర్మరాజునకు కోపం కలిగితే లోకాలు భస్మమవుతాయి కాబట్టి సంధికి అంగీకరించు! లేకపోతే సమస్తం కోలుపోతావు. మన వంశంలో పెద్దవారు

రాజ్యం చేయడం ఆచారం. శంతనుడు, పాండురాజు పాలించినట్లే ధర్మరాజు రాజ్యాధికారి!' అన్నాడు.

గాంధారి కుమారుని అనునయిస్తూ యిలా చెప్పింది. 'ధర్మం వారి పక్షాన వుంది. భీష్మాదులు న్యాయపక్షపాతులు. అరణ్యాజ్ఞాతవాసాలు పూర్తిచేసి బంధునాశనానికి జంకి సంధికి దూతను పంపారు. ధర్మజాదుల ఎదుట విష్ణుమహేశ్వరులు కూడా నిలువలేరు. కాబట్టి కౌరవపాండవులు కలిసి జీవించడం న్యాయం.

దుర్యోధనుడు తల్లిదండ్రుల మాటలను త్రోసిపుచ్చుతూ అన్నాడు! 'తల్లిదండ్రులారా! మీరు చెప్పాలి గాబట్టి చెప్పారు. ఐదూళ్లు యిచ్చానని అనుకొందాం. మొదటినుండి మాకు మైత్రిలేదు. యికపై కలవదు. పాండవులు బలవంతురని మీరు కలలో కూడా భావించవద్దు. వారుబలవంతులే అయితే భార్యపరాభవం పొందుతుంటే చూస్తూ ఊరుకొంటారా? కర్ణాదులు, నేను, నాతమ్ములు యుద్ధంలో నిలబడితే మమ్ము ఇంద్రుడు కూడా జయించలేడు. పాండవులు రాచబిడ్డలైతే 12 ఏళ్ళు అరణ్యాలలో వుంటారా? తమ్ముని బిడ్డలకు దాయభాగం యివ్వడం ధర్మమే. కాని యమానిలేంద్రాశ్వినులు తమ్ములు ఎలా అవుతారు? పాండురాజు తమ్ముడవుతాడుగాని వారు కాదు'.

గాంధారి ఆ అప్రస్తుత ప్రసంగాన్ని వారిస్తూ ధర్మశాస్త్రం ప్రకారం వారికి రావలసిన భాగం వారికిమ్మని మందలించింది. దుర్యోధనుడు తల్లి మాటలకు ప్రత్యుత్తరమిస్తూ యిలా అన్నాడు.

'తల్లీ! రాజ్యము జ్యేష్ఠకుటుంబంలోనిదేగాని, కనిష్ఠ కుటుంబంలోనిది గాదు. ధర్మమే జయించే పక్షంలో నాకే జయం లభిస్తుంది. ఏదైనా రణరంగంలో తేల్చుకొంటాం. కృష్ణుడు చెప్పిన మాటలు వినలేదని మీరు బాధపడవద్దు. రాజరాజనే పేరు నేను సార్థకం చేసుకొంటాను.

ధృతరాష్ట్రుడు కుమారుని మందలిస్తూ- 'కుమారా! పాండవులతో తగవుపెట్టుకోవడం నాకడుపు దహిస్తోంది 'అన్నాడు.' 'భీముని

బలపరాక్రమాలు నాకు భయం కలిగిస్తున్నాయి. జరాసంధ, హిడింబ, కీచకులను చంపినవాడు నిన్ను మట్టుబెట్టగలడు' అని గాంధారి హితవు చెప్పింది.

దుర్యోధనుడు తల్లిదండ్రుల మాటలను పెడచెవిని బెట్టి యిలా అన్నాడు. 'మాబల పరాక్రమాలు పాండవులకంటె తక్కువగా భావించవద్దు. భవిష్యత్తును నేను ముందే నిర్ణయించాను. పాండవులను తెగటార్చి జయం సాధిస్తాను. కాబట్టి మీరు అమంగళవాక్యాలు మాట్లాడటం మానండి.

ధృతరాష్ట్రుడు కుమారుని మూర్ఖత్వానికి చలించిపోయాడు. వాగ్దేవి భవిష్యత్కాలానుగుణంగా మాట్లాడిస్తుంది కదా! అని తలపోశాడు.

కర్ణుడు గాంధారి మాటలకు అద్భుతగులుతూ క్షత్రియకులంలో పుట్టిన నీవు ఇలా మాట్లాడటం ధర్మంగాదన్నాడు. ధృతరాష్ట్రుడు కర్ణుని పై కోపాన్ని ప్రకటిస్తూ- సంధికోసం వచ్చిన కృష్ణునితో అడ్డదిడ్డంగా మాట్లాడి భరత వంశాన్ని నాశనం చేస్తున్నావు అన్నాడు. గాంధారి భర్తను సమర్థిస్తూ కర్ణుని ప్రగల్భములే సుయోధనుని ప్రవర్తనకు కారణములని చెప్పింది. వికర్ణుడు ధృతరాష్ట్రుని గర్హిస్తూ రాధేయుని కుమారుతో సమానంగా పెంచినది నీవేకదా అన్నాడు. నీకునిజంగా పాండవులపై వాత్సల్యముంటే రాజ్యాన్ని ధారబోయవచ్చు. అలాకాక తప్పు రాధేయునిదే అని తప్పించుకోవటం ధర్మం కాదన్నాడు. దుర్యోధనుడు వికర్ణుని శాంతింపచేసి తండ్రివైపు చూసి కర్ణుని మందలించుట తనకు నహింపరానిదన్నాడు. కర్ణుడందులకు కలతపడి మిత్రమా! ఎవరెన్ని చెప్పినా మనమైత్రి బంధం చెడదు. సప్తసముద్రములు ఘోషిల్లినా, పరమశివుడు అలిగివచ్చినా, అర్జునుని చావు తప్పించలేరు అన్నాడు. ధృతరాష్ట్రుడు గాంధారి తొడపై మూర్ఛిల్లాడు. గాంధారి అది చూసి దుర్యోధనుని తెగడుచూ మూర్ఛిల్లింది.

విదురుడు దుర్యోధనునకు ఉపదేశం చేశాడు. సుయోధనా! నీవు వినవని తెలిసి కూడా నామనస్తాపన తగ్గించుకోవడానికి చెబుతున్నాను. తల్లిదండ్రులకు ప్రజలకు తప్పనితోచిన పనిని మిత్రులమాట విని చేయడం భావ్యం కాదు. ఇక్కడి సభలో కృష్ణుడుతప్ప మిగిలిన వారందరూ నీవారే. వారు చెప్పిన

మాట కూడా కాదని సంపమరణానికి దోహదం చేస్తున్నావు. ఇందరి చావుకొనితెచ్చుకోవడం కంటె ఇరుపక్షాలలో బలిష్టులైన యిద్దరిని తలపడమని వారిలో గెలిచినవారి పక్షానికి జయం చేకూర్చటం తులారణం అంటారు కర్ణార్జునులకు యుద్ధం ప్రకటించి వారి జయాపజయాలను పట్టి భవిష్యత్తును నిర్ణయించవచ్చు- నన్నాడు భీష్ముడు కూడా దానిని సమర్ధించాడు ఈముదిసిముప్పున మాకీ సంతాపమేల అన్నాడు

దుర్యోధనుడు బీష్ముని పరిహాసిస్తూ అర్జునుడు చనిపోతే మాకు నాలుగూళ్ళిస్తే చాలునని మిగిలిన వారనరా! దానిని మీరు సమర్ధించరా? అందువలన మాకు ఐదుగురూ శత్రువులే.బ్రతికినా చచ్చినా ఒకేసారి వారి అంతం చూడాలి అన్నాడు ద్రోణాచార్యుడు సుయోదనుని అజ్ఞతకు నవ్వుతూ- 'సుయోధనా! అప్పుడే అర్జునుడు చనిపోయినట్లు సంతోషిస్తున్నావు అతడు అవక్రపరాక్రమం కలవాడు పరమశివుని ఓడించి పాశుపతాస్త్రం పొందాడు ఇంద్రుని అర్ధసింహాసనాన్ని అధిష్ఠించాడు అన్నకోరిక మేరకు అశ్వమేదయాగం చేయించాడు గోగ్రహణ సమయంలో అతనివల్ల మనము పడినపాట్లు గుర్తులేదా! అన్నాడు

ద్రోణుని పక్షపాత బుద్ధిని ఎత్తిపొడుస్తూ సుయోదనుడిలా అన్నాడు, 'గురుదేవా! అతడు నీకంటె పరాక్రమవంతుడు కాడుగదా! మీవంటి వారు పాండవులతో సంది చేయమనడం కంటె రాజ్యాన్ని వారి కప్పగించి మమ్మల్ని అరణ్యానికి వెళ్ళమనండి రెండుకత్తులు ఒక ఒరలో ఒదగడం కుదరదు' అన్నాడు

'సంపదలను భోగాలను అనుభవించాము బ్రతికి బట్టగట్టాలని మేమీపని చేయడం లేదు బీమార్జునుల బలసంపద మాకు తెలును కాబట్టి'- అన్నాడు ద్రోణుడు సుయోదనుడు వినయపూర్వకంగా గురువునకు చేతులు జోడించి ప్రతిస్పందించాడు సమస్త బంధువర్గం నామేలు కోరి సంధివచనాలు పలుకుతున్నారు అన్ని ప్రాణులకు మరణం తద్యమే దానికి బయపడటం దర్మం కాదు. మీరు మాతో సహకరించదలచుకుంటే మాతో వచ్చి యుద్ధం చేయండి- అని నమస్కరించబోయాడు

కర్ణుడు అడ్డుపడుతూ 'మిత్రమా! బ్రాహ్మణుడు, గురువు అయిన ద్రోణునికి నమస్కరించవచ్చు. కానీ యుద్ధానికి సహకరించమని ప్రార్థించుట ధర్మం గాదు. నీ మిత్రుడు కర్ణుడు చనిపోయాడనుకున్నావా? నీవిలా దైన్యంగా అడగడమెందుకు' అన్నాడు. అశ్వత్థామ కోపావేశంతో కర్ణుని సంహరించడానికి ఉద్యుక్తుడయ్యాడు. కృష్ణుడడ్డుపడి అశ్వత్థామను వారించాడు. 'గురుపుత్రా! కర్ణుని కోరిక చెల్లనీయవయ్యా! అతడు తన సేవాధర్మాన్ని పాటిస్తున్నాడు' అన్నాడు. అశ్వత్థామ కర్ణుని మీది కురకపోయాడు. దుర్యోధనుడడ్డుపడి మనలో మనం కలహించుకోవడం భావ్యం కాదు. ఈకోపాన్ని శత్రువులపై చూపించాలన్నాడు. అశ్వత్థామ దుర్యోధనుని గర్హిస్తూ- సుయోధనా! గురువునకు నమస్కరించవద్దని చెప్పిన అతడు నీకు మిత్రుడా! నీవు మూర్ఖుడవు! అని నిందించాడు.

రాజును దూషించుట తగదని విధిలేనిచో పరిత్యజించుట ధర్మమనీ అశ్వత్థామను వారించాడు. అలాపరిత్యజించటం కూడా ధర్మం కాదనీ కృష్ణుడు సూచించాడు. ఇలాంటివారు పరిత్యజించినా, పరిగ్రహించినా ఒకటే! అంటూ కర్ణుడు దుర్యోధనుని మరింత రెచ్చగొట్టాడు. ఈపెద్దలతో పెట్టుకొనక పోరికి సిద్ధం కమ్మన్నాడు.

కర్ణుని దురహంకారాన్ని తెగడుతూ అశ్వత్థామ మీరాజు మమ్మల్ని ప్రార్థించిన నాడే మేము యుద్ధానికి వస్తామన్నాడు. ద్రోణాచార్య కృపాచార్యులను ఈసభను బహిష్కరించమని అశ్వత్థామ కోరాడు. కృష్ణుడు అది గమనించి దుర్యోధనునితో ఇలా అన్నాడు'.

'బావా! నీకొలువుకూటము క్రమక్రమముగా రణకూటమగుచున్నది. నామాటలు ఆలకించు. తమకు జరిగిన ఎగ్గులను పాండవులు సహించారు. సంధి కోసమై నన్ను దూతగా పంపారు. ప్రజాక్షేమాన్ని కోరి సంధికి అంగీకరిస్తావో లేక యుద్ధానికి సిద్ధపడతావో నిశ్చయించుకో! అలుగుటయే ఎరుగని అజాతశత్రుడు అలిగినచో పదివేల మంది కర్ణులు ఎదురు వచ్చినా చావక తప్పదు. విజయ సారథినై నేనుండగా గాండీవాన్ని ధరించి అర్జునుడు వచ్చినపుడు నీమొర ఎవరూ ఆలకించరు. సంతోషంగా సంధి చేయటం

మంచిది. ద్రౌపదీ వస్త్రాపహరణ సమయంలో నీతొడలు విరగ్గొడతాననీ దుశ్శాసనుని రొమ్ముచీల్చి నెత్తురు తాగుతాననీ భీముడు చేసిన ప్రతిజ్ఞలు గుర్తులేవా'?

దుర్యోధనుడు కర్ణుని మాటలను విననట్లు నటిస్తూ ఈ కృష్ణుని భరతం పడితే గానీ పాండవుల మదం అణగదని తనలో నిశ్చయించుకొన్నాడు. కృష్ణుని మాటలనువినవలసిందనీ, కర్ణుని మాటలు విని చెడిపోవద్దనీ భీష్ముడు హితవు చెప్పాడు. కర్ణునిపై మీరందరూ ఇలా కత్తికట్టడం భావ్యం కాదని సుయోధనుడు యిలా అన్నాడు.

'మీరందరూ సంధిచేయమని చెబుతుంటే, భయాన్ని నూరిపోస్తుంటే నిజమైన బంధువైన కర్ణుడు నాకు చక్కటి మార్గం చూపాడు. ఇకపై ఇతడే రాజ్యాధిపతి' అని ఖండితంగా పలికాడు.

హితము పలుకుతూ తనమాటలుగా కృపాచార్యుడు ఇలా అన్నాడు' కురునాథా! నీరాజ్యాన్ని నీవు సూతపుత్రుని చేతనో, మరియొకరి చేతనో ఏలించుకోవచ్చు. మేమందరం నీదగ్గర తినడానికి వచ్చామని గేలిసేయడం భావ్యం కాదు. నీసొమ్ము తిని ఉండటం వల్ల మేము నీసూటిపోటి మాటలు పడవలసి వచ్చింది. యుద్ధం ఆసన్నమైంది. నీకోర్కె తీర్చడానికి మేము సిద్ధమే. యుద్ధానికి సహాయపడమని కోరవలసింది పోయి ఇలాదూరం చేసుకోవడం మంచిదికాదు. బుద్ధిః కర్మానుసారిణీ. రాజవంశంలో పుట్టి సూతునికొలువు కొలువవలసిన కర్మ నీకుపట్టింది. భీష్ముని, ద్రోణుని అశ్వత్థామను తూలనాడటం తగదు'.

నారదుడు తదితర పెద్దలు కూడ కర్ణుని చెలిమి మంచిది కాదని భీష్మాదులతో విరోధం గర్హించదగినదని చెబుతూ కర్ణుని శాపాలను ఏకరువు పెట్టారు. మారువేషంలో బ్రాహ్మణుడనని చెప్పి పరశురాముని వద్ద నేర్చుకొన్న విద్యలు యుద్ధంలో గుర్తురాకుండా శాపంపొందాడు. బ్రాహ్మణుని గోహత్యాపాతకంవల్ల యుద్ధభూమిలో రథం కుంకుతుందని మరోశాపం. దేవేంద్రుడు కూడా కర్ణుని కవచకుండలాలు హరించుకొని వెళ్ళాడు. కలహాభోజనుడనైన నేను కూడా సంధి చేసుకోమని చెబుతుంటే నీవు పెడచెవిని పెడుతున్నావు'- అన్నాడు నారదుడు.

భీష్ముడు దుర్మదాంధుడైన దుర్యోధనుని మందలిస్తూ యిలా అన్నాడు, 'ఈ రాజ్యమంతానాది. నేనుకాదంటే పాండురాజు, ధృతరాష్ట్రుడు రాజ్యాధిపత్యం వహించారు. అందువల్ల మీరు నూర్గురు పాండవులైదుగురూ నేను చెప్పినట్లు మీరు నడుచుకోవాలి. అయితే నిన్ను ఆపగలవారెవ్వరూ'? ఆపితామహుడు సృష్టిని సృష్టించి లయంచేసినట్లు నీవే పితామహుడవై మమ్మల్ని కడతేర్చు'- అన్నాడు. ద్రోణుడు భీష్ముని సమర్థిస్తూ 'సుయోధనా! భీష్ముడు చెప్పింది ధర్మసమ్మతం, మాకు కూడా జీవన భృతి కలిగించినది ఆయనయే. ఇరుపక్షాలవారు నాకు శిష్యులే. నాకెదురు లేదు. అర్జునుడు నాకు అశ్వత్థామతో సమానము. భీష్ముడున్నచోటనే ధర్మం వుంటుంది జయం కలుగుతుంది- అని హెచ్చరించాడు. ఆసభలో మిగతావారు కూడా భీష్ముని సమర్థించారు. జమదగ్ని మహర్షి కూడా భీష్ముని తన యిష్టం వచ్చినవారికి రాజ్య మిమ్మని సలహా యిచ్చాడు.

కర్ణుడు జమదగ్ని మహర్షితో నవ్వులాటగా మాట్లాడాడు. 'మునీశ్వరా! శుద్ధశ్రోత్రియులైన మీకు ఈ రాచకార్య ప్రసంగమేల? అంబను ఉభయ భ్రష్టురాలిని చేసిన నపుంసకునకు రాజ్యమెక్కడిది'? పంచపాండవులు చచ్చినదాకా ఈ కర్ణుడు నిద్రపోడు. నేను రాజరాజు పక్షం వదిలి పెట్టను- అన్నాడు. జమదగ్ని అతని మాటలకు కోపించి ఓరి! మా పరుశురాముడే యిక్కడ వుండివుంటే మాశ్రోత్రియత్వం నీకు తెలిసేది' అని సవాలు విసిరాడు. భీష్ముడు జమదగ్ని మహర్షిని సమర్థిస్తూ మీ శిష్యుడనైన నేనున్నాను గదా! అని కర్ణునితో మాటలేల? అని ఓదార్చాడు. కర్ణుడు మునిమాటలకు బెదిరిపోవలదని ఈతిట్లకు భయపడవలిసిన పనిలేదని దుర్యోధనునికి హితవు చెప్పాడు. దుర్యోధనుడు మునుల కందరికి నమస్కారం చేసి 'తపస్సు చేసుకునే మీకు మాజోలి ఏలా? యుద్ధంలో మాకు సహాకరించమని మేము కోరలేదు' అని గర్వంగా పలికాడు. దుశ్శాసనుడు అన్నకు ప్రోత్సాహకంగా ఇలా మాట్లాడాడు. 'సహోదరా! వీరి శాపవచనాలకు భయపడవద్దు భీష్మాదులందరూ పాండవ పక్షపాతులు. తమ మాట విననిచో వీరు నిన్ను కృష్ణునికి అప్పగించేలా ఉన్నారు. మనము సభచాలించి పోవుట

మంచిది. అనగానే కర్ణదుశ్శాసనులతో సుయోధనుడు సభవెడలి బయటికి వచ్చినాడు.

ధృతరాష్ట్రుడు మూర్ఛనుండి తెప్పరిల్లి భయకంపితుడైనాడు. విదురుడు దుర్యోధనుని సభాబహిష్కరణ వార్త అన్నకు తెలియజేసినాడు. ధృతరాష్ట్రుడు తానొక కలగంటిననీ, అందులో దుష్టచతుష్టయము కృష్ణుని బంధింపదలచగా ఆయన తన విశ్వరూపం చూపాడని చెప్పెను కృష్ణుడు ధృతరాష్ట్రుని గాంధారిని సేద దీర్చెను. గాంధారి కుమారుని సభకు పిలిపించింది తన వంతుమాటగా హితవు చెప్పిచూసింది. కామక్రోధాదులు నీకు శత్రువులు కానీ, పాండవుల కాదు. కుటుంబ కలహము మంచిది కాదని మీ తండ్రి తాత చెపుతున్నారు. కన్న కడుపుకాన నీకిన్ని మాటలు చెబుతున్నాను'- అన్నది గాంధారి. సమాధానంగా దుర్యోధనుడు 'పాండవులు కానీ కౌరవులు కాని ఏ ఒక్కరో వుండాలనీ నాతప్పు సైరించి దీవించ'మనీ కోరుకున్నాడు. తల్లి వద్ద శలవు తీసుకొని కృష్ణుని సాగనంపి సుయోధనుడు కొలువు నుండిబయటికివెళ్ళాడు. ధృతరాష్ట్రుడు కర్ణుని కౌగలించుకొని ఇకపై ఏమి కానున్నదో గదా! ఎవరు జయిస్తారో గదా! ఈవార్ధక్యంలో మాకు తోడుగావున్న కుంతీదేవి సహనాన్ని మెచ్చుకోవాలి అన్నాడు.

కౌరవపక్షంలో కూడా కర్ణాశ్వత్థామాది వీరులున్నారనీ దుర్యోధనునికి తోడ్పడతారనీ కృష్ణుడు ధృతరాష్ట్రునికి ధైర్యం చెప్పాడు. నీతోడు వుండగా పాండవులకు కొదువ లేదని కౌరవులు పాండవులచేత చిక్కినచో చంపక మానరనీ ఆ తండ్రి విలపించారు. కౌరవ సభలోని వారందరూ దుశ్శాసనుని శాసనాన్ని తలవొగ్గవలసిన అవసరం లేదని కృష్ణుడు హెచ్చిరించాడు. కాలగతిని తోసివేయజాలమనీ, దుర్యోధనుని మూలంగా తమకు ముప్పుతిప్పలు వచ్చాయనీ ధర్మాన్ని కాపాడవలసిన బాధ్యత కృష్ణునిపై వుందనీ భీష్ముడు నిర్ద్వందంగా చెప్పాడు. దుష్టచతుష్టయం కృష్ణుని బంధించాలని యత్నిస్తున్నట్లు సాత్యకి కృష్ణుని హెచ్చరించాడు.

అనుమానించినట్లుగా కర్ణ, శకున దుశ్శాసనులు ఖడ్గములు చేత బట్టుకొని వచ్చారు. భీష్ముడు చేటుకాలము దాపురించినదని కృష్ణుని లీలలు వారికి

తెలియవని తనలో అనుకున్నాడు సాత్యకి అన్నకు జరుగుతున్న అవమానాన్ని సహించలేక దుష్టచతుష్టయం పన్నాగాన్ని బహిరంగ పరిచాడు కర్ణాదులు విడివిడిగా వెళ్ళిపోయారు విదురుడిక కులనాశనంతప్పదని హెచ్చరించాడు. వారి కోరిక తీర్చుకోనిమ్మని కృష్ణుడు భీమ్మనితో అన్నాడు దుర్యోధనాదులను తీసుకురమ్మని ధృతరాష్ట్రుడు విదురుని పంపాడు కృష్ణుడు దరహాసం చిందిస్తూ-బావా! ఒక్కనినిగా చేసి నన్ను చంపాలని ఆలోచించావు నేను ఒంటరిగా మీచేతిలో చిక్కాను అని అట్టహాసం చేస్తూ విశ్వరూపాన్ని ప్రదర్శించాడు దుర్యోధనాదులు అది చూడలేక గడగడవణకి పోయారు మునులు బీష్మ విదుర ద్రోణులు ఆనందపారవస్యంతో తేలియాడారు ముసలిరాజు కోరగా కృష్ణుడు దివ్యదృష్టిని ప్రసాదించాడు ఆ విరాట్స్వరూపాన్ని చూసి ధృతరాష్ట్రుడు దానిని ఉపసంహరించవలసిందిగా కృష్ణుని ప్రార్థించాడు విశ్వరూపాన్ని చూసిన చూపులతో ఈ పాపప్రపంచాన్ని చూడలేనని ధృతరాష్ట్రుడు కోరుకున్నాడు. ధృతరాష్ట్రుడు యధాస్థితిని పొందాడు కాలుడు ఆకలిగొనియున్నాడనీ కురుక్షేత్ర సంగ్రామాన్ని ఎవరూ ఆపలేరనీ అన్నాడు భీష్మద్రోణులు అర్జునునితో తమకు యుద్ధం అనివార్యమైనందుకు బాధపడ్డారు ఇప్పుడేమీ చేయలేనని కృష్ణుడు తన అశక్తతను తెలియజేశాడు

తిరుగు ప్రయాణంలో కర్ణుని కలసి మాట్లాడి వెళ్ళాలని కృష్ణుడు నిశ్చయించుకున్నాడు అప్పుడే దుర్యోధనుని సాగనంపి కర్ణుడు తన సౌదానికి వెళుతున్నాడు నీతో ఏకాంతంగా మాట్లాడాలి ఈరాత్రికి విదురినింట వుంటాను నీవు వస్తావా? నన్ను రమ్మంటావా? అన్నాడు కృష్ణుడు నాజన్మరహస్యాన్ని గురించి మాట్లాడేందుకు కృష్ణుని పన్నాగమని కర్ణుడు గ్రహించి మీరు వెళ్ళేలోగా నేనే వచ్చి కలుస్తానని శలవు తీసుకున్నాడు

కురు సభలో జరిగిన విశేషాలను వివరంగా కుంతికి వివరించాడు కృష్ణుడు హస్తిన నుండి బయలుదేరే ముందు ఆమె వద్ద శలవు పుచ్చుకోవడానికి వెళ్ళాడు. యుద్ధం సమీపించిందనీ కురువంశ వినాశనం తప్పదనీ పాండవులు గెలుస్తారని చెప్పజాలనని పేర్కొన్నాడు బీష్మద్రోణులతో

పోరాడటం సులభసాధ్యం కాదనీ కొడుకు కోడంద్రతో కొండగుహాలలో దాగికొనుమనీ సలహా యిచ్చాడు.

కుంతి అల్లుని మాటలకు సమాధానం చెబుతూ ' నామనసులో మాట తెలుసుకోవాలని నీవలా అంటున్నావు! కొండగుహాలలో వున్నా రాజప్రాసాదాలలో వున్నా నాకుమారులు సుక్షత్రియులనిపించుకోవటం నాకు గౌరవం. పాండవుల తల్లినై దాయాదుల యింటిలో పదమూడు సంవత్సరాలు పడియున్నాను. ద్రౌపదిని గౌరవించవలసినదిగా ధర్మజునితో నామాటగా చెప్పు'- అని కుమారులకు తనమాటగా చెప్పమని కోరింది. కుంతి వెళ్ళిన కొంత సేపటికి ఆమె కుమారుడు కర్ణుడు కృష్ణ మందిరంలోనికి ప్రవేశించాడు. కర్ణజన్మ రహస్యాన్ని, రాధపెంపకాన్ని సవివరంగా కృష్ణుడు చెప్పాడు. కర్ణుడు పాండవాగ్రజుడు కావున అతడు రాజ్యాధికారాన్ని స్వీకరించేలా ధర్మజుని ఒప్పిస్తానని అటు కౌరవులకు యిటు పాండవులకు కావలసిన వాడవుకాన నీకే పట్టాభిషేకం చేయిస్తానని ఆశచూపించాడు. అంతకుమించి కర్ణుని ఆరవ భర్తగా ద్రౌపది స్వీకరిస్తుందని విశేషంగా చెప్పాడు. ధర్మజాదులు సేవలు చేస్తారని వూరించాడు.

కర్ణు డామాటలు విని- 'కృష్ణా! నాజన్మ విశేషాలు సూర్యునివల్ల కొంత విన్నాను. ఈనాడు నీవల్ల వూర్తిగా విన్నాను. నేను జన్మతః సూతకులంలో పెరిగాను. ఈనాడు రాజకుమారుడినని చెబితే నామనసు అంగీకరించడం లేదు. కామంతోనో, భయంతోనో, రాజ్యాధికారమమకారంతో నేడు సుయోధనుణ్ణి వదలివస్తే జనాలు మెచ్చరు. ఈ రాజ్యంపై నాకు యిచ్చలేదు. నన్ను, నాబలాన్ని నమ్మి వున్న రారాజును వదలి రేపోమాపో చావనున్న నేను పాండవ పక్షం వహించడం ధర్మం కాదు. ఓటమిభయంతో నేనలా చేశానని లోకం ఆడిపోసుకొంటుంది. పదమూడు సంవత్సరాలు సుయోధనుని పేర నేనే రాజ్యం చేశాను. నాకు రాజ్యార్హత లేదు. ధర్మరాజు రాజ్య పరిత్యాగం చేయడం సమ్మతం కాదు. అతడే రాజ్యపాలనాదక్షుడు. యుద్ధమనే యజ్ఞానికి అర్జునుడు హోత. కురుసైన్యం ఆయజ్ఞానికి ఆజ్యం. మిగతా కావలసినవి అధ్వర్యుడవైన నీవు సమకూర్చగలవు ఆనాడు నేను పాండవులను సభలో కించపరచినట్లు మాట్లాడినందుకు బాధపడుతున్నానని సమాధానం చెప్పాడు.

కృష్ణుడు కర్ణునితో వాదన కొనసాగిస్తూ యిలా అన్నాడు. 'కర్ణా! నాముఖప్రీతి కోసం ఏవో మాటలు చెప్పివెళ్తున్నావు పాండవులు భీష్మాదులైన మిమ్ములను యుద్ధంలో సంహరించడం తథ్యం! ఆ తర్వాత లాభం లేదు. ముందే మేల్కొనడం మంచిది'.

కర్ణుడు శ్రీకృష్ణుని మాటలను సమర్థిస్తూ- నీవు చెప్పినట్లు అంతా జరిగితీరుతుంది. ఇప్పుడు ఈమహా ప్రళయానికి దుర్యోధన, దుశ్శాసన శకునులు ప్రధాన కారకులు. నా మనసు పాండవుల పక్షం వహించడం లేదు' అన్నాడు. వినాశకాలంలో చెడు మంచిగా తోస్తుందని కృష్ణుడు పెదవి విరిచాడు. కర్ణుడు కృష్ణుని వద్ద సెలవందుకొని వెళ్లిపోయాడు.

కృష్ణుడు కుంతిద్వారా కర్ణునికి చెప్పిచూద్దామని ఎంచాడు. అయినా తల్లిదండ్రులు చెప్పిన మాట వినేవాడు కాదు కర్ణుడనుకొన్నాడు.

కుంతి కర్ణునికి పాండవ పక్షంలో చేరమని చెప్పడానికి కర్ణుని వద్దకు వచ్చింది. ఆమె తన మనసులో కర్ణార్జునులు తనకు సమానంగా భావించి తరలివచ్చింది. ఒక్క కర్ణుడే పాండవుల పట్ల అపకార బుద్ధి కలవాడు. అతనిని వారి కనుకూలం చేయాలని ఆమె కోరిక.

కర్ణుని జన్మవృత్తాంతాన్ని కుంతి అతనికెరిగించింది. తన అపరాధం మన్నించి పాండవులతో కలిసి రాజ్యమేలుకోమని చెప్పింది. ఆకాశవాణి కూడా ఆకాశంలో నుండి 'తథాస్తు' వచనం పలికింది.

కర్ణుడు తల్లితో వాదనకు దిగాడు. 'ఈ 13 సంవత్సరాలు లేని మమకారం ఇప్పుడెలా వచ్చిందని అడిగాడు. కన్నకుమారుని గంగలో వదలిన నాడు ఈ ప్రేమ ఏమైందన్నాడు. పంచపాండవులనే మాట అలానే వుండనీమన్నాడు. అయినా తల్లికి వాగ్దానం చేశాడు. యుద్ధరంగంలో అర్జునుడు చేత చిక్కినా చంపనని చెప్పాడు. `మా యిరువురిలో ఏ ఒక్కరు జీవించినా పాండవులు అయిదుగురనే మాట నిలుస్తుందన్నాడు. ఉపపాండవులను కూడ దయతో చూడుమని కుంతి కర్ణుని కోరింది. అర్జునుడు ఎట్లయినా ఇతనికి చిక్కడని ఆమె నమ్మకం పాండవులతో కలవమనడం తప్ప ఏపని అయినా

చేస్తానన్నాడు కర్ణుడు. కృష్ణార్జునులు కలిసివస్తే శత్రువులు భయపడినట్లే, పాండవులతో నేను కలిస్తే నవ్విపోతారని చెప్పి తల్లి వద్ద సెలవు తీసుకొన్నాడు.

పంచపాండవులు కృష్ణుడు మంతనాలాడుతున్నారు. ధర్మజుడు నిర్వేదంతో యిలా అన్నాడు. కృష్ణా! నీ రాయబార విశేషాలన్నీ విన్నాను. కౌరవులను చంపి రాజ్యాధికారం స్వీకరించాలనే కోరిక కలిగింది. అయినా దైవేచ్ఛను ఎవరూ ఆపలే'రన్నాడు. భీముడు తన ప్రతిజ్ఞలు నెరవేర్చుకొనే అవకాశం కలిగిందని పొంగిపోయాడు.

కౌరవ సభలో అతిరథమహారథుల ప్రస్తావన వచ్చింది. భీష్ముడు కర్ణుని అర్ధరథునిగా పేర్కొన్నాడు. గురుశాపం అందుకు కారణంగా చెప్పాడు. కర్ణుడు ఆగ్రహించి, భీష్ముడు యుద్ధంలో తనువు చాలించేంతవరకు తాను యుద్ధం చేయనని ప్రతిజ్ఞ చేశాడు. ఈ వార్తలు ధర్మజుడు ప్రతిహారి ద్వారా విన్నాడు.

శకుని పుత్రుడైన ఉలూకుడు దుర్యోధనుని పక్షాన పాండవుల వద్దకు రాయబారిగా వచ్చాడు. దుర్యోధనుని మాటలుగా యిలా చెప్పాడు.

'మీరు చేసిన ప్రతిజ్ఞలు నిలుపుకొనే ప్రయత్నం చేయండి. భీముడు సభలో నా తొడలు విరగగొడతాననీ, దుశ్శాసనుని రొమ్ము రక్తం త్రాగుతాననీ అన్నాడు. గుర్తు తెచ్చుకోండి. విరాటుని కొలువులో మీ వేషాలు అందరికీ గుర్తే. మీరు నిజంగా క్షత్రియులే అయితే యుద్ధానికి రండి. అర్జునుని బలం చూసి గర్వించ వద్దు. ధర్మపత్ని సభలో పడిన అవమానాలు మరచిపోయి మీరు ప్రవర్తించడం హేయం. కృష్ణుడు మాయలాడు'.

భీముడాగ్రహంతో పైకి లేచాడు. దూతగా వచ్చాడు కాబట్టి వదలివేశాడు. కృష్ణుడు కూడా-అతనిని వారించాడు. దుర్యోధనునికి తన మాటగా నాలుగు మాటలు చెప్పి పంపాడు. భీముడు తప్పకుండా నీ ఊరువులు తెగగొడతాడు.

నిన్ను కాపాడేవారు ఎవరూ లేరు.' ఆ మాటలు విని అర్జునుడు తన మాటలు చెప్పమని దూతతో యిలా అన్నాడు.

'భీష్మాదులను, కర్ణుని, నిన్ను యుద్ధంలో సంహరించక తప్పను. వారి భుజబలాన్ని నమ్మి నీవు పొంగిపోతున్నావు. శ్రీ కృష్ణుడు అంతా చక్క బెట్టగలడు. నీ కోసం కురువృద్ధుడైన భీష్ముని చంపవలసి వస్తోంది.'

ఈ మాటలు విని ఉలూకుడు సభలో నుండి నిష్క్రమించాడు.

ధర్మరాజు కృష్ణునితో మంతనాలు కొనసాగించాడు :

'బావా! నీ సహాయంతో మేము జయాన్ని సాధించడం ఖాయం' అన్నాడు. భీముడు కోపంతో ఊగిపోతూ - 'ఆ రారాజు తన కుమారులు తమ్ములు యుద్ధంలో చనిపోగా, తోడునీడ లేక తల్లడిల్లి పోతా'డని సవాలు విసిరాడు. భారతరణరంగానికి సూచన మొదలైందని కృష్ణుడు పలికాడు. ఇంతలో విదర్భ దేశాధిపతియైన రుక్మి పాండవుల వద్దకు వచ్చాడు. గొల్లవాడైన కృష్ణుని నమ్మ వద్దనీ, అర్జునుని గెలిపించడానికి తాను స్వయంగా వచ్చాననీ గంభీరంగా చెప్పాడు. భీముడతని చంపడానికి లేచాడు.

కృష్ణుడతనిని వారించి రుక్మిణిని చూసి నేను వీనిని వదలి వేస్తున్నానని హెచ్చరించాడు. అర్జునుడు కూడా రుక్మిని మందలించాడు. కృష్ణుని నిందించడం భావ్యం కాదని రుక్మిని మందలించాడు. నీ సాయం మాకక్కరలేదు పొమ్మన్నాడు. ఖాండవ దహన సమయంలోను, గోగ్రహణ సమయంలోను నీ సహాయం ఏమైందని గేలిచేశాడు. రుక్మి అది భరించలేక సుయోధనుని వద్దకు సహాయం చేస్తానని బయలుదేరివెళ్లాడు.

యుద్ధం రేపు జరుగుతుందని ప్రకటన వెలువడింది. కృష్ణుడు విజయ సారథియైనాడు. కురుక్షేత్రసంగ్రామ భూమిలోకి కృష్ణార్జునులు ప్రవేశించారు. అర్జునునికి కురుసైన్యంలోని హేమాహేమీలను కృష్ణుడు చేసైగచే చూపుతున్నాడు:

'అడుగో భీష్ముడు. ఇతడే ద్రోణాచార్యుడు. అతడు అశ్వత్థామ! అక్కడ కర్ణదుర్యోధనులు ముచ్చటలాడు కొంటున్నారు.' అని పరిచయం చేశాడు.

అర్జునుడు నిరుత్సాహంగా యిలా అన్నాడు : 'జగన్నాధా! ఇందులో కొందరు బంధువులు, కొందరు గురువులు, యింకను తమ్ములు, కుమారులు వున్నారు. వీరిని చంపి రాజ్యం పొందడం కంటె బిచ్చమెత్తుకొని జీవించడం సంతోషంగా భావిస్తాను. భీష్మునిపై, ద్రోణునిపై, కృపునిపై, అశ్వత్థామపై శకునిపై బాణాలు ఎలా వేసేది?' అని కృష్ణుని ప్రశ్నించాడు.

కృష్ణుడు అర్జునకు ధైర్యం కలిగించడానికి ఇలా అన్నాడు. 'అర్జునా! చంపేవాడు, చచ్చేవాడు అంటూ లేరు దేహస్వభావం అశాశ్వతం. నీవు శత్రువులను సంహరించు.'

అర్జునుడు తనకు రాజ్యకాంక్ష లేదనీ, ముందరి రాజు లెందరో రాజ్యాలేలారనీ, అది అశాశ్వతమనీ, పరలోకగతులు కలుగవనీ వాపోయాడు. శ్రీకృష్ణుడు విశ్వరూప దర్శనం అర్జునునికి కలిగించాడు. అర్జునుడు చేతులు జోడించి ఆ విరాటస్వరూపానికి నమస్కరించాడు.. కర్తవ్యతా దీక్షవహించాడు.

ధర్మరాజు అస్త్రాలు వదలిపెట్టి కురుపక్షం వైపు వెళ్ళాడు. తమ్ములు ఆశ్చర్యంగా చూస్తున్నారు. ఇలా బేలతనంతో వెళ్తున్నాడేమిటా? అని నివ్వెరపోయారు. భీముడు ధర్మజునికడ్డు తగిలాడు. దేవాసురులు వచ్చినా యుద్ధంలో గెలుపు తథ్యమని నమ్మపలికాడు. నకుల సహదేవులు భీమునివలె మాట్లాడి తమకు తలవంపులు తీసుకు రావద్దన్నాడు.

భీష్ముడు సేనానాయకులకు ధైర్యం నూరిపోశాడు. ఎప్పుడైనా చనిపోవలసిందేననీ, యుద్ధంలో వీరమరణం పొందడం క్షత్రియోచితమనీ చెప్పాడు.

ధర్మజుడు భీష్మునికి సాంజలియై నమస్కరించాడు. భీష్ముడు అతనిని కౌగలించుకొని నీవు రావడం మేలైంది. దేవతలు కూడా మెచ్చుకొంటారు. లేకపోతే నా శాపానికి గురికావలసి వచ్చేది. యుద్ధం మీపక్షాన చేయమనడం తప్ప ఏదైనా వరం కోరుకోమన్నాడు.

యుద్ధానికి ఆజ్ఞ యిమ్మని ధర్మజుడు ప్రార్థించాడు. మమ్ము పోషణ [illegible] చేసిన నీవు ఎదురు నిలబడిన మమ్ము క్షమించమన్నాడు. భీష్ముడు తన

నెదిరించడం రుద్రునికి కూడా సాధ్యం కాదని చెప్పాడు. ధర్మజుడు ద్రోణునికి నమస్కరించాడు. ఆయన తన మరణ రహస్యాన్ని వివరించాడు. అలానే కృపాచార్యుని, శకునిని కలిశాడు. తమ పక్షం వహించి రావడానికి ఎవరైనా సిద్ధంగా ఉంటే రావచ్చునని ధర్మజుడు ప్రకటించాడు. యుయుత్సుడు తన బలంతో పాండవపక్షంలో వచ్చి చేరాడు. భీష్ముని మరణం వరకు తమ పక్షానికి రమ్మని కర్ణుని కృష్ణుడు ఆహ్వానించాడు. కర్ణుడు అందుల కంగీకరించలేదు. భీష్మాదు లెంతమంది ఎదురు వచ్చినా పాండవులకు జయం కలుగుతుందని శ్రీకృష్ణుడు భరతవాక్యం పలికాడు.

——— * ———

# కాళ్లకూరి నారాయణరావు

కాళ్లకూరి నారాయణరావు పశ్చిమ గోదావరిజిల్లా మచ్చపురిగ్రామంలో 1871 ఏప్రిల్ 28న జన్మించారు. తండ్రి బంగారురాజు కవి, పండితులు. బాల్యంలో ఎన్నో చిన్నచిన్నవృత్తులు చేపట్టారు, ఆదిభట్ల నారాయణదాసు ప్రభావంతో కొంతకాలం హరి కథలతో జీవనం సాగించారు. మరికొంతకాలం కళాశాలలో తెలుగు అధ్యాపకులుగా వ్యవహరించారు. చిన్నపాటి ప్లీడరుగా పనిచేశారు. ''మనోరంజని' సాహిత్యమాన పత్రిక సంపాదకత్వం నిర్వహించారు.

నారాయణరావు నాటకాలు ప్రసిద్ధాలు: చింతామణి వరవిక్రయం, చిత్రాభ్యుదయం, పద్మవ్యూహం, మధుసేవ సంసారసారం ప్రముఖాలు. చింతామణి, వరవిక్రయం సినిమలుగా రూపొందాయి. వరవిక్రయం 1922లో ప్రకటించారు. లుబ్ధాగ్రేసర చక్రవర్తి, ధూమశకటవము దసరాతమషా, పుష్కరాలకబుర్లు, గణపతిగత్తర రూపాయెగమ్మత్తు యిందులో ప్రముఖాలు. జార్జి రాజసూయము, పెద్దలనాటి ముద్దుల కథలు ప్రతాపరుద్రమదేవి యితర రచనలు. పుష్పగిరి పీఠాధిపతి వీరికి 'మహాకవి' బిరుదు యిచ్చారు. సాహిత్య సామాజిక బాధ్యతలను నారాయణరావు స్వీకరించి ఏడు నాటకాలు, పదమూడు ప్రహసనాలు 1906-1927 సంవత్సరాల మధ్య కాలంలోవ్రాశారు గురజాడ కన్యాశుల్క సమస్యపై వ్యవహారిక భాషలో కన్యాశుల్క నాటకం వ్రాశారు. నారాయణరావు వరకట్న సమస్యను వస్తువుగా స్వీకరించి గ్రాంధికంలో వరవిక్రయం వ్రాశారు. నారాయణరావు 1927 జూన్ 27న సిద్ధాంతం గ్రామంలో స్వర్గస్థులయ్యారు.

# వరవిక్రయం గురించి

పురుషోత్తమరావు గాంధేయవాది. ఆయనకు యుక్తవయస్సువచ్చిన ఇద్దరుకుమార్తెలు - కాళింది, కమల. వారి పెళ్లిళ్లకోసం కట్నంయివ్వడానికి ఆయన సంఘసంస్కరణాభిలాష అందుకు అంగీకరించడం లేదు.

పెండిండ్ల పేరయ్య, వివాహాల వీరయ్య బేరసారాలు కుదర్చడంలో ఘనులు తండ్రిపడే కష్టాలనుచూసి కుమార్తెలు వ్యథ చెందేవారు. పెండింఢ్ల పేరయ్య తనవద్దవున్న చిట్టాలోనుంచి సింగరాజు లింగరాజుగారి అబ్బాయి సంబంధం మంచిదని చెప్పారు.

లింగరాజు లోభి. పైసాఖర్చుపెట్టడు. లింగరాజు వద్ద పేరయ్య పురుషోత్తమరావు సంబంధం ప్రస్తావించారు. ఐదువేలకట్నం, ఆపై లాంఛనాలు మాట్లాడాడు అయినా వీరయ్య, పేరయ్య చివరకు వేలంపాటపెట్టించి 5,500 రూపాయలకు పెళ్లికుదిర్చారు, పెళ్ళికొడుకు బసవరాజు.

పురుషోత్తమరావు అప్పుకోసం ప్రయత్నించాడు. పిత్రార్జితమైన భూమిని ఎనిమిదివేల రూపాయలకు అమ్మివేశాడు. కట్నమిచ్చి పెళ్లిచేసుకోవడం కాళిందికిష్టం లేదు. సహేతుకంగా తల్లితో ఈ విషయం వాదించింది. పురుషోత్తమరావు కాళిందికి నచ్చజెప్పాడు. డబ్బు పేరయ్యద్వారా లింగరాజుకు పంపించాడు పొలం అమ్మి తెచ్చిన డబ్బుతో తనపెళ్లి చేస్తున్న విషయం తెలుసుకొని కాళింది బావిలో దూకింది. కాళిందిచావుకు లింగరాజు కారకుడని ప్రకటించారు. రెండోపిల్లను తనకుమారునికి చేసుకొంటే ఈ కేసుమాఫీ అవుతుందని పేరయ్య సలహాయిచ్చాడు.

పేరయ్య ఎలానో కమల పెళ్ళికి తల్లిదండ్రుల్ని ఒప్పించాడు. పెళ్లిలో లింగరాజు నానాగొడవ పెట్టాడు. ఐదు రోజులు పెళ్ళి వైభవంగా జరిగింది.

మూడేండ్లు గడిచినా కమల కాపురానికి వెళ్లలేదు. లింగరాజు కోర్టు వారిని ఆశ్రయించాడు కమల న్యాయస్థానంలో వాదించి వరకట్నదురాచారాన్ని తూర్పారబట్టింది. భర్తను తాను వేలం పాటలో కొన్నాను గాబట్టి భర్త తన యింటికి రావాలని పట్టుబట్టింది. లింగరాజు మనసుపరివర్తన చెందింది. దావారద్దు చేసుకొని కమలను తనకోడలుగా స్వీకరించాడు. కథ సుఖాంతమయింది.

రుషోత్తమరావు తమ కుమార్తెల వివాహము కోసం వరాన్వేషణలో ఎన్ని బాధలు పడిందీ సరళగ్రాంధికంలో అక్కడక్కడా పద్యాలు వ్రాస్తూ రసవత్తరంగా రచించారు. ఇది పది అంకాల నాటకం

# 8. వర విక్రయం

## సంక్షిప్త గ్రంథం

పురుషోత్తమరావు గాంధేయ వాది. వారి యింట్లో చరకాగానం నిత్యం వినిపిస్తూ వుంటుంది. ఆయన భార్య భ్రమరాంబ. ఆయనకు యుక్తవయస్కులైన ఇద్దరు కుమార్తెలు కాళింది, కమల. వారి పెండ్లిండ్లు చేయటానికి ఆయన అహర్నిశలూ అల్లుళ్లను వెదకటానికే తిరుగుతున్నాడు. కట్నాలు పోయందే అల్లుళ్లు దొరకని కాలమది. ఆడు బిడ్డలను ఎందుకు కన్నామా అని వ్యధ చెందే రోజులు. సంతలో పశువులువలె పెండ్లి కొడుకును వ్యాపార మార్గంలో కొనవలసిందే. తిండి తిప్పలుకూడా మాని ఆడబిడ్డల గన్నతండ్రి అలమటించవలిసిందే.

పురుషోత్తమరావు కాళ్లు అరిగేలా కాలేజీ అంతా కలియదిరిగాడు. కానుకు పనికిరాని కుర్రవాడుకూడా కొండవీద ఎక్కి కూర్చొనివున్నాడు. స్కూలుఫైనలువారికి రెండు వేలూ, ఇంటరువానికి మూడు బి.ఎవానికి నాలుగు ఆస్తివుంటే అంతకు రెట్టింపు. రైలు తరగతులలో వలె రేట్లు నిర్ణయించి వున్నారు. కట్నంతో సరిపోదు. కానుకలకు కొదవ లేదు. మోటరు సైకిలు, రిస్టువాచీ, గోల్డురింగు, బూటు, సూటు, ఒకటేమిటి అన్నీ కావాలంటారు ఒకడు తనను బి.ఎ.బి.యల్ దాకా చదివించమంటే, మరొకడు సీమ చదువులకు పంపమంటాడు. ఇలా అసలుకు కొసరు తోడు. వరుల అవలక్షణాలు లెక్కలేనన్ని. క్రాపు పక్కపాపిడి లేని వాడులేడు. కాఫీ హోటళ్ల బిల్లులు లేనివాడు లేడు. సిగరెట్లు, బీడీలు, కిళ్ళీలు, చలవఅద్దాలు సరేసరి.

తల్లిదండ్రులు మగపిల్లలను కట్నాలకోసం చదివిస్తూ పెండ్లి అయిన మర్నాడు మాన్పిస్తున్నారు అన్నాడు పురుషోత్తమరావు.

అలా అయితే ఆచూపుడు గుర్రాలు మనకు అక్కరలేదు. మీతో బాటు సంఘసంస్కర్తల పిల్లలను వెదుకుతామని భ్రమరాంబ అంది.

ఏమీ ప్రయోజనం లేదు. ఉపన్యాస వేదికల మీద మాత్రమే వారి పరాక్రమం. బాల్య వివాహాలు వద్దన్న బాపిరాజుగారు ఆరేండ్ల పిల్లను అరవైయేండ్ల ముదుసలికి నాలుగో పెండ్లివానికిచ్చి చేశారు. స్త్రీ పునర్వివాహం కోసం పాకులాడే శివయ్య చెల్లెలి భర్త చావగానే వంట మనిషిగా కుదిర్చాడు. అందువలన ఎవరిని అడిగినా నా కిష్టమే గాని మా యింట్లో వాళ్లు పడనివ్వరని తప్పించుకుంటారు అన్నాడు పురుషోత్తమరావు.

ఆ వూరిలో పెండ్లిండ్లు పేరయ్య, వివాహాలు వీరయ్య పెండ్లిండ్లు కుదర్చడంలో ఘటికులు. కాళిందికి 13వ యేడు. కమలకు 12వ యేడు. ఈ మాఘ మాసంలో ఇద్దరకీ పెండ్లిండ్లు చేయాలని భ్రమరాంబ భర్తను బ్రతిమాలుతోంది.

అల్లుడు దొరకడం అంత సులభం కాదని, అప్పిచ్చినవాడు, అల్లుడు అద్దెయింటి యజమాని పుస్తెకట్టని భర్తలు. అందుకే అల్లునిబాధ పడలేక హరిహరులంతటి వారలుకూడా కూతుళ్లను కనడం మానివేశారని పురుషోత్తమరావు చమత్కరించాడు.

ఈ మాటలు వింటూ కాళింది కమల మరింత దుఃఖపడ్డారు. ఆడపిల్ల పుట్టి ఏమి ప్రయోజనం. తండ్రికి కట్నబాధ తల్లికి వియోగ బాధ కన్యకు మరొకరి యింట దాస్యబాధ తప్పనివని కమల కాళిందితో అంది. కాళింది ఆ మాటను సమర్థిస్తూ వరకట్నం లేకుండా పెండ్లి కాని ఈ రోజులలో రాజుగారి కుమార్తెగా కూడా పుట్టకూడదని అంది. లేదా భర్తలకు దాస్యం చేసే కంటే వివాహం మానుకొని రాట్నం తిప్పుతూ యోగినులవలె కాలం గడపవచ్చునని, కమల నిస్పృహతో అంది. కాళింది అందుకు ప్రతి సమాధానంగా వరకట్నం అడిగే వ్యక్తిని పెండ్లాడనని రాట్నం సాక్షిగా ప్రమాణం చేసింది. ఇంతలో పేరయ్య రానేవచ్చాడు. కాళింది కమలలను చూసి సంబర పడ్డాడు. పురుషోత్తమరావు పిలుపు మేరకు ఆయన వచ్చాడు. భ్రమరాంబ వారి మాటలు వింటూ నించుంది. కమల, కాళింది లోపలికి వెళ్లారు.

వరకట్న నిషేధ సంస్కరణ వాదులలో తానొకణ్ణి అని పురుషోత్తమరావు కుండబద్దలు కొట్టినట్లు చెప్పాడు. కట్నం లేకుండా సంబంధం రావడం ఒట్టి పిచ్చి అని పేరయ్య ఉదాహరణంగా చెప్పాడు. పెద్దపెద్ద వాళ్లు బేరాలతో పనిలేకుండా బల్లమీద రేట్లు రాయించి పెట్టారు. షాపులలో వస్తువులకు రేట్లు అంటించినట్లు పెండ్లి కుమారుల ముఖాలమీద వ్రాసి పెడతారని పేరయ్య నిష్కర్షగా చెప్పాడు. మాటల సందర్భములో చదువు సంప్రదాయము చక్కదనమూ సంపత్తూ కలిగినవరుడు కావాలని పురుషోత్తమరావు దంపతులు పేరయ్య చెవిలో వేశారు. నాలుగూ వున్న వాణ్ణి బ్రహ్మదేవుడు కూడా తీసుకురాలేడని పేరయ్య నిర్ద్వందంగా చెప్పాడు.

పేరయ్య తన చిట్టా విప్పాడు. మంత్రిప్రగడవారి సంబంధము, బాపిరాజుగారి సంబంధము, నాదెళ్ల వారి సంబంధము ఇలా ఒకటికి నాలుగు సంబంధాలు ఏకరువుపెట్టాడు. అయితే అందరికీ ఏదో ఒక లోపం వుంది. అయినా సింగరాజు లింగరాజుగారి దత్తపుత్రుడు బాగానచ్చాడని పేరయ్య ఆశజూపాడు. స్కూల్ ఫైనల్ చదువుతున్న అతడు చూపరి. వయస్సు 16 సంవత్సరాలు. ఎలానో సరిపెట్టుకోవాలి. అయితే లింగరాజుగారు కట్నం దగ్గర మహా మొండి మనిషి. అయినా ఎలానో లొంగదీస్తానని చెప్పి పేరయ్య శలవు తీసుకున్నాడు.

సింగరాజు, లింగరాజు ఆవూర్లో మంచి వడ్డీ వ్యాపారి క్రింద లెక్క. వట్టి పిసినారి. రోజూ పిడకలు, వంట కట్టెలు, పొయ్యి బొగ్గులు, కొబ్బరికాయలు లెక్కపెట్టుకునే మనిషి. వడ్డీలు గుంజటంలో అసాధ్యుడు. దస్తావేజులు వ్రాయించుకొని కోర్టుకు వెళ్లడానికి వెనుదీయని మొండివాడు. ప్రాణం పోయినా ఫరవాలేదు. డబ్బు వదలకూడదనుకునే లోభి. 'ధనమూల మిథం జగత్' అనేది ఆయన ఊపిరి. ధనాన్ని పాడు పొట్ట కొరకు, బట్ట కొరకు లంకపొగాకు చుట్టకొరకు ఖర్చు చేసేవారు మతిలేని వారని ఆయన నమ్మకం కులలోపగుణలోపాలు పోగొట్టుకోవడానికి ధనం ప్రధానం. ఆధనాన్ని తలలు మార్చి అయినా, కొల్లగొట్టి అయినా కూడబెట్టాలి. దివాలా తీయించి వడ్డీలు పెంచి సాధించిన ధనాన్ని లింగరాజు రాత్రుళ్ళు మేల్కొని

రామకీర్తనలు పాడుతూ కాపాడుకునే గట్టివాడు. పరువు ప్రతిష్టలు మంట కలిపినా ఫరవాలేదు. పొట్ట కోసం ఖర్చు పెట్టడు. బంధువులు తనఇంట్లో విస్తరివేసి ఎరుగరు. కలువు పెరిగినట్లు పాదులు పెరిగినట్లు వడ్డీ పెరుగుతుంటే ఆయన ఆనందం చెప్పనలవికాదు. అనలుకంటె వడ్డీ తీపి. లక్ష్మీదండకం చదవందే ఆయన నిద్రపోడు.

ఆ పూట వంటసామానులు యిప్పించమని వంటల ఘంటయ్య లింగరాజుగారిని వేడుకున్నాడు. నిన్నరాత్రి మిగిలిన సామానుల పట్టీ లెక్క చూచుకొని ఆపూట విషయం ప్రస్తావించాడు. కరివేపాకు చెట్టుమీద కాకిగూడు పడగొట్టి ఆపూట వంటకట్టెలు సమకూర్చుకోమని లింగరాజుగారు ఆజ్ఞాపించారు. వంటలవాడు పాపం అన్నాడు. లింగరాజుకు కోపం వచ్చింది. ఇంతలో లింగరాజు కొడుకు బసవరాజు వచ్చాడు. పేనాకావాలని పట్టుపట్టాడు. అత్తవారి నడిగి తీసుకుందాంలే అన్నాడు లింగరాజు. అసలు అయ్యవార్లు పిల్లలను పాడుచేస్తున్నారు. కట్నంకోసం వీడి చదువు కొనసాగించాల్సి వస్తోంది. కానీ, లేకపోతే లింగరాజు మాన్పించేవాడే. తాను మూడు పెండిండ్లు చేసుకొని కట్నం క్రింద 14 వేలు సంపాదించాడు.

ఇంతలో ఆశీర్వచనాలు పలుకుతూ పేరయ్య లింగరాజు వద్దకు వచ్చాడు. పెండ్లి విషయం ముందే ప్రస్తావిస్తే లాభంలేదని పాతికవేలు బదులిమ్మన్నాడు. వడ్డీ బేరం కుదుర్చుకుని అప్పుసంగతి పూర్తి చేశాడు. మాట వరుసకు పిల్లవాడి పెండ్లి ప్రస్తావన తెచ్చాడు. ఏదైనా మంచి సంబంధం చెప్పమని లింగరాజు బ్రతిమాలాడు. పుణ్యమూర్తుల పురుషోత్తమరావుగారి సంబంధం ప్రస్తావించాడు. పేరయ్య చక్కగా చదువుకున్న అందాల బొమ్మ అన్నాడు. అవన్నీ నాకు అక్కరలేదు. ఇంటిపనులన్నీ చేసిపెట్టి తిట్టినా పడివుండి ఒక్కపూట తిండితినే పిల్ల కావాలన్నాడు లింగరాజు. ఆ పిల్ల అచ్చం అలాంటిదే అన్నాడు. పేరయ్య కట్నం సంగతి ప్రస్తావనకు వచ్చింది. పది సంవత్సరాలు రెవిన్యూఇనస్పెక్టరు ఉద్యోగం చేసిన పురుషోత్తమరావు సహాయ నిరాకరణోద్యమంలో ఉద్యోగం మానివేసి పిత్రార్జితం పది ఎకరాలు మీద బ్రతుకుతున్నాడు. ఆ పది ఎకరాలు తనకు వ్రాసి యివ్వమని లింగరాజు

కొసిరాడు. వెయ్యిన్నూట పదహార్లతో ప్రారంభమై బేరం 5 వేలు దాకా నడిచింది. లాంఛనాలు అలకపాన్పు, ఆషాఢ పట్టీ సరేసరి. లాటరీ తగిలిందని సంతోషపడ్డాడు. లింగరాజు వంటవాణ్ణి మాన్పించవచ్చుననుకున్నాడు.

లింగరాజు పడక గదిలో వున్న తనవడుచు భార్య సుభద్ర వద్దకు వచ్చాడు. ఆమె రుసరుసలాడుతోంది. నా గొంతుకోసి మా అమ్మ మెడలు విరిచి ఈ పెండ్లి చేసిందని నిష్కర్షగా చెప్పింది. విద్యావయోరూపాలు వదిలి భాగ్యమొక్కటే చూసి ఈ పిసినిగొట్టుతో మా అమ్మ నాపెండ్లి చేసింది అని సుభద్ర విసుక్కుంది.

లింగరాజు పిల్లవాని పెండ్లి చూపుల విషయం ప్రస్తావించాడు. పురుషోత్తమరావుగారి సంబంధము కుదురబోతోందని చెప్పాడు.

లింగరాజుగారి కచేరి చావడిలో పెండ్లి చూపుల బేరం మొదలైంది. పురుషోత్తమరావు, లింగరాజు, బసవరాజు, పేరయ్య, వీరయ్య కూచొని మాట్లాడుకుంటున్నారు వీరయ్య, పేరయ్య ఒకరి మీద ఒకరు వేలంపాట పెంచి ఐదువేల దాకా సాగదీశారు. బజారులో గుడ్డల వేలము వలె పెండ్లికొడుకు వేలం చూసి బసవరాజు ఆశ్చర్యపోయాడు. అది కేవలం కుట్ర మాత్రమే చివరకు 5500 రూ రొక్కము, రవ్వల వుంగరము వెండి చెంబులు, వెండి కంచము వెండి పావుకోళ్ళు లాంఛనాలతో ఐదు దినాల పెండ్లి ఖాయం చేసుకున్నారు. బయానా కింద పదిరూపాయలు పురుషోత్తమరావు జమకట్టాడు. ఆ తరువాత అన్ని వక్కాణాలు వ్రాత కోతలు వ్రాసుకొని లింగరాజు చేవ్రాలుతో రసీదు వ్రాసియిచ్చాడు. చిరంజీవి సౌభాగ్యవతి కాళిందిని చి బసవరాజు నకు చేసుకొనుటకు నిర్ణయించుకొన్నట్లు వ్రాసుకున్నారు. తాతగారు కాళింది పేర వ్రాసి యిచ్చిన దస్తావేజును ఒకసారి పంపమని పురుషోత్తమరావుతో లింగరాజు ప్రస్తావించాడు.

వీరయ్య పేరయ్య కేవలం తమ కమీషను కోసం ఈ వేలం పాట నాటకం ఆడారు. పురుషోత్తమరావు అమాయకుడు కాబట్టి అది గమనించలేదు. కట్నంలో పేరయ్య ఐదువందల కమీషను వీరయ్య భాగం వీరయ్యది.

కాళింది కమలలు బసవరాజు ఫోటో చూస్తూ ఎకసెక్కా లాడుకున్నారు. ఆ ఫోటో ముందుగా కమల చూసింది విశాలమైన కనులు, తీర్చిన కనుబొమ్మలు, ఉన్నతలాలటము, అందమైన నాసిక ఉన్న ఈవరుడు మా అక్కకు లభించటం అదృష్టమే అని కమల మురిసిపోయింది. ఇదిగో ఐదువేలా అయిదువందల బావ అని కాళిందికి ఫోటో చూపించింది. పెండ్లి పత్రికలో వేయించుటకై ఇద్దరి ఫోటోలు తీయించారు. ముహూర్తము యింక మూడు వారాలు వుంది. కట్నం సొమ్ము ముందు పంపితేకానీ పనులు మొదలు పెట్టమని లింగరాజు వర్తమానం పంపాడు పురుషోత్తమరావు వూరంతా తిరిగి చేబదులుకోసం ప్రయత్నించాడు. లంచంవలే రహస్యంగా యివ్వటం ఎందుకని భ్రమరాంబ అడ్డుపడింది. పెండ్లిరోజు అందరిముందు ఘనంగా చదివించాలి కానీ ఇది ఏమిటని ప్రశ్నించింది. నలుగురిలో నగుబాటుకన్నా ఇదేమేలని పురుషోత్తమరావు సమర్థించాడు.

అప్పుదొరకడం ఎంత కష్టమో పురుషోత్తమరావు వివరించాడు. అప్పుకోసం మానాభిమానాలు చంపుకోవాలి. విసుగు, కోపం విడిచి పెట్టాలి. వడ్డీ ఎంతయినా తల ఒగ్గాలి. నీవే దేవుడివని పొగడాలి. అప్పుడుగాని అప్పు పుట్టదు. చివరకు పదిఎకరాల భూమి తనఖా పెట్టుకుని ఐదువేలు యిస్తామన్నారు. ఇక లాభం లేదనుకొని పురుషోత్తమరావు భూమి అమ్మివేయడానికి సిద్ధపడ్డాడు. అమ్మబోతే అడివి, కొనబోతే కొరివి అన్నట్లు 7500రూ. కన్నా ఎక్కువరాలేదు. పేరయ్య ఈ విషయంలో కూడా సహాయపడ్డట్టు నటించాడు. అనుకోకుండా పేరయ్య అల్లుడు వచ్చాడు. గృహస్థులను ఆదుకోటంలో తప్పులేదని 8000కు తన పేర వ్రాయించమని అన్నాడనీ పేరయ్య చెప్పాడు.

ఎంతలేదన్నా పదివేలు వస్తుందనుకున్నాను. పోనీలే ఎవరోకాదు మీ అల్లుడు కాబట్టి నాకు యిష్టమే. అన్నాడు పురుషోత్తమరావు ఇందులో కనీసం పేరయ్య వాటా రెండువేలు వుంటుంది. ప్రస్తుతం అల్లుడి పేర వ్రాయించి ఆ తర్వాత పది రోజులకు తన పేర ఫిరాయించుకుంటాడు. నిఘ పేదలు జీవిస్తున్న ఈ కాలంలో భూమి పోయినంత మాత్రాన

చింతించవలిసినది లేదని పురుషోత్తమరావు సరిపెట్టుకున్నాడు. భగవంతునిపై భారంవేసింది భ్రమరాంబ.

పెళ్లికూతురు కాళిందికి ఈ వివాహం ఇష్టంలేదు. కులము, రూపము లేనివారివలె యింత దైన్యంగా వరకట్నమిచ్చి వివాహం చేసుకొవలసిన కర్మ ఏమిటని ఆమె తల్లితో చెప్పి బాధపడింది. భ్రమరాంబ అందుకు అంగీకరించలేదు. కొంపాగోడు అమ్ముకొని సంతకుపోయినట్లు తండ్రులు వెళ్లి కుమార్తెలకు భర్తలను తెచ్చుకొంటున్నారు గదా అని ఆమె బిడ్డను ఓదార్చింది. అడిగేవారికి భయంలేకపోతే, ఇచ్చేవారికి సిగ్గులేదా వరకట్న నాటకంలో మనం కూడా పాత్రధారులమేనా అని కాళింది ప్రశ్న. అప్పువలె గయలో దక్షిణవలె, కన్నతండ్రి తిథివలె కట్నం తప్పనిసరి అని భ్రమరాంబ సమాధానం. ఇంటి ముందర దేవాలయముండగా తిరుపతికి మొక్కులు తీర్చడానికి వెళ్లినట్లు కులదీపకులైన వారుండగా పరువులేని కట్నపిశాచులను వెదుకుతూ పరుగెత్తడం దేనికి? అని కాళింది వాపోయింది. ఇప్పటి దేశకాల పరిస్థితులు ఆమెకు తెలియవు. పిండిబొమ్మ అయినాసరే పిల్లనిస్తామంటే కట్నానికి చేయి చాచేరోజుల్లో కట్న మీయకుండా పుస్తికట్టేవరుడు లోకంలో కనబడతాడా అని భ్రమరాంబ వివరించింది.

కట్నం కోరివచ్చిన గాడిదతో కాపురం చేయడంకంటె పెండ్లిమానుకొని మగబిడ్డవలె తల్లిదండ్రులతో వుండిపోవడం మంచిదని కాళింది అభిప్రాయం. భ్రమరాంబ కాళింది మాటను కాదంటూ సహేతుకంగా కొన్ని కారణాలు చూపింది. తల్లి ఇతరుల పిల్లలకు వరుడు దొరికితే మన పిల్లకు మగడెప్పుడు దొరుకునాయని, ఇతరుల పెళ్లి జరుగునప్పుడు మన పిల్ల పెళ్లి ఎప్పుడాయని ఎదుటవారి యిళ్లకు అల్లుడు వస్తే మన అల్లుడు ఎప్పుడు వస్తాడాయని యితరులు కాపురాని కెళుతుంటే మన పిల్లకాపురం ఎలావుంటుందోనని ఆడపిల్ల పుట్టింది మొదలు రేయింబవళ్లు ఏపనిచేస్తున్నా తల్లిపడే బాధ నీకు తెలియదని కూతుర్ని మందలించింది.

ఇన్ని అవమానాలు పడి లంచగొండులైన అల్లుళ్లకు కట్టబెట్టడం ఏం న్యాయమని కాళింది నిలదీసింది. త్రాగే వారుండబట్టి తాటికల్లుగీత, మాంసం

కొనేవారున్నారుగాబట్టి గోవధ, పోయేవారుండటంవల్ల వేశ్యావృత్తి ఉన్నాయి కాబట్టి ప్రోత్సాహమే అన్నిటికీ మూలమని చెప్పింది. తల్లీకూతుళ్లూ సంవాదం జరుగుతుండగా పురుషోత్తమరావు యింట్లోకి అడుగుపెట్టాడు.

రిజిస్ట్రారు ఆఫీసులో పొలంఅమ్మకం పనిపూర్తి చేసుకొని పురుషోత్తమరావు యింటికి వచ్చాడు. కాళింది పెళ్లి ససేమిరా వద్దంటున్నదనీ కట్నమిచ్చి వరుని తెచ్చుకోవడం గౌరవహీనమే అంటోందని తల్లి చెప్పింది. పురుషోత్తమరావు కాళిందిని చేరదీసి ఆప్యాయంగా మాట్లాడాడు.

నన్ను కొడుకువలె పెంచుకోండి, లేదా నేనే మిమ్మల్ని పెంచుతాను. అన్నది కాళింది. కన్నబిడ్డను అత్తవారికి అప్పగించడం ధర్మం. కాబట్టి రాతిగుండె ధరించి తండ్రి ఆపని చేయాలి అని సమాధానం చెప్పాడు తండ్రి. కట్నమిచ్చి వరునిచే తాళికట్టించుకొనే బదులు తమకుతానే ఉరిత్రాడుతో ప్రాణాలు తీసుకోవడం మంచిదని కాళింది బదులు చెప్పింది.

ఆమె చూపిన తెగువకు పురుషోత్తమరావు ఆనందించారు. వరకట్నదురాచారం గురించి వేదికలపై ఉపన్యాసాలిచ్చి వ్యాసాలు వ్రాసిన తాను ఆమె వలె ధైర్యంగా మాట్లాడలేకపోయానని వగచాడు. కాళింది ఈ అకృత్యానికి అంగీకరించనని ఏడుస్తూ చెప్పింది.

ఆడుపడుచు అవివాహితగా ఇంట్లో ఉంటే అపనిందలు తప్పవనీ లోకులు పలుకాకులనీ సుఖంగా బ్రతుకనివ్వరనీ పురుషోత్తమరావు ఆమెను ఓదార్చాడు. తనకు చదువులు చెప్పిన ఇంగ్లీషుదొరసాని 46 సంవత్సరాలున్నా పెళ్లి చేసుకోలేదని ఆమెకేమీ నిందలురాలేదనీ కాళింది నిర్ద్వంద్వంగా పలికింది. ఆ దేశంలో ఆచారాలకు, మన ఆచారాలకు చాలా తేడా ఉందనీ, అక్కడ ఆడది మగవాడు, మగవాడు ఆడుది మనదేశంలో అలాకాదు. అని బలవంతంగా కాళిందిని భ్రమరాంబ తీసుకెళ్లింది.

ఇదంతా పేరయ్య వింటున్నాడు. కట్నం పంపించి వేస్తే పిల్లది సరిపెట్టుకొని వూరుకుంటుందని పురుషోత్తమరావుకు సలహా ఇచ్చాడు. మూడు ముళ్లూ పడితే పెనిమిటి బెల్లం అవుతాడు అని పేరయ్య సమాధానం.

అనుకొన్న ప్రకారం రు. 5500 లింగరాజుగారికి యిచ్చిరమ్మని పేరయ్య చేతికి యిచ్చిపంపాడు పురుషోత్తమరావు తన దురదృష్టానికి ఆయన బాధపడ్డాడు. నిన్నటిదాకా వరకట్నం పెళ్లిళ్లు మంచివిగావని తిరిగినవాడు ఈ నాడు ఈ నీచానికి పాల్పడవలసి వచ్చిందని దుఃఖపడ్డాడు.

లింగరాజుగారికి కట్నం పంపించారని తెలిసి కాళింది విచారించింది. ఎంత మొత్తుకున్నా తల్లిదండ్రులు తనమాట వినలేదు. చెల్లెనినాణెంవలె తనను చేసిన ఆ దైవాన్ని నిందిస్తోంది. ఆడుదాని బ్రతుకు ఎంత అలుసైనది. లవలేశమైన స్వతంత్రం లేకుండా గౌరవం లేకుండా, బ్రతికే ఆ బ్రతుకు అవమానపు పుట్టువు. ఇల్లు అమ్ముకొని కట్నం అర్పిస్తేతప్ప పెళ్లి కాదు. పైకం కోసం పాకులాడే అబ్బాయి చేత మెడలో తాళి కట్టించుకొని తృప్తిపడే కంటె తల్లిదండ్రుల నెదిరించి అనవసరంగా తగవు పెంచి మొండి కెత్తడం మంచిది కాదనే నిర్ణయానికి కాళింది వచ్చింది.

ఇంతలో వార్తాపత్రిక చేతిలో పట్టుకొని కమల రానే వచ్చింది. అందులో ఒక వార్త చదివి వినిపించింది. ఓరుగల్లులో యువతీ యువకు లిద్దరు ప్రేమించుకొన్నారు. యువకుడు 6 వేలు కట్నం ఇమ్మని బలవంతపెట్టాడు ఆమె తల్లిదండ్రులు వేరే సంబంధం ఏర్పరచారు ఆమె విషంత్రాగి ప్రాణాలు వదిలింది. ఇదీ వార్త.

కాళింది ఆ వార్తవిని ఆయువతిని మెచ్చుకొంది. పుట్టిన వ్యక్తి గిట్టకమానదు. జీవులకది నహజం. అంతరాత్మ నహింపని పనికి ఒప్పుకొవటం కంటె మరణం మేలు అనీ కాళింది చెప్పింది. అలాంటి సాహసం చేయడం అందరికీ సాధ్యం కాదని కమల పలికింది.

నాన్న కట్నం డబ్బు ఎక్కడనుంచి తెచ్చాడనే అనుమానం కాళిందికి కలిగింది. పోతునూరులో పొలమమ్మివేశారని కమల చెప్పింది. కాళింది ఆ రాత్రి భోజనానికి లోపలికెళ్లక తలనొప్పిగావుందని చెప్పి తప్పించుకొంది

కాళింది మనసులో యిలా బాధపడింది.

ఆ పది ఎకరాలు అమ్మి అల్లునికి చెల్లిస్తే తల్లిదండ్రుల గతి ఏంకావాలి? ఇంకనాకు ఒకటేదారి ఓరుగల్లు యువతి మార్గం. ఆ నిర్ణయానికి వచ్చి చివరిసారిగా రాట్నం త్రిప్పి తృప్తి పడింది. చీకటిలో బావిదగ్గరకు సమీపించి వరకట్నదురాచార నిర్మూలనకు దేశసేవా దురంధరులు ముందుకు రావాలని కోరుకుంది. ఆడబిడ్డల తల్లిదండ్రులగతి ఏమవుతుందోగదా అక్షరం రానివాడుకూడా కట్నంకోసం బిగుసుకపోతాడు. ఆడ పిల్లల్ని అలక్ష్యం చేయడం అలవాటైంది. మగబిడ్డలనుకన్న తల్లులు కలలో గూడ కట్నం గూర్చి పలవరించే కలికాలపిశాచాలు. ఇంకనైనా వారు బుద్ధి తెచ్చుకోవాలి. వారిది ఆడపుట్టువు కాదా? తనవుసురు వారికి తగలకపోదు. అంటూ బావికి ప్రదక్షిణం చేసింది తొలి స్నానం ఈ బావి నీటితోనే చివరి స్నానం కూడా యిక్కడే అంటూ బావిలో దూకింది.

లింగరాజు ఈ ఏడు ఇంతవరకు డబ్బు బదులుకోసం ఎవరూ రాలేదే అని దుఃఖిస్తున్నాడు. వడ్డీలు వచ్చిన రోజే తగిన రోజు తాకట్టు పెట్టికొని యిచ్చినబదులే సరియైనది అని మురిసిపోతున్నాడు. బుద్ధిమాలి తాను పడుచు పెళ్ళాన్ని చేసుకొన్నందుకు లెంపవేసుకొంటున్నారు. వయసు పైబడ్డ తర్వాత భ్రమపడి రెండో పెళ్లి చేసుకోవడం, దాయాదులకు ఆస్తిపోతుందని ఇతరుల బిడ్డను దత్తత తీసుకోవడం, అత్తవారింట్లో ఎక్కువ కాలం ఉండటం అప్పుల బాధ తాళలేక ఆస్తులు ఇతరుల పేర వ్రాయించడం అనే నాలుగు బుద్ధిమాలిన పనులను లింగరాజు బాధపడ్డాడు, తాను మూడో పెళ్లి చేసుకోవడం మూర్ఖం.

లింగరాజు కుమారుడు బసవరాజు పత్రికలో వార్త చదివి కాళింది బావిలో పడిందని విచారించాడు. తోటి పిల్లలు బడిలో బసవరాజును దెప్పి పొడిచారు. కట్నం కోసం యింత పని జరిగిందని బాధపడ్డాడు ఆ మాట తండ్రితో చెప్పి పత్రికలో వార్త చదివి వినిపించాడు.

పురుషోత్తమరావుగారి అమ్మాయిని లింగరాజు కుమారుడు బసవరాజునకు చేసుకోవడానికి 5,500 రూపాయలు కట్నం మాట్లాడుకున్నారు. ఆ డబ్బు ముందుగానే గుంజుకొన్నారు. ఆ వార్త తెలిసికొని కట్నం అంటే ఇష్టం లేని

కాళింది ఒక ఉత్తరం తల్లిదండ్రులకు వ్రాసి పెట్టి బావిలో పడి చనిపోయింది. ఇదీ వార్త.

ఉత్తరంలో అంశాలు ఏమిటంటే

కట్నమిచ్చి తెచ్చుకున్న వరునిచే మంగళసూత్రం కట్టించుకోవడం గౌరవహీనం. నా వివాహానికై మీరు సర్వస్వంమర్పించారు. అది క్షేమంకాదు. నాకోసం మీరు బాధపడవద్దు ఇట్లు కాళింది.

ఆ వార్త విన్న లింగరాజు మండిపడ్డాడు. ఆ వార్త వ్రాసిన పౌరునిపై పరువునష్టం కింద పదివేలకు దావా వేయాలని సంకల్పించాడు. ఇంతలో పేరయ్య వచ్చి భ్రమరాంబదుఃఖం చెప్పనలవికాదన్నాడు.

లింగరాజు ఆలోచన మరోరకంగా ఉంది. మూడుముళ్లు పడ్డ తర్వాత కాళింది ఈ పని చేసి వుంటే తమకు రావలసినవన్నీ దక్కివుండేవని ఆయన ఆలోచన. వారి సొమ్ము వారికిచ్చి వేయమని పేరయ్య తొందరపెట్టాడు. అది తప్పించుకోవడానికి ఇద్దరూ వన్నాగం పన్నారు. ఆ సొమ్ము, ఆ భూమి దక్కించుకోవడానికి ఆ రెండో పిల్ల కమలను చేసుకొంటే సరిపోతుందని నిశ్చయించుకొన్నారు. ఇంటాబయట అల్లరి పడటంకంటె ఇదే ఉత్తమమైనపని అని లింగరాజు చెప్పాడు. ఎలానైనా ఒప్పిస్తానని పేరయ్య బయలుదేరాడు.

పురుషోత్తమరావు ఇంటికి పేరయ్య వచ్చాడు. కమల, భ్రమరాంబ సుముఖంలో ఉన్నారు. లింగరాజు పైకం వాపసు యిచ్చే విషయం ఏమన్నాడో చెప్పమన్నాడు. పురుషోత్తమరావు మీరు సహాయ నిరాకరణోద్యమవాదులు కాబట్టి కోర్టుకు వెళ్లరని ఆయనకు బాగా తెలుసు. అందువల్ల యివ్వను పొమ్మని మొండికెత్తికూచొన్నాడని పేరయ్య కుండబద్దలు కొట్టినట్లు చెప్పాడు. దానికి ఒకటేమార్గం. కోటి వరహాలు పోయినా కోర్టుకు పోవడం మంచిది కాదంటూ పేరయ్య ఒక సలహా ఇచ్చాడు. అకారణంగా సొమ్ము పోగొట్టుకోవడం అంతకంటె ధర్మం కాదు. ఈ చిక్కులు తొలగిపోవాలంటే కమలను బసవరాజుకిచ్చి చేస్తే గొడవ తీరిపోతుంది.

పురుషోత్తమరావు కామాట నచ్చలేదు. డబ్బు పోయినా అతనితో సంబంధం చేయడం యిష్టంలేదని మొహమాటం లేకుండా చెప్పాడు. పరువుప్రతిష్టల గూర్చి ఆలోచించక, పాపభయం లేకుండా, ఈ విధంగా ధనమే జీవితంగా బ్రతికే వ్యక్తితో చుట్టరికం చేసి అనునిత్యం అయ్యో అని బాధపడటం కంటె గౌరవాదరాలుగల గృహస్థుల కాళ్లపై బిడ్డను పడవేయడమే మేలు అన్నాడు.

పేరయ్య తన వాదన వదలిపెట్టలేదు. మీరీ విషయంలో పట్టుదల పెట్టుకోవద్దు ఆయన మీద రోతతో పిల్లవాణ్ని పోగొట్టుకోవడం మంచిదికాదు. అంతసొమ్ము ఆయన చేతిలో పెట్టి ఇప్పుడు అడుసు తొక్కడమేలా అనుకోవడం భావ్యం కాదు అని పురుషోత్తమరావు మనసు కరిగేలా చెప్పాడు. పేరయ్య భ్రమరాంబ అలా దుఃఖిస్తూకూచుంటే లాభం లేదనీ, ఏదో విధంగా మరచిపోయి వ్యవహారంలోకి రావాలని పేరయ్య ఓదార్చాడు భ్రమరాంబ దుఃఖం కట్టలు తెచ్చుకొంది.

పురుషోత్తమరావు ఆమె నోదార్చాడు. జీవితమనేది నాటకరంగం. ఎవరి వేషాలు వారువేసి అవి పూర్తి కాగానే వెళ్లి పోతారు అన్నాడు. పేరయ్య ఆ వాదనను సమర్ధించాడు. బొమ్మలాటకాదు. సమయాన్నిబట్టి ఏ బొమ్మ పని వచ్చినప్పుడు ఆ బొమ్మను తెరమీదికెక్కిస్తాడు. అలానే భగవంతుడు కూడా అన్నాడు.

పిల్ల యిష్టం లేకుండా ఈ సారి పెళ్లి జరిపించడం భావ్యంకాదనీ కమల అభిప్రాయం తెలుసుకోమని భ్రమరాంబ ఖండితంగా చెప్పింది. డబ్బు వదలుకోవడం మంచిదా లేక బసవరాజును కుదర్చమంటావా అని కమలను పేరయ్య ప్రశ్నించాడు.

కమల తనలో తాను వితర్కించుకొంది. తన కర్తవ్యమేమిటి? అక్కధోరణి అవలంభిచడమా? లేక అందుకు భిన్నంగా వివాహం చేసుకొని తల్లిదండ్రులకు మనశ్శాంతి కలిగించడమా? ఏది మార్గం. అక్క చెప్పిన మాటలు

ఆణిముత్యాలు. కట్నాల రాయుళ్ళ చేత కళ్యాణ సూత్రం కట్టించుకోవడంకంటె గతిమాలిన పని మరొకటి లేదు. అలాంటి వివాహం నా కిష్టం లేదంటే తల్లి దండ్రులు బలవంతపెట్టారు. కాని దానివల్ల పర్యవసానం ఏమవుతుంది. 5,500 రూ.లు ఆ దుర్మార్గుడి పొట్టన బెట్టడమే అవుతుంది. కాబట్టి ఆ సంబంధం అంగీకరించి తగిన ప్రాయశ్చిత్తం చేయగలిగితే అక్క కసి తీర్చిన దానినవుతాను. ప్రపంచానికి గుణపాఠం చెప్పిన దానినవుతాను. ద్రవ్యం వినియోగంలోకి వస్తుంది. అయితే ఆ ప్రతీకారం ఎలా తీర్చుకోవాలి కట్టె కట్టెను మదిస్తే నిప్పుపుడుతుంది. భూమిని త్రవ్వుతూపోతే నీరు పడుతుంది. పెరుగు తరచిన కొద్దీ వెన్న వస్తుంది. కాబట్టి కార్యసాధనకు మార్గాలు అనేకం.

పురుషోత్తమరావు కుమార్తె అభిప్రాయాన్ని అడిగారు. ఏ విధమైన బలవంతం లేదనీ, సందేహం లేకుండా తన అభిప్రాయం చెప్పవచ్చుననీ అన్నాడు. మీ యిష్టమే నాయిష్టం అని కమల తలవంచుకొంది. నీ యిష్టానుసారమే జరిపిస్తామని పురుషోత్తమరావు ఖండితంగా చెప్పాడు. వివాహానికి సంబంధించిన ఇతర విషయాలలో కూడా ఆమె యిష్టమే జరుగుతుంది అని తండ్రి హామీ ఇచ్చాడు. అలా అయితే సరేనని కమల వివాహానికి అంగీకరించింది. తర్వాత మాగొంతుకోయక అన్నీ ఆలోచించుకొని చెప్పమని తల్లి బ్రతిమాలిందో అన్నీ అలోచించి చెప్పానుకాబట్టి అనుమానం అక్కరలేదని కమల జవాబిచ్చింది.

పేరయ్య ఆ మాటవిని సంబరపడిపోయాడు. లింగరాజుతో ఆ మాటలు చెప్పి సరి అనిపించమని పురుషోత్తమరావు కోరాడు. ఈ నెలలోనే పెళ్లి జరిపిస్తే భ్రమరాంబ దిగులు క్రమంగా తొలగిపోతుందని ఆయన నమ్మకం సరేనని పేరయ్య వెళ్లిపోయాడు.

కమలను అక్కున జేర్చుకొని పురుషోత్తమరావు తలనిమిరాడు. వయసుకంటె ఎక్కువ బుద్ధితో ప్రవర్తించినందుకు సంతోషమనీ, కాళింది అలాచేసినందుకు, తానైనా వారి కళ్ల ముందువుంటే అదే చాలుననీ అన్నాడు.

కమల తనలో తాను స్థిరనిశ్చయానికి వచ్చింది. కాళిందిని తలపోసుకొని కుమిలిపోయింది. నీ మతానికి అడ్డంగా వెళ్తున్నందుకు మన్నించు. అభిమానం లేకగాదు. నీ కసి తీర్చడానికి ఇదే సరియైన మార్గం. దేవుడే ఇందుకు సాక్షి అని అక్క మీద వొట్టుపెట్టుకొంది.

లింగరాజుగారు పడకగదిలో తన భార్య సుభద్రతో ఆడువారికి బంగారు నగలపైగల మక్కువను గూర్చి ముచ్చటిస్తున్నారు. శుభకార్యం దగ్గరలో వుంది కాబట్టి తన నగలు తనకిస్తే వాటిని ధరిస్తానని సుభద్ర భర్తను బ్రతిమలాడింది. ఎల్లుండి రాత్రి వివాహం కాబట్టి ఇప్పటి నుంచీ పెట్టుకుంటే అవి అనవసరంగా అరిగిపోతాయని లింగరాజు వాదన. సుభద్ర వూరుకోలేదు. ఎప్పుడు చూసినా నగ తరిగిపోతుందని బట్టలు చిరిగిపోతాయని బియ్యం తరిగిపోతాయని మీరంటారు. మరి ఈ భాగ్యం అంతా ఎందుకు. స్వారీ చేయని గుర్రము చదవని పుస్తకము సేవింపనిమందు ఆరగింపని వంటకము అనుభవింపని ధనము వ్యర్థమని మీకు తెలియదా రేపు శుక్రవారం అనలే తీయరు. ఇక కోడలికి ఏమి నగలు పెడతారు అని సుభద్ర మొత్తుకుంది.

ఆడువారికి ఆభరణాల రుచి ఎవరు నేర్పించారో గదా! ఏడువారాల నగలుగల యిల్లాలు ఎదురింటి ముత్తైదువు ముక్కుపుడక తెచ్చుకున్నదాకా నిద్రపోదు. బులాకీలు, తాలూకాలు, పిల్లేళ్లు, లోలాకులు, వాచీ గొలుసులు అటుకలు, గాజులు ఇలా ఎన్నో రకాలు అని దెప్పి పొడిచాడు. పెండ్లి వారు పంపిన అరెసెలు, అప్పడాలు, వడియాలు, అల్లము బెల్లము అన్నీ జాగ్రత్తగా పెండ్లి అయిన మరునాడు తనకు అప్పగిస్తే అవి బజారులో పెట్టి అమ్మిస్తానన్నాడు. పదిరూపాయలు యిచ్చి పోలీసు పహారా ఏర్పాటు చేస్తే సదస్యసంభావనపురోహితుల గొడవే వుండదన్నాడు.

పెండ్లిలో అయిదు రోజులూ రావలసిన 5 చీరలు, 5 మొహిరీలు, 5 కానులు ఇలా సమస్తమూ వారి వద్ద జాగ్రత్తగా అధికారం వెలగబెట్టి రాబట్టుకోమన్నాడు. గ్రామ దేవతకు కానుకలు, కొలువలు, వేటపోతులూ కుంభములు ఒక్క రోజు యిస్తే చాలు. పెండ్లి కొడుకు తల్లికి ఐదు రోజులిచ్చినా చాలవు అని లింగరాజు తన పద్ధతి స్పష్టం చేశాడు. సుభద్ర

సృష్టివైచిత్రికి ఆశ్చర్యపోయింది. ఐశ్వర్యవంతులకు కనికరము, పాపభీతి సూనృతము, సిగ్గు, లజ్జ కనిపించవు. ఐశ్వర్యము కాలచక్రమువలె తిరుగుతూ వుంటుంది. లోభి కొడుకు త్యాగి కావచ్చు. త్యాగి కొడుకు దరిద్రుడు కావచ్చు అనుకుంది.

పెండ్లి పందిట్లో పురుషోత్తమరావుగారు కన్యాదాత వేషంలో తిరుగుతున్నారు. అది నాల్గవ రోజు. ఈ రెండురోజులు ఎలానో గడిస్తే పెండ్లి అయిందనిపించవచ్చు. ఆడపిల్లకు పెండ్లి చేయడం కంటె అశ్వమేధ యాగం చేయటం సులభమని ఆయన నమ్మకం . వియ్యాలవారికి తెల్లవారగానే బిందెలతో నీళ్లు, పళ్లుతోముకునే పుల్లలు పంపాలి. తర్వాత కావిళ్లతో కాఫీ దోశెలు, ఇడ్డెనలు, ఉప్మా పంపాలి. పిలిచిన వారినే మళ్ళీమళ్ళీ భోజనాలకు పిలవాలి. భోజనాలు సమయంలో పంక్తిలో వారికి కావలసిన కోర్కెలు కనిపెట్టాలి. వియ్యాల వారిలో భోజనానికి ఏ ఒక్కడు రాకపోయినా ఎదురు చూస్తూ వస్తులుండాలి. అన్నీ ఓర్చుకొని వేలు ఖర్చు పెట్టినా నిష్ఠూరాలు మిగిలిపోతాయి.

ఇలా అనుకుంటున్న పురుషోత్తమరావు దగ్గరకు ఘంటయ్య వచ్చి ఒక ఉపన్యాసం ఇచ్చాడు. వియ్యపురాలుగారు లేస్తే ఆమె కండ్లు తుడవాలి. పండ్లు తోమాలి, నీళ్లు పోయాలి, ఒళ్లు తుడవాలి గంధం అత్తరు పన్నీరు పారాణి ఒకటేమిటి అన్నీ అందించాలి. లేకపోతే ఆలస్యమైనందుకు అలక కట్నం చెల్లించాల్సి వస్తుంది అన్నాడు. ఇంతలో పేరయ్య వచ్చి ఎలానో ఈ రోజు గడిపించాలి అంటూ పై వూళ్ల నుంచీ ఎందరో సంభావనలకు వస్తే లింగరాజు పోలీసు పహారా ఏర్పాటు చేశారని వాపోయాడు. ఈ మధ్యలో వియ్యాలవారి తరపు నుండి వీరయ్య వచ్చి ఇంకా ఫలహారాలు కావిళ్లు రాలేదని వాళ్లు కాఫీ హోటళ్లకు వెళుతున్నారని మగపెండ్లి వారిని ఇలా చూస్తే మర్యాద దక్కదని హెచ్చరించారు. నిన్నటి ఉప్మాలో నిమ్మపండ్లరసం లేదని, ఇడ్డెనలల్లో అల్లంముక్కలు, కాఫీలో పంచదార లేవట. ఈ పూట బాగులేకపోతే తెచ్చినవారి మొహాన కొడతామని అంటున్నారు. మగపెండ్లివారు ఎంత నిరంకుశులో మిలిటరీ మనుషులో మరిడీ దేవతలో అనుకుంటూ పురుషోత్తమరావు లోపలికెళ్లారు. 16 రోజుల

పండగతో పెండ్లికూతురి తండ్రికి చిప్ప చేతిలో కొస్తుంది. అన్నీ అమ్ముకొని ముష్టి ఎత్తుకోవాలిగదా అనుకున్నాడు పేరయ్య.

పెండ్లివారు ఎంతసేపైనా భోజనాలకు రానందుకు పురుషోత్తమరావు గాబరా పడుతున్నాడు. వంటలు చల్లారిపోతున్నాయి. పిలిచినా పలకకుండా ముసుగుతన్ని పడుకున్నాడొకడు. ఇదుగో మీ వెనకనే వస్తున్నామని చుట్టముట్టించాడింకొకడు. నేను వెళ్లిందాకా వుంటారో లేదో చూద్దామని ఇంకొకడు ఆలస్యం చేస్తున్నారు. ముందేవచ్చి కూచుంటే పరువు పోతుందని మరొకడు. హాయిగా భోంచేసి కూచుని ఏమాటా చెప్పడు ఇంకొకడు. ఏదో నెపంతో కోపపడి వెళ్లిపోయాడు. ఇంకొకడు ఇలావుంటాయి పెండ్లిడ్ల భోజనాల తంతు అనుకున్నాడు పురుషోత్తమరావు. సదస్యసంభావనలకు భయపడి ఇంట్లోనే నాలుగుమెతుకులు తిని లింగరాజు సరిపెట్టాడు.

పేరయ్య వచ్చి వియ్యాలవారి తరపు బంధువులకు గౌరవము సరిగా జరగనందున భోజనాలకు ఎవరూ రావడం లేదనీ పురుషోత్తమరావును వెళ్లి వియ్యాలవారిని కాళ్లావేళ్లాబడి బ్రతిమాలి తీసుకురమ్మని సలహా యిచ్చాడు ఊళ్లో బ్రాహ్మణులు తలోసాకుతో భోజనాలకు రాలేదు. భ్రమరాంబ వియ్యాలవారి పద్ధతికి కోపపడింది. వారి లాంఛనాలు వారు తీసుకొని తమకు ఈయవలసి వచ్చినప్పుడు మాకు ఆనవాయితీలేదని దాటవేస్తున్నారు. మంగళ హారతిలో వరహాకంటె ఎక్కువ వేయరట. ఎవరో దూరపు బంధువునకు అద్దిన మొహరీ మోటుగా వున్నందున ఆమె అలిగి కూచున్నది. వియ్యపురాలు ఆమెను విచారిస్తూ కూచుంది. అమ్మలక్కలు ఆమె చుట్టూ కూచుని తగవు పెంచుతున్నారు.

పురుషోత్తమరావు వెళ్లి వాళ్ల కాళ్ల మీదపడి కటాక్షింపమని వేడుదాంపద అని భార్యను బ్రతిమాలాడు. ఆడపిల్ల పెండ్లి, అతి లోభితో చుట్టరికము, పగవారికి కూడా వద్దని భగవంతుని పురుషోత్తమరావు వేడుకున్నాడు. ఎలానో ఐదురోజుల పెండ్లి జరిపించి తన బాధ్యత నెరవేర్చుకున్నాడు.

వెర్రివెంగళప్పగారు వకీలు తాలూకా బోర్డు ప్రెసిడెంటు ఆయన తన కచేరీ చావడిలో కూర్చొని ఏ ఒక్కపార్టీ అయినా రాలేదని వ్యాపారం

జరగనందుకు చింతిస్తున్నాడు. లాయరు వృత్తిమీద ఆయనకు అసహ్యం వేసింది. గంట పది కొట్టేసరికి తలపాగా కోటు తగిలించుకొని కచేరి కాంపౌండులోనూ రైలు స్టేషనువద్ద మనిషికంట బడితే మరిడీ దేవతల్లా పట్టుకోవాలి. అలాంటి వారిని చూసి మరి కేసులెలా వస్తాయి. ఆయన దృష్టిలో ఈ రోజుల్లో నాలుగే మత్తులు మంచికి. 1 సిగరెట్ల దుకాణం 2 కాఫీ హోటలు 3 డాక్టరు 4 ప్లీడరు ఏ సందులోకి వెళ్లినా ఏ గుమ్మం దగ్గర చూసినా వీరి బోర్డులు కనిపిస్తాయి. ఈ నాలుగింటిలో మొట్టమొదట చెప్పుకోవలసింది. కాఫీ హోటలు ఆఖరిది ప్లీడరీ సహాయనిరాకారణోద్యమం వల్ల కొంత ప్రాక్టీసు తగ్గింది. స్టాంపు డ్యూటీ పెరిగి సర్వం నాశనమైంది. తాలూకా బోర్డు ప్రెసిడెంటు పదవి లేకపోతే ఈ పాటికి ఆయన లాయరు పుస్తకాల బీరువాలు అమ్ముకొవాల్సివచ్చేది. బోర్డు ప్రెసిడెంటుగా పోయిన సంవత్సరం అమాంబాపతు ఐదువేలు గిట్టాయి. కాంట్రాక్టర్ల కమీషను స్కూలు టీచర్ల లంచాలు సరేసరి, ఎలక్షను రోజులు వస్తున్నాయి. కాబట్టి జాగ్రత్తగా వుండాలని వెంగళప్ప అనుకున్నారు.

ఇంతలో ఒకటీచరు రెండు రోజులు శలవు యిప్పించమని వెంగళప్పను కాళ్లావేళ్లా పడ్డాడు. శలవు లేదు పొమ్మన్నారు. మాటామాటా పెరిగి టీచర్ని డిస్మిస్ చేశాడు. టీచరుకు ఒళ్లు మండింది. ఛండాలుడా ఇంతకంటె ఏంచేయగలవు. ఈ మూడేళ్లు తాలూకా బోర్డు ముష్టిపదవిపోతే అడుక్కుతింటావు. నాకు మరో దగ్గర ఉద్యోగం దొరక్కపోదు. నీవంటి నీచాతి నీచులు బోర్డు పదవిలో వున్నంతకాలం అడ్డమైన గడ్డీ కరుస్తారు. భగవంతుడు మా మొరవింటాడు. ఈ సారి ప్రజలు నిన్ను ఓడిస్తారు అని కోపపడి వెళ్లిపోయాడు.

వెంగళప్పకు ఆశ్చర్యం వేసింది. అందరు టీచర్లూ తనను చూసి భయపడుతుండే వీడిలా దులిపేశాడు. సమయానికి పనివెధవ కూడా లేకుండా పోయాడు.

లింగరాజుగారు ఇదే సమయంలో వెంగళప్ప వద్దకు సలహా కోసం వచ్చాడు. పురుషోత్తమరావు కూతురి వివాహ సమయంలో పిల్లకు లింగరాజు

నాలుగువేల రూపాయల నగలు పెట్టాడు. మూడేండ్లు కావచ్చినా పిల్లను పురుషోత్తమరావు కాపురానికి పంపించడు. అవి తాకట్టు నగలు . అసలువారు ఇవ్వమని అడుగుతున్నారు. పెండ్లికాగానే ఎలానో సంగ్రహిద్దామని లింగరాజు ప్రయత్నించాడుగానీ ఆ పిల్ల పడనివ్వలేదు. ఇప్పుడు ఏమి చేయమంటారని సలహా అడిగాడు లింగరాజు లాయర్ని.

పిల్లకు మైనారిటీ తీరలేదు. కాబట్టి అబ్బాయి పేరుతో ముందు నోటీసు యిచ్చి తర్వాత తండ్రిమీద దావా దాఖలు చేద్దామని వెంగళప్ప సలహా యిచ్చాడు. పిల్లను కోర్టుకు ఈడ్పించి నలుగురిలో నగలు ఊడదీయించాలని మనోవర్తి బాధలు లేకుండా యీసంబంధం ఇంతటితో తప్పిపోయేలా చూడమని లింగరాజు మొరపెట్టుకున్నాడు. పసిపిల్లను నగలతో పరారీ చేయడానికి సిద్దంగా వున్నారని చెప్పి ఇంజక్షను ఆర్డరు ఇప్పించి కోర్డుకు ఈడ్పించవచ్చును. కోర్టులో తనమాట ఇప్పుడు బాగా చలామణి అవుతుంది. మున్సిఫ్ మేజిస్ట్రేటుగారు తమ యింటికి ప్రతిరోజు పేకాటకు వస్తాడు. ఆయనతో చెపితే పని అయిపోతుంది. ఫీజు జమచేస్తే చాలు అని భరోసా యిచ్చాడు వెంగళరావు.

లింగరాజు లాయర్లఫీజుగోలకు ఆశ్చర్యపోయాడు. రోగి చచ్చినా బ్రతికినా వైద్యుడు డబ్బు గుంజుకుంటాడు. వ్యాజ్యంలో ఓడినా గెలిచినా ప్లీడరు ముందే పిండుకుంటాడు అయినా తప్పదనుకున్నాడు లింగరాజు.

పురుషోత్తమరావు కోర్టు నోటీసు అందుకొని వియ్యంకుడు వీధికెక్కి నందుకు వస్తుపోతూ నోటీసును తెచ్చి కమలకు చదివి వినిపించాడు.

హైకోర్టు వకీలు వెర్రిబుర్రల వెంగళప్ప పుణ్యమూర్తులు పురుషోత్తమరావు పంతులు గారికి యిచ్చిన నోటీసు. మా క్లయింటు సింగరాజు బసవరాజు గారికి మీ కుమార్తె కమలతో వివాహమైంది. వివాహ సమయంలో మీ పిల్లకు నాలుగు వేల రూపాయల బంగారు నగలు మా క్లయింటు పెట్టారు. ఆ నగలు హరించడానికి మీరు చిన్న దాన్ని కాపురానికి పంపడం లేదు. మీ పైన దావా వేయాల్సి వస్తుంది. నోటీసు అందిన 24 గంటలలోగా పిల్లలను కాపురానికి పంపి నగలు ముట్టినట్లు రసీదు తీసుకోవాలి. లేకపోతే

దావా వేయవలసి వస్తుంది. ఆ నోటీసులోని మాటలు విన్న కమల దావాకూడా దాఖలు కానీలే చూద్దామని నిష్కర్షంగా చెప్పింది. అపకీర్తి వస్తుందేమోనని పురుషోత్తమరావు ఆందోళన . ఇతరులకు దాస్యం చేసి పరువుమాలి బ్రతకడం కంటె, విరసులతో జగడమాడి కోర్టు కెక్కడం కంటె ఉరిశిక్ష మేలు అనుకున్నాడు. పురుషోత్తమరావు మీరు దిగులుపడవద్దని అంతా తనకు వదిలివేయమని కమల ప్రాధేయపడింది. పురుషోత్తమరావు కానున్నది కాకమానదులే అని వూరుకున్నాడు. కమల భగవంతునిపై భారంవేసి వూరుకుంది.

న్యాయస్థానం సమావేశమైంది. న్యాయ పీఠంపై న్యాయాధిపతి ఆసీనులయారు. ఎదురుగా వకీలు వెంగళప్ప అతని వెనుక లింగరాజు బసవరాజు మరోవైపు పురుషోత్తమరావు కమల వున్నారు. కోర్టు కెక్కడం కంటె కొరత కెక్కడం మేలని పురుషోత్తమరావు తనలో ఇలా అనుకుంటున్నాడు. మనుష్యుని ముందర చెట్టుమొరడు మాదిరిగా మరో మనుష్యుడు నిలబడి యుండగా ఇంకొకడు బల్లగుద్ది మాటిమాటికీ ఏవో ప్రశ్నలు వేస్తూ వుంటే ఉత్తరంచెప్పాలని ఇంతకంటే అవమానం ఇంక ఏం ఉంటుంది. ధనలోభం వల్లనో, దురాశవల్లనో, పట్టుదల వలనో, వెర్రిపుట్టి కోర్టుకెక్కుతారు. కూటసాక్షాలు కూర్చుకుంటారు. ఇళ్ళువాకిళ్ళు వదిలిపెట్టి వస్తారు . ప్లీడర్లు కోరిన ఫీజులిచ్చి, వూటకూళ్ళ ఇళ్ళలో తిని వారి పంచలలో పండుకొని కోర్టు దేవాలయంగా జడ్జిదేవుడుగా భావించే ప్రజల ఖర్మ ఏమని చెప్పాలి. ఇక ఖర్చులు - కరణంకట్నాలు, కూటసాక్షుల గొరుగుడులు ఏజంటు ఖర్చులు, ప్లీడర్ల ఫీజులు స్టాంపుడ్యూటీలు కోర్టు గుమాస్తాల ముడుపులు ఛార్జీలు ఇలా కొంపలుగోళ్లు అమ్ముకొని తిరగాలి. ఓడినవాడు బయట గెలిచినవాడు లోపల యేడవటం కంటె లాభమేమీలేదు అనుకున్నాడు పురుషోత్తమరావు.

పెంపుడు తండ్రి తనను పేలవపరచినందులకు బసవరాజు ఆలోచనలో పడ్డాడు. తండ్రి తన పెండ్లి కాగానే చదువు మాన్పించాడు. కోర్టుకెక్కించాడు. ధనం కోసం బ్రతికే తండ్రి కంటె సవతితల్లి మేలుగదా అనుకున్నాడు

ఎలానో రాజీ చేయండని న్యాయాధిపతి సలహా యిచ్చాడు. వెంగళప్ప లేచి కోర్టువారు అలా సెలవిస్తే కొంపమునుగుతుందన్నాడు. మానగలు మాకిచ్చి ఖర్చులు మాకిస్తే సంబంధం తెగతెంపులు చేసుకొవడానికి సిద్ధమే నన్నాడు లింగరాజు. చివరకు రాజీ కుదరదని న్యాయాధిపతి ఒక నిర్ణయానికి వచ్చాడు. కమల ముందుకు వచ్చి తమ సన్నిధానంలో ధర్మం విన్నవించుకుంటానని కోరింది. అందుకు చట్టం ఒప్పుకోదని వెంగళప్ప అడ్డువడ్డాడు. మైనారిటీతీరని పిల్ల మాట్లాడకూడదని మొండి పట్టుపట్టాడు. తన తండ్రి అసహాయవాది కాబట్టి వకీలును పెట్టుకొలేదని నామాట వినకపోతే అన్యాయం చేసినట్లేనని కమల వాదించింది.

న్యాయాధిపతి కమలకు అనుమతి ఇచ్చాడు. దావా సారాంశాన్ని కమల చెప్పసాగింది. నాతల్లిదండ్రులు నగలు హరింపదలచారని అందుకోసం కాపురానికి పంపడం లేదని ఆరోపించారు. ఇవిగో వారడిగిన వస్తువులు. వివాహ సమయంలో అవి నాకు బహూకరించారు. కాబట్టి తిరిగి తీసుకునే హక్కు వారికి లేదు. నా భర్త నా యింటికి రావాలి కానీ నేను వారి యింటికి వెళ్లవలసిన అవసరం లేదు. కారణం ఆయనను మేము వేలములో 5500 రూపాయలకు కొన్నాము. నాకు కాళింది అనే అక్కవుండేది. ఆమె కోసం మానాన్న ఈ సంబంధానికై వెళితే మున్నంగివారు పోటీకి వచ్చి వేలంపాట పెట్టారు. ఆ వేలంలో ఈయన మా సొత్తు అయినారు. వీరితో మేము చేసుకొన్న అగ్రిమెంటు కూడా యిదిగో. ఆ తరువాత సొమ్ము ముట్టిన రసీదు కూడా యిచ్చారు. వేలములో కొని తెచ్చిన వరుని చేసుకోవటం ఇష్టంలేక మా అక్క బావిలో పడి మరణించింది. ఈ వార్తాపత్రిక చూస్తే మీకు విషయం తెలుస్తుంది. వారికి యిచ్చిన డబ్బు దక్కించుకోవడానికి నన్ను ఇవ్వక తప్పలేదు. కట్నానికి ధనానికి తేడాలేదు శుభలేక చిత్తగించండి. నా కుమార్తె కమలకు బసవరాజునిచ్చి అని వ్రాసివుంది. దీనిని బట్టి నాకుగల హక్కును మీరు నిర్ణయం చేయండి నా భర్తపై నాకున్న హక్కును నాకు ప్రసాదించండి అని కమల వాదించింది. ఆ మాటలు విని బసవరాజు తన అజ్ఞానానికి చింతించి కోర్టు ముందుకు వచ్చి దావానురద్దు చేసుకుంటునట్లు ప్రకటించాడు. ఆమెకు నేను అమ్ముడు పోయాను కాబట్టి ఆమె చెప్పిన

మాట నేను వినాలి అన్నాడు. కమల సంతోషించి వరవిక్రయ దురాచారాన్ని రూపుమాపుదాం రమ్మని చెప్పింది.

రాజవీధిలో పురుషోత్తమరావు, బసవరాజు, భ్రమరాంబ కమల వరకట్న దురాచారాన్ని తెగడుతూ ప్రచారం మొదలుపెట్టారు. లింగరాజు కూడా మనసు పరివర్తనపొంది కొడుకు కోడలిని యింటికి తీసుకొనిపోయి ఆస్తి వారి వశంచేసి హరినామస్మరణ చేసుకోవడానికి ముందుకు వచ్చాడు. పాడుకట్నంకోసం పాట్లు పడినందుకు పశ్చాత్తాపపడ్డాడు. ఆ పాప పరిహారార్థం ఇందుకు సిద్ధపడ్డాడు. పురుషోత్తమరావు వరకట్న మహామ్మారిని తరిమికొట్టాలని మంగళాశాసనం పలికాడు.

❋

# ఉన్నవ లక్ష్మీనారాయణ

సంఘ సంస్కరణ కర్తలలో ఆంధ్రదేశంలో చెప్పుకోదగిన వారిలో ఉన్నవ లక్ష్మీనారాయణ ప్రసిద్ధులు. గుంటూరుజిల్లా వేములూరుపాడులో 1873 డిసెంబరు 4న లక్ష్మీనారాయణ జన్మించారు. గుంటూరులో విద్యాభ్యాసం చేశారు. 1903లో గుంటూరులో న్యాయవాద వృత్తిని చేపట్టారు. 1913లో ఐర్లండుకు వెళ్ళి బారిష్టరు పట్టా పొందారు. ఐర్లండు స్వాతంత్ర్యోద్యమనాయకుడు 'డి కలెరా'తో సన్నిహిత పరిచయం కలిగింది. విదేశాల నుండి తిరిగి వచ్చి మదరాసులోను, గుంటూరులోను బారిష్టరుగా విశేష ధనాన్ని గడించారు.

గాంధీజీ ఆదేశానుసారం బారిష్టరు పదవిని వదలిపెట్టి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. 1921, 1922 1930, 1942-43 మధ్యకాలంలో దాదాపు మూడు సంవత్సరాలు జైలు శిక్షలు అనుభవించారు. 1905లో గుంటూరులో వితంతు శరణాలయాన్ని స్థాపించి అనేక మంది వితంతువులకు వివాహాలు జరిపారు. కొంతకాలం రాజమండ్రిలో వీరేశలింగం ఆధ్వర్యంలో నడుపబడుతున్న వితంతు శరణాలయం కార్యక్రమాలను చూశారు మళ్ళీ తిరిగి 1908లో గుంటూరు విచ్చేసి శరణాయ కార్యక్రమాలు నిర్వహించారు.

1922లో శారదానికేతనాన్ని గుంటూరులో స్థాపించి స్త్రీవిద్యను ప్రోత్సాహించారు. 1910లోనే భాషాప్రయుక్త రాష్ట్రాన్ని యేర్పాటు చేయాలని కోరారు 1913లో బాపట్ల ఆంధ్రమహాసభ కార్యదర్శిగాను, 1922లో చిత్తూరులో ఆంధ్రమహాసభఅధ్యక్షులుగాను వ్యవహారించారు. ఉన్నవవారి హరిజనాభ్యుదయకాంక్షకు ప్రతీక మాలపల్లి నవల.

1922-23 సంవత్సరాల మధ్యకాలంలో మాలపల్లి నవలను ఉన్నవవారు రెండు భాగాలుగా ముద్రించారు. మదరాసు ప్రభుత్వం ఈ నవలను నిషేధించింది. అయితే 1925లో కొన్నిమార్పులతో ఈ నవలను ప్రచురించటానికి అనుమతి యిచ్చింది. 1935లో తిరిగి నిషేధం విధించబడింది. ప్రజాహృదయాలపై ప్రభావం చూపిస్తుందన్న ప్రభుత్వ భయమే అందుకు కారణం.

మాలపల్లి నవల ఆనాటి సాంఘిక వ్యవస్థకు దర్పణం. ఉన్నవవారు 1958 సెప్టెంబరు 25న పరమపదించారు

# మాలపల్లి గురించి

మాలదాసరి రామదాసు గారాలకూతురు జ్యోతి ఆయన పెద్దకొడుకు వెంకటదాసు. వారిది వ్యవసాయ కుటుంబం. ఆయన భార్య మహాలక్ష్మి పొత్తిళ్లలో బిడ్డతో సంసారం సాగిస్తోంది పెద్దకొడుకు వెంకటదాసు వారిరెండోకొడుకు సంగదాసు చౌదరయ్య యింట్లో పనిలో కుదిరాడు. చౌదరయ్య భార్య లక్ష్మమ్మ దైవభక్తి గలది కుమారుడు రామానాయుడు అభ్యుదయవాది

కూలీలకు అన్యాయం జరగకుండ చూడాలని సంగదాసు ఆలోచన. వారిని ఒకచోట చేర్చి సమ్మెకట్టాలని ఉద్బోధించాడు. కూలీలకు చెల్లించే డబ్బు విషయంలో వూళ్ళో రెండు పక్షాలు ఏర్పడ్డాయి. ఆవూళ్ళో మోతుబరి చౌదరయ్య. కూలీలకు జొన్నలు బదులు డబ్బులిద్దామని ఆయన ప్రతిపాదించారు. రామనాయుడు, సంగదాసు బెజవాడలో జరిగే హరిజనోద్యమ సభకు ప్రతినిదులుగా హాజరయ్యారు. సభాపతి వెంకటరెడ్డి సంగదాసు ఆ సభలో హరిజనోద్ధరణకు కొన్ని తీర్మానాలు ప్రవేశపెట్టి నెగ్గించారు. ఆసంఘానికి సంగదాసును కార్యదర్శిగా ఎన్నుకొవ్వారు. చౌదరయ్యకు సంగదాసు ప్రవర్తన నచ్చలేదు. సంగదాసును చావబాదాడు. కేసు మాఫికావడానికి చౌదరయ్యపంతులు కాళ్లు పట్టుకొన్నాడు శవాన్ని ఊరేగించి ఒకచోట సమాధి చేశారు.

రామానాయుడు తండ్రి నిర్వాహకాన్ని నిందించాడు రామదాసు పూర్తిగా ఆధ్యాత్మిక ధోరణిలోపడ్డాడు. సంగదాసు పేర సంగపీరం ఏర్పాటు చేశారు. రామానాయుడు భార్య కమల ఆమె బంధువుల కుర్రవాడు మోహనతో లేచిపోయింది. మోహన కమలను వదిలి పారిపోయాడు. ఆమె మరణించింది

రామదాసుపై చౌదరయ్య దావావేశాడు. రామదాసు ఒకరివద్ద నౌకరీకి కుదిరాడు రామానాయుడు తల్లి చనిపోయిన దుఃఖంలో పడ్డాడు చివరి రోజుల్లో చౌదరయ్య నారాయణ స్మరణలో మరణించాడు.

మిషనరీల వద్ద రామదాసు కుటుంబం కూలిపనికి చేరారు. ఫాదరీలు రామదాసుపై తప్పుడు కేసుపెట్టి జైలుకు పంపారు. జగ్గడు బందిపోటుగా పేరుపొందారు. అతడు ఎవరోకాదు వెంకటదాసు

రామదాసు జైలు జీవితాన్ని గడిపి జైలులో ఖైదీలను జాగృతం చేశాడు. జైలునుండి విడుదలై కాషాయవస్త్రధారియై (యతీంద్రుడై) పరబ్రహ్మతో కలిశాడని జనశ్రుతి

# 9. మాలపల్లి

## సంక్షిప్త గ్రంథం

రామదాసు పొలంలో పనిచేస్తున్నాడు. అతనికి మధ్యాహ్న భోజనం తీసుకువచ్చింది ఆయన కూతురు జ్యోతి. ఇద్దరు మగపిల్లల తరువాత పుట్టిన ఆమెను అందరూ గారాబంగా చూస్తారు. జ్యోతి తండ్రి వలె నల్లటిదికాదు. రామదాసు పడమర నాలుగు ఘడియలకల్లా దుక్కి పూర్తిచేసి మిరపమళ్ళకు నీళ్ళు చల్లాడు. పెద్దకొడుకు ఎన్నిటికని తంటాలు పడతాడు. సంగణ్ణి జీతానికి మాన్పించి యింట్లో వుండమంటే బాగుండుననుకున్నాడు. రామదాసు సాయంకాలం ఇంటికి వచ్చేసరికి పశువుల కాపరి అప్పాదాసు ఉలవలు రుబ్బుతున్నాడు. అప్పాదాసుకు 14 సంవత్సరాల నుంచి శరీరపటుత్వం కలవాడు. రామదాసు యింట్లో జీతానికి కుదిరిన తర్వాత చదువు మొదలుపెట్టి రామదాసు శ్రద్ధవల్ల కొంత సాహిత్యంకూడా నేర్చుకున్నాడు. ఇంతలో పెద్దకొడుకు వెంకటదాసు వచ్చాడు.

రామదాసు మాలదాసరి. అతని పూర్వీకులు వైష్ణవ మత బోధకులు. రామదాసు సంసారం దిద్దుకునే దక్షతగలవాడు. నాలుగు సంవత్సరాలనుంచీ పెద్దకొడుకు వ్యవసాయపు పనులలో ఆరితేరాడు. అందువల్ల రామదాసు మతవిషయాలలో కాలం గడుపుతున్నాడు. వారికి ఆస్తి పాస్తులు, సుక్షేత్రమైన మాగాణి వుంది. ఆయన భార్య మాలక్ష్మి. తన పూర్వపుణ్యవశంతో ఈ భర్త దొరికాడని ఆమె నమ్మకం. ఆమెకు పొత్తిళ్ళలో బాలుడున్నాడు.

రామదాసు ఇల్లు మిద్దెటిల్లు. విశాలమ్మైన దొడ్డి, వాకిళ్లువున్నాయి రామదాసుది వేదాంత ధోరణి. సిరిదావచ్చిన వచ్చును అనే ధోరణిలో ప్రవర్తిస్తుంటాడు. ఈ సంవత్సరం సంగడు అందరి చేతా పొగతోట మాన్పించాలని పట్టుబట్టాడు.

రామదాసుకు బుచ్చయ్య గుర్తుకు వచ్చారు. ఆయన మహాతపశ్శాలి అతని దర్శనం చేసుకోవాలని సంకల్పం దీపం దగ్గర కూచొని గురు

కీర్తనలు చదువుతూ కూనిరాగాలు తీశాడు. ఎదురుగా ఈనిన బర్రె తన దూడను నాకుతూ వుంటె ఆయన ఆలోచనలు తరంగాలవలె కదిలి ఆడాయి. స్త్రీపురుష సంబంధమే అలాంటి దేమో. మొన్న తల్లి పెండ్లిమాట ఎత్తగానే వెంకటదాసు ఎంత ఆనందపడ్డాడు. పూర్వ సంస్కారంవల్ల సంగడికి అన్నీ మంచి దారులున్నాయి. రామదాసుకు శ్రీకృష్ణుని మాయా వినోదాలు గుర్తుకు వచ్చాయి. వెంకటదాసు చిరునవ్వు కృష్ణుని నవ్వువలె కనిపించింది. ఇంతలో నిద్ర పట్టింది.

రామదాసు తెల్లవారి లేచి బయటకెళ్తూ పల్లెల చుట్టూ పోగేసిన పశుకళేబరాలను చూసి మనసుకు కష్టపట్టాడు. దరిద్రులు, అజ్ఞానము వల్ల వీరు శౌచపద్ధతులు తెలుసుకొలేరని బాధపడ్డాడు. సంగడు వీరికి బళ్లు పెట్టి చదువు, వృత్తులు నేర్పించాలంటాడు. దానికి డబ్బు మనుషులు కావాలి. ఒక్క రోజులో జరగదు.

అప్పాదాసు తల్లి సుబ్బలక్ష్మి జ్యోతిని తనకొడుక్కుచేసుకోవాలని ఆమె కోరిక. బావపై జ్యోతికి మనసే.

సంగడు దేవుడిలాంటివాడు. అతనికి చౌదరయ్య కొడుకు తోడయ్యాడు. ఇద్దరూ ఎక్కడికెళ్లినా కలిసే తిరుగుతుంటారు.

అప్పాదాసు పశువులు తోలుకొని పొలానికెళ్లాడు. పశువుల కాపరులతో కలిసి ఆటలాడుకొన్నారు అలిసిపోయిన తర్వాత ఈత కొట్టడానికి వెళ్లారు. అందరూ కలిసి తెచ్చుకొన్న సజ్జసంకటి పెట్టుకొని తిన్నారు. పశువులు చెట్ల కింద పడుకొన్నాయి. వీళ్లు పాటలు పాడుతూ కేరింతలు కొడుతున్నారు సాయంకాలానికి అంతా పశువుల్ని తోలుకొని యింటిదారి పట్టారు.

రామదాసు మాలపల్లె నుండి బయలుదేరి వూర్లోకి వస్తున్నారు. రాత్రి పటంలో చూసిన శ్రీకృష్ణుని మోహనాకారం గుర్తుకు వచ్చింది. బుచ్చయ్య గారిని చూడాలని వస్తున్నారు. ఆయన గొప్ప జ్ఞాని.

రామదాసు బుచ్చయ్య గారిని కలిసి సాష్టాంగ నమస్కారం చేశాడు. రామదాసును లోపలికొచ్చి కూచోమన్నాడు బుచ్చయ్య. సంగదాసు, రామదాసు ఆయనసమీపంలో కూచొని ఆయన చెప్పింది శ్రద్ధగా వింటున్నారు.

రామనాయుడు దగ్గర సంగదాసు వుంటున్నాడు. రామనాయుడు యోగ్యులు. ఆయన సంగదాసుకు బుద్ధులు చెప్పాడు. సంగదాసు మేధావి. అతనికి సద్గురువు దొరికితే చాలు. శిష్యుడు యోగ్యత వస్తే గురువే వెతుక్కొంటూ వస్తారని చెబుతారు.

బుచ్చయ్యగారిని చూడటానికి రామానాయుడు వచ్చారు. సన్నగా దిద్దిన నామాలు, పచ్చని చిరుచూర్ణము, ముఖానికి కాంతినిస్తున్నాయి. నలబోతువారి కుటుంబం ఆ జిల్లాలో పేరుపొందింది. ఆ వంశంలో రామానాయుడు పాల సముద్రంలో అఘాతంలా పుట్టారు. ఆయనకు స్తోత్రపాఠాలు గిట్టవు.

బుచ్చయ్యగారు కొన్ని మత విషయాలు నాయుడుగారితోను, సంగదాసుతోను చర్చించాలనుకొన్నారు. సంగదాసును నాయుడు చెడగొడుతున్నాడని వూరివారు అనుకోవడం సబబుకాదని నాయుణ్ణి చూడగానే బుచ్చయ్యగారి కనిపించింది. ఇద్దరూ స్వప్రకాశంగల స్వతంత్రవ్యక్తులు. రామదాసు తనకుగల సందేహాల్ను వారివద్ద నివృత్తి చేసుకొన్నాడు.

ముగ్గురూ కలిసి ఆ ఉదయం వెంకటసుబ్బయ్య యింటివద్దకు వచ్చారు. రామానాయుడు వచ్చారు. ఆత్మయోపాసన గూర్చి సాకార నిరాకారాలను వింటున్నాడు. బుచ్చయ్యగారు త్వరలో జీవసమాధి చేయబోతున్నారని తెలిసి వారి దర్శనం చేసుకొనే అవకాశం కలిగినందుకు సంతోషించారు.

ఆయన జీవసమాధి సమయంలో అక్కడే వుండి చూడాలని సంగదాసు కోరిక, సంగదాసు రామానాయుడు ఇంటికెళ్ళారు.

వెంకటయ్య సంగదాసు తెల్లారి కొట్టంలోకి బోయి జీతగాళ్లను పనులకు పురికొల్పుతున్నారు. లక్షమ్మ ఆ ఇంటి యజమానురాలు. ఆమెది వాత శరీరం. మండోదరిలా ఇంటి నిండా వుంటుంది. పూర్వకాలం మనిషి కల్లాకపటం తెలియవు. నోరార వరసబెట్టి అందర్ని పిలుస్తుంది. సగం నెరసిన తలవెంట్రుకలు పెద్ద ముత్తయిదువలా కనిపింపచేస్తున్నాయి. ఆమె గుళ్లోకిపోవాలని బయలుదేరింది. ఫకీరు సాహెబ్ గుర్రపు బండి ఎక్కింది ఆమె కోడలు వెనక ఎక్కింది. రామానాయుడు బండి తోలుతున్నాడు.

రామానాయుడుకి గవర్నమెంటు ఉద్యోగం చేయడం ఇష్టంలేదు పొలం పనులు నేర్చుకోవాలని కోరిక.

వీళ్ళ బండి దేవాలయం దగ్గరకు వెళ్ళేసరికి పూజారి సిద్ధంగా ఉన్నాడు. అప్పయ్య పొడుగాటిమనిషి. అరవయ్యో పడిలో వుంటాడు. చిన్నప్పుడే భార్యపోయింది. నవ్వు మాటలు మాట్లాడుతుంటాడు.

లక్ష్మమ్మ కాపురానికి వచ్చి ముప్ఫయి సంవత్సరాలైనా అమ్మవారి దర్శనానికి యిదే రావడం. ఆ శక్తి దేవాలయం పురాతనమైంది. స్థల పురాణం లేదు. పుట్టకోట ప్రాంతంలో శిథిల దేవాలయాలు, పూడి పోయిన విగ్రహాలు, మట్టిదిబ్బలు కనిపిస్తుంటాయి. దేవాలయం సుందరమైంది. శిల్పవిద్య ముఖ మండపంలో కనిపిస్తుంది. అప్పయ్య అక్కడి శిల్ప విశేషాలను వాళ్లకు కథలు గట్టి చెప్పాడు. రుక్మిణిని శ్రీకృష్ణుడు రాక్షసవివాహంలో ఎత్తుకుపోయింది ఈ గుడివద్దనేనని పాత కథ చెప్పాడు.

వాసిరెడ్డి వారి సంస్థానకాలంలో ఈ ఆలయానికి మహా భోగం. ముస్లింల పరిపాలన కాలంలో అమీన్ ముల్క్ తన పేర బావి తవ్వించాడు. తురుష్కుల దాడిలో కొన్ని చక్కని బొమ్మలు నాశనమయ్యాయి.

ఆ మాటలు విని రామానాయుడు రక్తంలో వీరరసం విజృంభించింది. త్రిశూలధారిణి అయిన అమ్మవారు అతనికి కళ్ళకు కట్టింది. పూజానంతరం అంతా గుడిచుట్టు ప్రదక్షిణ చేశారు. తిరిగి బండిలో యింటికి తిరిగి వచ్చారు.

సంగదాసు అన్నం తిని తన ఆఫీసు గదిలో కూర్చున్నాడు కూలీలకు ఈ సంవత్సరం కోత కూలీ కింద గింజలిద్దామా డబ్బులిద్దామా అని లింగన్నతో చర్చిస్తున్నాడు. నీలి మందు ధర పడిపోయింది కూలి వాళ్ళకు అన్యాయం జరుగుతోంది. ఆ సాయంకాలం చౌదరయ్య రాలేదు. రామానాయుడు, సంగదాసు అలా షికారుకు బయలుదేరారు. ఆ సాయంత్రం మీటింగువల్ల చౌదరయ్య పొలెంలో వుండిపోయారు. చిన్నపరెడ్డితో కలిసి కూలీలకు అన్యాయం చేయాలని వారి ఆలోచన రామానాయుడికి కూలీలపై

ప్రేమ. ఈ నిర్భాగ్యులకు దేవుడే ఆధారమని ఆయన నమ్మకం. ఈ విషయంలో ఇద్దరూ కలిసి పెద్దలను ఎదిరిద్దామని శపథం చేశారు. ఒకవేళ కూలివాళ్ళు సమ్మెచేస్తే వాళ్ళకు తిండి ఎలా గడుస్తుందని, వస్తులుంటారని సంగదాసు అన్నాడు. దేవుడు దయామయుడు కాబట్టి వారిని రక్షిస్తాడని అతని నమ్మకం. ఏమీ దొరకకపోతే నాగజెముడు పండ్లు, బొద్దాకు తింటారని అతనివూహా. ఏమీ లేకపోతే మడతకుడుములు తింటారు. మడతకుడుములంటే ఆకలి ఎక్కువై అన్నపుతిత్తి మడతలు పడేటట్లుగా ముడిపెట్టుకొని పడుకోవడమే. ఇలా మాట్లాడుకుంటూ ఇద్దరూ ఇంటి ముఖం పట్టారు.

సంగదాసు రామానాయుడి గూర్చి ఆలోచించసాగాడు తండ్రికి అతను ప్రతిపక్ష నాయకుడు. పట్టుదల మనిషి. తండ్రిని కాదంటే స్థిరాస్థిలో నాలుగో భాగం వస్తుంది. రైతులు వ్యతిరేకమవుతారు. ఆయన ఎప్పుడూ కష్టపడ్డవాడుకాడు. ఇలా ఆలోచించాడు.

మాలపల్లె దగ్గరకు వస్తే అక్కడ దుర్భరదారిద్ర్యం తాండవిస్తోంది. సంగదాసు మేనత్త సుబ్బలక్ష్మి యింటికెళ్లాడు. ఆమె అతనికోసం ఎదురుచూస్తోంది. భర్త ఏణ్ణర్ధం క్రితం చనిపోయాడు. అప్పుడిని సంగదాసు చేతిలో బెట్టి తాను కన్నుమూద్దామని అనుకోంటోంది. మంచంలోంచి లేవలేకుండా వుంది. అప్పడికి ఏ లోపమూ రాకుండా చూస్తామని సంగదాసు హామీ ఇచ్చాడు. ఆమెను బండిలో ఆసుపత్రికి పంపించే ఏర్పాటు చేస్తానన్నాడు.

సంగదాసు యింటికి వచ్చి తండ్రిని గుంటూరు ప్రయాణం చేశాడు.

కూలి గింజల విషయం మాలపల్లిలో అందర్నీ చేర్చి సంగదాసు మాట్లాడాడు. అందరూ సమ్మె కట్టాలని తీర్మానించుమన్నారు. సంగదాసు చెప్పినట్లు నడుస్తామన్నారు. ఇతర పల్లెల వాండ్లు వీరిని అనుసరించి వస్తారని అనుకున్నారు. అ రోజు అందరూ యిళ్ళకు వెళ్లిపోయారు.

సంగదాసు ఉదయమే కాల కృత్యాలు తీర్చుకొని, కూలివాండ్లకు కోతకు రమ్మని కబురు పంపించి మునసబుగారి దగ్గరకు వచ్చాడు. మునసబుకు చౌదరయ్యకు పడదు. కూలీ తగ్గించాలని మునసబు కోరిక. చౌదరయ్య

చేసిన ద్రోహం మునసబు మరచిపోలేడు. ఇంటోవాళ్లు చౌదరయ్యతో స్నేహమేమిటని దుయ్యబడుతున్నారు కూలీలను నూరుగురిని తాము మాట్లాడుకున్నామని ఈరోజు మీకు రారని సంగదాసు చెప్పాడు. మునసబుగారు కూలీలు కావాలంటే నాలుగురోజుల కూలీ ముందుగా తీసుకోమని సంగదాసు కబురు పంపాడు.

సంగదాసు రామానాయుడు దగ్గరకు వెళ్లాడు. కూలీలు సమ్మె కట్టడానికి సిద్ధంగా వున్నారనీ, మునసబు అక్కడ రెడ్డితో మాట యిచ్చివచ్చినా చెదిరిపోయినట్లు కనబడుతున్నాడనీ సంగదాసు చెప్పాడు. కూలీలు ముఠాలుగా కొడవళ్లు, కూటిదుత్తలు తీసుకొని బయలుదేరుతున్నారు రామానాయుడు సంగదాసు ఒకగుంపుతో ఉన్నారు. నాయుడు కూలీలకంటె ముందు నడిచాడుగానీ కొంత దూరం పోయిన తర్వాత వెనక బడ్డాడు కూలీలు చేలోకి దిగి కోయడం ఆరంభించారు రామానాయుడు సంగదాసు కొడవళ్లు పట్టుకొని దిగారు. అలవాటు లేక రామానాయుడు చేయి కోసుకున్నాడు. ఎవరితోనూ చెప్పలేదు అలుపు వచ్చింది. సంగదాసు కూలీలతోబాటు కోస్తూనే వున్నాడు రెండు జాములకు ఆకలి అయింది. అక్క లక్ష్మి నాయడుకి వెండి గిన్నెలో అన్నం తెచ్చింది. రామానాయుడు అందరితో కలిసి భోంచేసి ఆదమరిచి నిద్రపోయాడు. సాయంకాలం లేచి చూచేసరికి, కూలీలు కోస్తూనే వున్నారు రామానాయడికి ఇదంతా కొత్తగా వుంది. ఫలహారం చేయలేదే అనుకున్నాడు దోసపండ్లు, ఊచబియ్యము అందించాడు సంగదాసు. బీదవాళ్ల ఆకలిఏమిటో అర్థమైంది.

కూలీల డబ్బు విషయంలో వూళ్ళో రెండు పక్షాలు ఏర్పడ్డాయి. సంగదాసు రామానాయుడికి బాగా మైత్రి కుదిరింది. కూలీల విషయం ముందుగా పోయి వారి తండ్రితో మాట్లాడుదామని నిశ్చయించుకున్నారు పనివాడికి కుడుపు నిండా కూలీ యివ్వనిదే పనిచేయలేరని యజమానులు గ్రహించాలని రామానాయుడు ఉద్దేశ్యం.

ఆ సాయంకాలం యిద్దరూ ఇంటికి వచ్చారు. తండ్రి చౌదరయ్య తన గదిలో కూర్చుని వున్నారు.

నల్లమోతు వారిది గుంటూరు జిల్లాలో ప్రశస్తమైన కుటుంబం. అన్నవస్త్రాలకు లోపం లేదు. మర్యాదకు, పౌరుషానికి పెట్టింది పేరు. కంపెనీ ప్రభుత్వ హయాములో నల్లమోతు రామన్న చౌదరిగారి నాయకత్వం క్రింద ప్రజలు తిరగబడి పన్నులు ఎగవేశారు. చౌదరయ్య కుటుంబం ఆస్తిపరులు. తండ్రి చనిపోయేటప్పటికి 200 ఎకరాల మాగాణి 100 ఎకరాల మెట్ట వున్నాయి. చౌదరయ్యకు పెత్తనానికి వచ్చిన తర్వాత అది 500 ఎకరాలమాగాణి, 300 ఎకరాల మెట్ట 3లక్షల కవిల స్థాయికి పెరిగింది. సువిశాలమైన యిల్లు. లక్ష్మమ్మ ఆయన ధర్మపత్ని. మిద్దెలో దక్షిణంవైపు చౌదరయ్య కచేరి గది. మేడ యావత్తూ కొడుకు రామానాయుడు వాడుకుంటాడు. చౌదరయ్య అన్నకొడుకు వెంకటయ్య కూడా అయింట్లోనే పడుకుంటాడు. చౌదరయ్యది రాజ ఠీవి. బుర్రమీసాలు, నల్లనిముఖం, స్ఫోటకం మచ్చలు. అయినా వికారి కాడు.

చౌదరయ్య మంచి వ్యవహర్త. చదవను రాయను బాగా నేర్చినవాడు. వారి యింట్లో వ్యవసాయపు పని అజమాయిషీ చేయడం సంగదాసు పని. భోజనం పెట్టి నెలకు 15 రూపాయలు జీతం ఇస్తారు. ఆరోజు చౌదరయ్య ధుమధుమలాడుతున్నాడు. లక్ష్మమ్మ మీద కోప్పడుతున్నాడు. 'మీ అబ్బల కాలంలో మీవాళ్లు ఎప్పుడైనా చేలో కోతలు కోశారా!' అని విసుర్లు విసిరాడు. 'మా సంగతెందుకు మావాళ్లు ఎప్పుడూ మీకంటె పై చేయిగా వున్నారు.' అని లక్ష్మమ్మ ఎత్తి పొడిచింది. అయితే పిల్లవాణ్ణి కోత కెందుకు పంపించావని కసురుకున్నాడు. దీనికంతటికి కారణం సంగదాసు అని అతని అనుమానం. కొడుకుమీద కోపం భార్యమీదకు తిప్పి నువ్వు అన్నవస్త్రాలు పెట్టి కొంపగుల్ల చేస్తున్నావన్నాడు. కొడుకును ఉద్యోగానికి పంపిస్తానని, కోడలి మిద్దెమీద నుండి దిగి రానేరాదని చౌదరి అన్నాడు. సంగదాసు కొడుకును చెడగొడుతున్నాడని గట్టిగా నమ్మాడు. పిల్లవాడు దారి తప్పు తున్నాడేమోనని విచారించాడు. మనిషి కొంచెం శాంతపడ్డాడు.

చౌదరయ్య సంగదాసును పిలిచాడు. రామానాయుడు కూడా వచ్చాడు. కులీల విషయం ప్రస్తావన వచ్చింది కూలీలకు డబ్బులే యిద్దామని చౌదరయ్య

ప్రతిపాదించాడు. జొన్నలు యిస్తే తమకు లాభం రాదన్నాడు. ఏ రోజు ధరలు ఆ రోజు కాబట్టి ధాన్యం ఇవ్వటమే మంచిదని సంగదాసు వాదించాడు. ఆరు అణాల కూలి చాలా ఎక్కువనీ, రైతులు భరించలేరని చౌదరయ్య నిష్కర్షగా చెప్పాడు. ధాన్యం ధర నాలుగు రెట్లు పెరిగినపుడు కూలీ ఎందుకు పెంచరని సంగదాసు సుదీర్ఘంగా మాట్లాడాడు. కూలీల దగ్గర నుండి కమతగాళ్ళు, జీతగాళ్ళ విషయానికి సంగదాసు వచ్చాడు.

కూలీలకు వత్తాసు పలికాడు సంగదాసు. ఎలాగైనా వాళ్ళమీద కనికరం చూపమన్నాడు. 6 అణాలకు మించి పైసా యివ్వనని చౌదరయ్య ఖండితంగా చెప్పాడు. కీడెంచి మేలెంచడం మంచిదనీ కూలీలు సమ్మెకు దిగే అవకాశం వుందని సంగదాసు చౌదరయ్యను ఆలోచించమన్నాడు.

కూలీ జనం వీధిలో మూగారు. ముందరరోజు మనసబుగారింటి దగ్గర కూలి విషయమై గలాటా జరిగింది. అందువల్ల ఈ రోజు చౌదరయ్య ఏం చేస్తాడో చూద్దామని అంతా గుంపుగా చేరారు. చౌదరయ్య ఏదో రభస జరుగుతుందనుకున్నాడు. కూలీలలో ముఖ్యమైన వాళ్ళను ముందుకు రమ్మన్నాడు. శేషయ్య, రంగదాసు, వీరదాసు ముందుకు వచ్చాడు. వాళ్ళతో చర్చలు జరిపారు చౌదరయ్య. రేపు సాయంత్రం కూలీ యిస్తానన్నాడు. ఈ పూట పస్తులుండమంటారా అన్నారు వాళ్ళు. విధిలేక కూలీలకు ధాన్యం కొలిపించాడు.. సంగదాసు రేపు సాయంకాలం సంగతి ముందే అలోచించమని కూలీలకు చెప్పాడు.

రామానాయుడు యింటికి వచ్చేసరికి ఒక మునలమ్మ తన తల్లి లక్ష్మమ్మతో మాట్లాడుతోంది. వాళ్ళ అమ్మమ్మ లచ్చుక్క 40 ఏళ్ళు జమీ ఏలింది. ఇప్పుడు ముసలిదానికి తిండికి జరగటం లేదు. 7 రోజులైంది అన్నంతిని. లక్ష్మమ్మ అన్నం తెచ్చి పెడుతోంది. గంజితెచ్చి పోసింది. ఇంతలో చౌదరయ్య వచ్చాడు. ముసలిది ఆత్రంగా తాగబోతూ మింగుడు పడక ఉక్కిరి బిక్కిరైంది. జావకడుపులోకి పోయే సరికి కాళ్ళు చేతులూ కొంగర్లు పోయాయి. కట్టెవలే బిగిసింది. అంత్యదశ అనుకున్నారు. గాలి తెమ్మెర వీచింది. భగవదనుగ్రహం వల్ల కాలు కదిలింది చౌదరయ్య ఇవన్నీ పట్టించుకోకుండా మేడ మీదికి

వెళ్ళి కోడలు చేత అన్నం పెట్టించుకొని తిన్నాడు చౌదరయ్యకు ఇది నచ్చలేదు

రామానాయుడు భోజనానికి కూర్చున్నాడుగానీ మునలమ్మ దీనాలాపం గుర్తుకు వచ్చింది తండ్రికనికరం లేకుండా వుండటం ఎందుకో తెలియలేదు. ఆయన హృదయశూన్యుడు రామానాయుడు భోజనం చేసివచ్చి అవ్వ దగ్గరకు వచ్చి ఆమె కధ అడిగి తెలుసుకున్నాడు

ఆమెకు ఒక కొడుకు వుండేవాడు వాడి పెళ్ళాం ఎవరితోనో లేచి పోయింది వాడు మరంలో కలిసి పోయాడు ఆస్తి పాడైంది పదేళ్ళ నుంచి తన రెక్కల మీదే బతుకుతోంది బగవంతుడికింకా దయరాలేదు చౌదరయ్య ఆ కద కల్పిత కద అన్నాడు ముసల్ది బాదపడింది చావడానికి సిద్ధంగా వున్న తాను అబద్ధం చెప్పనంది

రామానాయుడు మేడ మీదికి పోయినాడు అతనికి కూలివాళ్ళు మునలమ్మ జ్ఞాపకం వచ్చారు మునలమ్మను సంగదాసు చూస్తే బాదపడే వాడు అతడు చిత్రమైన మనిషి, మేధావి, యోగ్యుడు, దయాదాక్షిణ్యాలు అపరిమితం సంగదాను దగ్గరకు వచ్చాడు రామానాయుడు ఇద్దరూ కలిసి మెట్లేక్కుతూంటే చౌదరయ్య గమనించాడు వ్యవహారం శృతిమించి పోయిందని అనుకున్నాడు రామానాయుడు మునలమ్మ విషయం నంగదానుకు చెప్పాడు. వాళ్ళకు దేవుడే దిక్కని సంగదాసు సర్దిచెప్పాడు సంగదాసు మేనత్త ఆ రోజు ఆస్పత్రిలో చనిపోయింది ఎవరో పొలంలోకి వెళ్ళావని కొట్టారట శస్త్రచికిత్స చేయటానికి కూడా వీలులేకుండా చేయికుళ్ళి పోయింది. డాక్టరు మరణ వాగ్మూలం తీసుకున్నాడుగాని మునసబు అది తీసిపార వేయించి వాతరోగంతో చనిపోయిందని వ్రాయించాడు రామానాయుడి మనస్సు వికలమైపోయింది.

సంగదాసు 4 రోజులు శలవు కావాలని చౌదరయ్య దగ్గర చెబుదామనుకున్నాడు పాప పుణ్యాల ప్రస్తావన వచ్చింది. కూలీల జీతం విషయం చర్చించుకున్నారు వాళ్ళమాటలు చౌదరయ్య జాగ్రత్తగా విన్నాడు ఆ తర్వాత వాళ్ళిద్దరూ తమ గదుల్లోకి వెళ్ళిపోయారు పిల్లవాడికి సంగదాసు సాంగత్యం తప్పిస్తే తప్ప బాగుపడడని నిశ్చయించుకున్నాడు ఉద్యోగంలో

చేర్పించడమే మార్గమనుకున్నాడు. కూలీలకు రేపు జీతాలివ్వాలి ఎలానైనా వాళ్ళ మెడలు వంచాలి. సంగదాసు వుండడు కాబట్టి కొంత మెరుగు.

రామానాయుడు ముందురైలుకు వెళ్ళేటట్లు, తర్వాత బండికి సంగదాసు వచ్చేటట్లూ అనుకొన్నారు. సంగదాసు చీకటితో లేచి ఇంటికి వెళ్ళాడు. బండి వాకిట్లో నిలుచునివుంది. రామానాయుడు తల్లి దండ్రులకు చెప్పి బయలు దేరాడు. చౌదరయ్య అంగీకరించటం కొడుక్కి ఆశ్చర్యం వేసింది. బండి హుషారుగా వెళుతోంది. రైలు స్టేషను చేరుకున్నారు. జనం కిక్కిరిసి వున్నారు. ద్వంద యుద్ధం ప్రారంభమైంది. ఎవరి గొడవ వారిది. రామానాయుడు సెకండు క్లాసు బండి దిగి వూళ్ళోకి బయలు దేరాడు. గుడ్డల అంగళ్ళకు వెళ్ళి చొక్కా గుడ్డలు కొని కుట్టించి స్టేషనుకు తిరిగి వచ్చాడు. సంగదాసు రైలు దిగాడు. ఇద్దరూ కలిసి ఒకే పంక్తిలో హోటలులో భోంచేశారు. బెజవాడ వెళ్ళడానికి సిద్ధమయ్యారు.

బెజవాడ రైల్వేస్టేషల్లో రామానాయుడు, సంగదాసులకు రామేశ్వరరావు స్వాగతం పలికాడు. వాళ్లు ఆవూళ్లో జరుగుతున్న హరిజనోద్యమసభకు ప్రతినిధులుగా హాజరు కావాలని వచ్చారు. సంగదాసు విషయనిర్ణయ సంఘంలో చిత్తు తీర్మానాన్ని ప్రవేశపెట్టాలని రామేశ్వరరావు కోరాడు. ఇద్దరూ కలిసి సభాపతి బసచేరుకొన్నారు. సభాపతి వెంకటరెడ్డి గారు. ఆయన సంగదాసును సాదరంగా పలకరించారు.

అక్కడ ఇంకా ఎందరో సమకూడారు. గుంటూరు నుండి రామసోమయాజులు గారు వచ్చారు. వారికి సంగదాసును పరిచయం చేశారు. కులవృత్తులలో వున్న గొప్పతనాన్ని గురించి ముచ్చటించుకున్నారు. వృత్తి సాంకర్యం జరిగిందని సంగదాసు అంటే దానివలన నష్టము ఏమిటని వెంకటరెడ్డి అన్నాడు. వర్ణవిభజనమనే మహాసౌధం శిథిలమైందని చెప్పవచ్చు. సంభాషణలో సంగదాసు ఇతరులను మెప్పించగలడు. సభ మర్నాడు ఉదయం పది గంటలకు ప్రారంభిద్దాం అనుకున్నారు. మర్నాడు ఉదయం 7.30 గంటలకు కలుసుకునేలా నిర్ణయించుకున్నారు.

సంగదాసు చీకటితో లేచి తీర్మానాలు వ్రాస్తున్నాడు సభాపతి సంగదాసు కూర్చున్న కాసేపటికి చౌదరయ్య సోమయజులు అక్కడికి చేరుకున్నారు మత విషయాల మీదికి సంబాషణ మరలింది శైవులు యజ్ఞోపవీతాలు తీసివేశారు బసవన్న రామానుజులు, దొడ్డయాచార్యులు వేదాంత దేశికులు తమ తమ బోధలు చేశారు మరి రామమోహానులు యజ్ఞోపవీతం త్యజించ లేదు ఈమాటలు వింటూ సోమయాజులు మనమందరం కర్మలు ఆచరించవలసిందే యజ్ఞోపవీత దారణ చేయవలసిందే అన్నారు చౌదరయ్య భక్తి జ్ఞాన యోగాలు చాలవా? అన్నారు. రెండింటిలో ఒకటి చాలుననీ మరొకటి పారవేయ నవసరం లేదని సంగదాసు చెప్పాడు అంతటితో సబ విరమించారు 10 గంటలకు సభ జరుగుతుందని బెజవాడ అంతా తెలిసిపోయింది సబాపతి గారి ఊరేగింపుకు రామేశ్వరరావు బ్యాండుమేళం ఏర్పాటు చేశారు కొందరు అలా జరగటానికి వీలు లేదని ఇంజక్షన్ ఆర్డరు తెచ్చేదానికి ప్రయత్నం చేశారు గాని ప్రయోజనం లేకపోయింది వెంకటరెడ్డి సంగదాసు బండిమీద కూర్చున్నారు. ఊరేగింపు బయలు దేరింది సభామండపం బాగా అలంకరించారు సింహద్వారం వద్ద అరుందతీ విగ్రహం ఏర్పాటు చేశారు.

సభ ప్రారంబమైంది చౌదరయ్య ఆహ్వానం పలికారు వెంకటరెడ్డిని అద్యక్షులుగా సంగదాసు ప్రతిపాదించాడు ఆయన తన కృతజ్ఞతలు తెలియజేస్తూ సుదీర్ఘోపన్యాసం చేశారు.

''పూర్వం సంఘదర్మాలు కొంతకాలానికి కట్టుబాట్లయినాయి దనిక ప్రభుత్వం యేర్పడి దిగువ జాతులకు బాదాకరమైంది ఈ పరిస్థితిని మార్చుడానికి ప్రయత్నం జరుగుతోంది ప్రపంచ దేశాల పరిస్థితి కూడా అలానే వుంది మన ఉద్యమం పవిత్రమైంది న్యాయానికి కట్టుబడి పండేపంటలో కూలీలకు తగిన భాగం ఇవ్వటానికి బూస్వాములు అంగీకరించాలి ధనిక సోదరులు మన ఉద్యమాన్ని నిరసించకూడదు'' అంటూ ఉపన్యాసం ముగించాడు

సంగదాసు కొన్ని తీర్మానాలు ప్రవేశ పెట్టారు. ప్రధానంగా పంచములు తమ పేర్లకు మర్యాదవాచకాలను చేర్చుకోవాలి. ఆరోగ్యానికి స్నానం మొదలైన శౌచపద్ధతులను పాటించాలి. దిగువ జాతుల వారికి ఉద్యోగాలలో అవకాశాలు ఇవ్వాలి. అస్పృశ్యతను ఎదుర్కోవాలి. పంచములకు విద్యాలయాలు, వసతి గృహాలు స్థాపించాలి.

తీర్మానాలను ఆ సాయంకాలం సభలో అంగీకరించారు. నూతక్కి రామయ్యగారు పంచముల నిమిత్తము తమ వూరిలో రామాలయం కట్టిస్తానని ప్రకటించారు. రామచంద్రచౌదరి తమ గ్రామంలో పంచములకు చెందిన ఆంజనేయస్వామికి 3ఎకరముల మాగాణి భూమి చదివించారు.

రాత్రి 10 గంటల రైలుకు సభాపతి హైదరాబాదు వెళ్ళారు. నరసరావుపెట బండిమీద రామానాయుడు, సంగదాసు ప్రయాణమయ్యారు. సంగదాసు సంఘానికి కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు

రైల్లోకూర్చున్న సంగదాసుకు రైలు ఒక ప్రపంచంలా కనిపించింది. మనుషులు కొందరు చనిపోయినట్లు రైలులో కొంతమంది ఎక్కుతారు దిగుతారు. కృష్ణార్జునులు లాగా సంగదాసు, రామానాయుడు ప్రవర్తించారు. సంగదాసు తన వూరి దగ్గర దిగిపోయాడు. రామానాయుడు రైల్లో ప్రయాణం కొనసాగించాడు. సంగదాసు నడుచుకుంటూ తన వూరికి వెళ్ళాడు. సంగదాసు ఇంట్లోకి రాగానే ఆదంసాహెబ్ రామానాయుడు సంగదాసు హోటలులో కలిసి భోజనం చేసినందుకు చౌదరయ్యకు కోపం వచ్చిందని చెప్పాడు. ఊళ్ళో కూలివారంతా బందు చేశారు. ఇదంతా సంగదాసు చేసిందేనని చౌదరయ్య నమ్మకం. బెజవాడలో జరిగిన పంచముల సభను గురించి తెలిసిపోయింది. అందువలన చౌదరయ్య ఎదుటపడవద్దని సంగదాసు హెచ్చరించాడు.

చౌదరయ్య వీధిలోకి వచ్చి సంగదాసు ఉన్న యింట్లోకి వెళ్ళినుంచున్నాడు. చౌదరయ్య చేతిలో రాగోల కర్రవుంది. పళ్ళు పటపట కొరుకుతున్నాడు.

కర్రతీసుకుని సంగదాసు తలమీద కొట్టాడు. సంగదాసు చతికిలబడి నేలకొరిగాడు. తలబద్దలైంది. రక్తం చిమ్మింది. చౌదరయ్యకు కళ్ళుబైర్లు కమ్మి యింట్లోకి పరుగెత్తాడు. లక్ష్మమ్మ ఏదో కొంపమునిగింది అనుకుంది. జీతగాడొకడు ఇదంతా చూశాడు. జీతగాళ్ళంతా పరుగెత్తుకొని వచ్చారు. చౌదరయ్య కోసం ఇల్లంతా వెతికారు. అతడు కనబడలేదు. పడమటింట్లో పత్తిమండెమీద దాంకోని వున్నాడు. సత్తిగాడు మాలపల్లెకు పరుగెత్తాడు. ఆదంసాహెబ్ మునసుబు దగ్గర రిపోర్టు యిచ్చాడు. లక్ష్మమ్మ చౌదరయ్య మీద పత్తివేసి కనబడకుండా తట్టలు పెట్టింది. ఆపద గట్టెక్కించటానికి పంతుల్ని పిలిపించమన్నాడు చౌదరయ్య.

లక్ష్మమ్మ తన పసుపుకుంకుమలు కాపాడమని పంతులికి చెప్పి, మీబావను ఒడ్డున చేర్చమనీ గోడుగోడున ఏడ్చింది. అవకాశాన్ని జారవిడుచుకునే మనిషి కాదు పంతులు. ''అక్కా! డబ్బును బావ సంపాదించాడు కానీ బావను డబ్బు సంపాదించలేదు. సమయం అటువంటిది 4,5 సంచులు ఖర్చు చేయవలసి వస్తూంది'' అన్నాడు పంతులు. సంభాషణ వింటున్న చౌదరయ్య నాలిగిటితో సరిపుచ్చమన్నాడు. అవసరమైతే సంగదాసు తండ్రి రామదాసుని లోబరుచుకోవాల్సి వస్తుంది అన్నాడు.

చౌదరయ్య అందుకు అంగీకరించలేదు. ఎంత ఖర్చైనా సర్కారుకు కట్టి పోలీసులు తమ యింటికి రాకుండా పంతుల్ని చూడమన్నాడు. 5 సంచులు దొడ్డివాకిలి గుండా పంతులింటికి లక్ష్మమ్మను చేర్పించమన్నాడు. వీధివాకిలి మాత్రం తీయవద్దన్నాడు. పంతులు దొడ్డివాకిట రావటం ఎవరైనా చూశారేమోనని అనుమానించాడు. పంతులు వెళ్ళిపోయాడు. రామదాసు పొలంపోయాడంటే అతనికి చెప్పడానికి సత్తిగాడు పోయాడు. వెంకటదాసు గండ్రగొడ్డలి తీసుకొని పరుగెత్తాడు. మాలక్ష్మి ఏడుస్తూ వచ్చింది.

వెంకటదాసు చౌదరయ్యను ఇంట్లోనుంచి బయటకు రమ్మని గర్జించాడు. జీతగాళ్ళు, కూలివాళ్ళు ,రాళ్ళవాన కురిపించారు. మాలక్ష్మి గుండెలు బాదుకొని ఏడుస్తుంది. రక్త ప్రవాహం చూసి కళ్ళు భ్రమలు కప్పినవి. రంగదాసు సంగదాసును కదిలించిచూసి ప్రాణముందని గ్రహించాడు. రామదాసు

పరుగెత్తుకుంటూ వచ్చాడు. సంగదాసు కళ్ళు మూతపడ్డాయి. రామదాసు అంతా అయిపోయిందని భోరుభోరున ఏడ్చాడు. జనం హాహాకారాలు చేశారు. శవం మీద గుడ్డకప్పారు. పోలీసు షూటు వస్తున్నదని ఎవరో మునసుబుతో చెప్పారు. జనాల్ని వెళ్ళిపొమ్మన్నారు. వాళ్ళు ససేమిరా పోమన్నారు. పంతులు తీర్పుచెప్పినట్లుగా చెప్పాడు. వెనకాముందు ఆలోచించుకోవాలన్నాడు. జరిగి పోయిందేదో జరిగిపోయింది. శవాన్ని ఊరేగింపు చేసి ఉత్తర క్రియలు చేద్దామన్నాడు. జనానికి ఆమాట నచ్చింది. జరిగింది ఎవరూ కళ్ళతో చూడలేదు కాబట్టి సర్దుకుపోవాలన్నాడు. ఖర్చులకు 500 రూపాయిలు ఇప్పిస్తానన్నాడు. 5 దమ్మిడీలు కూడా మాకువద్దని బిడ్డమాంసం అమ్ముకోలేమని మాలక్ష్మి ప్రార్థించింది. శవాన్ని భూస్థాపితం చేసి అక్కడే సమాధికట్టి ఆరాధన చేసుకునేందుకు 50 గజాల చోటు బజారు ధరకు ఇప్పించమని రామదాసు కోరాడు. పంతులు తథాస్తు అన్నాడు.

పోలీసువారు, గ్రామస్తులు, పంతులు కలిసి మాట్లాడి వచ్చారు. తన కొడుకు ఆయువుమూడి చచ్చాడని రామదాసు పోలీసు ఇనస్పెక్టరుకు చెప్పాడు. పంచాయితీ జరిపారు. ఎవరి మీద అనుమానం లేదని రామదాసు ధృవీకరించాడు. పంతులు, మునసబు, కరణాలు మరో యిద్దరూ వాఙ్మూలం మీద సంతకాలు పెట్టాలి. నీవు ముందంటే నీవు ముందని ఎవరూ చేయలేదు. శవాన్ని ఊరేగింపు చేసి ఖననం చేయటానికి అంగీకరించారు. గ్రామస్థులు, పోలీసులు, పంతులు అక్కడి నుండి బయలు దేరారు. కరణము, మునసుబు వ్యవహారం డబ్బుతో కుదుర్చుకున్నారు. మూడు సంచులు ఒప్పందం చేసుకున్నారు. అందరు పంతులుగారింటికి పోయి కూర్చున్నారు. తక్కినవాళ్ళ నిషానీలు వాళ్ళేవేశారు. అందరూ వెళ్ళిపోయిన తర్వాత పంతులు చౌదరయ్య యింట్లోకి వచ్చి 5 సంచులతో పని పూర్తి చేసుకువచ్చానని చెప్పాడు. చౌదరయ్య దూదిపింజలు దులుపుకుంటూ బయటకువచ్చాడు. ఎందుకైనా మంచిదని వూరేగింపు అయ్యేంతవరకు వీధి తలుపులు తీలేదు.

శవాన్ని వూరేగించారు. పూలదండలు జనం వేశారు. శవాన్ని భూస్థాపితం చేసి అంతా వెళ్ళిపోయారు.

రామానాయుడు రైల్లో నరసరావుపేట దగ్గర దిగి గుర్రంబండిలో నాదెళ్ళ వెళ్ళాడు. అది ఆయన అత్తవారి వూరు ఇంటి దగ్గరకు వెళ్ళగానే రామానాయుడి కొడుకు 'సాహు' తండ్రిని గుర్తు బట్టి ఆనందముతో కేక వేశాడు అత్త అనంతమ్మ కుశల ప్రశ్నలు వేసింది. సాహు రామానాయుడితో మురిపాలు పడ్డాడు మేడమీది నుంచి బార్య కమలమ్మ అబ్యంగన స్నానం త్వరగా పూర్తిచేసి వచ్చింది ఆమె సర్వాంగ సుందరి కాన్పు ఎడం కావడంచేత కొంచెం ఒళ్ళు వచ్చింది 'నిన్ననే వస్తారనుకున్నాము'అంది భర్తతో బార్యాబర్తలు కొంచెంసేపు సరసాలాడారు రామానాయుడు స్నానానికి లేచాడు భోజనానంతరం వెంకటయ్య ఇచ్చాడంటూ జీతగాడు రామానాయుడుకి ఒక ఉత్తరం తెచ్చియిచ్చాడు ఉత్తరం చదివి అతడు కూలబడ్డాడు తన తండ్రి కొడితే సంగదాసు చనిపోయాడని అందులో వ్రాసి వుంది కమలమ్మ సంగదాసు ఋషివంటివాడు అంటూ బాదపడింది ఉత్తరం తెచ్చియిచ్చిన వాణ్ణి వివరాలు తెలుసుకున్నాడు రామానాయుడు. జరిగినదంతా వాడు చెప్పాడు.

రామానాయుడు దుఃఖంతో కుమిలి పోయాడు బండిలో యెక్కి బార్యాబిడ్డలతో హుటాహుటిన బయలుదేరాడు సాయంకాలానికి వూరు చేరాడు. ఇల్లు ఇల్లుగా కనబడలేదు లక్ష్మమ్మ జరిగినది పూసగుచ్చినట్లు చెప్పింది పంతులు దయచూశాడు కాబట్టి సరిపోయింది. లేకపోతే మీమామగారు మనకు దక్కేవారు కాదంది హోటలులో యిద్దరూ కలసి భోచేయటం, కూలీలు సమ్మెచేయటం, సహించలేక అలా చేశాడని చెప్పింది కోపం వస్తే మంచి చెడ్డా తెలియవు కాలం కర్మం కలిసి రాబట్టి సరిపోయింది గానీ లేకపోతే కొంపమునిగి వుండేది అని చెప్పింది.

సంగదాసు తల్లి దండ్రులు ఎంతో యోగ్యులనీ డబ్బును విషంగా చూశారనీ లక్ష్మమ్మ చెప్పింది మద్యవర్తులు 5 వేలు కాజేశారంది. కడుపు తీపితో మాలక్ష్మి పడుతున్న బాధ వర్ణనాతీతం వెళ్ళి చూసి వద్దామంటే లక్ష్మమ్మను బర్త పంపలేదు

చౌదరయ్య కోడల్ని చూసి కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు కమలమ్మ మామగార్ని ఓదార్చింది చౌదరయ్య ముసుగు పెట్టి పడుకున్నాడు

రామానాయుడు తండ్రి దగ్గరకు వచ్చి ఆయన దిగులును చూసి కర్మఫలం అనుభవించక తప్పదన్నాడు చౌదరయ్య పెద్దపెట్టున ఏడ్చాడు తండ్రికొడుకులు కావిలించుకొని యేడవ సాగారు తండ్రి స్థితిని చూసి రామానాయుడు ఆలోచన చేయసాగాడు ఇంతలో పంతులు వచ్చాడు వ్యవహారం కష్టంగా వుందని చెప్పాడు కూలీలు రామంటున్నామన్నాడు ముందుగా కూలి యివ్వనిదే పని జరగదన్నాడు

రామదాసు సంగదాసు సమాదివద్ద గురుకీర్తనలు చదువుతున్నాడు అప్పాదాసు సంగదాసు వలె తానుకూడా సంఘసేవ చేయాలని నిశ్చయించుకున్నాడు అతని జ్ఞాపకార్థం ఏదైనా ఒక మంచి కార్యం చేద్దామని రామదాసుతో అన్నాడు రామాలయం కట్టించేందుకు రామదాసు 200 రూపాయిలు ఇస్తానన్నాడు సమాధి వద్ద కూలీలందరూ సంగపీరం ఏర్పాటు చేద్దామని అనుకుంటున్నారని అప్పాదాసు చెప్పాడు

ఆ రోజు ఐదారు వందలమంది జనం పోగయ్యారు రామదాసు కాళ్ళకు గజ్జెలు కట్టుకొని చిరతలు పట్టుకొని ఏకతార వాయిస్తూ తత్వాలు ప్రారంబించాడు వీరబ్రహ్మంగారి కాలజ్ఞానం మొదలు పెట్టి బ్రహ్మంగారి గొప్పతనాన్ని వర్ణిస్తున్నాడు

శేషయ్య సభమధ్యలోకి వచ్చి సంగదాసు పేరుమీద సంగపీరం యేర్పాటు చేస్తామని అన్నాడు డబ్బు నగలు వసూలయ్యాయి మర్నాటినుంచీ సమాధి కట్టడం ప్రారంభమైంది పంచముల నాయకుడైన సంగదాసును ఎవరో చంపారనీ అతని పెద్ద దినం రోజున సంగపీరం ప్రారంబం అవుతుందనీ పత్రికలలో వ్యాసాలు వచ్చాయి ఎక్కడెక్కడ నుంచో పీరానికి పైకం వచ్చిపడింది సమాది పక్కనే బావిత్రవ్వారు పెద్ద దినానికి మూడురోజుల ముందే సమాధిపని పూర్తి చేశారు

కార్తీకమాసం వెన్నెల పిండార బోసినట్లుంది అందరూ సమారాదన ప్రయత్నాలు చేస్తున్నారు సమాధి దగ్గర రోడ్డు పొడవునా అంగళ్లు దుకాణాలు వెలిశాయి దూరపు వూళ్ళనుంచి జనాలు వచ్చి దిగుతున్నారు బుర్రకథలు, బజనలు చెబుతున్నారు బెజవాడ నుండి రామేశ్వరరావు గారు, హైదరాబాదు

నుండి వెంకటరెడ్డిగారు ఇతర అభిమానులూ వచ్చారు భోజనానంతరం సంగపీఠస్థాపన జరిగింది. పఠన మందిరానికి రామేశ్వరరావు 500 రూపాయిలు వాగ్దానం చేశారు గ్రంథాలకోసం బాగిరెడ్డి 500 రూపాయిలు ఇస్తానన్నాడు. సభ ప్రారంభమైంది అప్పాదాసు నగర సంకీర్తనం పూర్తిచేసి వచ్చాడు వెంకటరెడ్డి గారిని సభాధ్యక్షుల్ని చేశారు ఆయన తన ఉపన్యాసంలో ఇలా అన్నారు

''హరిజనోద్ధారకుడైన సంగదాసు అకాలమరణం చెందారు. మన ఉద్యమం మహా యజ్ఞము దీనికి సంగదాసు ప్రాణాన్ని బలియిచ్చారు. ఆయన త్యాగం మనకు ఆదర్శం కావాలి కులంతో ప్రమేయం లేదు సంగదాసు ఆత్మకు శాంతి కలుగు గాక అంటూ సభ చాలించాడు

కొన్నాళ్లకు రామదాసు సంసారవ్యవహారాలు మాని సంగపీఠంలో దర్మంగా చదువుచెబుతున్నాడు కూలీలు పఠన మందిరంలో పత్రికలు చదువుకొంటున్నారు చౌదరయ్య యింకా బయట తిరగడం లేదు. ఇంట్లోనే కూచొంటే ఏమీ తోచడంలేదు ఎలానైనా హరిజనుల్ని లొంగదీసుకోవాలని పంతులు చౌదరయ్య గూడుపురాణీ చేశారు రామదాసు కొన్న పది ఎకరాల పొలంమీద దావా తెచ్చేలా ఆలోచించారు దానికి ప్రతిఫలం పంతులుకు ముడుతుంది.

వారసత్వవ్యాజ్యం వేయడానికి నిశ్చయించుకోవడంతో చౌదరయ్య మనస్సుశాంతించింది పొలం మీదకి పోయివస్తున్నారు

రామానాయుడి భార్య కమలమ్మ స్వంతకాపురం పెడదామనీ, అన్నదమ్ములు బాగపరిష్కారం చేసుకోండనీ భర్తను పురికొల్పింది రామానాయుడి సోదరుడు వెంకటయ్య అతడు పొలంపనులు చేస్తాడు

రామానాయుడి పినతల్లి కొడుకు మోహనరావు పెద్దమ్మను చూడటానికి వచ్చాడు అతడు షోకిలా పురుషుడు కసరత్తు చేసిన శరీరం పెళ్ళికాలేదు బి యల్ పరీక్షకు మద్రాసులో చదువుకొంటున్నాడు ప్లీడరు వృత్తి చేయాలని పట్టుదల రామానాయుడు హరిజనోద్యమం గురించి మోహన్‌తో చర్చించాడు

అతడు దాని వైపు మొగ్గుచూపలేదు. రామానాయుడు మాలపల్లెకు వెళ్లాడు.

మోహనరావు నిద్రపోతున్నాడు. కమలమ్మ వీణమీద 'రమణీ మణి వేగమె పోగదె-సామిని తేగదె' అనే పాట వాయిస్తుంది. ఆ తర్వాత మోహన రాగంలో పాట పాడింది. తర్వాత మోహనకు ఫలహారం తెచ్చిపెట్టింది. కమలమ్మకు అతనిపై మనసు పడింది. ఇద్దరూ మనస్సు విప్పి మాట్లాడుకొని శరీరస్పర్శతో ఆనందించారు.

రామానాయుడు ఆ సాయంకాలం మందిరం దగ్గర ఉపన్యాసం యిస్తున్నాడు. చిన్నపరెడ్డి సభకు పెద్ద. హరిజనుల స్థితిగతుల గురించి, చదువు సంస్థల గురించి రామానాయుడు ఉపన్యసించాడు. పొద్దుపోవడంతో అతడు ఆ రాత్రికి అక్కడే నిద్రపోయాడు.

ఇక్కడ మోహనరావుకు మన్మథాగ్ని దహించివేస్తుంది. కమలమ్మ మీదకి మనసు మళ్లింది. కమలమ్మకు కూడా ఆరాత్రి నిద్రపట్టలేదు. మోహనరావును గాఢాలింగనం చేసుకోవాలనుకొని తటపటాయిస్తోంది. ఆరాత్రి మోహన, కమల ఇంట్లోంచి లేచిపోదామని నిశ్చయించుకొన్నారు. కొడుకు సాహూను ఇక్కడే వదలి పోవాలని అనుకొన్నారు. మర్నాడు ఉదయం చీరలు, నగలు తీసుకొని పారిపోవాలని మాట్లాడుకొన్నారు. కమలమ్మ గుండె రాయిచేసుకొని ఈ నిర్ణయం తీసుకొంది. గాఢాలింగనంలో మైమరచారు. ముందుగా మోహన వూరికి వెళ్లేటట్లు, ఆ తర్వాత బండిలో కమలమ్మ గుంటూరు వెళ్లేటట్లు సంకేతం ఏర్పరచుకొన్నారు. ఆ రాత్రి కమలకు నిద్రలేదు.

అనుకొన్న ప్రకారం మర్నాడు మోహన వెళ్లిపోయాడు. ఆ తర్వాత రోజు కమలమ్మ కొడుకును వదిలిపెట్టి నగలుతీసుకొని కుదుర్చుకొన్న జట్కాబండిలో ఎక్కి మోహన ఎదురుచూస్తున్న చోటు చేరింది. ఇద్దరూ జట్కాబండి ఎక్కి తెనాలి రైల్వేస్టేషను చేరుకున్నారు. అక్కడ రైలు ఎక్కారు. కమల కొంచెం కళవళపడింది మోహనరావు ధైర్యంచెప్పి తీసుకొచ్చాడు. రామానాయుడు ఆ రెండురోజులు మాలపల్లెలోనే వున్నాడు. బండ్లోకి ఎక్కగానే కమలమ్మకు భ్రమకమ్మింది. మోహన సేదదిర్చాడు. ఆమెను పారవశ్యంలో మునిగేలా ముద్దులు కురిపించాడు.

కమలమ్మ కోసం యిల్లంతా వెదికారు యింట్లోవాళ్లు ఎక్కడికి పోయిందా? అని ఆలోచనలోపడ్డారు చెరువులో పడిందేమోనని వెతికించారు ఆవార్త వూరంతా పొక్కింది తలకోరకంగా అనుకొంటున్నారు. చౌదరయ్య వీధిలోకి రాలేక పోయాడు పోలీసు రిపోర్టు యివ్వటానికి జంకాడు బావులు వెదికించారు నగలు తీసుకపోయిందని చౌదరయ్య బాధపడ్డాడు బిడ్డను ఎలా సాకాలా? అని లక్ష్మమ్మ దిగులుపడింది రామానాయుడు యింటికి వచ్చి విషయం తెలుసుకొని మనసులోనే కుమిలిపోయాడు

వ్యాజ్యం విషయంగా రామదాసుకు నోటీసు తెచ్చాడు బంట్రోత్తు చౌదరయ్య వ్యాజ్యం వేశాడనీ, జవానును లోగట్టుకొని నోటీసులు జారీ చేయించలేదని తెలిసిపోయింది వెంకటదాసు జవాను చేతిలో రూపాయి బెట్టి వాయిదా తేదీ, నకలు వ్రాసుకొన్నారు

రామదాసు రాజీకి సిద్ధపడ్డాడు జాతక రీత్యా తనకు మంచిరోజులు కావని ఆయన భయం. చౌదరయ్య అంగీకరించలేదు రామదాసు, వెంకటదాసు గుంటూరులో ప్లీడరు నారాయణరావును కలిశారు అతడు హరిజనోద్యమవాది నంగదాసు చనిపోయాడని బాధపడ్డాడు. అతని తండ్రి రామదాసు వచ్చాడని తెలుసుకొని కేసువిన్నాడు

రామదాసు ఒక వితంతువు వద్ద దావా ఆస్తికొన్నాడు ఆమె చనిపోయింది కంఠంరాజు సన్నిహిత వారసుడు పూర్వం వ్యవహారాలు ఏవోజరిగాయి ఇదే కేసు నారాయణరావు కేసు పూర్వాపరాలు విని వృదాగా ఖర్చుచేయక యింటికి వెళ్లటం మంచిదని సలహా యిచ్చాడు వెంకటదాసు నోటీసుకు 'ఆన్సరు' ఇద్దామని పట్టుబట్టాడు వంద రూపాయిలు ఫీజు యిస్తామన్నారు. అందులో సగం ప్లీడరు గారు సంగపీఠానికి చందాను ప్రకటించారు ఆన్సరు వేశారు.

రైలులో ప్రయాణిస్తున్న కమలామోహనులను చూసి జనమంతా వారి దాంపత్యాన్ని ప్రశంసించారు మోహనరావు దారిలో పోలీసులు పట్టుకొంటారేమోనని భయపడుతూ వచ్చాడు మదరాసులో మాంబళంలో ఒక రంగుల మేడను అద్దెకు తీసుకొని కాపురంపెట్టాడు కమలకు సహాయంగా

ఒక పనిమనిషిని ఏర్పాటు చేశాడు. కమలామోహనులు స్వేచ్ఛగా జీవనం గడపసాగారు.

మోహనరావు హాస్టలు ఖాళీ చేశాడు. మిత్రుడు వెంకటరావు మోహన్ వాలకంచూసి ఎవరినో లేపుకొచ్చాడని గ్రహించాడు.

కమలకు సాహూ గుర్తుకు వస్తున్నాడు. ఒంటరిగా ఉండలేక పోతున్నది. అందువల్ల మోహన్ చదువుకు స్వస్తి పలికి ఆమె వద్దనే వుండి పోవాలనుకున్నాడు. బంధువులను, సంఘాన్ని ఎదిరించివచ్చినందుకు ఆమెకు కృతజ్ఞతాపూర్వకంగా అలా చేయక తప్పలేదు.

క్షణికావేశంలో తాను చేసిన తప్పుకు మోహనరావు పశ్చాత్తాప పడ్డాడు. కమల భవిష్యత్తు గూర్చి ఊహించి బాధపడ్డాడు. కమలకోసం తాను యింత త్యాగం చేయవలసి వస్తుందనీ, వివాహం మానుకోవలసి వస్తుందనీ ఊహించలేదు.

వరదలోబడి కొట్టుకొని పోతున్నాం గాబట్టి ఇప్పుడు వెనుదిరగవద్దని కమల మోహనరావుకు ధైర్యం చెప్పింది. మోహన్ మనోవ్యాకులత చెందాడు. అటెండన్సు సరిగా లేనందున పరీక్షలకు కూచోనీలేదు. స్కూలు మానివేశాడు. మనియార్డర్లు హాస్టల్‌కే వస్తున్నాయి. అవి తెప్పించుకునేవాడు.

క్రమేణా మొహం మొత్తసాగింది. ఉత్సాహం సన్నగిల్లింది. కమల గర్భవతి అయింది. నీరసంగా వుంది.

మోహనరావుకు వివాహం చేస్తాం రమ్మని యింటివద్ద నుండి ఉత్తరం వచ్చింది. పరీక్షలు గాబట్టి రావడానికి వీలులేదని వ్రాశాడు. ముహూర్తాలు పెట్టించామనీ, పరీక్షలు కాగానే పెళ్లి చేస్తామని వ్రాశారు. మోహన అన్న రాజారావు ఒకరోజు మదరాసులో కళాశాలకు వెళ్లాడు. మోహన్ ఎవత్తెనో లేవదీసుకు వచ్చాడన్న వార్త క్రమేణా తెలిసింది. రాజారావు ఇల్లు కనుక్కొని వచ్చాడు. కాని అబద్ధాలు చెప్పి ఇక్కడ లేడనిపించింది కమల. అన్న రావడం చూసి మోహన్ కంగారుపడ్డాడు. రాజారావు తిరిగి వెళ్లిపోయాడుగాని గండం గట్టెక్కలేదు. ఎలాగైనా అతనికి చెప్పడం మంచిదని సలహా ఇచ్చింది.

మోహనరావు రాజారావును కలుసుకొన్నాడు. తల్లి మరణదశలో వుందనీ, కొడుకులను చూడాలని వుందని తంతి వచ్చింది. అన్న తమ్ముడికి చూపించాడు. ఇద్దరూ కలిసి వెళ్దామనుకున్నారు. కమల విషయం చెప్పడానికి మోహన్ సందేహించాడు. కమలకు వివరంగా ఉత్తరం వ్రాసి పోస్టులో వేశాడు.

ఇద్దరూ వూరికెళ్లటానికి రైలు ఎక్కారు.

కమలకు నిరంతరం సాహూ జ్ఞాపకాలు ఎక్కువయ్యాయి. అతడు తన చుట్టూ తిరుగుతున్నట్లు వూహించుకోసాగింది. ఏమి చేసినా అతడే కనిపించసాగాడు.

కమల ఉత్తరం చదివింది. తల్లి జబ్బు సంగతి తాను చెప్పకుండా పోవడానికి కారణం మోహన్ వివరంగా వ్రాసాడు. కమలకు దుఃఖం వచ్చింది. ఒకరోజు కమల ప్రసవించింది. అచ్చం మోహనరావు పోలికలే. మగపిల్లవాడు. ఒకరోజు మోహన్ స్నేహితుడు వెంకటరావు ఆమెను పలకరించడానికి షోకు చేసుకొని వచ్చాడు. మోహన్ వేరే పెళ్ళి చేసుకొంటున్నాడనీ, ఆమెకు ద్రోహం చేశాడనీ చెప్పాడు. కమల ఎంతో గంభీరంగా మంచిదే, నాకు భగవంతుడే తోడ్పడతాడని ధైర్యంగా చెప్పింది. కళావిహీనంగా ఉన్న ఆమెను వదలివేసి వెంకటరావు వెళ్లిపోయాడు.

ఆ సాయంకాలానికి పిల్లవానికి జ్వరం ఎక్కువై స్ఫోటకం వచ్చింది. వ్యాధి వూరంతా పాకి జననష్టం కలిగింది. శవాలు మోసేవారు కరువయ్యారు. కమలమ్మకు జర్వంవచ్చి వొళ్లు తెలియనిస్థితి. 'సాహూ' అని కలవరించింది. మోహనరావు ఆ వార్త తెలుసుకొని మదరాసు పరుగెత్తాడు. ఈలోగా బిడ్డ కన్నుమూసింది. తల్లిని అపస్మారక స్థితిలో శవాలబండిలోకి తల్లీ బిడ్డల్నీ తీసుకెళ్లారు. మోహనరావు అలమటించాడు.

అప్పాదాసుకు యుక్తవయస్సు వచ్చింది. చురుకుదనం, శాంతం, దయ ముఖంలో వుట్టిపడుతున్నాయి అతడిప్పుడు సంగమందిరంలో పంచమ

పాఠశాలలో ఉపాధ్యాయుడు. అతడు శ్రద్ధగా పాఠాలు చెబుతాడని పేరువచ్చింది.

సాహెబుకు సరియైన పెంపకంలేదు. తల్లిలేని బిడ్డ పరిస్థితి. అక్క లక్ష్మి వాడి ఆలనాపాలనా చూసేది. వాడు అప్పుడప్పుడు గొడవ చేసేవాడు.

ఆరోజు మంగళాపురంలో ప్రహ్లాదనాటకం ఆడుతున్నారని ఊరంతా పుకారు. సంగమందిరం దగ్గరకు జనం మూగిపోయారు. చౌదరయ్య మాత్రం రాలేదు. రామానాయుడు కార్యక్రమం ఏర్పాటు చేశాడు. నాటకం ప్రారంభించారు. హిరణ్యకశిపుని తపస్సూ, లీలావతి చెర పూర్తి అయినాయి. ప్రహ్లాదుడు జన్మించాడు. పెరిగి పెద్దవాడై విద్యాబుద్ధులు నేర్చుకొంటున్నాడు. హరిధ్యాస పెరిగింది. తండ్రికది యిష్టంలేదు. నృసింహావతరణం జరిగింది. వీరకరుణా రసాలు జోడించి నాటకం పూర్తి అయ్యేసరికి తెల్లవారింది. భాగవతులకు కానుకలు బాగా వచ్చాయి.

ఆరోజే గుంటూరులో చౌదరయ్య వేసిన వారసత్వదావాకు విచారణ వాయిదా. కేసు మునసబు కోర్టునుండి అడిషనల్ కోర్టుకు మార్చారు. ఆ జడ్జి చాలా బద్ధకస్తుడు. ఆఖరి వాయిదా ఏప్రిల్ 20న. ఆ రోజు రామదాసు తరపు సాక్షులు రాలేదు. దావా భూమిస్వాధీనానికి, ఖర్చులకు జడ్జిగారు డిక్రీ ఇచ్చారు. రామదాసు తరపు న్యాయవాది నారాయణరావు అపీల్ చేద్దామన్నాడు. ఇప్పటికే రామదానుకు వెయ్యిరూపాయలు పైగా ఖర్చు.

ఊళ్లో ఈ వార్త గుప్పుమంది. వ్యాజ్యం డిక్రీ అయిన వారంలోగా కంరంరాజు గుంటూరు పోయి దావాభూమి స్వాధీనానికి వుత్తర్వుపొంది ఖర్చులు వసూలు చేసుకోవడానికి అమీనాతో మంగళాపురం వచ్చాడు. అమీనా దండోరా వేయించి మునసబు కరణాలను పిలిపించాడు. స్థిరచరాస్తులు జప్తుచేశారు. పొలంమీద మిరప పంట బాగా వుంది. కనీసం రెండువేల రూపాయల పంట వుంటుంది. ఇప్పుడు ఆపొలం చౌదరయ్య స్వాధీనమయింది. రామదాసు ఇంట్లో వంటపాత్రలు కూడా జప్తు చేసారు. క్షణం క్రితం వరకు రామదాసు మోతుబరి రైతు. ఇప్పుడు నిరుపేద.గ్రంథమంతా పంతులు జరిపించాడు. మందిరం కూడా వేలం వేయించాలని చౌదరయ్య పట్టుదల.

రామానాయుడు ఆరోజు వూళ్ళోలేడు. ఆ రాత్రి యింటికి వచ్చి పంతుల్ని పిలిపించి ఈ అన్యాయానికి ఎందుకు పాల్పడ్డారని అడిగాడు.

రామానాయుడు ఉద్యమవ్యవహారాలు మానుకుంటే అతని తండ్రి రామదాసుపై కక్షమానుకొంటాడని పంతులు సలహా ఇచ్చాడు.

రామదాసు, వెంకటదాసు నిస్పృహ చెందారు. ఇల్లు అమ్మితే కొంత డబ్బు వస్తుందని రామదాసు అనుకొన్నాడు. సంగణ్ణి పొట్టన పెట్టుకున్న చౌదరయ్య భరతం పట్టాలని వెంకటదాసు నిశ్చయించుకొన్నాడు. తెల్లవారి నుంచి అతడు కనబడలేదు. ఎంత వెదికించినా కనబడలేదు. రామదాసు ఇల్లు ఖాళీచేసి అప్పాదాసు స్థలంలో పాకలు వేసికొని అందులోకి వెళ్లాడు. చౌదరయ్య రామదాసు బండి,ఎద్దులు కూడా జప్తు చేయించాలని అర్జీపెట్టాడు. అప్పాదాసు పిటీషను దాఖలు చేసి వదిలించుకొన్నాడు.

అప్పాదాసు రాజకీయాలలో తిరుగుతున్నాడని కలెక్టరుకు ఫిర్యాదు చేశారు. నౌకరీలోంచి అప్పాదాసును తొలగించారు.

రామదాసు కుటుంబానికి పూటగడవటం కష్టమైంది.

గుంటూరు జిల్లాలో ప్రొటెస్టెంటు క్రైస్తవమతం వ్యాప్తిలోకి వచ్చింది. అయితే సంగదాసు వారి వ్యాప్తికి ఆక్షేపణలు చెబుతూ అడ్డుపడ్డాడు. ఇప్పుడు మళ్లీ మంగళాపురంలో క్రైస్తవమత ప్రచారకులు ప్రవేశించారు. ఒకరోజు సాయంకాలం హిందూ క్రైస్తవ మతాలను గూర్చి చర్చపెట్టారు. జనం అన్ని వర్ణాల వారూ వచ్చారు. చౌదరయ్యను సభాపతిగా ఫాదరీకోరాడు.

రామదాసు అన్నిమతాలూ దేవుడు ఒక్కడేనని చెబుతాయన్నాడు. వారు హిందూమత దూషణ మొదలుపెట్టారు. రామదాసు అడ్డుపడ్డాడు. సహేతుకంగా వాదించాడు. రాధాకృష్ణ మతాన్ని గూర్చి, గోపికల చరిత్రను గూర్చి చర్చ జరిగింది. ఏసు జననం గూర్చి ప్రస్తావన వచ్చింది. కన్యాగర్భం గూర్చి వాదులాడుకొన్నారు. మేరీ, యశోదలు తమ పుత్రులను ప్రేమించి ధన్యమయ్యారు. అలానే నాయికీ నాయక సంబంధం- ఇలా చర్చ అనంతంగా సాగి సభాపతి సభముగిసిందని ప్రకటించారు.

సాహూకు శాంతమ్మ దగ్గర మాలిమి ఎక్కువైంది. అతనికి కామెర్ల వ్యాధి తగిలింది. జ్వరం ఎక్కువైంది. డాక్టరు వచ్చి మందులిచ్చాడు. అతణ్ణి పైవూర్నించి పిలిపించారు. క్రమంగా వ్యాధి నెమ్మదించినట్లే వుండి ఒకరోజు కుర్రవాడు మరణించాడు. అన్ని రోజులుగా శుశ్రూషలు చేస్తున్న శాంతమ్మ బిడ్డపోవడంతో కృశించింది. ఆఖరిక్షణంలో రామానాయుడి కాళ్లమీద తలబెట్టి వాలిపోతూ-'నన్ను క్షమించండి. నేను మీ కమల'ను అని కన్నుమూసింది. రామానాయుడు కన్నీళ్లు విడిచాడు.

అప్పాదానుకి ఉద్యోగం పోయినతర్వాత రామదాను కూలికి పోతున్నాడు. అప్పాదాను స్వంతస్కూలు సరిగా జరగడం లేదు. నేతపని మళ్లీ మొదలు పెట్టాలనుకొన్నాడు రామదాను. దానికన్నా ఊరూరూ తిరిగి నేత బట్టలు అమ్మేపని యిస్తానని సుబ్బిశెట్టి సలహా ఇచ్చాడు. ఖర్చులు పోను చెరిసగం చేసుకొందామని మాట కుదుర్చుకున్నారు. మాలక్ష్మి ఈదుస్థితికి వగచింది. పనిచేసి సంపాదించడంలో తప్పులేదని రామదాను సర్దిచెప్పాడు. జ్యోతి పెళ్లి విషయం ఆలోచించారు. అప్పుడు చేసుకుంటాడేమోనని ఆశించారు.

జ్యోతి అప్పడి దగ్గర చదువుకొంటోంది మాటల సందర్భంలో తాను అప్పాదానును ప్రేమిస్తున్నానని జ్యోతి చెప్పింది రాధాకృష్ణుల వలె వారిరువురు ప్రేమను పెంచుకొన్నారు. అయితే ఉభయులూ పెళ్లిచేసుకోకుండా ఉండిపోదామని నిశ్చయించుకొన్నారు. పెద్దవాళ్లతో ఆమాట చెప్పారు.

రామదాను గుడ్డల మూటనెత్తిన బెట్టుకొని పల్లెబేరానికి బయలుదేరాడు. దారిలో దొంగలు పడ్డారు. వారు తక్కెళ్ల జగ్గడి మనుషులమన్నారు. ధనికులను దోచి పేదలకు పంపకం చేస్తామన్నారు. ఆ బట్టలు తీసుకొని రామదాను చేతిలో నాలుగు వందలు పెట్టి పారిపోయారు.

తన పూర్వస్థితిని, ఇప్పటి స్థితిని తలచుకొని రామదాను మనను కల్లోల పడింది. అనుకొన్న దానికంటె గుడ్డల ద్వారా రెట్టింపు డబ్బు వచ్చింది. తన భాగం మాత్రం తీసుకొని రామదాను మిగతాపైకం సుబ్బిశెట్టికి యిచ్చేశాడు ఆరాత్రి సుబ్బిశెట్టి ఇంట్లో దొంగలు పడి అంతాదోచుకపోయారు. పోలీసులు దొంగలకోసం గాలించారు. కాని దొంగలు పోలీసుల్ని స్వాధీనం

చేసుకొన్నారు. వారికి చెంచురామానాయుడు అండ. పోలీసుల్ని వదలివెయ్యమని రామానాయకుడు ఆజ్ఞాపించాడు.

తక్కెళ్ళ జగ్గడి ఉధృతం ఎక్కువైంది. జిల్లా పోలీసు నూపరెండెంటును సిబ్బందిని జగ్గడి గుంపు పట్టుకొని చెట్లకు కట్టివేశారు. ఆవార్త కలెక్టరుగారికి తెలిసింది. దొంగల కోసం తుమ్మలపాళెం, కొండవీడు కొండలు, అడవులు వెదకసాగారు. కానీ ప్రయోజనం లేకపోయింది. జగ్గడి నేర్పరితనం అసాధ్యం. చివరకు జగ్గణ్ణి పట్టుకొని బందిపోటు సెక్షన్ క్రింద 10 సంవత్సరములు శిక్ష వేశారు. అయినా నేరాలు జరుగుతూనే వున్నాయి. ఒకరోజు తెల్లవారే సరికి అన్నిరైళ్ళలో జగ్గడి ప్రకటన కాగితాలు వెదజల్లారు. పోలీసులు అక్రమచర్యలు ఆపకపోతే తగిన శిక్ష విధిస్తామని అందులో వుంది. జగ్గడు చేసిన దానధర్మాలు, మంచితనం దేశమంతా ప్రచారంలో వుంది. గవర్నరు దొంగలను అధికంగా శిక్షింప కూడదని ఉత్తర్వులు జారీ చేశారు. కేసుల విచారణకు అన్ని జిల్లాలలోనూ కొత్త కోర్టులు స్థాపించారు. బందిపోట్లను ఆపడానికి ప్రభుత్వం ప్రయత్నం చేసింది. దేశరక్షణ నిధి పేర చందాలు వసూలు చేయడం మొదలు పెట్టారు.

రామదాసు భుక్తికోసం చిల్లర వ్యాపారం మొదలు పెట్టాడు. అదిసాగక ధాన్యం బేరం పెట్టాడు. జ్యోతి , అప్పాదాసు పిల్లలకు పాఠాలు చెబుతున్నారు. లక్ష్మమ్మ మంచానపడి అవసానదశకు వస్తున్నట్లుంది.

చౌదరయ్య కుటుంబ బాధలతో బాగా క్రుంగిపోయాడు.మనవడి మరణం అతన్ని బాగా కలతపెట్టింది. లక్ష్మమ్మ తుదిశ్వాస విడిచింది. శవాన్ని వూరేగించారు రామానాయుడు దుఃఖంతో కుమిలిపోయి ఆ పదిహేను రోజులూ మృష్టాన్నం పెట్టి మాతృ యజ్ఞం చేశాడు. చౌదరయ్య క్షీణించసాగాడు. వంశాంకురం లేదని అతని బాధ. నారాయణ శతకం చదవటం మొదలు పెట్టాడు. అవసానదశలో పశ్చాత్తాపం కలిగింది. మహార్దశ అనుభవించిన అతడు చివరకు నారాయణ స్మరణతో కన్నుమూశాడు. శాస్త్రోక్తంగా కర్మకాండ సాగించారు. రామానాయుడు, వెంకటయ్య హరిజనోద్యమానికి తమ శేషసంపదను దానం చేశారు. వెంకటయ్యలో వచ్చిన మార్పు (అన్న)

రామానాయుడికి ఆనందం కలిగించింది. హరిజనోద్యమానికి మంచి రోజులు వచ్చాయని అతని నమ్మకం. అప్పాదాసును పిలిచి సంగమందిరానికి తన అన్నను అధ్యక్షుడుగా పెట్టమని సలహా యిచ్చాడు. అంతరిస్తున్న ఉద్యమానికి ఊపు వచ్చినందుకు అప్పాదాసు సంతోషపడ్డాడు.

జగ్గడి అనుచరుల పేరుతో పోలీసులు పల్లెలో చాలమందిని కేసులు పెట్టిజైలుకు పంపుతున్నారు. ఆభయంతో రామదాసు కుటుంబం కూడా వొణికి పోతున్నది. రామదాసును కూడా తీసుకు పోతారేమోనని సందేహించారు.

ఆ మర్నాడే రామదాసుతో పాటు మరో 20 మంది మీద అరెస్టు వారెంట్లు తీసుకొని వచ్చారు. ఆంధ్రమహా కార్మిక సంఘం పేరుతో అందరూ జైలుకు వెళ్ళడానికి సిద్ధమయ్యారు. జైళ్ళుపట్టలేదు. విచారణ ప్రారంభమైంది. కోర్టులో రామదాసును వదిలిపెట్టి మిగతా వారిని నిడదవోలు సెంట్రలు జైలుకు పంపారు. ఆ తరువాత మంగళాపురం దొంగలకు రామదాసు గురువని రామదాసు కుటుంబాన్ని సెటిల్‌మెంటు చేయడానకి కలెక్టరు ఉత్తర్వులు జారీ చేశాడు. అప్పాదాసు దుఃఖంతో స్పృహతప్పి పడిపోయాడు. తనను వదలి జ్యోతి వెళ్ళిపోతున్నదని అతని బాధ ఊరిలో జనమంతా వారిని సాగనంపారు. చంకలో పిల్లవాడితో మాలక్ష్మి, రామదాసు, జ్యోతి పోలీసులతో బాటు రైలు స్టేషనుకు వచ్చారు. సెటిల్‌మెంటులో ఖైదీలచేత కూలిపని చేయిస్తారు.

స్టేషను వద్ద మిషనరీ పౌల్ రామదాసును కలిసి మతం మార్చుకుంటే అన్ని ఇబ్బందులూ తొలిగి పోతాయని సలహాయిచ్చాడు. రామదాసును చూస్తేతన మేనమామ గుర్తుకు వస్తున్నాడన్నాడు. తన ఇంట్లోనే వచ్చి వుండవచ్చునన్నాడు. అంతారైలెక్కారు. తాడేపల్లి స్టేషనులో దిగారు బండెక్కి పౌలు కాపురం వుండే ఇంటి దగ్గరకు వచ్చారు. పోలీసులు వెళ్ళిపోయారు ఆ రాత్రికి వారింట్లోనే రామదాసు కుటుంబం బస చేసింది, అక్కడే భోంచేశారు. మర్నాడు ఉదయం తమకు నిర్ధేశించిన గుడిశెకు వెళ్లిపోయారు.

5 సంవత్సరాల క్రితం ఈసెటిల్‌మెంటు ప్రారంభించారు. బొంబాయి గవర్నరు దీనికి మూలపురుషుడు. ప్రస్తుతం మిషన్‌దొరలు అజమాయిషీ చేస్తున్నారు. 500 కుటుంబాల దాకా వుంటాయి. క్రైస్తవమతంలో చేరిన కొందరిని వదిలిపెట్టారు. ఇంతలో దొరగారు వచ్చి రామదాసు కుటుంబానికి రెడ్డిగారి కుంట త్రవ్వమని పని అప్పగించారు. రామదాసు గడ్డపార చేతబట్టుకొని జ్యోతి సెలగపార తీసుకొని బయలు దేరారు. మాలక్ష్మి కంట తడి బెట్టింది. ఆమెకూడా మట్టిపనిలో సాయపడింది. సాయంకాలానికి వారికి రావలసిన కూలి ఇచ్చివేశారు. సామానులు తెచ్చుకొని వంటచేసి ఆరాత్రి భోంచేశారు.

తల్లి దండ్రుల కష్టాలు జ్యోతికి నిద్రపట్టనీలేదు. పమిట కంఠానికి చుట్టుకొని ఆత్మహత్యకు పూనుకుంది. పెద్దవాళ్ళిద్దరూ లేకుండాపోయారు నీవే ఆధారమని రామదాసు ఆమెను వారించాడు.

ఆ తెల్లవారు జామున పోలీసు ఇనస్పెక్టరు వచ్చి రామదాసుని లేపారు. పౌలు నీ కల్లుడవుతానంటున్నాడని చెప్పాడు. అలాంటి ఉద్దేశాలు మానుకోమని చెప్పిపంపాడు అతణ్ణి రామదాసు. అతనితోపాటు వుల్లన్న కూడా తోటి కూలీ. రామదాసు అతని ద్వారా ఉంగరం తాకట్టుపెట్టి డబ్బు తెప్పించాడు. చిన్నకొడుకు రంగడు అన్నానికి అవురుమంటున్నాడు.

క్రైస్తవబోధకు అందరు ఖైదీలు సాయంకాలం 5 గంటలకు సమావేశం కావాలి. మూడువందల మంది జమకూడారు.బ్రాన్సరు దొర, దొరసాని వచ్చి కుర్చీలపై కూచొన్నారు. పౌలు ప్రార్థన చేసిన తరువాత దొర ప్రసంగించాడు. రామదాసు తర్వాత లేచి హిందువులకు ఈ మతబోధ ఎందుకని ఎదురు ప్రశ్నించాడు.

పౌలు రామదాసు గుడిసెవద్దికు వెళ్లి 'మామా'' అని ఆప్యాయంగా పిలిచాడు. మరోసారి అలా పిలిస్తే తగిన శాస్తి చేస్తానని రామదాసు బెదిరించాడు. పౌలు వెళ్లిపోయాడు.

మర్నాడు రామదాసు, పుల్లన్న కూలీల చేత సమ్మెచేయించడానికి నిశ్చయించుకున్నారు. బడి పెట్టించాలనీ, చేతిపనులు అలవాటు చేయాలనీ

అనుకున్నారు. జనానికి నచ్చజెప్పిరహస్యంగా పోగుచేయాలనుకున్నాడు. దొరగారు పిలుస్తున్నారంటే రామదాసు ద్వాదశ పుండ్రాలు పెట్టి వెళ్లాడు. దొరగారు అది చూసి వాటిని తుడిసి వెయ్యబోయారు. రామదాసుకు కోపం వచ్చింది. సమయానికి అక్కడికి వచ్చిన వెంకటయ్య దొరగారి పైకి కఱ్ర ఎత్తాడు.దొర వెనకడుగు వేశాడు. రామానాయుడు లాయరుతో మాట్లాడి రామదాసును అక్కడి నుండి తొలగించే ప్రయత్నాలు చేశాడు. ఇక్కడ జరుగుతున్న అన్యాయాల గురించి రామదాసు దొరని నిలదీసి అడిగాడు. మర్నాడు రామానాయుడు తదితరులు స్వగ్రామానికి వెళ్లిపోయారు. మళ్ళీ మంగళాపురం చూస్తామా అని రామదాసు కుటుంబం కలవరపడింది.

అనుకున్న ప్రకారం నాయకులంతా ఒకచోట సమావేశమయ్యారు. దొమ్మర నాయకుడు రాము, ఎఱుకల కిష్టడు, పుల్లప్ప కలిసి మాట్లాడుకున్నారు. సెటిల్‌మెంటులో జరుగుతున్న అన్యాయాలను దాసరినాయకుడు కేశవులు ఏకరువు పెట్టాడు. ఎదిరించేదానికి సిద్ధపడాలని మొండివాడు రాజుకంటె బలవంతుడని తలపోశారు. తమలో మిత్రబేధం లేకుండా అందరూ కలిసికట్టుగా వుందామనుకున్నారు. పోలీసు వస్తే ప్రారంభం కాగానే పెద్దలంతా తమ గుడారాలకు పోయారు. పౌలు ఏదో గూడుపుటాని జరుగుతున్నదని పసికట్టాడు. బహుశా ప్రార్థనకు రాకుండా సమ్మెకడుతున్నారని అనుమానించాడు. ఎక్కడికి పోయినా మీకు సంఘాల గొడవ తప్పదని మాలక్ష్మి భర్తని ఎత్తిపొడిచింది.

మర్నాడు రెండోగంట కొట్టినా జనం రాలేదు. పుల్లప్ప మీద రామదాసు మీద తప్పించుకొని పారిపోతున్నట్లు కేసుపెట్టారు. పోలీసులు వాళ్ళను గుంటూరు తీసుకు పోవడానికి వచ్చారు. మాలక్ష్మిని కూడ జతకలిపారు. జ్యోతిని ఒక్కదాన్నే యింట్లో వదిలారు. రంగణ్ణి అమ్మతోబాటు తీసుకు పోవచ్చునన్నారు. దారిలో నారాయణరావు గుమస్తా ఎదురు పడితే రామదాసు విషయం చెప్పాడు. ముందే అనుకున్న ప్రకారం పుల్లప్పకు ఒక సంవత్సరం రామదాసు దంపతులకు 6నెలలు కఠినశిక్ష పడింది. ముద్దాయిలను నిడదవోలు జైలుకు తీసుకుపోయారు.

సంగతి తెలిసిన రామానాయుడు తదితర మిత్రబృందము వాళ్ళకు ఎదురు పడ్డారు. పోలీసులు రామదాసుతో వాళ్ళను మాట్లాడనిచ్చారు. రామదాసు జరిగినదంతా చెప్పాడు. రామదానును, మిగతాయిద్దరినీ రైలెకించారు. రామానాయుడు వకీలు నారాయణరావును కలిసి రామదాసు కథ చెప్పాడు. ఉభయులు కలిసి కోర్టుకు వెళ్ళారు. కలెక్టరుగారు జ్యోతికి సంరక్షుడిగా ఎవరిని నియమించాలి అనే విషయం విచారణ జరిపారు. దొరగారి సంరక్షణ పనికిరాదని రామదాసు అంగీకరించలేదు. కార్మికోద్యమం జరిపినందుకు పోలీసులు రామానాయుణ్ణి తాలూకా జైలుకు తీసుకెళ్ళారు. జ్యోతికిఒక అద్దెయింట్లో బస యేర్పాటు చేశారు.

పౌలు జ్యోతి మీద భ్రమపడ్డాడు. ఉన్మాదం ఎక్కువైంది. ఆదెమ్మ అనే ముసలిదాని సాయంతో రాయబారం పంపాడు. ఆమె జ్యోతితో చనువుగా వుంటుంది. ఒకరోజు తెల్లవారు జామున నదీస్నానానికి జ్యోతి ఆదెమ్మెతో బయలు దేరింది. పౌలుదారి కాచి అడ్డగించాడు. జ్యోతి నదిలోనికి పరుగెత్తింది. ఆదెమ్మ అరవసాగింది. పౌలు పరారీ అయ్యాడు. జ్యోతి శవం మర్నాడు ఇసుక పొరలో కనిపించింది. ఊరంతా గుమిగూడారు. అప్పాదాసు పరుగెత్తుకుంటూ నదిలోకి ఉరికాడు .జ్యోతితో కలిసిపోయింది అతని ఆత్మ. కృష్ణమ్మ తల్లి ఒడిలోకి చేరారిద్దరూ. వారిద్దరి మరణం ఆంధ్రదేశంలో కల్లోలం కలిగించింది. పత్రికలు రామదాసు కుటుంబ గాథలను పతాకశీర్షికతో ప్రచురించాయి. పౌలు పరారీకావడంతో అతనిపై అనుమానం ఎక్కువైంది.

కలెక్టరుకు కేసు వివరాలు తెలియజేశారు. సెటిల్‌మెంట్ల వసతుల విషయంలో చట్టాలు చేయాలని ప్రయత్నాలు జరిగాయి. రామానాయుడు జైలులో జరిగినదంతా తలచుకొని పులకితుడయ్యాడు. ఈ ఉద్యమంలో తానొక భాగస్వామి అయినందుకు ఆనందించాడు. నారాయణరావు రామానాయుడుని చూడటానికి వచ్చాడు. మంగళాపురంలో తాను కూడా హరిజన కార్మికోద్యమాలలో పనిచేయడానికి సిద్ధంగా వున్నానన్నాడు. ఇంతలో కలెక్టరు లాయరు నారాయణరావుతో మాట్లాడాలని కబురు పంపారు.

జగ్గడి యోచనాబలం, నిర్మాణశక్తి, కార్యదక్షత అతని ఉద్యమానికి

తోడయ్యాయి. బందిపోట్లు స్వైరవిహారం చేశారు. మద్రాసు, హైదరాబాదు, మైసూరు ప్రభుత్వాలు మూడూ అతణ్ణి పట్టుకోవాలని విశ్వప్రయత్నాలు చేశాయి. సైన్యం తరలివచ్చింది. ఒకదశలో జగ్గడి సైన్యానికి మందుగుండు సామాను తక్కువైంది. స్త్రీల మానసంరక్షణకోసం జగ్గడు, రామసింగు తలపడ్డారు. రామసింగు కంఠం తరిగి జగ్గడు సింహానాదం చేశాడు. ఆంగ్లసేనాని జగ్గడి కాళ్ళు నరికాడు. కత్తితో పొడుచుకోబోతున్న జగ్గణ్ణి ఆంగ్లసైన్యం పట్టుకుంది. జగ్గణ్ణి కర్నూలు జైలుకు పంపారు. జగ్గడి సైన్యం జైలుముట్టడించారు. కానీ జగ్గణ్ణి గుంటూరు జైలుకు మార్చారు. జగ్గడి సైన్యం గుంటూరుకు బయలుదేరింది.

జగ్గణ్ణి కర్నూలు మేజిస్ట్రేటు కోర్టులో హాజరుపరిచారు. అతణ్ణి గుర్తెరిగిన ఒక జైలుగుమాస్తా ఇతడు రామదాసు కుమారుడు వెంకటదాసని చెప్పాడు. జగ్గడికి నిజం ఒప్పుకోక తప్పులేదు. కలెక్టరు జగ్గనితో కేసు వివరాలు మాట్లాడారు. జైల్లోంచి తప్పించుకొనే ప్రయత్నం చేసినా కాలు చేయి లేనందున ఇబ్బంది పడతావన్నారు. 10 వేలసైన్యాన్ని అనూహ్యంగా అంతమొందించిన జగ్గడి ప్రతాపాన్ని పత్రికలు ప్రశంసించాయి. అతనికి తన తల్లిదండ్రులను చూడాలనిపించింది. కలెక్టరు అందుకు అంగీకరించాడు. డాక్టరు వచ్చి పరీక్షించి మంచం మీద పడుకోబెట్టి చేతికి కాలుకు ఆపరేషను కోసం రైల్లో తీసుకెళదామన్నాడు. పోలీసు పహారాతో జగ్గణ్ణి స్టేషనుకు చేర్చారు. అతణ్ణి చూడటానికి జనం గుంపులు గుంపులుగా వచ్చారు. వెంకటదాసే జగ్గడని జనం చప్పట్లు చరిచారు. జగ్గడున్న తాలూకా జైలు చుట్టూ 5వేల సైన్యాన్ని కాపలాపెట్టారు. విచారణవాయిదా యింకా మూడు రోజులుంది. ఆరాత్రి సైన్యం మీద తుపాకి గుండ్ల వర్షం కురిసింది. సైన్యం కుప్పకూలింది. 500 మంది దాకా చనిపోయారు.

వెంకటదాను కేసు విచారణ రోజు వేలకొద్ది జనం గుంటూరులో దిగారు. పోలీసులు భయపడి గుంటూరు ఇళ్లలో జనాలను ఇళ్ళు ఖాళీ చేయమన్నారు జగ్గడు కలెక్టరును పిలిపించుకొని అనవసర ప్రయాసమాన్పించమన్నారు.

వెంకటదాను వకీళ్లను పెట్టుకోలేదు. అతణ్ణి చూడాలని కోర్టు ఆవరణ

చుట్టూచేరిన జనం గొడవ చేశారు. మంచంలో వికలాంగుడుగా ఉన్న జగ్గడిని చూసి జనం వెళ్లిపోయారు.

విచారణ ప్రారంభమైంది. కృష్ణాజిల్లాలో జమీందారీ ఇళ్లలో జరిగిన రెండు బందిపోట్లు, కర్నూలులో జరిగిన కన్నపునేరము మోపారు. జగ్గడి పేరు వెంకటదాసు అని నిర్ధారణ అయింది. జగ్గడి సత్యసంథత, అహింసా ధోరణిలో సాగిన ఉద్యమాన్ని గుర్తించి సరళభావంతో 5సంవత్సరాల విడిఖైదు విధించారు.

రామదాసుకు, ఆయన స్నేహితుల్ని, వెంకటదాసును సెంట్రల్ జైలుకు పంపారు. నిడదవోలు సెంట్రల్జైలు బ్రిటీష ప్రభుత్వం స్థాపించిన మొట్టమొదటి జైళ్లలో ఒకటి. 1600 మంది ఖైదీలు పడతారు. జైలులో రత్నకంబళ్ల నేయడం వల్ల ఆదాయం వస్తుంది. వ్యవసాయం వల్ల ధాన్యం కూడా పండిస్తారు. జైలులో 1200 నుండి 1600 దాకా ఖైదీలు ఉంటారు. ఖైదీలకు కొన్ని నియమాలు విధించారు. రామదాసు, మాలక్ష్మి, వెంకటదాసుల్ని ఆజైలు వార్డర్కి అప్పగించారు రామదాసుకు ఖైదీ బట్టలు ఇచ్చారు. జుత్తుగీయించారు. మెడలో బిళ్లవేశారు

జైలు జీవితం దుర్భరం. రామదాసు ఓర్పుతో వున్నాడు. ఉప్పుడు బియ్యం తినడం అతని కలవాటలేదు. విధిలేక తినకతప్పలేదు. గాంధీగారి ఉద్యమం అప్పుడే దేశవ్యాప్తంగా నడుస్తోంది. ఆయన స్ఫూర్తితో ఎందరో జైళ్లకెళ్లారు స్వరాజ్యోద్యమకారులు బాధలనుభవించారు.

రామదాసు పుల్లప్పతో కలిసి రాళ్లుకొడుతున్నాడు. దొర తొమ్మిది గంటలకు తనిఖీకి వస్తాడు. ఖైదీలలో చాలా మందికి గోచీలు తప్ప గుడ్డలు లేవు. రామదాసు దొరకు తమ కష్టాలు చెప్పుకోవాలనుకొన్నాడు. ఫిర్యాదు చేశాడని పుల్లప్పను కుళ్లబొడిచారు. జైలులో జరిగే అకృత్యాలకు లంచగొండితనానికి హద్దులేదు.

జైల్లో జనమంతా బందిపోటు దొంగకు శిక్షపడి ఇక్కడకు వస్తున్నాడని చెప్పుకుంటున్నారు. ప్రజలు పోలీసుల చుట్టూచేరి జగ్గడిని చూడాలని

ఆతురతగా వున్నారు. జగ్గడు జబ్బు స్థితిలో వున్నాడనీ, త్వరగా వైద్యం చేయాలనీ చెప్పి లోపలికి తీసుకువెళ్ళారు. అదేజైల్లో వున్న తల్లిదండ్రులను చూడాలని జగ్గడు డాక్టరుని కోరాడు. జగ్గడు చూడాలంటున్నారని వాళ్ళను పిలిపించారు. మాలక్ష్మి గుర్తుపట్టి వెంకడిని ముద్దుపెట్టుకుంది. రామదాసు ఆశ్చర్యపోయాడు. తనబిడ్డ వీరుడైనాడని గర్వించాడు. జ్యోతి, అప్పుడి మరణవార్త వెంకటదాసు తెలుసుకుని బాధపడ్డాడు. మాలక్ష్మి ఆసంగతి తెలుసుకుని కుప్పకూలిపోయింది. కొంతసేపటికి అమె కన్ను మూసింది. రామదాసు నిర్లిప్తంగా బాధపడ్డాడు. వెంకటదాసు స్వయంగా మంచం మీదనుండే తల్లిని ఖననం చేశాడు. నేరాలు ఇక చేయనని సర్కారుకు వ్రాసియిస్తే వెంకటదాసుని విడిపిస్తామని సూపరింటెండెంటు అన్నాడు. తన తండ్రిని కూడా వదిలిపెడితే కలిసి వెడతామని వెంకటదాసు సూచించాడు. రామదాసు జోడువడిపోయిన పక్షివలె కుమిలిపోయారు. 30 సంవత్సరాల అనుబంధంమరి వెంకటదాసుకు మగత అధికమై శ్వాస సన్నగిల్లింది. చాలాసేపు తండ్రీకొడుకులు పితాపుత్ర సంబంధం గురించి, ధర్మాచరణ గురించి మాట్లాడుకున్నారు.

జీవితమొక విచిత్ర నాటకమన్నాడు వెంకటదాసు. మాట్లాడుతూ మాట్లాడుతూ ఒకమహా తేజం గుప్పన ఆకాశానికి లేవటం రామదాసుకు మాత్రం కనిపించింది. రామదాసు సమాధినిష్ఠుడైన యోగీంద్రునివలె కూచున్నాడు.

రామదాసును ఒకటవ బారకాసుకు మార్చారు. జైలు పరిస్థితిని చక్కదిద్దడానికి రామదాసు నడుం కట్టుకున్నాడు. ఉరిశిక్ష పడిన వాళ్లను గురించి రామదాసు చాలసేపు ఆలోచించాడు. ఉరి తీసే వెంకటస్వామితో చర్చించాడు. కోపం ఎక్కువైనపుడు అన్నిటికీ తెగించి చంపుతారని కూనీ నేరస్తుణ్ణి బాగుపరచే మార్గం చూడవచ్చుననీ ఉరి తీయడం అన్యాయమనీ రామదాసు వాదన ఉరి తీసేటప్పుడు మనిషిపడే బాధను వెంకటస్వామి వివరించాడు. తనచేతి మీదగా 80 మందిని ఉరి తీశానని సగర్వంగా చెప్పుకున్నాడు ఒకటి, రెండు మొదట్లో కొంచెం భయం కలిగించినా తర్వాత

తర్వాత మంచినీళ్ళ ప్రాయం అయింది. ఉరిశిక్ష వేసే జడ్జీలకు మేజిస్ట్రేట్లకు వురితేయించే సూపరింటెండెంట్లకు డాక్టర్లకు సున్నిత భావాలు నశించి ఘనాపాఠీలవుతారని రామదాసు అభిప్రాయం. యేది ఏమైనా ఉరిశిక్షను రద్దు చేయాలని రామదాసు కోరిక.

జైలులో పరిస్థితి దుర్భరంగా వుంది. కక్కసుకు పోవాలంటే అసహ్యం. జైలులో అధికారులు రాక్షసగణం. ఖైదీలను తన్నటం, కొట్టటం ఆనవాయితీ. రామదాసు రెండో చల్లడము, చొక్కా ఎవరో కాజేశారు. పుల్లప్ప జాడలు తీశాడు. ఒకఖైదీ బయటకి విసిరితే పాకీవాడు రెండో వార్డులో వున్న మరొకడికి 12 బీడీలకు అమ్మేశాడు.

రామదాసుకు తాడు పేనేపని అప్పగించారు. అలవాటుతప్పి చేయి పుండు పడింది. ఒకరోజు కక్కసు కుండలు మోసే బాధ్యత రామదాసుపై బడింది. అలవాటులేక కుండ వొలికి గుడ్డలు తడిసి ముద్దయినాయి. జైల్లో ఖైదీలంతా రామదాసుకి స్నానం చేసే యేర్పాటు చేసారు. ఆయన అవధూతవలె అంతా రామమయం అనుకున్నాడు.

రామదాసు తత్వాలు పాడసాగాడు. అందరూ గుంపులుగా చేరి వింటున్నారు. ఇంతలో పహారాపోలీసులు వస్తారని ఎవరిదారిన వాళ్ళు వెళ్ళారు. ఖైదీలలో చేయి తిరిగిన వాళ్ళున్నారు. ఒకఖైదీ 11వ సారి జైలుకు వచ్చాడు. అడపాదడపా బయటకి పోతూ 40 ఏళ్ళు జైల్లో గడిపాడు. మరికొందరు ముసలివారున్నారు. వాళ్ళకు నా అన్న వాళ్ళెవరూ లేరు. జైలు ఉద్యోగులే వారికి తల్లిదండ్రులు. విడుదలైనా మళ్ళీ వస్తారు. పోలీసులూ కోర్టులూ వారికి మహోపకారులు. ముసలి వారని వదలిపెడతామంటే ఒప్పుకోరు.

జైలరుకు ఛీఫ్‌వార్డనుకు బాగా డబ్బుముడుతుంది. అన్నిట్లోనూ భాగాలే. ఖైదీలు బహుమతులిస్తారు. సరుకులు సరేసరి. ఇలా జైలుకథలను ఖైదీలు విశేషంగా చెప్పుకునేవారు. ఖైదీలకిచ్చే రేషనులో మిగుల్చుకుంటారు. వార్డను దగ్గరనుండి ఖైదీ దాకా అమ్ముకుంటారు. పైవాళ్ళు డబ్బుల కమ్ముకుంటే ఖైదీలు బీడీలకు అమ్ముకుంటారు. లంచానికి అంతం లేదు. ఖైదీలను పశుప్రాయులుగా చూస్తారు.

రామదాసుకు జైలు జీవితం అలవాటైంది. రామదాసు దగ్గర ఖైదీలు లోకసంగతులు, నీతిమతబోధనలు తెలుసుకుంటున్నారు. నిడదవోలు సెంట్రల్ జైలులో జనం నిండా లేరు. గడువు తీరిన వారు వెళ్ళిపోతున్నారు. కానీ కొత్తవాళ్లు రావడం లేదు. మాలపల్లెలు మగ్గాలతో నిండిపోయాయి. ఖద్దరు ధారణ అధికమై కోట్లమందికి పని కల్పించింది. చాలా జిల్లాలు నేత జిల్లాలని పేరు పడ్డాయి. వ్యవసాయ పనుల వల్ల కూలీలు దొరికి జనం సుఖజీవనం గడుపుతున్నారు. మిగుల్చుకున్న డబ్బుతో కూలీలు పరపతి సంఘాలను యేర్పాటు చేసుకున్నారు. తాగుడు మానివేశారు.

సహాయ నిరాకరణోద్యమం గాంధి నాయకత్వంలో జయప్రదంగా జరిగింది. అహింసాయుత విధానంలో ఉద్యమం నడపడానికి నడుం కట్టారు. ఆంగ్లేయులు స్వరాజ్యం ప్రకటించక తప్పలేదు. స్వరాజ్య చట్టం వచ్చింది. స్వరాజ్యం రాగానే రాజకీయ ఖైదీలనందరినీ వదిలిపెట్టారు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నవారిని, బందిపోట్లను, సెటిల్‌మెంట్ల వాళ్ళను విడుదల చేశారు. వారికి ప్రజలు ఘనస్వాగతం పలికారు. ఖైదీలకు న్యాయంగా జీవించడానికి అవకాశం కల్పించాలని దేశమంతటా ఆందోళన చేశారు.

కొత్త పార్లమెంటు రాక ముందే స్త్రీ పురుషులకు సమాన హక్కులిచ్చారు. స్వాతంత్ర్య దినాన్ని జనం సంబరంగా జరుపుకున్నారు. మంగళపురంలో ఉత్సాహం చెప్పలేము. ఊళ్ళోవుండే అన్ని కులాల వాళ్ళు కలిసి కట్టుగా నిడదవోలు స్టేషనుకెళ్ళి ఖైదీలకు స్వాగతం పలికారు. జనం మధ్యలో రామదాసయతీంద్రుడు విజయపతాకం చేతబట్టుకొని నడుస్తున్నాడు. ఆయనకు ఇరుప్రక్కలా వెంటయ్య, రామానాయుడు నడిచి వస్తున్నారు. మాలక్ష్మి వెంటదాసుల అస్థికలు రెండు పెట్టెలలో మోసుకొస్తున్నారు. చుట్టూ చేరినవారు రామదాసుకు ముందు నడుస్తూ 'గురురాజుకు జై!', మహాత్మాగాంధీకీ జై! వీరబ్రహ్మంగారికి జై! అని కేకలు వేస్తున్నారు.

రామదాసు రంగడితో సహా గృహప్రవేశం చేశాడు. అది అంతకు ముందు వేలంబడ్డ తనయిల్లే. వెంకటయ్య అది వారికిదానంగా యిచ్చాడు.

పార్లమెంటుకు, శాసనసభలకు ఎన్నికలు జరిగాయి. ఓటర్లు దేశక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని ఎన్నికల్లో చేతులెత్తుతున్నారు. సభ్యులకు గౌరవవేతనాలు యేర్పాటు చేశారు సభలలో తీర్మానాలు ఏకగ్రీవంగానే అమోదించబడుతున్నాయి. ఇంకా పక్షాలు బలపడలేదు. ఆంధ్రశాసన సభలో చేసిన కొన్ని తీర్మానాలు చెప్పుకోదగ్గవి.

బాలబాలికలకు ఉచిత విద్య గ్రంథాలయాల స్థాపన మద్యపాన నిషేధం సెటిల్‌మెంట్లలో వ్యవసాయ భూములు కల్పించి చేతివనులు నేర్పించటం అడవుల సంరక్షణ, హరిజనులకు గృహావసతి, ఉద్యోగాలలో రిజర్వేషనులు కార్మిక సంఘాల యేర్పాటు. ఖద్దరు ఉద్యమ వ్యాప్తి, ఫ్యాక్టరీల పరిస్థితుల మెరుగుదల, జైలు కమిటీలు, తెలుగులో వ్యవహారాలు జరపడం, ఇలా ఎన్నో కార్యక్రమాలు లక్ష్యంగా పెట్టుకున్నారు.

మంగళాపురంలో పంతులు పశ్చాత్తాప హృదయంతో తాను చౌదరయ్య దగ్గర స్వాధీనపరచుకున్న ఈనాం రామదాసు సంఘానికి ధర్మంగా వ్రాసి యిచ్చాడు. దత్తత తీసుకోవడం మానుకున్నాడు. రామదాసు అనుకున్న ప్రకారం 3లక్షలు పెట్టి విద్యాలయాలూ, కార్ఖానాలు, వసతి గృహాలు కట్టించాడు. రామానాయుడూ, వెంకటయ్య సర్వసంగ పరిత్యాగులై అక్కడ ఉపాధ్యాయులుగా వున్నారు. పర్ణశాలలు వేయించి పెద్ద ఉద్యానవనం తయారు చేశారు. దానికి తపోవనమని పేరు. ఆ వూళ్ళో పండుముదసలి కోటమ్మ తానుచనిపోతూ లక్షకు పైగా ఆస్తి తపోవనానికి వ్రాసి ఇచ్చింది. మాలక్ష్మి, వెంకటదాసుల సమాధులు అక్కడే కట్టారు. కోటమ్మ సమాధి ఆప్రక్కనే యేర్పాటయింది. విజయకళాశాలలో ఎందరో దిగువ జాతుల పిల్లలు చదువుకుంటామని వస్తున్నారు.

ఒకరాత్రి రామానాయుడిని నిద్రలేపి ఎవరో పెద్ద బీగం ఇచ్చారు. జగన్నాథం ఇచ్చిపంపాడని చెప్పారు. మర్నాడు ఉదయం సంగమందిరానికి తాళంవేసి వుంటే ఎవరో చూశారు. ఈ బీగంతో తీస్తే అది వచ్చింది. లోపల చూస్తే వేయేసి రూపాయల వేయి సంచులున్నాయి. సంచులు విప్పి చూస్తే తక్కెళ్ళ జగ్గడు పంపినట్లుగా తెలిసింది. అన్యాయంగా

సంపాదించిందని కొందరు అదివాడటానికి వీలులేదన్నారు. హరిజనోద్యమానికి కార్మికోద్యమానికీ ఆడబ్బు సమానంగా ఖర్చుపెట్టాలని అందులో చీటీ వ్రాసి వుంది. అదే ప్రకారం విజయ కళాశాలకు ఖర్చుపెట్టమని వెంకటయ్యకు 5 లక్షలు ఇచ్చారు. మిగతా 5 లక్షలూ రామానాయుడు బెజవాడలో ఆంధ్రకార్మిక మహాసభకు అప్పగించాడు. రామానాయుడు లోగడ భూస్వామిగా శాసనసభకు వెళ్ళాడు. ఇప్పుడు ఆంధ్రకార్మిక సంఘకార్యదర్శి అయినాడు కాబట్టి ఆ పదవి వదులుకున్నాడు. కార్మిక కళాశాల యేర్పాటు చేశారు.

రామానాయుడు భార్యను లేపుకుపోయిన మోహనరావు దినదినానికీ క్షీణించి పోయాడు. బలవంతంగా చేసుకున్న భార్య, తల్లి చనిపోయారు. అన్నాదమ్ములు వేరుబోయారు. యాత్రలు చేశాడు. మహాత్ముని సాంగత్యంతో కొంత శాంతి కలిగింది. క్షయవ్యాధి పట్టుకుంది. తన 2 లక్షల ఆస్తి కార్మిక కళాశాలకు ధర్మం చేసి కాలం చేశాడు.

విజయ కళాశాల ప్రారంభోత్సవ సభ దిగ్విజయంగా జరిగింది. రామదాన మహర్షి ఆ సభకు అధిపతి. ఆసభలో ఆయన కర్మయోగం గురించి మాట్లాడాడు. ఆకళాశాలకు ఆయనను కులపతిగా ఎన్నుకోబడ్డారు. రామనాయుడు వెంకటయ్య తమ ఆస్తియావత్తూ విజయ కళాశాలకు ధర్మంగా వ్రాసి ఇచ్చారు.

ఆ తరువాత పంతులు వేదిక మీదికివచ్చాడు. మరణ సమయంలో సంగదాసు మనవే గెలుస్తామని అన్నాడనీ అది యేదో సంధి ప్రలాపమనుకున్నామనీ ఈనాడు అది నిజమైందనీ అన్నాడు. తన తదనంతరం తన ఆస్తి అంతా సంగకళాశాలకు దానం చేస్తున్నానని ప్రకటించాడు. తాను కళాశాలలో గుమాస్తాగా పనిచేస్తాననీ మనవి చేశాడు. ఇది సంగ విజయానికి కిరీటమని సభ జయజయధ్వానాలు చేసింది.

విజయకళాశాల దినదిన ప్రవర్ధమానమౌతున్నది. ఆంధ్రదేశంలో దిగువ జాతుల అభివృద్ధికి కేంద్రస్థానమైంది. అక్కడి ఆదర్శ పురుషుల జీవితాల ద్వారా విద్యార్థులు గుణపాఠాలు నేర్చుకొని నాయకులౌతున్నారు.

రామానాయుడూ వెంకటయ్య జీవితాలు పండిపోతున్నవి. వ్యవసాయంతో జీవనం గడుపుతున్నారు.

రామదాసు నేతనేసి వచ్చిన కూలీతో జీవనం గడుపుతున్నాడు. జీవిత సంధ్యా సమయంలో ఆయన కాషాయ వస్త్రాలు ధరించి అస్తమయ సూర్యునివలె బ్రహ్మ తేజంతో వెలుగుతున్నాడు. ఆయన కులపతిగా నున్నప్పుడు కొందరు సనాతనులు 'హరిజనులకు ముక్తిపొందే అవకాశముందా' అని ప్రశ్నించారు. శ్రీమణవాళ మహామునులు అందుకు యిచ్చిన సమాధానం గమనించదగింది. జాత్యాధిక్యత అహంకారానికి కారణం కావటంవల్ల సవర్ణులు భగవంతునికి దూరమౌతున్నారు. హరిజనులకు మేము ఎక్కువ అనే అభిమానముండదు కనుక వారికి ముక్తి సమీపం. సనాతన సోదరులు అభిజనాభిమానమును విడిచిపెట్టి హరిజనులతో సర్వసోదర భావం అలవరచుకోవటం మంచిది. ఋషులు ధర్మవ్యాధుని వాకిట కావలి వుండి సర్వసందేహాలను పోగొట్టుకోలేదా? - ఇదీ వారి సమాధానం.

రామదాసయతీంద్రుడు రేపు, మాపు వూరగొండ ఎక్కి తిరుగుతూ అక్కడే పడుకునే వాడు. తరువాత కళాశాలకు, వూరికి రావడం మానివేశాడు. సిద్ధుడై కొండ గుహలలో ఎవరికీ కనపడకుండా నిరంతర ధ్యానపరుడై పరబ్రహ్మంతో ఐక్యమైనాడని పెద్దలు చెప్పుకుంటారు.

❋

# 10

# సత్యహారిశ్చంద్రీయం

(పౌరాణిక నాటకం)

బలిజేపల్లి లక్ష్మీకాంతం

1881-1953

ప్రథమ ముద్రణ : 1912

# బలిజేపల్లి లక్ష్మీకాంతం

బలిజేపల్లి లక్ష్మీకాతం గుంటూరు జిల్లా ఇటికంపాడులో 1881 డిశంబరు 23న జన్మించారు. చిన్నతనంలోనే సంస్కృతాంధ్రాలు అభ్యసించారు. కర్నూలులో మెట్రిక్యులేషన్ పరీక్ష పూర్తి చేశారు. చిన్నతనంలోనే కవిత్వం చెప్పేవారు. కొంతకాలం కర్నూలులో సబ్ రిజిస్ట్రారు ఆఫీసులో హెడ్‌గుమస్తాగా పనిచేశారు. గుంటూరు హిందూకళాశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయలుగా వ్యవహరించారు. ఆంధ్రదేశంలోని వివిధ సంస్థానాలలో అవధానాలు చేశారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు రెండు సంవత్సరాల జైలుశిక్ష పడింది. జైలులో కాలం వృధాపుచ్చక సత్యహరిశ్చంద్రీయ నాటకం వ్రాశారు. జైలునుండి రాగానే 1926లో 'ఫస్టు కంపెనీ' అనే నాటక సమాజం స్థాపించారు. సత్యహరిశ్చంద్ర నాటకాన్ని, ఉత్తరరాఘవం నాటకాన్ని దానిద్వారా ప్రదర్శించేవారు. లక్ష్మీకాంతం స్వయంగా వేషాలు వేసేవారు. 1922లో చల్లపల్లి రాజా సహకారంతో గుంటూరులో చంద్రికాముద్రణాలయం స్థాపించారు. 1930లో రంగూనులోని ఆంధ్రులు వీరిని ఆహ్వానించారు. అక్కడ ఆయన సత్యహరిశ్చంద్రను ప్రదర్శించారు. నక్షత్రక పాత్ర ఆయనకు అభిమానం. శివానందలహరి శతకం, స్వరాజ్యసమస్య, ఆయన పద్యకృతులు. నవలలలో బ్రహ్మరథం, మణిమంజూష ప్రసిద్ధాలు. నాటకాలలో సత్యహరిశ్చంద్ర, ఉత్తరం రాఘవం బాగా పేరు తెచ్చిపెట్టాయి. జీవిత చరమదశ కాళహస్తిలో గడుపుతూ రామాయణ సుందరకాండాన్ని అసంపూర్ణంగా వ్రాసి వదిలి పెట్టారు. కవితా కళానిధి బిరుదంతో ఆంధ్రదేశం ఆయన్ని సత్కరించింది. 1942లో చలనచిత్ర సంఘంవారు పుంభావసరస్వతి అనే బిరుదాన్ని యిచ్చారు.

నాటకరంగంలోనే గాక చలన చిత్రరంగంలోను ఆయన పేరు తెచ్చుకున్నారు ఎన్నో చిత్రాలకు కథలు మాటలు, పాటలువ్రాశారు. స్వయంగా సినిమాలలో పాత్రలు ధరించారు. నాటకరచయితగా, నటుడుగా కవిగా, స్వాతంత్ర్య సమరయోధుడుగా బలిజేపల్లి లక్ష్మీకాంత కవి ఒక విశిష్ట వ్యక్తి. బలిజేపల్లి వారు-1953 జూన్ 30వ తేదిన కాళహస్తిలో పరమపదించారు.

# సత్యహరిశ్చంద్రీయం గురించి

హరిశ్చంద్ర మహారాజు సత్యసంధుడు. ఆయన భార్య చంద్రమతి హరిశ్చంద్రుని చేత బొంకు పలికిస్తానని విశ్వామిత్రుడు వసిష్ఠునితో పంతంపడతాడు. ఆపథకంలో భాగంగా వేటకువెళ్లిన హరిశ్చంద్రుని వద్దకు మాతంగ కన్యలను పంపి వారిని వివాహమాడమని ఒత్తిడి తెస్తాడు. అంగీకరించనందుకు విశ్వామిత్రుడు కోపించాడు. ఆయనకు రాజ్యాన్ని ధారపోశాడు హరిశ్చంద్రుడు. విశ్వామిత్రుడు హరిశ్చంద్రునికి సతీసుతులతో రాజ్య బహిష్కరణ శిక్ష విధిస్తాడు అందుకు హరిశ్చంద్రుడు అంగీకరించాడు.

నగరం వదలి వెళ్తున్న హరిశ్చంద్రుని పాత అప్పు తీర్చమని బలవంతం చేస్తాడు విశ్వామిత్రుడు. లోగడ యాగసంరక్షణకు అపారధనాన్ని దానంగా ధారపోశాడు మహారాజు అదియిప్పుడు తీర్చే శక్తిలేదంటాడు హరిశ్చంద్రుడు ఒక్కనెల గడువులో తీరుస్తానని హామీయిచ్చాడు. ఆడబ్బు రాబట్టడానికి నక్షత్రకుని వారి వెంట పంపాడు విశ్వామిత్రుడు. విశ్వామిత్రుని పంతం నెగ్గలేదు.

హరిశ్చంద్రుడు చంద్రమతితో అడవులపాలయ్యాడు. గడువు పూర్తి కావస్తోంది. భార్య చంద్రమతిని కాలకౌశికునకు దాసిగా అమ్మివేశాడు. ఆమెతో గూడ బిడ్డకూడా వెళ్లాడు. కాలకౌశికుని యింటికి సమిధలు తీసుకొనిరావడానికి అడవికి వెళ్లిన లోహితాస్యుడు పాముకాటుకు మరణించాడు. కుమారుని స్మశానవాటికకు తీసుకొని చంద్రమతి వెళ్తుంది.

అప్పటికే హరిశ్చంద్రుడు మిగతా డబ్బుకోసం తననుతాను కాటికాపరికి అమ్ముడుబోయాడు. అతని ఆజ్ఞమేరకు శ్మశానవాటిక రక్షణ బాధ్యతలో ఉన్నాడు. లోహితాస్యుని శవాన్ని తీసుకొని వచ్చిన చంద్రమతిని శుల్కం కట్టవలసిందిగా హరిశ్చంద్రుడు కోరాడు. ఆమె తన మాంగల్యాన్ని తాకట్టుపెట్టి పైకం తెచ్చికడుతుంది. దారిలో చంద్రమతిపై రాజద్రవ్యాపహరణ నేరారోపణ జరిగి మరణదండన విధించబడింది మరణదండన హరిశ్చంద్రుని చేతుల మీదుగా జరగాలి చంద్రమతిని ఖండించడానికి ఖడ్గంపైకెత్తాడు. దేవతలు పుష్పవృష్టి కురిపించారు. విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని సత్య సంధతను కొనియాడాడు. నాటి నుండి అతడు సత్యహరిశ్చంద్రుడయ్యాడు.

# 10 సత్యహరిశ్చంద్రీయం

## సంక్షిప్త గ్రంథం

ఇంద్రసభలో వశిష్ఠవిశ్వామిత్రనారదాదిమహర్షులతో, బృహస్పతితో ఇంద్రుడు ప్రవేశించాడు. యజ్ఞయగాదులు ఎన్ని చేసినా సత్యవ్రత నిష్ఠ కష్టమని వశిష్ఠుడు ఆసభలో నొక్కి చెప్పాడు. సత్యమే నాటికి నేటికీ ఆచరణీయమని ఆయన చెప్పగా నారదుడు అతణ్ణి ప్రశంసించాడు. విశ్వామిత్రునకు అది చూచి కోపము కలిగింది. వారిరువురికీ తగవుపెట్టవలెనని నారదుడు విశ్వామిత్రుని పురికొల్పాడు. విశ్వామిత్రుడు వశిష్టుని వైపు చూసి శుక్రనీతిలో సత్యమును గూర్చి చెప్పిన 'వారిజాక్షులందు' అనే పద్యము గుర్తు చేశాడు. దేవేంద్రుడు ఆ మాటను త్రోసి పుచ్చుతూ ప్రపంచములో ఎవడైనా అలాంటి సత్యవ్రతుడున్నాడా? అని సభలోని వారిని ప్రశ్నించాడు. వశిష్ఠుడు ఏదో చెప్ప బోయాడు. విశ్వామిత్రునకు అది పరాభవమనిపించినది. అయినా వశిష్ఠులు హరిశ్చంద్ర చక్రవర్తిని గురించి ప్రస్తుతించాడు. విశ్వామిత్రునకు ఎక్కడలేని కోపం వచ్చినది. వారిద్దరి మధ్య వాదోపవాదములు పెరిగినవి. లోకంలో ఆలాంటివాడు ఉండటం కష్టమని దేవేంద్రుడు కూడా నొక్కి చెప్పాడు. వశిష్ఠవిశ్వామిత్రులు ఒకరి నొకరు దూషించుకున్నారు. వారి యింట పురోహితుడు కావున వశిష్ఠుడు అలా మాట్లాడుతున్నాడని విశ్వామిత్రుడన్నాడు. నీవలన క్షత్రియ కులమేగాక తపస్సులకు కూడా కళంకమంటుతున్నదని వశిష్ఠుడన్నాడు. చివరకు ఇద్దరూ పందెము వేసుకున్నారు. హరిశ్చంద్రుడు బొంకాడినచో తానుగాడిదపై ఎక్కి తలగొరిగించుకొని తపస్సుమాని ఉత్తర దిక్కుగా వెళతానని వశిష్ఠుడు శపథం చేశాడు. తాను ఘోరతపస్సులో సాధించిన శక్తిని అర్ధభాగం హరిశ్చంద్రునకు ధారపోసి ఇంద్రపీఠంపై అతనిని కూర్చోబెడతానని విశ్వామిత్రుడు ప్రతినబూనాడు. నీ శిష్యుడు కాబట్టి అతనికి నీవు చెప్పదలచుకున్నదంతా చెప్పకోమని విశ్వామిత్రుడు వశిష్ఠుని పురికొల్పాడు.

దేవేంద్రుడు విశ్వామిత్రుని శాంతించమని కోరాడు. విశ్వామిత్రునకు కోపం ఎక్కువైనది. నడమంత్రపు సిరి వచ్చిన ఇంద్రుని విశ్వామిత్రుడు

దూషించాడు. అహల్యా శాపము, నహుషునిచే భంగపాటు గుర్తుతెచ్చి హేళన చేశాడు. మాకు కోపం వస్తే నీవు పదవీచ్యుతుడవు కావలసినదేనని హెచ్చరించాడు. నారదాది మునులు, బృహస్పతి అతనిని అడ్డుకున్నారు. చివరిసారిగా వశిష్ఠ విశ్వామిత్రులు తమ పందెములు గుర్తుకు తెచ్చుకొని జయాభిలాషులై వెళ్ళిపోయారు.

దుర్ఘటమైన కార్యమును నెత్తి మీద వేసుకున్నందుకు విశ్వామిత్రుడు బహుథా ఆలోచించాడు. ఒకవేళ హరిశ్చంద్రుడు తన మాయాజాలంలో పడక అబద్ధమాడక పోయిననూ, సాటిరాజకుమారుడు సత్యకీర్తి అని లోకానికి చాటి చెప్పిన గౌరవము తనకు దక్కుననుకున్నాడు. బొంకినచో వశిష్ఠుని పని యింతటితోసరి. సృష్టికి ప్రతిసృష్టిచేసి రాజర్షి పదవిని సాధించిన తనకు అవజయభయము లేదనుకున్నాడు. నేరుగా హరిశ్చంద్ర మహారాజు కొలువు తీరిన సభలో ప్రవేశించాడు. అక్కడ కొలువులో హరిశ్చంద్రుడు తనమంత్రి సత్యకీర్తితో మంతనములు జరుపుతున్నాడు. తాము జరిపిన రాజసూయ యాగం చక్కగా నెరవేరింది కానీ, విశ్వామిత్ర మహర్షి రాలేదనే కొఱత ఆయన వ్యక్తం చేశాడు. ఇంతలో విశ్వామిత్రుడు ప్రత్యక్షమయ్యాడు. తమ విషయమే మాట్లాడుకుంటున్నామని హరిశ్చంద్రుడు వినయ వినమితగాత్రుడై చెప్పాడు.

విశ్వామిత్రుడు తన యాగం కోసం ధనం కావాలని మహారాజు నడిగాడు. ఒక ఏనుగుపై బలవంతుడు నిలబడి ఒక రత్నాన్ని పైకి రువ్వితే ఎంత దూరం పోతే అంత ఎత్తు డబ్బు కావాలన్నాడు. హరిశ్చంద్రుడు సంతోషంగా ఇస్తాను తీసుకోమన్నాడు. అవసరం వచ్చినప్పుడు తీసుకెళ్తాను. అప్పటి వరకు నీవద్దనే వుంచమన్నాడు ఋషి. ధనం కోసం లోకంలో ఎన్నో అపవాదులు వస్తున్నాయని రాజు నచ్చచెప్పబోయాడు. మాకక్కడ కొంపాగోడూలేవు కాబట్టి దొంగలు నిలువనీరనీ దాచుకోవడానికి పెట్టె బేడా లేవనీ ముని ధనాన్ని తీసుకెళ్ళడానికి అంగీకరించలేదు. ధనం కాపాడుకోవడానికి మీకు తపశ్శక్తి వుంది గదా అన్నాడు హరిశ్చంద్రుడు. విశ్వామిత్రునికి రోషం వచ్చింది. ఈ చిన్న విషయానికి తన తపశ్శక్తి ధారపోయడం భావ్యంకాదన్నాడు ఋషి. హరిశ్చంద్రుడు మీ యిష్టానుసారమే

కానిండు - అని వూరుకొన్నాడు. హరిశ్చంద్రుడు తన చేజిక్కినాడని ఋషి సంతోషించాడు ఎలాగైనా అతణ్ణి తన ఆశ్రమానికి రప్పించే ఆలోచన చేశాడు ముని పరదనాన్ని కాపాడటం కష్టమని రాజు తన మంత్రితో అన్నాడు

రాజుగారి మ్రోల తమబాదలు మొరపెట్టుకోవడానికి సభకు జానపదులు వచ్చారు ఏదో ప్రళయం సంబవించిందని రాజు తలపోశాడు పౌరులు తమ కష్టనష్టాలను రాజుకు విన్నవించుకొన్నారు : ''తాను అరకదున్నుతూ పొలంలో తనబార్యను గడ్డి తెమ్మని పంపితే పులివాత బడిందనీ నెలబిడ్డను ఎలా బతికించాలనీ ఒక పౌరుడు మొరపెట్టాడు తన బిడ్డలందరినీ పులి కడుపున పెట్టుకొందనీ తానొంటిగా నిలచా''నని మరొకడు వాపోయాడు

రాజు వారినోదార్చి తానిప్పుడే వేటకు బయలు దేరుతున్నాననీ మంత్రితో చెప్పాడు ఈ పులులబాద విశ్వామిత్రుడు సృష్టించిన నాటకమని ఆ రాజునకు తెలియదు సూర్యుడు తన వెలుగుతో లోకాన్ని కాపాడినట్లు రాజు తన పౌరులను ఆదుకోవాలని రాజు మంత్రికి వివరించాడు మృగాలను సంహరించడానికి రాజు బయలుదేరగా సూర్యుడస్తమించాడు

విశ్వామిత్రుడు తన శిష్యునితో రంగప్రవేశం చేశాడు లెక్కలేనంత దనాన్నికోరి హరిశ్చంద్రుని తన చేజిక్కించుకోవడమేగాక అతణ్ణి అడవులకు వచ్చేలా చేశానని విశ్వామిత్రుడు గొప్పగా చెప్పుకొన్నాడు. ఇప్పుడతని మనస్సు నాకర్షించే శృంగార కన్యలను సృష్టించి పంపుతాననీ, నక్షత్రకుడు కూడా అప్రమత్తంగా ఉండాలనీ కోరాడు తన చదువు ఏదో మూలంగా గంగలో కలిసిందని నక్షత్రకుడు వాపోయాడు వశిష్టుడు, అగస్త్యుడు, గార్గేయుడు, మాండవ్యుడు మొదలైన మునులు వద్ద చేరిన శిష్యులు సాంగోపాంగంగా వేదాలు నేర్చుకొన్నారనీ, తనకు చేరిన నాటి నుండి ఈనాటివరకు సంధ్యావందనం కూడా రాలేదని నక్షత్రకుడు గురువును ప్రశ్నించాడు గడియలో నేర్పిస్తానని గురువు సమాదానం

ఇంతలో రదంమీద నిలబడి పులిని వేటాడుతూ హరిశ్చంద్రుడు ప్రవేశించాడు. మనుష్యమాంసానికి అలవాటుపడి పొలిమేరలలోబడి తింటున్న

ఆ వ్యాఘ్రాన్ని అతడు తరుముకొంటూ వచ్చాడు. రథసారథి గుర్రాలను దౌడు తీయించాడు. కుమ్మరి సారె వలె గుండ్రంగా భూమి తిరుగుతున్నట్లు కనబడుతోంది రాజుకు. చూస్తుండగానే పులి అదృశ్యమైంది. అంతా మాయగా వుంది.

పులి అడుగుజాడలు కనిపెట్టేందుకు హరిశ్చంద్రుడు రథసారథితో కలిసి పాదచారియై వచ్చాడు. దగ్గరలో ఆశ్రమ ప్రాంతం కనిపించింది. కొమ్మలకు ఆరవేసిన చెంగావి మడగుధోవతులు కన్పిస్తున్నాయి. ఎరుకలను దూరంగా వెళ్ళమని ఆజ్ఞఇచ్చి తాను ముందుకు సాగాడు. ఆయన వెనక చంద్రమతీ లోహితాస్యులు (రాణి, యువరాజు), మంత్రి సత్యకీర్తి రథంపై వస్తున్నారు. లోహితుడు పులిని చూసి భయపడ్డాడేమోనని రాజు వాకబుచేశాడు. ఆ పులిని చంపివేస్తానని బిడ్డ అనగానే రాజు సంతోషంగా అతణ్ణి ముద్దు పెట్టుకొన్నాడు.

విశ్వామిత్ర ఆశ్రమమని తెలియగానే చంద్రమతీ హరిశ్చంద్రులు అపశకునం కలిగినట్లు బాధపడ్డారు. విశ్వామిత్రుని పేరు వినబడగానే వారు కలవరపడ్డారు. అలసిపోయిన రాజు చెట్టు నీడన విశ్రాంతి తీసుకోవడానికి చంద్రమతి తొడపై తలపెట్టుకొని పడుకొన్నాడు. పగటి పూట శత్రువులను జయించడమో అర్థులను కాపాడటమో, విద్యార్జన చేయడమో, కవ్యాలు స్వీకరించడమో కీర్తి ప్రతిష్టలార్జించడమో చేయాలిగాని ఇలా నిద్రపోవడం భావ్యం కాదని అతని భావం. పైపెచ్చు నిన్న రాత్రి తానొక కలగంటినని భార్యకు స్వప్న వృత్తాంతం తెలియజేశాడు :

"తాను విద్వజ్జన పురోహితులతో కొలువు తీరి యుండగా క్రోధావేశంతో వచ్చిన ఒక రాజర్షి తనను సింహాసనమునుండి నేల బడదోసి రాజ్యాన్ని, సర్వస్వం తీసుకొని కటుబట్టలతో తనను అడవులకు పంపాడు. అక్కడ తాము పడరాని పాట్లు పడుతున్నారు."

చంద్రమతి అదివిని భయపడింది. మీక శుభాలు కలగవనీ, నిన్నటి దినం విశ్వామిత్రుని ధనాన్ని గూర్చి ఆలోచిస్తున్నందున అలాంటి స్వప్నం

వచ్చిందనీ మంత్రి సర్దిచెప్పాడు. నిద్ర బోవడానికి ముందు మన మేవిషయం ఆలోచిస్తుంటే దానికి సంబంధించిన కలలు రావడం సహజమన్నాడు. దేవతల నర్చించి సంతర్పణ చేస్తే శాంతి జరుగుతుందని సలహా ఇచ్చాడు. మనోహ్లాదానికి సంగీతపారకులు లేరే అనుకుంటుండగా ఇద్దరు మతంగ కన్యలు ప్రవేశించారు. వారిద్వారా కాలక్షేపమవుతుందని రాజు వారిని గానం చేయమన్నాడు. వారు వీణలుమీటి పాడనారంభించారు.

''మహారాజా! మమ్ము మేమే పొగడుకోవడం తగనిపని. అయినా సంగీతసాహిత్యవిద్యలలో సరస్వతీదేవి మాకు అండ. సరసుడవైన నిన్ను చూచి వలచి కౌగిలించాలని నిద్ర మానుకొని వచ్చాము.'' అంటూ వారు గానం మొదలెట్టారు. హరిశ్చంద్రునికందులో అర్థం వెంటనే స్ఫురించలేదు. కంఠస్వరం వీణానాదంతో శ్రోత్రపేయంగావుంది. వారికి ముత్యాలహారం బహుమానంగా యిచ్చి పంపమని మంత్రిని ఆదేశించారు.

వారందుకు అంగీకరించక ''రాజా! మా విద్యను మీ వంటి ప్రభువులు చూచి మెచ్చుకొంటే అదే పదివేలు. రసికుడవైన నీ ప్రాపకం దొరికితే చాలు. రతిరాజువైన నీవు యౌవనవతులమైన మమ్ము ఏలుకో''మని కోరారు. హరిశ్చంద్రుడు వారి మాటలు విని కోపంతో వారిని పంపివేయమన్నాడు. మంత్రివారిని తరుముకొనగా వారు ఏడుస్తూ మా తండ్రిగారైన విశ్వామిత్రునికి తెలియజేస్తామని వెళ్ళి పోయారు. హరిశ్చంద్రుడు యిదంతా ఇంద్రజాలంలా వుందనీ, ఏదో చెడు కోసమే ఈ ఆశ్రమానికి వచ్చామనీ అశుభ సూచకంగా భావించాడు.

విశ్వామిత్రుడు ప్రళయకాలగర్జన చేస్తూ వచ్చాడు. దండధారియై కనుల నిప్పులు చిమ్ముతూ కనిపించాడు. ''ఓరి హరిశ్చంద్రా! నా కుమార్తెలు ఈ రోజు నిన్ను ప్రేమగా పిలిస్తే నీవు వారికి దండన విధించావు. దాని ఫలితం అనుభవిస్తా'' వన్నాడు. హరిశ్చంద్రుడు అదే మహాభాగ్యంగా భావించి విశ్వామిత్రునికి పాదాభివందనం చేశాడు. విశ్వామిత్రుడు మహారాజు కిరీటాన్ని తన్నాడు. హరిశ్చంద్రుడతివినయంతో నమస్కరించాడు. విశ్వామిత్రుని కోపం తారాస్థాయికి చేరింది. మా ఆశ్రమాలలో వేటాడటం నేరమన్నాడు.

నీ కులగురువు వసిష్ఠునివలె నీ తప్పిదాలు మన్నించనన్నాడు. తెలియకచేసిన తప్పు సైరించమని మహారాజు ప్రాదేయపడ్డాడు

విశ్వామిత్రుడు తన గొప్పదనాన్ని చాటి చెప్పుతూ ఈ విశ్వామిత్రుని తెలియని మూర్ఖత్వం కళ్ళకావరమన్నాడు గానకళాకోవిదులైన తన కుమార్తెలను గౌరవించవలసినది బోయి దురాగతం చేయడం దర్మం కాదన్నాడు నా కూతురులని తెలిసి కూడా అలా చేసినందుకు హరిశ్చంద్రుని నాలుక కోయాలన్నాడు హరిశ్చంద్రుడు చచ్చిన పామును చంపడమేలయని విశ్వామిత్రుని ప్రార్థించాడు అతని క్షమాగుణ సంపత్తికి విశ్వామిత్రుడు మనస్సులో పొంగిపోయాడు అయినా శపదం గుర్తుకు వచ్చి క్రోదం వెళ్ళబుచ్చాడు శరణాగతరక్షకులమైన తాము హరిశ్చంద్రుని మన్నిస్తామనీ కానీ తాము చెప్పిన ఉపదేశం శిరసావహించమని ఆదేశించారు. పాపకార్యం తప్పమరేదైనా అంగీకారమే నన్నాడు మహారాజు నా కుమార్తెలను వివాహమాడుమని రాజర్షి సలహా ఇచ్చాడు మంత్రి ఆ మాటలు విని అదిరిపడ్డాడు మహారాజు పాపమని చెవులు మూసుకొన్నాడు కొంతసేపటికి తేరుకొని మహారాజు మహర్షితో వినయంగా ఇలా అన్నాడు: 'దేవా! వివాహం వంశం నిలవడానికేగదా! నాకు వివాహమైన సత్పుత్రుడైన ఈ లోహితుడు కలిగాడు వయః పరిపాకం కూడా తప్పింది ఇప్పుడు ఈ వర్ణాంతర వివాహానికి నన్ను మీరు పురికొల్పడం భావ్యం కాదు! ఇహ పరాలకు చెడే మార్గం నాకు వద్దు.'

విశ్వామిత్రు డావాదనను అంగీకరించలేదు :

''ఓరీ! ఎప్పుడో రాబోయే పరసౌఖ్యాలకోసం ఇప్పుడు సామ్రాజ్య భోగాలు వదలుకోవడం మూర్ఖం వీరిని పెళ్ళాడకపోతే నీకు స్వర్గద్వారాలు తెరిచియున్నాయా? తుచ్ఛ రాజులకు స్వర్గం దొరుకుతుందా? 'రాజ్యాంతే నరకం ధ్రువం' - అనే సంగతి నీకు తెలియదా; కాబట్టి ఈ పంచమకన్యలను పెండ్లాడి భోగబాగ్యాలు అనుభవించు! నీవు నాతో ప్రతివాదన చేయక నా మాటవిను పాపపుణ్యాలమాట కట్టిపెట్టు నా తపోబలంతో నీకు సమస్తం యిస్తాను ఇంద్రత్వమో,బ్రహ్మత్వమో ఏది కావాలంటే అది కల్పిస్తాను''

రాజర్షి మాటలు విని మహారాజు తన బయాన్ని వెలిబుచ్చారు ''దేవా! సిగ్గు వదలి మీ మాటలు విని నేను ఈ కన్యలను వివాహమాడితే సూర్యవంశానికి అప్రతిష్ఠ. ఆబాలగోపాలం నన్ను పరిహసిస్తారు'' - అన్నాడు

సృష్టికి ప్రతి సృష్టి చేసిన విశ్వామిత్రుని అల్లుడు గావడం గొప్పగాబట్టి వీరిని పెండ్లాడమన్నాడు రాజర్షి రాజ్యం సర్వస్వం వదులుకొంటానుగాని ఈ పని చేయలేనన్నాడు మహారాజు రాజర్షి 'తదాస్తు' అన్నాడు ఆ మాట మీద నిలబడమన్నాడు తాను పట్టణానికి వెళ్ళి సింహాసనం అధీష్టిస్తానన్నాడు రాజముద్రిక యిమ్మన్నాడు

మహారాజు సంతోషంగా అంగీకరించాడు ''మహానుబావా! ఈ రాజ్యసౌఖ్యాలు చెరుకుపిప్పివలె ఎన్నడో విడుచబడ్డాయి. మీరు స్వీకరించమన్నాడు విశ్వామిత్రుడు 'రాజా! ఈ మాయమాటలు చెల్లవు నీవు సత్యసందుడవని విన్నాం ఇప్పుడది నేతిబీరకాయకాకుండా చూసుకోమన్నాడు 'ఏదో పొరబాటున మాట దొర్లి అలా అన్నానుగాని రాజ్యమీలే'నని చెప్పమన్నాడు

చంద్రమతి ఆ మాటలకు తత్తరపడింది నాధా! నేను మీకు కర్తవ్యబోధ చేసేంత దానిని కాదు మాందాతాది రాజులందరూ రాజ్యాలు పాలించి వెళ్ళిపోయారు. ఒక్కరు కూడా సిరిని వెంట బెట్టుకొని వెళ్ళలేదు ప్రాణికి యశస్సు ముఖ్యం అన్నది విశ్వామిత్రుడామె సత్యవ్రతనిష్ఠ మనస్సులో మెచ్చుకొన్నాడు హరిశ్చంద్రుడు ఆమె సాహచర్యంలో తాను పొందిన గౌరవాలు గుర్తుతెచ్చుకొన్నాడు రాజ్యలక్ష్మిని మహర్షికి ధారాదత్తం చేశాడు దేవ బ్రాహ్మణ మాన్యాలు తప్ప మిగతా రాజ్యమంతా బ్రహ్మార్పణంగా యిస్తున్నానన్నాడు మహారాజు కిరీటాన్ని రాజలాంచనంగా సమర్పించాడు మహర్షి ఆయన దానగుణాన్ని మెచ్చుకొని తక్షణమే రాజ్యం వదలి పెట్టి బార్యాబిడ్డలతో వెళ్ళిపొమ్మన్నాడు సత్యకీర్తి మంత్రిగాయిక వుండనన్నాడు

ప్రజాసంక్షేమం దృష్ట్వా, విశ్వామిత్రునిబారి నుండి వారిని రక్షించడానికి సత్యకీర్తిని రాజ్యంలోనో వుండమని హరిశ్చంద్రుడు బ్రతిమాలాడు సత్యకీర్తి

బలవంతంపై అంగీకరించాడు. ప్రజలు ఈ రాజ్యం ధారపోసిన విషయం తెలిసి గుంపులుగా వచ్చి విశ్వామిత్రుని అంతమొందింప జూశారు. మహారాజుపై మత్తు జల్లి రాజ్యాన్ని మాయతో గ్రహించిన ఆ దురాత్ముని కొట్టబోయారు. హరిశ్చంద్రుడే ఈ పన్నాగం పన్నాడని రాజర్షి కావాలనే అతనిపై ఈ నెపం పెట్టాడు.

హరిశ్చంద్రుడు పౌరులకు చేతులెత్తి నమస్కరించాడు. మహర్షుల మాట పాటించమన్నాడు. వారిని ఎదిరించడం రాజధిక్కారమవుతుందని బ్రతిమాలాడు. ఎన్నడూ తానే రాజ్యమేలాలనుకోవడం పొరబాటనీ, ఆరోజుకు రాజు ఎవరైతే వారిని ప్రజలు అనుసరించాలని సలహా ఇచ్చాడు.

కన్న బిడ్డలవలె మమ్ములను కాపాడిన మీరు అడవుల పాలుగావడం సహించలేమనీ, భార్యాబిడ్డలతో మీరు కష్టాలు అనుభవించడం న్యాయంకాదనీ ఈ జడధారి తమపాలబడ్డాడని పౌరులు గోడు గోడున ఏడ్చారు.

హరిశ్చంద్రుడు వారినోదార్చి సత్యకీర్తితో పాటు వారిని వెనకకు పొమ్మన్నాడు. మంత్రి మహారాజును కౌగలించుకొని బావురుమన్నాడు. ఇన్నాళ్ళుగా మహారాజు ప్రాపకంలో వున్నతాను యిలా ఒంటరిగా వెళ్ళిపోవల్సివస్తుందని ఊహించలేదన్నాడు.

మంత్రి సత్తముని మాన్యతను గొనియాడాడు మహారాజు. నాకు వలె ఈ రాజర్షికి సలహాలిస్తుండమని కోరాడు. ఋణానుబంధం వుంటే మళ్ళీ కలుసుకోగలమన్నాడు. విశ్వామిత్రుడు తన పట్టాభిషేకమహోత్సవానికి ఏర్పాట్లు చేయమని మంత్రిని అదలించాడు. పరస్పరం వీడ్కోలు చెప్పుకొని వెళ్ళిపోతుండగా విశ్వామిత్రుడు రాజేంద్రుని పిలిచి అతని మోసాన్ని గుర్తిచేశాడు. తనకు లోగడ దానంగా ఇచ్చిన రొక్కం ఈ క్షణం కక్కమని ఆదేశించాడు. అది ఎక్కడో దాచిపెట్టుకొని వెళ్తున్నావన్నాడు. అంతటి అసత్యం పలుకుతున్నావని దూషించాడు. ఇంతటి దారుణం పనికిరాదన్నాడు హరిశ్చంద్రుడు. రాజ్యం, సర్వస్వం ధారపోసి కట్టుబట్టలతో వెళుతున్న తనను యిలా బలవంతంచేయడం భావ్యం కాదన్నాడు. ముందు ఇస్తానని యిప్పుడు

లేదనడం సమంజసం కాదని రాజర్షి కోపించాడు రాజ్యదానం కూడా అలానే చేస్తావా? అని హెచ్చరించాడు తన దరిద్రాన్ని తలచుకొని మహారాజు దుఃఖించాడు ఒక్క నెల గడువు యిస్తే తాను ఆ ధనం యిచ్చివేస్తానన్నాడు. ఆమాట ముందే చెప్పగూడదా? అన్నాడు రాజర్షి తన ఋణం రాబట్టుకోవడానికి తన ప్రియశిష్యుడైన నక్షత్రకుని రాజుతోపాటు పంపుతాననీ ఎప్పుడు సంపాదించిన డబ్బు అప్పుడతనికి యిచ్చివేయమని రాజర్షి నక్షత్రకుని తగులగట్టాడు.

రారాజును భిక్షార్థినిగా క్షణములో చేసిన తనగురువు శక్తియుక్తులను నక్షత్రకుడు మనస్సులో ప్రశంసించాడు

విశ్వామిత్రుడు నక్షత్రకునికి కర్తవ్యాన్ని ఉపదేశించాడు :

''శిష్యా! నీవు ఏరోజుకారోజు రాజు వద్ద రొక్కంతీసుకోవాలి. మోమోటం ఏ మాత్రం పనికి రాదు. ఒక్క నిమిషం కూడా అతణ్ణి కూర్చోనీకుండా అహోరాత్రులు హరిశ్చంద్రుని ధైర్యం సడలిపోయేలా చూడాలి అబద్ధం ఆడించేలా చూడాలి. అని రహస్యంగా చెప్పి హరిశ్చంద్రునికి వినిపించేలా ఇలా అన్నాడు 'నక్షత్రకా! మన కితడీవలసిన రొక్కం నెలలోపల రాబట్టాలి' అని చెప్పాడు. నక్షత్రకుని పువ్వులలో పెట్టి కాపాడవలెననీ, అన్న పానాదుల విషయంలో అతడు ఓర్వలేడనీ తనకుమారుగా జూచుకోవాలనీ విశ్వామిత్రుడు హరిశ్చంద్రునితో చెప్పాడు

హరిశ్చంద్రుని మనస్సును సంచలింపజేయాలని విశ్వామిత్రుడతనికి హితబోధ చేశాడు: ''రాజా! నా యుపదేశం నీవు త్రోసివేసి పడరాని పాట్లు పడబోతున్నావు నీవు కనీసం పిడెకెడు అటుకులు కూడా దొరకకుండా చేయగలను అప్పుడు నా అప్పు తీర్చడం సాధ్యంకాదు అందవల్ల నీవు నిష్కారణ బాద పడగలవు కాబట్టి చక్కదనాల చుక్కలైన మాతంగకన్యలను వివాహం చేసుకొంటే కష్టాలు గట్టెక్కగలవు ''

హరిశ్చంద్రుడు విశ్వామిత్రుని మాటలకు తలయొగ్గలేదు తాను పడబోయే కష్టాలను గూర్చి ఆలోచించలేదు. సృష్టి సర్వం తలక్రిందులైనా తాను కీర్తినే కోరుతానని, చంచలమైన సిరిసంపదలక్కరలేదనీ నిర్ద్వందంగా చెప్పాడు.

విశ్వామిత్రుడు ఆ మాటలకు కోపించి హరిశ్చంద్రుని నిందించాడు దరిద్రపు పెద్దమ్మ నెత్తి కెక్కితే ఇతరులమాటలు రుచించవన్నాడు. అరణ్యంలో బీకరమృగాల మధ్య భార్యాబిడ్డలతో అగచాట్లు పడే కర్మ నీకు వ్రాసి పెట్టివుంది ఈ బర్త నెందుకు చేసుకొన్నానా? అని ఆమె బ్రహ్మను అడుగుతుంది రోగికి పద్యాహారం వలె నా మాటలు నీ చెవికి రుచించవు అన్నాడు.

హరిశ్చంద్రుడు ఆ మాటలు విని దేవా! మాగతి ఎట్లైననుగానిండు షేమము పోయివచ్చెదమని బయలుదేరాడు

విశ్వామిత్రు డతని మనోనిశ్చయానికి, సత్యవ్రత విరాఢికి ఆశ్చర్యపోయాడు. బవిష్యత్ కార్యక్రమాన్ని ఆలోచించాడు

హరిశ్చంద్రుడు, చంద్రమతి, లోహితాస్యుడు అడవిలో నడచి వెళుతున్నారు. చంద్రమతి నడవలేక నడుస్తుంటే మహారాజు మనస్సు కలతపడింది. ఆమెకు ఆయాసం అదికమైంది కుర్రవానిని రాజు కొంతసేపు ఎత్తుకొన్నారు. రాచరిక సపర్యలందుకోవలసిన బిడ్డ యిలా అడవులపాలు కావలసి-వచ్చేనేఅని కుమిలిపోయారు కాళ్లకు ముళ్లుగుచ్చుకొని మహారాణి సోలసిపోయింది బిడ్డడు ముందే ఎండ వేడిమికి సొమ్మసిల్లిపోయాడు. రాణివాసంలో దానదాసేజనులచే పనులుగొనవలసిన చంద్రమతి ఇలా ఘోరారణ్యంలో సుకుమార శరీరాన్ని బాదలపాలు చేయడం తనవలననే కదా అని రాజు చింతించాడు ఉద్యానవనములలో తిరిగే స్త్రీ ఎడారులలో తిరగాల్సివచ్చింది మాణిక్యదీప్తులు చూసిన వనిత ఎండగాడ్పులు బరించాల్సి వస్తోంది మృష్టాన్నభోజనాలు తినవలసిన కాంత కందమూలాలు బక్షిస్తోంది శుకపికాలాపాలకు అలవాటుపడిన చంద్రమతి భయంకర మృగాల రవాలు వినవలసివచ్చింది అనుకుంటూ హరిశ్చంద్రుడు చంద్రమతిని ఓదారుస్తున్నారు చంద్రమతి బర్తను ఆశ్వాసిస్తూ నాకోసం మీరు చింతించవద్దని బ్రతిమాలింది సుఖదుఃఖాలు సమానంగా బావించాలనీ, పుట్టినవానికవి సహజమనీ చెప్పింది నక్షత్రకుడు ఎంత బాదపడుతున్నాడోనని అతని గురించి ఆలోచించమంది కష్టాలలో కూడ పరోపకార బుద్ధిమరువని ఆమె సౌశీల్యాన్ని హరిశ్చంద్రుడు మెచ్చుకొన్నాడు నక్షత్రకుని చెట్టునీడకు చేర్చారు

నక్షత్రకుడు తనకష్టాలు ఏకరువు పెట్టాడు. గురువుగారు తనను హరిశ్చంద్రునితో బంపనేల? సొమ్ము తీసుకొనే ఆయన ఆశ్రమంలోను, చెల్లించాల్సిన హరిశ్చంద్రుడు భార్యాబిడ్డలతో ఇక్కడ సుఖంగా ఉంటే తను మాత్రం కాళ్లుపడిపోయేలా తిరగడానికి తనకేంఖర్మ పట్టిందని వాపోయారు. ఒకవేళ ఈ అడవిలో ఏ బెబ్బులియో మింగివేస్తే, తననువదలి ఆలుబిడ్డలను తీసుకొని మహారాజు సుఖంగా వెళ్లిపోతాడు. ఇప్పటికే తాను ఆకలిదప్పులతో డస్సిపోయాననీ, మాటకూడ పడిపోయే అవకాశం ఉందనీ హెచ్చరించాడు. తాను చచ్చిపోతానని నక్షత్రకుడు అక్కడే కూలబడ్డాడు. దాహం తీర్చమన్నాడు. నిర్జన ప్రదేశం కాబట్టి నీరు దొరకదని మహారాజు బాధపడ్డాడు. మాయోపాశంతో తనను ఇక్కడికి తీసుకొని వచ్చి ఏపులివాతనో బడేలాచూడటమే అతని ధ్యేయమని నక్షత్రకుడు వాపోయాడు. లోహితాస్యుడు కూడ దాహమని ఏడ్చాడు. సార్వభౌముని కుమారునికి ఇట్టి బాధలువచ్చాయి గదా అని రాజు కలవరపడ్డాడు. అన్నమోరామచంద్రా! అని కుమారుడు దుఃఖిస్తున్నా తానేమిచేయలేని స్థితిలో ఉన్నాడు. విధిలిఖితాన్ని ఎవరూ తప్పించలేరనీ గర్వోన్నతులైన రాజులు కింకరులు, కింకరులు రాజులు కాగలరని దృష్టాంతం తెలిసింతదని రాజు తలపోశాడు. నక్షత్రకుడు తనకీ వేదాంతం అక్కరలేదన్నాడు.

హరిశ్చంద్రుడు నక్షత్రకుని రక్షించడానికై ఎక్కడైనా నీరు దొరుకుతుందేమోనని వెళ్లాడు. రాజు వెళ్లిన మరునిముషము నుండి నక్షత్రకుడు గొడవ ఎక్కువ చేశాడు. చంద్రమతిని కలవరపరచాడు. దాహంతో నా నాలుక దహించుకపోతున్నది. మా అమ్మకూడా నావద్ద లేదు. కనీసం ఏడ్చేందుకు ఆమెకవకాశం లేకపోయింది అన్నాడు. ఇంతలో వడగాల్పులు తీవ్రంగా వీచాయి. చంద్రమతి అతణ్ణి ఒదార్చింది. నీతల్లికి ఈ వయస్సులో ఏవిధమైన దుఃఖంరాకుండును గాక అని ఆశ్వాశించింది. నక్షత్రకుడు దుఃఖం మరింత ఎక్కువ చేశాడు. కాళ్లుపుండ్లుపడి కదుములు గట్టాయన్నాడు. నేను బ్రతికియున్నానా? లేక చనిపోయానా? అని దుఃఖించసాగాడు.

ఇంతలో లోహితాస్యుడు తనకాకలి యెక్కువైనదని తల్లితో మొరపెట్టుకున్నాడు. కుమారుని దయనీయస్థితిని చూసి తల్లి మరింత

దుఃఖించింది. అనేకరకాల భక్ష్యభోజ్యాలతో పరిచారికలు పెట్టే పదార్థాలతో తినవలసిన తాను ఈవిధంగా పిడికెడు అన్నం లభించక అలమటించడం దుఃఖభాజనమని ఆమె దురపిల్లింది. తమవలన నక్షత్రకునికి కూడ ఇటువంటి దురవస్థ వచ్చెనేయని భగవంతుని ప్రార్థించింది. పుట్టించిన వాడు పూరిమేపకపోడు. అన్నసామెత నిజమే అయితే పట్టెడన్నం లభింపచేయడా? అని ప్రశ్నించింది. అంతలో నాలుగు కల్పవృక్ష ఫలాలు వారి ముందు పడ్డాయి. నక్షత్రకునికి ఒకటి, లోహితున కొకటి యిచ్చింది చంద్రమతి. హరిశ్చంద్రుడు దాహం తీసుకురావడం ఆలస్యమైంది. తన భర్త వచ్చేటంతవరకు తాను ఫలహారం భుజించనని ఆమె నిష్ఠగా కూర్చొన్నది. నక్షత్రకుడు నీపతి మూర్ఖుడని నిందించాడు. ఒక సన్యాసికి సర్వ రాజ్యాన్ని ధారపోసి మాటపట్టింపు కోసం కట్టుబట్టలతో భార్యాబిడ్డలను అడవులపాల్జేసిన అయోగ్యుని నమ్ముకున్న చంద్రమతి వెఱ్ఱిది యని నిర్ధారించారు. తనకు ప్రాణదానం చేసినందుకు ప్రతిఫలంగా తన గురువుతో చెప్పి వారి రాజ్య సంపద యిప్పిస్తానని వాగ్దానం చేశాడు. కొడుకు ఎక్కివచ్చేంత వరకు ఆమె రాజ్యపాలన వ్యవహారాలు స్వయంగా చూడవచ్చుననీ వాదించారు. హరిశ్చంద్రునికే రాజ్యమిప్పించుట నిష్ప్రయోజనము. అతడు వట్టిమాయాదారి. రారాజు బిడ్డయైన చంద్రమతి కష్టాలపాలు కావడం తాను చూడలేడు. ఆమాటలు త్రోసిపుచ్చుతూ చంద్రమతి నక్షత్రకునికి ప్రత్యుత్తరమిచ్చింది. బ్రహ్మచారి చాపల్యంవల్ల అతడలా మాట్లాడాడనీ, ధర్మాన్ని యోచించలేదనీ, రాజ్యభోగాలు అనుభవించే సమయంలో పతిదైవసమానుడై కష్టసమయంలో త్యజించండం దోషియవుతాడా? అని ప్రశ్నించింది. పతిని అనుసరించడమే సతికర్తవ్యమని చెప్పింది. పరమశివుడు బిచ్చమెత్తి బికారిగా తిరుగుతున్నా గౌరీదేవి ఆయనను పూజించదా? అని సహేతుకంగా పలికినది.

నక్షత్రకుడు ఆమెకు చెప్పి ప్రయోజనం లేదని నిశ్చయించుకున్నాడు. తనకు గురువు అప్పగించిన పని శక్తివంచన లేకుండా నెరవేర్చడమే తన కర్తవ్యం. అదృశ్యుడై తన గురువు అంతా చూస్తూనే వుంటాడు. నిజమే విశ్వామిత్రుడు నక్షత్రకుని అప్రమత్తంగా వుండమని హెచ్చరించాడు. మార్గమధ్యంలో వారికి దొరకకుండా తాను మాయను కల్పించాడు. అయినా

తనపై ప్రతీకారచర్యగా ఇంద్రుడు ఈవిధంగా కల్పవృక్ష ఫలాలను అందించివుంటాడని, అనుకున్నాడు విశ్వామిత్రుడు. ఆ రోజు తనతో ఇంద్రసభలో వాదించాడు గదా! తనమాట గెలవాలని అతని దీక్ష! ఆ ఇంద్రుని కల్లకపటములు తెలియనిది ఎవరికి? గౌతముని భార్యను గూడి ఆపాదమస్తకం కళ్లు కలిగేలా శాపం పొందారు. తాను తపిస్తే దేవత్వం నశించక తప్పదు. అనుకుంటూ ఒకవేళ ఇంద్రుడు చేయకపోయినా కల్పవృక్షఫలాలను ప్రకృతి తానంతతానే ఆమె పాతివ్రత్యాన్ని మెచ్చి అందించివుండవచ్చునని తీర్మానించుకొన్నాడు విశ్వామిత్రుడు.

హరిశ్చంద్రుడు తన దరిద్ర్యాన్ని నిందించుకొంటూ యింతకంటె మరణమే శరణ్యమని నిశ్చయించుకున్నాడు. చావు, లేమి అనే రెండు మనుష్యులకు ప్రధాన వ్యసనాలు. చావు సంభవిస్తే క్రమంగా ఆ యింటిలోవారు మరచిపోతారు. దరిద్రమనేది కలిగితే జీవితం దుర్భరమవుతుంది. అనుకుంటూ హరిశ్చంద్రుడు నీళ్ళు దొరకలేదు గదా అని చింతిస్తున్నాడు.

చంద్రమతి భర్త కెదురుగా బోయి తనకు దొరికిన ఫలహారాల విషయం చెప్పింది. భగవత్ప్రసాదంగా దొరికిన ఆ ఫలాన్ని వారు స్వీకరించారు. ఆ రాత్రికి నిద్రించడానికి దగ్గరలోవున్న వటవృక్షం దగ్గరకు వెళ్ళారు. నక్షత్రకుడు ఆ పెద్ద చెట్టును చూచి భయపడి, రాజా! నన్ను భూతాల ఆశ్రయ స్థలానికి తీసుకువచ్చావా? అని ప్రశ్నించాడు. ఆ రాత్రికి వారక్కడ సేదదీర్చుకొన్నారు.

ఇంతలో అంధకారబంధురంగా ఆకాశం భయంకరంగా కన్పించింది. హరిశ్చంద్రుడు నక్షత్రకుడికి, తన భార్యా బిడ్డలకు నిద్రాభంగం కాకుండా రక్షించాలని నడుమకట్టాడు. చంద్రమతిని చూస్తే ఆయన కడుపు తరుక్కొని పోతున్నది. ఆమె అమాయకంగా నిద్ర పోతున్నది. కటికనేలపై సార్వభౌముని ఇల్లాలు నిద్రించడం విధివైపరీత్యం. ఎంత ధైర్యం వహించాలన్నా హరిశ్చంద్రుని మనస్సు నిలవడం లేదు. పైట పరచుకొని కటికరాలపై నిద్రిస్తున్న ఆమెను చూస్తే రాజుకు దుఃఖం పొర్లుకొని వస్తున్నది. అసూర్యంపశ్యయైన ఆమె అడవులు పాలైంది. చెలికత్తెల మేలుకొలుపులందుకొనే పట్టపురాణి క్రూరమృగాల శబ్దాల మధ్య నిద్రపోతున్నది. స్వర్ణసౌధాల మధ్య వుండవలసిన

దేవి కటిక రాళ్ళపై నిద్రిస్తోంది. అల్లారు ముద్దుగా పెరగవలసిన బిడ్డ ఆకలికలవుటించి నిద్రపోతున్నాడు - హరిశ్చంద్రుడిలా అనుకొంటూ కలవరపడ్డాడు.

ఇలా వుండగా వటవృక్ష సమీపంలో భేతాళుడు మనుష్యసంచారం జరిగినందుకు కోపగించి 'ఎవడురా? అక్కడ నా పరిసరాలలోకి వచ్చి ధైర్యంగా తిరుగుతున్నా మిమ్ము భక్షించి నా ఆకలి తీర్చుకొంటా' నన్నాడు. హరిశ్చంద్రుడు అతని హాహాకారాలువిని భేతాళుని సంహరించాడు. అతని పరిజనులు బ్రతుకు జీవుడా? అని పరుగులు తీశారు.

ఆ శబ్దానికి నక్షత్రకుడు మేల్కొని 'అయ్యో చచ్చా'నని అరుస్తూ లోహితాస్యుని, చంద్రమతిని మేల్కొలిపాడు. ఈ మర్రియూడలలో పెనుభూతాలు ఉన్నాయనీ, హరిశ్చంద్రుని మీద కొకభూతం దూకిందనీ చెప్పాడు. చంద్రమతి అదిగమనించి మీరనవసరంగా గాబరాపడనవసరంలేదనీ, తనపతి భూతాన్ని చంపి వస్తున్నారని ధైర్యం చెప్పింది.

అది గమనించిన విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని సాధించడం తన తరంకాదని తలంచి తన శక్తిని అతనికి ధారపోయాలనుకొన్నాడు. అయినా తన శిష్యుని పిలిచి వీరినిక్కడ నుండి బయలుదేరేలా చేస్తే తరువాత వన్నాగం తాను చూసుకొంటానన్నాడు.

తనకు ధర్మదేవతయైన తన ధర్మపత్ని చెంతనుండగా ఎలాంటి ఆపదలు రాజాలవని హరిశ్చంద్రుడు మనోనిబ్బరంతో ఉన్నాడు. ఇంకా జాముర్రాత్రి వుంది. నక్షత్రకుడు గోలచేయసాగాడు : ''మహారాజా! నీకు మతి పోయినది. ఇలా దయ్యాల మధ్య చెలగాటం పనికిరాదనీ, మొండితనం వద్దనీ యిక్కడనుండి బయటపడదామనీ బ్రతిమాలాడు. పిశాచం చనిపోయినా అతని పరివారంలో ఒకటి తన రొమ్ముపై దూకినదనీ, తాను చచ్చిపోవడం ఖాయమనీ, వేళకు అన్నంలేక చిక్కిపోయాననీ, ఆశ్రమంలో సుష్ఠుగా భోజనం చేసే తాను యింకా మొండి ప్రాణంగా బ్రతికి వున్నా''ననీ అన్నాడు. నక్షత్రకుని పిరికితనానికి హరిశ్చంద్రుడు నొచ్చుకొన్నాడు. గాఢాంధకారంలో

ఎక్కడికి పోవాలన్నా కుదరదన్నాడు. మృత్యువును గూర్చి భయపడనవసరం లేదని నక్షత్రకుని సముదాయించాడు ''అయ్యో దయ్యం నన్ను నంజుకొని తినగల''దని నక్షత్రకుడు ఘోషపెట్టాడు ఇక అతనితో వాదించి ప్రయోజనం లేదని హరిశ్చంద్రుడు ఆ రాత్రివేళ బయలుదేరాడు భార్యా బిడ్డలు నక్షత్రకుడు అతని ననుసరించారు. దావాగ్ని వారిని చుట్టుముట్టింది ఋణం తీర్చకుండా దావాగ్నికి ఆహుతి కావలసి వచ్చెగదాయని హరిశ్చంద్రుడు కుమిలిపోయాడు బార్యాబిడ్డలను దగ్గరకు తీసుకొని అంత్యకాలం సమీపించిందని దుఃఖించాడు. ఒకరి నొకరు గాడంగా కౌగలించుకొని విధివైపరీత్యానికి బాధపడ్డారు చివరకు చంద్రమతి దృఢనిశ్చయంతో అగ్నిదేవుని ప్రార్థించింది అగ్నిదేవుడు చల్లబడి వారికి చింతలు పోగొట్టాడు బగవంతుడనుగ్రహించాడని ఆ దంపతులు సంతోషించారు. మీ ముద్దు ముచ్చటలుచాలు – కాశీకి వెళ్ళవలెగదా రండని నక్షత్రకుడు వారిని త్వరపెట్టి కాశీకి తీసుకెళ్ళాడు

హరిశ్చంద్రాదులు వారణాసి ప్రవేశించారు. ఆ పుణ్యక్షేత్రంలో విశ్వేశ్వరుని సందర్శించి భక్తిప్రపత్తులతో సేవించారు ఆపద్భాంధవుడైన ఆ పరమేశ్వరుడే తమ కష్టాలు తొలగించగలడని విశ్వసించారు నక్షత్రకుడు వారికి మనస్తాపం కలిగించాలని మాట్లాడాడు:

హరిశ్చంద్రా! నీవేమో ముక్కు మూసుకొని కూచొంటావు. గుళ్ళు, గోపురాలు తిరుగుతూ అప్పుమాట మరచి పోయావు. గడువు తీరేలోగా ఋణం తీర్చాలనే తాపత్రయం లేదు నా ప్రయాస ఆలోచించవు ఋణం ఎగవేయ దలచుకొంటే చెప్పు. నేవెళ్ళి పోతాను. తొందర పడనవసరం లేదంటావా? నరేనరి దీపముండగా యిల్లు చక్కబెట్టుకోవాలని మా వెర్రిగురునికి తెలియదు నేను మాట్లాడితే నీకు నిష్ఠురంలా కనిపించవచ్చు కొంపా గోడు లేని నీవు ఋణం ఎలా తీరుస్తావు? బాకీ లేదంటే నిన్ను కొట్టేవాడు లేడు. పత్రాలా? సాక్ష్యాలా? రచ్చకీడ్పించడం ఎటూ చేయలేం గురువు నీ కప్పు పెట్టలేదు ఆయనే నిన్ను చెయిసాచి యజ్ఞార్థం దనం కావాలన్నాడు. ఈలోగా నీకళ్ళలో దుమ్ముకొట్టి నీరాజ్యం అపహరించాడు ఇక అప్పు సంగతి ఎక్కడిది చెప్పు? ఇంకా నీవు సత్యము, సత్యమని పట్టుకొని

ఊగులాడుతున్నావు. జడధారినైన నేననరాదుగాని, ఈ సత్యమే నీ కొంప కూల్చింది. నేను తీర్చవలసిన ఋణం లేదని యిప్పటికైనా అంటే చాలునే వెళ్ళి పోతాను. నీవు సచ్చిదానందరూపుడవై బైరాగివిగా వెళ్ళవచ్చు. పోనీ, ధనసంపాదన చేద్దామనుకొంటే ఎలా చేస్తావు? వైదిక వృత్తి చేద్దామంటే నీవు రాచబిడ్డవు. రాజరికం వెలగబెట్టడానికి నీకు దిక్కులేదు. వ్యాపారం చేసి సంపాదిద్దామంటే చేతిలో గుడ్డి గవ్వలేదు. వ్యవసాయం చేద్దామంటే భూవసతి లేదు. ఈ స్వల్పకాలంలో నీకు గంటుకట్టి ధనం సమకూరడం వట్టిమాట. నెలగడువు తీరిపోతున్నది. పుట్టినప్పటినుండి అసత్యం ఆడలేదు. బాగానే వుంది. ఎలానో తెంపు చేసుకొని నా వుపదేశం ఆలకించు. నీవు అసత్యమాడావని నేనెవరితోను చెప్పనని వొట్టుపెట్టు కొంటాను. నీకు తోడు నీ భార్య కూడా దొరికింది. స్నానము, జపను, అనుష్ఠానము మాని నేను మీతో యిక తిరగలేను. ఇంతెందుకు. మాకు రావలసిన పైకం అణాపైసలతో సహా చెల్లించండి. ఆలస్యం చేస్తే ముక్కోపియైన మా గురువు నా గొంతు పట్టుకొంటాడు.'' ఇలా నక్షత్రకుడు పరిపరి విధాలుగా వారిని మాటలతో హింసించాడు.

హరిశ్చంద్రుడు ఋణబాధను గూర్చి చింతించాడు. ఋణముంటే నరివారు నవ్విపోతారు. మనస్సు చలిస్తుంది. ఆహారం రుచించదు. దేహ జాడ్యం అంటుకొంటుంది ఆ తర్వాత మరణమే శరణ్యం. అందువలన మనుషులకు ఋణవ్యథ కంటె మించినదిలేదు ఋణ విముక్తుడయ్యే అవకాశం లేదే అని హరిశ్చంద్రుడు బాధ పడ్డాడు. చంద్రమతి తననెవరికైనా అమ్మి ఋణ విముక్తులు కండని భర్తకు హితవు చెప్పింది. విధివైపరీత్యాన్ని మహారాజు తలపోశాడు.

త్రిశంకుని కోడలైన హరిశ్చంద్ర మహారాజు భార్యను ఒకరికి బానిసగా అమ్ముకోవడం కంటె దుర్గతి ఏముందని మహారాజు పరితపించాడు. సత్యప్రతిష్ఠకై చేసేపని నీచమైనా గౌరవప్రదమేనని చంద్రమతి హితవుపలికింది. హరిశ్చంద్రుడు విధిలేక ఆమెను అమ్మజూపాడు. కాశీపురవీధులలో అర్ధాంగిని అమ్మకానికి పెట్టాడు మహారాజు: ఓ పౌరులారా! నేను హరిశ్చంద్ర చక్రవర్తిని.

కౌశికుని ఋణం తీర్చుకోవడానికి నా అర్ధాంగిని అమ్మజూపాను. ఎవరైనా సరే రొక్కమిచ్చి ఈమెను కొనవచ్చు. ఎన్నడైనా పతిమాట జవదాటి ఎరగని రతనాల మూట ఈమె. అత్తమామల ఆజ్ఞ అడుగుదప్పి ఎరగదు. నవ్వులాటలకు కూడ బొంకి ఎరుగదు. ఇతరులు తనను దూషించినా కోపమే తెలియదు. ఈ హరిశ్చంద్రుని భార్యనెవరైనా కొనవచ్చు' - అని వీధులలో చాటింపువేశాడు.

కాలకేశికుడనే బ్రాహ్మణుడు ఆ చాటింపువిని అక్కడకు వచ్చాడు. ఎవరయ్యా మీ పేరేమి? అని హరిశ్చంద్రుని అడిగాడు. తన పేరుతో పని లేదన్నాడా రాజు. అయితే ఈమెను ఎత్తుకొని వచ్చి దొంగతనంగా అమ్ముతున్నావనీ బోయవానికి రామచిలుకవలె ఈమె లభించిందనీ దూషించాడు. కాలకేశికుడి తన దగ్గర ఫాలాక్షుడు కూడా తప్పించుకోలేడనీ, ఇప్పుడే తలారికి చెప్పి దొంగను పట్టిస్తానన్నాడు.

హరిశ్చంద్రుడు ఆశ్చర్యపడి భాగ్యవంతులైన దొరలు దొంగతనం చేసినా దొరతనమే. నిరుపేదలకు పెన్నిధి దొరికినా దొంగసొమ్మే అవుతుంది నేను హరిశ్చంద్రుడను. ఈమె నా భార్య చంద్రమతి విశ్వామిత్రునకు యాగ సంరక్షణకు ఇస్తానన్న డబ్బు యివ్వలేకపోయాను. నారాజ్యసర్వస్వం ఆయనకు ధారపోశాను అన్నాడు హరిశ్చంద్రుడు.

కాలకేశికుడు పకపకా నవ్వి హరిశ్చంద్రుని అమాయకత్వానికి ఆశ్చర్యపోయాడు. పత్రాలకు, సాక్ష్యాలకు భయపడి బంగారంవంటి భార్యను అమ్మకోవడం వెర్రితనమన్నాడు. తనను విశ్వామిత్రుని వద్దకు తీసుకుపోతే అసలు అప్పు లేదు పోవయ్యా అని వాదిస్తానన్నాడు. అప్పులెగవేయడంలో తనను మించినవాడులేడనీ, కూట సాక్ష్యాలు పలికించగలననీ, విశ్వామిత్రుడేమి చేయజాలడనీ సవాలు చేశాడు.

హరిశ్చంద్రుడు తనకెవరి సహాయము అక్కరలేదనీ సత్యమే తనకు రక్షయనీ, విశ్వామిత్రుడిన్ని కష్టాలు కల్పించినా సహిస్తాననీ, ఇటు సూర్యుడటు పొడిచినా బొంకననీ స్పష్టపరిచాడు.

కాలకేశికుడు తనవాదన కొనసాగిస్తూ 'సర్వేజనాః కాంచనమాశ్రయంతి' అని పెద్దలు చెబుతారు బాగుపడే యోగం నీకు లేక పోతే ఎవరూ ఏమి చేయలేరు. చెరుకు పానకం నోట్లో పోస్తే విషమని కక్కివేస్తే ఎవరేమి చేయగలరు అయినా నీ బార్యను ఎంతకమ్ముతావో చెప్పమని అడిగాడు

బలవంతుడైన మావంటివాడు ఏనుగుపైనెక్కి రత్నం పైకి విసిరితే ఎంత దూరం పోతుందో అంత దనానికి తన భార్యను విక్రయిస్తానని హరిశ్చంద్రుడన్నాడు ఇది చౌకబేరం కాదని కాలకేశికుడన్నాడు. పంచాంగం కట్టను కొందామని వచ్చావా? అని నక్షత్రకుడు పరిహాసించాడు. తన చేతిలో యాయవారపు జోలె చూసి అలా అనుకొంటున్నారని కాలకేశికుడు ఆ దనం యిచ్చి వేస్తానని చెప్పాడు. బేరం కుదిరిపోయింది.

చంద్రమతి బర్త పాదాలపై పడి గోడు గోడున ఏడ్చింది మీమీది బక్తితో నా పాదాలు తొట్రు పడుతున్నాయి మిమ్ములను చూచే బాగ్యం మళ్ళీ ఎన్నటికోననీ, కన్నీటితో పాదాలు కడుగుతాననీ. ప్రార్థించింది

హరిశ్చంద్రుడుకిరాతుడనీ మెడలో వేసుకొవలసిన పూలదండను పాదవర్ధనం చేసినట్లు సామ్రాజ్యభోగాలనుబవించవలసిన పట్టమహిషిని బానిసగా అమ్ముకుంటున్నాననీ దుఃఖించాడు కనుసన్నలలో పనికత్తెలు వ్యవహరించగా తిరగే చంద్రమతి సేవావృత్తికి అంగీకరించడం విదివిలాసమని చింతించాడు ఈ బ్రాహ్మణ దంపతులే తల్లిదండ్రులుగా బావించివారి సేవలు చేయడంలో ఏమరుపాటు పొందవలదని హితవుచెప్పాడు కుర్రవాడైన లోహితాస్యుని ఎలానో కాపాడమన్నాడు కుమారుని కౌగిలించుకొని దుఃఖతప్తుడయ్యాడు కుమారా! ఇన్ని కష్టాలు వచ్చినా యిద్దరం కలిసేవున్నాం ఈనాడు నిన్ను కాలసర్పంబారిని బడవేసి - కాదు కాదు - కాలకేశికునికి అప్పజెప్పిపోతున్నాను - అంటూ అమంగళమైన మాట తన నోటి వెంటరావడానికి ఆశ్చర్యపోయాడు కాలవశంలో కలిగిన కష్టాలు కలకాలం నిలువవనీ, ఆకాశంలో కమ్మిన మేఘాలు తొలగి పోయినట్లు పోతాయని చంద్రమతి బర్తను ఓదార్చింది ఱెక్కలు రాని పక్షి పిల్లలను గూటిలో వుంచితే పాముపాత బడతాయో, కిరాతుని వలలో పడతాయో తెలియనట్లు

వియోగం భరించడం ఎవరికి సాధ్యం? అని హరిశ్చంద్రుడు బాధపడ్డాడు. వంశోద్ధారకుడుగా పుట్టిన లోహితాస్యుడీవిధంగా దాస్యపు పనికి అప్పజెప్పడం విధివైపరీత్యం అనుకొన్నాడు. లోహితాస్యుడు గడుగ్గాయ అనీ, ఇల్లంతా అల్లకల్లోలం చేసేలా వున్నాడనీ కాలకేశికుడు గదమాయించాడు బాల్యచాపలము తప్ప మరియొకటి కాదని, మహారాజు తన బిడ్డలతో సమానంగా చూసుకోమని కాలకేశికుని ప్రాధేయపడ్డాడు. ఇంక యీ అప్పగింతలు చాలించి దాసిని పంపించమని కసురుకొన్నాడు. భార్యాభర్తలు కడసారి వీడ్కోలు చెప్పుకొని దుఃఖమగ్నులయ్యారు. నక్షత్రకునికి ధనమిస్తాను రమ్మని కాలకేశికుడు తీసుకెళ్ళాడు. హరిశ్చంద్రుని విశ్వేశ్వరాలయము వద్దనుండమని నక్షత్రకుడు చెప్పివెళ్ళాడు.

కాలకేశికుని భార్య కలహకంఠి (కాలకంటకి). అతని శిష్యుడు కేశవుడు. ఆమె గయ్యాళి యజమానురాలి ధూర్తతనుచూసి చంద్రమతి నివ్వెరపోయింది. కలహకంఠి భర్తను దూషించసాగింది:

'ఏమోయి. దుర్మార్గుడా! ఇల్లువదలి ఎంతసేపైనది? ఈ మధ్య నీకు తగిన ప్రాయశ్చిత్తము లేక అలా వున్నావు. నేడు నీకు మూడినది ఇంత పొద్దువరకు ఎక్కడి కెళ్ళావు? నీవు తెచ్చిన డబ్బు చూపించు. యాయవారమెత్తి, శవాలుమోసి ఎంతసంపాదించావు? నీ పొట్ట బద్దలు చేస్తే గాని అసలు విషయం బయటపడదు. ఈ ముసలితనంలోకూడా నీ మద పిచ్చి పోలేదు. ఈమెనెవరినో తీసుకొని వచ్చావు. అయ్యో! నా మగడు చంపివేస్తున్నా'డని కేకలు వేసింది.

పనులు చేయించుకోవడానికి దాసిని తీసుకొచ్చానని కాలకేశికుడు భయపడుతూ చెప్పాడు. చంద్రమతి అందుకాశ్చర్యపోతూ యిలా చెప్పింది. 'అమ్మా! పతియే ఏడుగడ. అతడెంత వశవర్తియైనా యిలా మాటలనడం భావ్యంకాదు. సూర్యోదయానలేచి పతి పాదాలకు నమస్కరించడమో, ఆయన కిష్టమైన భోజనపదార్థాలు వండిపెట్టడమో, ఆయన సేవలు చేయడమో సతి కర్తవ్యం. అలా కాక ఈ పద్దతి మంచిదికాదు. అయినా నీకు చెప్పునంతటిదాననుగాను. నీ భర్త నీ అడుగు దాటని వాడైతే బంగారం

ఒంటి నిండా ధరించి పట్టుపాన్పుపై పవళించి దాసీజనంతో పనులు చేయించుకో.

కలహకంఠి ఆమె చెప్పే శ్రీరంగనీతులు సహించలేకపోయింది. నాకు దాసివిగా వచ్చిన దానివి నాకు నీతులు చెప్పే దొరసానివైనావా అని దెప్పి పొడిచింది. కూటికి వచ్చిన దానవు చచ్చినట్లు పడియుండమని గద్దించింది. తనమగని బుద్ధి మారిపోయేలా చేసేందుకు వచ్చిన జగజంతవని పలికింది. కాలకేశికుడు కూడా చంద్రమతినలా మాట్లాడవలదని మందలించాడు.

నక్షత్రకుడు హరిశ్చంద్రునితో కాశీపురవీధులలో తిరుగుతున్నాడు. అన్నానికి, నీళ్ళకు ఇన్నాళ్ళు మొగము వాచి హరిశ్చంద్రునితో తిరిగాననీ, ఇకతనకు రావలసిన బత్తెం తాను తీసుకొంటాననీ, ప్రాణాలకు సైతం తెగించి ఘోరారణ్యంలో తిరిగాననీ, చంద్రమతినమ్మగా వచ్చిన ధనం తన భత్యానికి సరిపోయిందనీ ఋణం అలానే ఉండిపోయిందనీ నక్షత్రకుడు తిరకాసు వేశాడు. అయితే తనను గూడ అమ్మి గురువు ఋణం తీసుకొమ్మని మహారాజు ముందుకొచ్చాడు. ఎవ్వరూ కొనకపోతే కడజాతికైన అమ్ముకోమన్నాడు. నక్షత్రకుడు హరిశ్చంద్ర చక్రవర్తి గుణగణాలను ఏకరువు పెట్టి పురవీధులలో అమ్మజూపాడు. అసత్యమాడని అసమానశీలియని చెప్పాడు. బానిసగా ఎవరైనా కొనుక్కోవచ్చునని చెప్పాడు

వీరబాహుడనే కాటికాపరి అక్కడకు వచ్చాడు బాగా కల్లుతాగి కుక్కలు భౌభౌమని అరుస్తుండగా కాటికి పోతున్నాడు. తనకు బానిస కావాలనీ అన్నాడు. మదపుటేనుగుపై మావటీడు రత్నం విసిరినంత ఎత్తు ధనం పోసి వీరబాహుడు హరిశ్చంద్రుని కొన్నాడు. హరిశ్చంద్రుడు నక్షత్రకునికి తనవలన కలిగిన ఇబ్బందులను గుర్తుకు తెచ్చి క్షమించమని కోరాడు మహారాజు

నక్షత్రకుడు తన ఆగడాలను మన్నించమని ఆ రాజును ప్రార్థించాడు. సత్యనిష్ఠా గరిష్ఠుడైన మహాత్ముని మనస్సును క్షోభ పెట్టాననీ, తనవంటి

ఘోరకర్ముడు శిక్షార్హుడనీ నక్షత్రకుడు పలికాడు తాను చేసిన పాపకార్యాలు తనను దహించి వేస్తాయనీ, కలకాలం కష్టాలుండవనీ చెప్పాడు. కావాలని సత్యఫలాన్ని కాంక్షించి కష్టాలు కొనితెచ్చుకొన్నావు. దోషమని తెలిసికూడా తాను అలాంటి పనులు చేశానన్నాడు. చివరకు నక్షత్రకుడు హరిశ్చంద్రుని వద్ద సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

నక్షత్రకుడు తాను చేసిన ఘోరకృత్యాలను స్మరించుకొని కుమిలి పోయాడు. తన గురువైన విశ్వామిత్రుడు ఈ అకార్యాలకు తనను పురికొల్పాడు. ఇనుమునుబట్టి అగ్నికి సమ్మెట బెట్టినట్లే తన గురువువలననే తానిట్టి పనులకు ఉపక్రమించాడు. నిత్యసత్యకీర్తియైన హరిశ్చంద్ర చక్రవర్తిని యిక్కట్ల పాలుచేశాడు. గురుదక్షిణ నిశ్శేషంగా చెల్లించాడుగాని, అన్నివిధాలా దిక్కుమాలినవాడై ప్రపంచానికిక రోసి చావలేక బ్రతికి యున్నాడు. ఇంకతనకు ధనం అక్కరలేదు. మన్వంతరాలు తపస్సు చేసినా ఈ దుష్కృతికి పరిహారంలేదు. గురు తిరస్కృతి తగదనీ, గురుకార్యం నెరవేర్చాలనీ ఇంతటి నిందలకు పాల్పడ్డాడు. ఎన్ని కల్పాలైన ఇది జనం మరిచిపోరు. తన పాపానికి ప్రాయశ్చిత్తం లేదు. ఆ విశ్వేశ్వరుడే తనను రక్షించాలి. ఏయే ధర్మాలు ఆచరించాలి, ఏయే పుణ్య క్షేత్రాలు సేవించాలి, ఏయే తీర్థాలలో స్నానాలు చేయాలి? తన పాపపంకిలం ఎలా తొలగిపోతుంది? దయాళుడైన కాశీవిశ్వేశ్వరుడే యిక దిక్కు. తన గురువు దురుద్దేశంతో హరిశ్చంద్రుని బాధించాడు. ఆయన తన శత్రువైన వసిష్ఠునిపై కోపంతో అలా చేశాడు. మహానుభావుడైన హరిశ్చంద్రుని కష్టాలు తలచుకొంటే హృదయం ద్రవిస్తుంది చంద్రమతీలోహితాస్యులు కాలకేశికుని కొలువులో ఎలాంటి బాధలను అనుభవిస్తున్నారో తెలియదు. అనుకొంటూ వీరబాహుని వద్ద తన ధనం తీసుకొని నక్షత్రకుడు నిష్క్రమించాడు.

కాశీపురస్మశాన పరిసరారణ్యంలో కాలకేశికుని శిష్యులగు కేశవ జనార్దనులతో లోహితాస్యుడు దర్భలకోసం వెళ్ళాడు. మిత్రులతో కలిసి ఆటలాడుకోని సాయంత్రం వేళ అగ్నిహోత్రానికి వేళ అయినందున

అయ్యవారికి కోపం వస్తుందేమోనని దర్భలు కోస్తున్నాడు. పుట్టమీద దర్భలు బాగా ఉన్నాయని కోస్తూ వుండగా పాము కరచి పడిపోయాడు. మిత్రులను తన తల్లికి ఈ వార్త చెప్పమని బ్రతిమాలాడు. ఆలస్యమైతే గురుడు మిమ్మలను కొడతాడు. నా దర్భలుగా చెప్పిఈ దర్భలు అందించండి. మా తల్లి దుఃఖాన్ని బాపండి. అని లోహితుడు వేడుకొన్నాడు.

చంద్రమతి ఈ వార్త అందకోలేదు. తన దౌర్భాగ్యానికి చింతిస్తోంది. పిడక లేరుతోంది. ఎంత సేవ జేసినా తన యజమానురాలిని మెప్పించలేకున్నానేయని అలమటిస్తోంది. తన భర్త ఎంతటి కష్టాలను భరిస్తున్నాడో గదా! తన శోకం చేత యజమానురాలి ఆజ్ఞ మరచిపోతున్నది వడుగులతో కలిసి వెళ్ళిన లోహితుడింకా రాలేదు సూర్యుడస్తమించాడు. ఆవులు లేగదూడలకు పాలివ్వడానికిక పరుగులెత్తి ఇళ్ళకు చేరుకున్నాయి పక్షులు గూళ్ళకు చేరి పిల్లలకు ఆహారం అందిస్తున్నాయి. మనస్సు ఎందుకో కీడు శంకిస్తున్నది. లోహితుడు అడవికి పోలేనంటే కాలకేశికుడు మందలించిన మాటలు గుర్తుకు వస్తున్నాయి.

'ఓరీ! నీకు ఏ పనీ చేతగాక పోతే నీ కడుపునిండా ముప్పూటలా మేపడానికి నా చేతనౌతుందా?' అని కొట్టాడు. ఆ బాధ పడలేక లోహితుడు అమ్మా! చూడవే అని తనతో అన్నాడు. ఆ మాటలు తనకు కడుపుకోతగా వున్నాయి. కుర్రవాడు కనబడకపోవడంతో మనస్సు ఏదో శంకిస్తోంది. కేశవజనార్దనులు లోహితుడు పామువాతబడుట విన్నవించారు చంద్రమతి మూర్ఛిల్లింది.

కొంతసేపటికి తెప్పరిల్లి తన కుమారుని తలసి ఘోరంగా విలపించింది హరిశ్చంద్రుని తలచుకొని బావురమంది. కొడుకు శవాన్ని చూచివస్తానని కలహకంఠిని అనుమతి కోరింది. ఆమె కోపావేశంతో నిందించింది. పనికి వెళ్ళిన నీవు ఎక్కడ తిరుగుతున్నావని హూంకరించింది మా సొమ్ము విషమైనదని వాపోయింది. లోహితుడు చనిపోయాడనే వన్నాగం వన్నావని దూషించింది ఇంట్లో పనులన్నీ పూర్తి చేసి తర్వాత వెళ్ళమన్నది కడప్రాణంతో వున్న తన కుమారుని వైద్యుని వద్దకు తీసుకెళ్ళుతానని చంద్రమతి

యజమానురాలి కాళ్ళంటి మ్రొక్కినది. పోయిన వెధవ పుట్టలెక్కిన పాములు కరవవాయనీ, పనులు చక్కగజేసి అందరిని నిద్ర పుచ్చి పొమ్మని ఆదేశించింది. అదే విధంగా చంద్రమతి పనులు పూర్తి చేసి కుమారుని చూడటానికి వెళ్ళింది.

హరిశ్చంద్రుడు కాటికాపరి వద్ద బానిసగా పనిచేస్తూ వల్లకాటికి పోతున్నాడు తన యజమాని వీరబాహుడు కల్లు తీసుకొని రమ్మని వీరదాసుని (హరిశ్చంద్రుని) ఆజ్ఞాపించాడు విశ్వవిశ్వంభరాదేవిని భుజస్కంధాలపై మోయవలసిన చక్రవర్తి కల్లుకుండను మోయవలసివచ్చింది. కాటికాపరి శవదహనాలకు తోడ్పడుతూ సుంకాన్ని వసూలు చేసే బాధ్యత అతనిది. స్మశానవైరాగ్యము అతనికి కలిగింది. కష్టాలే తన జీవితంలో భాగంగా అయిపోయాయి భార్య ఒకరి యింట బానిసగా వుంది. బిడ్డడు బానిసయ్యాడు ఎప్పటికైనా శుభం కలుగకపోదనే ఆశకూడా అంతరించింది. బ్రతికినంతకాలం చంద్రమతికి పరుల దాస్యము, తనకు కాటికాపరి ఉద్యోగము అనుభవించవలసిందే. ఇలా అలోచిస్తూవుండగా ఎవరిదో స్త్రీ దీనాలాపం వీరదాసునకు వినిపించింది.

చంద్రమతి ఒకవైపునుండి చీకటిలో ప్రవేశించి కాలికి లోహితుని శవం తగలగా గుర్తించి కుమిలి పోయింది. రాజభోగాలనుభవించవలసిన తన కుమారుడిలా మరణించడం దుఃఖభాజనం. అయినా తెల్లవారేలోగా కుమారుని కాటిలో కాల్చివేసి మళ్ళీ యజమానురాలి దగ్గరకు వెళ్ళాలి అనుకొంటూ చితిపేర్చడానికి చంద్రమతి వుపక్రమించింది. కాని కట్టెలు కొనడానికికూడా కరవైంది నగం కాలిన ఎవరిదో శవం నుండి చితిపేర్చి దుఃఖించసాగింది.

హరిశ్చంద్రుడు ఆ ఆర్తనాదం విని తన అనుమతి లేకుండా కాటి సుంకం చెల్లించకుండా కాల్చడం భావ్యంకాదని హెచ్చరించాడు. ఆమె తన భర్తను గూర్చి తలపోసి విలపించడం వినిపించింది. ఆమె వివరాలు తెలుసుకోవాలనుకొన్నాడు. వీరదాసుని చూచి యితడెవరో మహానుభావుడని ఆమె తలపోసింది. మహానుభావా! నన్ను కరుణించాలని ప్రాధేయపడింది. వీరదాసుడు అడిగిన ప్రశ్నలకు చంద్రమతి (ననారి) సమాధానాలు చెప్పితాను

ఒక బ్రాహ్మణుని యింట దాసిగా ఉన్నాననీ, తన కొడుకు దర్భలకు వెళ్ళి చనిపోయాడనీ చెప్పింది. తన కుమారుడేమోయని వీరదాసుడు కలవరపడ్డాడు. అయినా తన యజమాని సుంకం చెల్లించవలసిందేనని నిర్బంధం చేసాడు. చివరకు అతడు లోహితుడేయని అతడు గుర్తించాడు. రాణివే అయితే కాటిసుంకం యివ్వలేవాయని వీరదాసుడు గద్దించాడు. తనవద్ద ఏమీలేదని ఆమె అంటే నీ పయ్యెదలోపల వుండే తాళిని అమ్మి రొక్కం తీసుకురమ్మని సూచించాడు. తన మాంగల్యం తన పతికి తప్ప మరొకరికి కనిపించదని ఆమె వాపోయింది. అయినా భర్త కిట్టి దురవస్థకలిగినందుకు చింతించింది. చండాలుని వద్ద దాస్యవృత్తి చేసే దుస్థితి కలిగిందే అని విధివంచితులై దుఃఖించారు. కుమారుని దహనానికి సుంకం చెల్లింపక తప్పదని నిశ్చయించుకొన్నారు.

తన యజమానురాలి వద్దకు వెళ్ళి మారు, బాత తీసుకొని వస్తానని చంద్రమతి బయలు దేరింది. హరిశ్చంద్రుడు లోహితుని శవాన్ని పట్టుకొని భోరుభోరున ఏడ్చాడు నీ బ్రతుకు ఈ విధంగా తెల్లవారుతుందని కలలో కూడ ఊహించలేదు. సామ్రాజ్యభారాన్ని వహించవలసిన నీవు ఈ విధంగా ఒకరికి బానిసవై నిర్భాగ్యపు చావు చావడం ఘోరం. పాము కరచినప్పుడు తల్లి-దండ్రులను తలచుకొని ఎంత విలపించావోగదా! ఉండీ మేము లేనివారమయ్యాము. నీవు దీర్ఘాయుష్మంతుడవని దీవించిన కాలజ్ఞుల పలుకులు వమ్మయినాయి - అనుకొన్నాడు.

ఇంతలో రాజభటులు శిశుహంత అయిన ఒక స్త్రీని వధ్య శిలవద్దకు తీసుకొని వచ్చారు. రాజుగారి యింట దొంగతనం చేసి ధనాశచే రాచబిడ్డను చంపిన శిశుహంతకి ఆమె. రాజు ఆమెను మరణదండన విధించారు. తక్షణమే దానిని అమలు పరచాలి. ఆ వచ్చిన స్త్రీ ఎవరో కాదు - చంద్రమతి. హరిశ్చంద్రుడు నివ్వెరపోయినాడు. ఏదైనా పొరబాడు జరిగినదేమోనని రాజభటులను ప్రశ్నిచాడు. నీకా అధికప్రసంగమక్కరలేదని వారు వెళ్ళిపోయారు

తనపైబడిన నిందకు చంద్రమతి అలమటించింది. తాను వెళ్ళుచుండగా దారిలో శిశువు శవాన్ని చూసి లోహితుని దనుకొని చూస్తున్నది.

ఇంతలో రాజభటులు తనను తీసుకొనిపోయి రాజు కప్పగించారు. ఆయన మరణశిక్ష విధించారు - అని చెప్పింది హరిశ్చంద్రుడు ధర్మానికి కలిగిన దురవస్థకు చింతించాడు. దంపతులిరువురూ తమకు గలిగిన ఈ విపత్తుకు చలించిపోయారు. కర్తవ్యం వారి వెన్ను తట్టింది. చంద్రమతి కాశీవిశ్వేశ్వరుని ప్రార్థించి కడపటి నమస్కారం చేసి తల వంచి శిరచ్ఛేదనానికి భర్తను ప్రోత్సహించింది.

చేజేతుల భార్యను సంహరించే నాటకీయసన్నివేశం తన జీవితంలో కలిగినందుకు మహారాజు క్రుంగి పోయాడు. శిరస్సుఛేదించడానికి కత్తిని పైకెత్తి నిలుచున్నాడు. ఎదుట విశ్వామిత్రుడు ప్రత్యక్షమయ్యాడు. సూర్యవంశంలో బుట్టి స్త్రీహత్యకు పాల్పడుట దుర్మార్గుల లక్షణమన్నాడు. ఇప్పుడైనా తన కుమార్తెలను పెండ్లియాడమన్నాడు. హరిశ్చంద్రుడు తన కర్తవ్యం మరచిపోలేదు సత్యసంధుడయిన హరిశ్చంద్రుని కుటుంబాన్ని రక్షించడానికి విశ్వామిత్రుడు విశ్వేశుని ధ్యానించాడు. పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమయ్యారు. చంద్రమతి కోరికపై లోహితుడు సజీవుడయ్యాడు. దేవేంద్రుడు, వసిష్టుడు మొదలైన మునులు వచ్చారు

యమధర్మరాజు కాటికాపరి. కాలకేశికుడు పరమశివుడు. వారు హరిశ్చంద్రుని సత్యనిష్ఠని పరీక్షించడానికి అలా చేశారు. దేవేంద్రుని ఆజ్ఞపై విశ్వామిత్రుడు తన తపశ్శక్తిని హరిశ్చంద్రునికి ధారపోసి తిరిగి పట్టాభిషిక్తుని చేశాడు. ఆలుబిడ్డలతో హరిశ్చంద్రుడు రాజ్య భోగాలనుభవించాడు.

# 11

# బారిష్టరు పార్వతీశం

(సాంఘిక నవల)

మొక్కపాటి నరసింహశాస్త్రి

(1892-1973)

ప్రథమ ముద్రణ 1925

# మొక్కపాటి నరసింహశాస్త్రి

మొక్కపాటి నరసింహశాస్త్రి 1892 అక్టోబరు 9న గంగ్రేడు గ్రామంలో జన్మించారు పిఠాపురం, మచిలీపట్నంలలో విద్యాభ్యాసం చేశారు ఎడింబరో విశ్వవిద్యాలయంలో మూడు సంవత్సరాలు విద్యగరపారు ఆదేశంలో విపత్కర పరిసితులవల్ల చదువు మధ్యలో మానివేసి రావలసి వచ్చింది

బందరు జాతీయ కళాశాలలో కొద్దికాలం అధ్యాపకులుగా పనిచేశారు ప్రకాశం పంతులు నెలకొల్పిన స్వరాజ్య పత్రికలో కొంతకాలం వున్నారు శశి, కళ అను పత్రికలను స్థాపించి కొంతకాలం నడిపారు 1920 నుండి సాహిత్య వ్యాసంగం మొదలైంది సాహితీసమితిలోను, నవ్యసాహిత్య పరిషత్తు లోనూ సభ్యులుగా చేశారు ఏకోదరులు అనే నవలను, ప్రతిబింబాలు, బిక్షువు అనే కథల సంపుటులను బారిష్టరుగారి బాతాఖానీ అనేవ్యాస సంపుటిని మొక్కుబడి అనే ఏకాంకికల సంపుటిని ప్రచురించారు అనేక ప్రసంగాలు, కదలు, ఆకాశవాణి, విజయవాడ, మదరాసు కేంద్రాల నుండి ప్రసారమయ్యాయి సుబ్బారాయుడు నాటకంలో ఆయన ప్రధానపాత్రనుపోషించి స్వర్ణపతకాన్ని పొందారు కన్నవి, విన్నవీ అను శీర్షికలతో రెండు సంపుటాలు వెలువరించారు

ఎడింబరో విశ్వవిద్యాలయం వెళ్ళివచ్చిన అనుబవాలను బారిష్టరు పార్వతీశం నవలలో అత్యద్భుతంగా చిత్రీకరించారు ఈ నవల 1924లో మొదలు పెట్టారు అదిమూడు సంపుటాలుగా వెలువడింది ఈ సంకలనంలో మొదటి బాగం కదమాత్రమే స్వీకరించబడింది హాస్యరచయితగా మొక్కపాటి వారికి ఈ గ్రంథం మంచిపేరు తెచ్చి పెట్టింది 1925లో ఈ నవల మొదటిబాగం ప్రచురించారు బారిష్టరు పార్వతీశం సినిమా 1940లో అడవిబాపిరాజు కళాదర్శకుడుగా, కొప్పరపుసుబ్బారావు సంగీత దర్శకుడుగా విడుదలైంది 1978లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ విశిష్ఠ సభ్యత్వంతో గౌరవించింది

పార్వతీశం విశిష్టమైన హాస్యపాత్ర మొగలితుర్రులో మొదలుపెట్టిన అతని ప్రయాణం ఇంగ్లండు చదువుకు వెళ్ళడంతో ముగుస్తుంది మొదటి బాగం చివరలో ఆయన ఇంగ్లండులో అడుగుపెట్టాడు తెలుగులో బహుకొద్ది హాస్యరచనలలో బారిష్టరు పార్వతీశం ఒకటి మొక్కపాటి నరసింహశాస్త్రి 1973 మార్చినెలలో పరమపదించారు

బారిష్టరు పార్వతీశం మొదటి భాగాన్ని 1925లో ప్రచురించారు తర్వాత రెండు, మూడు భాగాలు 'ఆంధ్ర జ్యోతి వారపత్రిక'లో సీరియల్‌గా వచ్చాయి పార్వతీశం ఇంగ్లండులో అడుగు పెట్టంతో మొదటి బాగం పూర్తివుతుంది ఆ తరువాత రెండు బాగాలలో ఆయన ఇంగ్లండులో ప్రవర్తించిన కథా సంవిదానం వుంది పార్వతీశం ఒక యింటివాడై పెద్ద లాయరై దేశబక్తుడై నాయకుడయ్యాడు ప్రదానంగా ఈ సంక్షిప్త రచనలో మొదటి బాగం కథను మాత్రం స్వీకరించడం జరిగింది

# బారిష్టర్ పార్వతీశం గురించి

పార్వతీశం ఒక హాస్య పాత్ర. అతని ప్రతి పనీ నవ్వు పుట్టిస్తుంది. అమాయకత్వం అడుగడుగునా కనిపిస్తుంది. అహం కదం తొక్కుతుంది. అయినా ఎక్కడో మొగలి తుర్రులో పుట్టిన పార్వతీశం ఇంగ్లండులో చదువుకోవడానికి వెళ్ళడం ఆశ్చర్యకరం. అతని స్టీమరు ప్రయాణము, మదరాసులో సరుకులు కొనడం ఒకటేమిటి! అన్నీ నవ్వు పుట్టిస్తాయి. గిరీశం, పార్వతీశం, గణపతి, పేరిగాడు యిలా ఆయా పాత్రలు తమ తమ ప్రవర్తనల ద్వారా సంభాషణల ద్వారా మన మనస్సుల్లో చెరగని ముద్ర వేసుకున్నారు. మొక్కపాటివారి ప్రత్యేక శైలిలో సాగిన పార్వతీశం కథా కథనాన్నీ పార్వతీశం మాటల్లో తెలుసుకొందాం:

# 11. బారిష్టరు పార్వతీశం

## సంక్షిప్త గ్రంథం

మాది మొగలితుర్రు. అది చరిత్ర ప్రసిద్ధికెక్కిన నగరం. ఎన్నో యుద్ధాలను శత్రుసైన్య సంహారాన్ని చూసిన పట్టణం. చరిత్రకారులెవరైనా మొగలితుర్రు రాజుల పరాక్రమం పరిశోధించి వుంటే వారి విశేషాలు తెలిసేవి. ఆ వూళ్ళో నేను జన్మిచటం గర్వకారణం. మాపూర్వీకులైన వేమూరి వారు మొగలితుర్రు ఆస్థాన విద్వత్‌కుటుంబంలో వారే. ప్రభువులు ఏ విషయంలోనైనా మా యింటి వారి సలహా తీసుకునే వారు. మానాన్నగారు కూడా అంతే గౌరవం పొందారు. పెద్దవాడినైతే నాకూ ఆ మర్యాదలు దక్కుతాయి.

నేను అయిదారు తరగతుల వరకు మొగలితుర్రులోనే చదువుకున్నాను. ఆవూరంటే నాకూ ఎంతో ఇష్టం. నా స్నేహితుల్ని వదిలిపెట్టలేక నరసాపురం వెళ్ళకుండా అక్కడే వుండి పోయాను. నేనంటే మాగురువుగారికి, వూళ్ళో అందరికీ ఎంతో అభిమానం. మగవాళ్ళకే గాదు ఆడవాళ్ళకు కూడా నేనంటే ముద్దు. నా పుట్టినరోజు పేరంటానికి వచ్చిన ఆడవాళ్ళందరూ నన్ను ముద్దెట్టుకొని వెళ్ళేవారు. నాకు చిరాకు వేసి వచ్చేయేడు పుట్టినరోజు పండుగ జరుపుకోనని మాఅమ్మతో అన్నాను. మా అమ్మా, వాళ్ళు తెగనవ్వి ముద్దెట్టుకున్నారు. నాచిన్నతనం అలానరదాగా గడిచింది.

ఇష్టంలేకపోయినా నా చదువుకి నరసాపురం వెళ్ళక తప్పలేదు. మా మేనత్త గారింట్లో వుంటూ టైలర్ హైస్కూల్లో ఫస్టుఫారంలో చేరాను. నరసాపురం చాల పెద్దవూరు. అక్కడ బళ్ళోపద్ధతులు అన్నికొత్తగా వున్నాయి. పిల్లలకి మేష్టారికి మధ్య ఎంతో దూరం వున్నట్లనిపించేది. నాతోడు ఈడు వారితో కలిసి ఆడుకునే వాణ్ణి. చెడుగుడు ఆటగానిగా నాకు మంచి పేరు. అన్ని ఆటలపోటీలలోనూ నేను పాల్గొనేవాణ్ణి. ఆ సంవత్సరం మా చెడుగుడు జట్టుకు మొదటి బహుమతి వచ్చింది. జిల్లా కలెక్టరుచేత నాకు బహుమతి యిప్పించారు.

ఆటలలోనే కాకుండా ఆసంవత్సరం నాకు చదువులో కూడా మొదటి బహుమతి వచ్చింది. ఆసభలో నేను బహుమతి తీసుకుంటుంటే మానాన్న, మావూరి మాష్టారు నాకు తెలియకుండావచ్చి చూడటం నాకు ఆనందం కలిగించింది.

నేను మూడవఫారంలో వుండగా ఒక తమాషా జరిగింది. ఒకరోజు మాస్కూలుకు స్కూళ్ళ ఇనస్పెక్టరు వచ్చారు. మాకు మా మాష్టారు ఎన్నో హెచ్చరికలు చేశారు. ఆయన వచ్చి కూచోగానే పిల్లలను ప్రశ్నలు వేయటం మొదలుపెట్టారు. ఆయనకు మెల్లకన్ను. ఎవరిని ప్రశ్నలడుగుతున్నారో తెలియక మేము తబ్బిబ్బయ్యాము. చివరకు క్లాసంతా విరగబడి నవ్వాము. ఆయనకు కోపం వచ్చింది. మాష్టారు అది గమనించి పిల్లల్ని ప్రశ్నలతో బాటు పేరు పెట్టి పిలవటం మొదలెట్టారు. ఆయన నాకో ప్రశ్న వేశారు- ఎటువంటి వస్తువుమీద కాంతి కిరణం పడితే పరావర్తన చెందుతుంది- అని అడిగారు. నేను తడుముకోకుండా బట్టతల మీద అన్నాను. ఆయనకు బట్టతల క్లాసంతా విరగబడి నవ్వారు. ఆయన మండిపడుతూ వెళ్ళిపోయారు మామాష్టారు నన్ను తిట్టిపోశారు.

నేను ఫోర్తుఫారంలోకి వచ్చాను. నాకు చెడుసహవాసాలు కలిగాయని ఎవరో గిట్టనివాళ్ళు మానాన్నకు చెప్పారు. అయితే నాకు చదువులోను ఆటలలోను బహుమతులు వస్తూనే వున్నాయి. స్నేహితులు ఉపాధ్యాయులు, నన్ను అభిమానంగా చూసేవారు. అదిమొదలు చదువుపట్ల నిర్లక్ష్యం యేర్పడింది. కుస్తీ నేర్చుకున్నాను. సరదాగా సభలకు వెళ్ళసాగాను. ఈవ్యాపకాలతో చదువు సన్నగిల్లింది నాకు పెళ్ళి చేయాలని మాఅమ్మా నాన్న ఉబలాటపడ్డారు. తొలిమెట్టుగా ఉపనయనం చేశారు. బంధుమిత్రులంతా వచ్చారు. భిక్షాపాత్రతో నావేషం చూసి మిత్రులు ఎగతాళి చేశారు. శుభకార్యం జరిగిన తర్వాత బంధువులు ఎవరిదారిని వారు వెళ్ళిపోయారు

నేను తిరిగి నరసాపురం వచ్చిన తర్వాత నాఉపనయన విశేషాలు విన్న మిత్రులు కొందరు నాచుట్టూ చేరారు. నామీద పద్యాలు చెప్పారు. ఇద్దరు జంట కవులు నామీద అష్టావధాన పద్యాలు మొదలుపెట్టారు. ఇదంతా

చూస్తున్న హెడ్మాష్టారు, మరి కొందరు మాష్టర్లు ఈహడావిడి చూసి నాబోడి తలమీద రెండు మొట్టికాయలు వేసి వెళ్ళిపోయారు.

చదువు సన్నగిల్లడంతో ఉపాధ్యాయులు నన్ను ఐదోఫారంలోనే మరో యేడు వుంచారు. మా నాన్న ముక్కు చివాట్లు పెట్టి చదువు మాని ఇంటికి రమ్మని నిర్బంధించాడు. మెట్రిక్యులేషన్ కడతానని నేను పంతం పట్టాను. అమ్మ నాన్నకు నచ్చచెప్పింది మా మాష్టరు నాకు హితబోధ చేశాడు. బుద్ధితెచ్చుకొని చదువుకోమన్నాడు.

నన్ను దారిలోకి తీసుకు రావడానికి నాన్న ఆలోచించి ఆలోచించి పెళ్ళి ప్రయత్నాలు మొదలెట్టాడు పెళ్ళిసంబంధాలు చూడటానికి నేను మాటిమాటికీ నరసాపురం నుంచి మొగలితుర్రుకి వెళ్ళి రావల్సి వచ్చేది. చివరకు ఏ సంబంధము కుదరలేదు.

ఒకానొక రోజు నేను మా అమ్మ మా మామయ్య ఒక పల్లెటూరికి పిల్లను చూట్టానికి వెళ్ళాము. పిల్లను చూసేరికి మా నవనాడులూ క్రుంగి పోయాయి. ఆ పిల్లను చూడగానే మేము ముగ్గురం నోట మాట లేక గుడ్లప్పగించి చూస్తున్నాము. ఇంతలో మేనమామ ప్రోత్సాహంతో ఆ పిల్ల హార్మోనియం అందుకొని 'ఈ విరహము సైపజాలరా' అనే జావళి అందుకుంది మేము కొయ్యబారి పోయాము. మా అమ్మ కలుగజేసుకొని పిల్లను శ్రమపెట్ట వద్దని చెప్పి, ఆపివేయించింది. పిల్ల మేనమామ యింట్లో భోజనాలు యేర్పాటు చేసారు. వంటలు చల్లగా వున్నాయి ఆ రోజు వాళ్ళింట్లో తద్దినం. ఆ మిగిలిపోయిన భోజనం మాకు పెట్టారు. పిల్ల తండ్రి కోర్టు వ్యవహారానికి పట్టణానికి వెళ్ళి మేమున్నంత సేపూరానేలేదు. అది మొదలు నేను నాలుగేళ్ళవరకు పెళ్ళి చేసుకోనని మా నాన్నకు ఖండితంగా చెప్పేశాను.

ఆ సంవత్సరం పరీక్ష తప్పడంతో చదువుకు స్వస్తి చెబుదామని నిర్ణయించుకున్నాను. మానాన్న కూడా ఆ అభిప్రాయాన్ని బలపరచారు.

పొలంపనల్లో తనకు సహాయంగా వుంటూ సంస్కృతం నేర్చుకోమని సలహా యిచ్చారు. రెండు మూడు నెలలు ప్రశాంతంగా గడిచింది. అప్పుడప్పుడు నరసాపురం వెళ్ళివచ్చేవాడిని. ఒకరోజు మానాన్న యింట్లో లేని సమయంలో నరసాపురం నుంచి ఒక ప్లీడరుతో బాటు నామిత్రులు కొందరు వచ్చారు. ఒక స్వచ్ఛందసేవాదళం స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా ఏర్పాటు చేయదలచుకున్నామని అందుకు నన్ను నాయకత్వం వహించమని కోరారు. నేను ఏమీ అనలేకపోయాను. వాళ్ళు రేపు సాయంకాలం నరసాపురం రమ్మని వెళ్ళిపోయారు. నేను వారు కోరిన ప్రకారం వరుసగా మూడురోజులు నరసాపురం వెళ్ళి వచ్చాను. అక్కడ ప్లీడరు రమణరావుగారు దేశభక్తి గురించి విదేశవస్తు బహిష్కరణ గురించి చెప్పేవారు. సేవాదళంలో చేరి స్వచ్ఛందంగా దేశసేవ చెయ్యాలని ఆయన ఉద్బోధించేవారు.

ఒకరోజు సాయంకాలం బహిరంగసభ యేర్పాటు చేసాము. ఆసభకు యేర్పాట్లన్నీ నేనే చూశాను. నాలోని నిగూఢ శక్తిని రమణరావుగారు ప్రశంసించారు. ఇంతలో ఉపన్యాసం ఇవ్వటానికి బందరు నుండి నారాయణరావు పంతులు గారు వచ్చారు. నారాయణరావు గారు రెండు గంటలు గంభీరోపన్యాసం చేశారు. సభ అయిపోయిన తర్వాత కుర్చీలు,బల్లలు సర్దటం పూర్తి చేసి రాత్రి 9గంటలకు గాలిలో తేలుతూ యింటికి చేరాను. ఆలస్యంగా వచ్చినందుకు అమ్మా,నాన్న మందలించారు. మానాన్న మాత్రం ఏమీ మాట్లాడలేదు. నాకదొక స్వప్నంలా అనిపించింది.

మానాన్న నాకు ఊపిరి సల్పకుండా పొలం పనులు అప్పగించారు. పొలానికి వెళ్ళినా నామనస్సంతా నరసాపురంలోనే వుంది. వారం రోజుల తర్వాత రమణరావు గారి నుంచి నరసాపురం రమ్మని కబురు వచ్చింది. బిపిన్ చంద్రపాల్ అనే మహా నాయకుడు వస్తున్నాడని ఒక గొప్ప బహిరంగ సభ ఏర్పాటు చేయాలనీ, నన్ను దగ్గర వుండి పనులు చూసుకోమని కబురు పంపారు. నేను బాగా ఆలోచించి ఎవరికీ చెప్పకుండా నరసాపురం చేరాను. రమణరావు గారిని అప్పుడప్పుడూ కలుస్తూ వచ్చాను. మానాన్న చూసి చూడనట్లు ఉన్నాడు.

ఆరోజు సభ ఏడు గంటలకు ప్రారంభమైంది. యాభై వేలదాకా జనం వచ్చారు పాల్‌గారు బ్రహ్మాండమైన ఉపన్యాసం ఇచ్చారు. రెండు గంటల సేపు సాగిన ఆ ఉపన్యాసాన్ని, తెనుగు అనువాదాన్ని జనం కిక్కురు మనకుండా విన్నారు. సభ జయప్రదంగా సాగింది. ఆ రాత్రికి నేను యింటికి చేరి మా అమ్మతో మారుమాట్లాకుండా భోంచేసి పడుకున్నాను.

తెల్లవారి ప్రొద్దున మానాన్న నన్ను నిలదీసి అడిగారు. ఇలాంటి సభా నిర్వాకం వల్ల ప్రయోజనమేమీ ఉండదని గత మూడేండ్లుగా నీచేత వాళ్లు బల్లలు మోయించారు తప్ప మరేమీ లేదని అన్నారు. చదువు లేకుండా ఏదీ సాధించలేరనీ, అందువల్ల నీకు కావలసిన చదువేదో నిర్ణయించు కోమన్నారు.

నాలుగు రోజుల తర్వాత నేను రమణరావుగారికి జరిగినదంతా చెప్పాను. ఆయన మా నాన్న వాదనతో ఏకీభవించారు. ఇంటిదగ్గరే సంస్కృతం తెనుగు నేర్చుకోమన్నారు నేను రాజకీయాలూ, సాంఘికాలు మతాన్ని గురించి చదవసాగాను. నాలో అశాంతి అధికమైంది. ఇలా రెండు సంవత్సరాలు గడిచాయి. మరి కొందరు పెద్ద మనుషులతో పరిచయాలు యేర్పడ్డాయి. విదేశాలకు వెళ్ళి చదువు కోవాలని కోరిక కలిగింది. రమణరావు గారింట్లో ఒక ప్లీడరుగారి సలహా మీద లండను వెళ్ళి బారిష్టరు చదవాలని స్థిర సంకల్పం చేసుకున్నాను. ఒక రోజు సుముహూర్తం నిశ్చయించాను.

మా నాన్నతో చెప్తే ప్రయాణం సాగనివ్వడు. ఆయన ఒట్టి అనాగరికుడు. అందుకని ఒక స్నేహితుని దగ్గర కొంత సొమ్ము బదులు పుచ్చుకున్నాను. నాలుగు రోజులలో తిరిగి వస్తానని చెప్పి నరసాపురం బయలుదేరాము.

లండనులో యే యే వస్తువులు కావాలో జాగ్రత్తగా ఆలోచించాను. నరసాపురంలో దొరల నడిగితే నవ్విపోతారని అడగలేదు. నేనే స్వయంగా ఒక జాబితా తయారుచేశాను తెల్లవారి లేచిన తర్వాత దంతధావనానికి కావలసిన సామానులు, స్నానానికి కావలసిన వస్తువులు, బట్టలు

వ్రాసుకున్నాను. అక్కడికి కావలసిన నూట్లు కుట్టించాను. బట్టలు సర్దుకున్నాను. మరచెంబు తయారు చేశాను. గోధుమపిండి, నెయ్యి, ఆవకాయ, అట్ల పెనము, స్టౌ, కిరసనాయిలు పోగుచేసాను. మడతమంచం, బొంత, శాలువా ఎత్తి పెట్టాను. తుంగచాప చుట్టి పక్కన పెట్టాను. ఆరు యజ్ఞోపవీతాలు జతలు, మూడు పట్టుమొలతాళ్ళు, తీసుకెళదామనుకున్నాను. ఇవన్నీ స్వయంగా తీసుకెళ్ళడానికి చిన్న రేకుపెట్టె చేయించాను. ఒకానొక శుభముహూర్తంలో పడవరేవుకు చేరుకున్నాను. తెల్లవారేసరికి పడవ నిడదవోలు చేరింది. అక్కడ రైల్వే స్టేషనుకు వెళ్ళి టికెట్టు ఇవ్వమంటే గొడవ జరిగింది. ఏ వూరికి పోతానో చెప్పక పోతే వాళ్ళు టిక్కెట్టు యివ్వమన్నారు. బలవంతం మీద నేను చెన్నపట్టణం వెళ్ళాలని చెప్పాను. ఆ బండి మదరాసు వెళ్ళదని సాయంకాలం రమ్మని నన్ను తోసివేశారు. అక్కడ టికెట్టు ఇచ్చే అరవాయన నన్ను ఎకసెక్కాలాడాడు. ఆయనవాలకం చూసి నేను కూడా ఆయన్ను గేలి చేశాను. బజారుకు వెళ్ళి ఇత్తడి తాళాము చేంతాడు నాలుగు మేకులు కొనుక్కు వచ్చాను.

ఎలానో టికెట్టు కొని అందరూ అడుగుతున్నా జవాబు చెప్పకుండా వచ్చిన రైలు ఎక్కాను. రాజమహేంద్రవరం వెళుతున్నానని అబద్ధం చెప్పి ఎక్కాను. స్టేషనుమాష్టరు రైలునుఆపి నన్నుదించాడు. నన్ను ఫూల్ అన్నాడు. బలవంతంగా దించారు. చివరకు మదరాసు వెళ్ళే రైలు వచ్చింది. తోసుకుంటూ ఎక్కడంలో దభీమనిపడ్డాను. నా మీద కొందరు ఎక్కి లోపలికెళ్ళారు. తీరా లోపలికెళ్ళి కూచోబోతూ ఒక ఆడమనిషి ఒళ్ళో పడ్డాను. ఆమె భర్త నానా తిట్లు తిట్టాడు. సామాన్లు సర్దడానికి వీలు లేక ఎదురుగా వున్న గొలుసుకు సామాన్లు తగిలించాను. రైలు ఎందుకో ఆగింది. గార్డు వచ్చి యాభై రూపాయలు జరిమానా కట్టమన్నాడు. గొలుసులాగితే బండి ఆగి పోతుందట.

నా పక్కన నలభై యేండ్ల వితంతువు నా వైపు వీపు పెట్టి కూర్చుంది. నేను, ఆవిడ కునికి పాట్లు పడ్డాము. ఒకరి వీపుకు ఒకరు జార్లబడి నిద్ర పోయాము. కొంతసేపటికి మెలుకువ వచ్చి సిగ్గుపడి నేను సరిగా కూర్చున్నాను ఆవిడ నా ఒళ్ళోపడింది. లేచింది మొదలు - నీకు

తోడబుట్టువులు లేరా? ఒకత్తెనే వస్తుంటే ఇలా చేస్తావా? ఆయన చచ్చి స్వర్గాన ఉన్నారు'' అంటూ ముక్కు తుడుచుకో సాగింది.

చాలా సేపుగా లఘుశంకకు వెళ్ళాలని ప్రయత్నం! రైలు ఆగితే వెళదామని ఎదురు చూస్తున్నాను. రైలు ఒకమాటు ఆపమని గార్డుగారికి కేక వేశాను. పక్కన పెద్దమనిషిని అడిగితే ఒక గది చూపించి ఒకటికి, రెంటికి అందులో వెళ్ళవచ్చునని చెప్పాడు. తెల్లవాడు గొప్ప తనానికి మెచ్చుకోవాలి. రైల్లోనే అన్ని ఏర్పాట్లు చేశాడు.

మర్నాడు ఉదయం తొమ్మిది గంటలకు బేసిన్‌బ్రిడ్జి స్టేషను వచ్చింది. ఒక నల్లదొర నాదగ్గరకు వచ్చి టికెట్టు అడిగి తీసుకొని వెళ్ళిపోతున్నాడు. నేను అతని వెంబడి పడ్డాను. నాటికెట్టు నాకిప్పించమన్నాను. అతను నన్ను 'పోవయ్యా ఫూల్' అంటూ తిట్టసాగాడు. చుట్టూ వున్న వారంతా కడుపు చెక్కలయ్యేలా నవ్వుతున్నారు. చివరకు నావక్కన కూర్చున్న పెద్దమనిషి నా కంగారు గమనించాడు. చెన్నపట్టణం చేరేలోగా అందరి దగ్గరా టికెట్టు తీసుకెళతారనీ భయమేమీ లేదని ధైర్యం చెప్పాడు.

చెన్నపట్టణంలో రైలు ఆగింది. కూలీలు చుట్టుముట్టారు. పెట్టె నెత్తిన పెట్టుకొని దిగాను. ఇంతలో ఒకడు ఆ సామాను లాక్కొని పరుగెత్తాడు. వాడు ఆగలేదు. తిన్నగా బండ్ల దగ్గరకు తీసుకెళ్ళాడు అక్కడ బండ్లవాళ్ళతో గోల. నాకు హోటలుపేరుగాని,వీధి పేరుగాని తెలియదు. ఇక లాభం లేదని పెట్టెమీద కూర్చున్నాను. కూలివాడు కూలి యిమ్మని కూచున్నాడు. దర్జాగా రెండణాలు వాడిచేతిలో పెట్టాను. నేనేమి ముష్టివాడినా అని వాడు విసుక్కున్నాడు. రూపాయకు తక్కువ తీసుకొనన్నాడు. బండ్లవాళ్ళు తీర్పు తీయడానికి వచ్చారు. కూలివాడు తిట్లు మొదలు పెట్టాడు. అర్థరూపాయి వాడిచేతిలో పెట్టాను. వాడు నన్ను, ఆంధ్రుల్ని యేకంగా తిట్టి అర్థరూపాయ తీసుకొని చక్కంగా పోయాడు. ఆ దరిద్రం అంతటితో వదిలింది. ఊళ్ళో బస చేయడానికి ఏదైనా హోటలుగాని సత్రంగాని వుందా అని వాళ్ళను అడిగాను. దగ్గరలోనే రామస్వామిమొదలిసత్రం ఉందన్నారు. భోజనం సంగతి

అన్నాను. దుడ్డు తీసుకొని వేస్తారన్నాడు. నాకు భయం వేసింది. భోజన హోటలయ్యా! అని అడిగాను. డబ్బు తీసుకొని భోజనం పెడతారని వాడు అభినయం చేశి చూపించాడు. బండి కిరాయిబేరం మొదలు పెట్టాను. రెండు మైళ్ళ దూరం ఉంటుందన్నాడు. మూడురూపాయలు అడిగితే ఒకరూపాయి ఇస్తానన్నాను. కూలివాడికి అర్థరూపాయి యిచ్చారుగదా! నాకు కనీసం రెండు రూపాయలైనా యిమ్మని అంటూ పెట్టె బండ్లో పెట్టాడు. నేను బండి యెక్కి కూచున్నాను. మిగతావాళ్ళు రూపాయిన్నరకే వస్తామన్నారు. బండివాడు దారిపొడుగునా ఇంకో పావలా యిమ్మని ప్రాథేయ పడ్డాడు. పది నిముషాల్లో సత్రం వచ్చింది. గుఱ్ఱం త్వరగా వచ్చిందని సంతోషించాను. రెండుంబేడ యిచ్చినా సంతోషపడక తిట్టి పోయాడు.

సత్రం నిండా జనం కిటకిటలాడుతున్నారు. ఒక నల్ల శిలావిగ్రహం లాంటి మనిషి అరవంలో 'ఏంకావాలి?' అన్నాడు. 'నీవు బ్రాహ్మణుడివా? ఎందుకు వచ్చావు?' అన్నాడు. 'బ్రాహ్మణులమే గాని ఎందుకువచ్చానో చెప్పన'న్నాను. నాకొక గది చూపించాడు. స్నానం చేసి పట్టు బట్టకట్టుకొని భోజనాల సావిట్లోకి వచ్చాను. అక్కడ అందరూ చొక్కాలు, బనీన్లు తొడుక్కొని వున్నారు. వడ్డించే వాళ్ళు కూడా బనీన్లు తొడుక్కొని వున్నారు. వడ్డన పూర్తిగాక ముందే కొందరు తినటం మొదలెట్టారు.

నేతి వడ్డన కాగానే పులుసు తీసుకొని వచ్చాడు. అందరూ పులుసు వడ్డించుకున్నారు. అందులో పప్పుకలిపి కూర, పచ్చడి నంజుకోసాగారు. నేను పులుసు వద్దన్నాను. అంతా తెల్లబోయి చూశారు. మళ్ళీ నెయ్యి కావాలన్నాను. 'ఎక్స్ట్రా' అవుతుందన్నాడు. సరే! వెయ్యమన్నాను మిగతావాళ్ళు చారు వడ్డించుకున్నారు. అక్కడ అనాచారం నాకిష్టపడక రెండు మెతుకులు తిని లేచాను. అన్నం చేత్తోనే అన్నీ ముట్టుకుంటారు. వీళ్ళకు అసహ్యం లేదా? అనుకున్నాను.

గదిలో కాసేపు విశ్రమించి వూళ్ళోకి బయలు దేరాను. జుట్టుముడి, గిరజాలు తీసేసి దొరటోపీ కొనుక్కోవాలని బయలుదేరాను. వీధిలో నడిరోడ్డు మీద ఇంజను లేకుండా ట్రామ్ కార్లు నడుస్తున్నాయి. రాయపురం వెళ్ళే

ట్రామ్ ఎక్కుదామని ప్రయత్నించాను అది ఎక్కువ సేపు ఆగలేదు నేను దాని వంబడే పరుగెత్తాను చివరకు ఒకమైలు పరుగెత్తి ఎక్కి కూర్చున్నాను. నేను మౌంటు రోడ్డు పోవాలని చెప్పాను ఇందులో కాదు ఎదురుగా వచ్చే ట్రాములో వెళ్ళమని ఒకతను సలహా యిచ్చాడు. నేను దిగబోయి ముందుకురికితే మొహం బద్దలైంది. అందరూ చివాట్లు వేశారు బహుశాః నేను బయలు దేరిన వేళ శకునం మంచిది కాదని సరిపెట్టు కున్నాను. ట్రామ్ కారు ఎక్కకూడదని ఒంటెద్దు బండి కుదుర్చుకున్నాను

చెన్నపట్నం చాలా పెద్దవూరు. ఇంగ్లండులో ఇంత పెద్ద పట్టణాలుంటాయా? అనుకుంటూ ఎదురుగా చూస్తే ఒక 'హెయిర్ కటింగ్ సెలూన్' కనిపించింది బండిదిగి పుట్టు వెంట్రుకలు తీయుంచుకుందామని సెలూన్‌లోకి అడుగు పెట్టాను బట్టలతో భోజనానంతరం క్షవరం చేయించుకోవటం మనసుకు కష్టంగా తోచింది కార్యసాధన కోరి దేశోపకారం కోసం అలా చేయక తప్పలేదు సెలూన్ లోపల చూస్తే ఆశ్చర్యంగావుంది అది మంగలిషాపా, లేక ఆఫీసా అనే అనుమానం వచ్చింది అక్కడ కూర్చున్న ఒక పెద్దమనిషి నా అవస్థ చూసి అరవంలో మాట్లాడాడు అరవం రాదన్నాను అతను వచ్చీరాని తెలుగులో 'లోన కూర్చోండి' అన్నాడు. మరొకడు వచ్చి నన్ను కుర్చీలో వెనకకు జార్లపడమని నాగడ్డానికి సబ్బు నురగ రాశాడు. కత్తి నూరకుండానే క్షౌరం చేశాడు కత్తి విశేషమేమో తెలియలేదు. నా రక్తం కళ్ళజూడకుండా మరోపక్షం రోజులు గుర్తుండేటట్లు మా వూళ్ళో మంగలి క్షౌరం చేసేవాడు చంకల్లో శుభ్రం చెయ్యమని అడిగితే వాడికి కోపం వస్తుందని మానుకున్నాను బారెడు జుట్టు రెండు నిముషాల్లో కత్తిరించి వేశాడు అద్దంలో చూసుకుంటే పుట్టెడు దుఃఖం వచ్చింది వాడు నా తలస్నానం కూడా చేయించి సువాసన నూనె క్రాఫ్ చేసిన తలకు పూసి దువ్వాడు. చివరకు ఒక రసీదు నా చేతిలో పెట్టి మూడు రూపాయలిమ్మన్నాడు వాడితో వాదన చేసి లాభం లేదని మాట్లాడకుండా డబ్బులిచ్చి యివతలికి వచ్చాను ఆలస్యమైందని బండివాడు కోప్పడ్డాడు ఎక్కువిచ్చు కుంటానని చెప్పి ఎక్కి కూచున్నాను మరో పెద్ద షాపుకనిపిస్తే అక్కడ టోపీ కొందామని దిగాను గాజు తలుపులు పెట్టి వస్తువులన్నీ అందంగా అమర్చారు

అది ఇంద్రభవనమే. అమ్మేవాళ్ళు కొనేవాళ్ళు జాతి వాళ్ళే. వాళ్ళను చూస్తే భయం వేసింది. ఏంకావాలని అడిగితే టోపీ కావాలన్నాను. మేడ మీద కెళ్ళమన్నారు. అక్కడ ఒక మగవాడు ఒక ఆడది టోపీలమ్ముతున్నారు. ఆడమనిషి అమ్మే టోపీలు బాగున్నాయి. సైజు చెప్పమన్నారు. నాకేనన్నాను. వాళ్ళు నవ్వుకున్నారు. కర్పూరపు ఆకులతో అల్లిన ఒక పెద్ద టోపీ నానెత్తిన పెట్టి సరిపోతుంది తీసుకోమన్నారు. ఖరీదు యిచ్చి క్రిందికి వచ్చాను. వాళ్ళు నవ్వుకోవడం ఆపలేదు. కింద'టెంపసు' వాచీ కొన్నాను. రేజరుకూడా కొన్నాను. బండివాడికి డబ్బులిచ్చి పంపేశాను. ఆకలి అవుతుంటే, దగ్గరలో కాఫీ హోటలుకెళ్ళాను. నేనెన్నడు కాఫీ హోటలు కెళ్ళలేదు. గుమ్మం దగ్గర యజమాని కూచొని డబ్బులు వసూలు చేస్తున్నాడు. ఒక కుర్రవాడు ఏకంగా ఇరవై వస్తువుల పట్టీ చెప్పి ఏంకావాలన్నాడు. పక్కబల్లకేసి చూపించి అది తీసుకు రమ్మన్నాను.

యజమానికి డబ్బు చెల్లించి గుఱ్ఱంబండి చేసుకొని సత్రానికి వచ్చాను. అక్కడ పొద్దుట కనిపించిన వ్యక్తిని నెమ్మదిగా రైలు సంగతి అడిగాను. ఇంగ్లండు వెళ్ళాలి కొలంబో వెళ్ళే రైలు ఎప్పుడుంది అని అడిగాను. ఫలానా స్టేషనులో సాయంత్రం ఆరుగంటలకు రైలు వుందని చెప్పాడు. నాచేతులో నంచి చూసి టోపీ చూపించమంటే చూపించాను. ఆడవాళ్ళ టోపీ తెచ్చానని నవ్వాడు. బహుశా షాపులోవాళ్ళు కూడా ఇందుకే నవ్వి వుంటారు. అయినా వీడి ముందు లోకువ కాకూడదని, కొలంబోలో నేనెరిగిన వాళ్ళకి బహుమతి పట్టుకెళుతున్నానన్నాను. అతను నమ్మినట్లు లేదు.

సాయంకాలం సామాను సర్దుకొని బీచ్ స్టేషను కెళ్ళాను. కొలంబో వెళ్ళాలంటే సెకండుక్లాసు టికెట్టు తీసుకొమని అక్కడ సలహా యిచ్చారు. రేవు సాయంకాలానికి ట్యుటికురాన్లో దిగి స్టీమరెక్కితే మర్నాడు ఉదయానికి కొలంబో చేరుతానని చెప్పారు. ఈ మధ్య కొలంబో దాకా రైలు వెళ్ళడం లేదా అన్నాను. అతడు నన్ను ఎగాదిగా చూసి వారధి సరిగా లేనందున సముద్రంలో వెళ్ళవలసిందేనని వారధి కట్టడానికి ఆంజనేయుడికి కబురు పంపుదామంటే అడ్రను తెలియదని ఎద్దేవా చేసి మాట్లాడాడు.

రైలు దగ్గర గార్డు స్వయంగా సెకండు క్లాసు పెట్టెలో ఎక్కించాడు. ఎవళ్ళూ ఎక్కువ మంది ఎక్కరనీ సుఖంగా పడుకోవచ్చుననీ చెప్పాడు. ఇతరులెవరూ ఇందులో ఎక్కకూడదనీ అది నా గౌరవానికి భంగమనీ చెప్పాను. ఇంతకు ముందు స్టేషనుమాష్టరు భారతీయుడు కావడంవల్ల నాతో చులకనగా మాట్లాడాడని గట్టిగ చెప్పాను. 'అయినా మనకెందుకులే' అని వూరుకున్నానన్నాడు. లంచం యిస్తేగాని పనులు జరగవని గుర్తుకొచ్చింది. మాష్టర్లకు, పోలీసులకు, రిజష్ట్రారుకు, పదిరూపాయల నోటు చూపిస్తే పని సులభంగా అవుతుందని తెలుసు. గార్డు చేతిలో ఒక రూపాయి పెట్టాను. మరో రూపాయి యిస్తే బాగుండేదే అనుకున్నాను. గార్డు మాట్లాడకుండా రూపాయ జేబీలో వేసుకొని నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

రైలు పదినిముషాల్లో ఎగ్మూరు స్టేషను చేరింది. అదికూడా చెన్న పట్టణంలో భాగమని తెలిసి ఆశ్చర్యపోయాను. ఊరి మధ్యలో రైలు వేసినా ప్రజలకు ప్రమాదం లేదుగదా అని సరిపెట్టుకున్నాను. నా పెట్టెలోకి నలుగురు రాబోయారు. ఇది సెకండుక్లాసు ఇందులో ఎక్కితే జుల్మానా వేస్తారు అన్నాను. ఇంకో పెట్టెలో ఎక్కమన్నాను. వాళ్ళు వినలేదు. మాట్లాడకుండా కూర్చోమన్నారు. గార్డు వెళుతుంటే చెప్పాను. అతడు నా మాట వినిపించుకోలేదు. వాళ్ళు నాకు ఇంగ్లీషు రాదనుకొని మాట్లాడు కుంటున్నారు. గార్డు చేతులో రెండు రూపాయలు పెట్టి పెట్టె నాదనుకుంటున్నాని నవ్వుకున్నారు. వీళ్ళకెలా తెలిసిందా? ఆ గార్డుకు డబ్బులిచ్చానని అని అనుకుంటూ నేనూ ఇంగ్లీషు చదువు కున్నాననీ చెప్పాను. మీరు సెకండుక్లాసు టిక్కెట్టు కొనుక్కొని వుంటే నాకభ్యంతరం లేదన్నాను. ఎందుకైనా మంచిదని సందిగ్ధంగా వెనుకంజ వేశాను. అనవసరంగా గార్డు చేతిలో రూపాయ పెట్టినందుకు విచారించాను. నలుగురెక్కే పెట్టెలో ఒక్కణ్ణే కూర్చోవచ్చునని మోసపోయాను. డబ్బు పోయిందని కాదు. గార్డు దొంగ. నాకెందుకు ద్రోహం చేశాడు. అసలు దొరలే మోసగాళ్ళు. అందుకనే అంత రాజ్యం సంపాదించారు. వాళ్ళను తరిమి వేయాలని ఎంతో మంది దేశీయులు ప్రయత్నం చేస్తున్నారు.

నా పెట్టెలో వీళ్ళెక్కారని కాదుగానీ గ్రామసింహాల్లా వాదించు కుంటున్నందుకు, అర్థంకాని సంభాషణకు కష్టమనిపించింది. గార్డు ఈలవేశాడు.

వచ్చిన నలుగురైదుగురులో ఒకడే లోపల కూర్చున్నాడు. మిగతావాళ్ళు సాగనంపడానికి వచ్చారు ఆయన ఒక్కడే ఉన్నాడుగదా! నాతో మాట్లాడకుండా తప్పుతుందా! అనుకున్నాను. చిన్నచిన్న స్టేషన్లలో ఆగకుండా రైలు పరుగెడుతోంది అలాంటప్పుడు, ఆ స్టేషన్లు ఎందుకు కట్టారని ఆ పెద్ద మనిషిని అడుగుదామనుకున్నాను. అంతకు ముందే పల్లెటూరి దద్దమ్మ అన్నాడు కాబట్టి వూరుకున్నాను అయినా వుండబట్టలేక చెన్నపట్టణం పొలిమేర చెప్పమన్నాను. ఈ చిన్న స్టేషను చెన్నపట్టణంలో బాగమని చెప్పాడు ఇంగ్లండుకంటె ఇది పెద్దదిగదా! అనుకున్నాను ఒక చివరి నుండి మరియొక చివరకు వెళ్ళడమెలా? ఆఫీసులకెళ్ళే వాళ్ళు ఏం చేస్తారు చిన్న ఉద్యోగులు బతికేదెలా? వాడికేం మిగులుతుంది వాళ్ళేం తింటారు నా సూక్ష్మబుద్ధికి అది అర్థంగాలేదు.

ఏమీ తోచక నాతోటి ప్రయాణీకుని వైపు చూశాను 'మీదేవూరండి'? అన్నాడు 'నర్సాపురం' అన్నాను 'ఎక్కడిదాకా వెళుతున్నా'రన్నాడు తరచూ వెళ్ళి వచ్చేవాడిలా 'కొలంబో వెళుతున్నా'నన్నాను 'కొంపదీసి ఇంగ్లండు వెళ్లటం లేదుకదా!' అన్నాడు. 'అలా ఎందుకనిపించింది' అన్నాను దానికి అయన ఒక చిన్న కథ చెప్పాడు ''ఒక తుంటరి కుర్రవాడు తిమ్మన్నగారూ ఎక్కడికెళుతున్నారని అడిగాడట నా పేరు నీకెలా తెలిసిందని వాడు ఆశ్చర్యపోయాడట. నీ మొహం చూస్తే వేరే చెప్పనక్కరలేదని ఆ కుర్రవాడు అన్నాడట అలానే నీ వాలకం చూసి అలా అనిపించిం'దన్నాడు ఎప్పుడూ దూరప్రయాణం చేసిన వాడివిలా లేవని పల్లెటూరివాడివి ఇంగ్లండు వెళుతున్నట్లు అనిపించిం'దని అన్నాడు నాట్రాఫింగు చూసి ఇంట్లో చెప్పకుండా వెళుతున్నానని, బొంబాయి మీద కాకుండా కొలంబో మీదుగా వెళ్ళడాన్ని బట్టి ఆ అనుమానం వేసిందని ఖండితంగా చెప్పాడు అరవవాడు అఖండుడిలా కనిపించాడు నా సంగతి పుస్తకంలో చదివినట్లు కనిపెట్టేశాడు అయినా మనసు విప్పి చెప్పడం మంచిది కాదని మా యింటికి ఉత్తరం వ్రాసివేస్తాడేమోనని అనుమానించాను. అతని విషయం కనుక్కుందామని 'తమదేవూరు' అన్నాను ఆయన తన చరిత్ర చెప్పాడు వాళ్ళది తిరుచినాపల్లి తండ్రి స్టేషను మాష్టరుగా రాజమహేంద్రవరము నిడదవోలు, ఏలూర్లలో

పని చేశాడు. తాను ఇంగ్లండులో ఇంజనీరు పరీక్ష అయి దవళేశ్వరంలో బెజవాడలో ఉద్యోగం చేశాడు ఆయన చరిత్ర వింటుంటే నా గుండె ఆగినంతపని అయింది మా నాన్న అడ్రసు అడిగి తెలుసుకొని యింటికి ఉత్తరం వ్రాస్తాడని భయం వేసింది అయినా ధైర్యం తెచ్చుకొని ఆయనతో సంభాషణ మొదలు పెట్టాను

ఇంగ్లండులో మన వాళ్లెవరైనా ఉన్నారా? భోజన సదుపాయం వుంటుందా? అని అడిగాను అక్కడ యిబ్బంది వుండదనీ, దేశాచారాలు తెలిసి వుంటే మంచిదనీ అక్కడ స్నేహితులున్నారా? అని అడిగాడు. నన్ను కుర్రవాడి కింద జమకడుతున్నాడని బావించి నేనతనితో సంభాషణకు క్లుప్తంగా సమాధానాలు చెప్పసాగాను నాకు నిద్ర వచ్చి అలా అంటున్నానని పడుకోమని సలహా యిచ్చాడు నేనేమీ పసిపిల్లవాడిని కాదని చెబుదామనుకొన్నాను ఆయనలోలోపల నవ్వుకొంటున్నాడు నాబొంతచూసి మడతమంచము కూడా బయటకు తీద్దామని వూరుకొన్నాను 'లండనుకు బొంతకూడా తీసుకెళ్తావా'? అని ఆయన గేలిచేసినట్లు మాట్లాడాడు తమ హితోపదేశం అవసరం లేదని మొహం మీదనే చెప్పాను అతడు నవ్వు ఆపలేదు నేను నాదారిని నిద్రకుపక్రమించాను

అయినా అతడు సామానుపట్టుకపోతాడేమోనని బెదురుపుట్టింది మధ్యమధ్యలో కళ్లు తెరిచి చూస్తూ పడుకొన్నాను ఒకసారి లేచిచూస్తే అతడు పెట్టెలో లేడు సామానుపోలేదని నిర్ధారించుకొన్నాను అతని శనివిరగడయింది

తెల్లవారేలేచి 'లావెటరీ' తలుపుతీసుకొని లోపలికెళ్లాను. అక్కడ మధ్యరంధ్రమున్న కుర్చీపీట వుంది తిరిగి వచ్చిన తర్వాత మాయింట్లోకూడా అలాంటిదిఏర్పాటు చేయించాలని నిశ్చయించుకొన్నాను కొళాయి తిప్పితే నీళ్లురాలేదు చేయిజారి కొళాయి మీదపడితే జయ్యని నీళ్లు వచ్చాయి దంతధావనం పూర్తి చేసుకొని స్టేషనులో అమ్ముతున్న ఇడ్లీలు తిని పరిసరవాతావరణం చూస్తూ కూచొన్నాను

అరవదేశం కూడా యింత చక్కగా వుంటుందని వూహించలేదు. అన్నీ సమృద్ధిగా లభించే ఈదేశస్థులు దేశంతాని దేశానికి ఉద్యోగ నిమిత్తం ఎందుకెళతారా అని ఆశ్చర్యమేసింది.

ఆ మధ్యాహ్నం గార్డు వచ్చి భోజనం కావాలా? అని అడిగాడు. నాసంగతి వీడికెందుకని 'అక్కర్లేదు' అన్నాను. అతడు పెదవివిరిచి భుజాలు ఎగరేసి వెళ్లాడు. భోజనం సంగతి ఏంచేయాలో తెలియక చిరు తిండి తిని సరిపెట్టుకొన్నాను. ఆ సాయంకాలం 5గంటలకు 'ట్యూటికొరాన్ ' చేరాను.

కొలంబో పోయేవాళ్ళు ఇక్కడ దిగండని పోర్టర్లు కేకవేస్తున్నారు. సెకండు క్లాసులోంచి దర్జాగా దిగాలని కొత్తసూటు, తొడుక్కొని ఎర్రసిల్కు తలగుడ్డ చుట్టకొని, దొరసాని టోపీపెట్టుకొని సామానులతో దిగాను. కూలివాడితో బేరమాడి సామానువాడి చేతికిచ్చి బయలుదేరాను. గేటుదగ్గర టిక్కెట్ కలెక్టరు సామాను చూపించమన్నారు. కూలివాడి నెత్తిమీది పెట్టెతీసి చూపించమన్నారు. కొలంబో ఎందుకు వెళుతున్నారన్నాడు. ఇంటిదగ్గర చెప్పకుండా వచ్చానని అనుమానిస్తున్నాడకొన్నాను. పన్ను విధించే సామానులుంటే చూడాలన్నారు. కూలివాని నలహామేరకు అతని చేతిలో అర్ధరూపాయి పెట్టి బయటపడ్డాను.

ఇంతలో ఒకరైలు బంట్రోతు పరుగెత్తుకుంటూ వచ్చి నేను రైలులో వదిలేసిన దొరసాని టోపి నాకు అప్పజెప్పాడు. విధిలేక వాడికి ఒక పావలా యిచ్చాను. ఎదురుగా స్టీమరు కనిపించింది. కానీ అది చాల చిన్నదిగా వుంది. ఎక్కబుద్ధి కాలేదు. కూలివాడు సామాన్లు లోపల పెట్టి ఎక్కమని తొందరపెట్టాడు. నాతోపాటు మరోపాతిక మంది ప్రయాణీకులున్నారు. నాకు పడవ ప్రయాణం చూస్తుంటే ఆనందం పెల్లుబికింది. కవిత్వం రాక పోవటం బాధవేసింది. తలనొప్పి, వికారము కలిగాయి. వెనక్కు వెళ్ళాలనిపించింది. ఇల్లు జ్ఞాపకం వచ్చింది. నన్ను ఇంగ్లండు వెళ్ళమని చెప్పిన వాడిమీద కోపం వచ్చింది. తల్లిదండ్రులు గుర్తుకు వచ్చారు.

నాకు ఎక్కడలేని సందేహం వచ్చింది. చిన్న స్టీమరులోంచి పెద్ద స్టీమరులోకి ఎక్కడం ఎలా? మా వూళ్ళో వాళ్ళు వీళ్ళు అనుకుంటున్న

భయంకరమైన పద్ధతి గుర్తుకు వచ్చి భయంతో హడలిపోయాను. నిచ్చెనమీద నుంచి ఎక్కడము లేదా కొక్కెమున్న గొలుసు నడుముకు తాడు కట్టిపైకి లాగడము, నీళ్ళలో పడితే వలవేసి లాగడము వంటివి గుర్తుకు వచ్చాయి. స్టీమరులో పడి తలకాయ బద్దలైతే ఎలా? లేదా పెద్దచేప వచ్చి తినివేస్తే ఇలా తలపోస్తూ పెద్దలను గుర్తుకు తెచ్చుకొని రామనామ స్మరణ చేస్తూకూచున్నాను.

సముద్రవు హోరులో తలనొప్పి ఎక్కువైంది. తల తిరుగుతోంది. ఇంతలో అదుగో స్టీమరు అన్నారు. ఈ స్టీమరును దాని దగ్గరగా తీసుకెళ్ళారు. నాకు ఒళ్ళు కంపరమెత్తిపోతుంది. ఎవళ్ళు ఏమి అన్నా, నవ్వినా యింటికి వెళ్ళిపోదామనుకున్నాను. చెన్న పట్టణంలో మరోవారం గడిపి యింటికి వెళ్ళవచ్చుననుకున్నాను.

కొంచెంసేపటికి పెద్ద స్టీమరులోకి ఎక్కడానికి ఒక నిచ్చెన విశాలమైంది తెచ్చారు. భయంలేకుండా ఎక్కడానికి వీలుగా వుంది. సామాను తీసుకోవడానికి వెళుతుంటే వెనక వస్తుందని చెప్పారు. 'జాగ్రత్తగా వస్తుందా'? అని భయంవేసింది. అందరూ సామాన్లు వదిలి వెళుతున్నారు. ఫరవాలేదనుకొని దొరసాని టోపీ మాత్రం తీసుకొని నిమ్మళంగా పైకిఎక్కాను.

స్టీమరులోకి అడుగు పెడితే మహారాజ భవనంలా వుంది. సోఫాలు, కుర్చీలు ఒకటేమిటి సమస్తం ఉన్నాయి. నేను ఆశ్చర్య పోతుంటే ఒక పెద్దమనిషి వచ్చి పలకరించాడు. తాను నేటాల్ వెళుతున్నానని గడగడా ఏదో చెప్పాడు. రోజంతా తిండిలేక పోవడం వల్ల కడుపు దహించుకుపోతోంది. స్టీమరు బయలుదేరింది. ఇంతలోగంటకొడితే భోజనానికి పోదాం రమ్మని నావక్క వాడు చెప్పాడు. దేవుడున్నాడనిపించింది. అంత ఆహారం లోపలికెళితే తర్వాత సంగతి తర్వాత.

భోజనాల గది మరీ విచిత్రంగా వుంది. పొడుగాటి బల్ల చూట్టూ కుర్చీలు వేశారు. అప్పటికే కొంతమంది వచ్చి కూర్చుని వున్నారు. బల్లమీద కత్తులు,కటార్లు పెట్టారు. అవి ఎందుకని నాస్నేహితుణ్ణి అడిగాను. అజ్ఞానంగా

అదక్కుండా గడుసుగా మాట్లాడాను. ఒక చేతిలో ఫోర్కు పట్టుకొని, రెండో చేత్తో కత్తి పట్టుకొని ఫోర్కు రొట్టెమీద గుచ్చాను. చుట్టు పక్కల వాళ్ళు ఊపిరి బిగబట్టి చూస్తున్నారు. రొట్టె ఐదవకంచం పక్కన పడింది. కంచంవచ్చి నా ఒళ్ళోపడింది. పక్కవాళ్ళు నవ్వడం మొదలెట్టారు. ఆకలి దహించుకుపోతోంది. వీళ్ళు నవ్వటం కోపం తెప్పించింది. దేవుడిచ్చిన చేతులుండగా ఇవన్నీ ఎందుకని రొట్టెముక్క కొరుక్కుతినటం మొదలు పెట్టాను. మిగతావాళ్ళు కోపంగా చూస్తున్నారు. నేను వాళ్ళను పట్టించుకోలేదు. కడుపులో కలియబెట్టినట్లై డోకు వస్తోంది. ఆపుకోలేక పోయాను. ఎక్కడికెళ్ళాలో తోచలేదు. ఒక నౌకరు వచ్చి పక్కగదిలోకి తీసుకువెళ్ళాడు. కడుపులో దంతా కక్కున్నాను. తలబద్దలౌతోంది. నాప్రక్కన నౌకరు ఒక చిన్న గదిలో మంచంమీద నన్ను పడుకోబెట్టి వెళ్ళిపోయాడు తాగిన వాడిలాగా పడిపోయాను. ఇదంతా దృష్టిదోషం వల్ల వచ్చి వుంటుంది. దిష్టి తీసేవాళ్ళు లేకపోయారు. ఒళ్ళు తెలియకుండా నిద్రపట్టింది. తెల్లవారి నౌకరు వచ్చిలేపాడు. తలనొప్పి తగ్గింది. కొలంబో చేరామని చెప్పాడు. సామాను కిందికి వెళ్ళి పోయిందని చెప్పాడు. అంతా జాగ్రత్తగా వుందో లేదోనని భయం వేసింది. దొరసాని టోపీ మాత్రం బల్లమీద పెట్టివుంది. మాట్లాడకుండా పైకి వచ్చేశాను.

నేను స్టీమరు మీద నుంచి దిగివచ్చేటప్పటికి సామాను జాగ్రత్తగా వచ్చివుంది. కూలివాడిని పిలిచి సామాను బండ్ల దగ్గరకు తీసుకువెళుతున్నాను. ఇంతలో వెనుకనుంచి ఎవరో పిలిచారు. పరుగెత్తుకుంటూ దొరసాని టోపీ తెచ్చి యిచ్చారు. ప్రపంచంలో న్యాయం ఇలా నాలుగు పాదాలతో నడుస్తోందని ఆశ్చర్య పోయాను. ఇది నన్ను వొదిలేటట్టు లేదు. ఏ అర్ధరాత్రి పూటో సముద్రంలో గిరాటు వేద్దామనుకున్నాను.

ఇక్కడ బస విషయం మళ్ళీ సందేహం. ఇంగ్లీషు వచ్చిన వ్యక్తిని వివరాలడిగి ఒక సత్రం చేరుకున్నాను. ఒక గది తీసుకొని నేను తెచ్చుకున్న పండ్లపొడితో దంతధావనం పూర్తి చేశాను. భోజనం పూర్తి చేశాను. లండను వెళ్ళే స్టీమరు వివరాలు కనుక్కుందామని సూటు వేసుకొని తలగుడ్డ చుట్టుకొని

బయలుదేరాను. ఎదురుగా గంధంబొట్లు పెట్టుకొని ఒకవ్యక్తి కనిపించాడు. 'మీదేవూరన్నాను'. కుంభకోణం అన్నాడు. కుంభకోణంవాళ్ళు మోసకారులని పేరు. నాకో సహాయం చేయాలన్నాను. నేను పేదవాడినంటూ వెళ్ళిపోతున్నాడు. లండను వెళ్ళే స్టీమరు గురించి చెప్పమని బ్రతిమాలాను 'తామస్ కుక్ అండ్ సన్' అనే కంపెనీ దగ్గర కెళితే వివరాలు తెలుస్తాయన్నాడు. తిన్నగా కంపెనీ దగ్గరికెళ్ళాను. చాలా పెద్ద భవనం! లోపలికెళ్ళటానికి భయం వేసింది.

ఆ కంపెనీ బంట్రోతుతో గొడవపడి వాడిచేత మెడబట్టి గెంటించుకున్నాను. వాడితో నెమ్మదిగా స్నేహం చేసి లండను కెళ్ళడానికి టిక్కెట్టు కావాలన్నాను. వాడు నెమ్మదించాడు. అక్కడ లోపల ఒక దొర గారి దగ్గరకెళ్ళి లండనుకు టిక్కెట్టు కావాలన్నాను. వారం రోజులు వరకు లండనుకు వెళ్ళే స్టీమర్లు లేవని చెప్పాడు. కానీ మార్సెల్సు వరకు వెళ్ళే స్టీమరుకు థర్డుక్లాసు టిక్కెట్టు యిచ్చాడు. నాదగ్గర ఎక్కువగా వున్న డబ్బు అతని దగ్గర దాఖలు చేశాను. చేఖర్చులకు యాభైరూపాయలుంచుకున్నాను. మిగతా సొమ్ముకు ఒక చెక్కు యిచ్చాడు. వాళ్ళ మాట,మర్యాదా నాకు బాగా నచ్చింది.

స్టీమరు బయలుదేరడానికి ఆలస్యముంటే బజారుకెళ్ళాను. మళ్ళీ ఒక టోపీ కొన్నాను. రెండు డజన్లు కొవ్వొత్తులు కొన్నాను. పాలడబ్బాలు రెండుకొన్నాను.

మానాన్నకు ఓ ఉత్తరం వ్రాశాను. అందులో నేను ఎక్కడ వున్నది వివరంగా వ్రాశాను. ''దేశదుస్థితి పోగొట్టడానికి బారిష్టరు పరీక్ష చదివి తిరిగి వస్తాను. ప్రస్తుతానికి నర్సాపురం నాటక కంపెనీ నారాయణ దగ్గర ఐదువందలు రూపాయలు వడ్డీకి తెచ్చాను. మరో ఐదువందలు మీరు నాకు మార్సెల్సు గ్రామానికి టెలిగ్రాఫ్ మనియార్డరు పంపించండి. బారిష్టరు పూర్తయిన తర్వాత కావలిసినంత డబ్బు సంపాదిస్తాను. ఈసాహసం చేసినందుకు మన్నించండి. అమ్మను బెంగపెట్టుకోవద్దని చెప్పండి''. అని

ఉత్తరం పూర్తి చేసాను. అమ్మను తలుచుకునే సరికి కళ్ళ నీళ్ళు వచ్చాయి. ఉత్తరం పోస్టు చేసి స్టీమరు ఎక్కాను చాలమంది సాగనంపడానికి వచ్చారు. స్టీమరు బయలుదేరింది. దుఃఖం పొంగివచ్చింది.

అక్కడ పొడుగాటి బల్లచుట్టూ జనం కూచొని వున్నారు. వడ్డన విచిత్రంగా వుంది. వడ్డించేవాడు తెచ్చిన వస్తువులు ఎవరికి కావలసినంత వాళ్ళు కంచాల్లో వేసుకుంటున్నారు. వాడు తెచ్చింది. మాంసం అనే అనుమానంతో ఒద్దన్నాను. వాడిభాష నాకు అర్థం కాలేదు. మరొకడు వచ్చీరాని ఇంగ్లీషులో నాఅవస్థ కనుక్కొని రెండురొట్టెలు తెచ్చి ఇచ్చాడు. అందరికీ సగ్గుబియ్యం క్షీరాన్నం ఇచ్చాడు. మరికాస్త పుచ్చుకున్నాను. స్టీమరు లోపలే పరుపులు వేసినందువల్ల నాబొంత తీయవలసిన అవసరం రాలేదు. తెల్లవారు ఝామున మెలకువవచ్చింది. లఘుశంకకు ఎక్కడికెళ్ళాలో తెయదు. నిముషం ఒక యుగంగా గడిపాను. నాబాధ చెప్పనలవికాదు. ఇంగ్లీషులో అడిగితే ఎవరూ సమాధానం చెప్పడం లేదు. నానా అవస్థ పడి సంజ్ఞలు చేశాను. స్నానాల గదివంటిది ఒకటి చూపించారు.

ఇలా నాలుగు రోజులుగడిచాయి. అలవాటు లేక నాకు వికారంగా తలనొప్పిగా వుంది. అన్నహితవు తప్పి పోయింది. ఐదవ రోజు ఒకచోట స్టీమరు ఆగింది. సాయంకాలం దాకా స్టీమరు ఆగుతుందని చెప్పారు. నేను అలా బయటికి వెళ్ళాను. అది ఆఫ్రికా దేశంలా వుంది. కాసేపు అటూ యిటూ తిరిగి స్టీమరు వాళ్ళు నన్ను వదిలేసి వెళతారేమోనని వెనక్కు వచ్చాను.

నాపేరు పిలవడం నోరు తిరగక వాళ్ళు నన్ను 'కొలంబో గారు' అని పిలవడం మొదలు పెట్టారు. తిండి సరిగాలేక ఎలాగో వుంది. వికారము తలనొప్పి ఎక్కువైనాయి. నాగదిలోకి అన్నీ తెచ్చియిస్తున్నారు. ఒకరోజు కళ్ళు తెరిచి చూసే సరికి దొరసాని టోపి కనిపించింది. దీనివల్ల నగం తలనొప్పి అనుకున్నాను. టోపి ఉండకింద నలిపి కిటికీ అవతల పారవేశాను. ఆ తెల్లవారి ఒక డాక్టరు నన్ను పరీక్ష చేయడానికి వచ్చాడు. జబ్బుగావున్న వాళ్ళని 'సూయజ్ కెనాల్' ముందు దింపివేస్తారట.

'సూయజ్ కెనాల్' చూద్దామని స్టీమరు టాప్ మీదకి వెళ్ళాను. కర్జూరపు చెట్లు ఒంటెలు కనిపించాయి. తెల్లవారేసరికి 'పోర్టుసెడ్' చేరాము. అక్కడ స్టీమరు ఆగితే వూరుచూద్దామని నా మిత్రులతో బయలుదేరాను.

అలా తిరిగి మళ్ళీ స్టీమరు చేరుకున్నాను. ఆరాత్రి కులాసాగానే వుంది. మర్నాడు మూసిన కన్ను తెరవకుండా వికారమూ, వాంతులూ. వారంరోజులు బాధపడ్డాను. గడియారం వెనక్కునడుస్తున్నట్లు అనిపించింది. గడియారం అమ్మిన వాడి మీద కోపం వచ్చింది పారవేద్దామనుకొని మళ్ళీ పెట్టిలో పడవేసాను. ఒకరోజు ఒక దొర వచ్చి ఇవాళ దిగిపోతామన్నాడు. నాగదిలోకి ఫలహారం పంపించాడు. కొంచెం తట్టుకున్నాను. ఎలానో 11 గంటలకు 'మార్సల్స్' చేరాము.

మార్సల్స్‌లో ప్రయాణికులు తాలూకు బంధువులు ఎదురువచ్చారు. నాకోసం ఎవరూ రాలేదే అని దిగులు పడ్డాను. ఇంతలో 'తామస్ కుక్‌కంపెనీ' మనిషి వచ్చి సహాయం కావాలా అన్నాడు. పెద్దహోటలుకు తీసుకెళ్ళమన్నాను. చాలాడబ్బు అవుతుందని అతడు సంకోచిస్తున్నాడు. ఫరవాలేదు కానీండన్నా! హోటలు బయట బంట్రోతు నన్ను ఎగాదిగా చూసి లోపలికి తీసుకువెళ్ళాడు. అది కేవలం ఇంద్రభవనంలా వుంది. ఓపెద్ద చిట్టాలో నాచేత సంతకం చేయించుకొని నాకొక గది యిచ్చారు. గది చాల చిన్నదిగా వుంది. ఇదేమిటా అని చూస్తున్నాను. చుట్టుపక్కల వాళ్ళు నన్ను చూసి నవ్వుతున్నారు. నేను లోపలికెళ్ళడానికి తటపటాయిస్తుంటే నన్ను లోపలికి తోసి కటకటాల తలుపులు వేసి అంతరిక్షంలోకి తీసుకెళ్ళారు. అప్పుడు తెలిసింది నాకు అది పైకి రావడానికి ఒక సాధనమని. విశాలమైన గదిలో నన్ను దించి బంట్రోతువెళ్ళిపోయాడు.గోడకున్న బొత్తాము నొక్కాను. ఎవడో వచ్చి ఫ్రెంచిలో మాట్లాడాడు. ఆకలితో వున్న నాకు కోపం వచ్చింది హాల్లో భోజనానికి తీసుకెళ్ళాడు. అక్కడి వాళ్ళు నాకేసి ఆశ్చర్యంగా చూస్తున్నారు. మాంసము, చేపలు, కోడిగుడ్లు ఒకటి కాదంటే ఒకటి తెచ్చిపెడుతున్నారు. శాకాహారినని చెప్పాను. ఆశ్చర్యంగా చూసి శాకాహారములు తీసుకువచ్చి నిర్లక్ష్యంగా పెట్టారు. నన్ను చూసి అందరూ నవ్వుతున్నారు. దానికి కారణం

నేను ఆడవాళ్ళు ధరించే మెడపట్టీ తగిలించుకున్నాను. బట్టల దుకాణంలో ఒక ఓవర్‌కోటు కొనుక్కున్నాను.

మధ్యాహ్న అనుభవంతో ఈపూట నాగదికి భోజనం తెప్పించుకున్నాను. అక్కడ పరుపు మీద పడుకుంటే నలిగి పోతుందేమోనని బొంత తీసి కిందపడుకుందామనుకున్నాను. మర్నాడు బంట్రోతు లిద్దరూ నన్ను చూసి నవ్వుతున్నారు. ఈ నవ్వుకు కారణం నాశాలువా నేమో! ఇంతలో నాకు డబ్బు వచ్చిందని కుక్ కంపెని వారు చెప్పారు. హోటలు బిల్లు చూస్తే గుండె కొట్టుకోవడం మానివేస్తుంది. బిల్లు చెల్లించి రైలుకు బయలుదేరబోతున్నాను. ఇద్దరు నౌకర్లు వచ్చారు. వారిచేతిలో తలాఒక అణా పెట్టాను. వాళ్ళు ఎగాదిగా చూశారు. నాదారిన నేను రైలు ఎక్కివెళ్ళి పోయాను.

రైల్లో తెల్లవారేసరికి పారిస్ చేరాను. అక్కడ మరో కొత్తరైలు ఎక్కాను. ఖాళీగా వున్న పెట్టెలో ఎక్కికూర్చున్నాను అందులో కూర్చుంటే బలవంతంగా నన్ను దింపేశారు. నేను గొడవ పెట్టాను. ఎందుకంటే అది ఆడవాళ్ళ పెట్టె. ఆ రైలు దిగి మరో స్టీమరు ఎక్కి ఇంగ్లాండులో అడుగుపెట్టాను. ముందుగా కుడికాలే పెట్టాను. ఒక విధమైన ఆందోళన గుండెల్లో అదురు. ఇంతవరకూ మొండి తనంతో వచ్చాను ఇకపై ఈశ్వరుడే వున్నాడని దండంపెట్టుకున్నాను.

---

# 12

# దైవమిచ్చిన భార్య

(సాంఘిక నవల)

గుడిపాటి వెంకటచలం

1894-1979

ప్రథమ ముద్రణ : 1923

# గుడిపాటి వెంకటచలం

గుడిపాటి వెంకటచలం మదరాసులో 1894 మే 19న బుద్ధపూర్ణిమనాడు జన్మించారు. కొమ్మూరివారి యింట జన్మించి గుడిపాటివారింటికి దత్తతపోయారు. తోట్ల వల్లూరు, తెనాలి, కాకినాడ, మదరాసు, రాజమహేంద్రవరాలలో చదివి బి.ఏ.యల్.టి పూర్తి చేశారు. ప్రభుత్వ విద్యాశాఖలో ట్రైయినింగు స్కూలు అధ్యాపకులుగా వివిధ పట్టణాలలో పనిచేశారు. అధ్యాపకులుగా మంచి పేరుపొందారు.

సంఘాన్ని ఎదిరించి సనాతనాచారాలపై ధ్వజమెత్తి స్త్రీలకు సమానాధికారాలకు కృషిచేశాడు చలం. ఆయన ముప్పయి నాటికలు, 8 నాటకములు వ్రాశారు. సనాతన సంప్రదాయాలపై ధ్వజమెత్తిన చలం కలం వెలుగులతో ఆధునికాంధ్ర సాహిత్యం ప్రకాశించింది. చలం తన రచనలలో స్వేచ్ఛాప్రణయాన్ని విశృంఖలంగా ప్రదర్శించిన భావుకుడు. ఆయనపట్ల విపరీతమైన అభిమానము, లేదా ద్వేషము పాఠకులకు కలిగాయి. విమర్శలకు చలం చలించలేదు.

చలం వ్రాసిన పాపం, శశిరేఖ, చిత్రాంగి, సావిత్రి, మైదానం రచనలు తీవ్ర సంచలనాన్ని రేకెత్తించాయి. పాశ్చాత్య కథకుల ప్రభావం ఆయన కథలమీద బాగా కనిపిస్తుంది. స్త్రీలపట్ల పురుషుల ఆధిక్యతను ఆయన ఎదిరించారు. ఆయన నవలలు, మ్యూజింగ్సు తెలుగు సాహిత్యంలో క్రొత్త ఒరవడికి దారితీశాయి. చలం నవలలలో దైవమిచ్చిన భార్య ప్రసిద్ధం. అసంప్రదాయిక మైన భావాలతో ఆయన తెలుగు వారిని ఉక్కిరి బిక్కిరి చేశారు. పురూరవ, బ్రాహ్మణీకం, అమీనా, అరుణ, పాఠకుల్ని వూపివేశాయి. రవీంద్రుని గీతాంజలి అనువాదం ప్రసిద్ధం. ఉద్యోగ విరమణ చేసిన తరువాత ఆయన ఆధ్యాత్మిక అన్వేషణలో తిరువణ్ణామలైలోని రమణాశ్రమం చేరుకున్నారు. మూడు దశాబ్దాలు అక్కడ ప్రశాంత జీవనాన్ని గడిపారు. ఆయన మానవతావాది. సమకాలికుల ఆలోచనా ధోరణిని సమూలంగా మార్చివేసిన అసాధారణ రచయిత. ఆయన ఆంధ్రదేశంలో స్త్రీ స్వాతంత్ర్యోద్యమ ప్రారంభకులని చెప్పవచ్చు. తెలుగు వచన రచనకు ఆయన కొత్త ఒరవడి సృష్టించారు. తన ఎనభై అయిదవ యేట పూర్ణపురుషుడైన చలం 1979 మే 4న తిరువణ్ణామలైలో సిద్ధిపొందారు

# దైవమిచ్చిన భార్య

తాశిల్దారుగారి అబ్బాయి రాధాకృష్ణ. అతడు అల్లరిపిల్లవాడు. వారికుటుంబ స్నేహితులకుమారై పద్మావతితో అతనికి పరిచయమేర్పడింది. వాళ్లు కథలు చెప్పుకొనేవాళ్లు, కలిసి తిరిగేవాళ్లు. పద్మావతికి వేరే కుర్రవాడితో పెళ్లి నిశ్చయించారు. పెళ్లి జరిగిపోయింది.

రాధాకృష్ణ బి.ఏ పూర్తి చేశాడు ఇంకా పెళ్లిచేసుకోలేదు. పద్మావతి వాళ్ల వూళ్ళో వుంటే కలవడానికి వెళ్లాడు. పాతజ్ఞాపకాలు తవ్వివోసుకొని నవ్వుకొన్నారు. ఆమెభర్త విదేశాలకు చదువులకెళ్లి తిరిగి వస్తున్నాడని కబురువచ్చింది ఆయన పేరు న్యాయమూర్తి. వొర్థి అనుమానం మనిషి రాధాకృష్ణ ఆమె వెంబడిబడి తిరగడం ఆయన కిష్టంలేదు. రాధాకృష్ణ తన ప్రేమ గురించి ఆమెకు చెబితే ఆమె ఉదాసీనంగా వుండిపోయింది.

హైదరాబాదుకు కాపురం మారుస్తూ రాధాకృష్ణను పద్మావతి చివరగా కలుసుకొంది. ఆరాత్రి వారు ముద్దుమురిపాలతో ఉల్లాసంగా గడిపారు. రాధాకృష్ణతో వుండిపోవడానికి పద్మావతి యిష్టపడలేదు. న్యాయమూర్తితోనే కాపురం చేస్తానని గట్టిగా చెప్పింది

పద్మావతి తనను కాదని మదరాసులో భర్తతోకాపురం పెట్టడం రాధాకృష్ణకు బాధాకరంగా మారింది. వాళ్లనాన్న అతడికి బలవంతంగా పెళ్లి చేశారు రాధాకృష్ణ గోఖలేతో ఇంగ్లండు వెళ్లి భారతదేశానికి ఐదేళ్ల తర్వాత తిరిగివచ్చాడు తనకు శకుంతలతో పెళ్లయిన విషయం మర్చిపోయాడు. మామగారు పిల్లను తీసుకొనివస్తే, తర్వాత తీసుకరమ్మని గదమాయించాడు పిల్లను అక్కడేవదలి మామగారు వెళ్లిపోయారు.

పద్మావతి మీద మరులు రాధాకృష్ణకు తీరలేదు. న్యాయమూర్తి వీరి అనురాగాన్ని చూసి రాధాకృష్ణను యికపై తమ యింటికి రావద్దని హెచ్చరించాడు. పద్మావతిని సింగపూరు తీసుకెళ్లారు అది తెలిసి రాధ సింగపూరు వెళ్లాడు. రాధ టిబెట్టు వెళ్లి మూడేళ్ల తర్వాత వచ్చాడు. అయినా పద్మావతిని మరిచిపోలేక పోయాడు.

చివరిసారిగా వాళ్లు కాలికట్‌లో కలుసుకొన్నారు దూరంగా ఎక్కడకో వెళ్లి అనేక విషయాలు చర్చించుకొన్నారు. న్యాయమూర్తి వారిద్దరిపై కోర్టులో దావావేశాడు నిరాశానిస్పృహాలతో పద్మావతి రాధ కౌగిట్లో తనువు చాలించింది.

# 12. దైవమిచ్చిన భార్య

## సంక్షిప్త గ్రంథం

రాధాకృష్ణ నాన్నగారు సుందరవరం తాసిల్దారు రాద (రాధాకృష్ణ) అక్కడ హైస్కూల్లో చదువుకుంటున్నాడు అతనిది కొంటె మనస్తత్వం స్నేహితులతో కలిసి అల్లరిపనులు చేయటం, చివాట్లు, తన్నులు తినటం అలవాటు.

ఆరోజు రాద తమ కుటుంబానికి తెలిసిన రాణిగారు రైల్లో వస్తున్నారంటే రైల్వే స్టేషనుకు వెళ్ళాడు రైల్లోంచి బందువులు దిగారు. ఇద్దరు మగపిల్లలు, ఒక అమ్మాయి వాళ్ళను చూస్తే ఆశ్చర్యం వేసింది తెల్లదొర పిల్లలవలె లాగులు, బూట్సులు వేసుకొని దిగారు ఆడపిల్ల పద్మావతి కూడా దొరపిల్లలా బట్టలు దరించి రెండు జడలు వేసుకుంది రాధాకృష్ణ బట్టలు చూసి వాళ్ళు నవ్వుకున్నారు

రాధాకృష్ణ కుటుంబం ఒకరోజు రాణిగారిని చూడటానికి వెళ్ళారు వాళ్ళది జమిందారీ కుటుంబం రాధాకృష్ణ పక్కయిల్లే జమిందారుగారు ఆస్తినంతా వ్యయం చేసి పరలోకానికి వెళ్ళారు అయినా రాణిగారి ఆస్తికేమీ కొరవలేదు ఆమె పెద్దకొడుకు వెంకట రత్నం రెండవాడు సుదర్శనం అతడు రాధకంటె 6నెలలు చిన్న రాధకు 12వ యేడు. వాళ్ళ అమ్మాయి పేరు పద్మావతి రాదవాళ్ళతో ఆడుకోవాలని ప్రయత్నించాడు కానీ వాళ్ళు అతగాడికేసి చూసి నవ్వుకోసాగారు సుదర్శనం రాధటోపి క్రిందపడేసి నవ్వుతున్నాడు పద్మావతి కూడా నవ్వసాగింది రాధాకృష్ణ పొడవాటి జుత్తుచూసి వాళ్ళు నవ్వుతున్నారు పద్మావతి మరీను పద్మావతి రాధకేసి కోలకళ్ళతో చూసింది రాణిగారు (సత్యవతమ్మ) రాదను చూసి యింకా పాతకాలం అలవాట్లేనా అని ఆప్యాయంగా అంది మా పిల్లలతో కలిసి రోజూ ఆడుకోమంది రాధకు కళ్ళలో నీళ్ళు తిరిగాయి ఇంక జన్మలో ఆతోటలో అడుగు పెట్టకూడదనుకున్నాడు ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు జేబునిండా సీమబాదంకాయలు, అక్రోట్ పండ్లు నింపి పంపింది సత్యవతమ్మ అమెను

చూడ్డానికి వస్తే లాభంగానే వుంటుంది అనుకున్నాడు. ఆ రాత్రంతా జమిందారుగారి కబుర్లుతో రాధాకృష్ణ కుటుంబం గడిపింది. ఉభయులూ బంధువులే.

సత్యవతమ్మ మద్రాసులో పిల్లల చదువుకోసం వుంటున్నారు. ఇప్పుడు పద్మావతి పెండ్లికని సుందరవరం వచ్చారు. ఒకరోజు సత్యవతమ్మగారు పిల్లలతో రాధాకృష్ణ యింటికి వచ్చారు. వాళ్ళను తమ తోటలోకి తీసికెళ్ళి ఆడుకోమన్నారు వాళ్ళ నాన్నగారు. వాళ్ళను తమ తోటలోకి తీసికెళ్ళి ఆడుకుందాం రమ్మన్నాడు రాధ. బెచ్చాలాట, గోలీకాయలు, గూటిబిళ్ళ ఇవేవీ రావన్నారు వాళ్ళు. వాళ్ళు చెప్పిన ఆటలు రాధకు తెలియవు. చివరకు మామిడిపిందెలు రాలగొట్టి తిందామనుకున్నారు. రాధ దెబ్బకోకాయ పడేశాడు. కాయలన్నీ పద్మావతి జేబులో పోశాడు. ఆమె ఒకకాయ కొరికి పులువుకు ముఖం చిట్లించింది. రాధను చూసి నవ్వింది. ఆ నవ్వుకు రాధలోబడి పోయాడు. రాధజుట్టు అరవవాళ్ళ జుట్టులా వుందని సుదర్శనం ఎగతాళి చేశాడు. రాత్రి ఇంట్లో రాధ జుట్టు తీసివేయమనిగొడవ చేసాడు. ఎలానో ఇంట్లో వాళ్ళను ఒప్పించి ముడి వెనకాల అలానే వుంచి ముందు కత్తిరింపు పెట్టేటట్లు సంధి చేసుకున్నారు. మర్నాటి నుంచి ప్రతి సాయంత్రం రాధ జమిందారు గారి మేడకు వెళ్ళేవాడు. వాళ్ళ తోటలోని నాలుగు మూలలూ వాళ్ళకు చూపించాడు. తనలాగా చెట్లెక్కటం, గోతుల్లో దూకటం, కాలవలో ఈదటం, గాడిదమీద షికార్లు వాళ్ళకు చేతకాదు.

అన్నలకూ పద్మావతికీ ఎప్పుడూ పోట్లాట. రాధవాళ్ళతో కలిసిన తర్వాత వాళ్ళ పోట్లాటలు మరీ ఎక్కువయ్యాయి. రాధ పద్మావతి పక్షం. అతణ్ణి చూసుకొని ఆమె అన్నల మీద తిరగబడేది. వాళ్ళతో పోట్లాడి పద్మావతీ రాధా ఏ చెట్లు క్రిందనో ఆడుకునేవాళ్ళు, పెద్ద తాను కలెక్టరో మహారాజో అవుతానని రాధ కబుర్లు చెప్పేవాడు. తాను కూడా గొప్పదాన్నవుతానని పద్మావతి అనేది'. నీమొగుడు గొప్పవాడైతే నీవు గొప్పదానివౌతావని' రాధ ఆమెను ఉడికించేవాడు.

ఆమెకు ఏవేవో కథలు చెప్పేవాడు. ఆ కథలలో నాయికానాయకులు వాళ్ళిద్దరే. పద్మావతికి స్వయంవరం అయినట్లు ఒక రాజు ఆమెను రథంలో

కూర్చోబెట్టుకొని ఆమెను తీసుకెళ్ళి పోయినట్లు రాధ ఆమెను రక్షించినట్లు చెప్పేవాడు. ఇద్దరూ సప్తసముద్రాలూ దాటారు. మూడులోకాల్లో రాక్షసుల్ని ఎదిరించారు. ఇవీ కథలు.

ఒకరోజు ఒక కథ చెప్తూ పద్మావతిని తనకిచ్చి పెండ్లి చేస్తామని సత్యవతమ్మ చెప్పినట్లుగా కథ అల్లాడు. పద్మావతి అతని గూబ గుయ్యిమనిపించింది. యిలా ఎన్నో కబుర్లూ ఆటలు ఆడుతున్నారు. ఆమెను చూసిన తర్వాత రాధకు ఆడవాళ్ళంటే గౌరవం ఎక్కువైంది. చెట్లనీడలలో చల్లగాలుల్లో, వాళ్ళిదరూ ఆడుకున్నారు, పాడుకున్నారు. అల్లరి రాధకు యింకా గుర్తు. చిన్నతనంలో సత్యవతమ్మ దగ్గర కూర్చొని వాళ్ళు ఎన్నోకథలు వినేవాళ్ళు. చిన్నతనం సరదాగా గడిచిపోయింది. చీకూ చింతా లేకుండా గడిపారు. బడి అంటేనే రాధకు గిట్టదు. పుస్తకాలు పట్టుకుంటే నిద్రవిచారం. పిల్లల ప్రాణాలు తీయటానికి చరిత్ర, లెక్కలు సృష్టించారని అతని నమ్మకం.

పద్మావతి పెండ్లి దగ్గర కొచ్చింది. ఆమెకు పెళ్ళంటే సంతోషమూ లేదు. ఆమె ఎంతో అందమైంది. ఆమెకు 25 యేండ్ల కుర్రవాడితో పెండ్లి నిశ్చయం చేశారు. ఆయన ఇంగ్లండు వెళ్లి పెద్దపెద్ద చదువులు చదివి తిరిగి వస్తాడట

పద్మావతి అందం రాధకు తెలియదు. అయితే ఆమెలో ఏదోమెరుపు వుండేది. ఊరికే ముట్టుకోవాలనిపించేది. అయితే రక్కుతుందని భయం.

పెండ్లివారు వచ్చారు. పెండ్లికొడుకు సత్యవతమ్మ తమ్ముడు న్యాయమూర్తి. అతనికిది రెండవ పెండ్లి. అతను ఇంజనీరింగు చదవడానికి రెండు నెలల్లో ఇంగ్లాండు వెళతాడు. పెండ్లిరోజు పద్మావతి సిగ్గుతో తలవంచుకుంది. వాళ్ళు బలవంతం చేసి పెండ్లి చేస్తున్నారని రాధ అనుమానం. ముక్కూ మొహం తెలియని ఎవరికో ఇచ్చేబదులు చిన్నప్పటి నుంచీ ఆడుతూపాడుతూ కాలం గడిపిన తన కివ్వవచ్చును గదా అని రాధ అనుకునేవాడు. అందుకనే పెండ్లిలో ఆమెకు దగ్గరగా వుండేవాడు. అయితే పద్మావతికి పెండ్లి చాలా సంతోషంగా వుంది మరొక వైపు గర్వం.

పెండ్లి అయిపోయింది. పద్మావతి గర్వం పోయింది. ఆమె భర్తను రాధ మిగిలిన కుర్రవాళ్ళూ ఎక్కిరించేవారు ఆమె వాళ్ళను కసురుకునేది. రెండు నెలల తర్వాత పద్మావతి, సత్యవతమ్మ కుటుంబం మద్రాసు వెళ్ళిపోవడానికి నిశ్చయించుకున్నారు. రాధకు దిగులేసింది. ఆ మధ్యాహ్నం పద్మావతీ రాధలు జామచెట్టు క్రింద కూచొని కబుర్లు చెప్పుకున్నారు. ఎప్పుడైనా మద్రాసు రమ్మని పద్మావతి రాధను పిలిచింది. నిన్నెప్పుడూ మర్చిపోలేనని రాధ అన్నాడు. ఆమె కోసం తన జుత్తు కత్తిరించి ఆమె ముందుపడేశాడు. ఆమె పెద్దపెట్టున నవ్వింది.

పిల్లలతో సత్యవతమ్మ మదరాసు వెళ్ళిపోయింది. రాధకు కొద్దిరోజులు ఏమీ తోచలేదు. ఆతోటలో మళ్లీ అడుగుపెట్టలేదు. పద్మావతి దగ్గరకు వెళ్ళినట్లు ఆమె స్టేషనులోనే కనపడ్డట్టూ అక్కడే ఆడుకున్నట్లు కలలు వచ్చేవి. ఆమెతో ఆడినవి, ఆడనివి బళ్ళో స్నేహితులతో కథలుగా చెప్పేవాడు.

రాధాకృష్ణకు పెండ్లి సంబంధం వచ్చింది. పెద్దకట్నం యిస్తామన్నారు. వాళ్ళమ్మ పట్టుబట్టింది పెండ్లి చేయాలని. బి.ఎ పూర్తయితేగాని చేయనన్నాడు వాళ్ళనాన్న. 'గడ్డాలు మీసాలు వచ్చిన తర్వాత ఏం పెండ్లిరా నామనమడిపెండ్లి నాకళ్ళముందరే చేయ'మని వాళ్ళమ్మమ్మ ఏడ్చిగోల చేసింది. అయినా వాళ్ళ నాన్నగారు లొంగలేదు.

ఏడేళ్ళు గడిచిపోయాయి, రాధ బి.ఎ పరీక్ష వ్రాయడానికి మద్రాసు వెళ్ళి ఎండాకాలం శలవులకు ఇంటికి వచ్చాడు. చదువుకోడానికి ఏలూరు వెళ్ళిన తర్వాత పద్మావతి గుర్తుకు రాలేదు. కొత్త స్కూలు, కొత్త వాతావరణం. శలవులలో యింటికి వచ్చినపుడు మాత్రం పద్మావతి గుర్తుకు వచ్చేది. రాధవాళ్ళమ్మ చనిపోయింది. నాన్నగారు పింఛను పుచ్చుకొని సుందరవరంలో స్థిరపడ్డారు.

బి.ఎ పూర్తయిన తర్వాత ఏం చేయాలా? అని రాధ ఆలోచించాడు. ప్రభుత్వోద్యోగం చేయటం బానిసత్వం అనిపించింది. దేశోపకారం చేసి తిలక్, గోఖలేవలె పేరు తెచ్చుకోవాలనిపించింది. పెండ్లి గురించిన ఊహేలేదు.

ఆడపిల్లలను చూస్తే అందం గుర్తుకువచ్చేది ఒకరోజు సానివాడకు వెళ్ళాడు గుమ్మంలో ముసలామెతో మాట్లాడి తిరిగి వచ్చేశాడు. మరోసారి పడవలో వెడుతూవుంటే ఒక చిన్నది తటస్థపడింది ఆమె దిగిన చోటనే తానూ దిగి పదిమైళ్ళు నడిచివెళ్ళి ఆరోజంతా ఆమెయింటి చుట్టూ తిరిగాడు ఇంకోసారి పెండ్లిలో మరొక పెద్దావిడతో పరిచయం యేర్పడింది. ఆచీకటి రాత్రిలో ముద్దులు పెట్టుకున్నారు. ఇంతలో భర్తకనపడితే ఆమె వెళ్ళిపోయింది. ఇలా ఎన్నో సంగతులు

మదరాసు వెళ్ళినపుడు పద్మావతి అన్నలు కనిపించారు పద్మావతి సత్యవతమ్మ సుందరవరంలోనే వున్నారని చెప్పారు షోకుచేసుకొని సుందరవరం వెళ్ళాడు క్రాఫింగుజుట్టు చిన్న మీసాలు, చలించే కళ్ళు-రాదను చూస్తే ముద్దోస్తోంది సత్యవతమ్మ రాదను ఆదరంగా కూర్చోబెట్టి మాట్లాడింది బాగా ఎదిగావే అనీ, పద్మావతి గుర్తుపట్టలేక పోవచ్చుననీ ఆమె పొగిడింది పెద్దన్నయ్య వెనకాల గంధర్వ కన్యలా చేతిలో పూలకొమ్మ ఆడిస్తూ పద్మావతి వచ్చింది

పద్మావతి పెద్దతనం తెచ్చుకొని ఇంగ్లీషులో అందరితో తొణుకుబెణుకు లేకుండా మాట్లాడుతోంది రాదను చూసి చిరునవ్వునవ్వింది అదొక హృదయానుబవం! ఆమె శరీరంలో, వస్త్రదారణలో చాలా మార్పు వచ్చింది. సిగ్గుపడి పరుగెత్తలేదు సరిగదా రాణిలా దగ్గరకు వచ్చి పరవశించేలా, బిడియపడేలా మాట్లాడింది చిన్నతనంలో కొంటె పద్మావతి కాదిప్పుడు. ఏడేళ్లు గడిచిపోయాయి ఆమెను స్వేచ్చగా తిరగనిచ్చినందుకు సత్యవతమ్మపై కోపం వచ్చింది.

పద్మావతి నడిగితే మాఅమ్మకు ఆపట్టింపు లేదంది నేను ఆమె మాటకు లోబడక తిరుగుతున్నానంది అనుబవించేది మరొకరుగదా అని ఆమె సరిపెట్టుకొని వుండవచ్చు. మర్నాడు తోటలో జాజి పందిరి కిందకు చేరారు వాళ్లు అక్కడచేరేసరికి పాతజ్ఞాపకాలు గుర్తుకోచ్చాయి చనువుగా మాట్లాడకున్నారు నవ్వుకున్నారు తోటంతా కలియతిరిగారు

ఆ ఎండాకాలమంతా రాధ యవ్వనం పద్మావతితో నిండి పోయింది. ఆమె కనబడకపోతే గిలగిలలాడేవాడు. కలలో కనిపించేది. ఒకళ్ళకొకళ్ళు పెనవేసుకుపోయారు. పద్మావతి భర్త న్యాయమూర్తి ఇంకా ఆ దేశంనుంచి రాలేదు. సత్యవతమ్మ వ్యాజ్యాల వ్యవహారాలలో వూపిరి సలపనంతగా తిరుగుతోంది. పగలు అన్నలిద్దరూ బయటకు వెళ్ళేవారు. సత్యవతమ్మ మధ్యాహ్నాలు నిద్రబోయేది. రాధా పద్మావతులు ఒంటరిగా కూర్చొని ఒకనొకరు చూసుకుంటూ ఏవో మాట్లాడుకునేవారు. కొన్నాళ్ళకు సుదర్శనం వాళ్ళు వాళ్ళిద్దరినీ వదిలి దూరంగా వెళ్ళిపోయేవారు.

ఒక రోజు మధ్యాహ్నం ఆ ఎండాకాలంలో వానకురిసి వెలిసింది. ఆహ్లాదరకమైన వాతావరణం అది. అప్రయత్నంగా ఆమె మీద చేతులు వేశాడు. పెదవులు వాటంతటవి కలుసుకున్నాయి అదీ వాళ్ళ ప్రేమకు మొదలు.

పద్మావతి తెల్లని చర్మం క్రింది ఎఱ్ఱని సౌందర్య ప్రవాహం వరదలు కట్టినట్లు వుండేది. కనురెప్పల్లో అరక్షణ వుండేది. ఆమె ఆత్మ ఔన్నత్యాన్ని ఆమె శరీరంలోంచి, కళ్ళ·లోంచి, మాటలోంచి అతడు చూశాడు. ఇద్దరూ సమానుల్లా ప్రవర్తించారు. ఆమె అంటే అతనికి గౌరవం. గాలినీ ఎండనూ అనుభవించడం ఎంత సహజమో పద్మావతిని అతడు ప్రేమించటం కూడా అంత సహజం. పద్మావతి అతని కంటె తెలివి గలది. ఆమె విశాలమైన జ్ఞానాన్ని సంపాదించింది. ఒకళ్ళ నొకళ్ళు వేళాకోళాలు చేసుకునేవారు. అనేక సంగతులు మాట్లాడుకునేవారు. మతం, దేవుడు, పుణ్య పాపాలు, తలవ్రాత ఇలా ఎన్నో విషయాలు మాట్లాడుకున్నారు. ముద్దులు పెట్టుకున్నారు.

తాను చేయబోయే ఘనకార్యాలను గురించి అతడు మాటాడేవాడు. ఆమె చమత్కారంగా తన గురించి చెప్పేదికాదు. ఒక రోజు ఆమె భర్త నుంచి ఉత్తరం వచ్చింది. అది చదివి చెప్పింది. 'ఆయన ఏవో గొప్ప పరీక్షలు పాసై వస్తున్నాడట. నీవు కూడా గొప్పవాడివౌతావు కదా' అంది.

తాను ఉద్యోగం చేసి బానిసను మాత్రం కానని రాధ అన్నాడు. తాను గొప్పపనులు చేసి ఆమె మెప్పు పొందుతానని అన్నాడు.

తానెక్కడ వున్నా రాధ గొప్పతనం విని పొంగిపోవాలనీ, ఆదర్శవంతుడు కావాలనీ ఉబుసుపోక ఉపన్యాసాలు చెబితే లాభం లేదనీ పద్మావతి తీవ్రంగా చెప్పింది. పద్మావతి కోసం తానేదైనా చేస్తానని అతడు హామీ యిచ్చాడు. స్త్రీలు పురుషుల ఆదర్శాలకు ఉత్సాహం ఇవ్వాలని కోరాడు. ఆమె అతనికి దైవమిచ్చిన పద్మావతి అనుకున్నాడు. మూడునెలలు గడిచాయి. పద్మావతి సత్యవతమ్మ మదరాసు వెళ్ళారు. అతనికి బ్రతుకే కష్టమైపోయింది. లోకం అంధకార బంధురమైంది.

చివరకు రాధాకృష్ణ సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీలో చేరాలని పూనా వెళ్ళి రెండేళ్ళు ఉన్నాడు. ఇంతలో వాళ్ళ నాన్నగారికి జబ్బు చేస్తే యింటికి తిరిగి వచ్చాడు. అక్కడ తోట చూస్తే పద్మావతి గుర్తుకొచ్చింది. పిచ్చెత్తినట్లైంది.

ఒకరాత్రి పద్మావతి వాళ్ళు వచ్చారు. ఆమెను కలవకుండా వుండలేక పోయాడు. సత్యవతమ్మ యధా ప్రకారం ఆప్యాయంగా పలకరించింది. ఇంటినిండా బంధువులున్నారు. పద్మావతి కనిపించలేదు. సుదర్శనం కనిపిస్తే పద్మావతిని గూర్చి అడిగాడు. లోపల బావగారితో వుందని చెప్పి భోజనానికి వుండమన్నాడు.

భోజనం దగ్గర న్యాయమూర్తి, పద్మావతి కనిపించారు. తనను మరిచి పోయినట్లుగా ప్రవర్తిస్తోంది. భర్త తప్ప లోకంలో ఇంకెవరూ లేనట్లు కనిపిస్తోంది. రాధకు ఆ రాత్రి నిద్ర లేదు.

మర్నాడు సాయంత్రం మళ్ళీ వాళ్ళింటికి వెళ్ళాడు. న్యాయమూర్తి టెన్నిస్ ఆడుతుంటే పద్మావతి చూస్తోంది. రాధాకృష్ణను సుదర్శనం బావగారికి పరిచయం చేశాడు. పద్మావతి ఏదో మాట్లాడబోతే భర్త అడ్డు పడ్డాడు. పద్మావతి ప్రవర్తన రాధకు కోపం తెప్పించింది. తనను మర్చిపోయిందనీ మోసం చేసిందనీ చాలా ఉద్రేకంగా వుంది. భర్తను సంతోషపెట్టాలని ప్రయత్నిస్తున్నట్లు కనబడుతోంది. అతను పట్టుదల మనిషిలా కనబడుతున్నాడు. అక్కడ వుండటానికి బుద్ధి పుట్టక రాధ తోటలో చీకట్లో చెట్లలో, పొదల్లో

తిరిగాడు చలిలో కూర్చున్నాడు పద్మావతిని ఎలానైనా లాక్కోవాలని దృఢనిశ్చయం చేసుకున్నాడు

మూడు, నాలుగు రోజులు కాలు నిలువకుండా తిరిగాడు పద్మావతి ఒక్కతెగా ఎప్పుడూ కనిపించలేదు నిలువలేక ఐదవరోజు వెళ్ళాడు రాదను చూసి ఆమె భర్త పక్కకు వెళ్ళాడు అన్నలను వదిలి పద్మావతి రాద దగ్గరకు వచ్చింది 'మునపటిలా లేవు ఏమి'అని అడిగాడు రాద ఇప్పుడు పరిస్థితి మారిపోయిందని, ఎన్నో సంగతులు మాట్లాడుకోవాలనీ తెల్లారి తోట వెనక యింటికి 5 గంటలకు రమ్మని సంకేతంగా చెప్పింది

శ్రావణమాసంలో ఉదయాలు పద్మావతిని గుర్తుకు తెస్తున్నాయి చీకటి మసకలో తెల్లగా ఉషాదేవి వలె అతని దగ్గరకు నడచివచ్చేది పద్మావతి వారి మాటల్లో ఎన్నోవూసులు వచ్చాయి ఇద్దరూ ముద్దులు పెట్టుకున్నారు తాను సాహసించి ఈ రాజుకోసం వచ్చిన రాజకన్యనని చెప్పింది నీవే నా రాజువంది రాచకన్యకోసం తాను లోకాలు జయిస్తానన్నాడు లోకాన్ని ఏదేదో చేస్తానన్నాడు బుజం చుట్టూ చేయి వేసి కళ్ళలోకి చూస్తూ అతను చెప్పిందంతా వింది పొద్దెక్కిన తర్వాత పద్మావతి వచ్చినట్లే మాయమైంది

ఇంకో రోజు ఉదయాన సన్నని వాన కురిసి వెలిసింది లోకమంతా కొత్తగా వుంది న్యాయమూర్తిని వదిలేసి తనతో వుండిపొమ్మని పద్మావతిని అడగాలని రాద నిశ్చయించు కొని వచ్చాడు కానీ తనలో తాను ఆలోచించ సాగాడు పద్మావతిని ఎలా పోషించాలి పెళ్ళైన పిల్లను లేవదీసుకొని వస్తే తన తండ్రి యింట్లో అడుగు పెట్టనిస్తాడా? మూడేళ్ళు పద్మావతి న్యాయమూర్తి దగ్గరకు వెళ్ళకుండా వుంటే బాగుణ్ణు యవ్వనోత్సాహంతో వున్న తన దగ్గరకు పద్మావతి రావడానికి కష్టమేముంటుంది భర్త చాటున వుండే పిల్ల తన దగ్గరకు రాగలదా! ఎవరేమనుకున్నా బాధలు కలిగినా ప్రేమ కోసం బంధువులను సంమాన్ని వదలడానికి తాను సిద్ధంగా వున్నాడు పద్మావతి అలా చేయడానికి జంకుతుందేమో పిరికివాళ్ళ వలె ప్రేమను పోగొట్టుకోవడం దర్మం కాదనుకున్నాడు పద్మావతి తనకు కావాలి ఆమె తన సొంతం

పద్మావతిని అడిగాడు. 'నీవెవరిదానివి?' అని. 'నేను నాదాన్నిగా వుంటానని ఒకరిదాన్ని కావటం ఇష్టం లేదని, నా బ్రతుకు నేను బ్రతుకు తాను నీ పని నీవు చూసుకోమని, ప్రేమ వుంటుందని ప్రేమ పేరు పెట్టి ఎక్కడకో ఎత్తుకు పోవడానికి చూడవద్దని' నిష్కర్షగా చెప్పింది. మరి న్యాయమూర్తి సంగతేమిటి? ఆయన దగ్గరకు ఆమె వెళ్ళదా? ప్రేమ లేకపోయినా భర్త దగ్గర సేవలు చేస్తుంటుందా? ఆ ఆలోచనలతో రాధకు హృదయకంపము వచ్చింది. పద్మావతి సౌఖ్యం కలుగజేస్తూ ప్రేమిస్తుంటానని తనతో వుంటే చాలునని రాధ చెప్పాడు ఆమె అందుకు అంగీకరించలేదు. తన కోసం అతడు అన్నీ వదలుకోవలసిన అవసరం లేదంది. అది ప్రేమికులు చేసే పని కాదంది.

ఎవరికీ తెలియకుంది రావడం తన కిష్టమేననీ, ఇలానే ఎప్పుడూ ఉంటాననీ, తన మీద అధికారం ఎవరికీ యివ్వడం యిష్టం లేదనీ పద్మావతి ఖండితంగా చెప్పింది. ప్రేమ అంటే తన అభిప్రాయాలను తెలియజేసింది.

ప్రేమగలవాళ్ళు తనని ఏం చేసినా ఊరుకోవడం కాదు. తనను ఉపయోగించుకొని, అసహ్యాపెట్టి, కావలసినపుడు దౌర్జన్య చేయడం కాదు. తాను ఎల్లప్పుడూ నూతనంగా విచిత్రంగా అద్భుతంగా కనిపించాలి. తన సౌందర్యాన్ని చూసి భ్రమపడాలి. ఎప్పుడూ నిత్యనూతనంగా ఉండాలి. లోకం సంగతి తనకు తెలియదు. ప్రేమ అంటే ఏడుస్తారెందుకు? ప్రేమని చంపుకోవడమెందుకు - ఇది పద్మావతి భావన.

వారం రోజుల తర్వాత పద్మావతి వద్ద నుండి రాధకు చీటీ వచ్చింది. తాను హైదరాబాదు వెళ్తున్నాననీ, రాత్రి 11 గంటలకు గులాబితోటలో కలుసుకోమనీ వ్రాసింది.

పద్మావతి సాహసంగా వచ్చింది. ఇక మళ్ళీ కలుసుకోవేమేమో, మన యిష్టం వచ్చినట్లు అనుభవిద్దామంది. ఆమె అందాన్ని చూస్తే రాధకు మతిపోతోంది. ప్రేమ అగ్ని భగ్గు మంటోంది. అర్థరాత్రి తన కోసం మేడమీద నుంచి దూకి వచ్చిన సాహసం ఆత్రుత తలచుకొంటూ పరవశించాడు

రాధ. మళ్ళీ ఇంకెప్పుడూ ఇలా సంతోషంగా కలిసి వుండలేమంది అందరూ నిద్రపోతున్న ఈ సంయంలో దగ్గిరగా కలిసిపోదామని పిలిచింది.

ఆ వెన్నెలలో మధురమైన ఆ ఊపిరిలో రాధ సమస్తమూ మరిచిపోయాడు. అది అతని జీవితంలోనే అందమైన రాత్రి లోకాన్ని మరచి పోయి సంఘాన్ని, మతాన్నీ, మర్యాదలను వదలుకొన్నారు. ప్రేమ పువ్వులలో ప్రతిధ్వనించి వాసనలు రేపింది. మాటలు రావడంలేదు. నరాలు వీణ తీగలవలే సంగీతభారంతో ఒణుకుతున్నాయి.

పసిపిల్లలా అమాయకంగా వారిద్దరూ ప్రవర్తించారు. ముద్దులు, మరిపెములతో రాత్రి గడిపారు. ఆ రాత్రి అనుభవించిన తర్వాత ఏమైనా ఫర్వాలేదనుకొన్నారు.

రాధ యిల్లు చేరుకొనే సరికి తెల్లవారుఝామున మూడైంది. వెన్నెలను వదలలేక యింటిమెట్లమీద పడుకున్నాడు.

తెల్లవారింతర్వాత తలుపు తెరిస్తే లోపల గదిలోకి వెళ్ళి పడ్డాడు.

పద్మావతి హైదరాబాదు నుండి మదరాసు వెడుతున్నాని వ్రాసింది. న్యాయమూర్తితో కాపురం చేయడానికి వెళ్తోంది. రాధ మదరాసు వెంటనే వెళ్ళి ఆమె అన్న సుదర్శనాన్ని కలిసి ఆ విషయమే అడిగాడు. పద్మావతి న్యాయమూర్తితో కాపురం చేయడానికి వస్తోందని అతడు నిర్ధారించాడు.

రాధ పద్మావతికి జాబు వ్రాస్తే నిజమేనని వ్రాసింది. ప్రతి రోజూ దూకుడు ఉత్తరాలు చాలా వ్రాశాడు. పద్మావతి మద్రాను వచ్చింది. ఉత్తరాలు మాత్రం రాధ వ్రాస్తూనే ఉన్నాడు. స్త్రీ జాతిని ద్వేషించాడు. వాటికి సమాధానాలు వ్రాసింది.

ఒకానొక రోజు తేనాంపేటతోటలో సంకేత ప్రకారం వాళ్ళిద్దరూ కలుసుకొన్నారు. రాధకు కోపం తారాస్థాయినందుకొంది. కసురుతూ మాట్లాడాడు. పద్మావతి ఇబ్బంది ఏమిటో అతనికి తెలీదు. ఒక హిందూ స్త్రీ వివాహానంతరం భర్త దగ్గరకు కాపురానికి వెళ్ళకుండా వుంటుందా? సంఘాన్నీ, తనవాళ్ళను కాదని వస్తుందా? అయినా పద్మావతి మీద అతనికి

అసహ్యం వేసింది. కాని ఆ తర్వాత అతనికి తెలిసింది - పద్మావతి ఎంతో యోచించింది. న్యాయమూర్తి దగ్గరకు వెళ్ళడమే మంచిదని నిశ్చయించుకుంది. ఆ రోజు అలా తోటలోకి వచ్చినందుకు సందేహిస్తూనే ఉంది. అయినా మనసు విప్పి నిర్మలంగా నిష్కపటంగా మాట్లాడింది. మనస్ఫూర్తిగా రాధను ప్రేమిస్తున్నాననీ, అతణ్ణి పెళ్ళి చేసుకోలేదు గాబట్టి న్యాయమూర్తి దగ్గరకు వెళ్ళాల్సిందేనంది.

రాధతో తనతో ఉండిపొమ్మన్నాడు. ఎక్కడికైనా దూరంగా వెళ్ళిపోదామన్నాడు. అలా పెళ్ళి అయినవాళ్ళు ఎందరో చేశారన్నాడు.

సరే. ఎక్కడికెళ్తాం, ఎలా బ్రతుకుతాం చెప్పమని అడిగింది పద్మావతి. డబ్బులేకున్నా సంఘంలో వెలివేస్తారంది. ప్రేమ అనుభవించడానికి సమయం ఉండదు. తెల్లవారింది మొదలు ఆందోళన, విచారము, తాపత్రయం తప్ప మరేమీ ఉండదని చెప్పింది.

మనం ఒకర్నొకరు ప్రేమించుకొంటే చాలుననీ, కష్టాలలో ప్రేమ మధుర్యాన్ని చవిచూసి అనురాగం వృద్ధిపొందిద్దామన్నాడు రాధ. ఇన్నాళ్ళు తాము కలలు కంటున్న ఆనందాన్ని పాడుచేసుకోవడం పిరికితనమన్నాడు. ఇద్దరం కలిసి వెళ్ళిపోయి అన్ని కష్టాలు భరిద్దామన్నాడు. ఒకటే గోల అతనిది.

పద్మావతి నిదానంగా సమాధానం చెప్పింది : పుస్తకాల్లో చదివే ప్రేమవేరు, తమ ప్రేమ వేరు. ఎవరూ లేకుండా ఒంటరిగా ఎన్నాళ్ళు ఉండగలరు? ప్రేమికులకు పెళ్ళి అయిందని పుస్తకాల్లో కథ ముగిస్తారు.

ఆ తర్వాత ఏమైందీ చెప్పరు. ప్రేమ అనేది యవ్వన కామజనితమైన భ్రమ. తాను రాధకు భార్యగా వస్తే ఒక నెలలో ప్రేమ మాయమైపోతుంది. ఇద్దరూ పోట్లాడుకోవడం మొదలెడతారు. తాను మాటలు పడలేదు. బాధలు ఎక్కువవుతాయి. తాను దాసీగా పడివుండాలి. ఇలానే వుండిపోతే తాను హృదయేశ్వరిగా మిగిలిపోతుంది.

న్యాయమూర్తికి దాసివి కావడం లేదా? అని అడిగాడు రాధ.

న్యాయమూర్తికి తాను దాసిని ఎన్నటికీ కాదనీ, వాళ్ళిద్దరికీ మధ్య నౌకర్లు గదులు ఎంతో ఎడం ఉందనీ, అతని మీద ప్రేమ లేదు గాబట్టి అది పోతుందనీ భయం లేదని చెప్పింది పద్మావతి. తన స్వేచ్ఛకు భంగం కలిగించనని న్యాయముర్తి అంగీకరించాడని పలికింది. కాపురానికి వెళ్ళకుండా వుంటే లోకంలో అప్రతిష్ఠ. తనను నలుగురికీ భార్యగా చూపి గొప్పలు చెప్పుకోవడం అతనికి కులాసా. అంతకుమించి అతనికేమీ అక్కరలేదు. పిల్లల్ని కననవసరం లేదు.

రాధ అందుకంగీకరించలేదు. ఇప్పుడలా ఉన్నా ఆ తర్వాత అతనిలో ఆ ఆశ కలగవచ్చునన్నాడు. అసలు తనతో రానంటావని అలా అనివుంటా వన్నాడు.

పద్మావతి అతని మాటలు తిరస్కరించింది. రాధవలే అంతా నాకే కావాలి, మింగేస్తాననే రకం కాదని హెచ్చరించింది. తాము విడిపోవడం లేదనీ, మాట్లాడు కొంటూ సంతుష్టిగా ఉందామంది. కావలసినంత సంతోషాన్ని ఇస్తానంది. ఈ విధంగా ఎక్కడికో ఎత్తుకపోతే తప్ప ప్రేమ వుండదా? అని అడిగింది.

తనకు పద్మావతిని ఎవరో దూరం చేస్తూన్నట్లుగా బాధపడ్డాడు రాధ.

భర్త దగ్గరకు వెళ్ళడం వల్ల రాధను వొదులు కోవడం లేదనీ, అలా అయితే ఒప్పుకొనేదాన్ని కాదనీ, రాధతో ఎక్కడికో వెళ్తే ఉపయోగమేమీ లేదనీ చెప్పింది. తనతో వాగ్దానం చేసినట్లుగా దేశ సేవకు వెళ్ళమనీ ఉద్బోధించింది. అలా చేస్తే లోకోపకారమనీ, కేవలం భార్యాపోషకుడుగా ఉండిపోవడం ఇష్టంలేదనీ చెప్పింది.

న్యాయమూర్తి దగ్గరకు వెళ్ళకుండా నిలిచిపోతే మూడేళ్ళలో తాను ధనము గౌరవమూ సంపాదించి వస్తానని రాధ ప్రాధేయపడ్డాడు.

పద్మావతి తన వాదన వినిపించింది : అతనిలాగే తనకూ గొప్పదాన్ని కావాలని వుంటుంది. తన సౌందర్యారాధకుడుగా అతడు ఎదగాలి. కేవలం

వంటమనిషిగా ఉండిపోవడం ఇష్టం లేదు. పెళ్ళాం పిల్లలకోసం మగాడు బ్రతకడం నీచం. అతడామెకు బానిస. తాను చెప్పినట్లు మూడేళ్ళు తాను సన్యాసం పుచ్చుకోలేననీ, భర్త దగ్గరకు వెళ్ళకుండా వెధవముండలా ఉండలేనంది నిరంతరం తన మీద ఆధారపడి వుంటే తల్లి కూడా గౌరవంగా చూడదు.

ఇలా ఎంతో సేపు మాట్లాడుకున్నారు. అలా రోడ్డు మీదికి వచ్చి ఇంకా మాట్లాడుకుంటున్నారు. పెంకితనంతో ఇద్దరి జీవితాలు పాడు చేయవద్దని రాధకోరాడు. పూర్వస్మృతులు గుర్తుకు తెచ్చాడు. అలా చేయడం ధర్మంకాదనీ, అలా వెళ్ళిపోవడం తనకూ సంతోషంగా లేదనీ, అక్కడికి వెళ్ళిన తర్వాత అతని బాధను చూస్తూ ఏదో బుద్ధితక్కువ పని చేస్తాననీ అందువల్ల తన నిశ్చయాన్ని గందరగోళ పెట్ట వద్దని బ్రతిమాలింది పద్మావతి.

మదరాసులోనే రాధ వుండిపోయాడు. పద్మావతికి అసహ్యంగా ఉత్తరాలు వ్రాశాడు. తనను కావాలని వలలో వేసుకొని, డబ్బుకాశపడి చివరకు తనను తోసేసిందని వ్రాశాడు. ఆమెను వాళ్ళ యింట్లో చూడటానికి రెండుసార్లు ప్రయత్నించాడు కాని వీలైంది కాదు. ప్రేమ పిచ్చిలో వొళ్ళు తెలియని వ్యక్తికి తానెం చేస్తున్నాడో ఎలా తెలుస్తుంది? ఎన్ని అవమానాలైనా పడటానికి సిద్ధపడ్డాడు. జీవితంపై ఆశ నశించింది.

పద్మావతి తనకు కాకుండా మరొకరిదైనదనే బాధ అధికమైంది. పద్మావతి సంతోషం కంటె ఆమె తనది కావాలని కోరిక. ఆమె తనదైతే ఆమెకు జీవనమంతా ఇస్తాడు. ఎంత సేవ అయినా చేస్తాడు. లేకపోతే ప్రేమ ద్వేషంగా మారుతుంది. న్యాయమూర్తి అదే యింట్లో వుంటూ ఒకే గాలిని పీలుస్తున్నదుంకు అతని హృదయం రాత్రింబవళ్ళు దహించుకుపోతోంది.

మదరాసు వదలడానికి బుద్ధిపుట్టలేదు. పద్మావతి పశ్చాత్తాపపడి ఎప్పుడైనా తన వద్దకు వస్తుందని ఎదురు చూస్తున్నాడు. మతిస్థిమితం లేకుండా పట్నం వీధులన్నీ తిరిగాడు. ఏం చేస్తున్నాడో తెలియదు ఎక్కడైనా పెళ్ళి మండపం చూస్తే పైశాచికంగా కనిపించింది. మద్యపానం చెయ్యాలని మనసు

పుట్టిందిగాని మళ్ళీ అణచుకొన్నాడు. ఇంకో రోజు ఎవరో అమ్మాయి కనబడితే ఆమెకు దగ్గరయ్యాడు. ఆమెను పెళ్ళి చేసుకోవాలనుకొన్నాడు. మళ్ళీ ఎలానో బయట పడ్డాడు.

ఇంటి కెళ్ళేసరికి రాధకు వాళ్ళ నాన్న పంపిన టెలిగ్రాం వచ్చింది. తక్షణం ఇంటికి రమ్మని వ్రాశారు. మధ్యాహ్నానికి వూరికెళ్ళాడు. తెల్లారేసరికి పెళ్ళి జరిగిపోయింది. ఎవరితో ఎలా జరిగిందో తెలియదు. అతడు ఈ లోకంలో లేడు. తన తండ్రిపై దయ గలిగింది.

పెళ్ళి వద్దని మొండిపట్టు బట్టి ఆయన మనస్సు కష్టపెట్ట లేక పోయాడు. తన ఇంటి అడ్రసుకు తనకు వచ్చిన ఉత్తరాలు మార్నాడు అందించారు. గోఖలేగారు ఇంగ్లండు వెళుతూ రాధను కూడా రమ్మని వ్రాశారు. వొస్తున్నాని టెలిగ్రాం ఇచ్చాడు రాధ.

పద్మావతి తానెక్కడికి వెళ్ళగూడదని రాధ చేత వాగ్దానం చేయించుకుంది. అయినా ఆమెను చూడటం అతనికి దుర్భరమైంది. పద్మావతికీ, తనకు ఎలాంటి సంబంధంలేదు. ఆ సంగతులన్నీ మరిచి పోతే మంచిదనుకొన్నాడు.

రాధ ఐదేళ్ళు ఇంగ్లండులో ఉండి భారతదేశం తిరిగివచ్చాడు. గోఖలేగారి అధ్యక్షతకింద తాను చేసి పనులు వార్తాపత్రికలో బాగా వచ్చాయి. గౌరవం, పైరు ప్రతిష్ఠలు పెరిగాయి. దేశోపకారానికి జీవితం వినియోగించాలని దృఢ నిశ్చయం చేసుకొని మన దేశంలో అడుగుపెట్టాడు. పాతచరిత్రముగిసి పోయింది. కీర్తి, మర్యాద వల్ల సంతుష్టి కలిగింది.

మదరాసులోని రాధ స్నేహితులు ఒక సభ ఏర్పాటు చేసి ఇంగ్లండు అనుభవాలు చెప్పమన్నారు. ఆ సభకు వచ్చి తలవొంచుకొని కూచొని వుంది పద్మావతి. ఉపన్యాసం అయిపోగానే ఆమె దగ్గరకెళ్ళి మెల్లగా పలకరించాడు.

రాధ చేసిన దేశసేవకు, సంపాదించిన కీర్తి ప్రతిష్ఠలకు తనకెంతో ఆనందాన్ని యిచ్చాయంది. తనకు ఉత్తరమన్నా వ్రాయకుండా రాధ ఇంగ్లండు

వెళ్ళి పోయినందుకు కారణం అడిగింది. ఇంత గొప్పవాడివవుతావని చిన్నప్పుడు అనుకోలేదంది. తన చిరునామా యిచ్చి ఒకసారి వచ్చి చూడమనీ, యింతకు ముందువలెగాక ఇప్పుడు పెద్దవాడివయ్యావుగాబట్టి రాలేవేమోనని అనుమానంగా అడిగింది.

తీరక ఐదురోజులదాకా వాళ్ళయింటికి వెళ్ళలేక పోయాడు ఆ రోజు వెళితే పద్మావతి భర్తతో కలిసి కలకత్తా వెళ్ళిందని చెప్పారు. కలుసుకుందామని ఎంతో ఆశగా వెళితే ఆమె వెళ్ళిపోవడం విచారంగా వుంది. ఐనా చిన్నప్పటి సంగతులు జ్ఞాపకానికి వచ్చాయి.

పద్మావతి తనను మరచిపోలేదు. రాధ వచ్చాడని తెలియగానే ఆ మీటింగుకు వచ్చిందికదా! తనపనిలో బడి తాను పద్మావతిని మరచిపోయాడు. ఐదేళ్ళ తర్వాత కూడా ఆమెకు ఇంకా పాతప్రేమ వుందా అనిపించింది. ఆమె దగ్గరగా కూర్చుని ఎన్నో విషయాలు చెప్దామనికున్నాడు.

ఇలా ఆలోచిస్తుంటే రాధ చేతులో నౌకరు ఒక ఉత్తరం పెట్టాడు. అందులో సారాంశం యిది. గోపాలం అనే ఆయన వ్రాశాడు. తానూ వాళ్ళ అమ్మాయి ఇవాళ వచ్చారు. సంగతులు మాట్లాడుకోవడానికి తమ యింటికి ఒకసారి రమ్మని వ్రాశాడు. రాధకు గుర్తు రాలేదు. మర్నాడు వాళ్ళింటికి వెళ్ళాడు. గోపాలం అనే ముసలాయన ఇంట్లో నుంచి 16 ఏళ్ళ అమ్మాయిని తీసుకు వచ్చాడు. తెల్లని చీర కట్టుకున్న ఆమె పొడుగ్గా సన్నగా వుంది. కోల కళ్ళు పొడుగాటి ముక్కు, చామన ఛాయ, తలలో నాగరం బిళ్ళ. ఆమెను చూడగానే రాధ కూచోండమ్మా అన్నాడు. ఆమె ఒణికి పోయింది. అమ్మాయి విషయం మాట్లాడి పోదామని వచ్చామని ఆమె రాధ భార్య అని గోపాలం నెమ్మదిగా చెప్పాడు.

అప్పటికి గానీ తనకు పెండ్లయినట్లు రాధకు గుర్తురాలేదు. మర్చిపోయి యింగ్లండులో పెండ్లి కాలేదనే చెప్పేవాడు. ఇప్పటివరకూ ఆమె సంగతి ఒక్కసారి కూడా తలచుకోలేదు. పెండ్లిరోజు పురోహితుడు చెప్పిన మంత్రాలతో తనకు శాశ్వతంగా ఒక వ్యక్తితో ముడి పడిందనీ, అనుబంధం

వదుల్చుకోవడం అంత సులభం కాదనీ అనిపించింది. గోపాలం మాత్రం మిమ్మల్ని యిదర్నీ ఒకటి చేసి వెడదామని వచ్చానన్నాడు. అలా బలవంతం చేసి ఇద్దరినీ ఒక గదిలో పెట్టడం తనకసహ్యం వేస్తుందని రాధ అన్నాడు. ఇష్టం లేకుండా అలాంటి పనికి పశువులు కూడా ఒప్పుకోవు అన్నాడు. ఇప్పటి వరకూ ఆ అమ్మాయి ఎలాంటిదో తనకు తెలియదన్నాడు. ముసలాయనకు ఒళ్ళుమండింది.

కావలిస్తే తమవూరు వచ్చి ఆమె గురించి భోగట్టా చేయమన్నాడు. కంటికి నిద్రలేకుండా కాపాడానన్నాడు.

ఆమె గుణగణాల గురించి తాను అడగటం లేదనీ, ఇద్దరి మనసులూ కలుస్తాయో లేదోననీ వివరించాడు రాధ.

ఈ ఆలోచనలన్నీ పెండ్లి కాకముందు రావాలన్నాడు. ఇన్నాళ్ళూ పిల్లను పుట్టింట్లో వదిలి ఎందుకు వెళ్ళారన్నాడు. తండ్రి చాటున కూచుని ఆమె ఇద్దరి మాటలూ వింటోంది. ఎదిగిన పిల్లను తీసికొని తాను భిక్షార్థినై వచ్చానన్నాడు.

ఏదోతాను తెలియక అన్నాననీ ప్రస్తుతం తానెక్కడా పనిలో చేరలేదనీ, హోటల్లో వుంటున్నాననీ తాను తన వూరికి వెళ్ళిన తర్వాత అక్కడికి పంపమనీ ఇలా అడ్డగోలుగా వస్తే ఎలాగనీ అన్నాడు. తాను ఎంతకాలానికి యింటికి వచ్చేదీ తెలియదన్నాడు.

గోపాలం ఆవేశం కట్టలు తెగింది : ''మీరు వచ్చిందాకా ఎదిగిన పిల్లని నాదగ్గర పెట్టుకోవటం బాగుండదన్నాడు. అంతకంటె మరో నరకం లేదన్నాడు. శత్రువులకు కూడా ఆ బాధ వద్దన్నాడు. డబ్బు ఖర్చు పెట్టి పెళ్ళి చేసింది ఇలా ఇంట్లో పెట్టుకోవడానికి కాదనీ తాను ఈ దిగులుతో పోతాననీ మీ భార్యను మీరేమైనా చేసుకోమనీ అన్నాడు. ఈ ఇంగ్లీషు చదువులు, వేషాలు ఇలా తగలబడ్డాయన్నాడు. ఏ వెధవ నక్షత్రాన పుట్టిందో ప్రాణాలు తీస్తోందనీ, తనతో రావద్దనీ, తన మొహం చూపించవద్ద''నీ కసురుకొన్నాడు.

రాధ బయటికి వెళ్ళిపోయాడు.

మర్నాడంతా రాధ తన భార్య సంగతి ఆలోచిస్తున్నాడు. ఈ దేశంలో ఆడపిల్లకావడమే నీచమనీ, తండ్రి, భర్త చేసిన పాపాలు ఆ అమ్మాయి మీద తోసివేయటం సులభం అనుకున్నాడు. తాను కావాలని పెండ్లి చేసుకోక పోయినా తనను నమ్మి చేసాడు. ఆమె తనవల్ల చివాట్లు తిట్లు భరిస్తోంది అనుకున్నాడు.

ఆ రోజల్లా బయట గడిపి రాత్రి పదింటికి గదికి వచ్చి దీపం వెలిగించాడు. గాజులచప్పుడు వినిపించింది. తెల్లని చీరను కట్టుకొని భార్య నిలబడి వుంది. కన్నీళ్ళు కారుస్తూ. నాన్నగారు తనను బలవంతంగా తీసుకొచ్చి వదిలి వెళ్ళారనీ కోప్పడవద్దనీ కోరింది. రాధకు జాలివేసింది. ఆమెను హృయానికి హత్తుకొని ధైర్య చెప్పాలనిపించింది. చేయిపట్టు కొని తీసుకువచ్చి కూచోబెట్టాడు. ఆమె చాలా అందంగా కనిపించింది. ఆమెను బ్రతిమాలక్కర లేదు. తన సొంతం. నెమ్మదిగా మాటలలోనికి దించి 'నేనంటే నీకు ఇష్టమేనా' అన్నాడు. తల వూగించింది. నా దగ్గరే వుండి పోవాలని వుందా అంటే సంతోషించింది.

నాలుగు రోజులు ఆగిన తర్వాత తన వూరు వెళ్ళి రమ్మని వ్రాస్తానన్నాడు. అలా అక్కర లేదనీ అన్ని యేర్పాట్లు తానే చేస్తాననీ వంటపని చేతనౌననీ మీదగ్గర వుణ్ణిస్తే చాలుననీ ప్రాధేయపడింది. భయపడనవసరం లేదనీ ప్రస్తుతం డబ్బులు లేవనీ రెండు నెలలలో తీసుకెళతాననీ చెప్పాడు. తనకు డబ్బూ దస్కం నగలూ నౌకర్లూ అక్కరలేదనీ, తన తండ్రి దగ్గరకు పంపకుండా వుంటే చాలుననీ బ్రతిమాలింది. రాధకు నవ్వాలో, జాలిపడాలో తెలియలేదు.

తనమీద చెయ్యివేసి దువ్వాడు. నీ పేరేమిటి అని అడిగితే శకుంతల అంది. ఆమెను నమ్మించి రెండునెలల తర్వాత తీసుక వెళ్ళేందుక ఒప్పించాడు. ఆమెను మామగారున్న యింటికి తీసుకెళ్ళి ఆయనను ఒప్పించేసరికి రాత్రి 12 గంటలైంది.

మదరాసు రాగానే పద్మావతి రాధకు ఉత్తరం వ్రాసింది. చూడటానికి వెళ్ళాడు. న్యాయమూర్తి పెద్ద మేడలో నగం ఆమెది. పెద్దగదిలో సోఫాలో కూర్చొని వుంది. ఆమె ద్గరగా కుర్చీ లాక్కుని కూర్చున్నాడు. ఈ ఐదేళ్ళలో ఆమె ఎంతో అనుభవం సంపాదించిన స్త్రీ వలె వుంది.

మళ్ళీ నా జీవితంలోకి వచ్చావా అని, మన జీవితంలో ఐదేళ్ళు గడిచిపోయానీ పద్మావతి కళ్ళ నీళ్ళు పెట్టుకొని అంది. రాధకు దిగులువేసింది.

తాను మళ్ళీ ఇంగ్లండు వెళ్ళనవసరం లేదనీ. ఇక్కడే రాజకీయాలలో ప్రవేశిస్తాననీ రాధ చెప్పాడు. ఉత్తరమన్నా వ్రాయకుండా వెళ్ళి పోతాడనుకోలేదనీ, ఉత్తరాలకు సమాధానాలు ఎందుకు వ్రాయలేదనీ అడిగింది పద్మావతి. తనకు పిచ్చెత్తిందనీ అంతా మరచి పోవాలనుకున్నాననీ అన్నాడు రాధ. తాను అన్యాయం చేశాననీ, చాలా బాధ పెట్టాననీ, వదలలేక తన దగ్గరే వుంటావను కున్నాననీ, మగవాడు ఓపిక పట్టలేడని తెలియదని తమ స్నేహానికి భంగం రాదనుకున్నాననీ పద్మావతి చెప్పింది.

తాను కుర్రవాణ్ణి కాబట్టి అపుడు తన కేమీ తెలియలేదనీ ఇప్పుడు మిగతా సంగతులు వదిలేసి మన మిద్దరము స్నేహితులుగా ఉందామనీ చెప్పింది పద్మావతి. పద్మావతి మాటల ధోరణిలో పడి ఇలా అంది

''ఇద్దరం సెటిలయ్యాం. నీకూ పెళ్ళి అయింది. ఇష్టం వచ్చినట్లే మాట్లాడుకోవచ్చు. నీవు లేని బ్రతుకు అర్థవిహీనం. నీవు కౌన్సిలుకు నిలబడతావా? అని అడిగింది.

పద్మావతితో ఇలాంటి తుక్కు సంగతులు మాట్లాడం రాధకు ఇష్టంలేక ఏదేదో మాట్లాడి ఇంటికి తిరిగి వచ్చాడు. మద్మావతి తప్ప వేరే ఆలోచనలేదు. ఆమెను చూడగానే శకుంతలమీద ప్రేమ ఎండలో వెన్నెలవలె మాయమైంది. పద్మావతి సహాయంతో తాను గొప్పవాణ్ణి కావాలనుకొన్నాడు. ఆమె అంతరంగిక మిత్రుడు కావాలని కోరిక. ఆమె సౌందర్యంతో తన జీవితం వెలిగించుకొంటాడు.

మర్నాటి నుంచి పద్మావతిపై మనసు లగ్నమైంది. పగలు, రాత్రి అక్కడే గడిపేవాడు. ప్రేమజలధి వారి సన్నిధిలో పొంగి పొరలుతోంది. ఒంటరిగా ఇద్దరూ కలుసుకొన్నారు. పద్మావతికి శకుంతల మీదా, న్యాయమూర్తికి రాధమీద అసూయ ఏర్పడింది. ఒకరి ఉద్రేకం మరొకరికి తెలుసుగాబట్టి పద్మావతి నౌకర్లను దగ్గర పెట్టుకొని మాట్లాడేది. సంఘం మీద కోపం వచ్చేది.

ఒక రోజు సాయంకాలం తోటలో కూచొన్నారు. న్యాయమూర్తి రాధతో టెన్నీసు ఆడి ఓడపోయి వెళ్ళాడు. పద్మావతి దగ్గర రాధ కూచొన్నాడు. బట్లర్ని దగ్గర ఉండమంది పద్మావతి. మబ్బుల్ని చూస్తూ పద్మావతి మీద చెయ్యి వేసాడు రాధ. ఆమె పక్కకు జరిగింది. రాధకు కోపం వచ్చింది. సాహసం ఎక్కువవుతోంది. బట్లర్ని వెళ్ళిపొమ్మన్నాడు. పద్మావతి వద్దని చెప్పింది. రాధ ఉద్రేకం గమనించి బట్లరు వెళుతుంటే వూరుకొంది. రాధ పద్మావతిని ముద్దు పెట్టుకున్నాడు. ఆమె యింటివేపు వెళ్ళి పోయింది.

పద్మావతి అతని జీవం. అతని మాధుర్యం. అతని ఆదర్శం. మెల్లగా నడుస్తూ పద్మావతి కోసం వెళ్ళాడు. ముందు గదిలో లేదు.దీపం వెలిగించి చూస్తే ఆమె లేదు. స్విచ్ ఆపేసి కుర్చీలో కూచున్నాడు. పరుగెత్తి పద్మావతిని పట్టుకొని ఆ మాధుర్యాన్ని జుర్రు కోవాలని ఆవేశం కలిగింది. తనలో సాహసం పెరిగింది. ఏది చూసినా పద్మావతే. పక్కగదిలోకి వెళ్ళాడు. మంచం మీద పద్మావతి వుంది. అతని రెండు చేతులూ ఆమె వంటి మీద పడ్డాయి. ఆమెను ముద్దుపెట్టు కుంటూంటే కన్నీళ్ళు వెచ్చగా తగిలాయి. రెండు చేతులతో అతన్ని లాక్కొని రాధా అంటూ వక్షానికి అదుముకుంది.

ఆ ప్రేమ మారుతంలో ఒళ్ళుమరచి రోజులు నిముషాల్లా గడిపారు. కొన్ని నిముషాలు యుగాలైనాయి. మొదటి నుంచీ పద్మావతికీ రాధకూ కొన్ని అభిప్రాయ బేధాలున్నాయి. తమ ప్రేమ రహస్యంగా ఉంచే ప్రయత్నం చేయకూడదని రాధ ఉద్దేశ్యం. భర్తకు అన్నలకు తెలిస్తే తమను విడదీస్తారని పద్మావతి భయం. తన హోదా గౌరవం వదలడానికి ఆమెకు యిష్టంలేదు. అందుకే తమ ప్రణయం రహస్యంగా వుండాలని అంటుంది.

న్యాయమూర్తి అంటే రాధకు ఇష్టమూ, గౌరవము. పరధ్యానంగా వుండే అతన్ని తలచుకుంటే జాలి వేస్తుంది. తన ఇంజనీరింగు గొడవ తప్ప అతనికేమీ పట్టవు. రాత్రులు ప్రొద్దుపోయేంత వరకు రాధ పద్మావతి పక్కన వున్నా పట్టించుకునేవాడు కాదు. అతణ్ణి మోసం చేస్తున్నానేమోనని రాధ బాధ. అయినా ఒక సమాధానం చెప్పుకొని సరిపెట్టుకునేవాడు. స్త్రీ పురుషుడు సొమ్ము కాదు. అతని ఆస్తికాదు. పిరికివాళ్ళు పూర్వాచార

పరాయణులూ స్త్రీలను పురుషుల ఆస్తి క్రింద జమ కడతారు. పద్మావతి అతని ఆస్తిలా ప్రవర్తించడం ఎందుకు?

అప్పుడప్పుడూ రాధకు తన భార్య శకుంతల గుర్తుకు వచ్చేది. ఆమె దీనంగా తనవైపు చూస్తున్నట్లు అనిపించేది. వెంటనే మరుపుకు తెచ్చుకునేవాడు.

ఒక రోజు హఠాత్తుగా మామగారు వచ్చారు. రెండు నెలలన్న పెద్దమనిషివి అమ్మాయిని తీసుకెళ్ళలేదేమని అమ్మాయి ఉత్తరాలకు సమాధానం వ్రాయలేదేమని, అసలు తీసుకెళతారా? లేదా అని అడిగాడు.

పని తొందరలో సమాధానం వ్రాయలేదనీ, ఆ అమ్మాయి భత్యంకింద నెలకు యాభై రూపాయలు యిస్తాననీ, తాను పంపమన్నంత వరకు పంపవద్దనీ రాధ నిష్కర్షగా చెప్పాడు.

ఆ తర్వాత మామగారు చెప్పిన మాటలు వినిపించుకోకుండా రాధ పద్మావతి యింటికి వెళ్ళాడు. పద్మావతి ఆ సంగతి విని వెంటనే వెళ్ళి మామగారికి క్షమాపణ చెప్పి శకుంతలను తీసుకొచ్చి కాపురం పెట్టమంది.

విధిలేక శకుంతలను తీసుకొచ్చి వాళ్ళ బంధువుల యింట్లో వుంచి రోజూ చూసి పోతున్నాడు రాధ. కొన్నాళ్ళ తర్వాత తీరిక లేక మానేశాడు.

ఒక రోజు మధ్యాహ్నం పద్మావతిని తోటలో కలుసుకున్నాడు. ఆమె అతణ్ణి కౌగలించుకొని ముద్దుపెట్టుకుంది. అయినా ఎవరైనా చూశారేమోనని జంకింది. ఈ భయాలు లేకుండా స్వేచ్ఛగా వుండాలని కోరుకున్నాడు. పద్మావతి అంది గదా! ఎప్పుడూ ఒకరి దగ్గర ఒకరు పడివుండటం బాగుండదు అంది. ఇప్పటికైనా తనతో వచ్చెయ్యమని తనకు జీవితంలో ఆమెతో కలిసి స్వేచ్ఛగా తిరగాలని వుంటుందనీ అన్నాడు రాధ. పద్మావతి ససేమిరా ఒప్పుకోలేదు. బహిరంగంగా భయపడ కుండా ఆమె తనది కావాలి. ఈ నీచపు జీవనాన్ని వదిలేసి ఆమె తన దగ్గరకు రావాలి. ఆమే తన లోకం. తన ప్రాణం. తన మనోహారి. ఈ భోగభాగ్యాలు లేకపోయినా తనతో సుఖంగా వుండవచ్చునన్నాడు.

పద్మావతి కళ్ళు కోపంతో దగ దగ లాడాయి తనను యింతవరకు రాధ తప్ప ఎవరూ అలా అనలేదనీ కళ్ళ నీళ్ళు పెట్టుకుంది ఆమె నిర్మలత్వం తనకు తెలుసుననీ, దొంగతనంగా వుండటం ఇష్టం లేదనీ, తనతో వచ్చేయమనీ కోరాడు రాధ అటు తన భర్త, ఇటు అతని భార్య ఎవరిని వదిలి పెట్టి పోవాలి జీవితాలు పాడు చేసుకోవడం ఆమెకు యిష్టం లేదు నలుగురి నోళ్ళలో మాటలు పడటం మనస్కరించలేదు ఆడదానికోసం చెడిపోయిన మగాణ్ణి సంఘం గౌరవించదని హెచ్చరించి తటాలున లేచి నుంచుంది

వీళ్ళ రహస్యం ఎన్నాళ్ళో దాగలేదు ఒక రోజు పద్మావతి దగ్గరగా వెళ్ళి ముద్దుపెట్టుకోబోయాడు ఆమె కోపంతో నెట్టివేసింది తలుపు దగ్గర న్యాయమూర్తి ఇలాంటిదేదో జరుగుతుందని తాను అనుమానించాననీ అయినా రాద ఇలాంటి దుర్మార్గం చేస్తాడని తాను వూహించలేదనీ ఇంకవెళ్ళి పొమ్మని న్యాయమూర్తి రాధతో మర్యాదగా అన్నాడు

రాద అటో ఇటో తేల్చుకోవాలనుకున్నాడు పద్మావతి రాదను వెళ్ళి పోమ్మంది రాద ఆవేశంగా మాట్లాడుతూ తాము ప్రేమించికున్నామనీ ఇక్కడ నుండి వెళ్ళిపోతామనీ తమకు పెళ్ళయిందనీ అన్నాడు.

భార్యాభర్తల గొడవలో ఇతరులు జోక్యం చేసుకోవలసిన అవసరం లేదన్నట్లు మాట్లాడాడు న్యాయమూర్తి సంఘాన్ని ఎదిరించాలని రాధ ఉద్దేశ్యం కట్టుబట్టలతో పద్మావతి తనతో వస్తుందని అతడి ఆలోచన

రాదతో రావడం యిష్టం లేదని పద్మావతి ఖండితంగా చెప్పింది అతణ్ణి పంపించివేయమని న్యాయమూర్తి అన్నాడు

మా ఇద్దరిలో ఎవరినో ఒకరిని ఎంచుకోమని న్యాయమూర్తి పద్మావతితో అన్నాడు లేక పోతే ఈ యింట్లో ఎలా వుంటావన్నాడు

పద్మావతికి కోపం వచ్చి మాట్లాడింది:

‘‘ఇక్కడ ఎందుకుండకూడదు ఇద్దరిలో ఒకర్ని ఏరుకోవడమెందుకు? ఇద్దరూ నాక్కరలేదు మీ ఆజ్ఞకులోబడి వుండటానికి నేను పదార్థాన్ని కాదు రాదతో కూడా వెళ్ళను ఇది నా ఇల్లు ఇక్కడే ఉంటాను’’

ఆమె కళ్ళు కోపంతో మెరిశాయి తనకోసం మీరు కుక్కల్లాగ పోట్లాడుకోవద్దని చెప్పింది. మహాశక్తిలాగా నుంచునివుంది. న్యాయమూర్తి, రాధా ఒకరి మొహం ఒకరు చూసుకొంటూ నిలబడ్డారు. కొంతసేపటికి రాధ యింటికెళ్ళి పోయాడు. అతనికి పట్టరాని కోపం వచ్చింది.

ఆ సాయంత్రం పద్మావతి వ్రాసిన ఉత్తరంలో న్యాయమూర్తి తమని ముద్దు పెట్టుకొంటూ చూసినందుకు రాధ మీద కొప్పడింది. తనతో రావల్సిందేనని రాధ సమాధానం వ్రాశాడు. పద్మావతి అన్నల్ని అర్జంటుగా పిలిపించాడు న్యాయమూర్తి.

మర్నాడు రాధ పద్మావతిని చూడటానికి వెళితే సుదర్శనం అతణ్ణి నిలదీశాడు. గోల చేస్తున్నావెందుకన్నాడు. న్యాయమూర్తి వయసులో ఉన్నవాడనీ, రాధ యిలా చేయడం బాగులేదనీ, నలుగురూ చూసేలా యిలా ప్రవర్తించడం బాగులేదనీ హెచ్చరించాడు.

ఇన్నాళ్ళూ అనుభవించారు. ఇంతటితో ఈ వ్యవహారం ఆగిపోవాలని పెద్ద అన్న వెంకటరత్నం గదమాయించాడు.

వాళ్ళంతా ఆలోచించుకొనే మాట్లాడుతున్నారు.

ఆ సాయంకాలానికి ఇంటికి తాళాలు వేసి రైలు కెళ్ళిపోయారు వాళ్ళు అందరూ. పద్మావతిమీద కేకలు వేసి దడిపించి సింగపూరు తీసుకెళ్ళారు.

పద్మావతికి జబ్బు చేసింది.

ఆమెను బలవంతంగా లాక్కొని వెళ్ళారని రాధ బాధ.

పద్మావతి ఎక్కడ ఉందో తెలిసినా అతనితో రాదు. ఆమె దగ్గరనుండి ఉత్తరం కూడా లేదు.

రాధ వుండబట్టలేక పోలీసు సూపరింటెండెంట్ వద్దకు వెళ్ళి విషయం చెప్పాడు. తన భర్తతో ఆమె వెళ్ళిందనీ అది చట్ట ప్రకారం సమ్మతమేననీ పోలీసు ఆయన చెప్పారు.

ఒకసారి వెంకటరత్నం కనిపిస్తే రాధ అతని వెంటబడ్డాడు. పద్మావతి వూసు చెప్పమన్నాడు. మీరెవరో నాకు తెలియదంటూ మొగంమీద కొట్టాడు. రాధ అతన్ని తిరిగి రక్తం వచ్చేలా కొట్టాడు.

పద్మావతి కోసం రాధ సింగపూరు వెళ్ళాడు. వాళ్ళు మదరాసు తిరిగి వెళ్ళారని చెప్పారు ఆశ చచ్చిపోయి, ఉద్రేకం చల్లబడింది.

రాధ మదరాసు వచ్చేటప్పటికి పద్మావతి వ్రాసిన ఉత్తరం వచ్చివుంది. అధైర్యంతో బతుకుమీద విసుగుతో రాసినట్లుంది. ఉత్తరం చదివి రాధ బేజారైపోయాడు.

నిలవలేక వాళ్ళ యింటికి వెళ్ళాడు రాధ. సుదర్శనం కనిపించాడు. తాను రాధ పక్షమేననీ, అయినా న్యాయమూర్తి బలవంతుడు కాబట్టి పద్మావతిని ఇంట్లోంచి తరిమివేస్తాడనీ, రాధను బైటకు పంపిస్తాడనీ అందువల్ల అల్లరి చెయ్యకుండా వెళ్ళిపొమ్మన్నాడు సుదర్శనం.

కొంచెం సేపటికి పద్మావతి అక్కడికి వచ్చింది. కట్టుబాట్లకు వ్యతిరేకంగా నడిచామనీ అందుకు ప్రతిఫలం అనుభవించాలనీ చెప్పింది. రాధను తలచుకొంటూ జీవిస్తాననీ, అలా వదిలేసిందుకు కోపం వద్దనీ చెప్పి ఎడవసాగింది. ఇద్దరూ కన్నీళ్ళతో తడిసి కౌగలించుకొని విడిపోయారు.

పద్మావతిని మరిచిపోవడానికి రాధ టిబెట్టుదేశం వెళ్ళి మూడేళ్ళ తర్వాత తిరిగి వచ్చాడు. తండ్రికి ఒంట్లో బాగులేదు. శకుంతల ఆయనకు ఉపచారం చేస్తోంది. తండ్రి తదనంతరం ఆస్తిని అమ్మివేసి ఏ దూరదేశమో పారిపోదామనుకొన్నాడు.

ఒక రోజు రాధ చిన్నాన్న కూతురు సావిత్రి వాళ్ళ యింటికి వచ్చింది. రాధ ప్రవర్తన బాగులేదని చివాట్లు పెట్టింది. శకుంతల, పద్మావతి స్నేహితులయ్యారని చెప్పింది. భార్యను ఏలుకోమంది. చిన్నతనంలో తిరుగుళ్ళు తిరిగినా, ఒక వయసువచ్చింతర్వాత మరిచిపోవాలంది.

పద్మావతిని మరిచిపోలేనన్నాడు రాధ, సావిత్రికి కోపం వచ్చి పద్మావతి నిన్ను మరిచిపోయివుంటోందనీ, ఆమె యిప్పుడు గర్భవతి అనీ, ఆమెకు

ఈ మూడేళ్ళలో ఒక ఆడపిల్ల, ఒక కొడుకు పుట్టారని చెప్పింది. ఎవరినంసారం వాళ్ళు చూసుకోవడం ధర్మం. ఏ పాపం ఎరుగని శకుంతల ఏంచేసింది? పద్మావతిని మరిచిపోయి శకుంతల భర్తగా సక్రమంగా నడచుకోమంది.

పద్మావతి న్యాయమూర్తి పిల్లల్ని కన్నందుకు రాధకు కోపం వచ్చింది. ఆమె అతడి వస్తువు కాగూడదు. ఎలాగైనా ఆమెను వొప్పించి ఎక్కడికైనా తీసుకెళ్దాం అనుకొన్నాడు గాని ఆమె పిల్లన్ని వదలిరాదని అతనికి తెలుసు.

ఐదేళ్ళు గడిచాయి.

రాధకు ఒక కొడుకు, కూతురు. తండ్రి పోయారు. రాజకీయాలు వొదిలేశాడు. ప్రెస్ పెట్టి ఒక పత్రిక ప్రారంభించాడు. గొప్ప సంఘసంస్కర్త అనే పేరు వచ్చింది. విధవా వివాహాలు, రజస్వలానంతర వివాహాలు జరిపించాడు.

ఒక రోజు పద్మావతి నుండి ఉత్తరం వచ్చింది

''పెద్దవాళ్ళమైనాం గాబట్టి ఉత్తరాలు రాసుకొంటూవుండవచ్చు. నీవెలా ఉన్నావు ఇన్నాళ్ళూ లొంగిపోయి వూరుకొన్నాను. నీవు ఎవరెవరితోనో కలిసి స్నేహం చేస్తున్నావని విన్నాను. నా బ్రతుకు దుర్భరంగా వుంది ఇద్దరు పిల్లల తల్లిని. న్యాయమూర్తికీ, నాకు యిప్పుడు ఏ సంబంధమూ లేదు. ఆయనకు కావలసింది వంశోద్ధారకుడు. ఆ బాధ్యత తీరిపోయింది. నీవు లేని జీవితం లేదని పోట్లాట మానేశాను. నేనెందుకు బతకాలో తెలీదు. జీవతంలో నీవు సంతోషం పొందివుంటే అది ఎలా సాధ్యమో చెప్పు'' ఉత్తరంచదివి తలపైకెత్తితే శకుంతల చూస్తోంది.

పద్మావతి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందని చెప్పి పెద్ద జవాబు వ్రాశాడు. ఇలా ఉత్తర ప్రత్యుత్తరాలు మూడు సంవత్సరాలు నడిచాయి. తర్వాత మెల్లిగా ఉత్తరాలు రావడం తగ్గింది.

రాధ సంఘసంస్కరణం, వార్తా పత్రిక పనుల్లో మునిగిపోయాడు.

ఆ సంవత్సరం కాలికట్‌లో సంఘసంస్కరణ సభకు రాధకృష్ణను అధ్యక్షుణ్ణి చేశారు. ఆ వూరు చేరుకొని పక్కన కొబ్బరితోటలోకి షికారు వెళితే పద్మావతి వూడి పడింది.

ఆమె సంరక్షణ కోసం పక్కనే ఎవరో ఒక స్త్రీ వుంది. మదరాసు అంటే వినుగుపుట్టి దేశమంతా తిరిగుతున్నానని చెప్పింది పద్మావతి.

దేవుడిచ్చిన ఈ సాయంకాలం ఎవరి భయమూ లేకుండా గడుపుదామని పద్మవతి బాధతో అంది. మళ్ళీ ఇన్నాళ్ళకు ఇలా కలుసుకోవడం ఆనందంగా వుందనుకొన్నారు.

ఎదురుగా వున్న డింగీ ఎక్కి సముద్రంలో ఎక్కడికో వెళ్ళిపోయారు. దగ్గర్లో కొండమీదికి వెళ్ళి నమ్మలేనంతగా వూరిస్తూ యిద్దరూ ఒకరికొకరు దగ్గరయ్యారు. స్వర్గంలో ఉన్నట్లుగా వుంది ఇద్దరికీ, భౌతిక శరీరానికి అతీతమైన ఆనందమది. ఒకరినొకరు తాకలేదు.

తిరిగి వొడ్డుకు వచ్చి ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయారు. రాధ కాలికట్ వచ్చిన ఐదురోజులకు పద్మావతి వద్దనుండి అర్జంటుగా రమ్మని టెలిగ్రాం వచ్చింది.

రాధ మదరాసు వెళ్ళి మునువున్న హోటల్లో దిగాడు. అక్కడికి పద్మావతి వ్రాసిన ఉత్తరం వచ్చింది.

‘‘ఆ రాత్రి ఎంతో సేపు ఏడ్చాను. నీవు మళ్ళీ తిరిగి వస్తావని ఎదురు చూశాను. నా సంరక్షణ కోసం పంపిన ఆమె ద్వారా విషయం తెలుసుకొని న్యాయమూర్తి నన్ను మదరాసు పిలిపించాడు. నా మీద కోర్టులో వ్యాజ్యంవేసి నన్ను వెళ్ళ గొడతాడట. మనం ఆ రాత్రి ఒంటరిగా గడిపినట్లు రుజువులు సంపాదించాడు. ఖైదు శిక్ష మన యిద్దరికీ పడుతుందని లాయర్ చెబుతున్నాడు’’ ఇదీ ఉత్తరంలో సారాంశం.

శకుంతలకు ఈ విషయం తెలిసి కోపడింది. ఏడ్చింది. ‘ఇద్దరూ తెలీకుండా ఎలా కలుసుకోగలిగారని అడిగింది. నా కొంప ముంచుతున్నారంది. పత్రికల్లో

ఈ గొడవులు వస్తే తల ఎత్తుక తిరగడమెలా అంది. మన అమ్మాయికి సంబంధం ఎలా వస్తుంది. ఇదంతా ఆమె మదంవల్ల జరిగింది అంది. ఆమెనేమీ అనవద్దని రాధ కోప్పడ్డాడు.

మర్నాడు రాధహోటల్ గదికి పద్మావతి వచ్చింది. ఇద్దరూ కావిలించుకున్నారు. ఆమె ఏడ్చింది. కోర్టులో వ్యాజ్యం మాన్పించేసాననీ, ఆ సంతోష వార్త చెప్పడానికి వచ్చానని అంది.

ఆ రాత్రి మలబారు పరిసరాల్లో గడిపిన క్షణాలు తలచుకొంది. రాధ ఎలా బతుకుతాడోననీ, తాను వెళ్ళిపోతే రాధను ఎవరు చూస్తారనీ, తాను తల్లిగా అతణ్ణి సంరక్షించాననీ చెప్తూ అతణ్ణి తాగేసేలా చూస్తూ కూచోంది.

రాధకు కోర్టులో అప్రతిష్ఠ రాకూడదనీ, అందుకోసమే ఇలా చేశాననీ చెప్పింది పద్మావతి. శకుంతలను తనకోసం ఏడిపించవద్దనీ అందుకే తాను కష్టపడటానికి సిద్ధపడ్డానని పలికింది.

పద్మావతి మొహం గంభీరంగా వుంది.

రాధ కన్నీళ్ళు పెట్టుకొన్నాడు. న్యాయమూర్తితో కొంత రాజీపడి కొన్ని షరతులు ఒప్పుకొన్నాని చెప్పింది. ఇంక తామిద్దరూ కలుసుకోబోమని అతనికి నమ్మకం పుట్టించాలి. ఇక మీదట జీవితంలో తాము కలుసుకోరు మాట్లాడుకోరు.

ఆఖరిసారిగా రాధను చూసిపోదామని వచ్చానని చెప్పింది పద్మావతి. న్యాయమూర్తికి తాను వాగ్దానం చెయ్యాలి. భయంకరమైన వాగ్దానం. రాధను వొదిలివేయాలి. అందుకే కడసారిగా అతనిరూపం తాను తనలో నింపుకొంటోంది.

ఆమె ఎక్కడికి వెళుతుందో రాధకు తెలియదు. చెపితే అతడు అంగీకరించడు. అతనికోసమే ఆమె ఎదురు చూపులు చూస్తుంటుంది.

ఆమె లేచి నించుంది. తనను జ్ఞాపకం ఉంచుకోమనీ, ఎప్పుడూ రాధను ప్రేమిస్తుంటాననీ అంటూ మాటలు తడబడగా తూలింది. రాధ ఆమెను

కావిలించుకొని బల్లమీదకూచోన్నాడు ఇద్దరూ కౌగిలించుకొన్నారు. ఆమె చేతులు వదులైనాయి.

ఆఖరిసారిగా నీ మొహం చూడనీమనీ, మరిచిపోవద్దనీ.... క్షమించమనీ.....రా....ధా.... అంటూ పద్మావతి వాలిపోయింది. ఇంతలో తలుపులు తన్ని న్యాయమూర్తి, ఇంకెవరో ఇద్దరు వచ్చారు.

పద్మావతిని భద్రంగా పడుకోపెట్టి లేచాడు రాధ

''మనిద్దరం కలిసి పద్మావతిని చంపాం. ముక్కల కింద చీల్చుకొన్నాం'' అన్నాడు న్యాయమూర్తి.

పోయినసారి కలుసుకొన్నప్పుడు పద్మావతీ, తాను రాత్రి ఒక చోట ఉండలేదని సమాధానంగా చెప్పాడు రాధ.

'అదంతా ఇప్పుడెందుకు? ఇంకేమైతేనేం' అన్నాడు న్యాయమూర్తి విచారంతో! పాపం!

---

# అడవి బాపిరాజు

అడవి బాపిరాజు పశ్చిమగోదావరిజిల్లా భీమవరంలో 1895 అక్టోబరు 10వ తేదీన జన్మించారు. లాయరుపట్టా పుచ్చుకొని భీమవరంలోనే వకీలుగా ప్రాక్టీసుపెట్టారు. 1922లో ఒక సంవత్సరం జైలు శిక్ష అనుభవించారు. 1934 నుండి నాలుగేండ్లు బందరు ఆంధ్రజాతీయ కళాశాలలో ప్రిన్సిపాల్ పదవి నిర్వహించారు.

బందరులో వుండగా ఆంధ్రజాతీయ కళాశాలలో ప్రమోదకుమార చటోపాధ్యాయ సాహచర్యంతో చిత్రకళా రహస్యాలు తెలుసుకున్నారు. రాజమండ్రి ఆర్ట్స్ కళాశాల ప్రిన్సిపాల్ ఆస్వాల్డు కూల్‌డ్రే బాపిరాజులోని కళాతత్వాన్ని పసిగట్టి రత్నానికి సానపట్టాడు. ఆయన ద్వారా బాపిరాజు ఆంగ్ల సాహిత్యం క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. చిత్రకళలో కావ్యకళా ధర్మాన్ని మేళవించి 47 వర్ణచిత్రాలు గీశాడు. డెన్మార్కు మ్యూజియంలో కూడా ఆయన చిత్రం వుంది.

ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. కవి, గేయరచయిత, కథకుడు. చిత్రకారుడు, శిల్పి అధ్యాపకుడు, పత్రికాసంపాదకుడు, సినీరచయిత అన్నిటినీమించి కళాశ్రేష్ఠ. 44 కథలు అనంపుటాలుగా ప్రచురించారు. ఆయన భావుకుడు.

బాపిరాజు గేయాలు ఆకాశవాణి గాయకులు ఎందరో గానం చేసి ప్రాచుర్యానికి తెచ్చారు. ఆయన వ్రాసిన 16 పద్యకవితా సంపుటాలలో మూడుమాత్రమే ప్రచురితమయ్యాయి. 1922లో జైలులో హిమబిందు నవల వ్రాశారు. బాపిరాజు నవలకు ఆంధ్రవిశ్వకళాపరిషత్తు విశ్వనాథ వేయిపడగలతో బాటు బహుమతిని కలిసి వంచిపెట్టింది. అడవిశాంతిశ్రీ, గోనగన్నారెడ్డి, జాజిమల్లి, కోనంగి ఆయన ఇతర నవలలు. జాతీయోద్యమ ప్రభావం కోనంగిలో కనిపిస్తుంది.

1939లో బాపిరాజు సినీరంగ ప్రవేశం చేశారు. సతీ అనసూయ, ధృవ విజయం, మీరాబాయి, పల్నాటి యుద్ధం చిత్రాలకు కళాదర్శకత్వం వహించారు. 1952 సెప్టెంబరు 19న బాపిరాజు కాలధర్మం చెందారు.

# కోనంగి గురించి

కోనంగి మధ్యతరగతి కుటుంబీకుడు.

ఆనాడు గాంధీజీ అహింసా సిద్ధాంతప్రభావం దేశదేశాంతరాలలో కనిపిస్తోంది. ప్రపంచయుద్ధ ప్రభావం కూడా ప్రతిబింబిస్తున్నరోజులవి.

కోనంగి అనంతలక్ష్మిని తొలిచూపులోనే ప్రేమించాడు. కోనంగి ఒక బ్రాహ్మణ వితంతువు కొడుకు. భర్త పోగానే తల్లి దిక్కులేనిదైంది. ఆమెను వంటకు కుదుర్చుకొన్న ఒక ఉద్యోగి ఆమెకు కడుపు చేశాడు. ఫలితంగా మదరాసులో కోనంగి పుట్టాడు. కోనంగి బాల్యం బందరులో గడిచింది.

అనంతలక్ష్మి కోనంగిని ప్రేమించింది. కోనంగి ఒక కంపెనీలో 'సేల్సువమాన్'గా చేరాడు అనంతలక్ష్మికి తెలుగు ట్యూషన్ చెప్పేమేష్టారుగా వాళ్ళ యింటికి రాకపోకలు సాగించాడు అనంతలక్ష్మి తల్లి జయలక్ష్మి కుతుర్ని చెట్టిగారికి తార్చాలని ప్రయత్నించింది కోనంగితో అనంతలక్ష్మి పరిచయం ఎక్కువ చేసుకొంది.

కోనంగి సినిమాలో కథానాయకుడుగా చేరాడు తనకు నయం చేసిన డాక్టర్ రంగనాయకులురెడ్డి ద్వారా సినీరంగప్రవేశం చేశాడు. ఆయన ద్వారా రాజకీయ పరిచయంకూడా ఏర్పడింది 'దుక్కిటెద్దులు' సినిమాలో కోనంగి నాయకపాత్ర పోషిస్తున్నాడు. సినిమా విడుదలై కోనంగికి మంచిపేరు వచ్చింది.

రాజకీయాలలోకి కోనంగి ప్రవేశించాడు. ఆంధ్ర మహాసభలో చేరాడు. అనంతలక్ష్మి కోనంగితో తనపెళ్ళి జరిపించమని తల్లినికోరింది. వివాహం వైభవంగా జరిగింది. అనంతలక్ష్మి ఖాదీ ఉద్యమంలో చేరి మనశ్శాంతి పొందిండి. కోనంగి జైలునుండి వ్రాస్తున్న ఉత్తరాలు ఆమెకు ఊరటకలిగిస్తున్నాయి.

కోనంగి జైలు నుండి విడుదలయి వచ్చాడు కోనంగి తల్లిని చాలా రోజుల తర్వాత కలిశాడు. కోనంగి అనంతలక్ష్మి ప్రోత్సాహంతో ఒక తెలుగు దినపత్రిక కొన్నాడు. పత్రికకు బాగా పేరు వచ్చింది. పత్రికా కార్యాలయంపై చెట్టి ప్రోత్సాంహంతో పోలీసులు దాడి చేశారు. అనంతలక్ష్మి గర్భవతి అయింది. కొడుకు పుట్టాడు. వారి దాంపత్యం సుఖమయంగా సాగిపోతోంది

# 13. కోనంగి

## సంక్షిప్త గ్రంథం

కోనంగి కార్లోంచి దిగుతూ కోటు మడతలు సరిదిద్దుకున్నాడు. విశాలమైన ఆ భవనంలోకి అడుగు పెడుతూ విజయదశమికి తనకు విజయం తప్పదనుకున్నాడు. హాల్లోకి వచ్చి కూచుని ఎవరూ కనిపించక పోయేసరికి ఆశ్చర్యంగా చూస్తున్నాడు. ఇంతలో ఇద్దరు పెద్ద మనుషులు వచ్చి అతణ్ణి పరామర్శించారు. పెళ్ళి చూపులకోసం ముస్తాబై వచ్చాడు కోనంగి. వధువు జాడ కనబడలేదు.

కొంతసేపటికి ఖరీదైన చీర ధరించిన సీత అనబడే వధువు కాలేజికి వెళ్ళడానికి సిద్ధమై మేడమెట్లు దిగి వచ్చింది. ఆమె పైపళ్ళు నాలుగు బాగా ఎత్తుగా కనిపిస్తున్నాయి. కాలేజికి వెళ్ళే తొందరలో ఆమె కారులో వెళ్ళి పోయింది. వధువు తండ్రి కోనంగిని అమ్మాయి తిరిగి వచ్చిందాకా యింట్లోనే ఉండమని చెప్పి వంటవానికి అప్పగించి వెళ్ళిపోయాడు.

హిందూ పత్రికలో వివాహప్రకటన చూసి కోనంగి ఈ పెళ్ళి చూపులకు అరువు తెచ్చుకొన్న బట్టలతో వచ్చాడు. ఈమె బంగారు పిచ్చుక. అయితే అందం లేదు. అయినా గిరీశంలా తాను లాభనష్టాలు బేరీజు వేసుకోదలచు కోలేదు.

సాయంకాలం కాలేజినుండి సీతాదేవి తిరిగి వచ్చి కోనంగిని పలకరించింది. కోనంగికి ఉన్నది ఒక బట్టల జత కాబట్టి బట్టలు మార్చుకోనే అవసరం రాలేదు. ఇద్దరూ టీ తాగి కారెక్కి సినిమాకెళ్ళారు. మీరు బాగా ధనవంతులా అని అడిగింది సీతాదేవి. కాదు పేదవాణ్ణి అన్నాడు కోనంగి.

సీతాదేవి సువాసనతో గుబాళిస్తోంది. ఆమె ముందర కోనంగి బంట్రోత్తులా కనిపిస్తున్నాడు. సినిమా ప్రారంభం కాగానే చీకటి కమ్మింది. సీతాదేవి ముందుగా కోనంగికి చెప్పి ముద్దు పెట్టుకొంది. ఆమె చెప్పినట్లు

కోనంగి కూడా ఆమెను ముద్దు పెట్టుకొన్నాడు. ఇది ప్రేమచేత కాదనీ, కేవలం రుచి చూడటానికేనని సీతాదేవి చెప్పింది.

సినిమా వదలగానే యిద్దరూ బీచీకెళ్ళారు. పాటలు పాడాడు కోనంగి. రేపటి పరీక్ష తనకే విధంగా ఉంటుందోనని కోనంగి ఆలోచిస్తూ వాళ్ళ యింటికి చేరాడు కోనంగి.

బీచి దగ్గర సీతాదేవికి తన చరిత్ర చెప్పాడు కోనంగి. తానొక బ్రాహ్మణ వితంతువు కొడుకు. చట్టప్రకారం తనకు తండ్రి లేడు. భర్తపోగానే తన తల్లి దిక్కులేనిదైంది. ఆవిడ ఒక బ్రాహ్మణోద్యోగి దగ్గర వంటకు కుదిరింది. అతడు ఆమెను లోబరచుకొన్నాడు. కోనంగి కడుపునపడ్డ తర్వాత వాళ్ళ అమ్మ మదరాసు వచ్చింది. అక్కడే కోనంగి పుట్టాడు. ఆ తర్వాత బందరుకు మకాం మార్చారు. వాళ్ల తండ్రి బ్రతికి వున్నంతకాలం వాళ్లకి బాగానే జరిగింది. ఆయన ఒకరోజు గుండెజబ్బుతో స్వర్గస్తుడయ్యాడు. నగలు, డబ్బు ఖర్చుచేసి వాళ్ల అమ్మ కోనంగిని యమయాతనపడి బి.ఏ చదివించింది. ఏడాది నుంచి ఉద్యోగం వేటలో ఉన్నాడు. పత్రికలో 'వరుడు కావాలి' అన్న ప్రకటన చూసి పరుగెత్తుకొని వచ్చాడు.

ఈ కథ విని సీతాదేవి తన మనసులో మాట బయటపెట్టింది. నిన్ను చూస్తే జాలివేస్తోంది- అని చెప్పి రైలు టిక్కెటు కొనిపెట్టి రైలు ఎక్కించి వెళ్లింది. మదరాసులో దిగిన కోనంగి నెల్లూరు లాడ్జిలో దిగాడు. మర్నాటి నుంచి ఉద్యోగ ప్రయత్నాలు ప్రారంభించాడు. ఉద్యోగం కంటె యుద్ధంలో చేరరాదా అని ప్రతి ఆఫీసు వాళ్ళు సలహా యిచ్చారు. ఒకచోట మాత్రం ఒక అరవ సినిమా ప్రొడ్యూసరు హరిశ్చంద్ర సినిమాలో లోహితాస్యుని పాత్ర యిచ్చి 'ఎక్స్ట్రా' ఉద్యోగానికి రోజుకు రూపాయ యిచ్చే ఏర్పాటు చేశారు.

అది 1939వ సంవత్సరం. యుద్ధం రోజులు. బస్సు దొరకక నడిచి వస్తున్న కోనంగి ఒక పెద్ద భవనం గేటుముందు నిలబడ్డాడు. కారు బయటికెళ్ళేందుకు గేటు తెరిచారు. ఒకబాలిక కారు నడుపుకొంటూ వెళ్తోంది. తాను ఉద్యోగాన్వేషణలో వచ్చానని ఆమెతో కోనంగి అన్నాడు. ఆమె

చాలా అందగత్తె. ఇరువురి చూపులు ప్రథమ సమాగమంలో కలుసుకొన్నాయి. వెనక కూర్చొన్న వ్యక్తి సూచన మీద కారు కదిలింది.

అతిమనోహరంగా ఉండే ఆమె ఎవరా? అని కోనంగి ఆశ్చర్యపోయాడు. గుండెమీద చెయివేసుకొని చూశాడు. గుండె కొట్టుకొంటోంది. తన బ్రతుకు సినిమా అయితే తానుకూడా ఆమెతో కలిసి మూడు పాటలు పాడేవాడు. అదే నాటకంలో అయితే వరసబెట్టి యాభైపద్యాలు పాడి వుండేవాడు. లోపలినుంచి సేవకుడు వచ్చి తనను ఎగాదిగా చూసి గేటు మూసి వెళ్ళిపోయాడు. కోనంగి అలానే నిలుచుండిపోయాడు.

కారు నడుపుకొంటూ వెళ్లిన అమ్మాయి అనంతలక్ష్మి. ఆమెకు మనస్సులో ఆకుర్రవాడి చూపులు నిలచిపోయాయి. అతని మాటలు, చూపులు ఆమె హృదయాన్ని కలవరపరచాయి. అనంతలక్ష్మి తంజావూరి రాజ్యానికి చెందిన మధురవాణి వంశస్తురాలు. అనంతలక్ష్మి మదరాసులోని క్వీన్‌మేరీస్ స్త్రీల కళాశాలలో యింటరు చదువుతోంది. ఇంట్లోనే వాళ్లఅమ్మ జయలక్ష్మి ముగ్గురు ఉపాధ్యాయులను బెట్టి చదివిస్తోంది.

జయలక్ష్మి కంచిలో ఒక ధనిక అయ్యంగారుకు పుట్టింది. ఆ తర్వాత పెరిగిపెద్దదై ఒక పెద్ద జమిందారుని కన్నెరికపు భర్తగా పొందింది. ఆమెకు జమీందారంటే ప్రేమలేదు. కొన్నాళ్ళకు అతడు ఇంద్రలోకం చేరాడు. తర్వాత ఒకలక్షాధికారి అయ్యంగారు భార్యపోయిన దిగులులో వుండి ఆమెకు చేరువయాడు. ఆయన పేరు శ్రీతిరుమల రంగయ్యం గారు. అప్పటి నుంచి ఆయనకు ఆమె భార్య. వారి దాంపత్య ఫలమే అనంతలక్ష్మి. ఆమె పెట్టిపుట్టింది. మేలిమి బంగారు వర్ణం చక్కటి కంఠస్వరం లభించాయి.

ఆ కుర్రవాడిని చూసిన రాత్రి అనంతలక్ష్మికి నిద్రపట్టలేదు. ఒక విచిత్రమైన కలవచ్చింది. మర్నాడు ఉదయం అనంతలక్ష్మి పరధ్యానం చూసి తల్లి అనారోగ్యమేమోనని అనుకుంది. ఆ కుర్రవాడి మీద మనసుపడిందని కూతురంటే తల్లి మందలించి పంపింది. అనంతలక్ష్మి బాలికల కళాశాలలో చదువుతోంది. ఆ సాయంకాలం అనంతలక్ష్మి ఆటలాడుకోవడానికి వెళ్లింది. ఆమెకు నాటకాలపైన, సాహిత్యం పైన కూడా ఇష్టం. కాలేజీ నుంచి

తిరిగివస్తుంటే గేటు వద్ద నిన్నటి కుర్రవాడు కనిపించాడు. ఆయన వివరాలు తెలుసుకోమని కావలాదారుకు చెప్పి లోపలికివెళ్ళిపోయింది.

కోనంగికి పరమానందమైంది. తాను వచ్చినపని విజయవంతమైంది. ఆమెను పగటిపూట బాగా చూశాడు.

కొంతకాలానికి కోనంగికి ఒక కంపెనీ వారు 'సేల్సుమాన్' ఉద్యోగం ఇచ్చారు. రోజుకు రెండు రూపాయలు జీతం. సరుకులు ఎక్కువగా అమ్మగలిగితే తగిన బహుమతి వుంటుంది. కోనంగి మాటల పుట్ట. మాయమంత్రాలు చేసాడు. కమ్మని మాటలు చెప్పాడు. ఆవారానికి మేనేజరు 10 రూపాయలు బహుమతి యిచ్చాడు. రెండవ వారం కోనంగి విజృంభించాడు. మేనేజరు కోనంగిని వారానికి ఒక కొత్త శాఖకు మార్చాడు. మూడు వారాలపాటు కోనంగి విజృంభణముందు హిట్లరు విజృంభణ మాటునపడింది.

ఒకరోజు అనంతలక్ష్మి ఆ కంపెనీలో ఏదో కొనడానికి వచ్చింది. కోనంగి గుండె కొట్టుకోవడం ఆగిపోయింది. నాకు తెలుగు ట్యూషను చెబుతారా? అని అనంతలక్ష్మి అడిగింది. తన కారులో వచ్చేటట్లు నెలకు 50 రూపాయలు ఇచ్చేటట్లు చెప్పింది.

మర్నాడు ఉదయం అనంతలక్ష్మి యింటికి ఒక పెద్ద రోల్సురాయిస్ కారులో చెట్టియార్ వచ్చాడు. ఆయన వయస్సు ఎప్పుడూ 33 సంవత్సరాలే. అనంతలక్ష్మికి కావలాగా వినాయగం పిళ్ళై, కందస్వామి మొదలియారు. అరుణాచలం నాయకర్ వ్యవహరిస్తున్నారు. వారి పేరు చెబితేనే గూండాలు భయపడతారు. చెట్టిగారు వచ్చారని విన్న అనంతలక్ష్మి కోపంతో మండిపడింది. పధినిముషాల్లో సిద్ధమై కార్లో కూర్చొని ట్రిప్లికేన్ పోనీమంది. చెట్టిగారు తనకారును ఆమె కారు వెనకే పోనీమన్నాడు. ఆమె అది గమనించి హైకోర్టు జడ్జి యింట్లోకి వెళ్ళింది. చెట్టిగారు తక్కువేమీ తినలేదు. ఆయన కూడా జడ్జిగారి అనుమతి తీసుకొని యింట్లోకి వెళ్లాడు. తానొక గొప్ప నాట్య ప్రదర్శనం యేర్పాటుచేస్తున్నానని దానివల్ల వచ్చే సొమ్ము యుద్ధనిధికి యివ్వదలుచు కున్నానని ఆ ప్రదర్శనకు జడ్జిగారిని అధ్యక్షత వహించమని

చెట్టిగారు కోరారు జడ్జిగారు అంగీకరించారు ఆసందర్భంగా అనంతలక్ష్మి సంగీతకచేరీ కూడా వుంటుందన్నాడు తానా అమ్మాయిని వివాహం చేసుకోదలచుకున్నాననీ కూడా చెప్పాడు ఇంతలో అనంతలక్ష్మి కారు గేటు దాటి బయటకి వచ్చింది అది చూచి చెట్టిగారు నేరుగా జయలక్ష్మి యింటికి వచ్చారు వాళ్ళయింట్లోనే భోజనం యేర్పాట్లు చేయమన్నాడు జయలక్ష్మి వంట యేర్పాట్లు చేసింది అనంతలక్ష్మి భోజనానికి ఎందుకు రాలేదని జయలక్ష్మిని చెట్టిగారు అడిగాడు ఆమె జడ్జిగారింట్లో భోజనానికి వుండి పోయిందని, ఒట్టి కారు మాత్రమే వచ్చిందనీ తెలుసుకుని ఆయన తల తిరిగిపోయింది

కోనంగి మద్రాసు సందుగొందులన్నీ తిరిగాడు ఎక్కడో ఒక చోట మళ్ళీ ఉద్యోగం చూసుకోవాల్సిన అవసరం యేర్పడింది అతను పని చేస్తున్న కంపెనీలో కోనంగి అందరితోనూ స్నేహం పంచుకున్నాడు అందులో ఒక 'ఆంగ్లో యిండియన్' బాలిక సారా వుంది ఆమెకు కోనంగి అంటే మహా యిష్టం కోనంగి మాటలంటే ఆమె కిష్టం ఒక రోజు యిద్దరూ కలిసి టాక్సీమీద సినిమాకు వెళ్లారు ప్రత్యేకమైన సీట్లలో 'డ్రస్ సర్కిల్'లో ఇద్దరూ కూర్చున్నారు కోనంగి జమీందారు కొడుకులా వున్నాడు ఆమె రాజకుమారిలా వుంది వీళ్ళిద్దరూ సినిమాకు వచ్చారన్న వార్త మొదటి తరగతిలో కూర్చుని సినిమా చూస్తున్న కంపెనీ మేనేజరుకు తెలిసింది పళ్ళు పట పట కొరికాడు

సినిమా మొదలైన తర్వాత సారా కోనంగిని ఉక్కిరి బిక్కిరి చేసింది కోనంగి ఆమె పెదవులను స్పృశించాడు సినిమా ఎలానో పూర్తయింది తిరిగి వచ్చేటప్పుడు కార్లో సారా కోనంగిని ముద్దుల వర్షంలో ముంచెత్తింది కోనంగి ఆమెను నలిపివేశాడు. తనకు పెండ్లి కాకుండా స్త్రీసంబంధం ఇష్టంలేదని చెప్పి ఆమెను యింటివద్ద దించి చరచరా వెళ్లిపోయాడు తెల్లవారి కంపెనీకి వెళ్ళగానే మేనేజరు తనను ఉద్యోగంలోంచి తీసివేస్తున్నామని చెప్పి 50 రూపాయలు చేతిలో పెట్టాడు

చిరునవ్వుతో కోనంగి అందరి స్నేహితుల దగ్గరా శలవు పుచ్చుకున్నాడు సారాను కలిసి తన పిరికితనానికి మన్నించమన్నాడు రేపు శనివారం

సాయంకాలం తన యింటికి రమ్మని సారా ఆహ్వానించింది. కోనంగి నవ్వుతూ వెళ్ళిపోయాడు.

ఆ మిట్టమధ్యాహ్నం వేళ నేరుగా గుజరాత్ హోటలు కెళ్ళి ఏదైనా ఉద్యోగం ఇమ్మన్నాడు. బి.ఎ. చదువుకున్న వాళ్ళకు ఉద్యోగాలేమీ లేవని మేనేజరు బాలక్ రామ్ అన్నాడు. తన చేతనైన తెలుగు వంటకాలు చేస్తానని చెప్పి ఒప్పించి నెలకు 6 రూపాయలు జీతం మీద మర్నాడు కోనంగి పనిలో చేరాడు. అక్కడే బస కూడా. ఆ శనివారం శలవు పెట్టి సారా యింటికి వచ్చాడు. సారా తప్ప మిగిలిన వాళ్ళంతా సినిమాకెళ్ళారు. సారా, కోనంగి ఫలహారాలు చేసి కబుర్లు చెప్పుకో సాగారు. కంపెనీ మేనేజరుతో తనకు శారీరకసంబంధం వుందని అలాంటిది తన జాతిలో తప్పేమీ కాదని సారా చెప్పింది. మేనేజరు స్టువర్టు ఆ రాత్రివచ్చి తనతో గొడవ పడ్డాడని చెప్పింది. కోనంగిని ఉద్యోగంలోకి తీసుకోకపోతే తాను కూడా ఉద్యోగం మానివేస్తానని చెప్పానని అంది. కాబట్టి తిరిగి ఉద్యోగంలో చేరమని మేనేజరు వచ్చి కోరుతాడని అంది.

కోనంగికి ఆ సాయంకాలం అనంతలక్ష్మి నుండి ఉత్తరం వచ్చింది. నాకు తెలుగు పాఠాలు చెప్తానన్నారు! రాలేదేమి? అని సారాంశం. మరునాడు ఆదివారం కంపెనీ మేనేజరు కోనంగిని తిరిగి ఉద్యోగంలో చేరమని కోరాడు. ఆత్మని చంపుకొని మళ్ళీ మీ దగ్గర ఉద్యోగం చేయలేనని ఖండితంగా చెప్పాడు.

కోనంగి ఆ సాయంకాలం అనంతలక్ష్మి యింటికి వెళ్లాడు. అక్కడ చెట్టిగారి కారు వుంది. కోనంగిని చూడగానే అనంతలక్ష్మి ముఖం వికసించింది కోనంగి హృదయం ఆగిపోయింది. ఆమె పరమాద్భుత సౌందర్యం అతణ్ణి ముగ్ధుణ్ణి చేసింది. శకుంతలాదుష్యంతులవలె వారు మాటామంతీ లేకుండా వుండిపోయారు.

అనంతలక్ష్మి ప్రైవేటు మాష్టార్ల దగ్గర పాఠాలు నేర్చుకోవడం చెట్టిగారికి యిష్టంలేదు. కానీ అట్టే ఒత్తిడిచేస్తే కథ అడ్డం తిరుగుతుందని వూరుకున్నాడు.

ఆయన తారల మద్య చంద్రుడు వ్యాపారంలో సంపాదించిన డబ్బు ఆడవాళ్ళ మీద ఖర్చు చేస్తాడు ఆమెను చూసిన మొదటిరోజునుండి ఆమెను లోబరచుకోవాలని జయలక్ష్మిని ఎన్నో రకాలుగా ప్రాదేయ పడ్డాడు జయలక్ష్మి కూడా సంబరపడింది

ఎందుకైనా మంచిదని అనంతలక్ష్మి గదిలోకి వచ్చిన చెట్టిగారికి శృంగార రసం గురించి పాఠం చెబుతున్న కోనంగి మాష్టారు కనిపించాడు అక్కడే తిష్ఠ వేశాడు చెట్టిగారు ఈవాల్టికి చాలునని కోనంగి బయలుదేర బోయాడు చెట్టిగారు కోనంగి వివరాలు అడిగి తెలుసుకున్నారు చెట్టిగారు మండి పడ్డారు. అనంతలక్ష్మి కోనంగిని వేరొక గదిలోనికి తీసుకొనిపోయి అల్పాహారం పెట్టింది. రేపటినుంచీ మాయింట్లోనే భోజనం చేయమని బ్రతిమాలింది ఎంతసేపటికి అనంతలక్ష్మి తిరిగిరాలేదని చెట్టిగారు ఆమెను గురించి పరిచారిక నడిగారు కొత్త అయ్యవారు, అమ్మాయి కార్లో యెక్కడికో వెళ్ళారని ఆమె చెప్పింది. చెట్టిగారు యేడ్చినంత పని చేశారు పట్టుదల యెక్కువైంది కొత్త కుర్రవాడితో ఎలా వెళ్ళిందా అని జయలక్ష్మి ఆవేదన పడింది తన భర్త ఫోటో దగ్గరకు వెళ్ళి 'అనంతలక్ష్మిని గూర్చి యేమి ఆలోచించారు స్వామీ!' అని దీనంగా ప్రార్థించింది

అనంతలక్ష్మి కారులో కోనంగి ప్రక్కన కూచుంది శృంగారావస్థలో అతడికి ఏదో మత్తు అలముకుంది అనంతలక్ష్మి సిగ్గుతో ముడుచుకు పోయింది యెక్కడికి వెళ్ళాల్సిందీ తెలియక డ్రైవరు బీచి వెంట బజారుల వెంట కారు తిప్పాడు చివరకు బీచి దగ్గర కారు ఆపి తలుపు తీశాడు ఇద్దరూ కొంత దూరం నడిచివెళ్ళి చెట్టునీడన చతికిల పడ్డారు ఇంత సేపూ వారు ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు ఇప్పుడు నోరు పెగల్చుకుని పాఠం గురించి ప్రస్తావించాడు కోనంగి. మీరు ఉద్యోగం మానివేస్తే మాయింటికి రావచ్చునని అనంతలక్ష్మి సూచించింది నేనే ఉద్యోగమూ చేయలేను చేయకుండా వుండలేను నా జీవితంలో ఏదో అసంతృప్తి అన్నాడు కోనంగి రిక్షాలాగాలని వుందని కోనంగి అన్నాడు ఉపాధ్యాయ వృత్తిలో వుండటం తన కిష్టమే నన్నాడు మీరునాకు తెలుగు చెప్పటం మానవద్దని అనంతలక్ష్మి ప్రాధేయ పడింది రోజూ కారు పంపుతాననీ, రాత్రి పూట అయినా పాఠాలు

చెప్పవచ్చుననీ అనంతలక్ష్మి అంది నాకు జీతం యివ్వకుండా వుంటే నేను పాఠాలు చెప్తాను అన్నాడు ఇద్దరూ పక్క చూపులతో ఒకరినొకరు చూసుకున్నారు పకపకానవ్వుకున్నారు హృదయాలు ఉప్పొంగిపోయాయి. ఇద్దరూ తిరిగి కార్లోకొచ్చి ముందు వెనుక కూచున్నారు

కోనంగి కోసం రాత్రులు కారువచ్చేది పదిన్నర గంటలవరకు పాఠాలు అనంతలక్ష్మికి చెప్పి తిరగి వచ్చేవాడు తెలుగు భాషను గురించి, సాహిత్యం గురించి చెప్పాడు. అతడు చక్కగా పాఠాలు చెప్పగలడు కంఠం మధురమైంది పాఠంచెప్పే విధానం చూసి జయలక్ష్మి, అనంతలక్ష్మి సంతోషపడ్డారు. పాఠం పూర్తయేదాకా జయలక్ష్మి వాళ్ళదగ్గర కూచునేది ఇలా 15 రోజులు గడిచాయి ఒకరోజు కోనంగి హోటలుకు తిరిగివెళ్ళినమీదట ఒక జమిందారు గారు పిలుస్తున్నారని కారువచ్చి నిలబడింది కోనంగి కారులో కూచుని వెళ్ళాడు కొంత దూరంవెళ్ళాక ఆ పిలుచుకొచ్చిన మనిషి బలంగా కోనంగిని కొట్టాడు చెంపలు వాచిపోయాయి కిందపెదవి తెగి రక్తం కారుతోంది కోనంగి అతని మీద కలియబడ్డాడు కొంత దూరం పోయాక డ్రైవరు కూడా తిరుగుబాటు చేశాడు కత్తితో పొడవ బోయాడు కోనంగి బలంగా వారిద్దరినీ ఎదిరించి ఎలానో తప్పించుకున్నాడు వాళ్ళు ఇతనితో లాభంలేదనుకున్నారు కోనంగి కారు టైర్లను అకత్తితో కోసిపారేశాడు వాళ్ళిద్దరూ పరుగు తీశారు అక్కడికి మదరాసు 15 కిలోమీటర్ల దూరం కోనంగి బ్రతుకు జీవుడా అని రోడ్డు మీద నడుచుకుంటూ బయలుదేరాడు బహుశా ఈపని చెట్టియార్ చేయించి వుంటాడు అనుకున్నాడు

నడుస్తుంటే బాధగా వుంది ఒళ్ళునొప్పులు ఎక్కువయాయి తెలతెల వారే వేళకు సైదాపేట బస్టాండు వద్దకు వచ్చి అక్కడ నుండి బస్సుఎక్కి గుజరాత్ హోటలు చేరుకున్నాడు ఎన్నోరోజుల తర్వాత కళ్ళుతెరిచి చూస్తే ఎదురుగా తనకు పరిచర్యలు చేస్తూ అనంతలక్ష్మి కూచొని వుంది. 10 రోజులుగా అతనికి ఒళ్ళు తెలియని మలేరియా జ్వరం మనుషులను కూడా గుర్తుపట్టలేకపోయాడు

ఎలానో కోనంగి బ్రతికి బయటపడ్డందుకు అనంతలక్ష్మి సంతోషించింది. చెట్టి రోజూవచ్చి పరామర్శించి వెళ్ళేవాడు. హోటలులోనే కోనంగి దిక్కులేకుండా చస్తాడనుకుంటే కథఅడ్డం తిరిగింది. అనంతలక్ష్మి హృదయం నవనీతం. ఆమె కోనంగికి దాది అయింది. అతని జర్వం తగ్గేవరకు కాలేజీ గడపతొక్కలేదు. తాను కూడా అయ్యంగారిని అలానే ప్రేమించానని జయలక్ష్మి లోలోపల అనుకుంది. నీరసంలో కూడా కోనంగి యేవేవో మాట్లాడాడు. పథ్యాలు పూర్తయిన తర్వాత కోనంగి కోలుకున్నాడు. వెనుకటి తేజస్సు వచ్చింది.

తాను గుజరాత్ హోటలుకు వెళ్ళిపోతానని కోనంగి పట్టుబట్టాడు. ఈలోగా చెట్టిగారు కోనంగి పుట్టుపూర్వోత్తరాలు వాకబు చేసి తల్లి జారిణీ అనీ, కోనంగి ముండల ముఠాకోరుఅనీ జయలక్ష్మికి చెప్పాడు. కూతుర్ని కోనంగి వూసు పట్టించుకోవద్దని తల్లి నూరిపోసింది. ఇది చెట్టి మాటల ప్రభావమని అనంతలక్ష్మికి తెలుసు.

డాక్టర్ని అడిగి అనంతలక్ష్మి అతని వ్యాధి గురించి వివరాలు తెలుసుకుంది. అతనికేమీ స్త్రీసంబంధ వ్యాధులు లేవని డాక్టరు నిర్ధారించాడు. డాక్టరుని కలిసి చెట్టియేవో వ్యాధులున్నట్లుగా అనంతలక్ష్మికి చెప్పమని కోరాడు.

డాక్టరు రంగనాయకుల రెడ్డి కమ్యూనిస్టువాది. ఆరోజుల్లో కాంగ్రెసులో వామపక్షం వారుండేవారు. ప్రభుత్వం కమ్యూనిస్టు సంఘాలను నిషేధించింది. డాక్టరు 1930లో ప్రాక్టీసు ప్రారంభించాడు. కాంగ్రెస్ శిబిరానికి వైద్యం చేసినందుకు ఆయనను జైలుకు పంపారు. 1934లో ఆయన జైలునుండి తిరిగి వచ్చాడు. రెడ్డిగారు రంగయ్యంగారికి కుటుంబ వైద్యులు. అందువల్ల చెట్టి పదివేల రూపాయలు ఇస్తాను అబద్దం చెప్పమంటే అంగీకరించలేదు. కోనంగి అంటే ఆయనకు ఎంతో ఇష్టం.

కోనంగిని పరామర్శించేందుకు డాక్టరు వెళ్ళినపుడల్లా వారిద్దరిమధ్య అనేక విషయాలపై చర్చలు జరిగేవి. కోనంగిని తన యింటికి వచ్చివుండమని

డాక్టరు కోరాడు. అనంతలక్ష్మి తమ యింట్లో వుండిపొమ్మని బలవంతం చేసింది.

అప్పుడు ప్రపంచ యుద్ధం జరుగుతోంది. జర్మనీ విజృంభిస్తోంది. రష్యా, ఫిన్లెండ్లు తలపడ్డాయి.

తమ యింట్లో ఉండమంటే వుండనందుకు అనంతలక్ష్మికి కోనంగిపై కోపం వచ్చింది. హోటలు యజమాని కోనంగికి నెలకు 20 రూపాయలు జీతం ఇస్తున్నాడు. ఆరాత్రి యధా ప్రకారం కారులో అనంతలక్ష్మి యింటికి వెళ్ళాడు. అనంతలక్ష్మికి కోపం ఎందుకు వచ్చిందో అతనికి అంతుపట్టడం లేదు. కోపంలో కూడా ఆమె అందంగా వుంది. ఆమె ఆరోజు ముభావంగా పాఠాలు వింది. నీకెందుకు కోపము వచ్చింది? అని అడిగాడు కోనంగి. అనంతలక్ష్మి అతని పాదాలపై వ్రాలి మాయింట్లోనే వుండిపోండి అంది. అతడామెను పైకి లేపి గుండెలకు హత్తుకున్నాడు. జయలక్ష్మి వచ్చి ఆలస్యమైంది ఏమని? అడిగింది. అనంతలక్ష్మి మాష్టారు మన యింట్లోనే ఇంకొక 15 రోజులు వుంటే బాగుండునని తల్లితో చెప్పింది. తిరిగి వెళ్ళడానికి కారు లేకపోవటంతో కోనంగి వాళ్ళయింట్లోనే ఆ రాత్రికి బస చేసారు. అనంతలక్ష్మి తెల్లవారి వచ్చి నిద్రలేపిందాకా అతడికి మెలుకువే రాలేదు.

తనంత దురదృష్టవంతులు మరొకరులేరని కోనంగి నమ్మకం. అనంతలక్ష్మిని పెళ్ళిచేసుకోవడానికి తనకు భయమెందుకు? ఉద్యోగం లేదనా? తాను ఆమెను వదలిపోతే ఒక నెలరోజుల్లో తనను మరచిపోతుంది. పెళ్ళి ప్రస్తావన తెచ్చినపుడు కోనంగి దాటవేశాడు. అనంతలక్ష్మి కోపంగా వెళ్లిపోయింది. గుజరాత్ హొటల్ యజమాని ఉద్యోగంలోంచి కోనంగిని తీసివేశాడు. ముందురోజు చెట్టిగారు అతనికి ఏవేవో చెప్పివెళ్ళాడట. కోనంగి సరేనని అక్కడ నుండి నెల్లూరు హొటలుకు మకాం మార్చాడు.

తాను సరదాగా కోప్పడితే కోనంగి నిజమనుకొని వెళ్ళిపోయాడేనని అనంతలక్ష్మి బాధపడింది. నేరుగా గుజరాత్ హొటల్‌కి వెళ్లింది. అక్కడనుండి కోనంగి ఖాళీచేసి వెళ్లాడని తెలుసుకొని బాధపడింది. హాస్టలుకు వెళ్లి ఒక స్నేహితురాలి గదిలో తలనొప్పిగావుంటే పడుకొంది.

తాను కావాలనుకొన్న ప్రతివస్తువు తనకు తల్లిదండ్రులు తెచ్చిపెట్టారు ఈనాడు కోనంగి తనను కాదనడం భరించలేకపోయింది చెట్టియారు తనను పెళ్లిచేసుకోమంటాడు. తనకు బుద్ధి పుట్టడంలేదు ఇంతలో స్నేహితులంతా వచ్చి యిది ప్రేమజ్వరం అని ఆటపట్టించారు. కోనంగి వల్ల వచ్చిందని ఎగతాళి చేశారు

కోనంగికి ఏమిచేయాలో తోచలేదు రాజకీయాలలో చేరడానికి ధైర్యం చాలలేదు సాహిత్యమన్నా, కళలన్నా ఇష్టం రెండురోజులు నెల్లూరు హోటల్లోనే ఉండిపోయాడు మూడోరోజు అనంతలక్ష్మి నిర్బంధించింది

కోనంగి ఆమెను గాఢాలింగనం చేసుకొన్నాడు ఆమెకళ్లలో నీళ్లు తిరిగాయి 'మీ అమ్మతో మన పెళ్లి విషయం చెప్పేద్దాం' అని కోనంగి అనంతలక్ష్మిని హెచ్చరించాడు

1940 జనవరిలో కోనంగి ఒక తెలుగు సినిమా కంపెనీలో కథానాయకుడుగా చేరాడు తన 'పోర్షన్' కంఠతా పట్టాడు ఆ సినిమా దర్శకుడు వి యల్ నారాయణ సినిమా సంగతులు తెలుసుకోవడానికి కోనంగి సినిమా గురించి పుస్తకాలు ఎన్నో చదివాడు డాక్టరు రెడ్డిగారి సిఫార్సు మేరకు సినిమా ప్రవేశం కోనంగికి కలిగింది రెడ్డిగారు, కోనంగి రాజకీయాల మీద, యింకా అనేక విషయాల మీద చర్చించుకొనేవారు

సినిమాలో చేరింతర్వాత బందరులో తల్లికి కోనంగి ఎక్కువ డబ్బు పంపగలిగాడు అంతకుముందు నెలకు 50 రూపాయలు పంపగలిగేవాడు కదానాయికగా ఒకమోస్తరు అందగత్తెను ఎంచుకొన్నారు ఆమె ఒక ప్రొడ్యూసరు వుంచుకున్న పిల్ల అందువల్ల చేర్చుకోక తప్పలేదు ఆమె సరిగా మాటలు పలకలేదు.

'సహస్రకంఠ రావణాసుర' చిత్రం తీద్దామని డైరెక్టరు సంకల్పం పౌరాణికం తీయడంకన్నా సాంఘికం తీస్తే బాగుంటుందని కోనంగి సలహా ఇచ్చాడు డాక్టరుగారు కూడా దాన్ని సమర్థించారు (రావణాసుర) సినిమా కథకు, కదానాయికకు యిచ్చిన ఆహ్వానం వదులుకొని కొత్తసినిమా ప్రయత్నాలు మొదలుపెట్టారు

విశ్వంభర మూర్తి కథ ఎంపిక చేశారు కోనంగి సూచన మేరకు 'దుక్కిటెద్దులు' అని సినిమాకు పేరు పెట్టారు రైతు జీవితంపై ఆదారపడిన కద అందులో 10 పాటలున్నాయి. కథానాయకుడు పాడినవి మూడు

అనంతలక్ష్మికి కోనంగి సినిమాల్లో నటించడం ఇష్టంలేదు అయినా తన ప్రియుడు అందరి సినిమా హీరోలలా బాగా పేరునంపాదిస్తాడని సినీ చక్రవర్తి అవుతాడని పొంగిపోయింది కాని కథానాయికా నాయకులు అలా కలిసిమెలసి తిరగడం, పాటలు పాడటం, పడుకోవడం ఆమె వూహించలేక పోయింది. దాంతో ఆమె కుంగిపోయింది చిత్రం మొదలై వారం రోజులైంది. రెండువేల అడుగుల చిత్రం తీశారు

కోనంగి సినిమావిశేషాలు అనంతలక్ష్మికి చెప్పాడు నాయికానాయకులు అందులో యుగళగీతం ఎలాపాడింది వివరించి చెప్పాడు అనంతలక్ష్మి పులకరించి కోనంగి కౌగిట్లో యిమిడిపోయింది త్వరగా పెళ్లి చేసుకొందామని బలవంతం చేసింది నేను నీకు తగననీ, నీప్రేమకు పాత్రుడనయ్యాననీ కోనంగి ఆమెకు విశదం చేశాడు.

ఇంతలో చెట్టియారు లోపలికి వచ్చారు.

కోనంగీ అనంతలక్ష్ములు ప్రణయ విషయాలు మాట్లాడుకొంటున్నారని పసిగట్టి మండిపడ్డాడు. పైకి ఏమీ ఎరగని వానిలా నవ్వుతూ వారి దగ్గరకు వచ్చి కూచొన్నాడు సినిమా విషయాలు అడిగి తెలుసుకొన్నాడు అనంతలక్ష్మి ఏదో పనివున్నట్లు లోపలికెళ్ళిపోయింది. ఎంతసేపటికీ చెట్టి వీళ్లను వదలడం లేదు.

కోనంగి వెళ్ళిపోగానే చెట్టిగారు సంతోషపడ్డారు మలయానుంచి తాను తెచ్చిన బహుమతులు అనంతలక్ష్మికి ఇచ్చి సంతోషపెట్టవచ్చునని సంబరపడ్డాడు ఇంతలో అనంతలక్ష్మి కారులో బయటికి వెళ్ళిందని తెలిసి కోపంతో చిందులు వేశాడు దీని పొగరు మితిమీరి పోతుందని విరుచుకపడ్డాడు. జయలక్ష్మిని పిలిచి తాను విదేశాలనుండి తెచ్చిన బహుమతులన్నీ విప్పిచూపించాడు దాదాపు 15వేల రూపాయలు పైనే వుంటుందివాటి ఖరీదు జయలక్ష్మికి ఆశ్చర్యం వేసింది ఆమె తలవంచుకుని వుంది చెట్టి

ఆమెభుజం మీద చేయివేశాడు. ఆమె కోపంతో మండిపోయి నాకు మీ బహుమానాలు వద్దు నేను మిమ్ము ఆశించలేదు. అమ్మాయి కోనంగిని ప్రేమిస్తోంది. శలవు అని చెప్పి బహుమతులన్నీ కారులో పెట్టమని పరిచారికకు చెప్పి వెళ్ళిపోయింది.

ఆరోజు మదరాసుకు 20 మైళ్ల దూరంలో 'అవుట్‌డోర్' షూటింగు జరుగుతోంది. అక్కడ పొలాల్లో చిత్రీకరణ చేస్తున్నారు. ఒక రంగం తరువాత ఒకరంగం స్క్రిప్టు ప్రకారం తీస్తున్నారు కోనంగిది బంగారు ఛాయ. వేషధారణ చేసినపుడు అందంగా వుంటాడు. నాయిక వేషం వేసిన అమ్మాయి కొత్తది గడుసుపిల్ల. ఆమెకు దేహం అమ్ముకోవడం క్రొత్తకాదు. డైరెక్టర్లు, సంగీత దర్శకుడు, మేకప్ మెన్, ఆమె పొందు అనుభవించారు. కోనంగిని కూడా ప్రేమించింది. కానీ అతడు అంటీ అంటనట్లు తిరుగుతున్నాడు. డాక్టరుగారు అది గమనించాడు. అభినయంలో ఆతేడా కనిపిస్తోంది. అందుకని ఇంత డబ్బుపెట్టి తీస్తున్న చిత్రం నీఅభినయం వల్ల పాడవుతోందని కోనంగిని హెచ్చరించాడు. కోనంగి ఆవిషయం గ్రహించాడు. ఆమె మాత్రం నిజంగా తనను ప్రేమిస్తోంది కాబట్టి చక్కగా నటిస్తోంది. తాను మాత్రం చనువుగా ఉండలేక పోతున్నాడు. అతడు కరుణరసాన్ని అభినయించినపుడు సెట్టుమీద అందరికి కళ్ళనీళ్లు తిరిగాయి.

అనంతలక్ష్మి ఒకరోజు కోనంగి అభినయచాతుర్యం చూసి ఆశ్చర్యపోయింది. ఆయన గంభీర మధుర కంఠం ఆమెకు నచ్చింది. అతడు నవ్వుతాడు, ఆవేదన పడతాడు. నవ్విస్తాడు. కానీ అతని హృదయంలో భయంకరాగ్నిశిఖలు మండుతున్నాయి. బాల్యంలో తాను పడిన బాధలు అతనికి బాగా గుర్తు. తన తల్లి ఎన్నిబాధలు పడిందీ, అతనికి తెలుసు, ఆమెభర్త చనిపోయిన తర్వాత ఏవిధంగా కుమిలిపోయిందీ గుర్తుకు తెచ్చుకున్నాడు. ఇప్పుడు ఆమె ఎవరికో వంట చేసి బ్రతుకుతోంది. కోనంగి పంపిన డబ్బు ఆమె అతనికోసమే దాచిపెడుతున్నానని వ్రాసింది.

1940 డిసెంబరు కల్లా సినిమా పూర్తి అయింది. కోనంగికి మూడువేల దాకా గిట్టింది. అందులో నాయికకు పదివేలు ముట్టింది. పత్రికలు కోనంగి

పాట, అభినయం మెచ్చుకొన్నాయి.

దుక్కిటెద్దులు చిత్రం దేశంలో డబ్బు దోచింది. కథానాయిక వాణి కోనంగిని గాఢంగా ప్రేమించింది. ఆవిషయం సూటిగా చెప్పింది. ఒకరోజు తన యింటికి కోనంగిని రమ్మంది. కోనంగి వెళ్ళాడు. ఆమె అమాంతం కౌగిలించుకొంది. కాని కోనంగి తిరస్కరిస్తున్నాడు. కనీసం ఒక్క నెలరోజులు తనతో ఉంటే పదివేలు సమర్పిస్తానంది. కోనంగి తానొక అమ్మాయిని ప్రేమిస్తున్నానని చెప్పి తప్పించుకొన్నాడు. ఆ తర్వాత ఆ అమ్మాయి పెళ్ళి చేసుకొని స్థిరపడిపోయింది. ఆపెళ్లి కొడుకులో కోనంగినే చూసుకొన్నానని పెళ్ళికి వెళ్తే చెప్పింది.

సినిమా ప్రపంచంలో కుళ్లు కోనంగికి ఏవగింపు కలిగించాయి. అందులో మళ్లీ ప్రవేశించదలచుకోలేదు. కోనంగి సినమాల్లో నటిస్తున్నప్పుడు అనంతలక్ష్మి అతణ్ణి శంకించింది. నిన్నే ప్రేమిస్తున్నానని కోనంగి నమ్మబలికాడు.

కోనంగికి రాజకీయాలలో ప్రవేశించాలని వుంది. గాంధీజీ గూర్చిన గ్రంథాలు చదివాడు. డాక్టరు గారిచ్చిన గ్రంథాలు చదివాడు. అహింసా మార్గము, రష్యామార్గమూ రెండూ మంచిగానే అనిపించాయి.

అనంతలక్ష్మి ఇంటరు ఫస్టుక్లాసులో ప్యాసయ్యింది. బంగారు పతకాలు వచ్చాయి. కోనంగి చెప్పిన ముఖ్యమయిన ప్రశ్నలు చాలా వచ్చాయి. ఆ సమయంలో కోనంగి షూటింగులో ఉన్నాడు. ఆ రాత్రికి వారిద్దరూ కులాసాగా కబుర్లు చెప్పుకొన్నారు.

రాజకీయాలలో చేరే విషయంలో డాక్టరుగారితో కోనంగి బాగా చర్చించాడు. ప్రభుత్వం సామ్యవాదంపై కత్తిగట్టి అనేక మందిని నిర్బంధంలో వుంచింది. కేసులు పెట్టి శిక్షించి జైలుకు పంపింది.

కోనంగి దేశంలోని జాతీయశక్తుల విజృంభణ ఒక్కసారిగా జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. తాము చేస్తున్న పనులకు భంగం కలగకుండా రాజకీయాలలో పనిచేసేవారు కొందరు. మరికొందరు జాగ్రత్తగా జాతీయ నాయకుల్ని కలుస్తూంటారు. డాక్టరుతోపాటు కోనంగి కూలీల సమావేశాలకు వెళ్లి ప్రసంగించేవాడు. కొంచెంఘాటూగా మాట్లాడాలని రెడ్డిగారి సూచన.

కోనంగి ఒకరోజు రాత్రి అనంతలక్ష్మి ఇంటికి వెళ్లాడు ఆమె బి.ఏ చదువుతోంది జయలక్ష్మి కోనంగితో అనంతలక్ష్మి పెళ్ళి ప్రస్తావన తెచ్చింది అనంతలక్ష్మి చెట్టిగారిని చేసుకోనంటుందనీ, అతడు తమపై వ్యాజ్యం వేసి ఆస్తిలో బాగంకోసం అడుగుతున్నాడనీ చెప్పింది చెట్టి గుణగణాలు తెలుసుగాబట్టి కోనంగి ఆశ్చర్యపోలేదు అనంతలక్ష్మిని పెళ్లి చేసుకోవడం కంటె ఆమెను అనుభవించడమే అతని లక్ష్యం చెట్టి కదలు సినిమా రంగంలో బాగా చెప్పుకొంటారు జయలక్ష్మి గాని, అనంతలక్ష్మిగాని అతనికందకపోవడం తలవంపులుగా ఉంది అందుకని వారిపై కత్తికట్టాడు.

రంగయ్యంగారు విల్లు వ్రాసిపెట్టి వెళ్ళారు దాని ప్రకారం ఆస్తి జయలక్ష్మికి సంక్రమించింది అయితే అందులో రంగయ్యంగారు అన్న దస్కత్తులేదు కాని ఆయన వ్రాసిన ఉత్తరాలలో ఆస్తి పంపకాన్ని అంగీకరించాడు అది ఆధారంగా కోనంగి వాదించవచ్చుననుకొన్నాడు

అనంతలక్ష్మి ఒకరోజు కోనంగిని మీరెవరినైనా ప్రేమించారా అని అడిగింది 'అనీ' అనే ఆంగ్లోఇండియన్ బాలిక తనను వాంచించిందనీ, కాని తాను మాత్రం అనంతలక్ష్మిని తప్ప యితరుల్ని ప్రేమించలేదనీ చెప్పాడు ఆమె కోనంగి కౌగిలిలో వాలిపోయింది

జయలక్ష్మి కోనంగితో వారి వివాహ విషయం ప్రస్తావించింది తాను దరిద్రుడననీ వారితో తులతూగలేననీ కోనంగి సవినయంగా చెప్పాడు జయలక్ష్మి మా అమ్మాయిని మీరు చేసుకోకపోతే ఆమె జీవితంలో కుంగిపోతుందనీ, పెళ్లి చేసుకోమనీ ప్రార్థించింది ముహూర్తాలు పెట్టించడానికి ఒప్పుకొన్నాడు కోనంగి

కోనంగికి మొదటి నుంచీ కాంగ్రెసు వారితో మంచి స్నేహం స్నేహితులలో కోనంగి ఎప్పుడూ వాదిస్తూంటాడు కోనంగికి మంచి స్నేహితులిద్దరు ఒకరు డాక్టరు రంగనాయకులు రెడ్డి, మరొకరు రియాసత్ అలీ కోనంగి కూడా ఆంధ్రమహాసభలో సభ్యుడయ్యాడు

ఆంధ్రమహాసభవారు 'ఉషాపరిణయం' నాటకం వేస్తూ కోనంగిని వేషం వెయ్యమన్నారు ప్రద్యుమ్నుడి వేషం యిచ్చారు దుక్కిటెద్దులు చిత్రంలో

తనసరసన నాయికగా వేసిన వాణి రతీదేవి మళ్లీ భార్యాభర్తలంగా వేస్తున్నామని ఆమె కోనంగితో చెప్పి పొంగిపోయింది నాటక ప్రదర్శన విషయంలో తన అభిప్రాయాలను కోనంగి ఆంధ్రమహాసభ కార్యదర్శికి స్పష్టంగా చెప్పాడు

పద్యాలు గొంతుచించుకొని పాడ నవసరం లేదన్నాడు నాటకంలో నటులు అందరూ కలిసిపనిచెయ్యాలి మాట్లాడవలసినచోట ఆభావాన్ని పద్యంగాగాని, పాటగాగాని అభినయం చెయ్యకూడదు వేషాలు వేయడం కొత్తరకంగా ఉండాలి. రిహార్సల్సు బాగా జరగాలి. ఇలా తన సలహాలు కోనంగి చెప్పాడు

మధ్యలో కోనంగి సలహాలు నచ్చక కొందరు అడ్డుపడ్డారు కోనంగి నాటకంలో వేషం వెయ్యలేనన్నాడు కోనంగి లేకపోతే మేము వేయమని ఉష, రతి వేషాల అమ్మాయిలు ఖండితంగా చెప్పారు కార్యదర్శి వాళ్ళ కాళ్ళావేళ్ళాబడి బ్రతిమాలుకొన్నాడు చివరకు అందరూ అంగీకరించారు

నాటకం రిహార్సల్సు బాగా నడచాయి. ప్రద్యుమ్నుని పాత్ర పోషణ, మాయాదేవి పాత్రపోషణా, అందరూ మెచ్చుకొన్నారు. నాటకానికి కోనంగి అసలు దర్శకుడయ్యాడు నాటక ప్రారంభసమయంలో ప్రదర్శన రోజు యిద్దరు పండితులు ఉషాదేవిని ప్రార్థిస్తూ వేదసూక్తం గానం చేశారు తెర పైకి లేవగానే భారతస్వాతంత్రోద్యమ ఉషోదయం గూర్చి గానం చేశారు నాటకం ఎంతో రక్తి కట్టింది

ప్రద్యుమ్నుని పాత్ర ధరించిన కోనంగిని అందరూ మెచ్చుకొన్నారు అనంతలక్ష్మి పరుగున వచ్చి కోనంగిని ప్రశంసించింది ఇంతలో సీతాదేవి అక్కడికి వచ్చి కోనంగి నటనను మెచ్చుకొంది మర్నాడు తమ యింటికి అనంతలక్ష్మి కోనంగులను టీపార్టీకి ఆహ్వానించింది

కోనంగి అనంతలక్ష్మి, జయలక్ష్మిలతో కలిసి కార్లో బయలుదేరాడు జయలక్ష్మి దారిలో చెట్టి చేయిస్తున్న గోల చెప్పింది అరవ వారపత్రికలలో

అమ్మాయిని గురించి భయంకరమైన వార్తలు వ్రాయిస్తున్నారు అందుకు గాబరాపడవద్దని అనంతలక్ష్మి, కోనంగి నర్దిచెప్పారు కోనంగి తిరిగి డాక్టరు వద్దకు వచ్చేశాడు

అనంతలక్ష్మి త్వరలో తన పెళ్ళి చెయ్యమని తల్లితో నిర్మొహమాటంగా చెప్పింది

కోర్టువ్యాజ్యాలు అయిన తర్వాత చూద్దామని జయలక్ష్మి నర్ది చెప్పబోయింది కళాశాలలో చెట్టి పుట్టించిన పుకార్ల గురించి అనంతలక్ష్మి చెప్పింది తల్లి ముహూర్తం పెట్టించడానికి అంగీకరించింది అనంత ఆనందానికి అవదులు లేవు కోనంగి రాగానే కౌగిలించుకొని వుక్కిరి బిక్కిరి చేసి ఎక్కడికైనా బయటికి తీసుకెళ్ళాలని అనుకొంది

ఒక రోజు కారులో అనంతలక్ష్మి కోనంగులు సినిమా నుంచి తిరిగి వస్తున్నారు మధ్యలో ఆమె అతనిపై తన ప్రేమను అదికంగా వర్ణింపజేసింది మాటల మద్యలో అతను స్త్రీ పురుషులు ప్రేమ అని కూచోగూడదు గదా అన్నాడు అనంతలక్ష్మి యింటికి రాగానే తన గదిలోకి పోయి ఏడుస్తూ కూచొంది.

ఆమె గదిలోకి వెళ్ళి ఆమెను పొదివి పట్టుకొని ఆమెపై తనకు గల ప్రేమను వెల్లడించాడు అప్రయత్నంగా కళ్ళనీళ్ళు వచ్చాయి అతనికి ఆమె అది గమనించి మనస్సులో బాద పడింది

కోనంగి కిందికి దిగివచ్చి సోఫాలో కూచొని ఆలోచిస్తున్నాడు తాను బీదవాడు ఆమె దనికురాలు తనను చేసుకోవాలని ఆమె గాడంగా కోరుతోంది ఇలా ఆలోచిస్తూ ఆ రాత్రి అక్కడే వుండిపోయాడు జయలక్ష్మి అక్కడికి వచ్చి చూసి అమ్మాయి దిగులు పడుతోందని చెప్పింది కోనంగి నేరుగా ఆమె గదిలోకి వెళ్ళి తనను క్షమించమనీ, తన తప్పును మన్నించమనీ కోరాడు అనంతలక్ష్మి గాఢంగా అతణ్ణి కౌగలించు కొంది ఇద్దరూ ఉదయశంకరనాట్యం చేశారు జయలక్ష్మి అది దూరంగా చూసి

ఆనందించింది.ఇద్దరూ కలిసి వెన్నెట్లో తాముకూచోనే పొదరింటిపందిరి కడకు వెళ్ళి బల్లపై కూచొన్నారు. ఇద్దరూ ఒకరినొకరు గాఢంగా వాంఛించారు. కాని వివాహం కాలేదనే స్పృహ వచ్చి కౌగిట్లోనుండి విడిపోయారు.

అనంతలక్ష్మి కోనంగుల వివాహం వైభవంగా జరిగింది. పెళ్ళికి నగరంలో పెద్దలంతా పార్టీలతో సంబంధం లేకుండా హాజరయ్యారు. మూడురోజులపెళ్ళి. సాయంకాలాలో గానసభలు, నృత్యప్రదర్శనలూ జరిగాయి.

కోనంగి స్నేహితులెందరో వచ్చారు. వారి రాక పోకల ఖర్చులు అతడే ఇచ్చాడు. కోనంగి అదృష్టాన్ని వారు పొగిడారు. సీతాదేవి, సారా కుడా వచ్చారు. సారా అనంతను అభినందించింది. నాలుగోరోజు వధూవరుల సంధాన కార్యక్రమం ఏర్పాటు చేశారు. శోభన మందిరంలో వారిరువురూ స్వర్గసౌఖ్యాలు అనుభవించారు.

ఆ సాయంకాలం రెడ్డిగారు కోనంగికి గర్భనిరోధక సాధనాలు వాడమని సలహా ఇచ్చాడు. ఆయన సలహా కోనంగి అంగీకరించి వేసవికాలం తప్ప మిగితా కాలంలో మేం ప్రాణ స్నేహితులంగా ఉంటామని చెప్పాడు.

రిజిష్ట్రారు వద్ద వివాహపత్రంలో సంతకాలు పెట్టేటప్పుడు అనంతలక్ష్మి సంతోషంతో వణకి పోయింది. తన అదృష్టానికి మురిసిపోయింది. తన భర్త ఉత్తముడు. ఆమె స్నేహితులు ఆమె చుట్టూచేరి ఆటపట్టించారు.

శోభన గృహంలో కోనంగి నూతన వధువును కౌగిలిలో కబళించాడు. వారు ఆనందమూర్తులయ్యారు. పాటలు పాడుకొన్నారు ఆ రాత్రి ఎలానో గడిచిపోయింది.

తెలతెలవారేవేళ ఐదుగంటల ప్రాంతంలో జయలక్ష్మి తలుపు బయట ఏడుస్తోంది. తలుపు తీసి కోనంగి తెల్లబోయాడు.

అసిస్టెంటు కమీషనరు కోనంగిని అరెస్టు చేస్తున్నట్లు చెప్పారు. గత రాత్రి అరెస్టు చేయాల్సి వుండగా శోభనం అయిన తర్వాత చేద్దామని

ఇప్పుడు వచ్చామని చెప్పారు. కోనంగిని పోలీసు వ్యాను ఎక్కించారు. తనను ఎందుకు అరెస్టు చేశారో కోనంగికి తెలియదు. అనంతలక్ష్మి ఎంత బాధ పడుతుందోనని కుమిలిపోయాడు.

పోలీసువారి మధ్యలో డాక్టరు కనిపించాడు. తామిద్దరూ కమ్యూనిస్టులతో కలిసి ప్రభుత్వంపై కుట్ర పన్నినందుకు అరెస్టు చేశారని చెప్పాడు.

ఎవరో యిచ్చిన ఫిర్యాదుమేరకు ఈ అరెస్టు చేశారు. పోలీసువారు ఇద్దరికీ ఫలహారాలు పెట్టారు.

అనంతలక్ష్మి కుమిలిపోయింది. జయలక్ష్మి మూర్ఛపోయింది మెలకువ వచ్చిన తర్వాత న్యాయవాదిని పిలిపించి బెయిలు మీద వారిద్దర్నీ విడిపించే ప్రయత్నం చేసారు.

జైలులో కోనంగి ప్రవేశించాడు. అదొక లోకం. రెడ్డిగారినీ, కోనంగిని రాజకీయ నిర్బంధితుల జట్టులో చేర్చారు. ఇద్దరికీ ప్రత్యేక గదులు ఇచ్చారు. నెలకు రెండు సార్లు ఉత్తరాలు వ్రాసుకోవచ్చు యిక్కడ వివరాలు కోనంగి అనంతలక్ష్మికి ఉత్తరం వ్రాశాడు. మొదటి రాత్రి దివ్యానుభూతిని గుర్తుకు తెచ్చాడు.

కోనంగిని తీసుకెళ్ళిన వెనుక అనంతలక్ష్మి నిర్విణ్ణురాలైంది. భావం లేని చూపులు చూస్తూ అలానే మంచం మీద కూచొంది. డాక్టరు వచ్చి పరీక్షించి జబ్బు ఏమీ లేదనీ, స్నేహితురాండ్రు ఆమెకు కోపం తెప్పించడం మంచిదేనని సలహా యిచ్చాడు. వారు చెట్టిగారు ఈ నాటకమాడాడని కథ అల్లి చెప్పసాగారు. అనంతలక్ష్మి మహిషాసురమర్దని అయి లేచినించుంది. మరుక్షణం భోరున ఏడుస్తూ మంచంపై వాలిపోయింది.

అనంతలక్ష్మి క్రమంగా కోలుకొంది. చెట్టియారువ్యాజ్యం ఓడిపోయాడు.

అప్పీలు చేస్తాడని కబురు వచ్చింది. పోలీసులకు ఆయనే కోనంగిపై ఫిర్యాదు చేసి అరెస్టు చేయించాడని సీతాదేవి వాకబు చేసి చెప్పింది.

జయలక్ష్మి చెట్టి మీద కోప్పడింది. రంగయ్యంగారు తన్ను ప్రేమించిన దినాలు జ్ఞాపకం చేసుకొంది. స్త్రీ పురుషులు విడిపోవడం, మళ్ళీ గాఢంగా కలుసుకొవడానికేనని ఆమె నమ్మకం.

అనంతలక్ష్మికి తన భర్త నిత్యం కంటి ఎదుట కనిపించినట్లుండేది. పెళ్ళి ఫోటోలు చూస్తూ ఎక్కువ కాలంగడిపేది. ఒకసారి వాళ్ళిద్దరూ మహాబలిపురం విహారయాత్రకు వెళ్ళిన సంఘటన గుర్తుకు తెచ్చుకొని పులకించి పోయింది.

రెడ్డిగారికి జైలు అలవాటే. ఆయనకు 'ఏ' తరగతి ఇచ్చారు. కోనంగీ రెడ్డీ పగలంతా అనేక విషయాలపై చర్చించుకునే వారు. కాంగ్రెసు మంత్రులు రక్షకభటుల్ని ఎందుకు పెట్టుకోరని ఒకరోజు చర్చించారు.

కోనంగి లోలోపల అనంతలక్ష్మి గూర్చి ఆలోచించేవాడు. తాము పాడుకొన్న పాటలు, మువ్వగోపాలపదాలు, గుర్తుకు తెచ్చుకొన్నాడు. నిత్యమూ అనంతలక్ష్మి స్మరణతో జీవిస్తున్నాడు.

ఆ సంవత్సరం అనంతలక్ష్మి బి.ఏ. జూనియర్ పరీక్ష ప్యాసైంది. కోనంగి వ్రాసిన ఉత్తరాలు ఆమె ఆనందంగా చదువు కుంటోంది. ఒకరికొకరు రహస్యమార్గాల ద్వారా కూడా ఉత్తరాలు పంపుకొన్నారు. వారి ప్రణయ జీవితనిగూఢరహస్యాలు అందులో తాండవం చేసేవి.

అంత నిర్దయగా వెళ్ళి పోయినందుకు అనంతలక్ష్మి భర్తను ఉత్తరంలో ప్రశ్నించింది. చెట్టిగాడివల్ల తమకు ఈ దుర్గతి కలిగినందుకు చింతిస్తున్నాని వ్రాసింది. కోనంగి సర్వాంగసౌందర్యాన్ని వర్ణించింది. వారి సరసనల్లాపాలను స్మరించింది.

భర్త నుండి వచ్చిన ఉత్తరాలే ఆమెకు అవేసవిలో మల్లెపూలు. ఒక్కొక్క ఉత్తరాన్ని ఒకటికి పదిసార్లు చదువుకునేది. ముద్దులు పెట్టుకునేది. కోనంగి

తన కవితా దోరణిని ఉత్తరాలలో చూపించేవాడు నీవు కోహినూరు రత్నం అనేవాడు పారిజాతవృక్షం తనకు లభించిందన్నాడు నీకు గురువును కావడం అదృష్టమన్నాడు బెంబేలు పడకుండా ధైర్యంగా వుండమన్నాడు ఆమె ఆ ఉత్తరాలు చదువుతూ కన్నీళ్ళతో కరిగి పోయేది ఉత్తరం కళ్ళకద్దుకునేది

ఒకరోజు అనంతలక్ష్మికి చెట్టిగారి వద్దనుండి ఉత్తరం వచ్చింది అనంతలక్ష్మి చదివింది : ''నేను నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో నీకు తెలును నీ పూర్వీకులంతా సరియైన వాళ్ళను ప్రేమించారు నీకు జరిగిన పెండ్లి వేళాకోళపు పెండ్లి వాడు ఒక విదవకు పుట్టాడు ఎందరో సినిమా తారలతో కులికాడు వాడి స్నేహితుడు డాక్టరు కూడా అంతే నా 60 లక్షల ఆస్తి నీ పాదాల ముందు ఉంచుతాను'' అదీ సారాంశం అదే సమయంలో కోనంగికి ఒక ఉత్తరం వచ్చింది అందులో సారాంశం ఇది ''నేను జయలక్ష్మిని, అనంతలక్ష్మిని ఉంచుకున్నాను అనంతానికి 14వ యేట కన్నెరికం చేశాను జయలక్ష్మి బర్త ఆమెను కోటీశ్వరులకు సప్లై చేసి డబ్బు సంపాదించేవాడు రెడ్డికి అనంతానికి జయలక్ష్మికి ఏదో సంబంధం వుంది కాలేజీలో కుర్రవాళ్ళ దగ్గర అనంతం తనను అర్పించుకుంది అందుకు నిదర్శనంగా ఇందులో ఉత్తరం జతపరుస్తున్నాను''

రెండు ఉత్తరాలనూ కోనంగి అనంతలక్ష్మికి పంపించాడు అనంతలక్ష్మి యింటికి మర్నాడు రెండు ఉత్తరాలు వచ్చాయి అవి కోనంగి పేర వ్రాసినవి అందులో ఒక ఉత్తరం కోనంగి మొదటి బార్య ఎవరో వ్రాశారు నీవు అక్కడ ఒకవారం రోజులు గడిపి తిరిగి రావలసిందని ఉంది ఆమె ఉత్తరం చదవలేక పోయింది నీరసంతో క్రుంగిపోయింది ఉత్తరం నిజమేనేమోనని సందేహించింది మరుక్షణం అది మోసమని గ్రహించింది

కొంత కాలానికి అనంతలక్ష్మి ధైర్యంగా లేచింది ఆమె స్నేహితురాలు మొహారున్నీసా ఆమెను మాడటానికి వచ్చింది ఆమె రియాసత్ ఆలీని ప్రేమిస్తున్నది

అనంతలక్ష్మి మొహారున్నీసా ఒకరి వేదన మరొకరికి చెప్పి వూరట పొందారు మొహార్ తన ప్రేమసంగతులు ఒక అనంతలక్ష్మికే చెబుతుంది

అనంత తనకు వచ్చిన ఉత్తరాలను మెహర్‌కు చూపించింది. తాను కూడా ఇలాంటి ప్రేమ ఉత్తరాలను అందుకున్నానని మెహర్ సోదాహరణంగా చెప్పింది. కొంతసేపు మాట్లాడుకుని మెహర్ యింటికి వెళ్ళి పోయింది. ఆమె రావటం వల్ల అనంతకు ధైర్యము, శక్తి వచ్చాయి. ఆమె మహిళా ఖాదీ ప్రచార కార్యాలయానికి వెళ్ళి వస్తున్నది. కోనంగికి తెలియజేసి తల్లితో కలసి వార్ధా సేవాగ్రామ్ వెళ్ళింది. అక్కడ ఆమె అనుభవించిన శాంతి వర్ణనాతీతం.

చెట్టి దురుద్దేశాలను కోనంగి ఆకళించుకున్నాడు. అనంతలక్ష్మి ఎంత బాధపడిపోతోందో అని ఆలోచించాడు. తనకు వచ్చిన ఉత్తరాల సారాంశాన్ని ఒక ఉత్తరంలో వ్రాశాడు. ఆమె కూడా అలాంటి ఉత్తరమే వ్రాసింది. అవి రెండూ ఒకేసారి ప్రయాణం చేశాయి.

చెట్టి తన పాపాన తానే పోతాడని, యుద్ధం అయిపోయేంత వరకు మీరు జైలులోనే వుంటారేమోనని అనంత అందులో వ్రాసింది. తాను వ్రాసిన పాటలు అందులో వ్రాసి పంపింది. యుద్ధ రాజకీయాలప్రస్తావన కూడా చేసింది.

కోనంగి వ్రాసిన ఉత్తరంలో సారాంశం యిది. ప్రేమకు ప్రపంచంలో ఏదీ అడ్డురాదు. డాక్టరు, నేనూ ఎన్నో విషయాలమీద చర్చించుకున్నాం. ఈ ఉత్తరం చదువుకొంది అనంతం. మర్నాడు కోనంగి మరో ఉత్తరం వ్రాశాడు. ప్రేమబలం అనంతమనీ, నేను రాత్రింబవళ్ళు నిన్ను గురించే ఆలోచిస్తున్నాననీ వ్రాశాడు. ఆమె ఆ ఉత్తరం చదివి సోఫాలో కూలిపోయింది.

యుద్ధం తీవ్రంగా జరుగుతోంది. హిట్లరు రష్యా మీద విరుచుకు పడ్డాడు. రష్యా మీదకు జర్మనీ విరుచుకపడిందని కమ్యూనిష్టులకు కోపం వచ్చింది. భారత ప్రభుత్వంవారు కమ్యూనిస్టులను విడుదల చేయాలని తీర్మానించుకున్నారు. ప్రభుత్వానికి సహాయం చేయడానికి రెడ్డి, కోనంగి సంసిద్ధత వ్యక్తం చేశారు. వారిద్దరినీ విడుదల చేశారు. రైలుస్టేషనులో దిగిన కోనంగికి అనంతలక్ష్మి బంధువర్గం స్వాగతం పలికింది. జయలక్ష్మి ఆనందంతో

పొంగిపోయింది. డాక్టరు రెడ్డి కోసం కమ్యూనిస్టు నాయకులంతా వచ్చారు. ఇంటికి రాగానే జయలక్ష్మి కోనంగికి దిష్టి తీసివేసింది. గదిలోకి వెళ్ళిన అనంతను కోనంగి గాఢచుంబనంతో ఉక్కిరి బిక్కిరి చేశాడు. అలా వారు ఎంత సేపు ఉన్నారోతెలియదు. మర్నాడు జయలక్ష్మి వాళ్ళిద్దరి చేత సత్యనారాయణవ్రతం చేయించింది. కోనంగిని చూట్టానికి దుక్కిటెద్దు సినిమా బృందం అంతా వచ్చింది. ఈ సంతోషంపంచుకోవాటానికి తన తల్లి కూడా వుంటే బాగుండునని కోనంగి అనుకున్నాడు. జయలక్ష్మి కూడా ఆమెను యిక్కడికి తీసుకురమ్మని కోనంగికి చెప్పింది. జైలు నుంచి వచ్చిన 15 రోజులు వారిద్దరికీ అమృత పక్షమే. వారి ఆనందానికి అవధులు లేవు.

కోనంగి, అనంతలక్ష్మి రైలులో బందరు బయలుదేరారు. రైలులో అనంతలక్ష్మి మీద తాను వ్రాసిన పాటలు పాడాడు. పాటల్లో స్త్రీమూర్తి ఎంకివలె చిరస్మరణీయురాలిగా నిలిచిపోతుందని కోనంగి నమ్మాడు. అనంతలక్ష్మి సిగ్గుతో ముడుచుక పోయింది. కాలమే తెలియకుండా ప్రయాణం చేసి బందరు స్టేషన్లో దిగారు.

అక్కడ కోనంగి స్నేహితుడు మధుసూదనరావు వారికి స్వాగతం పలికాడు. గుర్తుపట్టలేనంతగా మారి పోయిన కోనంగిని స్నేహితులు కౌగలించుకొన్నారు. అనంతలక్ష్మి అతిలోకసౌందర్యాన్ని అందరూ మెచ్చుకున్నారు. కోనంగి దంపతులు నేరుగా మధుసూదనరావు యింటికెళ్ళారు. మధుసూదనరావు బ్రహ్మసమాజవాది. కోనంగి వివాహానికి హాజరై దంపతుల్ని తన యింటికి ఆహ్వానించి వున్నాడు.

కోనంగి తల్లి పార్వతమ్మ కొడుకు వచ్చాడని చెప్పి యజమానురాలి అనుమతి తీసుకొని మధుసూదనరావు ఇంటికి వచ్చింది. కోనంగి కులం తక్కువ పిల్లను పెళ్ళి చేసుకోవడం వల్ల తల్లికి అవమానంగా ఉంది. దంపతులిద్దరూ పార్వతమ్మకు పాదనమస్కారం చేశారు అనంతలక్ష్మి అందాన్ని చూసి పార్వతమ్మ ఆశ్చర్యపోయింది

అత్తగారిని మదరాసు రమ్మని ఆహ్వానించింది అనంతలక్ష్మి. పార్వతమ్మ అనంతలక్ష్మి పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకొంది. రంగయ్యంగారికి జయలక్ష్మికి

తాను పుట్టానని చెప్పింది అనంతలక్ష్మి. అత్తాకోడళ్ళు ఏదో మాట్లాడు కొంటున్నారే అని కోనంగి వాళ్ళ మాటలకు అడ్డు వచ్చాడు. పార్వతమ్మ బందరులోనే వుండిపోతానంది.

యుద్ధం ఘోరంగా జరుగుతోంది. ఇంగ్లండును నాశనం చేయడానికి జర్మనీ విమానదాడులు చేసింది. ఇతర దేశాలలో కూడా యుద్ధ వ్యాధి పట్టుకొంది. కోనంగి ఆ విషయాలు ఆలోచిస్తూ ఆశ్చర్యపోయాడు. బందరులో తాను తిరిగిన ప్రదేశాలన్నీ కోనంగి అనంతలక్ష్మికి చూపించాడు. పార్వతమ్మకు ముళ్ళ మీద నుంచున్నట్లుగా ఉంది. ఐదు రోజులుండి దంపతులిద్దరూ మదరాను తిరిగి ప్రయాణమయ్యారు మధుసూదనరావు తన చెల్లెలు చౌధురాణి బి.ఏ. పూర్తి చేసిందనీ యింకా చదువుకోవాలని వుందనీ చెప్పాడు. మధుసూదన రావు దంపతుల్ని కోనంగి దంపతులు మదరాను రావలసిందిగా ఆహ్వానించారు.

చెట్టియారు పారిశ్రామిక విద్యాలయం స్థాపించాడు. ప్రభుత్వసహాయంతో ఒక తమిళదినపత్రిక పెట్టాడు. రాజకీయ పెద్దలతో పరిచయాలు పెంచుకొన్నాడు. వీటికి మూలహేతువు అనంతలక్ష్మిని చేపట్టాలనీ ఆశమాత్రమే.

ఒక తమిళవారపత్రికలో చెట్టియారు స్త్రీలోలత్వాన్ని చాటి చెబుతూ పెద్ద వ్యాసం ప్రచురించారు. అది చదివి చెట్టి మండిపడ్డాడు

''చెట్టిగారి జనానా రోజు రోజుకూ పెరిగిపోతోంది కురంగినయన అనే సినీతారతో తిరుచునాపల్లిలో చెట్టిగారి లీలావిలాసాలు వర్ణింపలేం. ఫలానా తారీఖున మదరాసులో చెట్టిగారు ఆరుగురు సినీతారలతో రాసక్రీడలలో తేలియాడారు.''

చెట్టియారు ఆ వ్యాసం చదివిన తర్వాత ఆ పత్రికాలయం మీద వేయి టన్నుల బాంబులు వినరమని ఆజ్ఞ యిచ్చాడు.

బందరు నుండి కోనంగి దంపతులు తిరిగి వచ్చారనీ, చెట్టపట్టాలు వేసుకొని దేశాలు తిరుగుతున్నారనీ తెలుసుకొని చెట్టికి కళ్ళనీళ్ళు వచ్చాయి.

జపాన్ ఏమి చేస్తుందా? అని అందరూ ప్రపంచంలో ఎదురు చూస్తున్నారు. జపాను శక్తిముందు చైనా తక్కువే అని అన్ని దేశాలు నమ్మాయి. కోనంగి జపాన్ అంటే మండి పడేవాడు. లోకశాంతి కోసం కోనంగీ అనంతలక్ష్ములు ఆవేదన చెందారు. హిట్లరు మాస్కోను ముట్టడించాడు. డాక్టరు, కోనంగి యుద్ధ విషయాలు మాట్లాడుకున్నారు. అహింసావాది అయిన మహాత్ముని సిద్ధాంతమే మంచిదని వారికనిపించింది.

'నవజ్యోతి' అనే తెలుగు దినపత్రిక 1936 నుండి ఒక సంవత్సరం వచ్చి నిలిచి పోయింది. దాన్ని అనంతలక్ష్మి పెట్టుబడితో కోనంగి కొన్నాడు. డాక్టరు, కోనంగి, రియాసత్ అలీ, అనంతలక్ష్మి, మరికొందరు పత్రిక పనిలో చేరారు. 1941 సెప్టంబరులో నవజ్యోతి తిరిగి ప్రారంభమైంది.

కోనంగి యుద్ధ విశేషాలను గూర్చి సంపాదకీయాలు వ్రాశాడు. దినపత్రిక ఆశయాలు అందులో వివరించాడు. దేశసేవా, జాతీయతాభావము, ప్రపంచ భద్రత తమ ఉద్దేశాలని చెప్పాడు. పత్రికను పోషించడం తెలుగు పాఠకుల బాధ్యత అని మనవిచేశాడు. రెండు నెలల్లో జపాన్ పెరల్ హార్బరుపై విరుచుక పడింది. పత్రికకు ప్రకటనలు బాగా వచ్చాయి. రియాసత్ అలీ ఢిల్లీ కలకత్తా వెళ్ళి ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థల ప్రకటనలు సేకరించాడు.

రియాసత్ అలీ బి.ఏ. ప్యాసయ్యాడు. చక్కటి తెలుగు వ్రాస్తాడు. కోపం వస్తే రుద్రుడవుతాడు. అతని ప్రేమనిధానం మేనత్త కూతురు మెహారున్నీసా! ఒకరి నొకరు ప్రేమించుకొన్నారు. అతడు కాంగ్రెసు. ఆమె ముస్లింలీగు. అందువల్ల వారి వివాహం కుదరలేదు.

కోనంగి, రియాసత్, మధుసూదనరావు, డాక్టరు మంచి స్నేహితులు. దినపత్రిక నడపడమంటే 'మాటలుకాదు. చెన్నపట్టణంలో ఏజెంట్లను పెట్టారు. స్త్రీలు ఆ పత్రికను అభిమానించసాగారు. విలేఖర్లను ఏర్పాటు చేసుకొన్నారు. ఉపసంపాదకురాండ్రు ఇద్దరు చేరారు టెలిప్రింటరు సంపాదించారు.

జపాన్ యుద్ధంలో కురికిన మర్నాడు అమెరికా యుద్ధం ప్రకటించింది. అమెరికాపై జర్మనీ, ఇటలీలు యుద్ధం ప్రకటించాయి. కోనంగి ప్రపంచ రాజకీయాలతో పాటు, భారతీయ రాజకీయాలు బాగా ఆకళింపు చేసుకొన్నాడు. నవజ్యోతికి పదిమంది దాకా పెట్టుబడిపెట్టారు. పత్రిక అందంగా వచ్చేటట్లు కోనంగి స్వయంగా చూశాడు. ముఖ్యమైన వార్తను ఎన్నుకోవడంలోనే సంపాదకుని గొప్పతనం ఆధారపడి వుంటుందని కోనంగి నమ్మకం. సహాయ సంపాదకులతో విషయాలు చర్చించేవాడు.

పత్రికా సంస్థ దేశంలోని ముఖ్య సంస్థలలో ఒకటి అది అద్భుతమైన లలితకళా సంస్థ. నవజ్యోతి పత్రిక ఆంధ్రదేశంలో ఒక్కసారిగా విప్లవం తెచ్చింది. అనంతలక్ష్మి ఒక కెమెరా కొంది. ఏదైనా ముఖ్య విషయాలు జరిగినపుడు ఆమె కారుమీద వెళ్ళి ఫోటోలు తీసి మర్నాడు పత్రికలో వేసేది. పత్రిక కంపోజింగ్‌లోకూడా మార్పులు తెచ్చారు. పత్రిక విజయవంతంగా నడవటానికి అందరూ కలిసి కృషి చేశారు. పత్రికలోపని అయిపోగానే ఆ రోజు అలాహారానికి వెళ్లి వచ్చేవారు - కోనంగి దంపతులు. రియాసత్‌అలీ ఒంటరిగా వున్నాడు కాబట్టి నిట్టూర్పులు విడిచేవాడు. ఒక రోజు అనంతలక్ష్మి మెహర్ యింటికి వెళ్ళి ఆత్మీయంగా మాట్లాడి వచ్చింది. పంతాలకు పోకుండా మీరిద్దరూ ప్రేమకు విలువ నివ్వండని మొహారుకు చెప్పింది.

జపాను విజృంభణ సాగిపోతూవుంది. ఇంగ్లీషువారు అమెరికావారు నిలువలేక పోతున్నారు ఇంగ్లీషు సైన్యంతోబాటు భారతీయ సైన్యాలు కూడా వెనక్కు వెళుతున్నాయి. ఆంగ్ల ప్రభుత్వం మన దేశానికి క్రిప్సును రాయబారిగా పంపింది.

క్రిప్సురాక సందర్భముగా పత్రికలన్నీ సంపాదకీయాలు వ్రాశాయి. కోనంగి వ్రాసిన సంపాదకీయం అద్భుతంగా సాగింది.

మధుసూధనరావు కుటుంబము మద్రాసు వచ్చింది. అతని సోదరి చౌధురాణి పత్రికలో ఉపసంపాదకురాలిగా చేరింది. రెడ్డి ఆమె పట్ల ఆకర్షితుడయ్యాడు. కోనంగి ఈ విషయం పసిగట్టాడు. అతడితో ఆమాట

అన్నాడు. డాక్టరు చిరునవ్వు నవ్వాడు. రెడ్డికి క్రమక్రమంగా ప్రేమవాసన తగులుకుంది. కోనంగి వారిద్దరి మధ్యా రాయబారం జరిపాడు. చౌధురాణితో కోనంగి సన్నిహితంగా వున్నాడని అనంతలక్ష్మి అనుమానించింది. ఆమె పెంకి పిల్ల. చౌధురాణి కోనంగిని సోదరునితో సమానంగా చూచేది.

నవజ్యోతి పత్రిక అటు కాంగ్రెసు వైపుగానీ, యిటు సామ్యవాదం వైపుగానీ మొగ్గు చూపలేదు. క్రిప్సురాయబారం విఫలమైంది. ప్రజలకు బ్రిటీషు ప్రభుత్వంపై ద్వేషం ఎక్కువైంది. ఆయాపార్టీలు తమ తమ ధోరణులకు సరిపడేలా మాట్లాడసాగాయి.

ఆగస్టు 8వ తేదీ కాంగ్రెసు మహాసభ బొంబాయిలో సమావేశమై క్విట్ ఇండియా తీర్మానాన్ని ఆమోదించింది. ప్రజాప్రభంజనం వెల్లి విరిసింది. జైళ్ళు నిండిపోయాయి. దేశం అల్లకల్లోలమైంది. అన్ని పత్రికలతోబాటు నవజ్యోతి పత్రిక కొంత కాలం ఆగిపోయి మళ్ళీ ప్రారంభమైంది. ఆ సంస్థలో సామ్యవాదం ప్రవేశపెట్టారు. అందరికీ ఒకటే జీతం. పత్రికా నిర్వహణ అందరి బాధ్యతగా పనిచేస్తున్నారు.

కోనంగి చౌధురాణితో రెడ్డి విషయం ప్రస్తావించాడు ఒక రోజు బీచిలో ఒంటరిగా ఆ విషయం ఆమెతో మాట్లాడాడు. అది చూసిన అనంత అనుమానంతో క్రుంగి పోయింది. కోనంగి ఈ విషయంలో ఆమెను బ్రతిమాల దలచుకోలేదు. అనంత గదిలో ఒంటరిగా కూర్చొంటోంది బెంగతో చిక్కిపోయింది. కోనంగి తన మతం మార్చుకొని అనంతను నవ్వించసాగాడు. ఆమె తన తప్పును తెలుసుకొంది. గొడవ తీరిపోయింది.

చెట్టిగారి ప్రమేయంతో పోలీసులు నవజ్యోతి కార్యాలయం సోదా చేశారు. వాళ్ళకు ఏమీ దొరకలేదు. మరికొన్నాళ్ళకు ప్రభుత్వం వారు 6000 రూపాయలు ధరావత్తు కట్టమన్నారు. హైకోర్టు దాకా వెళ్ళినా కట్టక తప్పలేదు. కోనంగి మాత్రం ఘాటుగా వ్రాయటం మానలేదు రెడ్డి హెచ్చరిస్తూనే వచ్చాడు. ఒకరోజు చౌధురాణి కోనంగితో ఆఫీసులో కరచాలనం చేస్తుండటం

అనంతలక్ష్మి చూసింది. రెడ్డిగారిని పెండ్లాడతానని చౌధురాణి చెప్పినందుకు ఆమెను అభినందిస్తున్నాడు కోనంగి. అనంత మండిపడింది. ఏడుస్తూ కుప్పకూలి పోయింది. డాక్టరు వచ్చి చూసి చన్నీళ్ళు చల్లి సేదతీర్చాడు.

భార్యమాటలకు కోనంగి నిస్పృహ చెందాడు. నిర్మల హృదయమైన అనంతం అనుమానించటం తన పొరపాటుగా భావించాడు ఆమె కోరుకుంటే విడాకులిద్దామనుకున్నాడు. మర్నాడు ఖద్దరు దుస్తులు ధరించి క్విట్ ఇండియా ఉద్యమగీతం పాడుకుంటూ కాంగ్రెస్ జెండాతో వీధులలో తిరిగాడు. పోలీసులు కోనంగిని అరెస్టు చేసి తీసుకెవెళ్ళారు

అనంతలక్ష్మిని ఘోషా ఆసుపత్రికి తీసుకువెళ్లారు ఆమె గర్భవతి అని డాక్టరు చెప్పింది. అందరూ సంతోషించారు ఆ శుభవార్త భర్తకు చెప్పాలని అనంత ఎదురుచూసింది. జయలక్ష్మి సంతోషానికి అవధులు లేవు. తదితర మిత్రబృందం సంబర పడ్డారు. భర్తపై కోపగించుకున్నందుకు అనంత జుగుప్స పడింది. తనలా పిచ్చిగా ప్రవర్తించడానికి కారణం ప్రథమగర్భ ధారణ అని లేడీ డాక్టరు చెప్పింది. కోనంగి మాత్రం కనబడటం లేదు. డాక్టరు రెడ్డి తాను చౌధురాణిని వివాహం చేసుకోబోతున్నానని ప్రకటించాడు అనంత తెల్లబోయింది. పశ్చాత్తాప పడింది. చౌధురాణిని క్షమాపణ కోరింది. కోనంగి ఎక్కడికి వెళ్ళిందీ వారికి తెలియదు. క్విట్ ఇండియాలో భాగంగా రెడ్డి మధుసూదనరావు జైలుకు వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు. రెడ్డి ద్వారా కోనంగి జైలుకు వెళ్ళాడని అనంతకు తర్వాత తెలిసింది. గర్భవతి మనసు నొచ్చుకుంటుందని ఆమెకు చెప్పకుండా వెళ్ళాడు కోనంగి.

కోనంగి కేసువిచారణకు వచ్చింది. మెజిస్ట్రేటు 8 నెలల శిక్ష విధించాడు. 'ఏ' తరగతి ఇచ్చారు. కోర్టు ఆవరణలో భార్యాభర్తలు విడిగా కలుసుకునే యేర్పాటు చేశారు. అనంత గర్భవతి అని తెలిసిన కోనంగి ఆమెను ముద్దులతో ముంచెత్తాడు. కోనంగిని వేలూరు జైలుకు తీసుకువెళ్ళారు

కోనంగి జైలులో స్వప్న ప్రపంచంలో జీవించసాగాడు. భిన్నత్వంలో ఏకత్వమున్న భారత ప్రజలు అతనికి విచిత్రంగా కనిపించారు. ఒక గూఢచారి

కోనంగి వద్దకు వచ్చాడు. బ్రిటీషు ప్రభుత్వంపైన కత్తి కట్టకుండా పత్రిక నడిపితే వదలివేస్తామని అతడు సూచించాడు. కోనంగి ససేమిరా ఒప్పుకోలేదు. ప్రపంచం అతనికి వింతగా కనిపించింది. ఇక్కడ అనంతలక్ష్మి కడుపులో శిశువు పెరుగుతున్నాడు. కోనంగిపై ఆలోచనలతో ఆమె కాలం గడుపుతోంది. ఆయన అంశ తనలో ప్రత్యక్షమైంది. ఆయన వ్రాసిన ఉత్తరాలు అమెకు గుర్తుకువచ్చాయి. రెడ్డి, చౌధురాణీ కోనంగి తిరిగి వచ్చేంత వరకు వివాహం చేసుకోదలచుకోలేదు. మెహరు, రియాసత్ పెండ్లి చేసుకోవడానికి అంగీకరించుకున్నారు. కలిసి సినిమాలకు వెళుతున్నారు. 1943 మార్చి నెలాఖలో అనంతలక్ష్మి మగ శిశువును ప్రసవించింది. ఆప్రసవవేదన అనంత కంటే కోనంగి పడ్డాడు. పుత్రుడు పుట్టాడని తెలిసి కోనంగి ఉప్పొంగిపోయాడు. జైలులో అందరికీ మిఠాయిలు పంచిపెట్టారు. జైలు జీవితం దుర్భరమైంది.

1943 జూనులో కోనంగి విడుదలై వచ్చాడు. రైల్వేస్టేషనులో అనంతతో బాటు మిత్రులంతా స్వాగతం పలికారు. మూడునెలల పసికూనను అనంత కోనంగి చేతికిచ్చింది. చిట్టిబాబు చిరునవ్వులు చిందించాడు. కారులో వెళుతూ కోనంగి తల్లీకొడుకులను ముద్దు పెట్టుకున్నాడు.

చెట్టిగారు ఇదంతా చూస్తూ మండిపడ్డారు. క్రుంగి పోయాడు. పిచ్చివాడయ్యాడు. ఎదురుగా తమిళ పత్రిక సంపాదకుడు కనిపిస్తే వాణ్ణి బూతులు తిట్టి లెంపకాయలు వాయించాడు. చెట్టి యారు డ్రైవరు కత్తి తీసి సంపాదకుణ్ణి ఒకపోటు పొడిచాడు. ఈ తగాదా చూస్తున్న అనంతలక్ష్మి అంగరక్షకుడు వినాయగం డ్రైవర్ని పట్టుకున్నాడు. సంపాదకుడు తన దగ్గర బాకుతో చెట్టియారు మొగముపై రక్తపు గంటు పెట్టాడు. ఈ కేకలు విన్న డాక్టరు రెడ్డి చెట్టిగారికి సంపాదకునికి వైద్యసహాయం చేశారు. చెట్టియారు క్షమాపణ కోరుతూ అందరికీ నమస్కారం చేశాడు కోనంగి అతణ్ణి క్షమించి వదిలివేయమన్నాడు. అతడు తలవంచుకు వెళ్ళిపోయాడు.

శుభ ముహూర్తంలో రియాసత్, మెహరున్నీసాల వివాహం జరిగింది.

రియాసత్ ఆనంద పరవశుడయ్యాడు మూడు దినాలకు రెడ్డి చౌధురాణుల వివాహం జరిగింది. పెండ్లి పెద్ద కోనంగి పెండ్లికి ఎక్కువ ఖర్చు పెట్టవద్దూ కోనంగి బిడ్డ రంగారావు ఒకటే అల్లరి. అందరూ ఆ బిడ్డను ముద్దు పెట్టుకోవడమే. గోపికా కృష్ణుడయ్యాడని కోనంగి అన్నాడు. కొంటె కోనంగి అయ్యాడని ఎవరో అన్నారు. చెట్టిగారు కూడా పెండ్లికి వచ్చి దంపతులను ఆశీర్వదించారు.

నవజ్యోతి పత్రిక బాగా జరుతోంది. కోనంగి అనంతలక్ష్ములు తమలోకంలో తామ విహరించసాగారు. బిడ్డకు పాలిస్తున్న అనంతను చూసి కోనంగి పొంగిపోయాడు. అనంత సిగ్గు పడింది! కోనంగి ఆమెను గాఢంగా హత్తుకొని పందిరిమంచంపై పడుకోబెట్టాడు. నీవే నేను, నేనే నీవు అని వారిద్దరూ మధుర కంఠంతో పాటలు పాడుకున్నారు.

**14**

# రుద్రమదేవి

(సాంఘిక నవల)

నోరి నరసింహశాస్త్రి
**1900-1978**

ప్రథమ ముద్రణ : **1951**

# నోరి నరసింహశాస్త్రి

1900 ఫిబ్రవరి 6న నోరి నరసింహశాస్త్రి గుంటూరులో జన్మించారు. వారిది సుప్రసిద్ధ పండిత వంశం. బాల్యంలోనే కవితావాసన కలిగింది. చిన్న వయసులోనే గీతమాలిక అనే పద్య సంపుటిని ప్రచురించారు. నవ్య సాహిత్య పరిషత్ అధ్యక్షులు తల్లావజ్ఝల శివశంకరశాస్త్రితో సన్నిహిత పరిచయం యేర్పడింది. నవ్యకవితా ధోరణి అలవడింది. మద్రాసులో పట్టభద్రులై ఉపాధ్యాయులుగా కొంతకాలం పనిచేశారు. మద్రాసులో లాపట్టా పుచ్చుకొని గుంటూరులో న్యాయవాద వృత్తిని స్వీకరించారు రేపల్లెలో స్థిర నివాసం ఏర్పరచుకున్న సమయంలో శాసనోల్లంఘన చేశారు.

న్యాయవాద వృత్తిలో వుంటూ సంస్కృతం, ఆంధ్రం, ఆంగ్లం, కన్నడ భాషలలో ప్రావీణ్యం సంపాదించారు. అప్పుడు జరుగుతున్న సాహిత్య ఉద్యమాలలో వ్యావహారిక భాషవైపు చివరకు మొగ్గు చూపారు. కేంద్ర రాష్ట్ర సాహిత్య అకాడమీలు వీరి నవలలకు బహుమతులు యిచ్చాయి. 1950లో తెలుగు భాషాసమితి బహుమతి పొందారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులుగా వ్యవహరించారు.

నరసింహశాస్త్రి వచనగేయ నాటికలు 24 వ్రాశారు. సంస్కృతదేవీ భాగవతంలోని మొదటి మూడు స్కంధాలను వేయి పద్యాలలో అనువదించారు. నారాయణ తీర్థుల లీలాతరంగిణిని పరిష్కరించి ప్రచురించారు. సుప్రసిద్ధ కవుల సమకాలీన సాంఘిక జీవనాన్ని నవలల్లో చిత్రించడంలో నరసింహశాస్త్రి కృతకృత్యులయ్యారు.

దేవీ ఉపాసకుడైన నరసింహశాస్త్రి 1941లో పూర్ణదీక్షను పొంది విజ్ఞానందస్వామిగా పేరుపొందారు. 1977నుండి హైదరాబాదులో స్థిరనివాసం ఏర్పరచుకొని శేషజీవితాన్ని గడుపుతూ 1980లో పరమపదించారు. కేంద్రసాహిత్య అకాడమీ రుద్రమదేవి నవలను యితర భాషలలోనికి అనువదింపచేసింది.

# రుద్రమదేవి గురించి

రుద్రమదేవి గణపతిదేవచక్రవర్తి కుమార్తె రాజుగారికి మగసంతానం లేదు. రుద్రమదేవికి యౌవనం వచ్చేంత వరకు మగబిడ్డగానే లోకానికి తెలుసు. యౌవనవతికాగానే రహస్యం బహిర్గతమైంది. స్వయంవరం ప్రకటించారు. చాళుక్యరాజు వీరభద్రరాజు ఆమెను వరించాడు. రుద్రమదేవి సవతికి హరిహరుడు, మురారి దేవుడని యిద్దరు కుమారులు. హరిహరుడు రాజ్యానికి వారసుడవుతాడని అంతా అనుకొన్నారు.

రుద్రమదేవి కుమార్తె ముమ్మడమ్మకు కుమారుడు కలిగాడు. దౌహిత్రుడు రాజ్యవారసుడవుతాడని గణపతి దేవుని ఆశ! చక్రవర్తి రాజగురువుల ఆదేశానుసారం రుద్రమదేవిని మహారాజుగా ప్రకటించారు. భర్త వీరభద్రేశ్వరు డందుకు ఎదురుతిరిగాడు.

ఏకశిలానగరంలో శరన్నవరాత్రులు దిగ్విజయంగా జరిగాయి. రుద్రమదేవి నవరాత్రిదీక్షను ప్రారంభించింది. కరణాలు ఆ సమయంలో సమ్మెచేశారు. తిక్కన సోమయాజి బుద్ధికౌశలంతో సమ్మెను ఎదుర్కొన్నారు.

విజయదశమినాడు యువరాజుకు శ్రీరుద్రదేవ నామాన్ని ప్రకటించారు. తిక్కన సోమయాజి ఏకశిలా నగరంలో మహాభారత కావ్యరచన ఆరంభించారు. గణపతిదేవులు అనారోగ్యంతో బాధపడుతున్నారు.

కాకతీయ సామ్రాజ్యంపై యుద్ధం ప్రకటించారు. రుద్రమదేవి ఒంటరిగా సైన్యంతో పోరాడసాగింది రాజధానిలో మత కలహాలు పెరిగాయి. అలజడులు పెరిగాయి.

దేవగిరి యాదవులు ఏకశిలానగరాన్ని ముట్టడించారు రాత్రింబగళ్లు యుద్ధం జరిగింది. రుద్రదేవ మహారాజు మహారాష్ట్రసేనల్ని తరిమికొట్టారు. మహాదేవరాజు రుద్రమవద్దకు సంధిరాయబారం పంపాడు. రుద్రమ అంగీకరించింది. జైత్రయాత్రపూర్తి చేసి తిరిగి వచ్చిన రుద్రమదేవికి పౌరులు ఘనస్వాగతం పలికారు. ప్రతాపరుద్ర కుమారుని దత్త స్వీకారం చేసుకోవడానికి వీరభద్రుడంగీకరించాడు. మనుమసిద్ధికి క్షమాభిక్ష పెట్టారు.

తిక్కన ఆంధ్రమహాభారత రచన అవిచ్ఛిన్నంగా సాగిపోయింది.

# 14. రుద్రమదేవి

## సంక్షిప్త గ్రంథం

ఏకశిలా నగరం రాజధానిగా గణపతి దేవుడు పరిపాలిస్తున్నాడు. ఆయన వార్ధక్యంలో అనారోగ్యంతో బాధపడుతున్నాడు. ఆసంవత్సరం నగరంలో నవరాత్రి పూజలు రాజుగారు చేస్తారా? లేదా అని ప్రజలు ఎదురు చూస్తున్నారు. మహారాజుకప్పటికే 70యేళ్ళు.

మహారాజు చిన్నతనంలో పడరాని ఇబ్బందులు పడ్డారు. కాకతీయులకు అప్పుడు హనుమకొండ రాజధాని. ఆయన తండ్రి మహాదేవరాజును శత్రువులు సంహరించి గణపతి దేవుని చెరసాలలో వేశారు. యవ్వనమంతా చెరసాలలో గడిపి తిరిగి రాజ్యాన్ని పొందారు. అప్పటికి చిన్న చిన్న సామంతరాజ్యాలు బలపడ్డాయి. మహారాజు శాంభవదీక్ష స్వీకరించి ఆంధ్ర దేశానికంతటికీ రాజయ్యాడు. రాజధానిని ఓరుగల్లుకు మార్చాడు. ఆయనకు పురుషసంతతి లేదు. వార్ధక్యం ఆవహించింది. వీరశైవ, వీరవైష్ణవ మతాలు ప్రబలి జైనులతో వాదోపవాదాలు సాగుతుండేవి.

లేకలేక గణపతి దేవునికి ఒక పుత్రిక- రుద్రమదేవి జన్మించింది. ఆమెకు యవ్వనం వచ్చేంతవరకు కుమారుడుగానే పెంచాడు. ఆ రహస్యం చాలరోజులు దాగలేదు. యవ్వనవతియైన రాకుమార్తెకు స్వయంవరం ప్రకటించాడు. రుద్రమదేవిని ఖడ్గయుద్ధంలోను ధనుర్విద్యలోనూ జయించిన వానికి తన కుమార్తెను ఇస్తానని రాజు ప్రకటించాడు. చాళుక్యరాజైన వీరభద్రరాజు ఆపరీక్షలో రుద్రమదేవిని జయించి వివాహమాడాడు. గణపతి దేవుని రెండవ కుమార్తె గణపాంబను బేతరాజునకిచ్చి వివాహం చేశాడు. మహారాజుకు దౌహిత్రులు కూడా పుట్టలేదు.

రుద్రమదేవి సవతికి హరిహరుడు, మురారిదేవుడు అనే యిద్దరు కుమారులున్నారు. అందులో హరిహరుడు రాజ్యానికి వారసుడవుతాడని అందరూ అనుకొనేవారు. ఇంతలో రుద్రమదేవి కుమార్తె ముమ్మడయ్యకు

కుమారుడు కలిగాడు. గణపతిదేవుడు ఆనందించాడు. అతడు చక్రవర్తి అవుతాడని అందరూ అనుకున్నారు.

ఆబిడ్డకు ప్రతాపరుద్రదేవుడని పేరు పెట్టారు. అతడంటే గణపతిదేవునికి మహాయిష్టం. హరిహరుడు రాజవుతాడని ఎదురు చూస్తున్న ప్రజలకు ప్రతాపరుద్రుడు యౌవరాజ్య పట్టాభిషిక్తుడవుతాడనటం నచ్చలేదు. ఇప్పుడు నవరాత్రి ఉత్సవాలలో ఎవరికి ప్రధానపాత్ర యిస్తే వారు భవిష్యత్ చక్రవర్తి. అందుకోసం రాజు ఆంతరంగిక సభ యేర్పాటు చేశాడు.

ఆమహాసభలో అనారోగ్యంతో ఉన్న గణపతిదేవుడూ, పురుషవేషంలో రుద్రమదేవి, నాలుగేండ్ల బాలుడైన ప్రతాపరుద్రుడు హరిహర మురారి దేవులు ఆశీనులయ్యారు. నవరాత్రి దీక్షకు ప్రతినిధిని నిశ్చయించవలసిందిగా మహా ప్రధాని సభను కోరాడు. చాళుక్యవీరభద్రేశ్వరుడు హరిహరుడు అందుకర్హుడని తన అభిప్రాయాలను ప్రకటించాడు. ముమ్మడయ్య భర్త మహాదేవరాజు ప్రతాపరుద్రుడే యువ రాజ పదవికి అర్హుడని సోపపత్తికంగా నిరూపించాడు. సభ అభిప్రాయాన్ని ప్రధాని కోరాడు. వాదోపవాదాలు జరిగాయి. చివరకు రాజగురువు విశ్వేశ్వర శంభువులను ధర్మనిర్ణయం చేయమని కోరారు. రుద్రమదేవిని మహారాజుగా ప్రకటించమని ఆయన శలవిచ్చాడు. సభలో జయజయధ్వానాలు మిన్నుముట్టాయి. విజయదశమి నాడు యువరాజ పట్టాభిషేకం నిర్ణయమైంది.

రుద్రమదేవి సభలో నుంచి అంతఃపురంలోకి వచ్చింది. ఆమె ఆంతరంగికురాలు రుయ్యాంబ చాల తెలివిగలది. ఆమె సలహాలు రుద్రమదేవి ఎప్పుడూ తీసుకుంటుంది. రుద్రమదేవి దాది కామసాని, ఆమెకు 80 యేళ్ళు. అమె రుద్రమదేవి తల్లి చెలికత్తెగా అంతఃపురంలో ప్రవేశించింది. ఆమె ఇప్పుడు రుద్రమదేవి దగ్గరకు వచ్చి వాత్సల్యంతో కౌగలించుకుంది. రుద్రమ నుదుట కల్యాణరేఖగా తిలకం దిద్దింది.

రుద్రమదేవి చింతాక్రాంతురాలై వుంది. భర్త మాటను కాదని తండ్రి ఆజ్ఞను శిరసావహించి తాను రాజ్యపదవిని స్వీకరించటం ధర్మమా? అని ఆమె సందేహం. కామసాని, రుయ్యమ అది గురువు ఆజ్ఞ , శివాజ్ఞ అన్నారు.

భర్తకు పాదపూజ చేయడానికి నిశ్చయించుకుంది. ఒకలేఖ వ్రాసి చేటిక ద్వారా పంపింది. పాదపూజకు యేర్పాట్లు చేశారు. గడియ ఒక యుగంగా భర్త రాకకోసం ఎదురు చూసింది. విజయ దశమినాడు సభలో విధేయ వందనాలందిస్తానని వీరభద్రేశ్వరుడు సమాధానం పంపాడు. రుద్రమ దేవి వీరభద్రస్వామి చిత్రపటానికి పూజలు చేసింది.

అక్కడ రుద్రమ భర్త వీరభద్రేశ్వరుడు గంభీరంగా తన మందిరం ప్రవేశించాడు. ప్రధాన కరణంతో అరగడియ సేపు ఏకాంతంగా మాట్లాడాడు. రుద్రమదేవి ఉత్తరానికి సమాధానం వ్రాసి పంపిన తర్వాత పదికేతకి పుష్పాలను పరిచారిక ద్వారా ఆమెకు పంపాడు. అప్పుడాయనకు తన పూర్వకథ స్మృతి పథంలో మెదిలింది.

చంద్రవంశపు రాజైన ఇందుశేఖరుని కుమారుడు వీరభద్రేశ్వరుడు. తండ్రి తన చిన్న తనంలోనే గతించాడు. తాను రాజ్యభ్రష్టుడై తురుష్కుల సాయంతో సామ్రాజ్యాన్ని సంపాదించాలని ఆశ పెట్టుకున్నాడు. గణపతి దేవుని ఆశ్రయించి మండలేశ్వరుడయ్యాడు. శాస్త్రోక్తంగా ఒక చోళరాజపుత్రికను వివాహం చేసుకొని హరిహర, మురారి దేవులను కుమారులుగా పొందాడు. ఇంతలో స్వయంవర ఆహ్వానం గణపతి దేవుడు పంపాడు. తాను చక్రవర్తి కావాలన్న కోరిక నెరవేరుతుందని ఆశపడ్డాడు. అంతకుముందు చాళుక్య క్షత్రియులు కాకతీయక్షత్రియులతో వివాహసంబంధాలు చేసుకోలేదు. వారు తక్కువ కులస్తులని వీరి అభిప్రాయం. ప్రభుత్వకాంక్షతో అతడు స్వయంవరానికి వెళ్ళాడు. అతని కప్పటికి 35 ఏళ్ళు. ఖడ్గయుద్ధంలో వీరభద్రుడు- రుద్రమ ఒకరిని మించి ఒకరు పోరాడారు. అతడు కొంచెము మూర్ఖంగా ప్రయత్నించాడు. ఆమె అది క్రీడాయుద్ధంగా భావించింది.

వీరభద్రుడు గెలిచాడని ప్రకటించారు. చాపవిద్యలో కూడా అతడే గెలిచాడు. ఆత్మశక్తితో అతడది సాధించాడు. చైత్రశుద్ధదశమినాడు రుద్రమదేవి అతనిని పూలమాలతో వరించింది. అప్పటినుండి అతడు రాజధానీ నగరంలో గణపతిదేవుని కుడిభుజంగా మసలుతున్నాడు. రుద్రమదేవి వలన అతనికి ముమ్మడయ్య అనే పుత్రిక కలిగింది. హరిహర దేవుని చక్రవర్తి కొలువులో

చేర్పించాడు. హరిహరుడు రుద్రమను సొంత తల్లితో సమానంగా చూసేవాడు. గణపతిదేవుని తర్వాత హరిహరుడు చక్రవర్తి అవుతాడని ప్రజలు విశ్వసించారు. ఈ విషయాలన్నీ ఇప్పుడు వీరభద్రుని మనో వీధిలో మెదిలాయి.

ఈనాడు తనకు ఆశాభంగమైంది. కాటికి కాళ్ళు చాచుకున్న వృద్ధరాజు ఒక సన్యాసి మాట ఆధారంగా ఒక స్త్రీకి రాజ్యపాలన అప్పగించాడు. భవిష్యత్తులో హరిహరునికి అది పెద్దదెబ్బ. షష్టిపూర్తి అయిన తనకింకా దేహధారుఢ్యం తగ్గలేదు. బుద్ధి కుశలత సన్నగిల్లలేదు. రహస్యాగారంలోపలికి వెళ్ళాడు. అక్కడ ముఖ్యులు కొందరు అప్పటికే సమావేశమై యున్నారు. అందరూ కత్తులు కలిపారు. ప్రమాణాలు చేశారు. సభారహస్యం బయటికి పోరాదని నిశ్చయించుకున్నారు. సభ రాత్రి మూడు జాముల వరకు జరిగింది. తెలుగు సామ్రాజ్యాన్ని నాలుగు వైపుల నుండి కబళించడానికి సిద్ధంగావున్న వారికి సహాయం చేయాలని నిశ్చయించుకున్నారు. రాజధానిలో కల్లోలాలు సృష్టించాలని సంకల్పం. ఎవరెవరు ఏమేమి చేయాలనే నిర్ణయాలు కూడా అయినాయి. పిల్లలమర్రి రెడ్లు, కోటకేతరాజు, రామదేవరాయలు అందులో ముఖ్యులు. వారికి ఒకనూతన విచిత్ర పురుషుడు తోడయ్యాడు. హరిహర దేవరాయలు మహారాజుగా భావించి అతనికి పట్టాభిషేకం చేసారు. అతని ఆజ్ఞకు విధేయులై యుండాలని ప్రతిజ్ఞలు చేసారు. నూతనమహాయోగి ఆ కార్యక్రమాన్ని నిర్వహించాడు. జయజయధ్వానాలు చేశారు. నూతనవిచిత్ర పురుషునితో రాజధానిలో వీరభద్రుడు అంతఃకలహాలు సృష్టించాడు. హరిహరుని దేవగిరికి పంపించాడు.

ఏకశిలా నగరంలో శరన్నవరాత్రులు దిగ్విజయంగా జరుగుతున్నాయి. రుద్రమదేవి నవరాత్రి దీక్షను ప్రారంభించిందని చాటింపు వేశారు. కాకతి దేవతను కొలుస్తూ ఊరేగించారు. ఆమె కాకతీయ ప్రభువుల కులదేవత. ఆమె ఉత్సవాలు వైభవంగా జరుపుతారు. వారికి వ్యతిరేక వర్గం మైలారభటుల వర్గం. వారు మరొకవైపు ఉత్సవాలు నిర్వహిస్తున్నారు. ఇద్దరి మధ్యా సంఘర్షణ రాకుండా రాజభటులు సర్దుతున్నారు. అయినా వారిమధ్య కొట్లాట తీవ్రంగా విషమించే స్థితికి వచ్చింది.

ఒకనాడు ఇరుపక్షాలకు చెందిన బొల్లడు, గండడు నడివీధిలో మల్లయుద్ధం చేస్తున్నారు. నగరపాలకుడైన మేచయనాయకుడు అక్కడకు వచ్చాడు. గండని వెనుకకు పిలిచాడు. మల్లయుద్ధం ఆగిపోయింది. ఇద్దరినీ రాజభటులు బంధించి తీసుకు వెళ్ళారు. అలజడి చేయకుండా ఇరుపక్షాల వారూ కొలువులు చేసుకోవచ్చుననీ నగరపాలకుడు ఆదేశించాడు. నగరంలో ఏం జరిగేది ఆయన రెప్పపాటులో గ్రహించగలడు.

శరన్నవరాత్రుల సందర్భంగా చక్రవర్తికి సామంతులు దండనాధులు, మంత్రులు, కానుకలు అర్పించటం ఆనవాయితీ. రాజకీయవ్యవహారాలకు, వివిధ ప్రాంతాలను కలపడానికి ఈ ఉత్సవాలు తోడ్పడతాయి. ఉత్సవాలలో సరస్వతీ పూజనాడు నటులకు, గాయకులకు, కవులకు, కళాకారులకు బహుమతులందిస్తారు. చివరినాడు దీక్షానమాప్తి. ఆయుధపూజ.

ఉత్సవాలు మొదలైన నాల్గవరోజుకు గాని, ఇందులూరి అన్నయమంత్రి రాజధానికి చేరుకోలేకపోయారు. అతడు కారణజన్ముడు. ఒక యతీంద్రుడు అతని తల్లివద్దకు వచ్చి అమ్మా! నేను నీ గర్భంలో జన్మించే మాత్ర భిక్షపెట్టమని అర్థించాడు. అతని పెదతండ్రి కుమారుడు రుద్రమంత్రి. ఆయిరువురూ అతిధులకు అభ్యాగతులకు సేవచేస్తూ గడిపేవారు. అన్నమంత్రి దివాణంలో వ్యవహారాలు చూసేవారు జైన కరణాలు. అన్నమంత్రి గణపతి దేవుని దర్శించి కుశలమడిగాడు. ఆయన పద్ద పనిచేసే కరణాలు ఆమరునాడు కార్యాలయానికి రాలేదు. అన్నమంత్రికి కోపం వచ్చింది.

ప్రధాన కరణం నాగాచారిని పిలిపిద్దామని పరిచారకులను పంపుదామంటే వారుకూడా వెళ్ళకుండా తటపటాయిస్తున్నారు. అన్నమంత్రి చిరాకుపడ్డాడు. అప్పటికతని వయస్సు 25 సంవత్సరాలు ఉండవచ్చు. అయినా వంశపారంపర్యంగా ఆయనకు ఆపదవి లభించింది. చిరాకు కోపంగా మారింది. అదేసమయానికి ఎక్కడినుంచో ఇద్దరు శిష్యులు వెంటరాగా ఒక సోమయాజి గంభీరంగా వచ్చాడు. అన్నమంత్రి కోపం ప్రసన్నంగా మారింది. ఆ వచ్చినది ఎవరో కాదు. తిక్కన సోమయాజి, ఆయన శిష్యులు గురునాధుడు,

మారన. ఎప్పుడో 10 సంవత్సరాల క్రితం తన తండ్రిని చూడటానికి వచ్చిన తిక్కనామాత్యుని ఏకశిలా నగరంలో అన్నమంత్రి చూశాడు. అప్పుడాయనలో దర్పము జనాకర్షణ అన్నయ్యకు కనిపించాయి. ఇప్పుడు ఆయన రూపంలో చాల మార్పు వచ్చింది. తిక్కన నెల్లూరు మంత్రి పదవిని వదలి కాకతీయుల కొలువులో మహామంత్రి కావటానికి అప్పుడు ఇష్టపడలేదు. ఆ పిదప ఆ మంత్రి పదవిని కూడా వదలి సోమయాజి అయినాడు. అన్నమంత్రికి తిక్కనకు దూరపుబంధుత్వముంది.

అన్నమంత్రి ఏదో చిరాకులో వున్నాడని సోమయాజి గమనించాడు. ఇద్దరి సంభాషణ మధ్య కరణాలు రాకపోవడం అనే విషయం ప్రస్తావనకు వచ్చింది. మరోఐదు రోజులలో తన లెక్కలు సిద్ధం చేసి చక్రవర్తికి చూపించాలనే ఆత్రుతతో వున్నాడు అన్నయ్య. తన శిష్యులను నూరు మందిని అన్నయ్య దివాణానికి పంపి సోమయాజి ఆదుకున్నాడు. అన్నమంత్రి కది కలలా కనిపించింది. తిక్కన అక్కడ నుండి తిరిగి వెళ్ళిపోయాడు.

రాజధాని నగరంలోని కరణాలందరూ సమ్మెచేశారు. అధికారులకు ప్రభువులకు ఆగ్రహం వచ్చింది. కానీ ఏమిచేయగలరు. జైన కరణాలు సాగించిన సమ్మె మిగతా వైదిక కరణాలు కూడా కొనసాగించారు. గూఢచారుల ద్వారా వార్తలు సేకరించారు. ఈ విషయం వ్యాధిగ్రస్తులైన చక్రవర్తికి తెలిస్తే వ్యాధి వికటిస్తుందని ఆయనకు తెలియనీయలేదు. మహామంత్రులు ఆవిషయాన్ని గోప్యంగా వుంచారు.

రుద్రదేవ మహారాజు నవరాత్రి దీక్షలో ఉన్నారు. ఉపవాస దీక్షతో బాటు పూజాకార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. రాజు కొలువులో వున్న అందరు కరణాలు పనికి రావడం లేదు. వీరభద్రేశ్వరుడు ఆవిషయం పట్టించుకోకుండా తన పారసీకఅశ్వం ఎక్కి ఎక్కడికో వెళ్ళిపోయాడు మిగతా అందరికీ మనసులో ఆందోళనగా వుంది. ఇంతకుముందు కుల సమ్మెలు జరగేవి. ఉద్యోగుల సమ్మె ఎన్నడూ జరగలేదు. ఈవార్త ఏకశిలా నగరంలో ఆశ్చర్యంగా చెప్పుకొంటున్నారు. ఒక్క అన్నమంత్రి దివాణంలో మాత్రం కరణాలతో పని జరుగుతోంది. ఇది మరీ ఆశ్చర్యంగా వుంది.

సామంతులు, దండనాధులు, మంత్రులు ఆసాయంకాలం అన్నమంత్రిని చూడటానికి వచ్చారు. ముందుగా జాయపనాయకుడు బద్దెన వచ్చారు. కుశల ప్రశ్నల తరువాత బద్దెనను సుమతీ శతకంలో పద్యం చదవమన్నారు. ఎలానో-

'ధర కాపుకొండెమ్మైనను కరణాలకు బ్రతుకులేదు గదరాసుమతీ!' అనే పద్యం చదివాడు. మరికొద్ది సేపటికి ఎందరో మంత్రిసామంతులు వచ్చారు. గోనగన్నారెడ్డి, నాగదేవుడు వచ్చారు. నీవు కరణాలను ఎలా సంపాదించావని వారందరూ అడిగారు. బద్దెన 'కరణము వైదికుడైనను మరణాంతకమగును గాని మానదు సుమతీ!' అని చెప్పాడు. అన్నమంత్రి ఆపద్యం విని దిగులుపడ్డాడు. తన వద్ద వైదికులు పని చేయటం అతని దిగులుకు కారణం. కొంతసేపు సరస సల్లాపాలతో కాలక్షేపం చేశారు. ఇంతలో తిక్కన సోమయాజి అక్కడికి వచ్చారు. బద్దెన సుమతీశతకరచన ప్రస్తావన వచ్చింది. ఇందాకటి పద్యం బద్దెన మళ్ళీ వినిపించాడు. మరణాంతకం అనేదానికి తిక్కన భాష్యం చెప్పాడు. శత్రువులకు మరణమని ఆయన అభిప్రాయం. అలా అయితే వైదిక కరణాలు మాకు కూడా కావాలని అందరూ పట్టుబట్టారు. ప్రస్తుతానికి వెయ్యిమంది చేత అందరి పనులు చేయించవచ్చుననీ వారి ద్వారా ఆరువేలమంది గ్రామ కరణములను తయారు చేసే విద్యాశాల యేర్పాటు చేయవచ్చుననీ తిక్కన సలహా యిచ్చాడు. సమ్మె కేవలం నగరానికి మాత్రమే పరిమితమైంది. యౌవరాజ్యపట్టాభిషేకం జరగకుండా ఈ సమ్మె ఆరంభమైందని నిర్ధారించారు.

సమ్మె కుపక్రమించిన వారిపై కఠిన శిక్ష తీసుకోవాలని నిర్ణయించారు. అందరికీ శిరచ్ఛేదం చేయిద్దామని కొందరు సూచించారు. చివరకు ప్రధాన కరణాలకు మాత్రం ఆశిక్ష విధిస్తే చాలునని ఏకాభిప్రాయానికి వచ్చారు. ఈవార్త నగరంలో చాటించారు. ప్రధానకరణాలు ఆవార్త విని యిళ్ళు వదలి పారిపోయారు. సప్తమినాటికి చాలామంది [illegible] [illegible]ణాలకు వచ్చి క్షమాభిక్ష వేడుకొని పనులలో చేరారు. [illegible] వైదిక [illegible]రికి పెద్దపదవులు లభించాయి.

విజయ దశమితో నవరాత్రులు ముగిశాయి. ఉపవాస దీక్షతో రుద్రమదేవి కృశించినా తేజస్సుతో ప్రకాశిస్తోంది. గణపతి దేవుని ఆరోగ్యము కుదుట పడింది. యౌవరాజ్య పట్టాభిషేక ఉత్సవానికి విచ్చేసిన జనంతో ఓరుగల్లు నిండి పోయింది. అభిషేకోత్సవం ప్రారంభమైంది. రాజపురోహితుడు గణపతి దేవుని ద్వారా రుద్రమదేవికి సువర్ణరత్నపట్టం కట్టించాడు. కులపెద్దలు సువర్ణాక్షతలు కురిపించారు. రాజగురువు శ్రీ విశ్వేశ్వరశంభుదేశికులు యువరాజునకు శ్రీ రుద్రదేవ నామాన్ని ప్రకటించారు. నృత్యగీతాలతో ఉత్సవాలు సంబరంగా జరిగాయి. ఆ సాయంకాలం మహాసభప్రారంభమైంది. గణపతి దేవులు, యువరాజు కొలువు దీరాడు. ఆమహాసభకు వీరభద్రేశ్వరుడు ఆయన కుమారులు రాలేదు. కొంతసేపటికి వారు తమ పదవులను ఒదులుకుంటున్నట్లుగా ఒక పత్రం వ్రాసిపంపారు. వీరభద్రేశ్వరుడు తాను సన్యసింపదలచుకున్నట్లు వ్రాసి పంపాడు. గణపతి దేవుడు ఆముగ్గురిని చెరసాలలో పెట్టమని ఆదేశించాడు. పర్వతనాయకుణ్ణి ఆక్షణం నుండి యువరాజుకు అంగరక్షకుడుగా నియమించాడు. ఆసభలో వీర సోదరులైన జన్నిగదేవుడు, త్రిపురాంతకుడు, అంబదేవుడు యువరాజు పట్ల తమ విశ్వాసాన్ని ప్రకటించారు. అన్నమంత్రి, కొలనిరుద్రుడు గోదావరీ నది వరద బాధితుల సహాయార్థం అక్కడే వుండిపోయి, పట్టాభిషేకానికి రాలేకపోయారు. వారి ప్రభుభక్తికి మహారాజు సంతోషపడి కరణాల పాఠశాలను ప్రారంభించడానికి ఆదేశించారు. కరణాలను క్షమించి వదిలివేయాలని రాజు ప్రకటించారు. వీరభద్రుడు అతని కుమారులు నగరం వదిలి పారిపోయారని తెలిసింది. ఆనాటి సభ ముగిసింది.

మేచయనాయకుడు ఓరుగల్లు కోటలో ఒక కారాగృహంలో బొల్లని, గండని బంధించారు. ఆరోజు నడివీధిలో వారిద్దరూ కలహించుకొంటుండగా బంధించారు. బొల్లడు విచారణ సమయంలో తన తప్పును గూర్చి ప్రశ్నించినపుడు ఆవేశంలో ఏమన్నానో గుర్తులేదన్నాడు. గండడు తన తప్పుకు క్షమించమన్నాడు. గండనికి బంధవిముక్తి చేసి నూరుగురు వీరభద్రులకు అధిపతిగా చేశారు. బొల్లనికి చెరసాలలో భార్యాబిడ్డలు గుర్తుకు వచ్చారు. అన్నం సహించలేదు. నగరమంతా పట్టాభిషేక మహోత్సవంలో

సంబరంగా వుంది. ఆరోజు చెరసాలఅధికారి వద్దకు మేచయనాయకుని వద్ద నుండి బొల్లని ఈ భటుల ద్వారా పంపమని ఒక అధికార పత్రం వచ్చింది. ఆ అధికారి దానిని కాదనలేక వారి వెంట బొల్లని పంపించాడు. ఆవార్త విని మేచయ నాయకుడు ఆగ్రహించాడు. బొల్లడు అశ్వాన్ని ఎక్కి ఓరుగల్లు పరిసరాలు దాటి పారిపోయాడు.

రాజ్యంలో అక్కడక్కడా పల్లవసేనలు, చోళసేనలు ప్రజాపీడ చేస్తున్నారు. దారిదోపిడీలు ఎక్కువయ్యాయి. రైతులు తమక్షేత్రాలు దున్నటానికి భయపడుతున్నారు. ఏదో ఒక నాయకుడు వచ్చి తమ పొలంలోని పంటను బలవంతంగా తీసుకుపోతారు. ఇక జానపదుల బాధలు చెప్ప నక్కరలేదు. బ్రాహ్మణాగ్రహారాలను మాత్రం ఎవరూబాధించడం లేదు. వారిని బాధిస్తే సంకటాలు వస్తాయని నమ్మకం. సార్థవాహులు కొందరు ధన సంపదను తరలించాలని ప్రయత్నించారు. మేచయ నాయకుడు వారిని అడ్డగించి వారి వద్దనున్న ముత్యాలు, పగడాలు, సువాసనద్రవ్యాలు రాజభటులు స్వాధీనం చేసుకున్నారు. వారిని చెరసాలకు పంపించారు. ఆ రాత్రి ఏకశిలా నగరంలో రుద్రదేవ మహారాజు ఏనుగుపై ఎక్కి పురవీధులలో వూరేగారు.

ఏకశిలానగరంలో రాచనగరు తరువాత సంపదలకు పేరెన్నిక గన్నది వేశ్యలవాడ. అక్కడి వేశ్యలు కళాకుశలురు. వారితో గోష్ఠి చేయడానికి ఎందరో వస్తుంటారు. రాజకీయవ్యవహారాలలో కూడా రాయబారాలు జరిపి వారు సహకరిస్తూ వుంటారు. వారిలో కవులు కూడా ఉన్నారు. ఆరాత్రి వేశ్యవాటికలో కౌముదీ జాగరణమహోత్సవం జరుపుకుంటున్నారు. ఆ వాడలో చెప్పుకోదగిన వ్యక్తి మాచలదేవి. ఆమె తల్లికి గణపతి దేవుని అనుగ్రహం వుంది అయినా మాచలదేవిని రాజవంశంలో గౌరవించరు.

మాచలదేవి యింటికి ఆ రాత్రి గోష్ఠికి బద్దెన, జాయపనాయకుడు వచ్చారు. వారి వినోదం కోసం నృత్యాన్ని ఏర్పాటు చేశారు. ఇంతలో ఒక అజ్ఞాత పురుషుడు అక్కడికి వచ్చాడు. అతణ్ణి చూస్తే స్త్రీ పురుష భేదం కనిపించడంలేదు. మరికొంత సేపటికి మేచయ నాయకుడు, పర్వత నాయకుడు

వచ్చారు. గోష్ఠిలో పంతాలు పెరిగి నూతన పురుషుడు పర్వత నాయకుడు ఖడ్గయుద్ధానికి దిగారు. చివరకు మేచయనాయకుడు వారి యుద్ధాన్ని ఆపాడు.

రుద్రమదేవికి పట్టాభిషేకమహోత్సవం నుండి జరుగుతున్న కార్యకలాపాలు వింతగా కనిపిస్తున్నాయి. ఆమె ఒక రాత్రి నిద్రపోగా ఒక కల వచ్చింది. ఒక వనమధ్యంలో కూర్చున్న ఆమెను నాలుగు వైపులనుండి కుక్కలు అరుస్తూ చుట్టుముట్టాయి. ఆమె కత్తి దూసింది. వాటి తలలు తెగిపడి మళ్ళీ మొలుస్తున్నాయి. ఎవరో ఒక పురుషుడు వాటిని తనపైకి ఉసిగొల్పాడు. అత డెవరోగాదు వీరభద్రేశ్వరుడు. ఆకలలో భాగంగానే రుద్రమ శయనమందిరంలో వీరభద్రుడు కూర్చుని వున్నాడు. కామసాని రుయ్యమ వీరభద్రేశ్వరుని మాయం చేసింది.

రుద్రదేవ మహారాజు అంతరంగికంగా తిక్కచమూపతిని, అన్నమంత్రిని, అంబదేవుని పిలిచి ఏవో రహస్యాలు మాట్లాడుతున్నారు. ఏకశిలా నగర మధ్యభాగంలో స్వయంభూ దేవాలయం వుంది. రహస్యంగా జరిగే మంతనాలలో రాజ్యంలో శత్రువుల బాధ అధికమైందని తిక్కచమూపతి విన్నవించాడు. మట్టికోటకు బదులు రాతికోటను నిర్మించాలని నిశ్చయించుకున్నారు. రుయ్యమ దుర్గనిర్మాణచిత్రాలను తీసుకువచ్చింది. దానిపై అందరూ చర్చించారు. వారి సంభాషణ మధ్యలో బాలప్రతాపరుద్రుడు వచ్చాడు. అతడు ఖడ్గ యుద్ధం నేర్చుకుంటున్నాడు. ఆయనకు మహాదేవరాజుల తొందర వచ్చిందని అందరూ అనుకున్నారు.

రుద్రమదేవి తాను తన భర్తకు అశోక పుష్పాలు పంపించాననీ వారు తిరిగి 10 కేతకీ పుష్పాలు పంపారనీ చెప్పింది. 10 పుష్పాలు పంపడంలో దశదిశల నుండి ఒత్తిడి ఎక్కువౌతుందని సూచించినట్లవుతుందని గ్రహించారు. ఇంతలో మేచయనాయకుడు రాజదర్శనం కోరి వచ్చాడు.

మేచయనాయకుడు తెచ్చి చూపించిన పత్రాలు చదివిన రుద్రమదేవికి ఆశ్చర్యము, ఆందోళన, కోపము ముప్పిరి గొన్నాయి. అవి చూపి మహా మంత్రులను సైతం బంధించే విశేషాధికారాలు కావాలని మేచయ నాయకుడు కోరాడు. ఆపత్రాలలో అన్నమంత్రిపై ఎన్నో ఆరోపణలు ఉన్నాయి. వాటిని

రుద్రమదేవి నమ్మలేదు. అయినా రాజప్రసాదంలో అన్నమంత్రికి ఒక యేకాంత మందిరం ఏర్పాటు చేశారు. గత అయిదారు రోజులలో తన పనులు తలచుకుంటే రుద్రమకు ఆశ్చర్యం వేసింది. మొదటి ఆజ్ఞ ద్వారా వీరభద్రేశ్వరుడు బంధించబడ్డాడు. ఇప్పుడు అన్నమంత్రి బంధించబడ్డాడు. రాజధర్మం ఎంత కఠినమైనదో ఆమెకిప్పుడు అర్ధమైంది.

తిక్కన సోమయాజి తమ సోమిదేవమ్మతో కలిసి ఏకశిలా నగరానికి వచ్చియున్నారు. నెల్లూరులో యుద్ధం జరుగుతుండగా కావ్యరచన ఆగిపోయింది. చివరకు ఆయన నెల్లూరుపట్టణమే వదిలి పెట్టవలసి వచ్చింది. మనుమసిద్ధికి సహాయం కోరేందుకు ఓరుగల్లుకు కరణాలతో వచ్చాడు. వారిని ప్రభువులకు ఉపయోగపడేలా చేసాడు. ఆ విజయదశమినాడు ఆయన స్వయంభూ దేవాలయంలో మహాభారత రచన మళ్ళీ సాగించడానికి ఉపక్రమించాడు. అక్కడ కేశవ, స్వయంభూ దేవాలయాలను చూస్తే హరిహరనాధ తత్వం గోచరించింది. రచన ఆరంభమైంది. సోమయాజి చెబుతుంటే గురునాధుడు తాళపత్రంపై గంటంతో వ్రాస్తున్నాడు. మారన కూడా ఆయన వద్ద ఉన్నాడు. ఆరోజు అనుశాసనికపర్వంలో పంచమాశ్వాసం రాస్తున్నారు. 'దేవా! వైశంపాయనుడు జనమేజయుని కిట్లనియె' అని ప్రారంభించారు. జనమేజయునకు అన్నమాట రాజరాజనరేంద్రుని తిక్కనకు గుర్తుకు తెచ్చింది. ఆయన లేడుకదా అని బాధవేసింది.

ఇంతలో రుద్రదేవమహారాజులు ఆ ఆలయానికి ఆకస్మికంగా వచ్చారు. దైవదర్శనానంతరం ఆమెకు తిక్కన సోమయాజి చెబుతున్న పద్యం వినిపించింది. విప్రుల దీవెనలు రాజుల కవసరమనీ, విప్రుని అలుక మంచిది కాదనీ ఆయన చెబుతున్నారు. కొంతసేపటికి గురునాధుడు వాటిని మళ్ళీ పునశ్చరణ చేశాడు. ఆమెకు ఉత్కంఠ పెరిగింది.

ఆ కూర్చున్న వ్యక్తి ఆంధ్రమహాభారతకర్త అయిన తిక్కనామాత్యులని తెలుసుకొని అమె ఒక అభయహస్త ముద్రికగల పత్రాన్ని పంపింది. తిక్కన మహాప్రసాదంగా స్వీకరించి యధా ప్రకారం రచన కొనసాగిస్తున్నాడు.

అన్నమంత్రికి ఏకాంతవాస శిక్ష కలిగిందని తెలిసి తిక్కన బాధపడ్డాడు అన్నమంత్రి భార్యలు చింతపడ్డారు అతని చిన్నకుమార్తెకు ఆ విషయాలేవీ తెలియక నాన్నగారు రాలేదేమిః? అని తిక్కనను అడిగేది తిక్కన వారి యింట్లో అతిదిగావుంటూ భారత రచన కొనసాగిస్తున్నారు

పట్టాభిషేకానంతరం సమ్మెచేసిన జైన కరణాలకు రుద్రదేవ మహారాజు క్షమాభిక్ష ప్రసాదించారు కరణపారశాలలో బ్రాహ్మణులు లెక్కల లోతుపాతులు తెలుసుకుంటున్నారు సమ్మె చేసిన కాలంలో పదవులలో చేరిన పాకనాటి బ్రాహ్మణకరణాలకు ప్రదానపదవులు లభించాయి నాగాచారికి రావలసిన భత్యం లెక్కగట్టి చెల్లించి అతనిని పదవిలో నుంచి తీసివేశారు మరి కొందరు ప్రదానకరణాలకు కూడా ఉద్యోగాలు పోయాయి వారు బ్రాహ్మణకరణాలు వీధిలో కనబడినపుడు అపహాస్యం చేసేవారు అన్నమంత్రిపై నాగాచారికి విపరీతమైన కోపం అతడికి తోడ్పడిన తిక్కన పై ఆకోపం పాకింది ఒకనాటి సాయంకాలం తిక్కన భారత రచన ముగించుకొని మారన, గురునాధులతో అన్నమంత్రి యింటికి తిరిగి వస్తున్నాడు ఆ కృష్ణపక్ష చీకటిలో తిక్కనను కొట్టడానికి కర్ణాటకులు చాలా మంది గుంపుగా వచ్చారు గురునాదుడది చూసి విజృంభించాడు ఇంతలో నూరుగురు వీరభద్రులతో గండడు వచ్చి వారిని రక్షించాడు మారనకు బాగా దెబ్బలు తగిలాయి

ఏకశిలానగరంలో మట్టికోట సమీపంలో ఒక చిన్న గుట్టపై ఒక జైన సాధువు వుంటున్నాడు ఆయన మాహత్యం లోకమంతా ప్రాకింది ఆసిద్ధుని దర్శనం కోసం జనం విపరీతంగా రాసాగారు. క్రమక్రమంగా ఆ ప్రాంతం ఒక జైనఆరామంగావెలసింది అక్కడ దీపావళి అమావాస్యనాడు సిద్ధ దర్శన మౌతుందని ఒక వార్త పొక్కింది కానీ పంచమినాటికి కానీ ఆ సిద్ధుని దర్శనం కాలేదు కొంతసేపటికి ఆయన అంతర్ధానం చెందాడు

ఏకశిలానగరంలో నిర్మించతలపెట్టిన శిలాప్రాకారం పనులు చురుగ్గా సాగుతున్నాయి రుద్రమదేవి అదృష్టం పండి ఆ త్రవ్వకాలలో నిధి నిక్షేపాలు లభించాయి ఆ లభించిన దనాన్ని ఆమె ప్రజలకు వితరణగా యిస్తూ

వుండేది. ఇలా వుండగా ఆ ప్రాకారం నిర్మించడానికి ఎన్నుకున్న స్థలంలో ఒక జైనతీర్థంకరుని విగ్రహం వెలసింది. దాన్ని పడగొట్టడానికి వీలు లేదు. ఆవిషయాన్ని జైనాచార్యులతో సంప్రదించారు. ఆ విగ్రహాన్ని ఎవరో కావాలని అక్కడ తెచ్చిపెట్టారు. సామరస్యంగా ప్రాకారనిర్మాణం జరగడం వారికిష్టం లేదు. ప్రాకారనిర్మాణానికి సర్వాధికారి అంబదేవుడు. అతడు ఎన్నో రకాలు చెప్పిచూశాడు. ఆ విగ్రహాన్ని తొలగించి కందకం త్రవ్వ వలసిందిగా ఆయన స్థపతులను ఆజ్ఞాపించాడు. ఆ విగ్రహానికి హానికలుగకుండా పక్కకు తొలగించారు. అదేస్థలంలో అద్భుతంగా ఒక మహాశివలింగం ఉద్భవించింది. చుట్టూ భక్తులు చేరారు. ఆ లింగోద్భవ కాలంలో అక్కడ ఒక ఆరాధ్యబ్రాహ్మణుడు వెలిశాడు. అతడు సాక్షాత్తు శివుడు అనుకొని భక్తులు భావించారు. అప్పటికప్పుడు సహస్రఘట్టాభిషేకం నిర్వహించారు. ఇప్పుడు అంబదేవుడికి మరొక చిక్కు ప్రశ్న వచ్చింది. ఆ వచ్చిన వ్యక్తి యధావాక్కుల అన్నమయ్య. అతడొక మహాకవి. అతణ్ణి ప్రార్థించి అంబదేవుడు ఆ శివలింగాన్ని అక్కడనుండి కదిలించాడు. ఆ లింగమెత్తిన పాదులో రత్నరాశులు కనిపించాయి. శివలింగాన్ని నగరవీధులలో ఊరేగించారు. ఆలింగాన్ని స్వయంభూదేవాలయానికి ఈశాన్య భాగంలోని బహుచిన్న ఆలయంలో ప్రతిష్ఠించారు. అంబదేవునికి ఇది అంతా ఆశ్చర్యంగా వుంది. ఎలానో అగడ్తకు అంతరాయం తొలగిపోయింది

నాగాచారి జైనుల పక్షంలో నిలబడ్డాడు. తమకు దానంగా యిచ్చిన వసతిని అపహరించిన విషయం మహారాజు దృష్టికి తీసుకరావాలని ప్రయత్నించారు. అగడ్త పేరుతో తమకు అన్యాయం జరిగిందని ఒక వినతి పత్రం వ్రాసి పంపారు. అది చదువుకొని రుద్రదేవ మహారాజు అంబదేవుని పిలిపించి వాస్తవాన్ని గ్రహించారు. జైనులకు ఆ స్థలంపై అధికారంలేదనీ, ఆ విగ్రహ ప్రతిష్ఠకు ధనసహాయం చేస్తామని రుద్రమదేవి ఆజ్ఞాపించారు. జైనవసతిలో వున్న సిద్ధుడు మాయమయ్యాడు. ప్రభుత్వం చేసిన అవినయానికి నిరసనగా అతడు గోమటేశ్వర ప్రాంతాలకు వెళ్ళాడని వదంతిలేవదీశారు. జనం నమ్మారు.

జన్నిగ సేనలు కొప్పెరుంజింగని సేనలను ఎదిరించాయి. కాకతీయ నౌకలు అర్ధచంద్రవ్యూహంలో మొగలితుర్రు ఓడరేవు పైకి ఉత్సాహంగా సాగిపోయాయి. ఇటు నేల మీద, అటు సముద్రం మీద మహోధృతంగా యుద్ధం సాగుతున్నపుడు కొప్పెరుంజింగడు ఏకాదశీ మహోత్సవం జరుపుతున్నాడు. తానే స్వయంగా నటరాజ పూజ నిర్వహిస్తున్నాడు. గోదావరీ తీరపండితులు ఎందరో వచ్చారు. అందులో కేతన మహాకవి ఒకడు. ఒకవైపు యుద్ధం మరొకవైపు పండిత చర్చ. రాజుమాత్రం జనకమహారాజువలె నిర్లిప్తంగా వున్నాడని కేతన ప్రశంసించాడు. ఇంతలో ఒక వర్తమానం వచ్చింది. ఆ వార్త రాజునమ్మలేక పోయాడు. చోళనౌకలు వెనక్కి తిరిగి వస్తాయనే నమ్మకం లేదు. ఇంతకు ముందు అతడు గణపతి దేవుని చేతిలో ఓడిపోయి వున్నాడు. శతఘ్నులను ప్రయోగించమని అతడు ఆజ్ఞాపించాడు. తాను జనకమహారాజువలె నిశ్చింతగా వున్నట్లు 'ఊరుభంగ' నాటక ప్రదర్శనను తిలకిస్తూ గడిపాడు. నాటకంలో భీముడు దుర్యోధనుని తొడలు విరుగగొట్టడం ప్రధానాంశం. అది చూస్తున్న పండితులు సమీపంలో యుద్ధకోలాహలం గమనించారు. దగ్గరలో వశిష్ఠ గోదావరిలో నుండి ఒక మహాతరంగం లేచివచ్చింది. నాటకంలో భీమదుర్యోధనుల గదాయుద్ధం ప్రదర్శించారు. తొడలు విరిగి దుర్యోధనుడు నేల కూలాడు. రంగస్థలం మీద మరణాన్ని చూపటం గోదావరి పండితులకు నచ్చలేదు. హాహాకారాలు చేశారు. కొప్పెరుంజింగనికి కోపం వచ్చింది. ఆబ్రాహ్మణులను ముక్కలు ముక్కలుగా నరికి వేయాలని అనిపించింది. అయినా వారి చాదస్తాన్ని చూసి వదిలి వేశాడు. పూజమధ్యలో ఆగిపోయినందుకు బాధకలిగింది. శిబిరం బయట ప్రమాదసూచకమైన ఘంటానాదాలు వినిపించాయి

శిబిరంలో అల్లకల్లోలం చెలరేగింది. ఆంధ్రగజాలకు కొత్తశక్తి వచ్చింది. అతని శిబిరాన్ని చుట్టుముట్టాయి. ఒక ఆశ్వికుడు కొప్పెరుంజింగనితో నీటిలో ద్వంద్వయుద్ధానికి దిగాడు. ఒకరి నొకరు చంపుకోవాలని ప్రయత్నం. అయితే మహాప్రవాహంలో కొట్టుకొని పోకుండా ఒకరికొకరు ఊతగా కౌగలించుకున్నారు. ఇద్దరికీ ఒక్కసారిగా స్మృతిపోయింది.

ఏకశిలా నగరంలో శిలాప్రాకార నిర్మాణం చురుగ్గా సాగుతోంది. కాకతీయ సామ్రాజ్యంలో శాంతి నెలకొన్నది మొదలు కర్ణాటక రాజ్యానికి వలసపోయిన కాకతీయ ప్రజలు తిరిగి వస్తున్నారు. వారితోబాటు శ్రీవైష్ణవులు కూడా వచ్చారు. ఆరోజు వైకుంఠఏకాదశి దేవాలయంలో అర్చనలు ఏమతానుసారం చేయాలని చర్చవచ్చింది. స్మార్తపక్షంలో చేయాలని అనుకున్నారు. తిక్కన భారత రచన సరిగా సాగడం లేదు.

ఉన్నట్లుండి ఏకశిలా నగరంలో కనీవినీ ఎరుగని శబ్దం ఒకటి వినిపించింది. దానికి తోడు 'అల్లా చల్లా చూపు తల్లీ' అనే పాట కూడా వినిపించింది. అది ఏమిటో తెలియదు. అది నిశాచరుడైన ఒక భిక్షుకుని పాట, గండడు ఆ రహస్యాన్ని ఛేదించాలని అర్ధరాత్రి అతని వెంబడి వద్దాడు. అతను చివరకు బొల్లని యింటి వద్ద ఆగాడు. గండడు అతనికి తెలియకుండా అతణ్ణి అనుసరిస్తున్నాడు. ఇంతలో మంగి బయటికి వచ్చింది. తమ యింటిలో తినడానికి తిండిలేదని బాబాకు ఏమీ యివ్వజాలమనీ చెప్పింది. ఆమె పెనిమిటి సుఖంగా వున్నాడని భిక్షుకుడు చెప్పాడు. రెండు చేతులూ పైకెత్తి దోసిటినిండా సువర్ణం తీసి ఆమెకిచ్చాడు.

ఇంతలో ఆభిక్షుకుడు అదృశ్యమయ్యాడు. గండనికి విపరీతమైన భయం వేసింది. పరుగెత్తుకుంటూ వెళ్ళి మేచయనాయకుని మందిరంవద్ద వాలాడు. తనమీదికి విసిరి వేసిన బాణాన్ని గండడు తెచ్చి మేచయకు ఇచ్చాడు. దానిపై 'హ హ' అనే పొడిఅక్షరాలు వ్రాసి వున్నాయి.

అప్పటికి రుద్రదేవ మహారాజు పట్టాభిషేకమై రెండు నెలలయింది. కాకతీయ సైన్యాలు నిర్భయంగా మోటుపల్లిని పట్టుకున్నాయి. సేనానాయకులు విజయ దశమినాడు చేసిన ప్రతిజ్ఞలు చెల్లించసాగారు. ఆ విజయవార్తను స్వయంగా రుద్రమదేవి గణపతిదేవులకు తెలియజేసింది. ఆయన ఆరోగ్యమిప్పుడు మెరుగు పడింది. శరీరంలో తేజస్సు కనిపించింది. అయినా రాజ్యకార్యాలలో జోక్యం కలిగించుకోవడం లేదు. ఏదైనా సలహా కోరినపుడు 'శివాజ్ఞ పాలింపుము' అని చెప్పేవారు. ఎక్కువ కాలం భగవత్ కాలక్షేపంతో గడిపేవారు.

మోటుపల్లి విజయవార్త వినగానే ఆయన 'విజయోత్సవాలు ప్రకటించారా? అని ప్రశ్నించారు. వెంటనే రుద్రమదేవి ఆజ్ఞాపించారు. అంబదేవుడు అందుకు నియమింపబడ్డాడు. వీరవినోదాలు మొదలయ్యాయి. నాటక ప్రదర్శన ఒకటి చేశారు. అది మోటుపల్లి విజయనాటకం మూడు నాళ్ళు నగరంలో మహోత్సవంగా జరిగాయి. ఆ మూడు రాత్రులు అపరరాత్రివేళ ఒక భిక్షుకుని కంఠం 'అల్లో జేష్ఠం' అని పాడుతున్నాడు. ఉత్సవాలతోబాటు అంబదేవుడు సర్వాధికారిగా రెండులక్షలసేన పాకాలనుండి బయలుతేరింది. కోటనిర్మాణం గోన గన్నారెడ్డికి అప్పగించారు.

కొంతకాలంగా రుయ్యమ పరధ్యానంగా ప్రవర్తిస్తోంది. ఉత్సాహం కనిపించడంలేదు. రుద్రమ ఆ బ్రాహ్మణ బాలనుండి విషయం తెలుసుకోవాలని విఫలమైంది. రాజధర్మాన్ని పాలిస్తున్న తాను భర్తను ఒదులుకోవలసి వచ్చింది. లోకం కోసం శ్రీరామచంద్రుడు సీతను వదలుకోలేదా! మాటి మాటికీ వీరభద్రేశ్వరుడు గుర్తుకు వస్తున్నాడు వారెక్కడో మారు వేషంలో ఉన్నారని తెలిసింది. ఇప్పటికైనా మొండిపట్టు వదలి ఆయన తనతో సహకరించ వచ్చు. ఆయనతో వియోగం జరిగినప్పటి నుండి రుయ్యమ తనకు దూరమౌతోంది. ఆమెకు వివాహం చేస్తే బాగుంటుందని అనిపించింది.

రుయ్యమ మనస్సులో అన్నమంత్రి రూపం హత్తుకొని పోయింది. ఆనాడు అన్నమంత్రిని బంధించమన్నప్పుడు రుయ్యమ బాధపడింది. ఆనాటి నుండి ఆమె బాధ ఉపశమించలేదు. ఒక నాడు అన్నమంత్రి వేదపారాన్ని శిష్యులకు చెబుతుండగా రుయ్యమ కంటబడింది. అతనిపై చూపులు నిలిపింది. వారిరువురు దగ్గరయ్యారు. ఒకనాడు విక్రమోర్వశీయనాటకంలో నుండి ఒక పాట పాడుతూ రుయ్యమ వీణ వాయిస్తోంది. ఆ సమయంలో రుద్రమదేవి అక్కడకు వచ్చింది. ఆమె విరహాన్ని గమనించి అన్నమంత్రిని తాత్కాలికంగా విడుదల చేయటానికి రుద్రమ ఒక ఆజ్ఞాపత్రం జారీ చేసింది ఆ వార్తను అన్నమంత్రి యింటికి చేరవేశారు.

అన్నమంత్రి లేని సమయంలో కూడా వారి యింటిలో యధావిధిగా అతిథిసత్కారాలు జరుగుతున్నాయి. ఆ రోజు బాల పుట్టిన రోజు. ఆ

ఉత్సవాలలో పాల్గొనడానికి ఆనవాయితీ ప్రకారం రుద్రమ వచ్చింది. అందరూ ఆశ్చర్యపోయారు. ఆమెతో కూడా రుయ్యమ వచ్చింది. ఆమె గౌరమ్మకు పాదాభివందనం చేసింది. 'శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు' అని గౌరమ్మ దీవించింది. ఇంతలో మేనాలో నుంచి అన్నమంత్రి దిగాడు. తల్లికి నమస్కరించి ఎవ్వరినీ పలకరించ కుండా తలవంచుకొని కూచున్నాడు. రుద్రమ్మ, అన్నమంత్రి అక్కడికి రావడం అందరికీ సంతోషదాయకమైంది. అన్నమంత్రి కూడా అతిథులలో ఒకనివలె తిరుగు తున్నాడు. ఉత్సవం పూర్తి కాగానే అతను మళ్ళీ తిరిగి తన ఏకాంతప్రదేశానికి తిరిగి పోయాడు.

కొప్పెరుంజింగడు సేనాపతిగా యుద్ధసన్నాహం జరుగుతోంది. సేనాపతులకు ముందుగానే ఆజ్ఞలు అందాయి. అంబదేవుడు మహాసేనతో వస్తున్నాడని తెలిసింది. కొప్పెరుంజింగని ఎదిరించడానికి జన్నిగ కూడా మహాసేనతో వచ్చాడు. సేనలన్నీ కలిసి 18 లక్షలు వుంటాయని ప్రచరం. సముద్రనౌకాబలం కూడా కాకతీయుల నౌకాబలాన్ని ఎదిరించడానికి సిద్ధంగా వుంది.

ఆ రోజు శ్రీవైష్ణవులు దైవదర్శనంకంటె కొత్తగా వచ్చిన శ్రీవైష్ణవుని చూడాలని ఉబలాట పడుతున్నారు. అన్నమేశ్వరుని ఆలయం ముందున్న శివభక్తులు శ్రీవైష్ణవులు పాడుతున్న పాటలను యేవగింపుతో వింటున్నారు. యధావాక్కుల అన్నమయ్యకు అభిషేకభంగమైంది. అతనికి తీవ్రమైన కోపం వచ్చింది. విభూతిరేఖలు మధ్యలో నుండి ఒక తేజోధారవచ్చి వైష్ణవులను కాల్చివేసింది. వైష్ణవులు చెల్లా చెదరయ్యారు

అప్పట్లో గుంటూరు చిన్న పట్టణము. అందులో ఒక మట్టికోట. దాని పక్కన ఎఱ్ఱి చెరువు. దాన్ని ఆనుకొని ఒక అడవి. అందులో ఒక వైష్ణవ బాబాజీ మఠం వుంది. ఆ మఠానికి శ్యామలదాసు మూలపురుషుడు. మఠంలో జగన్నాధస్వామి ఆలయంవుంది. దానికి సమీపంలో ఆచ్ఛాదన లేని ఒక గణపతి విగ్రహం వుంది. దానికింద పెద్ద నిక్షేపాలున్నాయని ప్రతీతి. దాన్ని కదిలంచటానికి చేసిన ప్రయత్నాలు కుదరలేదు. ప్రయత్నించిన వారు

నానాబాధలు పడ్డారు. అది మొదలు గణపతికి పూజలు ఎక్కువయ్యాయి. ఈరోజు అక్కడ నాగదేవుడనే భక్తుడు బాబాజీ శిష్యుడయ్యాడు. అతని అతిథిశాలలో అతిథులు ఎక్కువయ్యారు. వారంతా మండలాధిపతులే. అందరూ గణపతిదేవుని ధిక్కరించినవారే. వారికి ఇతర సేనాధిపతులు కూడా తోడయ్యారు.

ఇంతటి మహాసైన్యాన్ని కాకతీయ సేనలు ఎదుర్కోగలవా! గణపతిదేవుడు వృద్ధుడైనాడు. రాజ్యభారం స్త్రీయైన రుద్రమదేవిపై బడింది. ఆమెను, ఆమెభర్త కుమారులు ఎదిరిస్తున్నారు. ఒకవైపు కళింగసేనలు మరొకవైపు కడప, పాండ్యసేనలు రాజ్యంలోకి చొచ్చుకొనివచ్చాయి. హొయసల బల్లాల సేనలు, దేవగిరి యాదవసేనలు దండెత్తడానికి సిద్ధంగా వున్నాయి. కాకతీయ సామ్రాజ్యం మునిగిపోవడానికి సిద్ధంగావున్న నౌకవలె వుంది. బొల్లడు గొంటూరు నాగదేవుని కుడిభుజంగా తిరిగుతున్నాడు. ఆసాయంకాలం జగన్నాథస్వామి ఆలయంలో వేశ్యల మేళం జరుగుతోంది. ఆనాట్యగత్తెలు బొల్లనివైపు తదేకంగా చూశారు. అతడు పాలిపోయిన ముఖంతో బిరబిరా నడుచుకుంటూ పోయాడు. ఆరాత్రి వేళ అతడు క్రోశం దూరం నడిచిపోయాడు. నల్లచెరువుకట్టవద్ద ఒక పొదలో అతడు తన ధనాన్ని దాచిపెట్టాడు. అక్కడికి వచ్చి తన కుమార్తె పాటిని, భార్యమంగను తలచుకొని ధనాన్ని ముట్టుకొని ఏడవసాగాడు. అతనికి ఆడసోకు సోకింది.

అతని అవస్థను అక్కడికి వచ్చిన గండడు చూస్తున్నాడు. బొల్లనికి అతని కుటుంబదారిద్ర్యం తెలియజేసి పూర్వసఖ్యాన్ని గుర్తుకు తెచ్చి గండడు తన వెంట తీసుకొని వెళ్ళాడు. ఇద్దరూ అంబదేవుని వద్దకు వెళ్ళారు. అంబదేవుడు యథాపూర్వంగానే గౌరవించాడు. అతనిద్వారా శత్రుపక్షం బలం అంబదేవునికి తెలిసింది

కొప్పెరుంజింగడు ఆరోజు నీటిలో యుద్ధంచేస్తూ గోదావరిలో మునిగి పోకుండా ఒడ్డుకు చేరాడు. ముందురోజు ఏకాదశిఉపవాసం వల్ల నీరసంగా వుంది. కళ్ళు తెరిచి చూసే సరికి ఎదురుగా రాణులు తనచేత ఆవుపాలు

తాగిస్తున్నారు. తన పత్నులతో కూడ అతడు శత్రువుల చేజిక్కాడు. ఆశత్రువు మర్యాదకోసం వారిని బంధించలేదు. రాణులతో అతడు మాట్లాడటానికి శక్తి చాలటం లేదు ఏదోమత్తు కమ్మి కళ్ళు మూతలు పడ్డాయి.

అదే సమయంలో అతనితో యుద్ధం చేసిన ఆశ్వికయోధుని పరిస్థితి కూడా అలానే వుంది. తాను గోదావరిలో మునిగిపోతూ వుంటే కొప్పెరుంజింగని కౌగలించుకోవటం గుర్తుకు వచ్చింది. కొంతసేపటికి కళ్ళు మూతలు పడ్డాయి. నిన్నటి వరకు ఆ ప్రదేశం నిర్జనం. ఇప్పుడు అక్కడ పద్మాకారంలో ఒక పట్టణం వెలసింది. అందులో రుద్రదేవ మహారాజు యుద్ధాలు ఘోరంగా జరుగుతున్నప్పుడు మహారాజు స్వయంగా యుద్ధభూమికి రావడం సాహసమే అనిపించింది. శ్రీశైలమల్లేశ్వరుని అనుగ్రహం వల్ల అంతా అనుకూలంగా జరిగింది.

రుద్రమదేవికి గోదావరీ తీరంలోని దక్షవాటి భీమేశ్వరుని దర్శించాలనే కోరిక కలిగింది ఆంధ్రరాజులకు ఆయన కులదైవం. ఆమె బయలుదేరే దానికి ముందు రుయ్యమకు విశేషాధికారాలు ఇచ్చివచ్చింది. ఆమె తనవెంట సేనలను కొప్పెరుంజింగని చుట్టుముట్టాయి. ఆమె వెంట వచ్చిన ఆశ్విక దళాధిపతి కొప్పెరుంజింగనితో నీటిలో యుద్ధం చేశాడు. తెల్లవారిన తరవాతగానీ జన్నిగకు రుద్రమయే స్వయంగా వచ్చినట్లు తెలియలేదు. వశిష్ఠగోదావరీ ప్రవాహంవల్ల కాకతీయసేనలపని కొంత తేలిక అయింది.

రుద్రమ దేవి జన్నిగ దేవుని ద్వారా యుద్ధవార్తలు వివరంగా తెలుసుకుంది. యోధులకు బహుమానాలు వంచి పెట్టింది. కొప్పెరుంజింగనికి శిక్ష విధించటం ఆశ్వికుని గౌరవించటం మిగిలిపోయాయి. అతనిని గురించిన వివరాలు తెలుసుకుందామని బయలుదేరిన రుద్రమకు ఏదో అనుమానం కలిగింది. ఆమె వెంటనే తన శిబిరానికి తిరిగి వచ్చేసింది.

వశిష్ఠగోదావరీ తీరంలో రుద్రమదేవి ఐదురోజులు బస చేసింది. స్వయంగా ప్రజల కష్టసుఖాలు తెలుసుకుంది. గ్రామకరణాలను నియమించింది.

అక్కడనుండి పదిరోజులు ప్రయాణం చేసి ద్రాక్షారామం చేరుకుంది అక్కడ భీమేశ్వరునికి పూజలు చేస్తున్నపుడు భర్త తన పక్కన లేక పోవడం బాధగా అనిపించింది అక్కడికి ఆమెకు రెండు శుభవార్తలు అందాయి కొప్పెరుంజింగడు ఓడిపోయిపట్టు బడ్డాడు అంబదేవుని చేతిలో గొంటూరు నాగదేవుడు ప్రాణాలు కోల్పోయాడు తప్పించుకొని పోయిన బొల్లడు చిక్కాడు ఆ విజయఘోషను ప్రకటించారు

రుయ్యమ్మ పంపిన లేఖ ద్వారా రాజధానిలో బిన్న మతస్థుల పరస్పర కలహాలు పెరిగాయని, మహాప్రదానులు రుయ్యమ రాజ ప్రతినిది కావటం ఇష్టంలేక పదవులు వొదులుకున్నారు కరణ పాఠశాలలో 6వేల మంది వ్రాయన వృత్తిలో ఆరితేరారు – ఈవార్తలందుకొని రుద్రమ బాలవీరుని పిలిపించింది అతణ్ణి క్షమించి ఏకశిలా నగరంలో విచారిస్తామని పంపివేసింది కొప్పెరుంజింగడు క్షమాభిక్ష కోరాడు దైవసాక్షిగా రాజసేవ చేసుకుంటాననీ ప్రమాణం చేశాడు అతని వెంట ఎందరో ద్రావిడ ఋత్విక్కులు వచ్చారు. వారెన్నో బాధలననుబవించారని కేతన మహాకవి చెప్పగా వారికి కాకరపర్రు అగ్రహారం దానం చేశారు

ఆ తరువాత రెండు రాత్రులు తన దండనాదులతో రుద్రమ మంత్రాలోచన చేసింది ఓరుగల్లు నుండి ప్రదానసేనలు అన్నీ వెళ్ళిపోవడం మంచిది కాదని కొలనిరుద్రుడు సందేహం వెలిబుచ్చాడు అయినా రుద్రమ అంగీకరించలేదు విజయోత్సవాలు అయిపోగానే రుద్రమ ఓరుగల్లుకు తిరుగుప్రయాణం సాగించింది

ఆరోజు మాచలదేవి స్వయంబూదేవ దర్శనానికి వచ్చింది అక్కడ తిక్కన సోమయాజులను దర్శించింది

ఆ రాత్రి మంగి, పాటి నిద్రపోలేదు భిక్షువు వచ్చి శుబవార్తలు చెప్పాడు మంగి తిక్కన సోమయాజి పాదాలపై బడింది యదావాక్కుల అన్నమయ్యను ప్రార్థిస్తే ఆమె తండ్రికి తిరిగి చూపు వస్తుందని సోమయాజులు చెప్పాడు అన్నమయ్యకృపతో శివనింద చేసి కనులు పోయిన అతనికి చూపు వచ్చింది

రుయ్యమ రాజ ప్రతినిధిగా యుద్ధ సన్నాహానికి ఆజ్ఞలు జారీ చేసింది. గోన గన్నారెడ్డి సేనలతో కదిలి పోయాడు. అయినా రుయ్యమకు నగరంలో రక్షలేకుండా పోయిందనే భయం పట్టుకుంది. ఆలోచించటానికి మంత్రులు కూడా లేరు.

అన్నమంత్రిని విడిపించి ఆయన సలహాతీసుకుంటే బాగుండునని పించింది. కానీ, తన అభిమానంతో అలా చేస్తే రాజద్రోహం కావచ్చుననుకొని మానివేసింది.

కరణశాలలు ప్రారంభించిన కొత్త రోజులలో జైనకరణాలు వారికి ఎన్నో విఘ్నాలు కల్పించారు. రాజభటులు ఏమీ చేయలేక పోయారు. కరణ పాఠశాలలో చదువు పూర్తి చేసుకున్న విద్యార్థులకు పరీక్షాధికారిగా తిక్కన సోమయాజిని నిర్ణయించుకున్నారు. పరీక్షానంతరం వారిని రణసాధనలు ప్రయోగించటంలో కూడా నేర్పు సంపాదించమని తిక్కన కోరారు. విద్యాశాలలు సాముగరిడీశాలలయ్యాయి,

మహాశివరాత్రికి ముందు ఓరుగల్లులో కుంభవృష్టి కురిసింది. పెద్ద పెద్ద భవనాలు కూడా కూలిపోయాయి. ఆ గాలివానకు ముందే రుద్రమ నగరప్రవేశం చేయవలసివుంది, కానీ ఆమెరాలేదు. శిలాప్రాకార నిర్మాణం ఆమూడు రోజులూ కష్టమైంది. జైనవసదిలో మహాశివరాత్రికి జరగవలసిన నేమినాథ ప్రతిష్ఠకు వేసిన పందిళ్ళు ఎగిరి పోయాయి. రుద్రమ నగర ప్రవేశం చేయలేక పోయింది. నేమినాథ ప్రతిష్ఠ పూర్తి అయింది. ఆ ఉత్సవాలు చూడటానికి ప్రతాపరుద్ర కుమారులను తీసుకు రావాలని వార్త వచ్చింది. ఆయనను అంతఃపురంలోంచి బయటకు పంపవద్దని రుద్రమ ఆజ్ఞ. అందువల్ల అతడురాలేదు. రాజబంధువైన మహాదేవరాజు దైవ దర్శనానికి వచ్చారు జనసందోహం ఎక్కువైంది.

మాచలదేవి కోరిక మేరకు తిక్కన సోమయాజి యువకవి అయిన గోవిందశర్మను వెంటబెట్టుకొని రాచనగరుకు బయలుదేరాడు. దేవగిరి ప్రభువు దండెత్తి వస్తే కోటరక్షణ ఎలా అని రుయ్యమ భయపడుతోంది. జైనవసదికి

వెళ్ళిన మహాదేవరాజు, మేచయ, నాగదేవ నాయకుడు తిరిగి రాలేదు. తిక్కనను చూడగానే ఆమెకు ధైర్యం వచ్చింది.. కాకతీయ సామ్రాజ్యాన్ని కాపాడమని ఆయన కాళ్ళపై పడింది. అన్నమంత్రిని విడిపిస్తే అతడు అన్ని విషయాలూ చూసుకుంటాడని తిక్కన సలహా యిచ్చాడు. రుయ్యమ అలానే చేసింది. శాస్త్రవిద్యానిపుణులైన కరణాలను రెండువేలమందిని అన్నమంత్రి రాజమందిరం చుట్టూ కాపలావుంచాడు. మరి కొందరిని గోవింద శర్మ నాయకత్వంలో జూదశాలకు పంపి అక్కడి వారిని బంధించమన్నాడు. తానే స్వయంగా కవచధారియై అశ్వంపై బయలుదేరి జైనవసదిని ముట్టడించాడు.

కొప్పెరుంజింగడు మహారాజులవద్ద శలవు తీసుకొని కాడవదేశానికి వెళ్ళిపోయాడు. దారిలో కిన్నెరసాని వాగును దాటుతూ రుద్రమదేవి తనభర్త దూరంగా వుండటాన్ని గుర్తుకు తెచ్చుకుంది. కిన్నెరసాని వలె తాను కూడా గోదావరిలో కలిసిపోతే బాగుండుననుకొంది. ఆచుట్టు పక్కల జానపదులు దేవగిరి యాదవ రాజైన మహాదేవరాజు ప్రశస్తిని గానం చేస్తున్నారు. రుద్రమ కోపంతోఖడ్గం దూసింది. ఆమె వెంట ఐదువేల సైన్యం వుంది. ఎదుట శత్రుసైన్యం ఎంతవుందో తెలియదు అనుకోకుండా ఏకధారగా వానకురిసింది. కిన్నెరసాని పొంగి ప్రవహించింది రుద్రమసైన్యం చిరిగిపోయిన గాలిపటంలా తయారైంది. మూడురోజులు మూడుయుగాలుగా గడిచిపోయాయి. సేనలు చెల్లా చెదరయ్యాయి. కేవలం నూరుమంది మాత్రమే రుద్రమ వెంట వున్నారు. అక్కడనుండి వెళ్ళడం మంచిదని రుద్రమకు సలహాయిచ్చారు. ఆమె వినలేదు.

మహాశివరాత్రి నాటికి కిన్నెరసాని తగ్గుముఖం పట్టింది. అయినా దాటటానికి వీలులేకుండా వుంది. ఎదుటి సైన్యం దాటి రాలేదని రుద్రమ పొరబడింది. తనసేనల్ని అడవి దారిలో ఎదురు రావలసిందిగా రుద్రమ ఆజ్ఞాపించింది. ఆమెకు ఇరువైపులా పర్వతనాయకుడు మనుమసిద్ధి వున్నారు. ఇరుపక్షాల సైన్యాలు ఘోరంగా పోరాడాయి. విధిలేని పరిస్థితుల్లో రుద్రమ ఒక పాలగుర్రం ఎక్కి పరుగుతీసింది. ఆమెను ఒకయోధుడు ఎదుర్కొన్నాడు. అతణ్ణి సులభంగా ఓడించింది. ఖడ్గంతో కుడిచేతిపై ఒకవేటు వేసింది. పరిశీలించి చూస్తే అతడు తన భర్త వీరభద్రేశ్వరుడే.

మహాశివరాత్రినాటి రాత్రి నేమినాథ దర్శనానంతరం మహాదేవ రాజును ఎత్తైన ప్రదేశం నుండి ఒక జలప్రవాహంలోకి త్రోసివేశారు. అతని వెంట మరొకరు- ఇలా ఎందరో! అందరూ కలిసి బయటపడాలని ప్రయత్నించి విఫలులయ్యారు. పైన ఘోరమైన యుద్ధం జరుగుతున్న శబ్దాలు వినబడుతున్నాయి. వారిని అన్నమంత్రి జాగ్రత్తగా రక్షించాడు.

మహాశివరాత్రినాడు ఏకశిలా నగరంలో ఎన్నోచోట్ల అలజడులు చెలరేగాయి. తన సైనికుల ద్వారా వీరభద్రేశ్వరుని చికిత్స నిమిత్తం పాకాలకు పంపించింది. ఆమరునాటి ఉదయం బయలుదేరి రుద్రమ ఏకశిలా నగరం చేరుకుంది. మహారాజు విజయయాత్ర అందర్నీ సంతోషపరిచింది.

దేవగిరి యాదవులు మహాదేవుని నాయకత్వంలో మూడులక్షల సైన్యంతో ఏకశిలానగరాన్ని ముట్టడించారు. నాగదేవుడు ప్రసాదాదిత్యుడు సహాయం రాగా అన్నమంత్రి శత్రుసైన్యాన్ని ఎదిరించాడు. మధ్యలో విప్లవకారులగు జైనులు శత్రుసైన్యాలకు తోడ్పడ్డారు. రాత్రింబగళ్ళు యుద్ధం జరిగింది.

అంతఃపురంలో గౌరమ్మ తిక్కన సోమయాజి చేత ఆంధ్రమహాభారతం చదివి వినిపించుకొంటోంది. కొలనిరుద్రుడు విజయ వార్తతో తిరిగి వచ్చాడు. మహాభారతంలో కురు పాండవ సమరంలో వ్యాస భగవానులు ఎలానో ఇప్పుడు తిక్కన సోమయాజి అలా కనిపిస్తున్నారు. ఒకవైపు మహారాష్ట్ర సేనలు 'జయ హరిహర దేవరాయ! జయ! అని విజృంభిస్తున్నారు. ఒకచోట హరిహర దేవులు అన్నమంత్రి ఎదురెదురుగా తలపడ్డారు. అన్నమంత్రి విజృంభించి హరిహర దేవుని శిరస్సు కామసాని పాదాల ముందు పడవేశాడు. రాజప్రాసాదంలోకి శత్రువీరులు ప్రవేశించిన విషయం గౌరమ్మకు తెలియదు. రుద్రమ ఎవరు చెప్పినా వినకుండా చివరి వరకు పోరాడటానికే నిశ్చయించుకుంది. ఆరు వేల బ్రాహ్మణ యోధులతో అన్నమంత్రి మహారాష్ట్ర సేనల్ని ఎదిరించి నిలిచారు. రుద్రమదేవి అతని వెంట తోడుగా సాగింది.

ఏకశిలా నగరం రుద్రభూమిగా వుంది. నాగాచారి పట్టుబడ్డాడు. రుద్రదేవ మహారాజు మహారాష్ట్ర సేనల్ని తరిమి కొట్టాడు. ఇంత యుద్ధం జరుగుతున్నా

దేవాలయాల్లో నిత్య పూజలకు భంగం కలుగ లేదు. అన్నమంత్రి ప్రతిభ గోనగన్నారెడ్డి పరాక్రమం, తిక్కచమూపతి పరాక్రమం రుద్రమదేవి బహుముఖ ప్రజ్ఞ వీరగాథలుగా చెప్పుకోవాలి.

మహాదేవరాజు రుద్రమ వద్దకు సంధిరాయబారం పంపాడు. ఔదార్యంతో రుద్రమ సంధికి అంగీకరించింది. జైత్రయాత్రతో తిరిగి వచ్చిన రుద్రమదేవికి ఏకశిలా నగర పౌరులు ఆనందంతో స్వాగతం పలికారు. అన్నమంత్రి తన పని పూర్తి అయినదన్నట్లుగా తిరిగి చెరసాలకు వెళ్ళి పోయాడు. కామసాని యుద్ధంలో ప్రాణాలర్పించినందుకు రుద్రమ మనసులో బాధ పడింది.

ఏకశిలా నగరంలో వసంతోత్సవాలకు రాజుగారు కోరిక మేరకు రాజగురువులు విశ్వేశ్వరశంభుదేశికులు రాజధానికి విచ్చేశారు. వారి ఆశీస్సులతో రుద్రమ రాజ్యభారం స్వీకరించారు. కాకతీయ సామ్రాజ్యంపై చెలరేగిన తుఫాను విచ్ఛిన్నమై పోయింది. నవరాత్రి దీక్షను రుద్రమ స్వీకరించింది. వసంతోత్సవాలు దిగ్విజయంగా జరుగుతున్నాయి. నగరంలో ఎక్కడ చూచినా సంబరాలే! మాచలదేవి వసంతరాగాలాపనం చేసింది. చుట్టూ చేరినవారు లయానుగుణంగా అడుగులు వేస్తున్నారు.

చైత్రశుద్ధ పంచమినాడు సరస్వతీ పూజ తరువాత పండితపరిషత్తు ఏర్పాటు చేశారు. ఆ పరిషత్తుకు తిక్కనను పిలిపించారు. కేతన కూడా అక్కడ వున్నాడు. గాయం నయమై మారన తిక్కన సమీపంలో ఉన్నాడు. ఆరు వేల మంది బ్రాహ్మణులకు కరణవిద్య పూర్తి అయినట్లు తిక్కన పట్టాలు బహూకరించారు. అన్నమంత్రీశ్వరుడు సంపూర్ణంగా నిర్దోషి అని గోనగన్నారెడ్డి మహారాజుకు తెలియ జేశారు. విజయదశమినాడు ఉదయం రుద్రమ రుయ్యమను వెంటబెట్టుకొని అన్నమంత్రి యింటికి వచ్చింది. రుయ్యమను తమయింటి కోడలిగా స్వీకరించమని గౌరమ్మను రుద్రమదేవి అభ్యర్థించింది

రుద్రదేవమహారాజు సింహాసనంపై కొలువు తీరారు. సభలోని వారందరిపై వసంతాలు చల్లబడ్డాయి. అన్నమంత్రి నిర్దోషి అని సభలో ప్రకటించాడు.

వందిమాగధులకైవారంతో అతడు సభాప్రవేశం చేశాడు. చక్రవర్తి సింహాసనంపై గణపతి దేవులు ఆశీనులై ఉన్నారు. ఇంతలో వీరభద్రేశ్వరులు సభా ప్రవేశం చేసారు. రుద్రదేవ మహారాజులకు శిరస్సు వంచి నమస్కరించారు. దౌహిత్రుడైన ప్రతాపరుద్ర కుమారుని దత్త స్వీకారం చేసుకునేందుకు వీరభద్రుడంగీకరించాడు. గణపతిదేవుని ఆనందానికి అవధులు లేవు. ఆ సాయంకాలం విజయసభ జరిగింది. చాళుక్య వీరభద్రుడు రాలేదు. తిక్కన, కేతన, మారన ఆ సభలో పాల్గొన్నారు. మనుమసిద్ధికి క్షమాభిక్ష పెట్టమని తిక్కన కోరుకున్నాడు. రాజు సరేనన్నారు. అన్నమంత్రికి రుయ్యమను, మారనకు బాలను యిచ్చి వివాహం చేశారు. తిక్కన ఆంధ్రమహా భారతమునుండి రాజ్య పరిపాలన ఘట్టాన్ని చదివి సభాసదులకు వినిపించారు.

——— ❋ ———

# 15

# అసమర్థుని జీవయాత్ర

సంక్షిప్త గ్రంథం

త్రిపురనేని గోపిచంద్

1910-1962

ప్రథమ ముద్రణ : 1946

# త్రిపురనేని గోపీచంద్

త్రిపురనేని గోపీచంద్ 1910 సెప్టెంబరు 8న కృష్ణాజిల్లా అంగలూరులో జన్మించారు. వీరి తండ్రి ప్రముఖ సంఘం సంస్కర్త త్రిపురనేని రామస్వామి చౌదరి. తండ్రి ప్రభావము, ఉన్నవ లక్ష్మీనారాయణ స్వాతంత్ర్యోద్యమ ప్రభావము గోపీచంద్‌పై పడ్డాయి లా పట్టా పుచ్చుకొని కొంతకాలం న్యాయవాదిగా పనిచేశారు

1953లో కర్నూలు రాజధానిగా ప్రకాశంపంతులు ముఖ్యమంత్రిగా ఆంధ్రరాష్ట్రం యేర్పడినప్పుడు గోపీచంద్ ఆంధ్రరాష్ట్ర సమాచారశాఖ ప్రధమ డైరెక్టరుగా నియమితు లయ్యారు 1957లో ఆకాశవాణి హైదరబాదు కేంద్రంలో గ్రామస్తుల కార్యక్రమాల ప్రొడ్యూసరుగా పనిచేశారు మద్యవయసులోనే (1962 నవంబరు 22న) గోపీచంద్ హైదరాబాదులో గతించారు

1939లో గోపీచంద్ సినీరంగప్రవేశం చేశారు. రైతుబిడ్డ గృహాలక్ష్మి, చదువుకున్న అమ్మాయిలు చిత్రాలకు మాటలు వ్రాశారు లక్ష్మమ్మ, పేరంటాలు, ప్రియురాలు చిత్రాలకు దర్శకత్వ బాధ్యత స్వీకరించారు కథారచయితగా, నవలా రచయితగా, నాటకరచయితగా గోపీచంద్ పేరు గడించాడు తొలుత మార్క్సిజం వైపు మొగ్గు చూపి, ఆంధ్ర రాడికల్ డెమోక్రటిక్ పార్టీ కార్యదర్శిగా వ్యవహారించారు

వీరికథా సంపుటాలలో- భార్యలలోనేవుంది, దేశం ఏమయేట్టు? గీతాపారాయణం, తండ్రులుకొడుకులు, నరేకానివ్వండి, ధర్మానుపత్రి, దేవుని జీవితం ప్రసిద్ధమైనవి పండితపరమేశ్వరశాస్త్రి వీలునామా అనే వీరినవలకు కేంద్రసాహిత్య అకాడమీవారి పురస్కారం లభించింది మెరుపుల మరకలు, చీకటిగదులు అనే నవలలు కూడావ్రాశారు వీరి రేడియో ప్రసంగాలు 'ఉభయ కుశలోపరి' పేరుతోప్రచురింపబడ్డాయి అసమర్థుని జీవయాత్ర సమకాలీన సాంఘిక జీవనాన్ని ప్రతిబింబించే నవల నిరాడంబర శైలి, సంక్షిప్తత ఆయన రచనలలో ప్రధాన లక్షణాలు

# అసమర్థుని జీవిత యాత్ర గురించి

సీతారామారావు అసమర్థుడైన విద్యార్థికుడు. సీతారామారావు జీవితంలో ఎదురుదెబ్బలు తిన్నాడు అతణ్ణి వంశాచారాలు, సంప్రదాయాలు కట్టిపడవేశాయి మేన మామ మోసం చేశాడు

గురుకులంలో చదివేరోజుల్లో విధిలేని పరిస్థితుల్లో ఇందిరను సీతారామరావు పెళ్ళి చేసుకొన్నాడు. సంవత్సరం తిరగకుండా ఆడపిల్ల పుట్టింది. ఐదుసంవత్సరాలు గడిచేసరికి యిద్దరుపిల్లలు తనకు పిల్లనిచ్చిన మామవల్ల కష్టాలువచ్చాయని అతడి ప్రగాఢ విశ్వాసం. భార్యమీద కోప్పడేవాడు. ఉద్యోగం ఊడిపోయింది ఏపని చేయలేక పోతున్నాడు. భార్యమీద విసుగు, కోపం. చేయిచేసుకొనేవాడు. తర్వాత మనసులో బాధపడేవాడు. ఆమె సాదాసీదామనిషి దుర్భరదారిద్ర్యం బయటకు కనబడకుండా కుటుంబం వెళ్ళబుచ్చుతోంది ఆదర్శాల ముసుగులో అతడు వికృతంగా ప్రవర్తిస్తున్నాడు ఎప్పుడు ముసుగుపెట్టి పడుకొని బాహ్యప్రపంచాన్ని మరచిపోయేవాడు కలలుకనేవాడు ఆకలి అతణ్ణి ఆవహించేది ఆకలిని జయించాలని తాపత్రయం.

బిడ్డల్ని కొట్టేవాడు. తరవాత బాధపడేవాడు విపరీత ప్రవర్తనకు భార్య ఆశ్చర్యపోయేది. అన్నం దగ్గర గొడవ పెట్టుకొనేవాడు పోట్లాటకు దిగేవాడు గమ్యంలేని వానివలె ప్రవర్తించేవాడు ప్రతి వస్తువు తనను ఎగతాళి చేస్తున్నట్లు భావించేవాడు. పాతజ్ఞాపకాలు గుర్తుకువచ్చి తాను మారిపోయానని బాధపడేవాడు స్నేహితులే తానిలా కావడానికి కారణమని నమ్మాడు వారంతా అసమర్థతను మాటలతొడుగుతో కప్పిపుచ్చుకొని ఆత్మవంచన చేసుకొంటున్నారని అతడి భావన
ఎదుటివాళ్లపై ద్వేషభావం పెరిగింది
తగువు పెట్టుకోవడానికి తాపత్రయ పడేవాడు
భార్యను కొట్టడాన్ని సమర్థించుకొనేవాడు
గమ్యస్థానం లేకుండా నడుస్తున్నాడు
పిచ్చిపట్టిన వానిలా ప్రవర్తించసాగాడు. స్మశానంలో మనశ్శాంతి పొందగలిగాడు ప్రపంచం వింతగా కనిపించసాగింది. ఆత్మహత్య చేసుకొని సీతారామరావు చివరకు చనిపోయాడు అదే అసమర్థుని జీవయాత్ర।

# 15. అసమర్థుని జీవయాత్ర

## సంక్షిప్త గ్రంథం

సీతారామారావు జీవితం విచిత్రమైనది. ఆయన తండ్రి మరణశయ్య మీద వుండి 'మనవంశం పేరు నిలబెట్టు' అని ఆఖరి మాటలు చెప్పాడు. నిజంగా వాళ్ళ వంశం గొప్పదే. తాతముత్తాతల తరం నుండి ఆవూళ్ళో దేవుడిపెళ్ళికి పీటల మీద కూర్చునే హక్కు వాళ్ళదే. ఆయన తండ్రి దానధర్మాలకు కొదవలేదు. బంధువులంతా వాళ్ళను పొగిడేవాళ్ళు. డబ్బుకన్నా పేరు గొప్పదని బంధువులు చెబుతుండేవారు

తండ్రి ఖర్మ 10వేలు పెట్టి ఘనంగా చేసాడు. రావలసిన బాకీలు విషయంలో ఉదారంగా వ్యవహరించాడు ఇవ్వవలసిన బాకీ మేనమామ ఎగ్గొట్టాలని చూశాడు. వాళ్ళతో తన తండ్రి చివరి రోజుల్లో గొడవ పడ్డాడు. సీతారామారావు తనకు రావలసిన 40 వేల బాకీకి మేనమామది 10 ఎకరాలు రాయించుకుని పరిష్కారం చేసుకున్నాడు. ఇతరులకు సహాయం చేయటమే జీవిత ధ్యేయంగా తిరగసాగాడు. తండ్రి మాట నిలబెట్టాలని అతని ప్రయత్నం.

ఆ వూళ్ళో రామయ్య అనే వృద్ధుడు సీతారామారావుని పిలిచి కొంచెం జాగ్రత్తగా మెలగమని, డబ్బు విషయంలో ఉదారత పనికిరాదని సలహా యిచ్చాడు. నీమంచితనం నీపతనానికి కారణమౌతుందని స్పష్టంగా చెప్పాడు. ప్రతిఫలం కోరకుండా తాను సహాయం చేస్తున్నానని సీతారామారావు సమాధానం

సీతారామారావు ఉన్నతాశయాలు గల వ్యక్తి నిత్యజీవితంలోని సామాన్య విషయాలకు అతీతంగా ప్రవర్తించేవాడు కుటుంబజీవితం అంటే అతడికి గిట్టదు. ఏసుఖం కోరి పెండ్లి చేసుకుంటారో అతని కర్థమయ్యేది కాదు. పెళ్ళి విషయంలో మానవులు పొరపాటు పడుతున్నారేమో అనుకునేవాడు. కుటుంబజీవితం అంటే అమితరోత. సంసారమెప్పుడూ అతనికి పురిటి

కంపు కొడుతూ వుండేది. తండ్రులు కూతుళ్ళ కోసం మొగుళ్ళను వెదకటం అసహ్యం వేసేది. అందుకని పెళ్ళి ప్రస్తావన వస్తే 'నేను సుఖపడటం ఇష్టం లేదా'? అనేవాడు

సీతారామారావు పెళ్ళి చేసుకుంటున్నాడని తెలిసి అందరూ ఆశ్చర్యపోయారు. పెళ్ళికి నూతనార్థం కల్పించి తన సిద్ధాంతానికి ఉపయోగించుకుంటానని మిత్రులతో అనేవాడు. అతను గురుకులంలో చదివే పోలీసు ఉద్యోగికూతురు ఇందిరను ప్రేమించాడు విధిలేని పరిస్థితులలో పెళ్ళి చేసుకున్నాడు. సంవత్సరం తిరక్కముందే ఆడ శిశువు పుట్టింది. **5** సంవత్సరాలు తిరిగేసరికి మూడు గర్భస్రావాలు, ఇద్దరు పిల్లలు పరిస్థితులు తారుమారయ్యాయి. జీవితం చేతిలో కీలుబొమ్మ అయ్యాడు. మామ సిఫారసుపై ఒక పెద్దకంపెనీలో గుమాస్తాగా చేరాడు. తన మామకు తాను లోకువైనందుకు బాధపడ్డాడు. పెళ్ళికి బానిస కాకుండా మామకయ్యాడు. అతనికి మామ మీద కోపం వచ్చింది. ఆయన పుట్టడం వల్ల తనకు ఇబ్బంది కలిగింది ప్రపంచమంతా మామలమయంగా కనిపించింది ఉద్యోగం చేయలేకపోయాడు అకౌంటు లెక్కలు వ్రాస్తూ పిచ్చి బొమ్మలు గీస్తే మేనేజరు మండిపడి ఉద్యోగం ఊడగొట్టాడు. ఎవరైనా అడిగితే మా మామ డిస్మిస్ చేయించా డనేవాడు

అతను మళ్ళీ ఉద్యోగ ప్రయత్నం చేయలేదు బంధువులన్నా స్నేహితులన్నా రోత. ప్రపంచం మీద కోపం. ఉన్న రోజుల్లో ఖర్చుపెట్టి ఇప్పుడనుభవిస్తున్నాడని ఇతరులు ఈసడించే వాళ్ళు తన సహాయం పొందిన వాళ్ళు కంటపడకుండా తప్పుకు తిరుగుతున్నారు. ప్రపంచం మీద కసి భార్య మీద చూపేవాడు నిత్యావసరవస్తువులు లేవని భార్య కోపం. తాను సంపాదించటం లేదని అలుసై పోయినట్లు బాధపడేవాడు. ధనవంతుల్ని చంపెయ్యాలని ఆరోజుల్లో ఒక పాట వ్రాశాడు.

అతనికిప్పుడు ఇంటి నాలుగుగోడలే జీవిత సరిహద్దులు. ప్రపంచం అనుక్షణం మారుతుంటుందని అతని నమ్మకం. సంఘసంస్కరణ, విప్లవం అని తిరిగే వారిని చూస్తే జాలివేసేది. ప్రజానాయకులు ప్రజలను మోసం చేస్తున్నారు. కుర్రతనంలో సంఘసేవకు బయలుదేరి ఆతరువాత లాభంలేదని

తెలుసుకొని వెనక్కు రాలేక బాధపడతారు. వారికి సత్యం తెలిసినా చెప్పరు. ఎందరో సంఘసంస్కర్తలు తమ స్వంత విషయానికొచ్చేటప్పటికి స్వార్థానికి పాల్పడతారు. వాళ్ళెందుకు సంతోషపడుతున్నారో అర్థమయ్యేదికాదు. రామయ్య తాత చెప్పిన మాటలే తాను ఇతరులకు చెబుతున్నాడు.

సుఖదుఃఖాలు మనస్సులో వుంటాయి. నిజంగా ఆకర్షణీయంగా అలంకరించుకున్న అందమైన స్త్రీలను చూస్తే అతనికి మరీ కంపరం. వాళ్ళ వెంబడి పడి తిరిగే కుఱ్ఱవాళ్ళను చూస్తే జాలి వేసేది. వాళ్ళకు పశువులకు తేడా లేదు తానూ ప్రేమించాడు. తనకంతా తెలుసు. శరీరాంగాలను గురించి చింతామణి పాడిన సీసపద్యం అతనికి గుర్తుకువచ్చేది. ఈ వేందాంతసారం కుఱ్ఱవాళ్ళకు బోధించాలనుకునేవాడు.

తాను కాలేజీలో చదువుకునే రోజుల్లో బస్సులో వచ్చే అమ్మాయిలను చూస్తే జుగుప్స కలిగేది. అసలు ఆలోచించడమే తప్పు అనే నిర్ణయానికి వచ్చాడు తీరిక లేకుండా కాయకష్టం చేయటం మొదలు పెట్టాడు. దొడ్లో కూరగాయల పాదులు పెట్టాడు ఆ శ్రమవల్ల నిస్సత్తువ, కోపం, చిరాకు, భార్యను తిట్టడం కూతుర్ని కొట్టడం. ఏదైనా ఉద్యోగం చూసుకోమని రామయ్య తాత సలహా. జీవిత జంఝాటం తాను పడలేనన్నాడు. చచ్చి సాధించేదేమీ లేదని అయినా ఎప్పుడో ఒకప్పుడు చావక తప్పదనీ అనిపించింది కష్టాలు లేని జీవితం కోసం ఎవరికి తోచిన విధంగావారు ప్రయత్నిస్తారు అయినా జన్మ అశాశ్వతం

అతని మనస్సు పరిపరి విధాలపోతోంది ఒక పని చేద్దామని మరోపని మొదలు పెడతాడు. ఏపని అయినా మంచి, చెడు అనేది చూడటం మీద ఆధారపడి వుంటుంది అందుకని చూడటమే మానుకోవాలనిపించింది. ఏదో ఒకటి చేయాలనుకోవటం వల్ల ఈబాధలన్నీ వస్తున్నాయి.– ఇలా అనుకుంటూ మెదలకుండా కూర్చునేవాడు. మనస్సును పెద్దలు చిక్కబట్టుకోమంటారు. ఆలోచించేది తానయినప్పుడు చిక్కబడేదెవరు? ఇలా పరిపరి విధాలుగా ఆలోచనల పుట్టలు. అతని జీవితమే గొడవ. అందుకని ఎప్పుడూ ముసుగుపెట్టుకొని పడుకొని బాహ్యప్రపంచాన్ని మరచిపోయి ఆలోచించేవాడు. ప్రశ్న మీద ప్రశ్న. ఏప్రశ్నకూ జవాబులేదు. ముసుగుపెట్టుకొని కళ్ళు మూసుకొని పడుకోవటమే ఇప్పుడతని జీవితము.

# అసమర్థుని భార్య

తెల్లారకమునుపే వచ్చేపోయే జనం కంటబడకుండా వాకిట ముందర కలాపిజల్లి ముగ్గులు వేయడం అసమర్థుని భార్య కలవాటు నా పరువు తీస్తున్నావని గొడవచేస్తాడు. అందుకని ఆమె తన కూతురు చేత ముగ్గు వేయిస్తుంది, ఆరోజు పాలమనిషి పాలబాకీ 36 రూపాయలు అయిందని, డబ్బులిప్పించమనీ కోరింది. చాల కాలంగా ఆమె ఖాతా నడుస్తోంది. వెంకమ్మకు డబ్బు యివ్వలేనందుకు ఆమెకళ్ళు చెమ్మగిల్లినాయి.

ఆవూళ్ళో పంపులు, బావులు లేవు. అవి రెండూ ఆయింట్లో వున్నాయి. ఆ నీళ్ళ కోసం ఎక్కడెక్కడి జనం వాళ్ళ యింటి ముందు వాలుతారు అలావచ్చే శీనయ్య చేత యింట్లో నీళ్ళు పోయించుకుంటుంది అసమర్థుని భార్య. శీనయ్య పల్నాటి సీమనుండి బ్రతుకుతెరువు కోనం వచ్చి లాగుడు బండితో జీవనం సాగిస్తున్నాడు. దానిమీద సంపాదించిన డబ్బుతో పెళ్ళి చేసుకోవాలని సంకల్పం. అతనికి వండిపెట్టేవారు లేరు. శీనయ్య స్వయంగా వండుకొని తింటాడు

అసమర్థుని కూతురు బడికి వెళ్ళడానికి మొరాయించేది. అంట్లుతోముతాననీ యింటిపనులు చేస్తాననీ బడికి ఎగనామం పెట్టింది. బడికి వెళితే మాష్టారు జీతం అడుగుతాడు. నాన్న జీతం అడిగితే కోప్పడతాడు. అందుకని ఆపిల్లబడికి వెళ్ళలేదు.

అసమర్థుని భార్య కూరగాయల ముసలిదానితో బేరం చేస్తోంది ఆమె దగ్గర నాసిరకం సరుకు వుంటుంది. అయితే అప్పుపెడుతుంది కాబట్టి ఆమె దగ్గర కొంటుంది. డబ్బులు ఈరోజు అడిగింది. చిల్లరలేదని సరిపెట్టింది పక్కయింటి కాంతమ్మ నడిగి అయిదు రూపాయలు బదులు తీసుకొని కట్టెపేళ్ళు తెచ్చిపెట్టమని శీనయ్య చేతిలో పెట్టింది. వెచ్చా లయిపోయాయి. ఒక కాగితం మీద కావలసిన పట్టీ తయారు చేసింది సుబ్బయ్య చిల్లరకొట్టులో ఖాతాలో వ్రాయించి సరుకులు తెమ్మని కూతుర్ని పంపింది. అంట్లు తోముతున్న కూతుర్ని చూస్తే ఆమె కడుపు తరుక్కుపోయింది.

శీనయ్య కొట్టేలు, కూతురు సామాన్లు తెచ్చిపెట్టారు. ఆరోజుకు కాపురం గట్టెక్కిందని అనుకుంది. ఆలోచించే కొద్దీ ఈ నావ ఎప్పుడు మునిగి పోతుందోనని ఆమెకు భయం వేసింది. శ్రీవారిని కాఫీకి లెమ్మని కూతురితో చెప్పింది. నాన్నకోప్పడతాగని ఆపిల్ల జంకింది

ఆమెకు తన చిన్నతనం చదువుకున్నరోజులు గుర్తుకు వచ్చాయి. తనను అదృష్టవంతురాలనని అందరూ అనేవారు. ఇప్పుడు అంతా తారుమారయింది. కాఫీకి లేవలేదని ఒకసారి, నిద్రపాడు చేశావని మరి ఒకసారి భర్త కోప్పడేవాడు. తాను చేసిన తప్పేమిటో తెలియదు.

కూతురు కూడా నాన్నకు ఏమీ తెలియదని నిర్ధారణకు వచ్చింది. ఏవైనా తెలియని ప్రశ్నలడిగితే నాకు తెలియదని కోప్పడేవాడు. పిల్లజాతకం ఎలాగుందో అని తల్లి ఆలోచిస్తోంది. సీతారామారావు గాజుగ్లాసులో తప్ప కాఫీ తాగడు. ప్రత్యేకంగా అతనికోసం ఒక గ్లాసు తెప్పించి పిల్లల చేయి తగలకుండా అలమరలో దాచింది.

సీతారామారావు నిద్దర్లో కలలు కంటున్నాడు. ఒక కీకారణ్యంలో పాములు బుసలు కొడుతున్నాయి పశుపక్ష్యాదులు భయంకర మృగాలు కనిపించాయి. ఒక ఎలుగుబంటు తాటి చెట్టు మీద నుంచి కింద పడింది. తనకు కోపం వచ్చి దాన్ని చూస్తే వెంట్రుకలు చురచురా కాలిపోయాయి. తాను తిరిగి తపస్సు మొదలెట్టాడు. ఆ తపస్సులో తనకు బ్రహ్మతేజస్సు కలిగింది. ఆ తేజస్సుకు క్రూరమృగాలు అతను చుట్టూ తిరుగుతున్నాయి. పార్వతీ పరమేశ్వరులు అర్ధనారీశ్వరరూపంలో ప్రత్యక్షమయ్యారు. తన మాట వినకుండా వున్నపళాన పరుగెత్తుకొని వచ్చినందుకు శివుణ్ణి ప్రశ్నిస్తోంది పార్వతి. శివుడు నీకేం కావాలో కోరుకోమన్నాడు.

'అన్నం' అన్నాడు సీతారామారావు.

ఆ వరమిస్తే తనను వండి పెట్టమంటాడని పార్వతి గునుస్తూ అంది. నీకు ఆకలి లేకుండా చేస్తానని శివుడు చెప్పాడు నాకు ఆకలి, అన్నము కావాలన్నాడు మరోవరం కోరుకోమన్నాడు శివుడు. భస్మాసురుని గుర్తుకు

తెచ్చింది పార్వతి నావరం ఇంకొకళ్ళకివ్వకూడదని సీతారామారావు కోరాడు. రంభాదిఅప్సరసలు పంచభక్ష్యపరమాన్నాలూ తెచ్చారు. అరణ్యం మారిపోయింది సీతారామారావు కల చెదిరిపోయింది.

పక్క ఇంట్లో పోట్లాట వినిపించి ఈ లోకంలోకి వచ్చాడు భార్య మీద కోపం వచ్చింది. పొద్దున లేచింది మొదలు రాత్రి పడుకునేదాకా ఒకటే పని. ఇప్పుడామెకు తొమ్మిదోనెల మోస్తున్నందుకు విసుగు పుట్టింది ఈ ఆడవాళ్ళకు సిగ్గు లేదనుకున్నాడు ఇంతలో పావ పిలుపు వినిపించింది. ఇంట్లో అన్ని నిండుకున్నాయనుకున్న సంగతి గుర్తుకు వచ్చి భయం వేసింది 'అమ్మ లెమ్మంటున్నది' అన్న మాటవిని కోపం జాస్తయింది. భార్య లేపటానికి వచ్చింది 'నేను బ్రతకటం మీ అమ్మ చూడలేకుండా వుంది.' అంటూ ఆమె చేతిలో కాఫీ గ్లాసు తీసుకొని గడగడా తాగేసాడు.

ప్రపంచంలో జరిగే మహాసభలు, ఉపన్యాసాలు ఆకలి ప్రస్తావనలు అతనికి రోత పుట్టించాయి. అన్నం గురించి వీళ్ళు ఎందుకు కీచులాడుకుంటారో సీతారామారావుకు అర్థం కాలేదు. ఈ మేధావులు అన్నం కోసం విప్లవాలు లేవదీస్తారు. అన్నం లేని వాళ్ళు ఉన్న వాళ్లపై తిరుగుబాటు చేస్తారు. మరి కొందరు కీర్తి దాహంతో దానాలు చేస్తారు. ఇలా ఆలోచిస్తున్న అతనికి ఆధ్యాత్మిక వాదం గుర్తుకు వచ్చింది. మన మహాఋషులు ఆకలిని జయించడానికి ప్రయత్నించారు అతనికి పునర్జన్మలమీద నమ్మకం లేదు చచ్చే వరకు బ్రతకటం తప్ప ఈ ప్రపంచంలో చేసేదేమీలేదు - అని రూఢీ చేసుకున్నాడు.

శీనయ్య పెండ్లి కోసంపడే తాపత్రయం చూస్తే అతనికి ఆశ్చర్యం వేసింది పెండ్లి చేసుకొని ఏం చేస్తావు శీనయ్య! అని అడిగాడు శీనయ్య ఏమీ తోచక సమాధానం చెప్పలేదు పెళ్ళి చేసుకోవడం పిల్లల్ని కనడం చాకిరీ చేయడం ఇదీ వరస ఏమీ తెలియని శీనయ్య అన్నీ తెలిసిన రామయ్య తాత సుఖపడుతున్నారు. మధ్య తనకే వచ్చింది బాధ. కష్టాలు తన దగ్గరకు రాకుండా తాను వూహించినవన్నీ జరగాలి. కష్టపడి ఇతరులతో పోట్లాడి బ్రతికే దాని కంటె చస్తే మేలనుకున్నాడు.

బయట నుంచి పరుగెత్తుకుంటూ వచ్చి రోజూ వచ్చే స్నేహితులు వచ్చారని చెప్పింది పాప సీతారామారావుతో. వారిని చూడటానికి గదిలోకి వెళ్ళాడు. ప్రాణం గురించి జడ చైతన్యపదార్థాల గురించి ప్రశ్నించాడు. శరీరానికి, శవానికి బేధం ఏమిటని అడిగాడు. వాళ్ళిచ్చిన సమాధానాలు అతనికి నచ్చలేదు. అతనికీ అతని స్నేహితులకీ భగవంతునిలో నమ్మకంలేదు. జీవితంలో నిర్నినిమిత్తంగాపుట్టి పరిణామంచెందడమే ఫలితం. సుఖదుఃఖాలు మానవ కల్పితాలు. మానవుడు ఏదో ఒకటి చెయ్యాలని దురభిప్రాయ పడుతున్నాడు. ఇలా కొనసాగింది వాళ్ళ చర్చ. బ్రతకటానికి వీలుంటే బ్రతకటం, లేకపోతే చావటం మంచిదని సీతారామారావు చర్చ ముగించాడు.

## అసమర్థుని మేనమామ

సీతారామారావు వందరూపాయలు కావాలని తన మేనమామకు జాబు వ్రాశాడు సమాధానం రాకపోతే మండిపడుతూ మరో ఉత్తరం వ్రాశాడు, 1500 రూపాయల ఖరీదు చేసే ఎకరం వెయ్యిరూపాయలకు కొనుక్కున్నావనీ నీకు విశ్వాసం లేదనీ వ్రాశాడు. ఒకప్పుడు బాకీకింద జమకట్టుకున్న పది ఎకరాలు నీవే పది వేలకు కొనుక్కున్నావు. నీకంటె మాయింట్లో వుండే కుక్కకు విశ్వాసం జాస్తి. నీకిచ్చిన డబ్బుకు ఎన్ని కుక్కలు వస్తాయో అని ఆలోచిస్తున్నాను. దానికి సమాధానం వచ్చింది. నీతండ్రి తాతలనుంచీ నీవంశం నాకు తెలుసుననీ గొప్పకోసం పోయి, బాధపడతారనీ వివరంగా వ్రాశాడు మేనమామ. మీనాన్న నామీద నమ్మకంతో నన్ను పిలిపించి మేనేజిమెంటు అప్పగించాడు నేను మీయింట్లో ఎన్నో కష్టాలనుభవించాను. ఆయన కంటికి మేము నౌకర్లుగా కనిపించాము. తన సహపంక్తి భోజనం కూడా చేయనిచ్చేవాడు కాదు అతని చూపులో విషం, అహంకారం, పరుషత్వం కనిపించేవి. నాకు మీ అమ్మ దొంగతనంగా అన్నం పెట్టేది మీ మేనత్త కూడా ఈనడించుకొనేది.

మీ మేనత్త కాపురం చెడిపోవడానికి మీనాన్నే కారణం తాను పుట్టింట్లో పనిచేయలేదని చెబుతూ భర్త చెప్పిన పనులు చేసేది కాదు ఆమె భర్తను

మీ నాన్న నానా దుర్భాషలాడేవాడు. చివరకు కాపరం చేయలేక నేను పెళ్ళి చేసుకున్నది నిన్నా? మీచెల్లెలినా? అని అడిగాడు. మాటామాటా పెరిగి మీనాన్న తన చెల్లెలిని తీసుకువచ్చేశాడు. వంశగౌరవం అడ్డువచ్చి ఆ కాపురం అలా కూలిపోయింది. మీయింట్లోనే వుంటూ కోర్కెలు తీరక కోపం అసూయ,ద్వేషం పెంచుకుంది. ఆమెకు ఎదురు చెప్తే మీ నాన్న కోప్పడేవాడు. మేము అన్నీ పడుతూ అక్కడే వున్నాం.

నీవు కడుపున పడ్డప్పటి నుంచీ మీ అమ్మ జీవితంలో కళాకాంతులు వచ్చాయి నీవు పుట్టిన తర్వాత నీలో మీ నాన్న పోలికలు చూసి మీ అమ్మ కన్నీళ్ళు పెట్టుకుంది. చిన్నప్పటి నుంచీ నీవు మీనాన్న వలె దాష్టీకం మామీద చూపేవాడివి. నిన్ను చూసి మీనాన్న గర్వపడేవాడు అయితే అదృష్టవశాత్తు మీఅమ్మ నీచిన్నతనంలోనే పోయింది నేను అన్ని ఏళ్ళు అవమానాలు భరించింది మీఅమ్మకోసం.

అహర్నిశలూ నేను చెమటోడ్చి మీపొలం మీద పనిచేశాను. నేను సంపాదించిందల్లా మీనాన్న యిష్టం వచ్చినట్లుఖర్చు పెట్టేవాడు నేను నా మనస్సు మార్చుకున్నాను. మీ నాన్న పోయిన తర్వాత నీవు కీర్తిప్రతిష్టల కోసంపడే తాపత్రయం చూశాను. అందుకని నీతో బాకీ పరిష్కారం చేసుకున్నాను. నీవు ఏదో నష్టపోయానని వ్రాశావు ఆరోజు మీఅత్తనోరు జారి 10 ఎకరాలు యిస్తానంది అప్పట్లో నీవు ఉచితంగానైనా ఇచ్చేవాడివి అసలు ఆ నలభైవేలు ఎక్కడివి. మాచెల్లెలు వివాహసమయంలో ఇచ్చిన డబ్బు మాడబ్బు మాదగ్గరే వుంది అది కష్టార్జితం. ఈమధ్య నీకు పిల్లనిచ్చిన మామ వచ్చాడు. నీపిల్లలు చెడిపోతున్నారనీ , నీభార్య నిన్నుచూసి జాలిపడి తనతో పుట్టింటికి రానంటోందనీ ఏవు చాలా గొప్పవాడివనీ చెప్పిందట.ఆమె బానిసగా బ్రతుకుతోంది. నేను నీకు డబ్బుపంపను. మీనుంచి జ్ఞానాన్ని పొందిన నేను మీ యింట్లో కుక్కగా పుట్టడానికి అంగీకరించను. అసలు ఇతరులని నిందించి ప్రయోజనమేమిటి? నీ చర్యల ఫలితం నీవే అనుభవించాలి. జీవిత మహాసంగ్రామంలో పిరికి వాళ్ళకూ, అసమర్థులకు చోటు లేదు. టికెట్టు ఇచ్చేచోట ముందుకు వెళ్ళాలని తొక్కిసలాడతారు అసమర్థులు

దూరంగా నిలబడి వుంటారు. టికెట్టు దొరికిన వాళ్ళు రైలెక్కివెళ్ళి పోతారు. వెళ్ళాలనుకుంటే అలా చేయక తప్పదు. ఇక మీద దయచేసి నాకు ఉత్తరాలు వ్రాయకు''.

మేనమామ వ్రాసిన ఉత్తరం చదివిన సీతారామారావుకు తనచుట్టూ వున్న ప్రపంచం గిర్రున తిరుగుతున్నట్లు అనిపించింది తన మేనమామ విషహృదయం బయటపడింది. అప్పట్లో తన బాకీకింద పదిఎకరాలు వ్రాయించుకున్నందుకు మిత్రులు అసమర్థుని క్రింద జమకట్టారు. ఆపొలం మరంమత్తు చేయిస్తేగాని పనికిరాదు. కావాలని అతను తనకు అంటగట్టాడు. ఆ పొలం తొమ్మిదిఎకరాల పదిసెంట్లనని ఆవూరి కరణం చెప్పాడు. ఆ పొలాన్ని ఎవరికైనా కౌలుకిచ్చి పొమ్మని స్నేహితులు చెప్పారు. స్నేహితుల మాటలు అతని హృదయాన్ని గాయపరచాయి. తన బాధను మేనత్త దగ్గర మొరపెట్టుకున్నాడు. మేనత్త భర్తను నిలదీసి అడిగింది. తానెన్నో కష్టాలు పడి నిందలు మోసి ఆపొలం నిలబెట్టాననీ యిష్టంలేకపోతే నీ పొలం నీవే చూసుకోమనీ ఆయన నిష్కర్షగా చెప్పేశాడు. అత్తమామ లిద్దరూ కలిసి తనను మోసం చేశారు.

సీతారామారావుకు ఈదరిద్రకొంపలో బ్రతకటం కష్టంగా వుంది. ఆమాట భార్యతో అన్నాడు కూడా. ఇంట్లో వుండలేక వీధి సందులోకి వచ్చాడు. అక్కడ తనకూతుర్ని ఎరికలది తిట్టిపోస్తూంది దాని కూతుర్ని ఈపిల్లకొట్టింది. ఎందుకుకొట్టావు? అని అడిగితే నోరు విప్పదు. అతనికి కోపం వచ్చి చావబాదాడు. చివరకు 'ముందు నన్నేకొట్టింది నాన్నా' అంది. దొడ్లో సపోటాకాయలు ఎత్తుకుపోతుంటే కొట్టానని కూతురు చెప్పింది ఎరికలది నానా మాటలంటూ నోరుపారేసుకుంది. అయ్యో! పిల్లను కొట్టానే అని బాధపడ్డాడు ఎరికలదానికి సంతోషం లేదు దాని నోటివెంట వచ్చే మాటలు వినలేక అతడు యింట్లోకి వెళ్ళాడు.

కూతుర్ని కొట్టినందుకు జాలివేసింది. పశ్చాత్తాపం కలిగింది. దగ్గరకు చేరదీసి విషయం ఎందుకు చెప్పలేదన్నాడు. కొడితే మళ్ళీకొట్టమని నీవే చెప్పావుగా అని ఆపిల్ల సంజాయిషీ యిచ్చింది. చిన్న పిల్లల తగాదాలలో

పెద్దలు తలదూర్చుకోరాదని అతని నమ్మకం. చిన్నప్పటి నుంచీ పెద్ద వాళ్ళ మీద ఆధారపడటం నేర్పితే వాళ్ళు స్వంతంగా ఆలోచించలేరు. అతనికి ఏమీ అర్థం కావడంలేదు.

పిల్లల్ని కొట్టటం తప్పనుకున్నాడు. ఆ తరువాత తరువాత భయపెట్టడానికి కొట్టవచ్చునని నిశ్చయించుకున్నాడు. పెద్దవాళ్ళు కూడా యింతే. సోషలిస్టు నాయకులు తమ ప్రత్యర్థుల్ని హింసించి తమ సిద్ధాంతాలను ఆచరణలో పెడతారు. అల్లరిచిల్లర వాళ్ళతో తిరగవద్దని తల్లి చెబుతుంటే తాను ఒకసారి అడ్డుపడ్డాడు. ఇప్పుడు తానే ఆమాట అన్నాడు. తనలోని జాలిగుణమే తన జాడ్యానికి మూలకారణం తన భార్య రాత్రింబగళ్ళు పనిచేస్తుంది. తాను ఆమెను తిడతాడు తన మెత్తని హృదయమే తన కుటుంబానికి శత్రువు నరాల బలహీనత వల్ల హృదయం మెత్తబడుతుందని ఎవరో చెప్తే ఒప్పుకోలేదు తన ఆరాటం భార్యతో చెప్పుకుందామనుకున్నాడు. తన చేతగాని తనం ఒప్పుకోవాలనుకున్నాడు. పాపమీద జాలివేసింది. లేచి అమ్మతో అన్నం వడ్డించమని చెప్పమన్నాడు. హృదయం విప్పి భార్యతో మాట్లాడితే శాంతి లభిస్తుందనే ఆశ అతనికి బలాన్నిచ్చింది.

భోజనాల దగ్గర తన మనస్సులో ప్రేమను భార్యముందు పెడదామని సీతారామారావు ప్రయత్నించాడు. ఇవాల్టిలాగే కూరరోజూ వండకూడదా అన్నాడు. ఆమె ముక్తసరిగా జవాబిచ్చింది. కొంచెంసేపు చూసి సుస్తీగావుందా? అన్నాడు. బాగానే వున్నానుఅన్న ఆమె సమాధానం అతనికి కోపం తెప్పించింది. తాను ఆమెకు అలుసు ఇచ్చాడు. అందుకే నెత్తికెక్కి కూర్చుంది. కూర మరింత వడ్డించబోతే మీనాన్నలా కడుపు పగిలేలా తినలేనన్నాడు. తనవారి ప్రస్తావన తెచ్చినందుకు ఆమెబాధపడింది. ఆయనకు కోపం వచ్చినపుడు తాను పక్కకు వెళితే మంచిదని వెళ్ళబోయింది. అతడు మధ్యలో చేయికడుక్కుని వెళ్ళబోయాడు. తన ప్రవర్తన తనకే ఆశ్చర్యం వేసింది. మాట్లాడబోయి పోట్లాట తెచ్చుకున్నాడు

ఎదురుగా గోడమీద బల్లి కనిపిస్తే దానికి తన బాధలు చెప్పుకున్నాడు భార్యవచ్చి బ్రతిమాలితే ఆకలి తీర్చుకుందామని ఎదురుచూశాడు ఆమె

గిన్నెలు సర్దుతోంది మంచినీళ్ళ మిషతో వంటిట్లోకి వెళ్ళాడు. నేను అన్నం తినకుండా మాడి ఛస్తే నీవు హాయిగా వుండవచ్చు అని ఖస్సున రేగాడు. ఎంతకూ ఆమెనోట మాట పెగల్లేదు. వంటసామాగ్రి సర్దుతూవుంది. కసితీరా పోట్లాడాడు. ఆమెను ఎలా దారిలోకి తీసుకురావాలో అర్థం కాలేదు. అన్నం వడ్డించమంటే ఆమె మాట్లాడటం లేదు. అతని అభిమానం చచ్చిపోయింది. అక్కడ నుంచి కదలబుద్ధికాలేదు.

అతని కోపము, ప్రేమ, శోకము ఆమెకు ఒకేరకంగా కనిపిస్తాయి. అతని ఉద్రేకాలకు విలువ ఇవ్వకపోటం ఆమెకు అలవాటు. లేకపోతే అతనితో ఆమె కాపరం చేయలేదు.

కళ్ళనీళ్లు పెట్టుకొని వడ్డించమంటున్న భర్తను చూసి ఆమె వడ్డించింది. తన పరువు కాపాడుకోవటానికి అతడు- నీవంతమే నెగ్గిందిగా! అంటూ విసురుగా వెళ్ళిపోయాడు. ఆమె మాత్రం పెదవి కదపలేదు. యంత్రంవలె వంటగది సర్దుతూవుంది.

తనలో తాను ప్రశ్నించుకున్నాడు సీతారామారావు తను చేసేపని తనకు బాగుండలేదు. తెలిసి మానుకోలేడు మంచిదనుకుంది చేయలేడు. ఎందుకు ఈ విచిత్రసంఘర్షణ. ఆత్మ మూలనున్న ముసలమ్మకు మల్లె గొణుగుతుంటుంది. దాని గొణుగుడు ఎవరూ వినరు పదార్థం తనపని తాను చేసుకుపోతుంది. అతని ఆలోచనలకు అంతంలేదు.

సీతారామారావు గమ్యస్థానం లేనివాడిలా ప్రవర్తిస్తున్నాడు. తనలో తానే ప్రశ్నించుకుంటున్నాడు. తనను తాను గుద్దుకుంటున్నాడు. ఇంట్లోభార్య అలికిడి వినిపించకపోతే బావిలో దూకి ఆత్మహత్య చేసుకుందేమోనని బావిదగ్గరికి వెళ్ళాడు. బావిలోకి చూట్టానికి ధైర్యం చాలలేదు ఆడవాళ్ళమీద అసహ్యం వేసింది ఆడవాళ్ళు సాధించాలని ఎందుకలా చేస్తారో అతని కర్థంకాలేదు. బావిలోకి తొంగి చూస్తే బుడగలు కనిపించాయి అది పిల్లలు విసిరేసిన గడ్డి, అతనికి భార్యమీద కోపం వేసింది. దొడ్లోంచి నంగనాచికిమల్లే నడిచివస్తోంది ఇంట్లో వుండి కూడ తన నెంతవేదన పెట్టింది.

ఏంచేస్తున్నావిక్కడ అన్నాడు. ఆమెమాట్లాడలేదు. కోపంగా అడిగితే

ఏముంది చెప్పడానికి అంటూ అతనివైపు ఎగాదిగా చూసి లోపలికెళ్ళింది ఎందుకలా చూస్తావన్నాడు. ఆమె మాట్లాడలేదు. అంతా తన కుక్కపోలిక ఆమె వెనుక పాప గజగజలాడుతూ నక్కింది విసుగుపుట్టి భార్య చెంపమీద కొట్టాడు పాప కెవ్వుమంది. మళ్ళీ భయంతో వొణికిపోయాడు. అంతా అయోమయంగా వుంది. భార్యమీద చేయిచేసుకున్నందుకు లోలోపలబాధ. లోకం యధావిధిగా జరిగిపోతోంది. ఏమిటి? ఈ ప్రపంచానికి తమతో ఏమీ సంబంధంలేదా? శరీరం అంతా సూదులుపెట్టి గుచ్చినట్లయింది. అక్కడ నిలువలేకపోయాడు

సీతారామారావుకి యింట్లో వున్న ప్రతి వస్తువు తనను చూసి ఎగతాళి చేస్తున్నట్లు అనిపించింది. ఎదురుగా గోడకు తగిలించిన పెళ్ళినాటి ఫోటో కనిపించింది. అందులో ఆమె సిగ్గుపడుతూ కూర్చుని వుంది తాను నించునివున్నాడు. ఆమె ఏదో విచారంగా కనిపిస్తోంది. మరో ఫోటోలో హార్మోనియం పెట్టెముందు కూర్చుని వుంది. ఒకప్పుడు ఇవన్నీ తనను ఆకర్షించాయి. తనను గురించి తాను తెలుసుకోవాలని తన డైరీ తీసి చదవడం మొదలు పెట్టాడు అది చదువుతుంటే ఏదో నవల చదివినట్లుంది. అందులో వ్యక్తి కధానాయకుడుగా కనిపించాడు. అతడు సాధారణ మానవుడుకాదు. చదవటం మొదలు పెట్టాడు. జులై 2వ తేదీ పేజీ తిప్పాడు. 'నీవు నన్ను మొదట ఎప్పుడు ప్రేమించావు' అని భార్యను అడిగితే సిగ్గుతో తలవాల్చింది. చెప్పమని బలవంతం చేస్తే ఎప్పుడూ ప్రేమిస్తూనే వున్నాను' అని చెప్పింది. చివరకు 'గురుకులానికి వెళుతున్నపుడు చూసి ప్రేమించానని, సిల్కులాల్చీ వేసుకున్న నేను, తన భర్త అయితే బాగుండుననుకున్నాననీ చెప్పింది.

జులై 3న భార్యాభర్త లిద్దరూ ఒక పూలచెట్టుకింద కూచున్నారు. 'నన్ను ఏం చూసి ప్రేమించావు ఇందీ' అని అడిగితే 'కోడేరువంటి మీ ముక్కు' అని చెప్పింది ఆప్యాయంగా దగ్గరకు తీసుకొని ముద్దుపెట్టుకున్నాడు. జులై 4వ తేదీ పేజీ తిరగవేస్తే డింగీలో కృష్ణానదిలో ప్రయాణం చేసి ఒకలంక చేరిన సంఘటన వ్రాసివుంది. లోకంలో తమవంటి అదృష్టవంతులు లేరు

పేరుపెట్టి పిలవమని కోరాడు. ఇందిరా దేవిని తాను ముద్దుగా 'ఇందీ' అని పిలిచినట్లే ఆమెతనని 'రామూ' అని పిలిచింది. సిగ్గు దొంతరలతో తన ఒళ్ళో తలదాచుకుంది. అతని ఆనందానికి అవధులు లేవు.

జులై 5న ఒకరి మనసు ఒకరికి విప్పి చెప్పుకున్నారు. తమ మధ్య రహస్యాలుండకూడదనీ భయం వుండకూడదనీ అనుకున్నారు. వారి నిర్మల ప్రేమ నిర్విఘ్నంగా సాగిపోవాలనుకున్నారు. ధైర్చదవ లేక పోయాడు తాను మారిపోయాడా? ఆనాటి ప్రేమ, భావాలు ఏమైనాయి. తానెంత మారిపోయినాడు. పోల్చిచూచుకుంటే గుండె గుభేలుమంది. తనలో ఉన్నత భావాలు ఏమైనాయి. తానెంత మారాడు. అద్దంలో ముఖం చూసుకున్నాడు. గుండెలు పగిలినాయి. నిజంగా తానుమారాడు. అప్పటి సౌమ్యమూర్తి ఇప్పుడు పిశాచంలా వుంది. తన శరీరం పెరుగుతున్నట్లని పించింది. ఎక్కడికైనా వెళ్ళాలనుకున్నాడు నడుస్తున్న అతనికి స్నేహితులే తాను యిలా కావడానికి కారణం అనిపించింది వాళ్ళందరూ తనలాగా బాధపడుతున్నవాళ్ళే! ఒక్కొక్కళ్ళను గురించి ఆలోచిస్తూ బజారులో నడుస్తున్నాడు

తనకు ముఖ్య స్నేహితుడు సూర్యారావు. అతడు రచయిత. కథలూ, వ్యాసాలూ పత్రికల వాళ్ళు తిప్పి పంపించేవాళ్ళు. ఇప్పుడు తను రాయటం మానేసి పెద్ద రచయితలు ఏఏ గ్రంథాల నుండి కాపీ కొట్టారో పరిశోధన చేస్తున్నాడు. తను రాయడు, ఇతరులు వ్రాసిన పుస్తకం కాపీ అని మాత్రం చెబుతాడు. తెలుగు సాహిత్యం ఎందుకు నాసిరకంగా తయారైందో రోజులకొద్ది ఉపన్యాసాలిస్తాడు తెలుగుదనం వుట్టిపడేలా ఉత్తమ రచనలు చేయాలని చెబుతాడు మన కృష్ణానది, వేమన, కనకదుర్గ వంటి విషయాలపై శ్రోతల మెప్పుకోసం ఎదురు చూస్తాడు పరాయి పాలన పోతేగానీ మంచి రచనలు రావంటాడు. చనిపోయిన రచయితలను పొగుడుతాడు.

రెండవ స్నేహితుడు శాతవాహనుడు. అతడు సుఖపడడు, రెండవ వాడిని సుఖపడనీడు ఏమి మాట్లాడినా గేయంలోనే చెబుతాడు. పిల్లలంటే అసహ్యం. అతడు ఆకలికి దాసుడు ఇడ్లీ, కారపొడి, కొబ్బరి పచ్చడి అతడి కిష్టం. అవి లేకపోతే కొట్లాడుతాడు. తన జీవితంలో సుఖపడే అవకాశాన్ని ఎవరో కాజేసినట్లు బాధ పడుతాడు

బాలకృష్ణుడు తండ్రికొడుకు. ప్రతి విషయాన్ని 'మానాన్న ఉన్నాడు చూడూ! అని చెబుతుంటాడు అన్ని విషయాలూ ఇంట్లో కూర్చుని భవిష్యత్తు వాణి చెప్పినట్లు ఆయన చెబుతుంటాడు. అవి అక్షరాలా జరుగుతాయి. తండ్రి పేరు చెప్పుకొని కొడుకు బతుకుతుంటాడు అతడు తండ్రికి బానిస. తండ్రి సలహాలు తీసుకొని బాగుపడిన పెద్దమనుషులు తన పట్ల కృతజ్ఞత చూపరు. తన తండ్రి ఇతరులు గొప్పవారవడానికి దోహదం చేస్తాడు కానీ తన సంగతి ఆలోచించడు. సీతారామారావుకు బాలకృష్ణ అంటే కోపం, ఈర్ష్య. ఒకరోజు ఎవరి నాన్న గొప్పవాడు అని సీతారామారావు ప్రశ్న వేస్తే బాలకృష్ణ నోట మాట రాలేదు. పైపెచ్చు తాను తండ్రిని పొగుడుకుంటాననీ లోకం అంతా చెప్పాడు. అలా చెప్పుకోవటం సంస్కారం కాదని కూడా బాలకృష్ణ ఏకరువు పెట్టాడు

శివరావు మరోరకం. తనను ఇతరులు ఎలాగొప్పగా చెప్పింది వివరంగా చెప్తాడు. ప్రపంచంలో ఎవరన్నా అతనికి గిట్టదు. తనంటే మాత్రం పడిచస్తాడు, కుటుంబ వ్యవహారాలు కూడా తనతో చర్చిస్తాడు. అతడు కోసే కోతలకు అంతంలేదు. ఊళ్ళో ఆడవాళ్ళంతా తనచుట్టు తిరుగుతున్నారని గొప్పలు చెప్పుకుంటాడు. అతడు చెప్పేది అబద్ధాలని తెలుసు. అయినా మళ్ళీమళ్ళీ చెప్పించుకుంటారు

స్నేహితులు గుర్తుకువచ్చి సీతారామారావు వొంటికి కంపరం పుట్టింది. వీరంతా తమ అసమర్థతలను మాటలు తొడుగుతో కప్పిపుచ్చుకొని ఆత్మవంచన చేసుకుంటున్నారు. ఇతరులను విమర్శించటం నిందించటం ప్రధానం. ఉన్నట్లుండి సీతారామారావు అరికాలితో రోడ్డును తన్నాడు. తన స్నేహితుల మూలంగా తాను ఈరోజు ఈస్థితికి వచ్చాడు. మళ్ళీ ఆలోచిస్తే ఒకరివల్ల ఒకరు చెడటమేమిటి అనుకున్నాడు

సీతారామారావుకి ఎదుటివాళ్ళపై ద్వేషం పెరిగింది. అడవుల్లో దారులుకొట్టి బతకాలి అనిపించింది. అక్కడ స్వేచ్ఛగా జీవనం గడపవచ్చు. అడవుల్లో ప్రయాణం చేస్తూ దొంగలభయానికి ఆంజనేయస్తోత్రాలు చదువుతారు దొంగలు వారిపైబడి నిర్దాక్షిణ్యంగా తన్ని నగానట్రా అపహరిస్తారు తాను ఆ అడవిలో కంటక కిరీటధారి- ప్రస్థానభేరి!

రోడ్డుమీద నడుస్తూ సీతారామారావు పెద్దగా నవ్వుకొన్నాడు. సంఘంలో కట్టుబాట్లు, నియమాలు లేకుండా హాయిగా వుండాలని ఆలోచించాడు. ఆవిధంగా నిలువుదోపిడీ అయిన తర్వాత ఆబళ్లలోవెళ్తున్న ఓ వయసులో వున్న పిల్లను అతడు చూస్తాడు. ఆమె భయంతో ఒణికిపోతుంటుంది. మానభంగాల గురించి వూహించుకొంటూ వుండటం వల్ల శరీరం పాకానికి వస్తుంది. రక్షించమంటూ పాదాలపై వాలుతుంది. తాను ఆమెను పైకిలేపి వెళ్ళిపొమ్మంటాడు. తానేమి చెయ్యడు. తన అనుచరులు చెట్లచాటుకు వెళ్ళిపోతారు. ఆమెకు ఆశాభంగం అవుతుంది. ఆవేదనతో కూలబడిపోతుంది. ఆమె తనను జన్మలో మరచిపోగలదా? ఇలా ఆలోచిస్తూ దగ్గరలోవున్న రామయ్యతాత యింటికి వెళ్లాడు.

రామయ్య తాత మనవడితో ఆడుకొంటున్నాడు. తన వయస్సును మరచిపోయి పిల్లవాడిలా ప్రవర్తిస్తున్నాడు. రామయ్యతాత శాంతంగా కాలం గడపటం సీతారామారావుకి అసహ్యం వేసింది.

సీతారామారావును చూడగానే రామయ్యతాత 'ఈజీవితం వుంది చూశావూ!' అని ఉపన్యాసం మొదలెట్టాడు. సీతారామారావుకు ఒళ్ళుమండింది.

'చూశాను! చూడకేం! పిచ్చివాడి రూపం ధరించి ముడ్డిమీద తంతూవుంది!' అన్నాడు. రామయ్యతాత రామారావును నిశితంగా చూస్తూ 'ఎంతతన్నినా కొంతమందికి బుద్ధిరాదు బాబు! అన్నాడు. తన భార్యను కొట్టినందుకు ఎత్తిపొడుస్తున్నాడేమోనని రామయ్య తాతను అవమానపరచాలని బుద్ధిపుట్టింది.

'నీ మనవడి ముక్కు నీవు తుడిస్తే చూసి చచ్చిపోవాలని ఉంది'. అన్నాడు.

చావదలచినవాళ్ళకు కోర్కెలుండటం మంచిదికాదని, చస్తానని బెదిరించి సానుభూతిని సంపాదించ దలచినవాడు చావలేడనీ రామయ్యతాత అన్నాడు. ఏమీ కోర్కెలు లేని నీవెందుకు బతుకుతున్నావని సీతారామారావు వాదన పెంచాడు. అతడు తగాదా పెట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నాడని తాత గ్రహించి నోరు మెదపలేదు.

నాభార్యను కొట్టడంలో తప్పేముంది తాతా! రాముల వారు సీతాదేవిని అడవులపాలు చేయలేదా! నేనుకూడా అవతారపురుషుణ్ణి కదా! అన్నాడు. తాత కళ్ళు ఎరుపెక్కినాయి. 'మూర్ఖుడా! శ్రీరామచంద్రమూర్తితో పోల్చుకుంటావా'! అనికోపంగా అన్నాడు. కళ్ళుచింత నిప్పులైనాయి. తాత తను అర్థంచేసుకున్న తాతకాదు. తానెన్నడూ వూహించి ఎరగని కొత్తమనిషి కనపడేటప్పటికి అతనికి భయం వేసింది.

రామచంద్రమూర్తితో నీవు పోల్చుకోవద్దు. తన ఆదర్శాన్ని త్యజించే విషయం వచ్చినపుడు ఆయన భార్యను త్యజించాడు. నీవు నీ అసమర్ధతను దుర్మార్గాన్ని కప్పిపుచ్చుకోవటానికి, కారణాలు వెదుకుతున్నావు. తప్పును సమర్ధించుకునే నీచులకు ముక్తి లేదు. నీఅంతం దగ్గరకు వచ్చింది. నీతాతముత్తాతలతో ప్రారంభమైన నాటకం చివరి అంకం నీతో ఆరంభమైంది. తెర ఎప్పుడైనా పడవచ్చు. నీవంశ చరిత్ర నేనెరుగుదును. అంతా ఒకటే రకం. ఒకడైనా బుద్ధిమంతుడు పుట్టకపోతాడా అని ఎదురు చూసిన ఆశ తీరిపోయింది.

'నీవు తెలివిగా చేసిందేమిటి తాతా'? అని ఎదురు ప్రశ్న వేశాడు. అతడికి పిచ్చిపట్టిందని తాత నిర్ధారించుకున్నాడు. నీవు పిచ్చివాడవని నీభార్య చేత విడాకుల పిటీషను పెట్టిస్తాను అన్నాడు తాత. ఇంట్లోంచి బయటకు వెళ్ళమని తాత గదమాయించాడు.

రామయ్యతాత తనను బయటకు నెడుతున్నాడు. మనవడి చేతిలో కత్తి రామయ్య తాత చేతిలోకి వచ్చింది. సీతారామారావు బయటకు పరుగెత్తాడు.

సీతారామారావుకు గమ్యస్థానంలేదు. తన ప్రమేయం లేకుండా తన అవయవాలు నడచుకొంటున్నాయి. ఎవరో పరిచితుడు కనిపించి ఎక్కడికి వెళుతున్నావన్నాడు. నాకాళ్ల నడగమన్నాడు. గోడలనిండా మసి బొగ్గులతో బొమ్మలు గీయడం మొదలెట్టాడు. అతని చుట్టూ పిల్లల గుంపుపోగయి తమ బొమ్మగీయమని అడగసాగారు. రామయ్య తాతను అడగండి పోయి అన్నాడు.

ఎదురుగా వెళుతున్న ఒక పెద్దమనిషిని ఆపి 'నీవెందుకు పుట్టావు? అని నిలదీశాడు 'నీబార్య చీర అడిగితే ఎందుకుకొట్టా' వన్నాడు పెద్దమనిషి విదిలించుకొని వెళ్ళిపోయాడు

కాఫీహోటల్లో పలహారం తిని సరియైన డబ్బులు యివ్వకపోతే ఒకన్యాయవాది ప్రొప్రయిటర్ తరపున సీతారామారావుని నిలదీసి అడిగాడు 'నీ బార్యను నీవు సరిగా చూశావటయ్యా' అని ప్రశ్నించాడు సీతారామారావు

చుట్టూ జనం పోగయ్యారు సీతారామారావు పక్కనే వున్న పోలీసు దిమ్మమీద నిలబడి ఒక తెలుగు పాట పాడాడు జనం గుమిగూడారు ఉపన్యాసం మొదలెట్టాడు

'ఒరేయ్! నాకు పిచ్చెత్తింది అనుకొన్నారా? దేవుడు మనల్ని పుట్టించాడు వాడిలో ఐక్యం కావాలని చెప్పారు మనం నమ్మలేదు దేవుడు మనుషుల్లో వున్నాడు. మనం ఒకరితో ఒకరు కొట్లాడుకొంటున్నాం సంఘసేవ మానేశాం హేతువాదులు 'ఎందుకు' అని ప్రశ్నించడం మొదలెట్టారు మనం పుట్టటం నిజం, చావటం నిజం బతకడానికి అన్నం కావాలి దానికోసం రక్తపాతాలు వద్దురా!' అని ఉపన్యాసం ముగించాడు

పోలీసు వచ్చి సీతారామారావును తరిమేశాడు

సీతారామారావు నేరుగా బోగంవాళ్లపేట వెళ్లాడు

ఒకామె వీదిలో నిలబడి విటునితో మాట్లాడుతోంది.

వాళ్ళిద్దరూ ఏం మాట్లాడుకుంటున్నారో తెలుసుకోవాలని' ఏం మాట్లాడుకొంటున్నా'రని అడిగారు విటుడు పారిపోయాడు

ఆమె అతణ్ణి లోపలికి పిలిచి తనకద చెప్పింది.

'నాతల్లి బ్రాహ్మణ స్త్రీ ఒక కుర్ర వాడు మోసం చేసిన ఫలితంగా నేను పుట్టాను ఎవరినైనా పెళ్లి చేసుకోవాలని పిల్లల్ని కనాలని వుంది' అంది

సీతారామారావుకు అతని స్నేహితులంతా ఆమె ముఖంలో కనిపించారు. వాళ్ల తలలన్నీ ఆమె తల చుట్టూ సినిమాలోలా తిరుగుతున్నాయి. ఒక్కొక్కళ్లు వాళ్లవాళ్ల కష్టాలు చెప్పుకొంటున్నారు. ఆమెను ఆరాధ్యదైవంగా భావించాలని చెబుతున్నారు. సీతారామారావు భయపడి బయటికి పరుగెత్తాడు.

దారిలో ఒక తాగిన యానాదిపురుషుణ్ణి వాడి భార్య తీసుకెళ్తోంది.

దేవాలయం ముందు ఏదో మీటింగు జరుగుతోంది. వేదికమీద పరబ్రహ్మ శాస్త్రి, చైతన్యస్వామి వగైరా ఉపన్యాసాలిస్తున్నారు. జనం జేజేలు కొడుతున్నారు. అతడు ఆశ్చర్యంగా చూస్తున్నాడు. తమ ప్రవర్తన మార్చుకోకుండా ఉపన్యాసాలిస్తున్నందుకు కుతకుతలాడిపోతున్నాడు.అతడు కూడా వేదిక మీదికెక్కాడు. శరీరం తూలిపోతోంది. వేదిక మీదివాళ్ల పద్ధతుల్ని తన ఉపన్యాసంలో తూర్పారబట్టాడు. ప్రజలు నోరు తెరుచుక వింటున్నారు. 'తాగాడు, దింపండి' అన్నారొకరు.

నీతులు చెప్పేవాళ్ళ మాటలు విని మోసపోవద్దన్నాడతడు. అధ్యక్షులవారి బండారం బయటపెట్టాడు. ఈ స్వాములవారు ఒక కుర్రదాన్ని లేపుకొచ్చాడు. తర్వాత ఆశ్రమంలోంచి తరిమేస్తే ఆ పిల్ల ఆత్మ హత్య చేసుకొంది - అని చైతన్య స్వామి గుట్టు రట్టు చేశాడు. అసలు తప్పు ప్రజలదే నన్నాడు. మీరు గొర్రె లన్నాడు.

'పిచ్చెక్కింది' అన్నారు కొందరు.

ప్రజల్ని మూర్ఖులనీ, పందులనీ తిట్టసాగాడు.

వీణ్ణి 'తన్నండి' అని ప్రజల్ని రెచ్చగొట్టాడు సూర్యప్రకాశరావు.

అతడు భయంకరాకారంతో కుర్చీ ఎత్తి పట్టుకొని - మీరు పిచ్చివెధవలని అరిచాడు. రామయ్య తాత 'పట్టుకోండి' అంటూ జనంలోంచి కేకవేశాడు. చైతన్యస్వామి అతడు నుంచొన్న బల్ల పడదోశాడు. అతడు కింద పడితే జనం విరుచుకపడ్డారు. బూతులు తిట్టారు. తలా ఒక తన్ను తన్నారు.

రామయ్య తాత వచ్చి పలకరించాడు.

'నా భార్యని నన్ను క్షమించమని చెప్పు తాతా!'' అని ప్రార్థించాడు

సీతారామారావు. రామయ్య తాతతో పాటు అతడు నిద్ర గన్నేరు చెట్టు కిందకి తీరిగ్గా మాట్లాడుకొందామని వెళ్ళాడు.

ఆ చెట్టు కింద కూచొని లోకాన్ని పరిశీలిస్తున్న అతడికి యిన్నాళ్ళ నుంచి వెతుకుతున్న దేదో అర్థమయినట్లు అనిపించింది. రామయ్య తాత మెల్లిగా మాటల్లోకి దించాడు :

మానవ స్వభావాన్ని ప్రకృతి నైజాన్ని విశదీకరించాడు. ప్రకృతి ఒక్కొక్కసారి ఎదురు తిరిగి మానవ జాతిని సర్వనాశనం చేస్తుంది. నీ దుర్గతికి కారణం అదే. నువ్వు కొత్తగా కనిపెట్టింది ఏమీలేదు. నేను ముందుకు పోక వెనక్కి రావడానికి కారణమేమిటని సంశయిస్తున్నావు. జ్ఞానాన్ని సంఘశ్రేయస్సుకు ఉపయోగపడేలా చేయకపోతే సర్వనాశనానికి దారితీస్తుంది. ఈ విషమావస్థలో నీవు దారి, తెన్ను లేకుండా కొట్టు కొంటున్నావు. నీ జీవితానికి ఆధారంలేక పతనం ఆరంభమైంది. సంఘం ఎప్పుడూ పరిణామశీలి! మన ఆదర్శం కూడా మారుతుంటుంది. దాన్ని బట్టి మనజీవితాల్ని మార్చుకోవాలి. మన ఊహాల్ని సంఘం మీద రుద్దడానికి ప్రయత్నించకూడదు. జరిగింది మోసమని నీచార్థం కలిపించడం నీ మనస్తత్వాన్ని తెలుపుతుంది అని సుదీర్ఘంగా చెప్పాడు రామయ్యతాత.

సీతారామారావు మాట్లాడలేదు. అంతా నిశ్శబ్దం, వెళదాం రమ్మన్నాడు రామయ్య తాత. నేను కాసేపు వంతెన వద్ద కూర్చొని వస్తానని రామయ్య తాతను పంపించి వేశాడు. ఉండి ఉండి అంతా మిథ్య అని నిశ్శబ్దం బద్దలయ్యేలా అరిచాడు.

కాళ్ళీడ్చుకుంటా శ్మశానం దగ్గరకు వచ్చాడు. అక్కడ దూరంగా ఒక చితి మండుతూ వుంది. అతనిలో ఆరాటం ఆవేదనా తగ్గాయి. ఆ చితి అతనికి మనశ్శాంతిని చేకూర్చుంది. దాన్ని చూస్తూ కూర్చున్నాడు.

ఇంతలో అరవైయేండ్ల ముసలివాడు వచ్చి నేను చేసింది తప్పా? అని అడిగాడు. ఎవరి మనసు వాళ్ళకు సాక్షి! అన్నాడు సీతారామారావు. సత్యం

చెప్పావు. నూరేండ్లు బతకమన్నాడు ముసలివాడు. బతకాలను కోవటం మనుషులు తప్పించుకోలేని వ్యసనమన్నాడు - సీతారామారావు.

తిండికి లేక పోతే తన కూతురు వ్యభిచరించి 10 రూపాయలు తెచ్చిపెట్టింది. తాను మొదటి రోజు ఎముకలు విరుగ గొట్టాడు. మర్నాటినుండి యధాప్రకారం జీవితం కొనసాగింది. దాని తమ్ముడు ఆమె సంపాదనతో చదువు పూర్తి చేసుకుని ఉద్యోగంలో చేరాడు బతికిన నాలుగు రోజులు తాను సుఖపడి అందరినీ సుఖపెట్టి ఈనాడు మట్టిలో కలిసిపోయిందని మండుతున్న చితిని చూపించి అన్నాడు ముసలి వ్యక్తి.

సీతారామారావు మనసులో ఆలోచనలు చెలరేగినాయి. ప్రపంచం కొత్త వింతగా కనిపిస్తోంది. కోలాహలంగా వున్న ప్రపంచాన్ని ప్రశాంతంగా వున్న శ్మశానాన్ని పోల్చి చూచుకుంటే అతని మనస్సు చల్లబడింది. తన స్వగృహానికి వచ్చినట్లనిపించింది. ఇక్కడ అంతా ఒక్కటే. శ్మశానం అందరినీ సమానంగా చూస్తుంది. రామయ్య తాత, తన మేనమామ అంతా ఇక్కడికి రావలసిందే. శ్మశానం అతడికి ఆకర్షణీయంగా కనిపించింది. చితిమంటలు తనను పిలుస్తున్నట్లు అనిపించింది. ఆ చితి తనతో మాట్లాడినట్లుంది. స్మశానం కదులుతున్నట్లుంది. తండ్రి సమాధి వద్దకు వెళ్ళాడు. అక్కడ జిల్లేడు మొక్కలు దట్టంగా వున్నాయి. అనేక ఘనకార్యాలకు మూలమైన తన తండ్రి వీటికి ఎరువుగా మారాడు. తండ్రి మీద అతనికి కోపం వచ్చింది.

ఒక మొక్క నీడ తన తండ్రి ఆకారాన్ని ధరించి - నా వంశప్రతిష్టను మంట గలిపావు గదరా! అని ప్రశ్నించింది. అతడికి కోపం వచ్చి డబ్బు అయిపోయింది నాన్నా అన్నాడు. డబ్బు విషయంలో నీకు నీ మేనమామ పోలిక వచ్చిందనీ తల్లిని ఆదర్శంగా తీసుకున్నావనీ దబాయించాడు తండ్రి.

తల్లి పేరు ఎత్తే సరికి అతనికి కోపం వచ్చింది. ' నా స్థితికి నీవే కారణమనీ మీ అభిరుచులతో నన్ను పెంచి పాడు చేశావనీ తల్లిని ద్వేషించేలా చేశావనీ నిందించాడు' - సీతారామారావు.

తండ్రిని ఎదిరించే కొడుకును చూసి ఆ తండ్రి నిర్ఘాంత పోయాడు. కొడుకు నీడ అతనికి కనిపించింది. తాను మరణించినప్పటి నుండీ కొడుకు తన తప్పులను ఇతరులకు అంటగట్టి హింసిస్తున్నాడు.

తండ్రి కొడుకు నీడను కౌగలించుకున్నాడు. సీతారామారావుకు కోపం వచ్చింది. వూపిరి ఆడటం లేదు. తండ్రి నవ్వుతూనే తన నీడను తీసుకొని అదృశ్యమయ్యాడు.

సీతారామారావును పక్క సమాధిలో వున్న తల్లి పిలిచింది. తనకెంతో సంతోషంగా వుంది అన్నది. అతడు భోరు భోరున ఏడ్చాడు. ఎదురుగా చితి ఆరిపోతూవుంది. చీకటి దట్టమైంది. దగ్గరలో వున్న కుక్కను చూస్తూ వెల్లకిలా పడుకున్నాడు. అతనికి ఆ కుక్క ఆకారం తన ఆకారంగా కనిపించింది. ఎదురుగా తన ఆకారం కనబడి భయం వేసింది. శరీరం అస్థిపంజరంలా వుంది.

ఆ ఆకారం సీతారామారావును నిలదీసి ప్రశ్నించింది : 'నీ తెలివి తక్కువతనం, అహంకారం, మూర్ఖత్వం ఈ స్థితికి తెచ్చాయని' ప్రశ్నించింది. భార్య, కొడుకు తాను దగ్గుతున్నా నెత్తురు కక్కుతున్నా పట్టించుకోటం లేదు. లోపల అగ్ని జ్వాలలు విజృంభించాయి. తన భార్య మనుమణ్ణి తన కొడుక్కు అందించింది. తన ఆకారం తనను చూసి వెక్కిరించింది. ఎవరూ తన మొర ఆలకించటం లేదు. తన భార్య కొడుకుతో కబుర్లు చెప్పి నవ్వుతోంది. తన ఆకారం తనని పీక్కుతింటోంది. సీతారామారావు ఆ ఆకారం గొంతునులిమాడు. తన్నుతానే హత్య చేసుకున్నాడు. ఎవరో పొడిచి చంపారన్నట్లుగా శవం గుర్తు పట్టలేకుండా పోయింది. రామయ్య తాత అది సీతారామారావు శవం అని చెప్పాడు.

*